

డా॥ త్రిపురనేని హనుమాన్ చౌదరి
విదేశీ సంచార్ నిగమ్ లిమిటెడ్
చైర్మన్ అండ్ మేనేజింగ్ డైరెక్టర్ (రిటైర్డ్),
సెంటర్ ఫర్ టెలికాం మేనేజ్‌మెంట్
అండ్ స్టడీస్ సంస్థాపకులు,
ప్రజ్ఞాభారతి అధ్యక్షులు,
పద్మశ్రీ పురస్కార గ్రహీత.

## అచ్చమైన సమాచారం-అద్భుతమైన కథనం

డా॥ బి. సారంగపాణి రచించగా 450 పుటల్లో విస్తరించియున్న "ఆంగ్లేయుల ఏలుబడి-అంతులేని దోపిడి" అనే పేరుగల ఈ గ్రంథం నన్ను కదలనివ్వకుండా కూర్చోబెట్టి, వదలనివ్వకుండా ఆసాంతం చదివింపజేసింది. 16-18 శతాబ్దాలలో ఇంగ్లాండు దేశం ఎటువంటి దుర్భరమైన, దుఃఖదాయకమైన పరిస్థితులలో ఉండేదో ఈ గ్రంథం వివరిస్తుంది. 18వ శతాబ్దం మధ్యలో హిందూదేశంలో వ్యాపారంలోను, సైనిక పరమైన దుస్సాహసాలలోనూ ఆంగ్లేయులు పైచేయి సాధించి, ధనాఢ్యదేశంగా రూపుదిద్దుకొని రవి అస్తమించని సామ్రాజ్యాన్ని నెలకొల్పినతీరు ఇందులో వివరంగా చెప్పబడింది. వారు పోయి కాలూనిన చోట్ల క్రైస్తవీకరణమూ జరిగేది. సముద్రయానంద్వారా నేరుగా హిందూదేశానికి పోగల మార్గం కనుగొనవలసిందిగా, తద్వారా సుగంధద్రవ్యాల వ్యాపారం సాగించటమే గాక, తాము అడుగుపెట్టిన-క్రొత్తగా వెలుగులోకివచ్చే-భూభాగాలలో క్రీస్తుపేరిట ఏలుబడి సాగిస్తూ లబ్ధి పొందదగునని రోమ్‌లో ఉండే క్రైస్తవ మతాధిపతి పోప్ స్పెయిన్, పోర్చుగల్ దేశాల రాజకుటుంబాలవారిని ఉత్సాహపరిచాడు. ఇది ఉత్తర దక్షిణ అమెరికాలను, ఆఫ్రికా ఖండంలోని విస్తృత భూభాగాలను, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, ఫిలిప్పిన్స్ తదితరదేశాలతో కూడిన ఓషియానియా ఖండాన్నీ చేరడానికి వారికి ప్రోత్సాహకమైంది. స్పెయిన్ పోర్చుగల్ దేశాలేగాక, ఇంగ్లాండ్, హాలెండు, బెల్జియం, ఫ్రాన్సు దేశాలుకూడా వ్యాపారంలో అగ్రభాగాన నడవడానికి, తాము హస్తగతంచేసుకొన్న దేశాలపై ఆధిపత్యం సంపాదించడానికీ, ఆపైన ఆయా దేశాలనుండి కోరుకొన్నంత దోచుకొనడానికీ వారికి అవకాశమిచ్చింది.

ఇలా వారికి లభించిన బహుమానాలలో ఎన్నదగినది–ఊహకందనిస్థాయిలో సంపదలకు నిలయంగా ఉన్న హిందూదేశం. అది ఆంగ్లేయుల వశమైంది. క్రీస్తుశకం ఒకటవ శతాబ్దంలో జీవించిన ప్లీనీ అనే రోమన్ చరిత్రకారుడు (ఇతడు క్రీ.శ 79లో మరణించాడు) తమ ఉత్పాదనలను ఎగుమతి చేయుటంద్వారా హిందూదేశం ప్రపంచంలోని బంగారానికి పాతరగా తయారవుతున్నదని వ్రాసియున్నాడు. హిందూ దేశంలోని సంపద ఏ ఒకటి రెండుసార్లో గాక మహమూద్ గజినీ, మహమ్మద్ ఘోరీల వంటివారిద్వారా 11 నుండి 17 సార్లు దోచుకొనబడటమేగాక  అలాగే తర్వాత వచ్చిన నాదిర్షా, అహమద్ షా అబ్దాలీలద్వారాకూడా ఎంతగానో కొల్లగొట్టబడింది. అయినప్పటికీ 18వ శతాబ్దపు ప్రథమార్థంలో కూడా అప్పటి యావత్ప్రపంచపు స్థూల ఉత్పాదనలోను, అంతర్జాతీయ వాణిజ్యంలోనూ దాదాపుగా 25 శాతం హిందూదేశానిదే ! ఆ తరువాత పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచివారిని వ్యాపారంలో ఒక ప్రక్కకు నెట్టి మనదేశంలోని అత్యధిక భాగాలలో ఆంగ్లేయులు ఆధిపత్యం సాధించారు. గ్రేట్ బ్రిటన్ ప్రభుత్వం అందించిన ప్రోత్సాహంతో, ఆ దేశానికి చెందిన ఈస్టిండియా కంపెనీ–మొగలులనుండి ఆ సామ్రాజ్యం అప్పటికే కొన్ని భాగాలను కోల్పోగా మిగిలిన భాగాలలోను, ఆ తర్వాత కొంతకాలానికి మొగలుల స్థానాలపై అదుపు సాధించిన మహారాష్ట్రులనుండి మరికొన్ని భాగాలనూ తమగుప్పిట్లోకి తెచ్చుకున్నారు.

1858లో యునైటెడ్ కింగ్ డమ్ (బ్రిటన్) లోని విక్టోరియా రాణి ప్రభుత్వం హిందూదేశాన్ని తమ ప్రత్యక్ష పాలనలోకి తీసుకున్నారు. బ్రిటీషువారు సిపాయిల తిరుగుబాటుయని పిలిచిన 1957 ప్రథమ అఖిలభారత స్వరాజ్య సంగ్రామం (వీర్ సావర్కర్ దానిని ఇలా వర్ణించారు) అనంతరం సంభవించిన పరిణామ మిది. అప్పటినుండి హిందూదేశాన్ని 'చట్టబద్ధం' గానే దోచుకొనట మారంభమైంది. వ్యాపారంలో నియమ నిబంధలన్నీ వారికి అనుకూలంగాను, మనప్రజానీకానికి ప్రతికూలంగానూ ఉండేవి. తమ వలసదేశాలనుండి 'ఆధునిక' పద్ధతులలో సంపదను ఎగురవేసుకుపోవటమూ మొదలైంది. స్థానికంగా ఉండే పరిశ్రమలను త్రొక్కిపారవేయుటము, విపరీతంగా పన్నులు వేయటము, భూమిశిస్తు పేరున రైతుల రక్తాన్ని పీల్చివేయుటము, ఈవిధంగా సమకూరిన నిధులతో ఎక్కడెక్కడో ఉన్న బ్రిటీషు సామ్రాజ్యాంతర్గతమైన భూములను రెండు ప్రపంచ యుద్ధాలలో

(1914-19లో, మరల 1939-45లోనూ) రక్షించుకొనేందుకు బ్రిటీషు ఇండియా సేనలకు అవసరమయ్యే నిధులు సమకూర్చటమూ, ఇక్కడ పాలనాధికారం చలాయించి, జనజీవితాన్ని ధ్వంసంచేసిన బ్రిటీష్ అధికారులకు రిటైర్మెంటు తర్వాత పింఛనులు చెల్లించటము...ఇలా ఎన్నోవిధాల నిధులు ఖర్చుచేసేవారు. అంతేకాని ఆ సమయాల్లో మహమ్మారి వ్యాధులు సోకిన, కఱవులబారిన పడిన భారతప్రజానీకానికి ఎలాంటి సహాయమూ చేసేవారు కాదు. 1947 ఆగస్టు15న వారు అధికారాన్ని మనవారికి అప్పగించేనాటికి హిందూదేశపు స్థూల జాతీయ ఉత్పాదన(జి.డి.పి)లో, ప్రపంచ వాణిజ్యంలో మనవాటాలు 25 శాతం నుండి 3 శాతం కంటే తక్కువగా దిగజారిపోయాయి. హిందూదేశంలో వ్యాపారం చేయడానికి అనుమతిని వేడుతూ 1606లో ఆంగ్లేయులు వచ్చినపుడు వారి దేశం ఎలాంటి శోచనీయమైన దుర్భర స్థితిలో ఉండినదో, అలాంటి దుర్భరస్థితికి మనలను దిగజార్చి హిందూదేశాన్ని వదిలిపెట్టిపోయారు

ఏకుగా వచ్చి మేకు అయినాడన్నట్లుగా వ్యాపారంకోసం వచ్చినవారు ఇక్కడపాలకులై ఇక్కడి ఆర్థికవ్యవస్థను అస్తవ్యస్తం చేయటమేగాక, విద్యావ్యవస్థను కూడా భ్రష్టంచేశారు. ఆ చరిత్రను వెలికితీసి వివరించటంలో డా॥ సారంగపాణిగారి ప్రజ్ఞ వ్యక్తమౌతున్నది. విద్యారంగంలో ఆంగ్లేయులు తెచ్చిన ఆ మార్పులద్వారా కేవలం రంగులో, రక్తంలో మాత్రమే భారతీయులుగా ఉంటూ, మిగతా అన్ని విధాలా అభారతీయులుగా, ఆంగ్లేయుల వీరాభిమానులుగా తయారైన ఒక వర్గాన్ని రూపొందించుకొన్నారు. ఈ వర్గంవారు ఎంతకాలంగడిచినా, ఇప్పటికీ పాశ్చాత్యుల ఆలోచనలను, సిద్ధాంతాలనూ శిరసావహించే వాహకులుగానే ఉంటున్నారు. ఆంగ్లం మాత్రమే మాట్లాడడానికి అలవాటుపడిన ఒక మహిళా పత్రకారిణికి హిందీ మాత్రమే వచ్చిన పిల్లలు చెప్పినమాట ఈ సందర్భంగా గుర్తు వస్తున్నది-"అంగ్రేజ్ చలే గయే-లేకిన్ ఉన్ కే ఔలాద్ కో ఛోడ్ కే" (ఆంగ్లేయులు వెళ్లిపోయారు-అయితే వారి మానసపుత్రులను ఇక్కడే ఉంచారు)

బ్రిటీషువారు హిందూదేశాన్ని ఎలా వంచించి, విధ్వంసంగావించారో, ఆ విషయాలను డా॥ సారంగపాణి గారి ఈ పుస్తకం పాఠకులకు తెలియజెప్పి, వారిని మతిమంతులను చేస్తుంది. బ్రిటీషువారు ఆర్థికంగా దోచుకున్నారు, మేధోపరంగా వలసపాలనతో సర్దుకుపోయే మస్తిష్కాలను తయారుచేశారు. హిందూదేశంలో

ఇంగ్లీషు వారిపాలన ఎలా ఉండినదో, వారు ఎన్నివిధాలుగా ఎంతెంత దోచుకుపోతున్నారో బ్రిటన్ పార్లమెంటుకు ఎన్నుకోబడిన మొదటి భారతీయుడైన దాదాభాయి నౌరోజీ 1892లో వ్రాసిన 'పావర్టీ అండ్ అన్‌బ్రిటీష్ రూల్ ఇన్ ఇండియా' (Poverty and Un-British Rule in India) అనే పుస్తకంలో విపులంగా చెప్పారు. బ్రిటీష్ గవర్నర్ జనరల్ వారన్ హేస్టింగ్స్ (జననం 6-12-1732, మరణం 22-8-1818)ను అభిశంసిస్తూ జరిగిన చర్చ సందర్భంలోను, రాబర్ట్ క్లైవ్ (జననం 29 సెప్టెంబరు 1725, మరణం 22 నవంబర్ 1774) హిందూదేశంనుండి మూటగట్టి తెచ్చుకున్న సంపదతో ఎంత సంపన్నుడైనాడో తెలియజెప్పినపుడు ఇది మరింత స్ఫుటంగా వెల్లడైంది.

అంచనాలకు అందని విధంగా భారీగా హిందూదేశపు సంపదలను కొల్లగొట్టి తీసుకుపోయి, హిందూదేశాన్ని ఒక దిబ్బగా మార్చిన వైనాన్ని, ఇక్కడ వస్త్రోత్పాదనలో జీవితాలుగడిపేవారి బ్రతుకులను బండలపాలు చేసిన వైనాన్ని, వేల సంవత్సరాల చరిత్ర కలిగిన నాగరికతా, సంస్కృతి, వారసత్వ విజ్ఞానాలను అపవిత్రీకరించిన వైనాన్ని చక్కగా తెలియజెప్పినందుకు డా॥ బొమ్మరాజు సారంగపాణిగారిని మరోసారి మనసారా అభినందిస్తున్నాను. మినూ మసానీ రచించిన అవర్ ఇండియా (Our India) అనేపుస్తకం 1940 దశకపు ద్వితీయార్ధంలో ఉన్నత పాఠశాలల విద్యార్థులకు ఉపవాచకంగా ఉండేది. మన ప్రజలకు ఈ విషయాలను తెలియజెప్పడానికి అవసరమైన అనంతర పరిణామాలను చేర్చి ఆ పుస్తకం పునః ప్రచురింపబడాలని నేను కోరుకొంటున్నాను. పుణ్యభూమియైన మన భారతదేశం ప్రకృతిసిద్ధంగా ఎటువంటి సంపదలతో అలరారుతున్నదో మన యువతరానికి తెలియాలికదా ! ఇంతటి అద్భుతమైన పుస్తకాన్ని ప్రచురించడానికి పూనుకొన్న 'నవయుగభారతి'ని ధన్యవాదపూర్వకంగా అభినందిస్తున్నాను.

– డా॥ త్రిపురనేని హనుమాన్ చౌదరి

# విషయసూచిక

సింధు గంగానదీ జలక్షీర మెపుడు
కురిసి బిడ్డల పోషించుకొనుచునున్న
పచ్చిబాలెంతరాలు మా భరతమాత,
మాతలకు మాత, సకల సంపత్సమేత!

భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై ఏడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి.

# ఆంగ్లేయుల ఏలుబడి - అంతులేని దోపిడి

అచ్చపు చీకటిండ్లఁ బొరలాడుచునుండ ప్రపంచమెల్ల, నీ
పచ్చనితల్లి గుమ్మములపై వెలిగెన్ మణిదీపికల్ !! కనన్
వచ్చిన ఖండఖండములవారికి కోరిక దీరునట్లుగా
బిచ్చము పెట్టె 'భారత సవిత్రి' ప్రియంబున రెండుచేతులన్

పచ్చని చేలతో పసిడి కుచ్చిళ్లతో
అన్నపూర్ణగ జనుల నాదరించిన మాత
బిచ్చు లింగ్రీజు లిట రెచ్చిపోయిన కతాన
బిచ్చగత్తెగ మారె పిచ్చి భారతమాత

పండ్రెండు రాష్ట్రాలు పండుతున్నా గాని
పట్టెడన్నమె నోచమండి,
కుక్కలతో కలసి కూడు తింటామండి?
మా కొద్దీ తెల్లదొరతనము...

మా కీ పడిపోయిన గోడలు
మీ కేడంతస్తుల మేడలు
చింపిగుడ్డ సింగారం మాకు,
ఒళ్ళంతా బంగారం మీకు...
మేము మండుటెండల్లో మాడుతూ
మీరు పండువెన్నెల్లో ఆడుతూ
మా కండలు పిండిన నెత్తురు
మీ పెండ్లికి చిలికే అత్తరు...

గోలకొండ నీ రత్నకోశమట
కోహినూరు నీ జడలో పువ్వట...
నమో హిందుమాతా...సుజాతా
నమో భరత మాతా...

# ఉపోద్ఘాతం

భారతదేశం దాదాపుగా 200ల సంవత్సరాలపాటు వలసపాలనలో ఉంది. వ్యాపారం మిషతో వచ్చిన ఐరోపాజాతీయులు క్రమంగా భారతదేశంలో వివిధప్రాంతాలలో వ్యాపార స్థావరాలు ఏర్పరుచుకొని, కాలక్రమంలో ఆ ప్రాంతాలమీద పెత్తనం తమదేనని ప్రకటించుకొన్నారు. అలా వచ్చిన పోర్చుగీసు, డచ్, ఫ్రెంచ్ జాతీయులపై అంతిమంగా ఆధిపత్యం సాధించి ఇంగ్లాండ్ భారతదేశంపై ఆధిపత్యం చలాయించింది.

కానిస్టాంట్‌నోపుల్‌ను తురుష్కులు ఆక్రమించిన తర్వాత ఐరోపా దేశాలకు భూమార్గం గుండా భారతదేశపు సరుకులు చేరటం అసాధ్యం అయ్యింది. సుగంధ ద్రవ్యాల సరఫరా నిలిచిపోవడంతో ఐరోపావాసులు తల్లడిల్లి పోయారు. పాశ్చాత్య దేశీయులు సముద్రమార్గం ద్వారా భారతదేశానికి చేరటానికి పూనుకొన్నారు. 1498లో వాస్కో డగామా కొత్త సముద్రమార్గాన్ని కనుగొన్న తర్వాత ఐరోపా-భారత దేశాల మధ్య వ్యాపార సంబంధాలు తిరిగి పునరుద్ధరించబడ్డాయి.

16వ శతాబ్దం చివరినుండి ఇతరదేశాల భూభాగాలపై ఆధిపత్యం చెలాయించి, ఆ దేశపు వనరులు కొల్లగొట్టటానికి పాశ్చాత్యదేశాలమధ్య తీవ్రమైన పోటీ నెలకొంది. స్పెయిన్, ఫ్రాన్స్, పోర్చుగల్, ఇంగ్లాండ్, ఇటలీ వంటి ప్రధాన పాశ్చాత్యదేశాలు మాత్రమే కాక నెదర్లాండ్స్ (హాలెండ్), స్వీడన్, బెల్జియం వంటి చిన్న దేశాలు సైతం పోటీలో భాగస్వాములు అయ్యాయి. రాజ్యవిస్తరణ, వనరుల దోపిడీ, క్రైస్తవ మతవ్యాప్తి వాటి ఉమ్మడి లక్ష్యాలు.

కేరళలోని కోజికోడ్ (కాలికట్) చేరిన వాస్కో డగామా తమ పంటలను (సుగంధ ద్రవ్యాలను) కొనుక్కొని తీసుకుపోవడానికి ఎవరూ అభ్యంతరం చెప్పలేదు. క్రమంగా కాలికట్ తీరంలో పోర్చుగీసులు వర్తకస్థావరం నెలకొల్పారు. 1700 నాటికి గుజరాత్ నుండి గోవా వరకూ గల పశ్చిమతీరాన పోర్చుగీసులు, దక్షిణాదిన ఫ్రెంచ్, డచ్ కంపెనీలు, తూర్పు తీరాన బ్రిటిష్ కంపెనీలు తమతమ వర్తక స్థావరాలను ఏర్పరుచుకొన్నాయి. ఫ్రెంచ్, బ్రిటిష్ కంపెనీలు బలమైన వ్యాపార

కంపెనీలుగా ఎదిగాయి. ఆధిక్యం కోసం వాటిమధ్య జరిగిన యుద్ధాలలో ఆంగ్లేయుల ఈస్టిండియా కంపెనీ అంతిమంగా విజయం సాధించింది.

వ్యాపారం కోసం వచ్చిన ఆంగ్లేయులు తప్పనిసరి పరిస్థితులలో రాజ్యాధికారం చేపట్టవలసి వచ్చిందని ఆంగ్ల చరిత్రకారులు వ్రాశారు. వలసపాలన నెలకొల్పటంలో, స్థిరపరచటంలో ఆంగ్లేయులకు ఎట్టి దురుద్దేశాలు లేవని, అందివచ్చిన అవకాశాలను మాత్రమే వినియోగించుకొని భారత్‌ను వలసదేశంగా చేసుకున్నారని ఆంగ్ల చరిత్రకారులు చెప్పిన కట్టుకథలను స్వతంత్రభారతదేశంలో వామపక్షచరిత్రకారులు స్థిరపరచి పాఠ్యాంశంలో భాగంగా చేసి, భారతీయుల మెదడులో బలహీన మనస్తత్వాన్ని చొప్పించి తెల్లవాడి ఆధిపత్యం సహజమైనదన్న భావన కలిగించే భావజాలాన్ని వ్యాప్తిచేశారు.

## ఆంగ్లేయులు ఇతర యూరోపియన్లు వ్యాపారం కోసమే వచ్చారా ?

ఈస్టిండియా కంపెనీ కేవలం వ్యాపార నిమిత్తమై భారతదేశానికి వచ్చిందా? 1609లో ఆంగ్లప్రభుత్వం తరపున సుప్రసిద్ధ సముద్రపు దొంగ కెప్టెన్ విలియన్ హాకిన్స్ తన నౌక 'హెక్టర్'లో సూరత్ చేరాడు. హాకిన్స్ భారతదేశం చేరేనాటికి అక్బరు పాదుషా చనిపోయాడు. జహంగీర్ చక్రవర్తిగా బాధ్యతలు చేపట్టాడు. 40 లక్షల సైనిక బలం ఉన్న మొగలాయిలతో యుద్ధం చేయటానికి హాకిన్స్ సాహసించ లేదు. వ్యాపార అనుమతులకోసం ఇతరదేశాలలో అనుసరించిన దండమార్గం, బలప్రయోగం భారతదేశంలో పనికిరావని గ్రహించిన హాకిన్స్ జహంగీర్‌ను ప్రసన్నంచేసుకొని అనుమతులు సంపాదించటానికి నానాయాతనలు పడ్డాడు. కానీ తన ప్రయత్నాలు ఫలించకపోవటంతో వచ్చిన దారి పట్టాడు. కానీ ఆంగ్ల ప్రభువులు, వ్యాపారులు తమ సంకల్పం నెరవేర్చుకోవటానికి మరొక దక్షుడైన వ్యవహార నిపుణుడికోసం అన్వేషించారు. చివరకు రాయబారి, బ్రిటిష్ చట్టసభలో సభ్యుడు అయిన సర్ థామస్ రో ను భారతదేశం పంపారు. జహంగీర్ చక్రవర్తికి విలువైన కానుకలు, ఆయనకు అత్యంత ఇష్టమైన ఖరీదైన మద్యం రో తెచ్చియిచ్చాడు. ఆయన ఇచ్చిన కానుకలను, మద్యాన్ని జహంగీర్ స్వీకరించాడు. కానీ ఆంగ్లేయుల వ్యాపారాలకు అనుమతిని ఇవ్వలేదు. పట్టువదలని థామస్‌రో 3 సంవత్సరాల పాటు చక్రవర్తి చుట్టూ తిరిగి అనుమతులు సాధించాడు. దేశంలోని అన్ని

రేవుపట్టణాలలో క్రయ, విక్రయాలను చేసుకొనేందుకు, వ్యాపార స్థావరాలను నెలకొల్పేందుకు ఈస్టిండియా కంపెనీకి అనుమతి లభించింది. సుగంధ ద్రవ్యాలతోపాటు నాజూకైన వస్త్రాలు, పత్తి, పొటాషియం నైట్రేట్ (సూరేకారం) నీలిమందు, తేయాకు చౌకగా భారతదేశంలో కొనుగోలు చేసి, ఎక్కువ ధరలకు విదేశాలలో కంపెనీ అమ్ముకొని లక్షలు ఆర్జించటం మొదలు పెట్టింది.

1670లో విదేశాలలో సాయుధ బలగాలను కలిగి ఉండేందుకు, యుద్ధాలు చేసేందుకు పెట్టుబడులు పెట్టేందుకు ఇంగ్లండ్ చక్రవర్తి రెండవ ఛార్లెస్ ఈస్టిండియా కంపెనీకి అనుమతినిచ్చాడు. వ్యాపారం చేయటానికి సాయుధబలగాలు అవసరంలేదు. యుద్ధాలు చేయవలసిన పనిలేదు. అయినప్పటికీ సాయుధబలగాలు కల్గిఉండటానికి, యుద్ధాలు చేయటానికి అనుమతించటం వెనుక భూభాగాలను కబళించాలనే లక్ష్యం, కుట్ర ఉన్నాయి. అత్యంత ఆధునిక ఆయుధాలను కంపెనీ సమకూర్చుకోవటానికి బ్రిటీషు ప్రభుత్వం ప్రోత్సహించింది. రాశిలోనూ, వాసిలోనూ కంపెనీ సాయుధ బలగాలు బ్రిటీషు సైన్యం కంటే మిన్నగా ఉండేవి. వ్యాపారంలో తన ప్రత్యర్థులైన పోర్చుగీసు, ఫ్రెంచ్, డచ్ వారిని ఆ బలగాల సహాయంతోనే ఓటమిపాలు చేసి వ్యాపారంలోనూ, రాజకీయాలలోనూ ఈస్టిండియా కంపెనీ తనకు ఎదురులేకుండా చేసుకుంది. కాలక్రమంలో బెంగాల్ తీరప్రాంతం అంతా సాయుధ బలాల సాయంతో విస్తరించింది.

**చారిత్రక తప్పిదాలు :**

ఔరంగజేబు మేనమామ షాయిస్తాఖాన్ బెంగాల్ గవర్నరుగా ఉండేవాడు. ఆంగ్లేయులు ఆడుమన్నట్లుగా ఆడడానికి అతడు సిద్ధపడలేదు. అతనికి గట్టిగా బుద్ధిచెప్పాలని కంపెనీ యోచన చేసింది. ఇంగ్లండ్ ప్రభుత్వ మద్ధతు కోరింది. 1686లో కంపెనీకి సహాయపడటానికి 9 యుద్ధనౌకలు తగినంత సాయుధ నావికాబలంతో ఇంగ్లండ్ నుండి భారతదేశపు తూర్పు తీరం చేరాయి. ఆంగ్లేయుల కుట్రను పసిగట్టిన మొగలాయిలు కంపెనీమీద యుద్ధం ప్రకటించి, ఆంగ్ల సైనికులను నిర్దాక్షిణ్యంగా చంపివేశారు. బెంగాల్ నుండి వారిని తరిమికొట్టారు. సూరత్‌లోనూ, బొంబాయిలోనూ వారి వ్యాపార స్థావరాలను, ఫ్యాక్టరీలను మూయించారు. కంపెనీ సిబ్బందికి సంకెళ్ళువేసి నగరమంతా తిప్పారు. అందుకు ప్రతీకారంగా ఔరంగజేబుకు చెందిన రెండు నౌకలను ఇంగ్లండ్ ప్రభుత్వ ప్రోద్బలంతో సముద్రపు దొంగలు

దోచుకున్నారు. దోచిన సొత్తు విలువ అప్పట్లోనే 6-7 లక్షల పౌండ్లు ఉంటుందని చరిత్రకారులు వ్రాశారు.

భారతదేశంలో తమకు జరిగిన శృంగభంగాన్ని ఆంగ్లేయులు జీర్ణించుకోలేకపోయారు. ఎలాగయినా తమ వ్యాపార స్థావరాలను, ఫ్యాక్టరీలను పునఃప్రారంభించి వ్యాపారాలు కొనసాగేటట్లు చూసుకొని, అదునుదొరికినప్పుడు ప్రతీకారం తీర్చుకోవాలని యోచన చేశారు. మొగలాయిలను యుద్ధంతో కాకుండా కుటిలనీతితో గెలవాలని పథకం వేశారు. తమ తప్పులను మన్నించమని కంపెనీ ప్రతినిధులు ఔరంగజేబును కలసి, క్షమాపణలు చెప్పారు. బ్రిటన్ చక్రవర్తి సైతం అధికారికంగా క్షమాపణలు తెలియచేశారు. ఔరంగజేబు ఓడలను దోచుకున్న సముద్రపు దొంగలపై చర్యలకు ఉపక్రమిస్తున్నట్లుగా తెలియజేశారు. కాళ్ళా, వ్రేళ్ళా పడి ఔరంగజేబునుండి వ్యాపారం చేసుకోవటానికి తిరిగి అనుమతులు సంపాదించారు. వారి దురుద్దేశాలను, రాజ్యవిస్తరణ కాంక్షను ఔరంగజేబు పసిగట్టలేకపోయాడు. వారి క్షమాపణలకు, నక్కవినయాలకు లొంగిపోయి వ్యాపారం చేసుకోవటానికి తిరిగి అనుమతులను ఇచ్చాడు. ఔరంగజేబు చేసిన పెద్దపొరపాటు ఇది. అనుమతి లభించకుంటే ఆంగ్లేయులు దేశం విడిచివెళ్ళేవారు. ఆంగ్ల వలసపాలనలో మ్రగ్గే దుర్గతి దేశానికి పట్టేదికాదు.

కంపెనీ తిరిగి తన వర్తక వాణిజ్యాలను ప్రారంభించింది. చావుదెబ్బతిన్న కంపెనీ తగిన అదను కోసం ఎదురుచూస్తున్నది. ఆరోజు రానేవచ్చింది. 1707లో ఔరంగజేబు మరణించాడు. ఆయన సామంతులు ఎవరికి వారు స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారు. అత్యంత సుసంపన్నమైన బెంగాల్‌కు నవాబుగా సిరాజ్ ఉద్దౌలా 1756లో గద్దెనెక్కాడు. సన్నని నాజూకైన వస్త్రాలకు, దృఢమైన మన్నికగల నౌకల నిర్మాణానికి పేరుపడ్డ బెంగాల్ నుండే మొగలాయిలకు 50శాతం పైగా ఆదాయం వచ్చేది. ఆనాటికే బెంగాల్‌లో వర్తక స్థావరాలు ఏర్పాటుచేసుకొన్న ఈస్టిండియాకంపెనీ బెంగాల్‌ను కబళించి దాని సంపదను దోచుకోవాలని ఎప్పటినుండో కుతంత్రాలు పన్నింది. కలకత్తాలోని తమ కోటలను విస్తరించి, వాటిని ఆయుధాలతో నింపింది. నవాబు ఈ విషయం పసిగట్టి కంపెనీ కోటలపై దాడులు చేయించి ఆయుధాలను వశపరుచుకొన్నాడు. ఆంగ్ల సైనికులను ఫోర్టువిలియమ్స్‌కోట నేలమాళిగలో బంధించాడు. కానీ సిరాజ్ ఉద్దౌలా కంపెనీని

దేశబహిష్కరణ చేయలేదు. అదే ఆయన చేసిన పెద్దపొరపాటు. ఆంగ్లేయులు మరల తమ నక్కవినయాలకు తెరతీసారు. క్షమాపణలు చెప్పారు. నవాబు క్షమించి రాజకీయాల జోలికి రాకుండా వ్యాపారం చేసుకోమని హెచ్చరించి, అనుమతిని ఇచ్చాడు.

**ఆంగ్లేయుల కుతంత్రాలు :**

బెంగాల్ సంపదమీద కన్నేసిన ఆంగ్లేయుల కంపెనీ సిరాజ్ ఉద్దౌలాను పదవీచ్యుతుడ్ని చేయాలని కుట్రపన్నింది. నవాబు బావమరిది, సేనాని అయిన మీర్‌జాఫర్‌ను మచ్చిక చేసుకొని, నవాబు పదవి ఆశచూపి తమవైపుకు తిప్పుకుంది. 1757 జూన్ 3న ప్లాసీ గ్రామంలో జరిగిన యుద్ధంలో సిరాజ్ ఉద్దౌలాను ఓడించి, మీర్‌జాఫర్‌ను నవాబును చేశారు. మీర్‌జాఫర్ గద్దెనెక్కడంతో ఆంగ్లేయుల దోపిడీ యుగం భారతదేశంలో మొదలైంది. ఆ తరువాత 1764 అక్టోబర్‌లో ఈస్టిండియా కంపెనీ మొగలాయి చక్రవర్తి షాఅలంను ఓడించి, బెంగాల్, బీహార్, ఒరిస్సాలలో దివానీ హక్కును పొందింది. ఈ ఘటనల క్రమం తర్వాతి అధ్యాయాలలో విపులంగా చెప్పే ప్రయత్నం జరిగింది.

ఈస్టిండియా కంపెనీ 18వ శతాబ్దం ద్వితీయార్థంలో చైనానుండి పట్టు, పింగాణి పాత్రలు కొనుగోలు చేసేది. అందుకు పెద్దపెట్టున వెండి చెల్లించేది. చైనీయులకు అవసరమైన ఉత్పత్తులేవీ కంపెనీ దగ్గరలేవు. దానితో చైనీయులకు నల్లమందు అలవాటు చేయాలని కంపెనీ కుట్రపన్నింది. బెంగాల్‌లో గసగసాలు సాగుచేయించింది. బీహార్‌లో నల్లమందు తయారు చేయించింది. నల్లమందును దొంగచాటుగా చైనాకు చేరవేసేవారు. నల్లమందును చైనీయులకు అమ్మి, అందుకు ప్రతిగా వారినుండి పట్టువస్త్రాలను, పింగాణీ పాత్రలను కొనుగోలు చేసి కంపెనీ భారీగా లాభాలు ఆర్జించింది. చైనా చక్రవర్తి అక్రమ నల్లమందు వ్యాపారాన్ని అడ్డుకోవటానికి విశ్వప్రయత్నం చేశాడు. చైనాకు అక్రమంగా దిగుమతి అవుతున్న నల్లమందు పెట్టెలను ధ్వంసం చేశారు. దానితో నల్లమందు అమ్మటం తమ హక్కుగా ప్రకటించుకొని చైనాతో ఈస్టిండియా కంపెనీ యుద్ధానికి దిగింది. ఆ నల్లమందు యుద్ధాలలో ఓటమి పాలైన చైనా ఇంగ్లండ్‌తో అవమానకరమైన ఒప్పందాలను చేసుకోవలసి వచ్చింది. ఆ ఒప్పందంలో భాగంగానే హాంకాంగ్ దీర్ఘకాలం

ఆంగ్లేయుల ఏలుబడిలోకి వచ్చింది. కంపెనీ ఆగడాలను గురించి విక్టోరియా రాణికి చైనా చక్రవర్తి లేఖలు వ్రాసినా ఆమె పట్టించుకోలేదు.

**రాజ్యవిస్తరణ కాంక్షతోనే :**

పై చారిత్రిక ఘట్టాలను పరిశీలించినప్పుడు కేవలం వ్యాపారం కోసమే కంపెనీ భారతదేశానికి రాలేదని తెలుస్తుంది. తమ సామ్రాజ్య విస్తరణలో భాగంగానే ఇంగ్లీషువారి కంపెనీ భారతదేశంలో అడుగుపెట్టింది. 2½ లక్షలమంది సైనికులు, అత్యంత ఆధునిక ఫిరంగులతో ఉన్న సైనిక బలగం దానికి ఉంది. వ్యాపారం కోసమే వస్తే అంత సైనిక బలగమే అవసరం లేదు. కుతంత్రాలతో, కుయుక్తులతో, అవినీతి పద్ధతులతో రాజ్యాలను కబళించిన తీరును, అందుకు లొంగని రాజ్యాలను అధునాతన ఫిరంగులతో మారణహోమం సృష్టించి, కబళించిన తీరును గమనిస్తే, రాజ్యవిస్తరణ కాంక్షతోనే ఆంగ్లేయులు ఈ దేశంలో అడుగుపెట్టారని ఇట్టే అర్థం అవుతుంది. ఉద్దేశపూర్వక చర్యల ఫలితంగానే ఆంగ్ల సామ్రాజ్యం సృష్టించబడి, విస్తరించబడింది. మోసపూరిత సైన్యసహకార పద్ధతి ద్వారా కొన్ని రాజ్యాలను, బలప్రయోగంతో రాజ్యసంక్రమణ సిద్ధాంతాన్ని అనుసరించి మరికొన్ని రాజ్యాలనూ తమ సామ్రాజ్యంలో కలుపుకొన్నారు.

కనుక ఆంగ్ల చరిత్రకారులు చెప్పింది, భారతదేశ వామపక్షచరిత్రకారులు స్థిరపరిచింది వాస్తవం కానేకాదు. భారతదేశాన్ని హస్తగతం చేసుకోవాలన్న దుర్బుద్ధి ఈస్టిండియా కంపెనీకి హఠాత్తుగా పుట్టలేదు. దోపిడీ అనేది ఐరోపాఖండ ప్రజల రక్తంలో జీర్ణించుకునిఉంది. అందుకు వారి మతం కూడా ప్రోద్బలం చేసింది. 'ప్రకృతి నీకోసం సృష్టించబడింది...వెళ్ళి అనుభవించు' అని చెపుతుంది వారి మతగ్రంథం. సంపద ఎక్కడున్నా వెళ్ళి దోపిడీచేయి, అనుభవించు అన్న మతగ్రంథ ప్రబోధంతోనే ఐరోపా ఖండదేశాలన్నీ వలసదేశాలను నెలకొల్పటంలో పోటీపడ్డాయి.

పాశ్చాత్య క్రైస్తవ దేశాలు బానిసల వ్యాపారంలోనూ పోటీ పడ్డాయి. ఇందులోనూ ఇంగ్లండ్‌దే పై చేయి అయ్యింది. ఈస్టిండియా కంపెనీని నెలకొల్పిన 60 సంవత్సరాల తర్వాత, ఇంగ్లాండ్ రాజకుటుంబం రాయల్ ఆఫ్రికన్ కంపెనీని నెలకొల్పింది. ఇంగ్లండ్ రాజు అయిన రెండవ ఛార్లెస్ సోదరుడు డ్యూక్ ఆఫ్ యార్క్ ఈ కంపెనీకి అధినేత. సోదరుడి మరణానంతరం 1685లో రెండవ జేమ్సుగా ఆయన సింహాసనాన్ని అధిరోహించాడు. రాయల్ ఆఫ్రికన్ కంపెనీకి

ప్రధాన వ్యాపారవస్తువు ఆఫ్రికన్ నల్లజాతీయులు. 1662-1731 మధ్య రెండు లక్షలమందికి పైగా నల్లజాతీయులను అట్లాంటిక్ మహాసముద్రంమీదుగా అమెరికాకు, ఇతరవలసదేశాలకు తీసుకొనివెళ్ళి అమ్మారు. ఈ అమానుష అక్రమరవాణాలో 44 వేలమంది ఓడలలోనే ప్రాణాలు కోల్పోయారు. మరే ఇతర సంస్థ కూడా ఇంత పెద్ద ఎత్తున మానవులను బానిసలుగా అమ్మిన దాఖలాలు లేవు. ఇంగ్లాండ్ రాజకుటుంబపు 'ఘనమైన' చరిత్ర అది.

ఇంగ్లాండ్ కానీ, ఇతర పాశ్చాత్య దేశాలు కానీ నేడు ఆర్థికంగా బలంగా ఉన్నాయంటే అదంతా భారతదేశాన్ని కొల్లగొట్టి వారి దేశాలకు తీసుకుపోయిన సంపద పునాదుల బలంవల్లనే. కానీ ఆ దోపిడీ అంశాలను మరుగుపరిచి చరిత్రను వక్రీకరించిన ఆంగ్లేయుల కుటిలనీతిని బహిర్గతం చేయాలంటే వాస్తవాలను వెలికితీసి తెలియచెప్పవలసిన అవసరం ఎంతైనాఉంది. భారతదేశ చరిత్రను తిరిగి వ్రాయవలసిన అవసరమూ ఎంతైనా ఉంది. 15వ శతాబ్దపు చివరిలో, ఐరోపా నుండి భారతదేశానికి సురక్షిత సముద్రమార్గం కనుగొన్ననాటి నుండి పాశ్చాత్యదేశాలు ఆఫ్రికా, ఆసియా ఖండదేశాలను తమ కుయుక్తులతో లోబర్చుకున్న వైనాన్ని బయటకు తీయాలి. వారు దోచుకున్న సామ్రాజ్యాలలో అత్యంత విశాలమైంది, అత్యంత విలువైంది భారతదేశం. ఆ భారతదేశ చరిత్రను వాస్తవాలతో పునర్నిర్మిస్తే నేటివరకు విశ్వసిస్తున్న ప్రపంచ చరిత్ర ఎంత మోసపూరితమైందో అర్థమౌతుంది.

**కంపెనీ విజయాల వెనుక:**

1602లో ఈస్టిండియా కంపెనీని ప్రారంభించారు. 1700 సంవత్సరం నాటికి అది అతిపెద్ద అంతర్జాతీయ వాణిజ్య సంస్థగా ఎదిగింది. వాస్తవానికి ఈస్టిండియాకంపెనీ వస్త్ర ఉత్పత్తులను ఆసియా, ఐరోపా దేశాలకేకాక, సుదూర ప్రాంతంలో ఉన్న మెక్సికోకు కూడా తరలించేది. నాణ్యమైన, మన్నిక అయిన బెంగాల్ వస్త్ర ఉత్పత్తుల విదేశీ వాణిజ్యంపై గుత్తాధిపత్యం సాధించిన ఈస్టిండియా కంపెనీకి వ్యాపారంలో ఎదురులేకుండా పోయింది. ఆ కాలంలో మొట్టమొదటిసారిగా భారతదేశం తయారీరంగంలో చైనాను అధిగమించగలిగింది. ప్రపంచస్థూలజాతీయ ఉత్పత్తిలో భారతదేశపు వాటా 34 శాతం అయింది. భారతదేశపు తూర్పుతీరంలో బెంగాల్ నుండి ఆంధ్రావరకు ఉత్పత్తి అవుతున్న

వస్త్ర ఉత్పత్తుల ఎగుమతులకు దేశీయ వ్యాపారులు తగినంతగా లేనిలోటును ఈస్టిండియా కంపెనీ తీర్చింది. సముద్రమార్గం ద్వారా వస్త్ర ఉత్పత్తులను ఎగుమతి చేసే కంపెనీ గానే అది అపారంగా ఆర్జించింది.

1740వ దశకంనుండి పాశ్చాత్యుల సైనిక సాంకేతిక పరిజ్ఞానంలో గణనీయమైన మార్పులు వచ్చాయి. తుపాకులను మెరుగుపర్చారు. ఫిరంగులు, అందులో ఉపయోగించే మందుగుండును ఇంతకు ముందుకంటె మెరుగు పర్చారు. సాకెట్ బాయినెట్‌ను కనుగొన్నారు. ఫిరంగి ఎత్తును అవసరాన్ని బట్టి మార్చుచేసుకోవటానికి వీలుగా ఎలివేటింగు స్క్రూను అమర్చగలగటం నేర్చుకున్నారు. కాల్చిన ఇనుప బంతులు ఒక్కసారిగా గుంపులు గుంపులుగా ఫిరంగి నుండి ప్రయోగించగల సాంకేతిక నైపుణ్యం వారి స్వంతం అయ్యింది. ఆధునిక ఆయుధ పరిజ్ఞానాన్ని, మెరుగైన ఆయుధాలను సమకూర్చుకోవటంలో ఈస్టిండియా కంపెనీ ఎప్పుడూ ముందుండేది. భారతీయుల దగ్గఱ ఉన్న ఆయుధాలు, మందుగుండు సామాగ్రి, హిందూ దేశస్థులువాడే ఫిరంగుల కంటె మెరుగైనవి, వేగవంతమైనవి, లక్ష్యాన్ని ఛేదించటంలో తక్కువ సమయం తీసుకొనేవి అయినవాటిని కంపెనీ సమకూర్చుకొంది. భారతీయుల కాల్బలంపై విచక్షణా రహితంగా కాల్పులకు తెగబడటం, అకస్మాత్తుగా దాడిచెయ్యటం, కకావికలురను చేయటం వారు అనుసరించిన సైనిక వ్యూహంలో ప్రధానమైన అంశం. మెరుగైన సైనిక, ఆయుధ సంపత్తితోపాటు, వారు అనుసరించిన యుద్ధనీతి, కుటిలోపాయాలు వారి విజయానికి కారణం.

**సంపన్నవర్గాల తోడ్పాటు :**

వ్యాపారాలకు పెట్టుబడులు పెట్టే సంపన్న వర్గాలవారు ఈస్టిండియా కంపెనీ వ్యాపార లావాదేవీలకు కావలసిన ఋణసహాయాన్ని అందించేవారు. కలకత్తాలో పెద్దపెద్ద మార్వాడీ వ్యాపారులు మాత్రమే కాక, బెనారస్‌లో పెద్ద హిందూబ్యాంకర్లు సైతం ఇతర పాశ్చాత్య కంపెనీల కంటె ఆంగ్లేయుల ఈస్టిండియా కంపెనీతో వ్యవహరించటానికి యిష్టపడేవారు. ఆంగ్లేయులు వ్యాపారం పేరుతో కొనసాగిస్తున్న దోపిడీ వారికి తెలియనిది కాదు. వారు వేరే దేశానికి చెందిన వారైనా, తీసుకొన్న ఋణాలను క్రమం తప్పకుండా చెల్లించేవారు. ఒప్పందం ప్రకారం గడువు తీరినా చెల్లింపులు చేయకపోతే న్యాయస్థానాలు ఉండనేఉన్నాయి గదా! సుదీర్ఘకాలం విదేశీ

ముస్లింపాలనలో విసిగివేసారిన బెంగాలీలు కంపెనీని కనిష్ఠ అపాయకరంగా భావించారు. మొగలాయిలు, మరాఠీల మధ్య ఈస్టిండియా కంపెనీ కనిష్ఠ అపాయకరంగా వారికి ఆనాడు తోచటం దురదృష్టకరం. కులీన వర్గాలు ఈస్టిండియా కంపెనీ బాండ్లలో పెట్టుబడి పెట్టారు. దేబ్‌లు, మాలిక్‌లు, ఠాగూరులు మొగలాయి ఎస్టేటులను కొన్నారు. ఆంగ్లపాలన సమర్థకులుగా మారారు. మెరుగైన ఆయుధ సంపత్తితోపాటు, సంపన్న వర్గాల వారి తోడ్పాటు వారికి కలసి వచ్చింది.

1757లో ప్లాసీ యుద్ధం జరిగింది. 1764లో జరిగిన బక్సర్ యుద్ధం తర్వాత ఈస్టిండియా కంపెనీ అధికారానికి తిరుగులేకుండా పోయింది. 1765లో దివానీ హక్కులు చేజిక్కించుకోవటంతో బెంగాల్, బీహార్, ఒరిస్సా పాలనాయంత్రాంగం కంపెనీ చేతికి వచ్చింది. దానితో కంపెనీ సాగించిన నిలువుదోపిడీకి పరిమితులు లేకుండా పోయింది. 1770లో బెంగాల్‌లో తీవ్రమైన కఱవు వచ్చింది. కోటిమందికి పైగా ఆకలిచావులు బారినపడ్డారు. ఇంగ్లాండ్ పార్లమెంటులో చర్చ జరిగి కంపెనీ కార్యకలాపాలను నియంత్రించటానికి 1773లో రెగ్యులేటింగ్ చట్టాన్ని చేశారు. భారతదేశానికి ఒక గవర్నర్ జనరల్‌ని, ఆయనకు ఒక సలహామండలిని, సుప్రీంకోర్టును ఆ చట్టం ద్వారా నియమించారు. 1784లో ఇండియా చట్టం (పిట్స్ ఇండియా చట్టం) ద్వారా ఈస్టిండియా కంపెనీకి ఉన్న గుత్తాధిపత్యాన్ని కొనసాగిస్తునే, రాజకీయ వ్యవహారాలను చక్కదిద్దేబాధ్యతను ముగ్గురు సభ్యులు గల ఒక కమిటీకి యివ్వటమే కాక, భారతదేశపు వ్యవహారాలను పర్యవేక్షించేందుకు ఒక 'సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా'ను నియమించారు. భారతదేశంమీద తిరుగులేని సార్వభౌమాధికారం ఆంగ్ల ప్రభుత్వానిదేనని ఈ చట్టం స్పష్టంచేసింది. ఏడు దశాబ్దాలకు పైగా 1858 వరకు ఈ ఏర్పాట్లు కొనసాగాయి. 1813లో భారతదేశపు వాణిజ్యంపై కంపెనీకి ఉన్న గుత్తాధిపత్యాన్ని తొలగించి, ఆంగ్లపారిశ్రామిక వేత్తలకు ప్రయోజనం కల్గించేలా అనేక చర్యలు చేపట్టారు. క్రైస్తవ మిషనరీలకు భారతదేశంలో మత ప్రచారం చేసుకోవటానికి, మత మార్పిడులు చేసుకోవటానికి అనుమతిని యిచ్చారు. 1857 ప్రథమ భారతస్వాతంత్ర్య సమరం తర్వాత రాజ్యాధికారం కంపెనీనుండి ఇంగ్లాండ్ కిరీటానికి బదిలీ అయి 1947 వరకు కొనసాగింది.

**'నాగరికత మిషన్' అనాగరిక-అరాచక పాలన :**

పాశ్చాత్య ప్రపంచంలో ప్రాచుర్యంలో ఉన్న ఉదారభావనలతో వలసరాజ్యాల స్థాపనను సమర్థించలేరు. ప్రపంచవ్యాప్తంగా రాజ్యవిస్తరణకాంక్షతో పాశ్చాత్య క్రైస్తవదేశాలు ఖండాలకు ఖండాలను తమ గుప్పెట్లోకి తెచ్చుకొన్న తరుణంలో ఆ దేశాల రాజకీయ తత్త్వవేత్తలు సమానత్వం, అందరికీ సమన్యాయం (Universalism)ను ఒకవైపు సమర్థిస్తూనే, వలసపాలనను, సామ్రాజ్యవాదనను సమర్థించటం మొదలుపెట్టారు. అందుకు వారు ఒకతేలికైన పరిష్కారాన్ని కనుగొన్నారు. మానవాళిని నాగరికులను చేసే బాధ్యత (Civilizing mission) తెల్లవారిదేనని ప్రకటించారు. తమకుతాముగా ఆ బాధ్యతను (Whiteman's burden) క్రైస్తవ దేశాలు తలకెత్తు కున్నాయని తెల్లవారు ప్రకటించారు. ఇతర దేశాలు సంస్కరించబడాలంటే వారు తప్పనిసరిగా ఏదో పాశ్చాత్య క్రైస్తవ దేశపు ఏలుబడిలో ఉండాలని సూత్రీకరించారు. ఉదార భావనలు (Liberal ideas)కు అనుగుణంగా నిర్మితమయ్యే పాలనా వ్యవస్థలను ఆ దేశాలు సమర్థవంతంగా నిర్వహించుకొనే స్థాయి వచ్చేవరకు పాశ్చాత్య దేశాల పెత్తనంక్రింద ఉండాలని వారుచెప్పేవారు.

అన్ని జాతులకంటె తెల్లజాతి గొప్పదనే అహంకారం, అన్ని సంస్కృతులకంటె పాశ్చాత్యుల సంస్కృతే తిరుగులేనిదనే అహంకారం వలసపాలన కొనసాగింపుకు అవసరం. ఆ భావజాలవ్యాప్తి వలన, తమకుతాము 'పాలించటానికి మాత్రమే పుట్టాం' అనే భ్రమవలన వలసపాలకులు క్రమంగా మరింత అనాగరికులుగా మారారు. అంతులేని హింసకు పాల్పడ్డారు. భారతీయులను హీనంగా చూసారు. వారిని హృదయమున్న వ్యక్తులుగా చూడలేదు. కేవలం శ్రమించటానికి తప్ప మరెందుకూ పనికిరాని వ్యక్తులుగా చూశారు. వారి శ్రమను నిర్దయగా దోచుకున్నారు. వారిశ్రమను దోచుకోవటం తమకు తమ దైవం నిర్దేశించిన కర్తవ్యంగా చెప్పుకున్నారు. ఇదంతా ఆటవికుల జాతులను నాగరికం చేసే ప్రక్రియలో తప్పనిసరియైన ఒక దశ అని దబాయించారు.

వలసపాలన కొనసాగాలంటే పాలితుల గతం చెరిపివెయ్యాలి. ఘనమైన గతమేదీవారికి ఉండకూడదు. పాలకుల దృష్టిలో బానిసలకు చరిత్ర, సంస్కృతి, కళలు, సాహిత్యం, సాహసాలు, ఆవిష్కరణలు ఉండవు. అవన్నీ ఉంటే బానిసత్వంలో వారు ఒగ్గరు. పరాజితులకు చరిత్ర ఉండకూడదని తీర్మానించి, భారతదేశ చరిత్రను

వక్రీకరించి, దాని ఘనమైన గతాన్ని కప్పిపుచ్చారు. జేమ్స్ మిల్ నుండి నేటి వరకు వక్రీకరణలు కొనసాగుతూనే ఉన్నాయి. భారతీయ మతాలు, సంస్కృతి, కళలు ఎందుకూ కొరగానివని ప్రచారం చేశారు, చేస్తున్నారు.

తమకుమాత్రమే ఘనమైన గతం ఉందని, తమ సంస్కృతి అజేయమైందని ఆంగ్లేయుల ప్రగాఢవిశ్వాసం. వారి జాతి ప్రత్యేకమైందని, విజయం సాధించేందుకే దేవునిచేత ప్రత్యేకంగా సృష్టించబడినదని వారు విర్రవీగేవారు. తమ మతప్రబోధశక్తిని (Pastoral Power) చూసి అబ్బురపడేవారు. ప్రపంచాన్ని నాగరికం చేసే ప్రక్రియలో తమకుతాము శ్రేష్ఠత్వం ఆపాదించుకొని మిడిసిపడిన వలసపాలకులు భారతీయులను, ఇతర జాతులవారిని పశుప్రాయులుగా చూసారు. అందువలననే ఫాసిజం మూలాలు వలసరాజ్య స్థాపనలోనే ఉన్నాయని చెప్పవచ్చు.

**ప్రజలను విభజించారు :**

సువిశాల, వైవిధ్యభరితమైన భారతదేశాన్ని దీర్ఘకాలం తమ గుప్పెట్లో పెట్టుకొనిపాలించటానికి దేశభాషల పరిజ్ఞానం అవసరమని ఆంగ్లపాలకులు గ్రహించారు. ఆదేశాలు యివ్వటానికి, పన్నుల వసూళ్లకు, శాంతిభద్రతలు కాపాడటానికి, పాలితుల గురించి, వారి భాషాసంస్కృతుల గురించిన పరిజ్ఞానం వారికి అవసరమైంది. ఆ పరిజ్ఞానాన్ని సంపాదించటానికి వారు ప్రయత్నం చేశారు. అయితే ఆ పరిజ్ఞానాన్ని క్షుణ్ణంగా పరిశీలించి, ఎంపికచేయబడ్డ కొన్ని అంశాలను మాత్రమే బహిరంగపర్చారు. ఇదంతా "వస్తుగత లేక నిష్పాక్షిక (Objective) పరిజ్ఞానం" పేరిట ముద్రించారు. తమకు అనుకూలమైనవి, పాలితప్రజలను గందరగోళంలోకి నెట్టి వేయటానికి పనికివచ్చేవి మాత్రమే బహిరంగపరిచారు.

భారతదేశం తన సాంస్కృతిక వైవిధ్యంతో, అనేక భాషలతో, సంప్రదాయాలతో, మత రాజకీయ సామాజికమైన వ్యవస్థలతో ఆంగ్లేయులను ఓ రకమైన దిగ్భ్రాంతికి గురిచేసింది. అంతటి భిన్నత్వాన్ని ప్రపంచంలో ఏదేశంలోనూ వారు చూడలేదు. వైవిధ్యాన్ని కుదించి, విభజించి, పాలించటానికి అనువుగా చేయదలుచుకున్నారు. అందుకోసం ఆ వైవిధ్యాన్ని అంతటినీ ఒక చట్రంలో బిగించదల్చుకొన్నారు. కొన్ని లక్షణాలు ఆధారంగా వ్యక్తులను కొన్ని తరగతులుగా వర్గీకరించి, లెక్కించారు. దానినే కొందరు 'సామాజిక కలనగణితం' (Social Calculus) గా పిలిచారు. లెక్కించటానికి ఉన్న ఏకైక లక్ష్యం ఒక్కటే. ప్రజల మీద తిరుగులేని అధికారాన్ని

చెలాయించటం (Mastery over Matter), వైవిధ్యాన్ని కుదించి, వారి ఆలోచనలను ప్రభావితం చేసి, వారి కదలికలను కట్టడిచేసి, వలస ప్రభుత్వానికి ప్రజలలో విధేయతను, లొంగిపోయే మనస్తత్వాన్ని పెంపు చెయ్యటమే.

"విభజించు పాలించు అనేది రోమన్ల మోటో. మన లక్ష్యం కూడా అదే కావాలి" అని 1859 మే 14న బొంబాయి గవర్నర్ ఎలిఫిన్‌స్టన్ అన్నాడు.

1931లో ఒక లక్షమంది ఆంగ్లేయులు భారతదేశంలో ఉన్నారు. అంటే ప్రతి నాలుగువేలమంది భారతీయులకు ఒక ఆంగ్లేయుడు చొప్పున ఉన్నాడు. ఎన్ని ఆయుధాలు ఉన్నా, ప్రజలను ఎంతగా నిరాయుధులుగా చేసినా, 37 కోట్లమంది భారతీయులను కేవలం సైనిక, ఆయుధ శక్తితో నియంత్రించటం కష్టం. అందుకని సామ్రాజ్యవాదానికి ఎదురులేకుండా చేసుకోవటానికి కుల, మత, వర్గాల వారీగా విడగొట్టి, ఐక్యత లేకుండా చేసి, వారు పాలించారు. కులానికి కొత్త జవసత్వాలు కలిగించారు. మత విద్వేషాలను రగిలించారు. ఆర్య, ద్రావిడ జాతులుగా హిందువులను విడదీశారు. ఉత్తరాదికి, దక్షిణాదికి మధ్య చిచ్చుపెట్టారు. మైదాన ప్రాంత వాసులకు, గిరిజనులకూ అగాధాలు సృష్టించారు. ఆంగ్ల మానసపుత్రులను తయారుచేయడానికి దేశీయవిద్యను ధ్వంసం చేసి దేశీయ విద్యాసంస్థలను నిర్వీర్యం చేసి ఆంగ్లవిద్యను ప్రవేశపెట్టారు. దానిద్వారా సామ్రాజ్యవాదానికి అనుకూలమైన వర్గాన్ని సమాజంలో సృష్టించారు.

**దోపిడీరాజ్యం :**

కంపెనీకి, ఆంగ్ల ప్రభుత్వానికి కొన్ని ముఖ్యమైన పోలికలతోపాటుగా తేడాలూ ఉన్నాయి. ఆంగ్లప్రభుత్వం కంటె కంపెనీయే ఎక్కువ కొల్లగొట్టింది. రైతుల నడ్డి విరగగొట్టి శిస్తులను వసూలుచేసింది. అదే సమయంలో భారతీయ సంపన్నులతో జతకట్టటానికి వెనుకాడలేదు. హిందూ వ్యాపార భాగస్వాములతో కలసిపనిచేసింది. వాస్తవానికి చాలా వ్యాపారాలు ఉమ్మడి వ్యాపారాలే. స్థానికులతో కలిసేవారు. పెళ్ళిళ్ళు చేసుకొనేవారు. లైంగిక సంబంధాలు పెట్టుకొనేవారు. కంపెనీలో పనిచేసినవారిలో మూడవవంతుమంది భారతీయ స్త్రీలను పెళ్ళాడటమో, సహజీవనమో చేశారు.

అధికారం కిరీటానికి బదిలీ అయ్యాక పరిస్థితులలో మార్పువచ్చింది. "భారతీయులకు నాగరికత నేర్పేందుకు" వారిని ఏలుతున్నామని చెప్పుకొనే బ్రిటీషు

ప్రభుత్వం వర్ణవివక్షకు తెరతీసింది. కంపెనీ పాలనా కాలంలో లేని వర్ణవివక్ష ఆంగ్ల ప్రభువుల పాలనలో మొదలైంది. బ్రిటీషు రాజ్యం-శ్వేతజాతీయుల రాజ్యమే. "కుక్కలకు, భారతీయులకు ప్రవేశం లేదు" అని సిమ్లాలో బోర్డులు పెట్టిన విషయం మనకు తెలిసిందే. 1920 వరకు ఇండియన్ సివిల్ సర్వీసు నియామకాలలో భారతీయులు లేరు. జాత్యంతర వివాహాలు లేవు. కనుక కంపెనీపాలన, రాజరికపాలన రెండూ రెండు విభిన్న కాలాలు.

కంపెనీకి కపటం లేదు. దోచుకోవటానికి వచ్చింది. దోచుకొంది. కంపెనీ లాభాపేక్షతో వచ్చింది. లాభాలు సంపాదించింది. వెళ్ళింది. అదొక శ్వేతజాతీయుల అంతర్జాతీయ వ్యాపార సంస్థ. భారతీయుల బాగోగులు గురించి అది పట్టించుకోలేదు. అందుకోసం వచ్చినట్లుగా అది ఎప్పుడూ చెప్పుకోలేదు కూడా. ఆంగ్లప్రభుత్వం 'మంచి చేయటానికి వచ్చిం'దని చెప్పుకొంది. ఆంగ్లేయులకు ఏదిమంచిదో, ఏది లాభమో అది చేసింది. భారతీయులపట్ల నిర్దయగా వ్యవహరించింది. దోపిడీ పాలనను కొనసాగించింది. ఎప్పటికప్పుడు కొత్త మార్గాలద్వారా భారతదేశాన్ని దోచుకుంది. అడుగడుగునా అణిచివేతకు పాల్పడింది. ప్రజల కష్టసుఖాలను వలసపాలకులు ఏనాడూ పట్టించుకోలేదు.

సుదీర్ఘకాలం కొనసాగిన ఆంగ్ల సామ్రాజ్యవాదుల దోపిడీలో మూడు దశలను గుర్తించవచ్చు. 1612లో ఈస్టిండియా కంపెనీ సూరత్‌లో అడుగుపెట్టినప్పటికి, 1757 ప్లాసీ యుద్ధం తర్వాతే భారత భూభాగాలను కబళించటం మొదలెట్టింది. 1757 నుండి 1858 వరకు కొనసాగిన వారి పరిపాలనా కాలాన్ని, దోపిడీనీ వ్యాపార పెట్టుబడి (Merchant Capital) దశగా పేర్కొనవచ్చు. 1858 నుండి 19వ శతాబ్ది ముగింపు వరకు పారిశ్రామిక పెట్టుబడి (Industrial capital) దశగా, 20వ శతాబ్ది ప్రారంభం నుండి 1947 వరకు ఫైనాన్సు పెట్టుబడి (Finance Capital) దశగాను పేర్కొనవచ్చు. ఈ మూడు దశలలోనూ ఆర్థిక దోపిడీ కొనసాగింది. దోపిడీకి అనుసరించిన పద్ధతులలో తేడాలు తప్ప దోపిడీ లేని కాలమేలేదు.

ఆంగ్లేయుల వలసపాలన భారతదేశానికి సానుకూలమైన ఆశీర్వాద పాలనగా చిత్రీకరించటానికి గట్టి ప్రయత్నాలు చేసారు. చేస్తున్నారు. మరోవైపు భారతీయ

జాతీయవాద చరిత్రకారులు ఆంగ్ల వలసపాలన వలన భారతదేశం ఏవిధంగా నష్టపోయిందో, ఎంత పేదరికంలోకి నెట్టివేయబడిందో వివరించే ప్రయత్నం చేసారు. వారిలో రమేష్ చంద్ర దత్ ప్రముఖులు. ఆంగ్లపాలన భారతదేశంలో నిరపాయకరమైన ఉనికిగా భావించడాన్ని ఆయన సవాలు చేశారు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం నుండి దేశ విభజన వరకు ఆంగ్లేయులు సృష్టించిన రక్తపాతాన్ని మించిన దారుణనేరం మానవచరిత్రలో మరొకటి లేదని అమెరికన్ చరిత్రకారుడు విల్ డ్యూరాంట్ వ్యాఖ్యానించారు. షుమారుగా 5 కోట్లమంది ఆ దారుణ మారణకాండలో ప్రాణాలు కోల్పోయారని అంచనా. రెండు ప్రపంచ యుద్ధాలతో కలిపి కనీసం లక్షన్నరమంది భారతీయ సైనికులు ప్రాణాలు కోల్పోయారు. ఆంగ్లేయులు 45 ట్రిలియన్ డాలర్లకు పైగా సొమ్మును కొల్లగొట్టి ఉంటారని అంచనా. అంటే వారు కొల్లగొట్టిన సొమ్ము ప్రస్తుత విలువ రూ॥ 3,300 లక్షల కోట్ల రూపాయలకు పైమాటే.

వలసపాలనాకాలంలో సుదీర్ఘకాలంపాటు కొనసాగిన తెల్లవారి ఆర్థికదోపిడీ గురించి ఆంగ్లంలో అనేక ప్రామాణిక గ్రంథాలు వచ్చాయి. రమేష్‌చంద్రదత్ నుండి Roots of Underdevelopment రచించిన కుసుమలత కేడియాగారలు రచించిన గ్రంథాలు మాత్రమే కాక, ఇటీవల కాలంలో సామ్రాజ్యవాద సమర్థకులు చేస్తున్న వాదనలను తిప్పికొట్టటానికి అనేక గ్రంథాలు, వ్యాసాలు ఆంగ్లంలో వెలువడుతూనే ఉన్నాయి. తెలుగు ప్రజలకు వలసపాలనా కాలపు దోపిడీ వివరాలను అందించాలనే లక్ష్యంతో ఈ గ్రంథరచన జరిగింది. గ్రంథ విస్తరణ భీతితో కొన్ని ముఖ్యమైన అంశాలను మాత్రమే స్పృశించటం జరిగింది. ఎంతో విలువైన సమాచారం నేడు మనకు లభ్యం అవుతున్నది. వలసపాలన అంతరించినా, వారు నాటిన విషసాంస్కృతిక బీజాలు నేటికీ సజీవంగా ఉన్నాయి. వేఱు వేఱు రూపాలలో కొనసాగుతున్న ఆర్థిక, సాంస్కృతిక బానిసత్వపు మూలాలపై అవగాహన పెంచటమే ఈ చిరుప్రయత్న లక్ష్యం.

# 1

# ఈస్టిండియా కంపెనీ స్థాపననాటికి ఇంగ్లాండు స్థితిగతులు

మనదేశపు వెనుకబాటుతనానికి, పాశ్చాత్యదేశాల అబ్బురపరిచే ఆర్థికాభివృద్ధికిమధ్య కార్యకారణ సంబంధం ఉంది. శతాబ్దాలపాటు వారు చేసిన వర్ధమాన దేశాల వనరుల దోపిడీతోనే పాశ్చాత్యదేశాలు అతిశీఘ్రంగా అభివృద్ధి సాధించాయి. భారతదేశ గతానికి, పాశ్చాత్య ప్రపంచ వర్తమానానికిమధ్యగల ఈ సంబంధాన్ని తెలియజెప్పుతూ ఎవరైనా విశ్లేషణ చేస్తే దాన్ని త్వరగా నమ్మం. కాని వాస్తవం అదే.

ఈ విషయం లోతుగా అర్థం చేసుకోవాలంటే మనం 5 లేక 6 శతాబ్దాలు వెనుకకు వెళ్ళాలి. 1453లో తూర్పురోమన్ సామ్రాజ్యపు రాజధానియైన కాన్‌స్టాంటినోపిల్ నగరాన్ని హస్తగతం చేసుకున్న తురుష్కులు యూరోపుదేశాలకు ఆసియాదేశాల నుండి భూమి ఉపరితల మార్గంలో జరిగే ఎగుమతుల నన్నింటినీ అడ్డుకున్నారు. హిందూదేశంనుండి అప్పటివరకూ తమకు లభిస్తూ ఉండిన మిరియాల దిగుమతులు ఆగిపోవటంతో ఐరోపా ప్రజలు తీవ్ర సంక్షోభానికి గురైనారు. ఐరోపా మొత్తం శీతలప్రాంతమే. శీతాకాలంలో అక్కడ నదులు, సరస్సులు, సముద్రాలలో నీరు గడ్డకట్టి ఉంటుంది. పడవలు తిరగవు. చేపలు దొరకవు. వేసవికాలంలో పట్టుకున్న చేపలను ఉప్పు, మిరియాల మిశ్రమంలో ఊరవేసుకొని శీతాకాలంలో తినేవారు. ఇప్పుడు మిరియాల దిగుమతి ఆగిపోవటంతో ఐరోపాలోని అన్నిదేశాలలో సంక్షోభం తాండవించింది. అప్పుడు పోప్ వివిధ దేశాల రాజులను పిలిచి, 'మీమీ నావికులను పంపి హిందూదేశానికి సముద్రమార్గం కనుగొనవలసింది'గా ఆదేశించాడు. పోర్చుగల్, ఇంగ్లాండ్, ఫ్రాన్స్,

హాలెండు దేశాలు అలా భారతదేశానికి సముద్రమార్గం కనుగొనటానికి తలమునకలై ఉన్న శతాబ్దాలు అవి.

రిఫ్రిజేటర్లు లేని ఆ కాలంలో తూర్పుదేశాలనుండి దిగుమతి చేసుకొనే సుగంధద్రవ్యాలు వారి ఆహారాన్ని నిల్వచేసుకోవటానికి అత్యంత ఆవశ్యకం అయ్యాయి. ఫాల్కనర్ (Faulkner) అనే ఆర్థిక చరిత్రకారుడు ఈ విధంగా వ్రాశాడు "పాశ్చాత్య ప్రపంచం తన అనేక అవసరాలకోసం, ఆనందాల కోసం ఆసియాపై ఆధారపడింది. మధ్యయుగంలో సుగంధద్రవ్యాల ప్రాముఖ్యత గురించి ఇప్పుడు అర్థం చేసుకోవటం కష్టం. ఇప్పటిలా అప్పుడు మాంసాన్ని తాజాగా నిల్వచేసుకోవటానికి వీలులేదు. వారు తీసుకొనే ముతక మాంస ఆహారానికి తూర్పుదేశాలనుండి దిగుమతి చేసుకొనే సుగంధద్రవ్యాలు, మసాలాలు రుచిని, పరిమళాన్ని కల్గించేవి. వీటిని దిగుమతి చేసుకొని, వాడుకోగల్గటం ఒక విలాసం. రాజులు, చక్రవర్తులు వీటిని దిగుమతి చేసుకొని విలువైన కానుకలుగా తమతోటివారికి పంపేవారు. మలబారుతీరంనుండి దిగుమతి చేసుకొనే మిరియాలకు ఎంతో గిరాకీ ఉండేది. వాటిని దిగుమతి చేసుకొనగల ఆర్థిక స్తోమత ఉన్న వారందరూ తప్పక మిరియాలను దిగుమతి చేసుకొనేవారు".[1] పాశ్చాత్యదేశాలు తూర్పుదేశాలనుండి చేసుకున్న దిగుమతులలో సింహభాగం మిరియాలదే (షుమారుగా మూడవవంతుపైగా). ఒక వంద సంవత్సరాలపాటు ఈ దిగుమతుల వ్యాపారం వర్ధిల్లింది. మనదేశంలోనుండే కాక, ఇండోనేషియా, చైనానుండి కూడా సుగంధద్రవ్యాలను, మసాలా దినుసులను దిగుమతి చేసుకొనేవారు. కనకవర్షం కురిపించిన వాణిజ్యం అది.[2]

చరిత్రకందని కాలంనుండే ఇటలీదేశానికి భారతదేశంతో వాణిజ్య సంబంధాలు ఉన్నాయి. భారతదేశంనుండి దిగుమతి చేసుకున్న సుగంధద్రవ్యాలను మిగిలిన పాశ్చాత్యదేశాలకు ఎగుమతి చేసి, ఇటలీ ఆర్థికంగా బలపడింది. ఇది మిగిలిన దేశాలవారి అసూయకు కారణం అయింది. ప్రాచ్యదేశాలతో వాణిజ్యం నెరపటానికి తగినన్ని వనరులు వాటిదగ్గఱ లేవు. పై పెచ్చు భారతదేశానికి సముద్రమార్గమూ వాటికి తెలియదు. ఇటలీకి తెలిసినా అది ఇతర దేశాలతో దాన్ని పంచుకోవటానికి సిద్ధంగా లేదు. దానితో స్పెయిన్, పోర్చుగీసు, హాలెండ్, ఇంగ్లాండు దేశాలు తూర్పుదేశాలకు చేరుకోగల నూతన సముద్ర మార్గాల అన్వేషణకు పూనుకోకతప్పలేదు. సరదాగా, సాహసకృత్యంగా సముద్రమార్గాల

అన్వేషణ మొదలు అవలేదు. వాటి మనుగడకు, వాటి పురోభివృద్ధికి ప్రాచ్యదేశాలతో వాణిజ్యం తప్పనిసరి అని అవి గ్రహించాయి. తమ వ్యవసాయ, తయారీ రంగాలవలననో అంతర్గత వర్తకవాణిజ్యాల వలననో కాక తూర్పుదేశాలతో వర్తక వ్యాపారాలతోనే వేగంగా అభివృద్ధి సాధించవచ్చునని ఇటలీ అనుభవం నుండి అవి గ్రహించాయి. పాశ్చాత్యదేశాల భాగ్యరేఖ ప్రాచ్యదేశాలతో చేసే వాణిజ్యంతో అంతగా ముడిపడిన శతాబ్దాలు అవి. ఆసియా దేశాలతో ముఖ్యంగా భారత్, చైనా దేశాలతో చేసే వాణిజ్యంపైనే ఆ దేశాలు ఎక్కువగా ఆధారపడ్డాయి. వాణిజ్య లావాదేవీలు పరిమాణంలో కాని, విలువలో కాని తగ్గితే, ఆమేరకు వాటి ఆర్థిక స్థితిగతులు కృశించేవి. 13వ శతాబ్దంలో మార్కోపోలో భారతదేశంలో పర్యటించాడు. భారతదేశ వైభవంగురించి పశ్చిమదేశాలకు ఆయన వివరించాడు. ఏనాటికయినా, భారతదేశపు సిరిసంపదలను కొల్లగొట్టాలనే ఆకాంక్షకు బీజాలు నాటిన వాడు మార్కోపోలో.

క్రీస్తుపుట్టిన 1500 సంవత్సరాల వరకు భారతదేశం ఎక్కడ ఉందో పాశ్చాత్యదేశాలకు తెలియదు. తూర్పుదేశాలతో వర్తకవాణిజ్య సంబంధాలన్నీ భూమార్గంనుండే జరిగేవి. భారత్‌తోపాటు చైనాతోనూ వ్యాపారసంబంధాలు ఆ దేశాలకు ఉండేవి. అయితే భూమార్గం ఎంతో సుదూరమైంది, కష్టతరమైంది, ఎంతో వ్యయప్రయాసలతో కూడినది అవటంతో సముద్రమార్గాలకై అన్వేషణ మొదలైంది. రాజకీయ పరిణామాలూ ప్రభావం చూపేవి. ఈ అన్వేషణాక్రమంలో పోర్చుగల్ మిగిలిన దేశాలకంటే ముందంజలో ఉంది. దీనికితోడు ఏయే దేశాలవారు నూతనంగా ఏ ద్వీపాలలో, ఏ భూభాగాలలో అడుగుపెడతారో, అక్కడ దేవుని వాక్యాన్ని వినిపించి, అక్కడి ప్రజలను క్రైస్తవులుగా మార్చి వాటిని తమ వలసలుగా మార్చుకొని, అక్కడి సహజసంపదలను యథేచ్ఛగా అనుభవించడానికి కూడా పోప్ 6వ అలెగ్జాండర్ అనుమతి లభించింది (4 మే 1493). ఈ ఆదేశపత్రాన్ని PAPAL BULL అని, ఈ విధానాన్ని Doctrine of Discovery అని పేర్కొంటారు. కాబట్టి క్రొత్తక్రొత్త భూభాగాలపై క్రీస్తురాజ్యాన్ని ఆవిష్కరించడానికి, తమ జెండా ఎగురవేయడానికి ఐరోపాలోని సముద్రతీర రాజ్యాలవారు ఉత్సాహపడ్డారు. ఈ అన్వేషణాక్రమంలో పోర్చుగల్ మిగిలిన దేశాలకంటే ముందంజలో ఉంది. 1498లో వాస్కో డిగామా భారతదేశ పశ్చిమతీరంలోని కోజికోడ్ పట్టణాన్ని సముద్రమార్గంద్వారా

చేరాడు. ఆఫ్రికా దక్షిణపు కొసన ఉన్న తుఫానుల అగ్రంలో అతని నౌక చిక్కుబడి పోయినపుడు, హిందూదేశానికి చెందిన స్కందుడు అనే గుజరాతీ వ్యాపారి వారిని రక్షించి హిందూదేశతీరానికి చేర్చాడు.

సుగంధద్రవ్యాలు, నాజూకైన వస్త్రాలు, రత్నాలు, సిల్కు, బంగారం, ముత్యాలు, ఔషధాలు, పింగాణీ వస్తువులు మొదలైన వాటిని పశ్చిమదేశాలకు తీసుకొని వెళ్ళేందుకు సముద్రమార్గంద్వారా సులభతరమైంది. పోర్చుగల్‌చేత హిందూదేశ అన్వేషణకు ప్రేరణ సుగంధద్రవ్యాల వాణిజ్యంలో ఉన్న అపార లాభావకాశాలు అని వేరే చెప్పనవసరంలేదు. దాల్చిన చెక్క అల్లం, లవంగాలు, మిరియాలు, పసుపు మొదలైన వాటిని ఇతర పశ్చిమదేశాలకు ఎగుమతి చేసి పోర్చుగల్ వ్యాపారులు అమితంగా లాభపడ్డారు. దీనితో ఆంగ్లేయులుకూడా ఆసియాదేశాలతో వర్తకవ్యాపారాలకై తహతహలాడసాగారు. అయితే, వాస్కో డిగామా సముద్రమార్గం కనుగొన్ననాటినుండి వందేళ్ళ నిర్విరామ ప్రయత్నాల తర్వాత గాని ఆంగ్లేయులు భారతదేశానికి సముద్రమార్గాన్ని పట్టుకోలేకపోయారు. వారి ప్రయత్నాలు ఫలించి 16వ శతాబ్దపు చివరి అంకంలో భారతదేశానికి సముద్రమార్గాన్ని కనుగొనగలిగాయి. ఈ సందర్భంగానే కొన్ని ముఖ్యమైన ప్రశ్నలకు మనం సమాధానాలు అన్వేషించాలి.

- 15, 16వ శతాబ్దులలో పాశ్చాత్యదేశాలవారు తూర్పుదేశాలకు ముఖ్యంగా భారత్‌కు సముద్రమార్గాల అన్వేషణకు ఎందుకు తీవ్రంగా పోటీపడ్డారు?
- ఆ శతాబ్దంలో పాశ్చాత్యదేశాల సమాజాల స్థితిగతులు ఎలా ఉన్నాయి? సముద్రమార్గాల అన్వేషణకు ముందుకువచ్చిన వారు ఎవరు? అత్యంత భయంకరమైన సముద్రయానానికి ప్రాణాలకు తెగించి ఎందుకు పూనుకొన్నారు?
- తూర్పుదేశాలతో వాణిజ్యంకోసం ఆ దేశాలలో అనేక వ్యాపారసంస్థలు నెలకొల్పారు. ఈస్టిండియా కంపెనీ వంటి సంస్థలు అనేకం పాశ్చాత్యదేశాలలో పుట్టుకువచ్చాయి. వాటిని నెలకొల్పినదెవరు? ఏ లక్ష్యాలతో వాటిని ప్రారంభించారు? వాటికి మూలధనం సమకూర్చింది ఎవరు? వాటిని ఎవరు ఏవిధంగా నిర్వహించారు? వారి వ్యాపార విధివిధానాలు ఎలా ఉండేవి?
- పై ప్రశ్నలకు సమాధానాలు ఎందుకు మనకు అత్యంత ప్రాధాన్యం అవుతాయి? ప్రచారం చేయబడి వాడుకలో ఉన్న అనేక సిద్ధాంతాలు, నమూనాలకు ఆ సమాధానాలకు మధ్య సంబంధం ఉందా? లేదా? పై ప్రశ్నలకు సమాధానం వెదకటానికి ముందు మనం మరికొన్ని విషయాలను ముచ్చటించుకోవాలి.

**కాథలిక్ చర్చి నియంతృత్వం:**

క్రైస్తవప్రపంచం షుమారుగా 15 శతాబ్దాలపాటు రోమన్ కాథలిక్ చర్చి నియంతృత్వ పోకడలకింద నలిగిపోయింది. ప్రజలకు సంబంధించిన ప్రతి అంశంలోనూ కాథలిక్ చర్చి జోక్యం చేసుకొనేది. మతవిషయాలతోపాటు, లౌకిక విషయాలలోనూ చర్చి జోక్యం భరించరానిదిగా తయారయ్యింది. అసంతృప్తిని తీవ్రంగా అణిచివేసేవారు. విమర్శకులకు తీవ్రమైన శిక్షలు విధించేవారు. ప్రశ్నించేవారిని, అవిశ్వాసులను, విమర్శించేవారిని తీవ్రంగా దండించేవారు. నిర్దాక్షిణ్యంగా చంపివేసేవారు. స్పెయిన్‌లో ఇంక్విజిషన్ (మతవిచారణ) పేరుతో అనేక దారుణాలకు చర్చి పెద్దలు ఒడిగట్టారు. స్పానిష్ ఇంక్విజిషన్ 1478లో మొదలయి 1834 వరకు కొనసాగింది. మూడులక్షలమందిని విచారణ చేసి రకరకాల శిక్షలు విధించారు. షుమారుగా 5వేల మందిని బలిగొన్నారు. అవిశ్వాసుల, అనుమానితుల ఆస్తులు జప్తుచేసేవారు. అవిశ్వాసుల పేరుతో పౌరులను సజీవదహనం చేసేవారు. 1542లో రోమన్ ఇంక్విజిషన్ మొదలయి 18వ శతాబ్దం మొదటివరకు కొనసాగింది. నికలస్ కొపర్నికస్, గెలీలియో వంటి ఖగోళశాస్త్రవేత్తలను చర్చి హింసించింది. అనేక వేలమందిని, ముఖ్యంగా స్త్రీలను సజీవదహనం చేశారు. పోర్చుగీసు ఇంక్విజిషన్ 1536లో మొదలయి 1821 వరకు కొనసాగింది. షుమారుగా 40 వేల మందిని వివిధ శిక్షలకు గురిచేసారు. వాటి వలసరాజ్యాలకు కూడా దానిని వర్తింపచేసారు. ఉదాహరణకు గోవాను అధీనంలోకి తెచ్చుకొన్న తర్వాత 1560లో ఇంక్విజిషన్‌ను మొదలుపెట్టి అనేక వేలమంది హిందువులను, ముస్లింలను చిత్రవధలకు, సజీవదహనాలకు గురిచేసారు.

చర్చి అక్రమాలకు రాజ్యాధినేతలు అండగా నిలిచేవారు. స్పెయిన్, ఇటలీ, పోర్చుగల్ ఇంక్విజిషన్‌ల క్రూరత్వానికి, చిత్రవధలకు, సజీవదహనాలకు భయపడి అనేకవేలమంది ఐరోపాఖండంనుండి పారిపోయారు. ఈ మూడు దేశాలలోనే కాక, ఇతర క్రైస్తవ దేశాలలోనూ ఇంక్విజిషన్ పేరుతో మత విచారణలు, శిక్షలు, సజీవదహనాలు పరిపాటి అయ్యాయి. భయభ్రాంతులకు గురైన ప్రజలు చర్చి దౌర్జన్యాలను ఎదిరించలేక దేశాలుపట్టి పారిపోయేవారు. అనేక శతాబ్దాలపాటు ఆయాదేశాల రాజులు చర్చికి సహకరించారు.

సర్‌జాన్ విలియమ్ డ్రాపర్ ఈ విధంగా వ్రాసాడు."లండన్ లోని థేమ్సు నదిమీద కట్టిన వంతెనను నేరస్థుల తలలతో అలంకరించేవారు. తోరణాలుగా కట్టిన ఈ తలలు చూసి సామాన్యులు చట్టం అంటే భయపడి చట్టం ప్రకారం నడుచుకుంటారని పాలకుల అభిప్రాయం. 1685 మే 8న స్కాట్‌లాండ్ పార్లమెంటు ఒక చట్టాన్ని చేసింది. ఎవరైనా కాథలిక్ మతానికి భిన్నంగా బోధించినా, లేక ఎవరైనా అలాంటి బోధనలు విన్నా, వారు మరణదండనకు పాత్రులవటమేకాక, వారి ఆస్తిపాస్తులు కూడా జప్తుచేయబడతాయి. అలాంటి మరణశాసనం చెయ్యటంతో తృప్తిపడక, ఎవరైనా ఏమాత్రం మతవిశ్వాసాలపట్ల సంశయం వ్యక్తపరచినా వారిని చిత్రహింసలు పెట్టేవారు. మత ప్రబోధకుల ఉపన్యాసాలను, బోధనలను వినటానికి ముందుకు రాని స్త్రీలను కట్టెలకు కట్టి సముద్రజలాలలో ముంచివేసేవారు. లేదా వారి బుగ్గలమీద అవిశ్వాసి అని ముద్రించేవారు. నౌకలు ఎక్కించి అమెరికాకు కట్టుబానిసలుగా పంపేవారు".[3] చర్చి క్రూరత్వం గురించి ఇలాంటి విషయాలు ఎన్నో ఉన్నాయి.

**నమ్మశక్యంకాని ఆంగ్లేయుల జీవనస్థితిగతులు :**

ఇంకవారి జీవన స్థితిగతుల గురించి తెలుసుకుందాం. బి.ఏ. హెూల్డర్‌నెస్ (B.A. Holderness) పారిశ్రామికీకరణకు ముందు ఇంగ్లాండ్‌లో ఉన్న స్థితిగతులపై లోతుగా అధ్యయనం చేసిన పరిశోధకుడు. ఆయన వ్రాసిన విషయాలు ఈనాడు మనం నమ్మలేము. భారతదేశంతో సంపర్కానికి ముందు, వర్తక వాణిజ్య సంబంధాలు నెలకొనటానికి ముందు, ఇంగ్లాండ్‌లోని పరిస్థితుల గురించి వ్రాస్తూ ఆయన "ఆకలి, పౌష్టికాహారలోపం, ఆహారంకోసం కొట్లాటలు, యుద్ధాలు, అంటువ్యాధులు, (మరణాలరేటు ఎక్కువగా ఉన్నా) పెరుగుతున్న జనాభా, పేదరికం, నిరుద్యోగం" మొదలైనవి ఆంగ్లేయుల జీవితాలలో ప్రధాన అంశాలుగా నిల్చాయని వ్యాఖ్యానించారు.[4]

ఈ పరిశోధకులు ఆనాటి పరిస్థితులను వర్ణిస్తూ కొంత మర్యాదపూర్వకమైన భాషను ఉపయోగించారు. ఎటుచూసినా పేదరికం, నిరుద్యోగం విలయతాండవం చేసేవని, వారి ఆనాటి దయనీయ స్థితికి ఆర్థిక కారణాలతోపాటు, పతనమయిన వారి నైతికవిలువలు కూడా కారణమని వారు వ్రాశారు. "పాశ్చాత్యదేశాల్లో సామాజిక

సమస్యలు తీవ్రంగా ఉన్నాయి. అసమర్థులైన పేదలు అందరికంటె ఎక్కువ కష్టాల పాలయ్యారు. శారీరకంగా బలవంతులైనవారు నయవంచకులుగా, సోమరి పోతులుగా, దేశదిమ్మరులుగా బ్రతికేవారు".[5]

ప్లేగువ్యాధి బారిన పడి ఎన్నో లక్షలమంది పశ్చిమ దేశాలలో మరణించారు. ప్లేగువ్యాధి ఇంగ్లాండును అనాథల, దేశదిమ్మరుల, తిరుగుబోతుల నిలయంగా మార్చివేసింది. 14వ శతాబ్దంలో వచ్చిన ప్లేగువ్యాధి ఇంగ్లండు జనాభాను సగానికి పైగా కబళించింది. దాని ప్రభావం బ్రతికి బట్టకట్టినవారిమీద పడింది. ఒకవైపు నిస్సహాయత, రెండవవైపు పరిమితులు లేని క్రూరత్వం రెండూ ఆ సమాజాన్ని ఒక కుదుపు కుదిపాయి. అవి ఆనాటికే నెలకొన్న అశాంతికి, అసంతృప్తికి తోడుఅయ్యాయి. అన్నీ కలసి 'ఎన్‌క్లోజర్' ఉద్యమానికి దారితీశాయి. గ్రామాలలో ఉమ్మడి వనరులపై సమాజానికి ఉన్న ఆధిపత్యం ప్రైవేటు వ్యక్తులపరం అవటాన్ని 'ఎన్‌క్లోజర్' అని అంటారు. చిన్నకమతాలను పెద్దరైతులు, భూస్వాములు బలవంతంగా ఆక్రమించారు. తమ భూముల పరిధిని బలవంతంగా పెంచుకొంటూ పోయి, కొందరు పెద్ద పెద్ద కమతాలకు స్వాములు అయ్యారు. బలవంతులదే రాజ్యమయిన శతాబ్దాలు అవి. బలహీనులకు దిక్కులేని కాలం అది. భూస్వామ్య వ్యవస్థ మరింతగా 'ఎన్‌క్లోజర్ మూవ్‌మెంటు' ద్వారా స్థిరపడింది. ప్లేగువ్యాధివలన లక్షలాదిమంది చనిపోవటంతో కూలీలకు కొఱత ఏర్పడింది. వ్యవసాయం కంటె గొఱ్ఱెలపెంపకం లాభసాటిగా కన్పించింది. గొఱ్ఱెలు పెంచటంవలన అటు తిండికి, ఇటు బట్టకు కూడా లోటు ఏర్పడదు. అంతేకాక ఇతర పాశ్చాత్య దేశాలకు ఉన్ని ఎగుమతులు కూడా చేయవచ్చు. గొఱ్ఱెలు పెంచటానికి సువిశాలమైన భూములు కావాలి. గొఱ్ఱెల మందలు పెరుగుతున్న కొద్దీ వాటి పెంపకానికి ఎక్కువ భూములు కావలసివచ్చాయి. గొఱ్ఱెలను అడవిజంతువులనుండి రక్షించటానికి చుట్టూ కంచెలు కట్టేవారు. కంచెలపరిధిని క్రమంగా విస్తరించుకొంటూ పొయ్యారు. పక్కవాడి కమతాలను, బంజరు భూములను, ఉమ్మడివనరులను బలవంతంగా ఆక్రమించి కంచెలు కట్టి తమ గొఱ్ఱెల కమతాల పరిధిని క్రమంగా విస్తరించారు. 18వ శతాబ్దంవరకు ఇంగ్లండులో సేద్యానికి పనికిరాని భూములే ఎక్కువగా ఉండేవి. ఆ బంజరుభూములపై పెరిగే మొక్కలను, పశుగ్రాసానికి, వంటచెఱుకుకు ఉపయోగించేవారు.[6]

ఎప్పుడైతే బంజరు భూములను ఆక్రమించుకోవడం మొదలయిందో ఆ భూములపై ఆధారపడి బ్రతికేవా రందరూ నిరాధారులయ్యారు. 16వ శతాబ్దపు ఇంగ్లాండ్‌లో మనుషులకంటె గొఱ్ఱెలకే ఎక్కువ విలువ యిచ్చారు. 'ఎన్‌క్లోజర్ మూవ్‌మెంట్' వలన గ్రామాలకు గ్రామాలు ఖాళీ అయ్యాయి. భూమిలేని కూలీల సంఖ్య గణనీయంగా పెరిగింది.దీనితో ఒక కొత్త శ్రామికవర్గం పుట్టింది. వారు నిరుపేదలు, నిరాశ్రయులు. తమ శ్రమ తప్ప తమదంటూ ఏమీలేని వారు. హుందాగా బ్రతకటానికి కావలసిన వనరులు లేనివారు. ఉపాధి వెదుక్కుంటూ సుదూర ప్రాంతాలకు, సమీప పట్టణాలకు వలసలు వెళ్ళినవారు. 15వ శతాబ్దం నుండి నిత్యావసరవస్తువుల ధరలు, యింటి అద్దెలు వేతనాలకంటె వేగంగా పెరగటంతో వాస్తవవేతనాలు పతనం అయ్యాయి. దానితో పేదలు మరింత పేదలుగా దిగజారారు.[7] దానికితోడు ఆనాటి బంగారు, వెండి నాణెముల యొక్క బరువును ఎనిమిదవ హెన్రీ, ఆరవ ఎడ్వర్డు కాలంలో తగ్గించారు. బరువును తగ్గిస్తే, ఎక్కువ నాణెములు ముద్రించవచ్చు. 1544-51 మధ్య 23 కారెట్లుగా ఉన్న బంగారు వరహాను 20 కారెట్లుగా, 92.5 శాతంగా ఉన్న వెండి నాణెంలోని వెండిని 25 శాతంకు తగ్గించారు. 1548లో బంగారాన్ని 22 కారెట్లుగా నిర్ణయించినప్పటికి, బంగారు వరహా బరువును గణనీయంగా తగ్గించారు. దీని వలన నాణెముల కొనుగోలు శక్తి పడిపోయింది.

1587-98 మధ్య తీసుకొని వచ్చిన 'పేదల చట్టాల (Poor Laws)' లక్ష్యం పేదలకు ఉపశమనం కలిగించటం. కాని వాస్తవానికి పేదలకు ఆ చట్టాలవలన ఎలాంటి ఉపశమనం కలుగలేదు. బిచ్చగాండ్లను, తిరుగుబోతులను, అనాథలను ఆ చట్టాలు ఆదుకోలేదు. కూలీల కొఱత వేతనాల పెరుగుదలకు దారితీయాలి. కాని ఎక్కువ వేతనాలు చెల్లించటాన్ని ఈ చట్టాలు నిషేధించాయి. ఆరోగ్యంగా ఉండి పనిలేకుండా తిరుగుతున్న తిరుగుబోతులను, వదరుబోతులను పట్టుకొని, బట్టలు ఊడదీసి, బండ్లకుకట్టి, రక్తం వచ్చేలా కొడ్తూ పట్టణమంతా తిప్పాలని ఎనిమిదవ హెన్రీ ఉత్తర్వులు యిచ్చాడు.

**జీవనంకోసం సముద్రపు దొంగతనాలు :**

ప్రముఖ చరిత్రకారుడు ఆర్నాల్డ్ టోయిన్‌బీ పెరుగుతున్న పేదరికాన్ని పేదల దుస్థితిని ఈ క్రింది విధంగా వర్ణించాడు. "తిరుగుబోతులకు పనికల్పించటం మాని,

వారిని శిక్షించేందుకు రక్తాక్షరాలతో చట్టాన్ని తీసుకొని వచ్చారు. వారిని కొరడాలతో కొట్టటం, తిరుగుబోతులుగా ముఖంమీద ముద్రించటం సమస్యకు పరిష్కారం కాబోదు. రెండు, మూడు సార్లు అదే నేరానికి పాల్పడితే మరణశిక్ష కూడా విధించేవారు. అయితే ఈ శిక్షలు తిరుగుబోతుల, నిరాశ్రయుల సంఖ్యను తగ్గించలేదు. చివరకు శిక్షలను రద్దుచెయ్యక తప్పలేదు. కఠినశిక్షలతో నిరుద్యోగాన్ని, పేదరికాన్ని ఎలా నిర్మూలిస్తారు?"[8] అలాంటి దుర్భర పరిస్థితులలో చట్ట బహిష్కృతులు, సంఘబహిష్కృతులు పాతప్రపంచం (Old World) నుండి బయటపడటానికి తహతహలాడేవారు. అనేకవేలమంది సముద్రపు దొంగలుగా మారిపొయ్యారు. కూడు, బట్ట లేక మలమలమాడిపోయేకంటె సముద్రాల మీద పడి నౌకలను దోచుకోవటంలో ఎంతో ప్రమాదం ఉన్నా, ఆ వృత్తినే ఎంచుకొన్నారు. 18వ శతాబ్దపు ఇంగ్లండులో సముద్రపు దొంగతనాలవల్ల ఒనగూరే లాభాలు చాలా ఆకర్ష ణీయమైనాయి. సముద్రపు దొంగలకు చట్టం అంటే భయంలేదు. సముద్రయానానికి ఎంతో ధైర్యంకావాలి. నౌకలను దోచుకోవటానికి ఎంతో సాహసాన్ని, శౌర్యాన్ని, తెగింపును అలవర్చుకోవాలి. నైతికవిలువలగురించిగాని, నాగరికతా ప్రమాణాలను గురించి గాని వారికి లక్ష్యంలేదు. బ్రూక్స్ ఆడమ్స్ అనే అమెరికన్ పండితుడు ఈ సముద్రపు దొంగల గురించి వ్రాస్తూ వారు స్పానిష్ కాలనీలను ఎంత భయంకరంగా దోచుకొనే వారో వ్రాశాడు. బానిసల వ్యాపారంలో ప్రసిద్ధి చెందిన వైకింగ్స్‌తో సమానంగా ఎంతో భయంకరంగా, శక్తిమంతంగా వారు దోచుకొనేవారని, బంగారం, వెండి, రత్నాలు యథేచ్ఛగా కొల్లగొట్టేవారని వ్రాశాడు.[9]

బహుకొద్ది కాలంలోనే వేలకొద్ది మంది ఈ వృత్తిని ఎంచుకోవటంతో నౌకల మీద వారు జీతభత్యాలు లేకుండా పనిచేస్తూ దక్షిణ అమెరికానుండి వచ్చే స్పానిష్ ఓడలను అదనుచూసి దెబ్బతీసేవారు. వారి విలువైన వస్తువులను, బంగారాన్ని, వెండిని దోచుకొని, ఓడలను సముద్రంలో ముంచేవారు. అలాంటివారిలో ఫ్రాన్సిస్ డ్రేక్ (Francis Drake), జాన్ హాకిన్సు (John Hawkins) ముఖ్యులు. వారిని ఆనాటి సమాజం ఎంతో గౌరవనీయులైన వ్యక్తులుగా, సాహసోపేతులైన వ్యక్తులుగా గుర్తించింది. ఇద్దరూ రక్తసంబంధీకులే. ఇద్దరిదీ ఇతరులను జంతువుల్లా వేటాడే స్వభావమే.

ఎమ్.ఎమ్. ఫ్లిన్ (M.M. Flinn) తన 'బ్రిటన్ ఆర్థిక సామాజిక చరిత్ర' (Economic and Social History of England)లో ఈ విధంగా వ్రాశాడు. "ఎలిజబెత్ రాణి కాలంలో నావికుల గురించి అనేక గాథలు ప్రాచుర్యంలో ఉన్నాయి. డ్రేక్, హాకిన్సు వంటివారు చేసినవి సముద్రమార్గాల అన్వేషణకాదు. నూతన ఖండాల అన్వేషణకాదు. ఇతరుల నౌకలను దోచుకోవటమే వారు చేసింది. 1540 నుండి స్పానిష్ వ్యాపారులు దక్షిణ అమెరికాలోని వెండిగనులను తవ్వి వెండిని తమదేశం తీసుకొని వెళ్తుండే వారు. పనామ నుండి అట్లాంటిక్ మీదుగా నౌకలు ప్రయాణం చేసేవి. వాటికి రక్షణగా యుద్ధవీరులు ఉండేవారు. కనీసం ఒక చిన్న నౌకను పట్టుకొన్నా చాలు. విలువైన వెండి వారికి సొంతం అయ్యేది. సముద్రపు దొంగతనాలు చట్టరీత్యా శిక్షార్హం. అయితే 1580లో ఇంగ్లాండ్‌కు, స్పెయిన్‌కు మధ్య ఉద్రిక్తతలు పెరిగాయి. యుద్ధానికి దారితీసిన పరిస్థితులలో ఈ చట్టవ్యతిరేక కార్యకలాపాలు చట్టబద్ధంగా రూపాంతరం చెందాయి. సర్ ఫ్రాన్సిస్ డ్రేక్, సర్ వాల్టర్ రేలీ (Sir Francis Drake, Sir Walter Raleigh)లకు అంతులేని గౌరవం దక్కింది. వారి సముద్రపు దొంగతనాలు దేశభక్తికి ప్రతీకగా పరిగణింపబడ్డాయి."[10]

**బానిసల వ్యాపారం :**

కాలక్రమంలో సముద్రపు దొంగలలో కొందరు స్వంతంగా వ్యాపారం చెయ్యటం మొదలుపెట్టారు. ఆ ప్రత్యేకమైన వ్యాపారం బానిసల వ్యాపారం. సముద్ర నౌకలమీద పడి దోచుకోవటం కంటె బానిసల వ్యాపారం మరింత లాభసాటిగానూ, తేలికగానూ వీరికి తోచింది.

జాన్ హాకిన్సుకు మంచి వ్యాపార ధోరణి ఉంది. నల్లజాతీయులు మంచి వ్యాపారవస్తువులని జాన్ యువకుడుగా ఉన్నప్పుడే గుర్తించాడు. మంచి శరీరదారుఢ్యం ఉన్న నల్లజాతీయుడి ధర 600 పౌన్లు. 500 మందిని వెస్టిండీస్ నుండి పట్టుకొని తెస్తే 70 లేక 80 వేల పౌండ్లు గిట్టుబాటు అయ్యేది (500×600=30,000 పౌండ్లు కొన్న ఖరీదు). నికరంగా 40లేక 50 వేల పౌండ్లు లాభం. దానితో బానిసల వ్యాపారం వర్ధిల్లింది. 18వ శతాబ్దం మధ్యనాటికి ఇంగ్లండ్ ఒక లక్షమంది నల్లబానిసలను ప్రతిఏటా ఆఫ్రికానుండి ఉత్తర అమెరికాలోని తన కాలనీలకు తీసుకొని వెళ్ళింది. బానిసవ్యాపారులు, సముద్రపు దొంగలు ఇంగ్లాండుకు భారీ మొత్తంలో బంగారాన్ని, వెండిని ఆర్జించి పెట్టారు. 1545కు

ముందు సుగంధద్రవ్యాలు లండన్‌లో అంతగా దొరికేవికావు. వాటికి తీవ్రమైన కొరత ఉండేది. అయితే వారు బానిసల వ్యాపారంలోనూ, సముద్రపు దొంగతనంద్వారానూ ఆర్జించిన సొమ్ముతో వారికి కావలసిన సుగంధద్రవ్యాలను పోర్చుగీసు వ్యాపారులనుండి సమకూర్చుకోగలిగారు. వాస్తవానికి సముద్రపు దొంగతనాల పునాదుల మీదనే ఆసియాలో బ్రిటీషు సామ్రాజ్యస్థాపన జరిగింది".[11]

బ్రిటీషు అభివృద్ధి పరిణామక్రమాన్ని వివరిస్తూ వారి వాణిజ్య విస్తరణ, దాని కారణంగా వ్యాపారవిప్లవం (Commercial Revolution)-అందువల్ల అంతిమంగా పారిశ్రామిక విప్లవం (Industrial Revolution) వచ్చినట్లుగా పాఠ్యగ్రంథాలలో వ్రాస్తూ ఉంటారు. అయితే ఆ వాణిజ్యవిస్తరణయొక్క స్వభావంగురించి ఎక్కడా చెప్పరు. వర్ధమాన దేశాలు తమ విదేశీ వాణిజ్యాన్ని విస్తరించని కారణంగానే అవి వెనుకబడి పోయ్యాయని విమర్శిస్తూ ఉంటారు. సముద్రపు దొంగతనాలద్వారా, మానవుల అక్రమరవాణా ద్వారా, వాణిజ్యాన్ని విస్తరించుకోవటం అన్ని దేశాలకు చేతకాదు. ఇంగ్లండ్‌కు ఉన్న ఈ ప్రత్యేకతల వలననే వారు ఆర్థికంగా ఎదిగారు.

బ్రిటీషు రాజరికవ్యవస్థ, సమాజం ఈ సముద్రపు దొంగలకు యిచ్చిన గౌరవమర్యాదలగురించి ఇప్పుడు తెలుసుకుందాం. సి.ఆర్.ఎన్.రౌత్ ఈవిధంగా వ్రాసాడు. "డ్రేక్ (ప్రసిద్ధి గాంచిన సముద్రపు దొంగ) అక్టోబరు 1580లో ప్లీమత్ (Plymouth) ఓడరేవు పట్టణానికి వచ్చాడు. సముద్రయానానికి పెట్టిన పెట్టుబడిమీద 1400 శాతం డివిడెండ్ ఇచ్చాడు. ఎలిజిబెత్‌రాణి ఎంతో సంతోషించింది. ఆమె ఆ నౌకను (దాని పేరు Golden Hind) లండన్‌కు తెప్పించింది. ఏప్రియల్ 1581లో స్వయంగా రాణి ఆ నౌకను చూడటానికి వెళ్ళింది. తనతోపాటుగా ఫ్రెంచిరాయబారిని కూడా తీసుకొని వెళ్ళింది. రాణిగారి ఆదేశంమీద సముద్రపుదొంగ ఫ్రాన్సిస్ డ్రేక్‌కు ఘనగౌరవం (Knighthood) ను యిచ్చారు."[12]

ఒక సముద్రపు దొంగ కొల్లగొట్టిన సొమ్ము చూసి, కళ్ళు చెదిరి, ఆయనను స్వాగతించటానికి స్వయంగా ఆ దేశపు రాణి, ప్రజలు రావటాన్ని, ఆయన 'వీరోచిత' కృత్యాలను గుర్తించి, బిరుదు ఇచ్చి సన్మానించడం తెల్లవారి స్వభావాన్ని తెలియజేస్తుంది. లక్ష్యంతప్ప మార్గంగురించి ఏమాత్రం పట్టింపులేని వారి బరితెగించిన వ్యాపార ధోరణిని బయటపెట్టింది.

**ప్రజల దుర్భర జీవితాలు :**

ఫాల్క్నర్ (Faulkner) ఐరోపా ఆర్థిక స్థితిగతులను వివరిస్తూ ఆధునిక ప్రమాణాలను బట్టి 15వ శతాబ్దం ఒక స్తబ్దత ఆవరించిన నాగరికత నెలకొన్నకాలంగా అభివర్ణించాడు (Static Civilization). ఎందుకంటే, జనాభా విస్ఫోటనం వలన భూమిమీద ఒత్తిడి పెరిగింది. బ్రతకటానికి అవసరమైన అన్నిటిమీద ఒత్తిడి కారణంగా ప్రజలు దుర్భర జీవనం గడిపిన శతాబ్దం అదీ.[13] సర్ జాన్ విలియమ్ డ్రేపర్ (Sir John William Draper) 16-17 శతాబ్దాల ఇంగ్లండ్ గురించి ఈ విధంగా వ్రాసాడు.

'రైతుల నివాసం చిన్నచిన్న గుడిసెలు, మట్టి, కర్రలతో తయారైనవి. పొగ బయటకు పోవటానికి వీలులేని చిమ్నీలు వాడేవారు. గట్టి మట్టితో వాటిని తయారు చేసేవారు. రహదారులు ప్రమాదకరంగా ఉండేవి. లెక్కలేనంతమంది దారిదోపిడి దొంగలు తిరుగుతూ ఉండేవారు. సముద్రపు దొంగలకు కొదవేలేదు. నదులమీద, సముద్రంమీద నౌకాయానం ప్రమాదకరంగా ఉండేది. బట్టలమీద, మంచాలమీద క్రిమికీటకాలు విహారం చేస్తూ ఉండేవి. వారి సామాన్య ఆహారం బఠాణీలు, బఠాణీ కుటుంబానికి చెందిన పొదల ఆకులు, అలములు, ఇతర చెట్ల బెరడులు, ఫెర్న్ చెట్టు వేళ్ళు. కఱవు, కాటకాల నివారణకు ఎట్టి ప్రణాళికలు లేవు. ప్రకృతి దయమీద ఆధారపడి బ్రతకటమే వాళ్ళకు తెలిసింది. జనాభా గ్రామాలలో పల్చగా ఉండేది. నిరంతరం ఆకలితో అలమటించేవారు. రకరకాల అంటువ్యాధుల బారినపడి, సరైన చికిత్స లేక, మరణాల రేటు ఎక్కువగా ఉండేది. పట్టణవాసుల జీవనం రైతుల జీవనం కంటె మెరుగ్గా ఏమీ ఉండేదికాదు. కొంచెం మెరుగైన జీవనం గడిపేవారు చర్మపు దుస్తులు ధరించేవారు. పట్టణాలలోని పేదలు తమ శరీరాలను చలినుండి తట్టుకోవటానికి గడ్డితో కప్పుకొనేవారు. పేదలకు వైద్యంలేదు. వైద్యుడూ లేడు. పారిశుద్ధ్య వసతులు అసలేలేవు. మగవాళ్ళు సముద్రయానం (నౌకల దొంగతనం) ద్వారా వచ్చే లాభాలగురించి వింటూ, తమకు ఎప్పుడు అలాంటి అదృష్టం కలుగుతుందా అని ఎదురుచూస్తూ గడిపేవారు. నిరక్షరత ఏస్థాయిలో ఉండేదంటే పార్లమెంటు సభ్యులలో అనేకమంది చదవటమూ, వ్రాయటమూ రానివారే. 6 షిల్లింగులకోసం, 8 పెన్నీలుకోసం కూడా తీవ్రమైన నేరాలకు పాల్పడేవారు. 17వ శతాబ్దం చివరకూడా లండన్ ఒక మురికికూపంలా

ఉండేది. క్రూరజంతువులు, పందులు యథేచ్ఛగా సంచరిస్తూ ఉండేవి. వర్షాకాలంలో రహదారులు అన్నీ జలమయ్యేవి. బురద బురదగా ఉండేవి. ఇక సామాజిక విషయాలకు వస్తే, నైతిక విలువలు ఉండేవికావు. గృహహింస తారాస్థాయిలో ఉండేది. భర్తలు భార్యలను చీటికీ మాటికీ కొట్టేవారు. అపరాధులకు దండన కఠినంగా ఉండేది. రాళ్ళతో కొట్టేవారు. స్త్రీలను కాళ్ళుకట్టి బంధించేవారు. లండన్‌లో చెక్కయిళ్ళే ఎక్కువగా ఉండేవి. వీధులన్నీ మురికిగా, దుర్గంధంతో, నడవటానికి వీలు కాకుండా ఉండేవి. రాత్రుళ్ళు వీధులవెంట నడవటం ప్రమాదకరం. ఏక్షణమైనా ఎవరైనా వచ్చి ఏదైనా చేయవచ్చు. ఇక చట్టాన్ని అమలు చేసే విషయంలో అయితే అది రాజకీయపరమైన లేక మతపరమైన అంశమైనా నమ్మశక్యంకాని దారుణాలు చోటు చేసుకొనేవి. ఇంగ్లండ్ రాణితోపాటుగా, ఆమెకు, ఆమె దాసానుదాసులకు సేవలు అందించే మహిళలు అందరూ ఏమాత్రం దయలేని వారుగా ప్రవర్తించేవారు. మానవత్వం అంటే వారికి తెలియదు. ఆ దుర్భర నరకయాతన బతుకుల్లో ఏమాత్రమూ కనికరం లేకుండా, క్రూరత్వానికి మారుపేరుగా వారు వ్యవహరించేవారు".[14]

అమెరికా వలసీకరణను వివరిస్తూ ఫాల్కనర్ ఇంగ్లాండ్ సామాజిక స్థితిగతులను ఈ క్రింది విధంగా చెప్పాడు. "మన దేశం అంతా సోమరిపోతులతో నిండిపోయింది. వారి పేదరికాన్ని పోగొట్టే ఉపాయమేలేదు. వారికి పనిపాటలు లేవు. వృథాగా కాలక్షేపం చేస్తున్నారు. అశ్లీల పనులు అంటే వారికి ఆసక్తి. అల్లరి చిల్లరగా తిరగటం వారి అలవాటు. వారిని మనం అమెరికాకు పంపాలనుకొంటె మనం ఎక్కువ సంఖ్యలో జైళ్ళు సత్వరమే అక్కడ నిర్మించాలి. వారందర్నీ ఏదో విధంగా వదిలించుకొంటేనే మనదేశానికి మంచిది. క్రూరత్వంలోనూ, చెడు అలవాట్లలోనూ వారిని మించినవారు మరొకరులేరు. ప్లేగువ్యాధి కంటె భయంకరమైన వారు సమాజంలో వివిధవర్గాలకు వారి చెడునడతను సంక్రమింపచేస్తున్నారు. కనుక వారిని ఏదో విధంగా వదిలించుకోవటం అవసరం".[15] ఆవిధంగా ఇంగ్లండ్ మోసగాళ్ళకు, బిచ్చగాళ్ళకు, తిరుగుబోతులకు, వదరుబోతులకు నిలయంగా మారిందని వ్యాఖ్యానించాడు. సముద్రపు దొంగతనాలను సాహసకృత్యాలుగా, సముద్రపు దొంగలను హీరోలుగా వారు చిత్రీకరించారు. ఆఫ్రికా నుండి, వెస్టిండీస్ నుండి నల్లజాతీయులను అక్రమంగా బంధించి తెచ్చి

అమ్మేవ్యాపారులు వారికి స్ఫూర్తి ప్రదాతలు అయ్యారు. ఆరకంగా ఆర్జించిన బంగారం, వెండిల ప్రవాహాన్ని విదేశీ వాణిజ్యవిస్తరణగా వారు పేర్కొన్నారు. ఏ మార్గాన ఆర్జించారు అన్నది ముఖ్యంకాదు. ఆర్జనే వారిధ్యేయం. ఆర్జనాపరులు వారికి నాయకులయ్యారు. ఆరాధనీయు లయ్యారు.

**ఈస్టిండియా కంపెనీ ఆవిర్భావం:**

సముద్రపు దొంగలకు, బ్రిటీషు రాజరికానికిమధ్య సన్నిహిత సంబంధాలు ఉండేవి. సముద్రపు దొంగతనాలద్వారా దోచుకున్న సొత్తు ప్రభుత్వానికి ఆదాయవనరుగా మారింది. ప్రభుత్వానికి పన్నుచెల్లించితే (అధికారులకు తగినంత లంచం ముట్టచెపితే) వారిని జనజీవన స్రవంతిలోకి కలవటానికి అనుమతిస్తామని ప్రభుత్వం ప్రకటించింది. ఆ విధంగా సముద్రపు దొంగతనాలకు ప్రభుత్వం పచ్చజెండా ఊపింది. హాకిన్సు 1562లో నల్లజాతీయులను బానిసలుగా పట్టితేవటానికి బయలుదేరాడు. బ్రిటీషురాణి స్వయంగా ఒక పెద్దనౌక 'జీసస్ ఆఫ్ లూబెక్'ను ఆయనకు సమకూర్చి పెట్టింది. ఆ బానిసల వ్యాపారంలో బ్రిటీషురాణికి 60 శాతం డివిడెండ్‌ను హాకిన్సు చెల్లించాడు. తను పెట్టిన పెట్టుబడిమీద 60 శాతం లాభం రావటంతో హాకిన్సుతో చేతులు కలిపినందుకు ఆమె ఎంతో సంతోషించింది. 1567లో హాకిన్సు తిరిగి ఆఫ్రికాకు మూడవసారి బానిసల కొనుగోళ్ళకై బయలుదేరినప్పుడు, రాణిగారు ఆ వ్యాపారంలో భాగస్వామి అవటమే కాక, రెండు పెద్దనౌకలను హాకిన్సుకు సమకూర్చి పెట్టారు. హాకిన్సుతోపాటుగా డ్రేక్, బ్రిటీషు రాణి, ఇంకొందరు కలసి ఒక జాయింట్ స్టాక్ కంపెనీని ఏర్పాటు చేసుకున్నారు. వ్యాపార భాగస్వామ్య కంపెనీలకు బహుశా అదే మొదలేమో. తర్వాత వచ్చిన ఈస్టిండియా కంపెనీకి మాత్రం ఖచ్చితంగా ఈ వ్యాపార భాగస్వామ్య షరతులే స్ఫూర్తిని యిచ్చాయి. నమూనాగా కూడా వారి భాగస్వామ్యపత్రం పనికి వచ్చింది. హాకిన్సు 1595లో ఇంకొకసారి డ్రేక్‌తో కలిసి బానిసలకొనుగోళ్ళకు, సముద్రపు దొంగతనాలకు బయలుదేరినప్పుడు కూడా బ్రిటీషు రాణి ఆ వ్యాపారంలో కూడా భాగస్వామి అయ్యింది. డ్రేక్ అంతకు ముందు 1400 శాతం తెచ్చిపెట్టిన వ్యాపారం చేసినప్పుడు రాణి నౌకలోకి వెళ్ళి డ్రేకుకు స్వాగతం చెప్పి, అభినందనలు తెలియచేసిన విషయం ఇంతకు ముందే చెప్పుకున్నాము కూడా. 17వ శతాబ్దం మధ్యలో ఆలివర్ క్రామ్‌వెల్ ఇంగ్లండు, స్కాట్‌లాండ్, ఐర్లండ్

కామన్‌వెల్త్‌కు ప్రొటెక్టరుగా పనిచేసి, చరిత్ర ప్రసిద్ధుడయ్యాడు. క్రామ్‌వెల్ కూడా సముద్రపు దొంగతనాలను ప్రోత్సాహించేవాడు. స్పెయిన్ తీరప్రాంతానికి చేరవలసిన నౌకలను దోచుకొమ్మని పురమాయించాడు. కొన్నిసార్లు విఫలం అయ్యాక ఒకసారి 4,50,000 వేల పౌండ్ల విలువైన సరుకును, బంగారాన్ని, వెండిని దోచుకొని వచ్చారు. దానివిలువ ప్రాచ్యదేశాలకు చేసిన మొత్తం ఎగుమతుల విలువకంటె ఎక్కువ. మరికొన్నాళ్ళ పాటు కనుక క్రామ్‌వెల్ బ్రతికి ఉంటే బ్రిటన్‌ను ఆర్థికంగా మరింతగా బలోపేతం చేసేవాడని కొందరు చరిత్రకారులు వ్రాశారు. క్రామ్‌వెల్ వంటివారికి అనుసరించే పద్ధతులపట్ల పెద్దగా పట్టింపులేదు. దోచుకోవటానికి అనుమతులు, దోచుకొచ్చిన సొత్తులో భాగం తీసుకోవటం ఎప్పటినుండో బ్రిటన్‌లో ఉన్న పద్ధతే. క్రామ్‌వెల్ కూడా అదే మార్గంలో నడిచాడు. స్పెయిన్ అధీనంలోని దక్షిణ అమెరికాపై దాడిచేసి, వారి బంగారు గనులను కొల్లగొట్టాలని ఆయన ప్రణాళిక కూడా రచించాడు. అయితే అది కార్యాచరణకు రాకముందే ఆయన మరణించాడు.[16]

క్రామ్‌వెల్ తర్వాత అధికారంలోకి వచ్చినవారు ఆయనకంటె ఘనులు. మొదటి ఛార్లెస్, మొదటి జేమ్సు, ఇంకా ఇతర స్టువర్టు రాజులు సముద్రపు దొంగలతో ఒప్పందానికి వచ్చి, వారికి దోచుకొనేందుకు పూర్తిహక్కులు యిచ్చారు. అందుకు ప్రతిఫలంగా దోచుకొచ్చిన సొత్తులో వాటా తీసుకొనేవారు.

ఆర్.డబ్లు.హారీస్ ఒక చరిత్రకారుడు. 18వ శతాబ్ది ఇంగ్లాండ్ గురించి ఆయన ఒక గ్రంథం వ్రాశాడు. వ్యాపారులు, నావికులు దాడిచేసే గుంపులని వర్ణించాడు. ఇతరదేశాల సొత్తును, సరుకులను, బంగారం, వెండి, ప్లాటినమ్ మొదలైన లోహాలను దోచుకొనే గుంపుగా ఆయన ఆంగ్ల వ్యాపారులను, నావికులను పేర్కొన్నారు. బ్రిగ్స్, మరియు జోర్డాన్‌లు ఇంకా ఒక్క అడుగుముందుకు వేసి ఎలిజబెత్ రాణి నుండి మొదలయి మూడవ జార్జి చక్రవర్తి కాలం వరకు మిలియన్ల కొద్దీ పౌండ్లు దేశంలోకి తెచ్చారు. అదంతా దోచుకొచ్చిన సొత్తు అని వ్రాసారు.[17] ఆవిధంగా పాలకులు, వ్యాపారులు, నావికులు, సముద్రపుదొంగలు తోడుదొంగలయ్యారు. ఆ అవినాభావ సంబంధం నుండే పుట్టుకొచ్చింది బ్రిటీషు ఈస్టిండియా కంపెనీ. తూర్పుదేశాలతో వ్యాపారం చెయ్యటానికి ఈస్టిండియా కంపెనీకి ఏకస్వామ్య(గుత్తాధిపత్య) హక్కులను కట్టబెట్టారు.

16వ శతాబ్దంలో ఆంగ్లవ్యాపారులు సుదూర ప్రాంతాలతో వాణిజ్య సంబంధాలకై తహతహలాడేవారు. అయితే ఆ ప్రాంతాలతో వ్యాపారసంబంధాలు

ఏర్పాటు చేసుకోవటానికి పెట్టుబడులు ఎక్కువకావాలి. రిస్క్ ఎక్కువ. ముందుగా ప్రాచ్యప్రాంతాలు చేరటానికి సముద్రమార్గాలు అన్వేషించాలి. ఆ తర్వాత అక్కడ అధికారులను, రాజులను కలసి అనుమతులు సంపాదించాలి. అందుకు వారికి విలువైన కానుకలు యివ్వాలి. లంచాలు యివ్వాలి. సంతోషపెట్టాలి. వ్యాపార అనుమతులు సంపాదించిన తర్వాత వాటిని కాపాడుకోవటానికి ఖర్చుపెట్టాలి. స్వీయరక్షణకోసం రక్షకదళాలను కల్గిఉండాలి. ఇందుకు కావలసిన మూలధనం మొత్తం ఏఒక్కరూ పెట్టుబడిగా పెట్టలేరు. అందువలన ఒక కొత్త భాగస్వామ్య కంపెనీ ఏర్పాటు అనివార్యమయింది. అనేకమంది వ్యాపారులు, పెట్టుబడిదారులు, పాలకవర్గం కలసి కావలసిన మూలధనాన్ని సమకూర్చారు. వ్యాపార లావాదేవీలు అన్నీ కంపెనీ పేరున జరుగుతాయి. వచ్చిన లాభాలను మూలధనంలో వాటాల నిష్పత్తి ప్రకారం భాగస్వాములందరూ పంచుకొంటారు. ఈ ఉమ్మడి భాగస్వామ్య సంస్థలను ఒక రాజపత్రం (Royal Charter)ద్వారా సృష్టించటంతో పాటుగా వ్యాపారంలో ఉన్న రిస్క్ కారణంగా బ్రిటీషు రాణి కంపెనీకి పోషకులు (Patron)గా, భాగస్వామి (Partner)గా ఉంటుంది. బ్రిటీషు రాణి ప్రాపకం ఉంది కాబట్టి ఈస్టిండియా కంపెనీకి చట్టబద్ధత వచ్చింది. ఏ పాశ్చాత్య కంపెనీ నుండి పోటీఎదురైనా, ఏదైనా జరగకూడనది జరిగినా, ప్రభుత్వ అండదండలు ఉంటాయి కాబట్టి ఈస్టిండియా కంపెనీ వ్యాపారానికి ఢోకా ఏమాత్రమూ లేదనే నమ్మకం కుదిరింది.

ఈస్టిండియా కంపెనీ ఏర్పాటు సందర్భంగా రాణి స్వయంగా ఒక ప్రకటనచేసింది. కొందరు సాహసుల సంఘంగా ఆమె కంపెనీని పేర్కొంది. లాభాలు ఆర్జించటానికి గాని, లూటీ చేయటానికిగాని ఏ మాత్రమూ సంకోచంలేని వ్యక్తుల సమూహంగా ఆమె ఈస్టిండియా కంపెనీని అభివర్ణించింది. కంపెనీ డైరక్టర్లు సైతం తమ అభ్యర్థనలో తమ ఉద్యోగులను ఎంపిక చేసుకొనే స్వేచ్ఛను తమకు యివ్వాలని కోరారు. "గౌరవనీయులైన వ్యక్తులను ఎటువంటి పరిస్థితులలోనూ ఉద్యోగులుగా ఎంపిక చేయకూడదు" అన్న నియమాన్ని వారు పెట్టుకున్నారు.[18] సత్యనిష్ఠ కలవారికి, మానవత్వం కలవారికి కంపెనీ కార్యకలాపాలలో పనిచేయటానికి అర్హతలేదు. సంపాదించాలనే యావ, జిత్తులమారితనం, దేనికైనా వెనుకాడని తత్త్వం, నైతికప్రమాణాలపట్ల నిష్ఠలేకపోవటం ప్రత్యేకఅర్హతలు అయ్యాయి. ఏదో విధంగా కంపెనీ వ్యాపారాన్ని వృద్ధిచేయగలవారికే పెద్దపీట వేశారు. ఈ విషయాలను

గమనించినప్పుడు ఈస్టిండియా కంపెనీ లక్ష్యాలు, స్వరూపస్వభావాలు మనకు ఇట్టే అర్థమవుతాయి. 1608లో మొట్టమొదటి బ్రిటీషు నౌక మనతీరానికి చేరింది. దాని పేరు హెక్టర్ (Hector). ఎదుటివారితో బిగ్గరగా, అప్రియంగా మాట్లాడుతూ, బెదిరించి తనపనులు చేసుకొనేవాడని ఆ పదానికి అర్థం. హెక్టర్‌కు కెప్టెన్ అయిన విలియమ్ హాకిన్స్ జహంగీర్ చక్రవర్తికి మొదటి జేమ్సునుండి ఒకలేఖను తీసుకొనివచ్చాడు. భారతదేశంతో వ్యాపారం నిమిత్తం ఆంగ్లేయులకు అనుమతిని యివ్వండని కోరుతూ ఒక అభ్యర్థనపత్రాన్ని తీసుకొనివచ్చాడు. భారత్ ఉపఖండంలో ఈస్టిండియా కంపెనీ ప్రవేశం ఇలా మొదలైంది.

15-16 శతాబ్దాలలో అనేక పదాలను ఒకే అర్థంలో వాడారు. వ్యాపారం (Trade), సముద్రపు దొంగతనాలు (Piracy), అన్వేషణ (Navigation), సాహసం (Adventure), ప్రపంచాన్ని సముద్రమార్గం ద్వారా చుట్టిరావటం (Circum Navigation) మొదలైన పదాలను ఒకదానికొకటి పర్యాయపదాలుగానే వాడారు. ఆ పదాలకు 'న్యూ స్పిరిట్ ఆఫ్ ఎంక్వరీ', 'ది హీరోయిక్', 'ది ఎడ్‌వెంచరస్' అనే విశేషణాలు జోడించారు. లాభార్జాన కోసం దేనికైనా తెగించగల ఒక వ్యాపారమూక తూర్పుదేశాలతో వాణిజ్యంకోసం బయలుదేరింది.

**పాశ్చాత్యుల భౌగోళిక శాస్త్ర పరిజ్ఞానం :**

ఈ సందర్భంగా పాశ్చాత్యుల భౌగోళిక శాస్త్ర పరిజ్ఞానం గురించి ఒక్కమాట చెప్పుకోవాలి. భూమి బల్లపరుపుగా ఉందనే వారు మధ్యయుగంవరకు నమ్మారు. కనుక దాని అంచువరకు వెళితే క్రిందకు పడిపోతామని వారు భావించారు. గెలీలియో మొట్టమొదటగా భూమిగుండ్రంగా ఉందని ప్రతిపాదిస్తే, వారు దాన్ని నమ్మకపోగా, అతడికి మరణశిక్ష విధించి అమలుచేసారు. 15వ శతాబ్దపు చివరమాత్రమే కొందరు పాశ్చాత్య మేధావులు భూమి గోళాకారంగా ఉండవచ్చునని విశ్వసించటం మొదలుపెట్టారు. పడమరవైపు అనంతంగా సముద్రజలాల్లో ప్రయాణంచేస్తే భారతదేశాన్ని చేరుకోవచ్చని కొలంబస్ ప్రతిపాదన చేస్తే ఆయనను అవహేళన చేసారు. కొందరు చక్రవర్తులను కలసి తన ప్రతిపాదనను కార్యరూపంలో పెట్టటానికి ఆర్థిక సహాయం చెయ్యమని కోరినప్పుడు కొలంబస్‌ను ఒక తెలివిలేని వెర్రివాడుగా కొట్టిపారవేశారు. భారతదేశానికి చేరగల నన్న నమ్మకంతో కొలంబస్ తన నౌకాయాత్రను మొదలుపెట్టి కొన్ని నెలలు ప్రయాణం తర్వాత 'బహామాస్' చేరి అదే భారతదేశం అనుకొన్నాడు. (తను మరణించేవరకు కూడ ఆయన అదే

అభిప్రాయంతో ఉన్నాడు) అమెరికాను అదృష్టవశాత్తు కొలంబస్ కనుగొన్నాడు. అదిగొప్ప ఆవిష్కరణ అయినప్పటికి భారతదేశాన్ని చేరుకోలేకపోయామని స్పెయిను దేశస్థులు ముందు విచారపడ్డారు. జిబ్రాల్టర్ పడమటిగా 3250 మైళ్ళ దూరంలో ఒక పెద్ద ఖండం ఉందని, దాని తర్వాత పసిఫిక్‌ను దాటి వెళితే భారతదేశాన్ని చేరుకోవచ్చుని ఈ పాశ్చాత్య నావికులకు తెలియకపోవటం ఆశ్చర్యకరం. భారతదేశాన్ని చేరుకోవటానికి అమెరికాద్వారానే వీలు అవుతుందని చాలాకాలంపాటు వారు భావించారు. చిట్టచివరకు భారతదేశానికి చేరువయ్యేమార్గాన్ని కనుగొన్న ఖ్యాతి వాస్కో డిగామాకు దక్కింది. 1498లో మలబారుతీరాన్ని ఆయన చేరుకున్నాడు. కొందరు భారతీయ నావికుల సాయంతోనే అది సాధ్యమయిందని చాలామందికి తెలియదు. వాస్కో డిగామా తర్వాత అనేకమంది పోర్చుగీసు నావికులు భారతదేశానికి వచ్చారు. కాని ఆంగ్లేయులు ఆ తర్వాత వంద సంవత్సరాలకుపైగా సముద్రజలాల్లో భారత్‌కు దారి వెదుక్కుంటూ తిరిగారు. భారతదేశానికి చేరటానికి వారికి పోర్చుగీసువారినుండి పటాలు దొంగలించకతప్పలేదు. ఫ్రాన్సిస్ డ్రేక్ తను దొంగిలించిన పటాల (Maps) సాయంతోనే ఎట్టకేలకు భారత్ తీరానికి చేరాడు. అయితే ఈనాటికీ పాశ్చాత్యులు చేసిన ప్రయాణాన్ని ఒక మహత్తర సాహసోపేత చర్యగా వర్ణించేవారు ఉన్నారు.

14-15 శతాబ్దాలలో పాశ్చాత్యదేశాల్లో, మరీ ముఖ్యంగా ఇంగ్లండులో ఎలాంటి పరిస్థితులు నెలకొని ఉన్నాయో తెలుసుకున్నాం. ఈస్టిండియా కంపెనీ ఏ సందర్భంలో పుట్టుకొచ్చిందో, దానికి నాయకత్వం వహించిన వారి లక్ష్యాలు, స్వరూప స్వభావాలు గురించి తెలుసుకున్నాం. మొట్టమొదటిసారిగా మరొక ఆటవిక నాగరికతను భారతదేశం చవిచూడవలసి వచ్చింది. తమకంటె అన్నిటా భిన్నమయిన ఒక సంస్కృతిని ఎదుర్కోవలసి వచ్చింది. ఈస్టిండియా కంపెనీ గురించి వ్రాస్తూ షెరిడన్ (Sheridan) ఈ విధంగా అన్నాడు "కంపెనీ తన పుట్టుకకు కారణమయిన మౌలిక లక్ష్యాలకు ఎప్పుడూ దూరంకాలేదు. ఆ తర్వాత కూడా ఆ లక్ష్యాలకు అనుగుణంగానే దాని ఆచరణ కూడా ఉంది. వస్తువులు అమ్ముతూ ఒక ఊరినుండి మరొక ఊరికి వెళ్ళే చిన్న వ్యాపారులకు ఉండే సంకుచిత తత్త్వం, వారు సాధించిన ఘనకార్యాలలో సైతం ప్రతిబింబించేది".[19]

(ఈ అధ్యాయంలోని విషయాలను అందజేయడంలో **1987**లో కె.ఎల్.కేడియా, ఎ.సిన్హా గారలు రచించిన Roots of Underdevelopment-A Peep into India's Colonial Past గ్రంథం బాగా ఉపకరించింది.)

## References


1a. William Digby: Prosperous British India, p. 121.
1b. Ibid p. 125
1. *Faulkner, American Economic History, p. 32*
2. *E.J. Hobsbawm, Industry and Empire, p. 52*
3. *John William Draper,The Intellectual Developmentof Europe, pages 233-234*
4. *B.A. Holderness, Pre-Industrial England: Economy and Society from 1500 to 1750*
5. *Briggs and Jordan, Economic History of England, p. 127*
6. *Ibid*
7. *E.J. Hobsbawm, Industry and Empire, p. 54*
8. *Arnold Toynbee, The Industrial Revolution, p. 71*
9. *Brooks Adams, The Law of Civilisation and Decay, p. 279*
10. *M.M. Flinn, An Economic and Social History of Britain since 1700*
11. *Brooks Adams, pp. 280-81*
12. *C.R.N. Routh, Who is Who in History, Vol II, p. 402*
13. *Faulkner, p. 37*
14. *John William Draper, pp. 233-234*
15. *Faulkner, p. 40*
16. *C.R.N Routh, pp. 380-410*
17. *Briggs and Jordan,p. 165*
18. *Bruce, Annals of the Honourable East India Company, Vol I, p.128, Also see W.W. Hunter, History of British India*
19. *Brooks Adams, p. 295*




# 2

# ఆంగ్లేయులు ఇక్కడ పాలకులు ఎలా అయినారు?

ఈ గ్రంథం మనదేశంలో మూడున్నర శతాబ్దులలో సంభవించిన పరిణామాలను ప్రధానంగా ఆర్థికశాస్త్రపరంగా తెలియజెప్పే ఒక ప్రయత్నం. ఆ సమయంలో సంభవించిన చారిత్రక ఘటనలను కూడా ప్రక్కన ఉంచుకొని వాటి నేపథ్యాన్నికూడా దృష్టిలో ఉంచుకొంటేనే ఈ పరిణామాలను మనం అవగాహన చేసుకోగల్గుతాం. ఆ కారణాన విస్తృతంగా వివరించకపోయినా రేఖామాత్రంగానో, ఉదాహరణ రూపంలోనో కొన్ని ఘటనలను స్మరించుకోవటం ఆవశ్యకం.

1947 ఆగస్టు 15న ఆంగ్లేయులు మనదేశాన్ని మనకు విడిచిపెట్టి వెళ్లిపోయినందున మనకు స్వాతంత్ర్యం వచ్చినదని అందరమూ తరచుగా చెప్పుకొంటూ ఉంటాం. ఆరోజు ఏటేటా ఉత్సవాలు జరుపుకుంటాం. పాఠశాలలకు, కార్యాలయాలకూ సెలవురోజు–కాబట్టి మనకు బాగా గుర్తుండేరోజు. మరి ఆంగ్లేయులు మనదేశంలోకి ఎప్పుడు వచ్చారు? ఎప్పుడు పాలకులైనారు? ఈ విషయం ఏ పాఠ్యపుస్తకంలోనైనా చదివినట్లుగా ఎవరికైనా జ్ఞాపకం ఉందా? ఉండే అవకాశమే లేదు. ఎందుకంటే ఇది ఈ దేశప్రజలు తెలుసుకోదగిన విషయమని గాని, గుర్తుంచుకోదగిన విషయమనిగాని ఆంగ్లపాలకులు భావించలేదు. ఆంగ్లేయుల పాలనలో ఈదేశీయులు స్పృహ లేకుండా పడియుండటమే తమకు మంచిదని ఆంగ్లేయులు భావించారు. తదనుగుణంగానే పాఠ్యపుస్తకాలు వ్రాయించారు. ఇప్పటికీ మనం ఆ ధోరణిలోనే చదువులు కొనసాగిస్తున్నాం.

కాగా కొందరు తెలివైన పిల్లలు తమనుతాము ప్రశ్నించుకొని, సమాధానాలు వెదికే ప్రయత్నాలు చేస్తుంటారు. పేరు తెలియని ఒక పిల్లవాడు అడిగిన ప్రశ్న గురించి స్వర్గీయ మన్నవ గిరిధరరావుగారు (గుంటూరులోని హిందూ కళాశాలలో చరిత్ర ఉపన్యాసకులు) ఒక వ్యాసంలో ప్రస్తావించారు.

ఆ పిల్లవాడు గ్లోబును, ప్రపంచపటాన్ని తీసికొని తమకు చరిత్ర బోధించే ఉపాధ్యాయుని చేరి ఇలా అడిగినాడట–"ఇంగ్లాండు ఇంత చిన్నదిగా ఉంది కదా, ఈ దేశంలోని ఇంగ్లీషువారు 'రవి అస్తమించని–ప్రపంచ వ్యాప్తమైన ఆంగ్ల సామ్రాజ్యాన్ని ఎలా స్థాపించారు?"

దానికి ఆ ఉపాధ్యాయుడు–"ఇంగ్లీషువారు మొదట హిందూదేశాన్ని జయించారు. ఆ తర్వాత ఇక్కడ లభించిన జనంతో, ఇక్కడ లభించిన ధనంతో ప్రపంచ వ్యాప్తమైన సామ్రాజ్యాన్ని గెలుచుకున్నారు." ఈ మాటకు సంతృప్తి చెందని ఆ పిల్లవాడు మళ్లీ అడిగాడు–"ఇంగ్లాండు ఇంత చిన్నదిగా ఉంది. హిందూదేశం ఇంత పెద్దదిగా ఉంది. ఇంత పెద్ద హిందూదేశం ఇంత చిన్న ఇంగ్లాండువారికి ఎలా వశమైంది?"ఉపాధ్యాయుడు జవాబు చెప్పాడు–"ఆంగ్లేయులు మొదట బెంగాలును జయించారు. అక్కడ లభించిన జనంతో, ధనంతో వారు హిందూదేశాన్ని జయించారు. ఉహూ! ఈ మాటకూ ఆ పిల్లవాడు తృప్తి చెందలేదు. బెంగాలుకూడా ఇంగ్లాండుకంటే పెద్దదిగానే కనబడుతున్నదే! ఇంగ్లీషువారు బెంగాలను ఎలా జయించగలిగారు?" ఉపాధ్యాయుడు చెప్పిన సమాధానమిది–"బెంగాలును ఇంగ్లీషువారు జయించలేదు. బెంగాలే వచ్చి ఇంగ్లీషువారి ఒడిలో పడింది"

తమాషాగా కనబడే ఈ పిట్టకథ మూడు శతాబ్దుల క్రింద సంభవించిన చారిత్రిక పరిణామాలకు దర్పణం వంటిది. నాటి పరిణామాలను వీలైనంత విపులంగా, సాధ్యమైనంత సంక్షిప్తంగా తెలుసుకొనే ప్రయత్నం చేద్దాం.

**బంగారు పక్షి:**

సుదూరగతంలోకి తొంగిచూసి అంచనాలు వేయనారంభించిన ఇతిహాసజ్ఞుల చూపు ప్రసరించిన కాలఖండాల తొలినాళ్లనుండి హిందూదేశం ఒక సమృద్ధమైన దేశం. నీటివనరులు పుష్కలంగా ఉన్న సారవంతమైన భూములు, అటవీ సంపద, ఖనిజసంపదలవంటి ప్రకృతివనరులూ, తరతరాలుగా అందించబడుతున్న జ్ఞానవిజ్ఞానములు, సంస్కృతీ, నాగరికతలూ విలసిల్లిన ప్రదేశం. పాడిపంటలకేగాక, వస్త్రములు, అనేక వృత్తులకు అవసరమయ్యే పనిముట్లు, గృహోపకరణాలు తయారు చేయబడడానికి కూడా ప్రసిద్ధి గన్నది. ఇక్కడి ప్రజల్లో ఎద్దులు, గుఱ్ఱాలు, ఏనుగులూ, ఒంటెలు, బండ్లూ, రథాలూ ప్రయాణసాధనాలుగా నేలమీద వేగంగా

ప్రయాణించ దానికేగాక పడవలలో ఓడలలో-కాలువలమీద, నదులమీద, సముద్రాలమీద ప్రయాణించడానికి కూడా అలవాటు పడినవారు కూడా ఉండేవారు. మనదేశానికి గల ఎంతోపొడవైన సముద్రతీరంలో ఎన్నో రేవు పట్టణాలు అభివృద్ధి చెందినవి. ఇక్కడ పండిన, తయారైన వస్తువులను నౌకలలో నింపుకొని ఖండఖండాలలోని రేవు పట్టణాలకు మన వ్యాపారులు వెళ్లేవారు.

మనదేశంనుండి ఎగుమతి అయ్యే ఎన్నో రకాల ఉపయుక్తమైన, ఆకర్షణీయమైన వస్తువులను ఆయా దేశాలలోని వ్యాపారులతో వినిమయం చేసుకోవటంలో బంగారము, వెండి వంటి విలువైన లోహ సంపద మనదేశానికి వచ్చి చేరేది. ఆ కారణాన మనదేశాన్ని 'బంగారు పక్షి' అని, 'సోనే కీ చిడియా' అని ప్రస్తుతించేవారు.

క్రీస్తుపూర్వం రెండువేల సంవత్సరాలకు ముందునుండి-యావత్ప్రపంచంలో జరిగే ఎగుమతి వాణిజ్యంలో 30శాతం మేరకు హిందూదేశంనుండి జరిగేదని చారిత్రక పరిశోధకులు అంగీకరిస్తున్నారు. హిందూదేశంనుండి శీతలప్రాంతాలైన యూరోపు దేశాలకు ఎగుమతి చేయబడే వస్తువులలో సుగంధ ద్రవ్యాలు-అందునా మిరియాలు ముఖ్యమైనవి. శీతాకాలంలో పడవలు తిరగడానికి, చేపలు పట్టడానికి అవకాశం లేని రోజులలో, అంతకుముందు వేసవికాలంలో పట్టుకొనిన చేపలను, ఇతర మాంసాహారాలను నిలువచేసుకొనడానికి మిరియాలు అవసరమయ్యేవి.

1453లో తురుష్కులు తూర్పు రోమన్ సామ్రాజ్యానికి రాజధానిగా ఉండిన కాన్‌స్టాంటినోపిల్‌ను స్వాధీనపరుచుకొని దానిని 'ఇస్తాంబుల్' అని వ్యవహరించ నారంభించారు. అప్పటికి శతాబ్దులుగా తమపై 'క్రూసేడు' లనే మత యుద్ధాలు సాగిస్తున్న యూరోపియన్ క్రైస్తవ రాజ్యాలపై కక్షసాధింపుగా ఆసియా ఖండం నుండి అన్ని రకాల వాణిజ్య సరఫరాలనూ నిలిపివేశారు. అన్ని రకాల దిగుమతులతో పాటు మిరియాల దిగుమతి కూడా ఆగిపోవటంతో ప్రజలలో హాహాకారాలు చెలరేగాయి. ఒకనాటి సమస్య కాదిది. ఏటేటా ఎదురౌతున్న అతితీవ్రసమస్య. ప్రజలు రాజులపై ఒత్తిడి తేగా-రాజులు పోప్‌వద్దకు పోయి మొరపెట్టుకొన్నారు. మీ వద్ద ఉన్న నావికులను పంపి హిందూదేశానికి నూతన సముద్రమార్గం కనిపెట్టండి అని ఆదేశించిన పోప్-ఎవరు ఏ నేలపై కాలుమోపి, క్రీస్తు పతాకాన్ని

ఆవిష్కరిస్తారో ఆ భూభాగానికి వారు తన ప్రతినిధులుగా పాలకులవుతారని లిఖితపూర్వకంగా ప్రకటించాడు పోప్ 6వ అలెగ్జాండర్ (1493)

**పోర్చుగీసుల ప్రయత్నాలు**

ఆ ఆదేశాన్ని తలదాల్చి, ఆశావహమైన భవిష్యత్తును వెదుకుకొంటూ మొదటగా హిందూదేశంలో కాలుమోపినవారు పోర్చుగీసువారు. వారు కోళికోడ్‌తో ఆరంభించి, భారతదేశపు పశ్చిమ సముద్రతీరంలో అనేక స్థావరాలు (సుమారుగా 70) ఏర్పరుచుకున్నారు. ఎక్కడ అడుగుమోపితే, అక్కడ క్రీస్తు రాజ్యపు పతాకం ఎగురవేయటం తమకు హక్కుగా భావించిన పోర్చుగీసులు (వీరినే బుడతకీచులనీ అంటారు) మొరటుగా తమ ఆధిపత్యాన్ని నెలకొల్పుకొనే ప్రయత్నం చేశారు.

ఆనాటికి మనదేశంలోని పశ్చిమ కనుమలకు తూర్పున విజయనగర సామ్రాజ్యం ఉండేది. విజయనగర సామ్రాజ్యానికి ఉత్తరాన-కృష్ణానదికి ఆవల బహమనీ రాజ్యాలు-బిజాపూర్, అహ్మద్‌నగర్, బీదర్, గోల్కొండ, బేరార్‌లు ఉండేవి. కాగా పశ్చిమ కనుమలకు, సముద్రానికి మధ్య ఉన్న సన్నని పీలికవంటి భూభాగంలో అనేక చిన్న చిన్న రాజ్యాలు ఉండేవి. ఎత్తైన పశ్చిమ కనుమలు రాకపోకలకు అవరోధంగా ఉండేవి. లోపల విశాలమైన సామ్రాజ్యాంతర్గత భూభాగాలతో, ఈ చిన్న చిన్న రాజ్యాలకు- అంతగా సంబంధాలు ఉండేవి కావు.

పోర్చుగీసులు రావడానికి ముందు పశ్చిమతీర వ్యాపారమంతా మూర్‌లు అని పేర్కొనబడే హిందూదేశంలోని కేరళ ప్రాంతపు మహమ్మదీయుల చేతులలోనో, అరేబియా ద్వీపకల్పంనుండి వచ్చిపోయే మహమ్మదీయ వ్యాపారుల చేతులలోనో కేంద్రీకృతమై ఉండేది. హిందూవ్యాపారులు కూడా తమ నౌకలలో సిబ్బందిగా మహమ్మదీయులను చేర్చుకొనేవారు. మతపరంగా సముద్రయానం చేయడానికి విధింపబడిన ఆంక్షలను ఉల్లంఘించజాలని కేరళ ప్రాంతీయులు కొందరు తమ కుటుంబంలోని పెద్దకొడుకు మహమ్మదీయ మతం తీసికొని వ్యాపారం సాగించేందుకు ప్రేరేపించేవారు. సముద్రంలో ఒకరి నౌకనుండి మరొకరు దోచుకొనే ప్రయత్నాలు అడపాదడపా జరుగుతూ ఉండేవి. అటువంటి నేరాలకు పాల్పడిన వారు తమ రాజ్యంలోకి వచ్చినప్పుడు వారిని శిక్షించేందుకు హిందూరాజులు తమ శక్తి మేరకు ప్రయత్నిస్తుండేవారు.

అయితే భూపతులుగా మహీపతులుగా ప్రస్తుతింపబడే ఈ రాజులమాట నేలమీద చెల్లినంతగా, సముద్రంలో విహరించేవారిమీద చెల్లేది కాదు. రాజులకు నౌకలతో పయనించుతూ యుద్ధంచేసే సైనికబలం లేకపోవటం అందుకు ప్రధానకారణం. స్థానిక రాజుల ఈ బలహీనతను కనిపెట్టిన పోర్చుగీసు వారు-భారతదేశపు పశ్చిమ సముద్రతీరంలోని రేవుపట్టణాలను సమీపింపగోరిన వివిధదేశాల నౌకలపై అజమాయిషీ చేయనారంభించారు. శుల్కం చెల్లించి అనుమతి పత్రం (Cartaz) తీసికొంటేగాని, రేవులలో ప్రవేశించే అవకాశం ఉండేది కాదు. ఆ విధంగా క్రీ.శ. 1500 సం॥ గడిచిన కొద్ది సంవత్సరాలలోనే హిందూదేశానికి పశ్చిమాన ఉన్న 'సముద్రానికి అధినాధులు' Lords of the Sea గా వారు వ్యవహరించ నారంభించారు.

నిజానికి సముద్రతీరంలో రాజ్యం చేస్తున్న రాజులు ఏ నలుగురు కలిసి నిశ్చయించుకున్నా, పోర్చుగీసువారిని సులభంగా తరిమికొట్టగలిగి ఉండేవారు. దేశంలోపలిభాగంలో ఉన్న విజయనగరం సామ్రాజ్యం ఈ విషయాలపై దృష్టి పెట్టకపోవటం, మిగిలిన రాజులకు తమలో తమకు అవగాహన కుదరక పోవటం ఒక విధమైన అవరోధంకాగా, వర్తకులలో ఎక్కువమంది మహమ్మదీయుల దాష్టీకంనుండి తప్పించుకొనడానికి పోర్చుగీసువారికి అనుమతిపత్రాల నిమిత్తంగా కొద్దిపాటి ద్రవ్యాన్ని వదలుకోవటం సులభమార్గంగా భావించటం మరొక కారణమైంది. మహమ్మదీయుల ఆగడాలను అదుపుచేయడానికి బుడతకీచులు సహాయపడగలరనే ఉద్దేశంతో-స్థానిక పాలకులు వారిని చూసీచూడకుండా వదిలేశారు.

**బుడతకీచులను దక్షిణ కర్ణాటక తీరంనుండి తరిమికొట్టిన అబ్బక్క చిన్న అబ్బక్క**

తమకుగల నావికాబలంతో పోర్చుగీసులు 1510లో గోవాలో దృఢమైన స్థావరమేర్పరుచుకున్నారు. 1529లో శ్రీ కృష్ణ దేవరాయల మరణానంతరం పశ్చిమ సముద్రతీరమంతటా తమ మాటే చెల్లుబాటు కావాలంటూ వ్యవహరించ నారంభించారు. ఆసమయంలో వారి దుష్కృత్యాలకు అడ్డుకట్ట వేసి వారిని దక్షిణానికి విస్తరించకుండా అడ్డుకొన్న రాణీ అబ్బక్క చౌతా,ఆమె కుమార్తె తిరుమలాదేవి(చిన్న అబ్బక్క) చిరస్మరణీయులు.

మంగుళూరు సమీపాన ఉన్న పుట్టిగె రాజ్యపు వీరనారి అబ్బక్క దేవి. వారి రాజ్యంలో ప్రధాన రేవుపట్టణమైన ఉల్లాల్ వారి రెండవరాజధానిగా ఉండేది.

ఆమెకు మంగుళూరు రాజ్యపు రాజకుమారుడు లక్ష్మప్పరసతో వివాహమైంది. అప్పటికి ఆ రాజ్యం పోర్చుగీసులకు కప్పం కట్టుతున్నది.ఆ ఆనవాయితీని నిలిపివేయాలని అబ్బక్క ప్రతిపాదించింది. కాని పోర్చుగీసుల బలాన్ని చూసి వెరచిన పెద్దలు అందుకు సిద్ధపడలేదు. ఆమె తన తనకుమార్తెను, కుమారుని తీసుకొని ఉల్లాల్‌కి వెళ్లిపోయింది. ఉల్లాల్ కూడా తమకు కప్పం చెల్లించాలని, తమ అనుమతి లేకుండా సుగంధద్రవ్యాలనుగాని, ఇతర వస్తువులనుగాని విదేశాలకు నేరుగా ఎగుమతిచేయరాదంటూ పోర్చుగీసులు నిర్బంధం విధించ చూసినపుడు రాణిఅబ్బక్క (పాలనాకాలం 1544-1582) వారి ఆదేశాలను తిరస్కరించింది. 1555లో డామ్ ఆల్వారో డా సిల్వీరా నేతృత్వంలో పోర్చుగీసు దండు ఉల్లాల్‌పై దాడి చేసింది. అబ్బక్క తన సైన్యంతో వారిని తరిమికొట్టింది.

1557లో పోర్చుగీసులు మంగుళూరును దోచుకొని విధ్వంసం చేశారు. మంగుళూరుకు ఉల్లాల్‌కు మధ్య నేత్రావతినది అడ్డంగా ఉంటుంది. మంగుళూరు కోటను స్థావరంగాచేసుకొని 1568లో వారు మరోసారి ఉల్లాల్ పై దాడి చేశారు. అబ్బక్క సైనికులు ఆ దాడిని ఎదుర్కొనటమే గాక, వారు పోర్చుగీసు నౌకలపై అగ్ని బాణాలను ప్రయోగించగా అవి తగులబడిపోయాయి. తీరంలో ఉన్న పోర్చుగీసు సేనలు చిత్తుగా ఓడిపోయాయి.

గోవాలో పోర్చుగీసుల రాజప్రతినిధిగా ఉన్న ఆంటోనియో నొరొన్హా జో పిక్సోటో అనే సేనాని నేతృత్వంలో పంపిన నౌకాదళం ఉల్లాల్‌ను ముట్టడించి స్వాధీనం చేసుకున్నారు. రాణి అబ్బక్క తప్పించుకుపోయింది. 200మంది మెరికలవంటి సైనికులను కూర్చుకొని ఒకరాత్రివేళ పోర్చుగీసులపై విరుచుకు పడింది. జో పిక్సోటో ప్రాణాలు కోల్పోయాడు. 70 మంది పోర్చుగీసు నావికులు బందీలుగా పట్టుబడ్డారు. నౌకాదళాధిపతి మస్కారెన్హాస్ కూడా హతుడైనాడు. పోర్చుగీసులు మంగుళూరు కోటను విడిచి పెట్టి పారిపోయారు. మంగుళూరుకు ఉత్తరాన 100 కి.మీ. దూరంలో ఉన్న పోర్చుగీసుల స్థావరం కుందపురవరకు వారు తరిమికొట్టబడ్డారు.

అబ్బక్క లక్ష్మప్పరసల అల్లుడు కామరాయ పోర్చుగీసులతో చెలిమిచేసి, వారి సలహాపై సమీపంలోని సామంతులను రెచ్చగొట్టాడు.వారిని అదుపుచేయడానికి లక్ష్మప్పరస వెళ్లినపుడు కామరాయ మారువేషంలో వచ్చి రాజును వెన్నుపోటు

పొడిచి చంపి పారిపోయాడు. మంగుళూరును స్వాధీన పరుచుకున్న పోర్చుగీసులు కామరాయ సాయంతో ఉల్లాల్‌పై దాడులను ఉధృతంచేశారు. కామరాయచే పంపబడిన చంద్రయ్య శెట్టి అబ్బక్క కుమారుని హత్య గావించాడు. 1570లో అబ్బక్క కోఝికోడ్‌లో ఉన్న సమూరి అనే సముద్రతీరరాజు (జామోరిన్ అని విదేశీయులు వ్రాశారు) సహాయాన్ని కోరింది. అతడు పంపగా వచ్చిన కోఝికోడ్ సైన్యాధిపతి కుట్టి పోకర్మర్కర్ తన సైన్యంతో వచ్చి అబ్బక్కకు తోడుగా నిలిచాడు. మంగుళూరులో పోర్చుగీసుల స్థావరాన్ని ధ్వంసంచేసి తిరిగి వస్తున్న సమయంలో పోర్చుగీసులు అతడిని చంపివేశారు. కామరాయ ఇటువైపు రహస్యాలను పోర్చుగీసులకు తెలియజేయగా వాటి ఆధారంగా వారు ఒక యుద్ధంలో అబ్బక్కను ఓడించగల్గారు. ఉల్లాల్ స్వాతంత్ర్యాన్ని కోల్పోరాదని, బుడతకీచులముందు తలవంచరాదని చెప్తూ ఆమె మరణించింది. కామరాయ ద్రోహబుద్ధికలవాడైనందున నమ్మదగినవాడు కాదని భావించిన పోర్చుగీసులు అతడినికూడా మట్టుబెట్టారు. అయితే ఉల్లాల్ మాత్రం పోర్చుగీసులకు తలవంచలేదు.

అబ్బక్క మరణం తరువాత ఆమె సహాయకురాలు భాగీరథి సంరక్షణలో పెరిగిన తిరుమలదేవి (చిన్న అబ్బక్క–పాలనాకాలం 1582–1606) ఉల్లాల్ సింహాసన మధిష్ఠించింది. తల్లి చనిపోయే సమయంలో జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకుంటామని, పోర్చుగీసుల ప్రభావంనుండి దేశాన్ని విడిపిస్తామని తీసుకున్న సంకల్పాన్ని ఆమె విస్మరించలేదు. కోటకు మరమ్మతులు చేయించింది. దృఢమైన నౌకలు తయారు చేయించి, విదేశీ వ్యాపారానికి సమకట్టింది. కోఝికోడ్ సమూరి రాజుకూడా చిన్న అబ్బక్క నౌకలతోపాటు తన నౌకలనూ పంపడానికి సిద్ధమైనాడు. కొన్ని రోజుల తర్వాత ఉల్లాల్ రేవు నుండి సుగంధ ద్రవ్యాలను, మేలైన నూలు, పట్టు వస్త్రాలను తీసుకొని వాణిజ్యనౌకలు అరేబియా ద్వీపకల్పానికి బైలుదేరాయి. అక్కడ లాభసాటిగా వ్యాపారం సాగించి తిరిగి వస్తుండగా, సముద్రమధ్యంలో పోర్చుగీసు నౌకలు వారిని అడ్డగించాయి. అప్పుడు ఉల్లాల్ నౌకాధిపతి "నేను వారిని ముందుకు రాకుండా నిలువరిస్తాను. మీరంతా వేగంగా ఉల్లాల్ వెళ్లిపోండి" అని తన సహచరులకు ఆదేశాలిచ్చాడు. ఆప్రకారంగా అతడు పోర్చుగీసు నౌకలను ఎదుర్కోగా, మిగిలిన నౌకలన్నీ క్షేమంగా ఉల్లాల్ చేరి, రాణికి జరిగినదంతా నివేదించారు.

రాణి మంగుళూరు లోని పోర్చుగీసువారి స్థావరానికి దూతను పంపి "మీరు బంధించిన మానౌకను తక్షణం విడిచిపెట్టండి. సముద్రంలో మాకు జరిగిన

ప్రాణనష్టానికి వెయ్యిబంగారు మొహరీలు పరిహారంగా చెల్లించండి" అని చెప్పించింది.

పోర్చుగీసుకమాండరు రైబీరో ఉన్మాదంతో 'ఉల్లాల్ పైకి ఫిరంగులు ప్రేల్చండి' అని ఆజ్ఞలు జారీచేశాడు. ఫిరంగులు మ్రోగసాగాయి. రాణి చిన్నఅబ్బక్క తాను తల్లికిఇచ్చిన మాట గుర్తుతెచ్చుకొని, కోఝికోడ్ నౌకలుకూడా తోడురాగా, మంగుళూరుపై దాడిచేసింది. అటునుండి ప్రేలుతున్న ఫిరంగులు వారిని అడ్డుకోలేకపోయాయి. ఉల్లాల్ సైన్యం మంగుళూరు కోటగోడలు ఎక్కి తలుపులు బ్రద్దలుకొట్టి పోర్చుగీసులపై విరుచుకుపడ్డారు. పోర్చుగీసుల కమాండర్ రైబీరో ప్రాణా లరచేత పట్టుకొని పారిపోయాడు. కోటలోని బంగారాన్ని, ద్రవ్యాన్ని రాణి చిన్న అబ్బక్క ఉల్లాల్‌కి తరలించింది.

కమాండర్ రైబీరో తెచ్చిన చావు కబురు విని గోవా గవర్నరు ఆగ్రహోదగ్రుడైనాడు. ఒక స్త్రీ చేతిలో సంభవించిన ఈ అవమానానికి మనం నవ్వులపాలైపోతామంటూ కొటిన్హో అనే సేనానికి పెద్దసైన్య మిచ్చి పంపించాడు. వారు వచ్చి ఉల్లాల్ కోటను ముట్టడించారు. చిన్న అబ్బక్క కోటతలుపులు తెరిపించి ఆడపులిలాగ వారిపై విరుచుకు పడింది. నాలుగురోజులపాటు భయంకరమైన యుద్ధం జరిగింది. బుడతకీచు సేన చావుదెబ్బ తిని వెనుదిరిగి చూడకుండా పారిపోయింది.

ఆతర్వాత మంగుళూరు కోటను ఆక్రమించుకొనడానికి కేలడిరాజైన శివప్పనాయకునికి చిన్న అబ్బక్కరాణి తోడ్పడింది. ఆపైన కొద్దికాలానికి కేలడిరాజు శివప్పనాయకుడు ఆ ప్రాంతాలనుండి బుడతకీచులను పూర్తిగా తరిమికొట్టాడు. గోవాకు దక్షిణాన బుడతకీచుల అధికారం అంతరించింది. కేవలం గోవాకి, గుజరాత్ సమీపంలోని దియూ, దమన్ దీవులకు పరిమితమైంది.

క్రీ.శ. 1590 నాటికి వారికి హాలెండు నుండి వచ్చిన వళందలనుండి పోటీ ఎదుర్కోవలసిన స్థితి కూడా ఏర్పడింది. డచ్చిభాష మాట్లాడే వళందలు సుగంధద్రవ్యాల వ్యాపారంలోకి దూసుకొని వచ్చారు. కొచ్చి కేంద్రంగా 11 రేవు పట్టణాలలోను, తూర్పు సముద్రతీరంలో బెంగాలులోని హుగ్లీలో, మాసులిపటం (మచిలీపట్నం)లో డచ్చి వారు తమ వ్యాపార కేంద్రాలను ఏర్పరచుకున్నారు.

## మలబార్ తీరంనుండి డచ్‌వారిని పారద్రోలిన మార్తాండవర్మ :

హాలెండుకు చెందిన డచ్ వారి ఈస్టిండియా కంపెనీ 1602లో స్థాపించబడింది. కొద్దికాలంలోనే ఆగ్నేయాసియా దీవులలో వారు గట్టిపట్టు సంపాదించారు. సింహళంగా నాడు వ్యవహరింపబడిన శ్రీలంకలోనూ బలమైన స్థావరాలు ఏర్పరుచుకొని హిందూదేశపు పశ్చిమ సముద్రతీరంలోకి చొరబడ్డారు. ఇక్కడకూడా గట్టి పట్టు సంపాదించి, అప్పటికి పోర్చుగీసులు బలహీనపడటంతో కేరళతీరంలో ఒక తిరుగులేని శక్తిగా వ్యవహరించ నారంభించారు. ఆ సంస్థ వ్యాపారంద్వారా ఆసియా దేశాలనుండి కొల్లగొట్టి సంపాదించిన లాభాలను ఏటేటా 18శాతానికి తక్కువలేని విధంగా తన వాటాదారులకు పంచుతూ ఉండేది.

కొచ్చి కేంద్రంగా ఉధృతంగా సుగంధద్రవ్యాల (ప్రముఖమైనవి మిరియాలే) వ్యాపారం సాగిస్తూ పాతుకుపోయామని భావిస్తున్న సమయంలో-18వ శతాబ్ది మధ్యసమయంలో పద్మనాభపురం రాజధానిగా కేరళ దక్షిణతీర ప్రాంతాన్ని పాలించే మార్తాండవర్మ (పాలనాకాలం 1729-58) రూపంలో పెనుసవాలు వారికి ఎదురైంది. అతడిని లోబరుచుకొనడానికి 1739లో సింహళంలోని డచ్ గవర్నరు గుస్తాఫ్ విలియం వాన్ ఇన్హోఫ్ పద్మనాభపురాన్ని తాము కైవసం చేసుకోగలమంటూ మార్తాండవర్మను బెదిరించ యత్నించాడు. అయితే మార్తాండవర్మ ఇచ్చిన జవాబు అతడిని నిర్ఘాంతపరిచింది. "మీరు గనుక అందుకు యత్నిస్తే హాలెండులోనే మా సైన్యాలను ఎదుర్కోవలసి వస్తుంది. హాలెండును ముట్టడించడానికి మేము వెనుదీయం" మార్తాండవర్మ తొణుకు బెణుకు లేకుండా చెప్పిన మాటలకు విస్మయము, కోపమూ కలిగిన డచ్ గవర్నరు ఏమీ మాట్లాడకుండా అక్కడి నుండి నిష్క్రమించాడు.

1741 జనవరి, ఫిబ్రవరి నెలల్లో రెండు పెద్ద నౌకలలో వచ్చిన డచ్ సైనికులు కోలాచలం వద్ద స్థావరం ఏర్పరుచుకున్నారు. చుట్టుప్రక్కల గ్రామాలను వశపరుచుకో నారంభించారు. కన్యాకుమారి-కోలాచలం మధ్యగల తీరమంతటినీ ఆక్రమించు కోవాలని వారి యోజన. మార్తాండ వర్మ తనవద్ద ఉన్న సైన్యాలను దక్షిణంగా కన్యాకుమారి దిశగా నడిపించటమేగాక, తన రాజ్యం ఉత్తర సరిహద్దులో ఉన్న రామయ్య దళవాయిని కూడా కోలాచలం చేరుకోవలసిందిగా ఆదేశించాడు.

అప్పటి కొన్ని గ్రామాలను కైవసం చేసుకొని డచ్ కమాండర్ వాన్ గొల్లనీస్ పద్మనాభ పురంపై దాడికి సమాయత్తమవుతున్నాడు. భూమి మీదనుండి మార్తాండ

వర్మ, మరోవైపున సముద్రంమీదుగా రామయ్య దళవాయి ఆ సేనలను చక్రబంధంలో ఇరికించాయి. ఆహారము, మందుగుండూ లభించని స్థితి డచ్చి వారికి ఎదురైంది. ఆగస్టు 5న తిరువాన్కూర్ సైనికులు డచ్ సేనలను కొలాచలం వద్ద నిలువరించారు. వారి ఆయుధాగారాన్ని ప్రేల్చి వేశారు. బియ్యంనిల్వలు వ్యర్థమయ్యాయి. ఆ యుద్ధంలో డచ్చివారికి కోలుకోలేని దెబ్బ తగిలింది. మార్తాండవర్మ సైనికులధాటిని తట్టుకోజాలని డచ్చివారు ఆగస్టు 7న మార్తాండవర్మను శరణువేడుకున్నారు. 24 మంది యూరోపియన్లతో సహా చాలామంది సైనికులు బందీలుగా పట్టుబడిపోయారు. అప్పటికి డచ్చివారి అధీనంలోఉన్న కోటలను, వాణిజ్య సముదాయాలనూ తిరువాన్కూరు రాజ్యం హస్తగతం చేసుకొన్నది.

ఆ తర్వాత తిరువాన్కూరు రాజ్యం ఆధ్వర్యంలో సుగంధద్రవ్యాల ఎగుమతి వ్యాపారం జరిగింది. రాజధాని 60 కి.మీ దూరంలో ఉన్న తిరువనంతపురానికి మార్చబడింది. అక్కడ ఉన్న అనంతపద్మనాభస్వామి ఆలయం అభివృద్ధిపరచబడింది. తిరువాన్కూరు రాజులు తమనుతాము పద్మనాభస్వామి దాసులమని భావించేవారు. వ్యాపార లాభాలను ప్రజాసంక్షేమ కార్యకలాపాలకు వెచ్చించటమేగాక, మిగులు నిధులను అనంత పద్మనాభస్వామి మందిరానికి సమర్పించేవారు. ప్రపంచంలో అత్యంత సమృద్ధమైన దేవాలయాలలో ముందువరుసలో పేర్కొనబడేస్థాయి ఆ ఆలయానికి వచ్చింది.

మార్తాండవర్మ ప్రజ్ఞ మరొక తీరున కూడా వ్యక్తమైంది. బందీలుగా చిక్కి శరణు వేడుకొనిన డచ్ సైనికులను తన సైన్యంలో చేర్చుకున్నాడు. వారిలో ప్రముఖుడైన ఈస్టాషియస్ డి లాన్నాయ్ ద్వారా తన సైనికులకు అధునాతన పద్ధతులలో శిక్షణ ఇప్పించాడు. అలా శిక్షణ ఇచ్చేక్రమం కొనసాగి, శిక్షణపొందిన సైనికులు ఆంగ్లేయులతో తిరువాన్కూరు రాజ్యానికి ఒప్పందం కుదిరిన దరిమిలా వారందరూ మద్రాసు రెజిమెంట్‌లో ప్రధాన భూమిక వహించిన వారైనారు. (డిలాన్నోయ్ వరిష్ఠ నావికాధికారిగా 2 దశాబ్దాలు పని చేశాడు. మరణానంతరం ఉదయగిరిలో ఖననం చేయబడినాడు.)

మనం గమనించవలసిన విషయమేమిటంటే, బుడతకీచులను ప్రతిఘటించటంలో రాణీ అబ్బక్క, చిన్న అబ్బక్క సాధించిన విజయాలు, డచ్చివారిపై మార్తాండవర్మ సాధించిన విజయమూ సామాన్య విజయాలుకావు. వారిని శాశ్వతంగా మనదేశం నుండి వెడలగొట్టిన విజయాలుగానే భావించాలి. ఈ యుద్ధాలతర్వాత

కూడా మనదేశంలో పరిమితమైన ప్రాంతాలలో వారి వర్తకకేంద్రాలు, స్థావరాలు కొనసాగడానికి యూరపు ఖండంలో వారికి ఆంగ్లేయులతో ఉన్న ఒప్పందాలు, సంబంధాలే ఆధారం. యూరోప్ బయటకూడా ఒకరి స్థావరాలపై మరొకరు దాడులు చేసుకోరాదన్న అవగాహన వారికి ఉండేది. 19వ శతాబ్దం తొలినాళ్ళ నాటికి మనదేశమంతా ఆంగ్లేయుల ప్రభావక్షేత్రంగా రూపుదిద్దుకొనటంతో తమ మనుగడ కాపాడుకొనడానికి వారు యుద్ధాలు చేయవలసిన అవసరం ఏర్పడలేదు.

## తూర్పుతీరంలో అడుగిడిన ఆంగ్లేయులు

1600 సం॥లో హిందూదేశంలో అడుగుపెట్టిన ఆంగ్లేయులకు పశ్చిమ తీరాన పాదంమోపే అవకాశం లభించకపోవటంతో వారు ప్రధానంగా తూర్పుతీరాన దృష్టి కేంద్రీకరించారు. మాసులిపటం (నేటి మచిలిపట్నం) (1611)) చెన్నపట్నం (1639) వారి ప్రధానకేంద్రాలుగా ఉండేవి. గుజరాత్‌లోని సూరత్‌లోనూ ఒక వ్యాపారకేంద్రం ఉండేది. 1680నాటికి ఆంగ్లేయులు డచ్ వారిని సవాలు చేయనారంభించారు. అంతకుముందు పోర్చుగీసు, ఇంగ్లీష్ రాజకుటుంబాలమధ్య జరిగిన ఒక వివాహ సందర్భంగా పోర్చుగీసువారు తమ చేతిలో ఉన్న ముంబై (నాడు బొంబాయి అనేవారు)ని ఆంగ్ల రాజకుటుంబానికి కట్నంగా ఇచ్చారు. 1661లో ముంబై ఆంగ్లేయులకు అప్పగించబడింది. ఆ తర్వాత 25 సం॥లలో ఆంగ్లేయులు కేరళవరకు చొచ్చుకు పోయారు.

పశ్చిమతీరాన కాక, తూర్పుతీరాన దృష్టిని కేంద్రీకరించటం ఆంగ్లేయులకు ఒకవిధంగా కలిసివచ్చింది. పశ్చిమ కనుమలవలె తూర్పు కనుమలు సందులేకుండా దట్టంగా వ్యాపించి లేవు. సముద్రాన్ని ఆనుకొని కొంత మైదానప్రాంతం ఉండటమే గాక, పడవలు తిరగడానికి వీలుగా గోదావరి, కృష్ణా, పెన్నా, కావేరీవంటి నదులున్నవి. ద్వీపకల్పానికి మధ్యలో ఉన్న పీఠభూమిని చేరడానికి అవి మార్గాలుగా ఉండేవి. ఆ విధంగా పడవ ప్రయాణాలద్వారానేగాని, గుఱ్ఱాలమీద స్వారిద్వారాగాని ద్వీపకల్పంలోపలి భూభాగాల పంటలు, ఇతర ఉత్పత్తులు మొదలైనవాటి గురించి తెలుసుకొని నేరుగా ఉత్పాదకులతోనూ సంబంధాలు ఏర్పరచుకొనడానికి అవకాశమేర్పడింది. తమ వ్యాపారాన్ని సుగంధద్రవ్యాలకు పరిమితం చేసికోకుండా పత్తి, పట్టు, నూలువస్త్రాలు, సూరేకారం (ఫిరంగుల ప్రయోగంలో ఉపయోగపడే ముడిరసాయనం) మొదలైన వాటికి విస్తరించారు. 18వ శతాబ్దంలో ఇతర యూరోపియన్ వ్యాపారస్థులతో పోటీలను, యుద్ధాలను ఎదుర్కోవలసి వచ్చినపుడు

అమెరికా ఖండంలో యుద్ధ అనుభవం ఉన్న తమ సైనికాధికారులు ఆంగ్లేయుల తూర్పుఇండియా వర్తకసంఘానికి చేతికి అందివచ్చారు.

ఆంగ్లేయులకు మరొక అంశం కూడా కలిసి వచ్చింది. అంతకుముందు దశాబ్దులుగా బుడతకీచులు, వళందలు కష్టపడి సమకూర్చుకున్న వ్యాపార కేంద్రాలలోకి చొరబడి, వారు అప్పటికే నిర్మాణం చేసియున్న-యూరోపియన్‌లతో వ్యవహరించడానికి అలవాటుపడియున్న విపణి వాతావరణాన్ని-సులభంగా తమకు అనుకూలంగా మలుచుకోగలిగారు. చాలాచోట్ల బుడతకీచులు, వళందలు నిర్మించిన భవనాలను, అంగడుల సముదాయాలను ఉపయోగించుకోవటమేగాక-ఆ భాషలలో మాట్లాడడానికి అలవాటుపడిన స్థానికులతో ఆ భాషలద్వారా సులభంగా సంభాషించగలిగేవారు. ఇంతకుముందు బుడతకీచులకు, వళందలకు ఉత్తరాలు వ్రాసిపెట్టడానికి ఉపయోగపడిన గుమస్తాలను, దుబాసీలనూ-వీరు చక్కగా ఉపయోగించుకున్నారు.

పోర్చుగీసువారికి, డచ్చివారికి భిన్నంగా ఆంగ్లేయులు ముఖ్యమైన కేంద్రాలలో కేవలం తాము మాత్రమే ఉండే గృహసముదాయాలను నిర్మించుకొనటం, వాటికి రక్షణగా సాయుధులైన యువకులను నియమించుకోవటం ఆరంభించారు. వ్యాపార కేంద్రాలను, గిడ్డంగులను, ఫ్యాక్టరీలు అనేవారు. తమ గృహసముదాయాలను టౌన్‌లని, స్థానిక ప్రజల నివాసస్థానాలను పేటలని వ్యవహరించేవారు.

ఇంగ్లీషువారు తమ బలాన్ని హిందూదేశంలో మోహరించాలని నిర్ణయించుకొనడానికి ముందు సంభవించిన ఒక చారిత్రక ఘటన వారికి ఎంతో బలాన్ని చేకూర్చింది. 1707లో మొగలు పాదుషా ఔరంగజేబ్ మరణించిన దరిమిలా ఢిల్లీ ప్రభుత్వం బలహీనపడింది. వివిధ ప్రాంతాలలో ఉన్న సుబేదార్లు (గవర్నర్లు) స్వతంత్రులవలె వ్యవహరించ నారంభించారు. ఎక్కడైతే, ఎప్పుడైతే సుబేదార్లు బలహీనపడేవారో, అప్పుడు వారిక్రిందఉండే జమీందార్లు తమ ప్రభావాన్ని విస్తరింపజేసికొన యత్నించేవారు. ఆవిధంగా వారు తమలోతాము ఒకరినిమించి మరొకరు ఎదగడానికి యత్నిస్తూ కీచులాడుకొనేవారు. అటువంటి వారికి ఆధునిక ఆయుధాలను ప్రయోగించటం నేర్చిన విదేశీకంపెనీల సిపాయిలు తమకు సహాయకారులు కాగలరన్న దృష్టితో, వారితో సత్సంబంధాలు కలిగిఉండే దృష్టితో వ్యవహరించేవారు. పోర్చుగీసువారితో పోల్చిచూసినపుడు ఆంగ్లేయులు చాలా వినమ్రంగా వ్యవహరించేవారుగా కనబడేవారు. స్థానికులతో మాటలు కలపడానికి

ఉత్సాహించేవారుగానేగాక, స్థానికంగా జరిగే ఉత్సవాలలోను, జాతరలలోనూ పాల్గొంటూ ఉండేవారు. స్థానికభాషలు నేర్చుకొనటంపట్ల ఉత్సాహం చూపించేవారు.

యూరోప్‌నుండి హిందూదేశంలోకి వచ్చి వ్యాపారం చేయబూనిన వారిలో ఆలస్యంగా వచ్చినవారు ఫ్రెంచివారు. 1669లో మాసులిపటంలోవారు తమ స్థావరం ఏర్పరచుకున్నారు. చెన్నపట్నానికి దక్షిణాన ఉన్న పుదుచ్చేరి (1673)లోను, బెంగాలులోని చంద్రనగార్‌లోనూ ఆ తర్వాత స్థావరాలు ఏర్పరచుకున్నారు.

**విదేశీయులను కాలుమోపనివ్వని మహారాష్ట్రుల నౌకాబలం:**

ఛత్రపతి శివాజీ 1674లో రాయగఢ్‌లో పట్టాభిషిక్తుడైనాడు. 1680లో శివాజీ మరణానంతరం అతని కుమారుడు శంభాజీ రాజైనాడు. అంతకు ముందు హిందూరాజులు ఎవరూ తీసికొనని ఒక జాగ్రత్త తీసికొనటంపట్ల వీరిరువురు శ్రద్ధవహించారు. తమ రాజ్యానికి సమీపానగల సముద్రతీరంనుండి రాగలముప్పును ఊహించి, నౌకాసైన్యాన్ని సిద్ధపరిచారు. సముద్రతీరంలో అనేక దుర్గాలను పటిష్టం చేశారు. పోర్చుగీసువారు కేరళనుండి గోవావరకు దాదాపు 70 రేవులలో తమకు కొంత చోటు సంపాదించుకోగల్గినా, శివాజీ రాజ్యానికి ఆనుకొని ఉన్న సముద్రతీరంలో పట్టు సంపాదించలేకపోయారు. 1689లో శంభాజీ ఎవరో చేసిన మోసం కారణంగా మొగలులకు బందీ అయ్యాడు. ఔరంగజేబ్ అతడిని చిత్రహింసలకు గురిచేసి చంపివేశాడు. ఎంతటి చిత్రహింసలనైనా భరిస్తూ ఔరంగజేబుకు లొంగక వీరమరణాన్ని ఆహ్వానించిన శంభాజీ ధర్మరక్షకునిగా తన ప్రజల మనస్సుల్లో నిలిచిపోయాడు. ఆ తర్వాత వంద సంవత్సరాలవరకు మహారాష్ట్రులు మొగలులను అనేకవిధాలుగా ఎదుర్కొన్నారు. కాలక్రమాన బలపడి, మొగలుపాదుషాలు, వారి సుబేదార్లు మహారాష్ట్రులతో రాజీపడక తప్పనిస్థితిని సాధించారు.

మొగలు సామ్రాజ్యంగా ఒకనాడు పేర్కొనబడిన అన్ని ప్రాంతాలలోనూ చౌథ్ (నాల్గవవంతు) పన్నును వసూలుచేసుకొనే అధికారాన్ని మహారాష్ట్రులు సంపాదించారు. ఛత్రపతిగా పేర్కొనబడేవారు సతారాలోనో, కొల్హాపూరులోనో ఉండగా, మహారాష్ట్ర సైన్యాలపై పూర్తి అదుపుగల్గిన పేష్వా పుణే నగరం కేంద్రంగా తన కార్యకలాపాలు నిర్వహించేవాడు. 18వ శతాబ్ది మధ్యంలో తూర్పు బెంగాలు, పశ్చిమ పంజాబ్, సింధు, బెలూచిస్థాన్‌లు మినహా మిగిలిన దేశమంతా మహారాష్ట్రుల ప్రభావమున్న క్షేత్రంగా పరిగణింపబడసాగింది. మహారాష్ట్రులు సంచరిస్తున్న పశ్చిమ

భారతదేశంలోగాని, ఉత్తరభారతదేశంలోగాని యూరోప్‌నుండి వచ్చిన నాలుగు జాతులవారికీ రెండు శతాబ్దాలు గడిచినా చెప్పుకోదగిన పట్టు చిక్కలేదు.

**బెంగాలులో ఉన్న ప్రత్యేక పరిస్థితి**

కాగా బెంగాలు పరిస్థితి భిన్నంగా ఉన్నది. పుణేలో శివాజీఖడ్గానికి తన కుడిచేతి వ్రేళ్లను కోల్పోయి వచ్చిన తన మేనమామ షాయిస్తాఖాన్‌ను ఔరంగజేబ్ బెంగాలుకు గవర్నరుగా పంపించాడు (1664). అప్పటికి అతడు 63 సం॥ల వయోవృద్ధుడు. 1682లో ఇంగ్లీష్ ఈస్ట్ ఇండియా కంపెనీ తరఫున బెంగాలులో ముఖ్యఅధికారిగా ఉండిన విలియం హెడ్జెస్ వచ్చి షాయిస్తాఖాన్‌ను దర్శించుకున్నాడు. మొగల్ పాదుషా జహంగీర్ గతంలో 70 సంవత్సరాలక్రితం (పన్నులు చెల్లించకుండా తమ సరుకులు అమ్ముకొనడానికి) ఆంగ్లేయులకు దయచేసిన ఫర్మానాను అనుసరించి, పన్నులు చెల్లించకుండా ఎగుమతి వ్యాపారం చేసుకొనడానికి బెంగాలులో అవకాశం కల్పించాలని అభ్యర్థించడానికి అతడు వచ్చాడు. ఆ సమయానికి షాయిస్తాఖాన్ మనస్సు వ్యాకులమై ఉంది. తాను పంపించిన సైన్యం (ఇందులో బుడతకీచులు సమకూర్చిన 600మంది కిరాయి మనుషులు కూడా ఉన్నారు) అహోం సైన్యాలధాటిని తట్టుకోలేక, కకావికలై పారిపోయివచ్చారనే విషాదవార్త వినియున్నాడు.

ఆ తర్వాత మళ్లీ రెండు వారాలకు వారిద్దరూ కలిశారు. కంపెనీని ధిక్కరించి, స్వతంత్రంగా వ్యాపారం చేసుకొంటున్న (ఇటువంటివారిని Interlopers అని వ్యవహరించేవారు) థామస్ పిట్‌కి ఎటువంటి సహకారమూ ఇవ్వరాదని హెడ్జెస్ షాయిస్తాఖాన్‌ను కోరాడు. అంతేగాక పన్నులు చెల్లించకుండా ఎగుమతి వ్యాపారం చేసుకొనడానికి కంపెనీకిగల హక్కును 'లిఖితపూర్వకంగా' గుర్తించాలని కూడా కోరాడు. అలా లిఖితపూర్వకంగా ఇవ్వటమంటే, మొగలు అధికారపీఠం తన అధికారాన్ని కుంచింపజేసుకొనటమే. కాబట్టి షాయిస్తాఖాన్ అటువంటి పత్రమేదీ ఇవ్వలేదు.

ఆనాటికి హిందూదేశంలో ఆంగ్లేయులు ఈస్ట్ ఇండియా కంపెనీకి 12 పట్టణాలలో స్థావరాలు ఉండేవి. అవన్నీకూడా సముద్రతీరాన్నో, లేక ఏదో ఒక నదీతీరాన్నో అంటిపెట్టుకొని ఉన్నవే. మొగలు అధికారుల వేధింపులకు గురికాకుండా ఉండేందుకు వీలుగా చుట్టూ ప్రహరీగోడలతో భద్రంగా ఉండే స్థావరం నిర్మించుకోవలసిన అవసరం గురించి హెడ్జెస్ ఎంతగా నచ్చజెప్పజూసినా,

షాయిస్తాఖాన్ అంగీకరించలేదు. ఇలా మంచిగా చెప్తే ఇక్కడి సుబాదార్లు వినరు, బలప్రయోగం చేసి, మన తడాకా చూపవలసిందేనని ఆంగ్లేయుల సైన్యంలోని యువకులు ఆవేశపడుతూ ఉండేవారు. ఇంగ్లీష్‌రాణి ఈస్ట్ ఇండియా కంపెనీకి ఆసియా ఖండంలో క్రైస్తవరాజు పాలనలో లేని ఏ దేశంలోనైనా వ్యాపారం చేయడానికి రాయల్ చార్టర్ ద్వారా ఆ కంపెనీకి గుత్తాధికార మివ్వటమేగాక, ఆయాదేశాల ప్రజలతో వ్యవహరిస్తున్న సమయంలో ఇంగ్లాండు రాజ్యానికి వీరు ప్రతినిధులుగా వ్యవహరిస్తున్నట్లుగా గుర్తించటం ఒక ప్రధానాంశంగా గమనార్హం. ఇంగ్లీషు సైనికాధికారుల కదనకుతూహలంలో ఇది ఒక కీలకమైన అంశం.

వారిద్దరిమధ్య సంభాషణలు జరిగిన నాలుగు సంవత్సరాల తర్వాత ఇంగ్లీషువారు ఒకపెద్ద నౌకాసైన్యాన్ని బెంగాలుమీదకు పంపించారు. 19 ఓడలలో, 20 ఫిరంగులు, 600 మంది సైనికులూ ఉన్నారు. 1688లో మరో నౌకాదళం కూడా వచ్చి కలిసింది. ఇలా భయపెట్టి, బలప్రయోగం చేసి ఆసియా ఖండంలోని హిందువులనుగాని, ముస్లింలనుగాని లొంగదీసుకోవాలని వారు గట్టిగా అభిప్రాయపడటం వెనుక అప్పటికి కొద్ది సంవత్సరాల క్రితం ఇంగ్లాండులో జరిగిన ఒక న్యాయవివాదం నేపథ్యంగా ఉంది.

## "క్రైస్తవేతరులందరూ శత్రువులే"-ఇది ఆంగ్లేయుల దృష్టి

1682లో ఇంగ్లీష్ ఛానల్ వద్ద హిందూదేశంనుండి తెచ్చిన వస్త్రాలతో నిండిన ఒక ఓడను నిలువరించి, అపరాధరుసుము చెల్లించాలని ఈస్ట్ ఇండియా కంపెనీ డిమాండ్ చేసింది. దానిని సవాలు చేస్తూ, ఆ ఓడ సరుకుల యజమాని థామస్ శాండీస్ న్యాయస్థానాన్ని ఆశ్రయించాడు. 'ది గ్రేట్ కేస్ ఆఫ్ మొనాపొలీస్' పేరుతో ఆ వివాదం ప్రసిద్ధమైంది. థామస్ శాండీస్ తరఫున హెన్రీ పొల్లెక్స్‌ఫెన్ వాదించాడు. అతడు ఇంగ్లాండులోని లిబరల్స్ (విగ్స్) పక్ష రాజకీయనాయకుడు. పరస్పర విశ్వాసము, సత్సంబంధాలు వ్యాపారానికి కీలకమని, ఇరుపక్షాలమధ్య ఇచ్చిపుచ్చుకోవడాలు జరగాలంటే, ఒకరినొకరు బాగా ఎరిగియుండాలని, ఒక వ్యక్తిత్వము, ఆత్మ ఉన్నవారు వ్యాపారం చేస్తున్నపుడే ఇది సాధ్యమౌతుందని, జీవించి ఉన్న వ్యక్తితో వ్యవహరిస్తున్నపుడే ఇది సఫలం కాగలవని వాదించాడు. అస్పష్టంగా-ఒక వ్యక్తిగా లేకుండా-ఒక కంపెనీ చేస్తున్న వ్యాపారంలో ఈ విలువలు సాధ్యంకావని వాదించాడు.

హెనియేజ్ ఫించ్ కంపెనీ తరఫున వాదిస్తూ, తన ప్రత్యర్థి వాదనలతో చాలా వరకు ఏకీభవిస్తూనే, తాను విభేదిస్తున్న అంశాలను ఇలా వివరించాడు. "ఇరువురు వ్యక్తులు వ్యాపార సంబంధాలు నెలకొల్పుకొంటున్న సమయంలో వారిమధ్య స్నేహము పరస్పరవిశ్వాసము-వారిరువురూ ఒకే మతాన్ని అనుసరిస్తున్న వారైనపుడే-సాధ్యవడగలవు. ఇంగ్లాండులో స్వేచ్ఛావాణిజ్యము సాగుతూ ఉండడానికి ప్రధాన ఆధారం-ఇక్కడి ప్రజలందరూ ఒకే క్రైస్తవమతాన్ని అంటిపెట్టుకొనియున్న సభ్యసమాజం కావటమే - **క్రైస్తవులు కానివారు ఆ సభ్యసమాజానికి చెందిన పౌరచట్టాలనుగాని, నైతిక నిబంధనలను గాని, పంచుకొని అనుసరించేవారు కారుగదా! కాబట్టి వారిని శత్రువులుగా పరిగణించాలి.** హిందూదేశంలో ఇంగ్లీషువారు నిరంతరయుద్ధంలో నిమగ్నులైయున్నారు. ఆసియా ఖండంలో జరుగుతున్న వ్యాపారాన్ని నిరంకుశ అధికారాలు కల్గిన ఒక కార్పొరేషన్ ద్వారా నిర్వహిస్తూ, దాని కార్యకలాపాలను గమనించుతూ, ప్రభుత్వం దానిని రక్షించ వలసిన అవసరమున్నది. నిందితుని తరఫున వాదించిన పొలెక్స్‌ఫెన్ ఉదాహరించిన మధ్యయుగంనాటి చట్టాలు ఇప్పుడు వర్తించవు. ఎందుకంటే ఆనాడు కేవలం క్రైస్తవులతోనే ఆంగ్లేయులు వర్తకం చేస్తుండేవారు. ఒకటవ ఎడ్వర్డు యూదులను బహిష్కరించిన విషయం గుర్తుచేసి, యూదులే మనకు శత్రువులుగా గుర్తింపబడినారంటే, **హిందూదేశానికి చెందిన హిందువులు, మహమ్మదీయులు మనకు మరింత ప్రమాదకారులైన శత్రువులుగా గుర్తింపబడి తీరాలి."**

పై వాదోపవాదాల పర్యవసానంగా ఇంగ్లాండులో క్రొత్తగా అధికారంచేపట్టిన రాజు రెండవ జేమ్సు కంపెనీ అధికారాలను గట్టిగా బలపరిచాడు. (అతనికి ఏటేటా 10వేల పౌండ్ల విలువైన బహుమతులు అందుతాయి గదా!) ఇంగ్లాండు రాజకుటుంబానికి ఈస్ట్ ఇండియా కంపెనీకి మధ్య గల సంబంధం ఎంత సన్నిహితమైనదంటే, రాజకుటుంబంవారు ఆ కంపెనీలో భాగస్వాములు. అందువల్ల కంపెనీ ఒక వర్తకుల బృందంగానో, సంఘంగానోకాక, ఆసియాఖండంలో ఇంగ్లాండు రాజ్యశక్తిని ప్రదర్శించే ప్రతినిధిగా విస్తృతంగా భావింపబడేది. హిందూదేశంలో మొగలు సామ్రాజ్యశక్తితో తలపడడానికి ఇంగ్లీషు సైనికులను పంపించే రాజపత్రము రెండవ జేమ్సు సంతకంతో పంపబడటం గమనార్హం. ఆసియా ఖండంలో ఆంగ్లేయుల వ్యాపారాలపై కంపెనీకి గల నియంత్రణాధికారాన్ని బలపరుస్తూ, ఇంగ్లండు

రాజవంశం తనకుగల అధికారాన్ని అంతా ఒడ్డి రంగంలోకి దిగినట్లుగా మనం గ్రహించుకోవాలి.

ఈ విధంగా క్రైస్తవమత పతాకాన్ని ఎగురవేయడానికి నాటికి రెండు శతాబ్దుల క్రిందట పోప్‌లు ఇచ్చిన ఆదేశం తొలిప్రేరణకాగా, ఉత్తర అమెరికా ఖండంలో లభించిన యుద్ధానుభవం వారిలో హుషారును పెంచగా, యావత్తు ఇంగ్లాండు ప్రభుత్వమూ తమ వెనుక నిలుస్తుందనే ధైర్యం కూడా తోడుకావటంతో హిందూదేశంలోకి వ్యాపారనిమిత్తం వచ్చిన ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు, ఉద్యోగులు, సైనికులు యుద్ధోన్మాదంతో పెరపెరలాడుతున్నవారైనారు.

## మొగలులకు ఆంగ్లేయులకు మధ్య తొలియుద్ధం

ఒకరోజు ముగ్గురు సైనికులు ఏదోఒక కారణంగా బెంగాలులోని మొగలు ప్రభుత్వ అధికారులతో హుగ్లీ బజారులో ఘర్షణకు దిగారు. దానిపై మొగలుల యంత్రాంగం కదలివచ్చి హుగ్లీలోని ఆంగ్లేయుల ఫ్యాక్టరీని (గిడ్డంగులను) తగులబెట్టారు. ఆంగ్లేయులకు తీరంలో నిలిచి ఉండే అవకాశంలేక, నదిలోనున్న పడవలపైనుండి హుగ్లీ నగరంమీదకు దాడిచేయ ప్రయత్నించారు. ఆ రాత్రి, మరునాడు కూడా తుపాకికాల్పులు కొనసాగించారు. తాము హుగ్లీ నగరాన్ని స్వాధీన పరుచుకొన్నట్లుగా ఆంగ్లేయుల కంపెనీ ప్రతినిధి చార్నోక్ ప్రకటించుకున్నాడు కూడా. అయితే 1400 బస్తాల సూరేకారం నిల్వలు గట్టుమీద ఉండిపోయాయి. ఆంగ్లేయులదృష్టిలో అవి చాలా విలువైనవి, కీలకమైనవి. పగతీర్చుకోవటంకంటే, ఆ విలువైన, కీలకమైన వస్తువులను దక్కించుకోవటం ముఖ్యమని ఆంగ్లేయులు భావించి, మొగలుల గవర్నరు చేసిన శాంతి ప్రతిపాదనలకు అంగీకరించారు. ఇలా ఒక వైపున ఆంగ్లేయులు బెంగాలులో మొగలు ప్రభుత్వంతో ఘర్షణ పడుతూ ఉండగా, డచ్‌వారు రకరకాల సరుకులను సకాలంలో యూరోప్‌కి తరలించుకొనిపోయి, అక్కడ అమ్ముకొని బాగా లాభపడ్డారు.

చార్నోక్ తనసైన్యాలను 'సుతనాటి' అనే గ్రామానికి చేర్చాడు. హుగ్లీకి 49 మైళ్ల దూరాన, నదికి దిగువన ఉన్న గ్రామమది (తర్వాత కాలంలో ఇదే కొలకత్తా నగరంగా అభివృద్ధి చెందింది). మొగలుల ప్రభావానికి దూరంగా ఉంటూ, సరుకులను వేగంగా ఓడలకెత్తేపనిని చక్కబెట్టుకోవాలని చార్నోక్ ఉద్దేశ్యం. ఇలా కంపెనీ మొగలులతో రాజీపడటాన్ని ఇంగ్లాండులో ఉన్న కంపెనీ అధికారులు పిరికితనపు చర్యగా భావించారు. ఎవ్వరూ హర్షించలేదు. ఒక బలమైన స్థావరం

తమచేతికి అందివచ్చేవరకు, వదలకుండా యుద్ధాన్ని కొనసాగించాలని నొక్కిచెప్పారు. తమ జాతిగౌరవానికి మించి ఆర్థిక ప్రయోజనాలకు అధిక ప్రాధాన్యం ఇచ్చిన చార్నోక్‌ను తప్పుబట్టారు. ఒక నిజాయితీపరుడైన వ్యాపారిగా ఉండటం ఎంత అవసరమో, మంచి సైనికునిగా మెలగడం అంతకుమించి అభిలషణీయమని స్పష్టం చేశారు. ఇంగ్లాండురాజు, కంపెనీ కలసి చర్చించుకొని మరో 15 ఓడలలో అదనపు సైన్యాలను పంపించారు. గతంలో చార్నోక్‌ను మొదటిసారిగా బెంగాలుకు తీసికొనివచ్చి బాధ్యతల నప్పగించిన హీత్‌ను మళ్లీ బెంగాలుకు పంపించారు.

అయితే హీత్ కొత్తగా సాధించినదేమీ లేదు. అతడు మొగలుల గవర్నరుగా ఉన్న షాయిస్తాఖాన్‌కు ఉత్తరాలపై ఉత్తరాలు వ్రాసి బెదిరించజూశాడు. 1688 మార్చిలో షాయిస్తాఖాన్ ఢాకాలో ఉన్న ఆంగ్లేయులందరినీ ఖైదు చేయించాడు. దొంగలతో, హంతకులతో సమానంగా తమపట్ల వ్యవహరించటంగురించి వారు అభ్యంతరం వ్యక్తంచేశారు. హీత్ తన దగ్గర ఉన్న బలగాలతో ఒరిస్సాలోని బాలాసోర్ రేవు పట్టణంపై విరుచుకుపడ్డాడు. ఎవరు తనకు అనుకూలురు, ఎవరు ప్రతికూలురు అనే విచక్షణ కూడా లేకుండా అడ్డగోలుగా విధ్వంసానికి దిగాడు. ఆ తర్వాత హీత్ చిట్టగాంగ్ రేవు పట్టణానికి వెళ్లాడు. అది అతనికి దుర్భేద్యంగా కనిపించింది. ఏమి చేయాలి, ఎలా చేయాలి అని హీత్ ఆలోచిస్తూ ఉండగా, కొన్ని అనుకోని పరిణామాలు అక్కడి మొగలు గవర్నరు ఆలోచనలలో కొత్త మార్పులు తెచ్చాయి.

బర్మాలోని అరకాన్‌లో సైనికచర్యలు నిర్వహించడానికి తన సైనికులను తరలించే ఆలోచనలో అతడు ఉండగా, ఆంగ్లేయుల నౌకలు అందుకు ఉపయోగ పడగలవేమోనన్న ఆలోచన వచ్చింది. కాబట్టి ఈ విషయం మాట్లాడుకొని నిర్ణయించుకొనేందుకు కొద్దిరోజులు వేచి ఉండవలసిందని గవర్నరు ఆంగ్లేయులను కోరాడు. అయితే మార్కెట్లను చేరుకోవటంలో తాము వెనుకబడుతున్నామని, ఇప్పటికే ఆలస్యమైందని ఆంగ్లేయులు అసహనభావంతో ఉన్నారు. చిట్టగాంగ్‌లోని మొగలు గవర్నరు మాటలను పట్టించుకోకుండా, ఆంగ్లేయులు మద్రాసు దిశగా ప్రయాణించారు. 1689 మార్చి 4న హీత్ మద్రాసు చేరుకొన్నాడు. బెంగాలుగడ్డమీద మొగలులకు పాఠం నేర్పితీరాల్సిందేనని బీరాలుపలికిన ఆంగ్లేయుల తొలియుద్ధ ప్రయత్నం ఆవిధంగా ఒకపెద్ద పరాజయంగా ముగిసింది.

సుమారు ఇదే సమయంలో బొంబాయిలోనూ ఆంగ్లేయులకు 1689 ఫిబ్రవరిలో ఘోరావమానం ఎదురైంది. (స్థలాభావం కారణంగా ఆ వివరాలన్నీ ఇవ్వలేక

పోతున్నాం) పై యుద్ధాలు కంపెనీకి చాలా చిక్కు సమస్యలను, ఆర్థిక సంకటాన్ని తెచ్చిపెట్టాయి. 1690నుండి సుమారుగా 10సం॥లపాటు వారు ఎటూ దిక్కుతోచని స్థితిలో ఉండి పోయారు. 1680 నుండి కంపెనీ వాటాలవిలువ పడిపోతున్నది. ఇంగ్లీషు అధికారులకు, ఉద్యోగులకు చేతులకు సంకెళ్ళువేసి ఢాకాలోను, సూరత్‌లోనూ వీధులలో ఊరేగించారన్న వార్తలు, పెడరెక్కలు విరిచి చేతులు వెనుకవైపున కట్టివేయబడిన ఆంగ్ల అధికారులు మొగలు పాదుషా ఔరంగజేబ్ ముందు సాగిలపడి, క్షమాపణ చెప్పి, తమను వదిలివేయ వలసిందని వేడుకొన్నారన్న వార్తలు- అవమానకరమైన ఈ పరిణామాలు అందుకు కారణాలయ్యాయి.

## మొగలుల రాజనీతిని తమకు అనుకూలంగా మలుచుకున్న ఆంగ్లేయులు

మరోవైపున ఇంగ్లాండులో మరికొన్ని పరిణామాలు సంభవించాయి. 1688లో డచ్ ప్రభుత్వాధినేత విలియం ఇంగ్లాండు రాజు జేమ్సుపైకి దండెత్తి వచ్చాడు. రాజుకు, కంపెనీకి వ్యతిరేకులైన వారందరూ ఏకమై విలియం వెనుకచేరారు. ఇంటర్‌లోపర్స్ కూడా వారికి తోడయ్యారు. విలియం, అతని భార్య మేరీ గద్దెనెక్కి చేసిన మొదటిపని హిందూదేశంలో వ్యాపారాన్ని డీరెగ్యులేట్ చేయటం (అప్పటివరకు ఉన్న నిబంధనలు ఎత్తివేయటం.) ఆసియాలో వ్యాపారానికి అందరికీ అవకాశమిస్తూ 1694లో ఒక చట్టాన్ని ఆమోదించారు. 1698లో ఈస్ట్ ఇండియా కంపెనీకి పోటీగా మరో కంపెనీని ఏర్పరిచారుకూడా.

18వ శతాబ్దపు తొలిదశాబ్దం గొడవలు-ఆర్థిక సంకటాలతో గడిచిపోయింది. మొగలులకు అభిమానపాత్రులు కావడానికి రెండు కంపెనీలూ పోటీపడ్డాయి. అయితే రాజకీయ పరిణామాలు ఎలా ఉన్నప్పటికీ, హిందూదేశంతో వ్యాపారం ఒకే కంపెనీ ద్వారా నిర్వహింపబడాలన్నదే ఇంగ్లాండులో బహుజనాభిప్రాయం. 1702లో ఇంగ్లాండులో క్వీన్ అన్నీ గద్దె నెక్కింది. కేంద్రీకృత అధికారం మరల బలం పుంజుకొన్నది. గత వ్యవస్థలను కొన్నింటిని పునరుద్ధరించారు. అప్పుడు జరిగిన పరిణామాలలో ముఖ్యమైనది ఇంగ్లాండు, స్కాట్లండు కలిసిపోయి, ఒకే పాలకవంశము, ఒకే పార్లమెంటూ ఏర్పడటం. అలా కింగ్‌డమ్ ఆఫ్ గ్రేట్ బ్రిటన్ రూపుదిద్దుకొంది. పోటీగా ఏర్పరచబడిన కంపెనీ పాత ఈస్ట్ ఇండియా కంపెనీలో విలీనమైపోయింది. అలా మరల ఆసియా వ్యాపారంపై గుత్తాధిపత్యం చేజిక్కించుకున్న ఈస్ట్ ఇండియా కంపెనీవారిని 20 ఏళ్ల క్రిందట సంభవించిన ఓటమి బాధ సలుపుతూ ఉంది. కష్టకాలంలో కొట్టుకుపోకుండా, క్షీణించిపోకుండా ఈస్ట్ ఇండియా కంపెనీ

నిలిచి ఉండడానికి ప్రధానకారణం ఇంగ్లాండులోని రాజకీయ ప్రముఖులు దీని ద్వారానే ఎప్పటికైనా ఎంతోకొంత సంపాదించుకోగలమని, ఇదిగాక తమను ఉద్ధరించగల మరో మార్గమేదీలేదని ఓపికగా నిరీక్షిస్తూ ఉండటమే.

ఈస్టిండియా కంపెనీ హిందూదేశంలో తన మనుగడను నిలుపుకొనడానికి ముఖ్యకారణం-తమ చేతిలో పరాజితులైన వారిని 'బుద్ధి వచ్చిందా?' అంటూ చేరదీసి, వారిద్వారా సేవలు చేయించుకొనడానికి అలవాటుపడిన మొగలుల రాజనీతి. దేశాన్ని అంతటినీ తమ గుప్పిట్లో పెట్టుకొని, నేరుగా తామే ఏలుతూ ఉండటం సాధ్యపడదని మొగలులు గ్రహించుకొనియున్నారు. కాబట్టి అనేకమైన దేశీయ రాజవంశాలతో-ఒప్పందాలు కుదుర్చుకొని, తమకు విధేయులుగా, కప్పం చెల్లిస్తూ ఉండే తీరులో-వారిని స్థానికపాలకులుగా అనుమతిస్తుండేవారు. వారు ఆంగ్లేయులను కూడా అదే పద్ధతిలో తమకు సేవలు అందించేవారుగా వినియోగించుకోదలిచారు. 1690 తర్వాత సంభవించిన మార్పులలో ఈస్ట్ ఇండియా కంపెనీకి కొన్ని అవకాశాలు లభించాయి. షాయిస్తాఖాన్ బెంగాలునుండి ఢిల్లీకి తీసికొని రాబడినాడు. అతని స్థానంలో ఇబ్రాహీంఖాన్ బెంగాలు గవర్నరు అయినాడు. అతడు పట్నా నుండి అతడు ఢాకాకు వచ్చాడు.

అతనికి ముందునుండి చార్నోక్‌పట్ల సానుకూలభావన ఉంది. ఆంగ్లేయులు పాదుషా ముందు సాగిలపడి, తాము పశ్చాత్తాపడుతున్నామని, పాదుషా అధికారానికి లోబడి ఉంటామని ప్రాధేయపడినారని తెలియగానే, ఇబ్రాహీంఖాన్ వారిని బెంగాలుకు ఆహ్వానించాడు. అలా వచ్చిన చార్నోక్ 1690లో సుతనాటివద్ద కొత్త స్థావరం నిర్మించనారంభించాడు. (అదే అనంతరకాలంలో కొలకత్తానగరమైందని ఇంతకుముందే చెప్పుకున్నాం గదా!) అయితే చార్నోక్ ఇప్పుడు చాలా జాగ్రత్తగా అడుగులు వేయసాగినాడు. మొగలుల దాడి నుండి తట్టుకోగల సత్తా ఉంటే తప్ప, ముందు ముందు తాము నిలువజాలమని గ్రహించి, నదికి ఆవలి తీరాన ఉన్న పోర్చుగీసు వ్యాపారులతోనూ ఒప్పందం కుదుర్చుకొన్నాడు. తమ స్థావరం రక్షించుకొనడానికి ఒక చిన్న యుద్ధనౌక (ఫ్రిగేట్ అంటారు)ను బాడుగకు తీసుకొన్నాడు.

సుతనాటి గ్రామంలో విదేశీయులైన ఆంగ్లేయులు స్థిరపడదానికి చాలా అగచాట్లు పడ్డారు. ఇటుకలతోగాని, రాళ్లతోగాని ఎటువంటి కట్టడాలు నిర్మించకుండా నవాబు నిషేధం విధించాడు. గుడారాలలో, గుడిసెలలో, పడవలలో వారు రోజులు వెళ్లబుచ్చ

వలసి వచ్చింది. 1691 ఆగస్టులో ఆ వలసలో 1000 మంది ఉన్నట్లుగా రికార్డులలో ఉండగా, అక్కడికి సందర్శనగా వచ్చిన హెమిల్టన్‌కి వందల సమాధులు కనిపించాయి. లెక్కపెట్టగా 460 వచ్చాయి (జనవరి 1692). అక్కడ అలా మరణించిన వారిలో చార్నోక్ ఒకడు.

కాగా, ఆంగ్లేయులకు అదృష్టం కలిసివచ్చి, వారి దశ తిరిగింది ఎక్కడ అంటే, కొత్తగా వచ్చిన నవాబుకు ఆంగ్లేయుల సేవలు ఉపయోగపడగలవుగదా అన్న ఆలోచన వచ్చింది. ఔరంగజేబ్ దక్షిణ భారతదేశంలో శివాజీవారసులతో యుద్ధం చేస్తుండటం అవకాశంగా తీసుకొని, బెంగాలులోని భూస్వాములు మొగలుల పాలనపై తిరుగుబాటుచేసి, విశాలమైన భూభాగాలను స్వంతం చేసుకో యత్నించారు. 1696నాటికి సగంపైగా భూమి వారి అదుపులోకి పోయింది. క్రొత్తగా వచ్చిన నవాబు వారితో యుద్ధం చేయవలసిన వచ్చింధి. ఆంగ్లేయులకు ఒక భద్రమైనకోట ఉంటే, అది మొగలు సామ్రాజ్యానికి లాభదాయకమౌతుందని, అప్పటికి ఒకసారి పరాభవాన్ని చవిచూసి ఉన్నందున, ఇకపై ఆంగ్లేయులు బుద్ధితెచ్చుకొని తమపట్ల మర్యాదగా వ్యవహరించగలరని, మొగలు అధికారుల ప్రయోజనాలను, స్థానిక వ్యాపారుల ప్రయోజనాలను, అతి తక్కువ ఖర్చుకు రక్షించగలరని ఇబ్రహీంఖాన్ అంచనావేసికొన్నాడు. స్థానిక వ్యాపారులను కొందరిని బెదిరించి, వారు తమ భూమిని ఆంగ్లేయులకు అమ్మేలా చేశాడు (1698). అలా ఆంగ్లేయులు స్థావరం నిర్మించుకోవటంలో ఖాన్ తనవంతు సహాయం అందించాడు.

క్రమంగా ఆంగ్లేయుల స్థావరం చుట్టూ జనావాసాలు, బజార్లూ పెరిగాయి. 18వ శతాబ్దంలో కలకత్తాగా ప్రసిద్ధిలోకి వచ్చింది. దక్షిణ హిందూదేశంలో యుద్ధ నిమగ్నుడైయున్న ఔరంగజేబ్ సైన్యాలకు ఆహారపు కొఱత ఏర్పడిన సమయంలో తమ నౌకల సహాయంతో ఆహారపదార్థాలు అందజేయటం ద్వార ఆంగ్లేయులు ఔరంగజేబ్ మెప్పుపొందారని చెప్పే కథలు కూడా లేకపోలేదు. ఏది ఏమైనా తమ పాలితులమీద పూర్తి పట్టు లేని మొగలాయిల అధికారులు, తమకు స్వంతంగా నౌకలు లేని కారణంగా ఆంగ్లేయుల సేవలు పొంది, ఆ లోటును భర్తీ చేసుకోవచ్చునని భావించి, గృహోన్ముఖులైన ఆంగ్లేయులకు బెంగాలులో మరల పిలిచి స్థానం కల్పించారు.

**రాజకీయ అస్థిరత-ఆర్థికవ్యవహారాల్లో నైపుణ్యానికి పెరిగిన ప్రాధాన్యం :**

1707లో ఔరంగజేబ్ మరణించాడు. అతని వారసునిగా గద్దెనెక్కిన బహదూర్ షా పాలన 5 సం॥లు మాత్రమే సాగింది. 1713 తర్వాత అంతఃకలహాలు చెలరేగాయి. అది అవకాశంగా అప్పటివరకు రాజధానిలో ఉండిన ప్రముఖులు తమవైన రాజ్యాలస్థాపనకు తమ ప్రాంతాలకు తరలివెళ్లారు. వారిలో కొందరు మాటవరుసకు మొగలు పాదుషాకు విధేయులమని చెపుతూ ఉన్నా, చాలావరకు స్వతంత్రులుగానే వ్యవహరించ నారంభించారు. అలా 18వ శతాబ్దంలో ఒకటి, రెండు దశాబ్దులు గడిచేసరికి అయిదారుగురు ప్రముఖ స్థానాల్లో విరాజిల్లుతున్నారు.

దక్షిణాన ఆర్కాట్, హైదరాబాద్ నవాబులు, తూర్పున బెంగాల్, అవధ్ (అయోధ్య) నవాబులు, పశ్చిమాన మహారాష్ట్రులు బలపడినారు. ఔరంగజేబ్ దక్షిణ హిందూస్థానంపై పట్టు సాధించటంకోసం కొన్ని దుర్గాలను స్వాధీనపరుచుకున్నా, ఈ విజయాలేవీ, అతనికి అవసరమైన ఆదాయాన్ని సమకూర్చిపెట్టినవికావు. యుద్ధాలకోసం దివాణంనుండి బయటకు తెచ్చి ఖర్చు చేసిన డబ్బు, మళ్లీ తిరిగి వచ్చేది కాదు. ఔరంగజేబ్ మరణానంతరం రాజకీయాధికారం కూడా, ఔరంగాబాద్, హైదరాబాద్‌లకు, లాహోర్‌కి, పుణేకి తరలి వెళ్ళింది. బెంగాల్‌లో మూర్షిదాబాద్ (ఇబ్రాహీంఖాన్ తర్వాత గవర్నరుగా వచ్చిన మూర్షిద్ కులీఖాన్ 1717లో బెంగాలు పాలకుడై రాజధానిని ఢాకా నుండి మూర్షిదాబాద్‌కి మార్చాడు), సుదూర దక్షిణాన ఆర్కాట్, రాజపుత్ర స్థానంలో జైపూర్, ఉత్తర హిందూస్థానంలో లఖనవ్‌లు రాజధానినగరాలై బలంపుంజుకొన్నవి. వ్యాపార కేంద్రాలుగాను, కళాకేంద్రాలుగాను ప్రశస్తి సంపాదించుకొంటున్నవి.

ఆ కాలంలోనే సైనికబలాల నిర్వహణలో ఒక ముఖ్యమైన మార్పు వచ్చింది. అంతకుముందు జాగీర్దార్లు, మన్సబ్‌దార్లు ఉండేవారు. వారు సైనికబలాలను నిర్వహించుతూ పాదుషా పిలుపునిచ్చినపుడు తమ దళాలను తీసికొనివచ్చి యుద్ధాలలో పాల్గొనేవారు. కాని ఇప్పుడు మరాఠా రాజ్యానికి ముఖ్యాధికారిగా ఉన్న పేష్వా మొదలైనవారు తమ రాజ్య కోశాగారాల నుండి సైన్యాలకు జీతాలు చెల్లించే పద్ధతిని విస్తృతం చేశాడు. దానితో రాజ్యనిర్వహణలో నగదు లెక్కలు, జమాఖర్చుల నిర్వహణ-వీటి పర్యవేక్షణ అనివార్యమైన అంశాలయ్యాయి. వాటిని కౌశలంతో నిర్వహించగలవారు ప్రముఖులుగా పరిగణింపబడసాగినారు. ఎప్పటికప్పుడు తమ అవసరాలు తీరేవిధంగా కోశాగారంలోకి ధనం వచ్చేవిధంగా

జమిందార్లను బుజ్జగించిగాని, గదమాయించిగాని ధనసంచయం చేసే నేర్పు రాజ్య నిర్వహణలో కీలకమైన అంశం అయ్యింది.

బెంగాలు నవాబుగా రాజధానిని ఢాకా నుండి మూర్షిదాబాద్‌కి మార్చిన మూర్షిద్ కులీఖాన్ ఈ రకమైన వ్యవహారాలలో దిట్ట. (ఇతడు పుట్టుకతో దక్షిణ హిందూదేశ బ్రాహ్మణుడు. ఔరంగజేబ్ గుర్తింపుపొంది దివాన్‌గా నియమితుడై, మతంమారి, పర్షియాలో శిక్షణపొందివచ్చాడు.) అవసరాన్నిబట్టి తనక్రింద జమీందార్లను మార్చివేసేవాడు. రెవిన్యూ వసూళ్ళను ఎప్పటికప్పుడు గమనించుకొంటూ ఉండేవాడు. క్రొత్తగా రహదారులు, మార్కెట్లు, వంతెనలు, పోలీసుఠాణాలు నిర్మించాడు. ధరలను వారంవారం సమీక్షించేవాడు. అన్నివైపుల నుండి సమాచారం సేకరించేవాడు. ఆ విధంగా ఆదాయాన్ని బాగా పెంచాడు.

ఆదాయాన్ని పెంచుకొనటంలో భాగంగా, వివిధ దేశాల వ్యాపారులను ప్రోత్సహించాడు. ఆంగ్లేయులు తమ ఫ్యాక్టరీల నిర్మాణంపట్ల చూపిస్తున్న పట్టుదలలో 'హింస' దాగి ఉండటం గమనించాడు. 1717లో నవాబు తరఫు అధికారులు ఆంగ్లేయుల భవనం సగంనిర్మాణమైన దశలో కూల్చివేశాడు. ఇదేమిటని ప్రశ్నించినపుడు చార్నోక్‌తో ఆరంభించి ఆంగ్లేయులు ఎవరెవరు ఎలా నగరాలను దోచుకున్నారో, తగులబెట్టారో ఆ వివరాలన్నీ ఏకరువ్వుగా బహిర్గతపరచి నోరుమూయించాడు.

తమిళప్రాంతంలో ఆంగ్లేయుల కార్యకలాపాలు ఆర్కాట్ పట్టణానికి సమీపంగా ఉన్న మదరాసు రేవుపట్టణంలో కేంద్రీకృతమై ఉండేవి. విజయనగర సామ్రాజ్య అంతర్గత చంద్రగిరి రాజుల సామంతుడైన శ్రీకాళహస్తి పాలకుడు దామర్ల వెంకటాద్రి ఏలుబడిలో ఆ భూములు ఉన్నప్పుడు అతని సోదరుడు దామర్ల అయ్యప్ప పూందమల్లికి అధిపతిగా ఉండేవాడు. ఆంగ్లేయుల ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రతినిధి ఫ్రాన్సిస్‌డే ఆనాటి వర్తక ప్రముఖుడైన భేరి తిమ్మన్నను ఆశ్రయించి, అతనిద్వారా అయ్యప్పద్వారా వెంకటాద్రి నుండి 1639లో కౌలుకు పొందాడు. అయితే ఆర్కాట్ నవాబ్ సాదతుల్లా ఖాన్ ఆంగ్లేయులను గట్టిగా నియంత్రించాడు. జౌళిపరిశ్రమకు, సాహిత్యరంగానికి కేంద్రంగా ఉన్న ఆర్కాట్ లక్ష జనాభాతో వృద్ధిగాంచింది. దానికి పోటీగా ఆంగ్లేయులు మద్రాసు పట్టణంలో నూతన నివాసభవనాలు, సూరేకారం నిల్వచేసేకొట్లు నిర్మించి బలిష్టం చేశారు. అలాగే మద్రాసుకు 120 కి.మీ.దూరంలో (పుదుచ్చేరికి దగ్గరగా) ఉన్న ఫోర్ట్ సెయింట్ డేవిడ్‌ను కూడా 1725లో పటిష్టం గావించారు.

అంగ్లేయులతో ఎప్పటికైనా ప్రమాదమేనని భావించిన ఆర్కాట్ నవాబు తమిళ ప్రాంతంలోని రేవు పట్టణాలను తానే స్వయంగా అభివృద్ధి చేయదలిచాడు. 1719లో 'సాదత్ పట్టణా'న్ని నిర్మించాడు. కాని అంగ్లేయులు, ఫ్రెంచివారల స్థావరాలనుండి వ్యాపారులను ఆకర్షించలేకపోయాడు. 1728లోనూ మరోసారి ప్రయత్నించి విఫలుడైనాడు. ఆవిధంగా దాదాపుగా 1750 వరకు కూడా రేవు పట్టణాలలో యూరోపియనులు వ్యాపారంలో బలపడినా, లోతట్టు ప్రాంతాలలోని రాజులు, నవాబుల రాజ్యాలు బలంగానే ఉండినవి.

**ఆంగ్లేయులకు అయిదు దశాబ్దులపాటు అన్నీ పరాజయాలే :**

పశ్చిమ తీరంలో ఆంగ్లేయులు ఊహించని ప్రతిఘటనను ఎదుర్కొన్నారు. మహారాష్ట్ర రాజ్యంలోని నౌకాదళాలకు కేంద్రాలుగా ఉన్న సముద్రతీర దుర్గాలకు రక్షకునిగా ఉన్న కాన్హోజి ఆంగ్రే ఆంగ్లేయులను బలంగా నిలువరించాడు. 50 సంవత్సరాల కాలఖండంలో వారిమధ్య చాలా ఘర్షణలు జరిగినవి. 1710వ సంవత్సరంనుండి డబ్బు చెల్లించి తమనుండి అనుమతిపత్రం పొందితేగాని, గోవానుండి సూరత్‌వరకు గల ఏ రేవు పట్టణంలోనైనా నౌకలు ప్రవేశించడానికి వీల్లేదని కాన్హోజీ ఆంగ్రే నిబంధనలు విధించాడు. అయితే విదేశాలనుండి వచ్చే నౌకలు మనదేశానికి లాభదాయకంగా బంగారం, వెండి చెల్లించి, మన దేశీయ ఉత్పాదనలను కొనుక్కొనిపోయేవి కాబట్టి, వాటికి మినహాయింపు నివ్వడానికి సిద్ధపడ్డాడు. అయితే ఇంగ్లీష్‌వాళ్లు తమకు కల్పించిన నదుపాయాన్ని ఉపయోగించుకొని ఊరకుండే బాపతుకాదు.

1718లో కాన్హోజీ సిబ్బంది 4 ఓడల్ని నిలువరించారు. తమకు చెల్లించవలసిన సుంకాన్ని ఎగగొట్టడానికి వారు ఆంగ్లేయుల పతాకాన్ని ప్రదర్శిస్తున్నారని వారిపై ఆరోపణ. లేఖల ద్వారా ఆరోపణలు, ప్రత్యారోపణలు జరిగాయి. కాన్హోజీకి చెందిన ఖాందేరీ దుర్గం మీదకు యుద్ధానికి వెళ్లిన ఆంగ్లసేనలకు పరాజయ మెదురైంది. ఊబిలో దిగి ముందుకు నడవడానికి ఆంగ్లేయుల సైన్యంలోని స్థానిక సిపాయిలు జంకారు. దానిపై వారు మరాఠా సేనతో కుమ్మక్కయ్యారని, వచ్చిన ఓడలగురించి దొంగచాటుగా సమాచారమిచ్చారని, ఆరోపించి విచారించటమేగాక, వారిని సైన్యంలో చేర్పించటంలో ముఖ్యపాత్ర వహించిన రామాకామత్‌పై వెన్నుపోటుదారుగా ఆరోపించి విచారణ తంతు నిర్వహించారు. బొంబాయి కోటలోని జైలులో 1728లో మరణించేవరకు (సుమారుగా 10 సం॥లపాటు) అతడిని నిర్బంధించి ఉంచారు.

అతని సహాయకుడైన దల్బా భండారేని కూడా బంధించారు. మిగిలినవారిని కొంత కాలం తర్వాత క్షమించి వదిలివేశారు.

ఆ తర్వాత కూడా మరాఠాలకు, ఆంగ్లేయులకు మధ్య యుద్ధాలు జరిగాయి. 1721లో కాన్హోజీకి సహాయంగా షాహూ ఛత్రపతి పంపగా 6,000 అదనపు సైన్యం కొల్హాపూర్ నుండి వచ్చింది. ఐతే 1720లో పేష్వా బాలాజీ విశ్వనాథ్ మరణించగా, అతని వారసులు ఆంగ్లేయులను సంప్రదింపులకు పిలిచారు. ఆ సంప్రదింపులలో పశ్చిమ సముద్రంమీద సార్వభౌమాధికారం తమకే ఉండాలని, ఏ దేశంవారైనా, ఏ జాతి వారైనా వ్యాపారం చేసుకొనేందుకు సమానావకాశా లుండాలని-మహారాష్ట్రులు పట్టుదలవహించగా, హిందూదేశీయ నౌకలకు-మొగలుల నిమిత్తంగా నడిచే నౌకలకు రక్షణ కల్పిస్తామని తాము మాట ఇచ్చామని, ఆపని నిర్వహించడానికి, ఈ నిబంధనలు అవరోధమౌతాయని ఆంగ్లేయులు తెలివిగా వాదించారు. ఎన్ని ఒప్పందాలు జరిగినా, మళ్ళీ మళ్ళీ కొట్లాటలు జరుగుతూనే వచ్చాయి. యాభై సంవత్సరాలకు పైబడిన వ్యవధిలో జరిగిన యుద్ధాలలో 1755లో తొలిసారిగా ఆంగ్లేయులకు విజయం లభించింది. అందుకు ప్రధాన కారణాలు రెండు 1) కాన్హోజీ ఆంగ్రే దివంగతుడు కావటం. 2) అతని కుమారులు మహారాష్ట్రులలో సంభవించిన అంతర్యుద్ధంలో పేశ్వాకు వ్యతిరేక శిబిరంలో ఉండటం. సుమారుగా ఈ కాలఖండంలోనే కేరళలో కూడా ఆంగ్లేయులకు, పోర్చుగీసులకు కూడా ఘోరపరాజయం ఎదురైంది.

## నాదిర్షా దాడులతో మారిన పరిస్థితులు

ఇలా ఐరోపానుండి వచ్చిన వారు నీరసపడిన సమయంలో, 1739లో పర్షియా దేశస్థుడైన నాదిర్షా మొగలుసామ్రాజ్యంపైకి దండెత్తివచ్చి ఢిల్లీని, పరిసరప్రాంతాలనూ దోచుకొన్నాడు. అతడు గద్దెమీద కూర్చున్నది 57 రోజులు మాత్రమే అయినా, అతని దండయాత్ర, దోపిడీల ప్రభావము, వాటి పర్యవసానాలు చాలా విస్తృతమైనవి. చాందినీచౌక్ వద్ద మసీదునుండి నాదిర్షా ఒరనుండి కత్తిని బయటకు తీసి పైకెత్తి సంకేతాన్నివ్వటంతో నాదిర్షా సైన్యాలు ఒకేరోజున దాదాపుగా 30 వేలమందిని (స్త్రీలు, పురుషులు కలిపి) ఊచకోతకోశారు. 300 ఏనుగులు, 10,000 గుఱ్ఱాలను వినియోగించి అపారమైన సంపదను నాదిర్షా తరలించుకుపోయాడు. ప్రసిద్ధమైన నెమలి సింహాసనాన్ని కూడా తీసుకొనిపోయాడు.

ఇది హిందూదేశపు ఆర్థికవ్యవస్థపై తీవ్రమైన ప్రభావాన్ని చూపింది. అంతకుముందు ఆంగ్లేయులు సూరత్‌లో బ్యాంకర్ (షావుకారు)ల వద్ద జమచేసిన సైకాన్ని-కలకత్తాలో ఆ బ్యాంకర్‌తో సంబంధమున్న మరో బ్యాంకరు నుండి తీసికొనేవారు. ఆవిధంగా శ్రమలేకుండా నగదుబదిలీ జరిగిపోయేది. అటువంటి వ్యవస్థ ఇప్పుడు కొనసాగటం ప్రశ్నార్థకమైంది. కలకత్తాలో ఉన్న షావుకార్లు తమ నగదుకు ఎటువంటి ముప్పు వస్తుందో తెలియనిస్థితిలో యూరోపియన్లకు ఇచ్చిన ఋణాలనన్నింటినీ వసూలుచేసుకో నారంభించారు. ఆవిధంగా ఆంగ్లేయులకు అప్పుపుట్టటం కష్టమైన పరిస్థితి ఏర్పడింది. ఈ ఒత్తిడులమధ్య రాజకీయమైన హింసను తట్టుకొనడానికి తాము ప్రత్యేకంగా ఏర్పాట్లు చేసుకోవటం అవసరమనే నిర్ణయానికి ఆంగ్లేయులు వచ్చారు.

## పెరిగిన మహారాష్ట్రుల ప్రాబల్యం

అంతకుముందు ఔరంగజేబ్ మరణించిన కొద్ది సంవత్సరాలకే అతని వారసులు మహారాష్ట్రులను అదుపుచేయటంలో భాగంగా తమవద్ద బందీగా ఉండిన షాహూ (శివాజీ మూడవ కుమారుడు)ను విడుదల చేసి, అతడిని ఛత్రపతిగా ప్రకటించారు. అప్పటివరకు మొగలాయీలతో పోరాడుతూ వచ్చిన రాజారాం (శివాజీ రెండవ కుమారుడు) వితంతువు తారాబాయికి ప్రత్యర్థిగా అతడిని రంగంలో దించారు. షాహూ ఛత్రపతి తరఫున మొగలాయీలతో సంప్రదింపులు జరిపిన పేశ్వా ఏటేటా ఒక లక్ష రూపాయలు ఇచ్చేట్లుగాను, మొగలాయీల అధికార రక్షణకు తమ సైన్యాల తోడ్పాటు నిచ్చేందుకుగాను-అందుకు ప్రతిఫలంగా మహారాష్ట్రుల ప్రభావక్షేత్రంలో చౌథ్, సర్దేశముఖి అనే పన్నులను (మొదటిది 25%, రెండవది 10%, మొత్తం 35%) వసూలు చేసుకొనడానికి మొగలు దర్బారు అంగీకరించేవిధంగానూ ఒప్పందం సాధించాడు. అప్పటినుండి మహారాష్ట్రులు పెద్ద సైన్యాన్ని సమీకరించుకొని వాటి నిర్వహణ వ్యయాన్ని ప్రాంతీయ ప్రభుత్వాధి నేతలనుండి ఈ పన్నుల రూపంలో వసూలు చేసుకొంటూ ఉండేవారు. నాదిర్షా దండయాత్ర జరిగిన 1739 వరకు ఇష్టపూర్తిగానో, అయిష్టంగానో గోల్కొండలోని నిజాంనవాబ్, ఆర్కాట్‌లోని నవాబూ తమ కోశాగారాలనుండి మహారాష్ట్రులకు పైపన్నులను చెల్లిస్తుండేవారు. 1744 నాటికి ఆర్కాట్ నవాబు ఏటేటా వరుసగా అయిదేళ్లపాటు మహారాష్ట్రులు వసూళ్లకు ససైన్యంగా రాగా, వాటిని సమర్పించుకోవలసి వచ్చింది. నాదిర్షా దండయాత్ర తర్వాత పెద్దరాజ్యాల కోశాగారాలు వట్టిపోయాయి. అప్పటివరకు

వారికి సమర్థకులుగా ఉన్నవారు ఇప్పుడు తల ఎగరేసి తమను తాము నవాబులుగా చెప్పుకొంటూ అధికారం చలాయించ నారంభించారు. దేశంలో నవాబుల సంఖ్య ఒక్కసారిగా పెరిగిపోయింది. మహారాష్ట్రులు వారివద్దకు పోయి - విశాలమైన తమ సైన్యాల పోషణ నిమిత్తంగా-బలప్రయోగం చేసైనా సరే చౌథ్, సర్దేశముఖి వసూలుచేయ నారంభించారు.

## తమ ప్రభ తగ్గి బేజారయిన నవాబులు

ఒకమాటలో చెప్పాలంటే, రాజులు, ప్రభువులు, రక్షకులూ ఎవరో తెలియని స్థితి దేశంలో చాలాచోట్ల ఏర్పడింది. ఇది ఆంగ్లేయులకు తమ ప్రభావాన్ని విస్తరింపజేయడానికి ఒక సువర్ణావకాశమైంది. ఈ నవాబులు తమలో తాము చేసుకొనే యుద్ధాల సమయంలోను, మహారాష్ట్రులను ఎదుర్కోవలసి వచ్చిన సందర్భాలలోనూ తమ విలువైన వస్తువులను, స్త్రీ జనాలనూ అభేద్యమైన దుర్గాలుగా భావించిన ఇంగ్లీషు, ఫ్రెంచి కోటలకు తరలించి భద్రపరచుకొనడానికి అలవాటు పడ్డారు. అర్కాట్ గద్దెకు వారసునిగా ఉన్న చందాసాహెబ్ తమ సంపదను, జనానాను ఫ్రెంచివారి అదుపులో ఉన్న పుదుచ్చేరికి తరలించగా, అతనికి ప్రత్యర్థి, మొగలుల చేత గుర్తింపు పొందినవాడూనైన మహపూజ్‌ఖాన్, అతని సోదరుడు మహమ్మదాలీ ఆంగ్లేయులపై ఆధారపడినారు. ఒకవైపున ఫ్రెంచివారి సహాయంతో, మరోవైపున ఆంగ్లేయుల సహాయంతో కొనసాగిన ఆర్కాట్ నవాబుల గృహయుద్ధంలో 1751లో సర్వత్రా పరాజయం చెందిన మహమ్మదాలీఖాన్ మద్రాసుకు చుట్టూ 25 మైళ్ల మేర ఉండే భూభాగాలను ఆంగ్లేయులకు ఇవ్వడానికి సిద్ధపడి ఆర్కాట్ నగరం మళ్ళీ తన వశమయ్యేటట్లు చూడవలసిందిగా ఆంగ్లేయులను అభ్యర్థించాడు. ఆర్కాట్ తన వశమైతేగాని, రాజ్యం తరఫున వసూలు కావలసిన పన్నులను తాను రాబట్టుకోజాలడు. అతని దుర్దశ అలా ఉంది.

మద్రాసులో బ్రిటీషు సైన్యాలకు కమాండర్ ఇన్ చీఫ్‌గా ఉన్న రొడాల్ఫస్ డి జింజెన్స్ ఈ ప్రతిపాదనకు నిరాకరించాడు. అప్పుడు అతని తరువాత స్థానంలో ఉన్న రాబర్ట్ క్లైవ్‌ను సైన్యాధిపతిగా కంపెనీ నియమించింది. ఆర్కాట్‌ను ప్రత్యర్థులనుండి విడిపించి మహమ్మదాలీఖాన్‌కు ఇప్పించిన యుద్ధంలో విజయం సాధించటంద్వారా రాబర్ట్ క్లైవ్ గుర్తింపులోకి వచ్చాడు. 1751 ఆగస్టు 26న 210 మంది సోల్జర్ల (ఆంగ్లేయులైన సైనికులు)తో రాబర్ట్ క్లైవ్ ఆర్కాట్ చేరుకొనే సమయానికి, అక్కడి సైనిక శిబిరం నిర్మానుష్యంగా ఉంది. జరిగినదేమిటంటే

చందా సాహెబ్ ఆర్థికస్థితి వీరు ఊహించినదానికంటే ఘోరంగా ఉంది. కొన్ని నెలలుగా జీతాలివ్వని స్థితి ఏర్పడి ఉండటంతో అతని సైన్యాలు, విధులను బహిష్కరించి, ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు. కోటను చేజిక్కించుకున్న క్లైవు ఆర్కాట్ పతాకాన్ని, మొగలుల పతాకాన్ని ఎగురవేయించాడు. మొత్తం సైన్యంలో ఉన్నది ఇంగ్లీషువారే అయినా, ఆంగ్లేయుల యూనియన్ జాక్ ఎగురవేయకపోవటం గమనార్హమైన అంశం.

కోటలో పాగా వేసిన క్లైవు చేసిన మొదటి పని, రెవెన్యూ వసూళ్ల నిమిత్తంగా అధికారులను నియమించి, ఆ రాజ్యానికి సామంతులుగా, జమీందార్లుగా ఉన్నవారి వద్దకు పంపించటం. కాగా కొద్దిరోజులలోనే చందాసాహెబ్ కుమారుడు రజా సాహెబ్ ఫ్రెంచి సైన్యాలను తోడుతీసుకొని (ఇందులో 2000 మంది మన దేశీయులే!) ఆర్కాట్ కోటకు ముట్టడి వేశాడు. రాబర్ట్ క్లైవ్ బింకంగా తమ ఫిరంగులను ముట్టడివేసిన సైన్యాలకు గురి చూసి నిలబెట్టి, రోజులు లెక్కిస్తూ, కోటను కాపాడే ప్రయత్నం చేస్తూ వచ్చాడు. రజా సాహెబ్, ఫ్రెంచి కంపెనీల తరఫున వచ్చిన సైన్యం ఆర్కాట్ పట్టణాన్ని చిందరవందర చేయటంలో నిమగ్నమైంది. అలా యాభైరోజులు గడిచిన తర్వాత, రాబర్ట్ క్లైవ్ అధీనంలోని సైనికులలో మూడింట రెండువంతుల మంది నిహతులైన స్థితిలో, 14 నవంబరు రాత్రి కాల్పులు జరపటం నిలిపివేసి, చందాసాహెబ్ సైన్యాలు రాత్రి రెండు గంటలవేళ పలాయనం చిత్తగించాయి. వారిని భయపెట్టిన అంశం-నవాబుకు, క్లైవుకు సహాయంగా, మొగలులతో ఒప్పందం ఉన్న మరాఠా సైన్యం (6వేల మంది) వస్తున్నారనే వార్త!

## మారిన బెంగాల్ రాజకీయ చిత్రపటం

ఇదే సమయంలో బెంగాల్‌లోనూ కొన్ని అనూహ్యపరిణామాలు చోటుచేసుకున్నాయి. హిందూస్థాన్‌పై నాదిర్షా దండయాత్ర జరిగిన 5 నెలలకు నవాబ్ షుజావుద్దీన్ మరణించాడు. నాదిర్షా ప్రభావాన్ని అరికట్టడానికని, అతనిచేత తన రాజ్యం పడమర సరిహద్దుల వద్దకు పంపబడిన అతని సేవకుడు యజమాని మరణించిన వార్త రాగానే, రాజ్యాన్ని తన చేతులలోకి తీసికొన్నాడు. ఆలీవర్దీఖాన్ పేరుతో పాలనా వ్యవహారాలు నడిపించసాగాడు. పన్నుల వసూలు కోసమై ఏటేటా వచ్చిపడే మహారాష్ట్రులను ఇతడు ప్రతిఘటించసాగాడు. 1742లో రఘూజీ భోంస్లే 20,000మంది అశ్వికులతో ఇతని రాజ్యంలోకి వచ్చాడు. అలీవర్దీఖాన్‌కి వ్యతిరేకంగా

ఉన్న స్థానిక జమీందార్లు మరో 20,000 సైన్యాన్ని సమకూర్చారు. మూర్షీదాబాద్ నుండి 30 లక్షల రూపాయలు తరలించుకుపోయారు. వారు అక్కడ తిష్ఠవేయకుండా ఆలీవర్దీఖాన్ తరిమికొట్టుతూ ఉన్నప్పటికీ ఆ తర్వాత 9 సం॥లలో మరో 6 సార్లు వచ్చి పన్నులు వసూలు చేసుకుపోయారు.

## నవాబులపట్ల ప్రబలిన అసంతృప్తి

మహారాష్ట్రులు ఇలా వచ్చి మూర్షిదాబాద్ కోశాగారంనుండి భారీగా పన్నులు చేస్తూ, నవాబుకు ఇబ్బందులు కల్గిస్తున్నందుకు సంతోషించేవారికి కొదవేమీ లేదు. ఎందుకంటే, ఆలీవర్దీఖాన్ పాలనలో క్రమపద్ధతి ఉండేది కాదు. నవాబుకు ప్రీతిపాత్రులైనవారు విశృంఖలంగా వ్యవహరిస్తూ ఉండేవారు. ఇతరుల స్త్రీలను అపహరించటం కూడా జరుగుతుండేది. నవాబునుండి నేరుగా తగినంత వసూలు కాని స్థితిలో మహారాష్ట్రులు క్రిందిస్థాయి పాలకులనుండి వసూలు చేసుకుపోతూ, నవాబు ఆదాయానికి గండికొట్టేవారు. దీనిని తప్పించటంకోసం 1751లో ఆలీవర్దీఖాన్ మహారాష్ట్రులను ఒరిస్సా పాలకులుగా గుర్తింపునిచ్చాడు (అతని మొత్తం రాజ్యం జనాభాలో ఐదవవంతు ఒరిస్సాలో ఉండేది) మహారాష్ట్రులు బెంగాలుపై ఒత్తిడి తగ్గించారు, ఒరిస్సాను అభివృద్ధిపరచటంపై దృష్టి పెట్టారు. అవసరమైనచోట్ల నదులపై వంతెనలు, దేవాలయాలు, విక్రయశాలల సముదాయాలూ నిర్మించారు. ఒరిస్సా కళకళలాడ నారంభించింది.

ఆలీవర్దీఖాన్ బెంగాల్, బిహార్‌లను రక్షించుకొనడానికి పెద్ద ఎత్తున సైన్యాలను పోషించవలసి వచ్చేది. అందుకై అతడు క్రిందిస్థాయి పాలకులను, యూరోపియన్ వర్తక సంఘాలనూ ధనంకోసం పీడించేవాడు. 1752లో ఆలీవర్దీఖాన్ అన్యాయంగా తమనుండి 3 లక్షల రూపాయలు వసూలు చేసుకుపోయాడని ఆంగ్లేయుల ఈస్టిండియా కంపెనీ వాపోయింది. అతడిని విసరి అవతలి పారేస్తే మంచిది కదా, అని కంపెనీ డైరెక్టర్లలో ఒకడైన రాబర్ట్ ఓర్మ్ క్లైవ్‌కి సూచించాడు. అయితే ఆలీవర్దీఖాన్‌పట్ల అతని సైనికులు విధేయంగా ఉండేవారు. అందువల్ల ఇతరుల ఆటలేవీ సాగలేదు. 1756 ఏప్రియల్లో, 80 సం॥ల వయస్సుపైబడిన ఆలీవర్దీఖాన్ మరణించాడు.

మహారాష్ట్రులు వచ్చి మీదపడతారనే భయం నవాబుకేగాక, ఆంగ్లేయులకూ ఉండేది. 1748లో ఒకసారి రఘూజీ భోంస్లే ఆంగ్లేయుల నౌకలపై దాడి చేశాడు. స్థానిక జమీందార్ల సిబ్బంది వచ్చి మధ్యమధ్య తమ సరుకులు ఎత్తుకుపోతున్నారని

చెప్తూ ఇటువంటి దాడులను నివారించడానికి అన్నట్లుగా ఆంగ్లేయులు తమ ముఖ్య స్థావరమైన కలకత్తా చుట్టూ ఒక పెద్ద కందకం త్రవ్వారు. లోపల కోటగోడల ఎత్తు పెంచారు. చుట్టూ ఫిరంగులూ అమర్చిపెట్టి ఉంచారు. ఆలీవర్దీఖాన్ పాలన చివరిరోజుల్లో ఫ్రెంచివారినుండి తమకు ముప్పురాగలదని చెప్తూ ఆంగ్లేయులు తమకోటను మరింతగా పటిష్టంచేశారు, బలగాలను పెంచుకొన్నారు.

ఆలీవర్దీఖాన్ మరణంతో 21 సం॥లు వయస్సున్న అతని మనుమడు సిరాజుద్దౌలా నవాబు అయ్యాడు. అతడు పాలనలోకి వస్తూనే తనచుట్టూ అనేక సవాళ్లు ముసురుకొని ఉండటం గమనించాడు. తూర్పు బెంగాల్ రాయ్ దుర్లభ్ నియంత్రణలో ఉంది. అతడు స్వతంత్రునిగా వ్యవహరిస్తున్నాడు. బీర్‌భుమ్, బర్ద్వాన్, నదియా రాజులు కూడా తమకు ఏవిధంగాను రెవిన్యూ (రాజస్వము) సమకూర్చటంలేదు. నవాబు ఆగ్రహానికి గురికాగలమని అనుమానించే వ్యాపారులు, జమీందారులు ఆంగ్లేయుల కోటలో చేరి అక్కడ రక్షణ పొందుతున్నారు.

కాబట్టి రాజ్యవ్యవహారాలను చక్కదిద్దే ప్రయత్నంలో భాగంగా సిరాజుద్దౌలా తాను గద్దెనెక్కిన రెండు నెలలకే ఆంగ్లేయులకు కొన్ని ఆదేశాలు జారీచేశాడు. కందకాన్ని పూడ్చివేయటము, ఎత్తు పెంచిన కోటగోడలను కూల్చివేయటమూ వాటిలో ముఖ్యమైనవి. ఆ ఆదేశాలను పాటించకపోతే, తన రాజ్యంనుండి గెంటివేయగలనని హెచ్చరించాడు.

సిరాజుద్దౌలా కొలువులోని అధికారులు ఆంగ్లేయుల వ్యవహారశైలి గురించి ఫిర్యాదు చేస్తుండేవారు. ఎంతో తలబిరుసుగా, తమ ఆదేశాలను ధిక్కరిస్తూ వ్యవహరించటమేగాక, అధికారాలను గుంజుకొంటున్నారని, హింసకు పాల్పడుతున్నారని, కాబట్టి ఆంగ్లేయులను అదుపుచేయడానికి సమగ్రమైన చర్యలు తీసుకోవాలని వారు మొరపెట్టారు. ఈ వ్యవహారాన్ని ఎత్తిచూపే ఘటన ఒకటి జరిగింది. రాయ్‌దుర్లభ్ కుమారుడు 53 లక్షల విలువైన సొమ్ముతో ఢాకానుండి తప్పించుకొనివచ్చి ఆంగ్లేయుల రక్షణలో ఉంటున్నాడు. ఈ విషయం మాట్లాడడానికి నవాబు ఒక ప్రతినిధిని ఆంగ్లేయుల స్థావరానికి పంపగా, ఒక బ్రిటీష్ అధికారి అతడిని చాచి లెంపకాయ కొట్టాడు. కలకత్తా బయటకు త్రోసేశాడు. అతడు మూర్షిదాబాద్‌కు వచ్చి- "వ్యాపారంకోసం వచ్చినవాళ్లు, ముద్దికదుక్కోవటం నేర్చుకోనివాళ్లు మీ రాయబారిని ఇలా చెంపదెబ్బకొట్టి బయటకు విసిరేస్తే, మీకింకా ఏమీ గౌరవం మిగిలింది?" అంటూ నిష్ఠురంగా మాట్లాడుతూ జరిగింది

వివరించాడు. దానికి మండిపడిన సిరాజుద్దౌలా 1756 జూన్‌లో ససైన్యంగా వెళ్లి కలకత్తాను ఆక్రమించాడు.

## క్లైవు చేతికి అధికార మప్పగించిన ఈస్టిండియా కంపెనీ

ఇది జరుగుతున్న సమయంలో రాబర్ట్ క్లైవ్ బెంగాలులో లేడు. దక్షిణ హిందూస్థానంలో మహారాష్ట్రులతో వివాదపడుతున్నాడు. రెండు సంవత్సరాలు ఇంగ్లాండులో గడిపి మళ్లీ హిందూదేశానికి వచ్చిన క్లైవును 1755లో నిజాంకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటంలో (అప్పుడు ఫ్రెంచి ఈస్టిండియా కంపెనీ సైనికాధికారులలో ఒకడైన బుస్సీ నిజాంకు అండగా ఉన్నాడు) మహారాష్ట్రులకు సహాయంగా పంపబడిన ఆంగ్లసైన్యానికి ద్వితీయస్థానంలో అధికారిగా నియమితుడైనాడు. మద్రాసుకు దగ్గరలో ఉన్న ఫోర్టు సెయింట్ డేవిడ్ నుండి ఆంగ్లసేనలు బొంబాయికివెళ్లి, అక్కడినుండి పుణే వెళ్లి మహారాష్ట్ర సైనికులతో కలసి నిజాం నవాబు ఉండే ఔరంగాబాద్‌కు వెళ్లి–ఫ్రెంచివారితో జతకట్టటం మానుకొనేటట్లుగా చేయాలనేది ఆంగ్లేయుల వ్యూహం. తన పాటవాన్ని ప్రదర్శించు కొనడానికి మంచి అవకాశం లభిస్తున్నదని క్లైవ్ ఉత్సాహపడ్డాడు.

అయితే, అతడు బొంబాయి చేరేసరికి, ఔరంగాబాద్‌ను ముట్టడించే పథకం వదిలివేయబడిందని తెలిసి హతోత్సాహుడయ్యాడు. ఆంగ్లేయుల శంకాకులిత మనస్తత్వం అతడికి చిరాకు పుట్టించింది. మహారాష్ట్రులతో కలిసి దగ్గరలో ఉన్న చిన్న చిన్న కోటలను పట్టుకోవాలన్న ప్రతిపాదన అతనికి నచ్చలేదు. తాను మళ్ళీ ఫోర్టుసెంట్ డేవిడ్‌కి ప్రయాణమయ్యాడు. తనను సైన్యం నుండి తప్పించి, కంపెనీలో వ్యాపారవ్యవహారాలు చూసే సివిల్ బ్రాంచికి పంపవలసిందిగా అభ్యర్థించాడు. అయితే అతడక్కడ బాధ్యతలు స్వీకరించిన వారంరోజుల్లోనే–బ్రిటీషువారు కలకత్తా నుండి గెంటివేయబడ్డారన్న వార్త వచ్చింది. తప్పించుకు పారిపోతూ పట్టువడినవారు ఒక ఇరుకైన భూగర్భగృహంలో నిర్బంధింపబడగా, ప్రాణవాయువు లభించని స్థితిలో పెద్ద సంఖ్యలో వారు మరణించారన్న వార్త (దీనిని బ్లాక్ హోల్ సంఘటనగా పేర్కొంటారు) కూడా వచ్చింది. దుఃఖము, ఆవేశమూ తన్నుకురావటమేగాక, సిరాజుద్దౌలాపై పగతీర్చుకోవాలన్న ఆకాంక్షతో ఆంగ్లేయులు రగిలిపోయారు.

కలకత్తాను తిరిగి స్వాధీనం చేసుకోవటమే, తనకు, తమ జాతికి కీర్తిప్రదం కాగలదని భావించిన క్లైవు మద్రాసుకు వెళ్లి, కంపెనీ అధికారులలో తనకు మిత్రుడైన రాబర్ట్ ఓర్మ్‌ను కలిసి, తనకు ఆ కార్యాన్ని అప్పగించేటట్లు చూడవలసిందిగా

అభ్యర్థించాడు. అడ్మిరల్ జేమ్స్ వాట్సన్‌తోపాటుగా క్లైవ్ జాయింట్ కమాండర్‌గా నియమితుడైనాడు. అక్టోబరు 1756లో వారున్న నౌకలు కలకత్తా దిశగా పయనించ నారంభించినవి. జరిగిన దానికి బాగా పగబట్టి, పగతీర్చుకోవాలన్న కదనోత్సాహం ఉన్నవారే ఆ నౌకల్లో ఉన్నారు. వారు మొత్తం 784 మంది. బెంగాల్లో కుదురుకొని వ్యాపారం చేసుకొనడానికి గతంలో మొగలు పాదుషా ఇచ్చిన సనద్ (అనుమతిపత్రా)ల ప్రతులు క్లైవు తనవెంట తీసికొని వెళ్లాడు. తాము ఏది చేసినా అది మొగలు పాదుషాలు కోరినదే అని చెప్పటం ఆంగ్లేయుల శైలి.

1757 జనవరి 2న కలకత్తా మరల ఆంగ్లేయులకు హస్తగతమైంది. అక్కడికి 20 మైళ్లు ఉత్తరంగా ఉన్న హుగ్లీరేవు పట్టణానికి కూడా ఆంగ్లేయులు దూసుకుపోయారు. అక్కడ ఉన్న నవాబు సైన్యాన్ని ఊచకోతకోశారు. ఆ తర్వాత కొద్దిరోజుల్లోనే నవాబు దిగివచ్చి కంపెనీతో ఒక ఒప్పందం కుదుర్చుకొన్నాడు. ఆంగ్లేయుల ఈస్టిండియా కంపెనీకి బెంగాలులో ఏవిధమైన పన్నులూ చెల్లించకుండా వ్యాపారం చేసుకొనేహక్కు, నాణెములను ముద్రించే హక్కూ గుర్తించటమేగాక, యుద్ధం కారణంగా ఆంగ్లేయులకు వాటిల్లిన నష్టాన్ని పూడ్చేందుకు తగిన పరిహారం చెల్లించేందుకు కూడా అంగీకరించాడు. అలా గతంలో లేని హక్కులు కూడా ఇప్పుడు వారు సంపాదించుకోగల్గినారు.

సిరాజుద్దౌలా ఈవిధమైన ఒప్పందం కుదుర్చుకొనడానికి అప్పటికి ఆంగ్లేయుల దృష్టికిరాని ఒక ముఖ్య కారణముంది. నాదిర్షా మొగలు సామ్రాజ్యంపై దండయాత్రచేసి బాగా దోచుకుపోయిన దరిమిలా, పర్షియా, ఆఫ్ఘనిస్థాన్‌లలో ఉన్న చాలామందికి అటువంటి సాహసకృత్యాలు తామూ చేయాలన్న ఆకాంక్ష ప్రబలింది. అలాంటివారిలో అహ్మద్ షా దుర్రానీ ఒకడు. 1748 నుండి 1767 వరకూ గల 20 సంవత్సరాలలో 7 పర్యాయాలు అతడు హిందూస్థానంలోకి వచ్చిదోచుకున్నాడు. వాటిలో హిందూస్థానంలోని మొగలాయీ పాలకులను, వారి సామంతులను లేదా సుబేదార్లనూ బాగా ఒణికించినదాడి 1756 చివరి నెలల్లో 1757 తొలినెలలో జరిగినది. అహ్మద్ షా దుర్రానీ బెంగాలు వరకూ వస్తే ఎలా? అని సిరాజుద్దౌలా భయపడ్డాడు. బ్రిటీష్‌వారిని తనకు దోస్తులుగా చేసుకొంటూ ఒక ఒప్పందం కుదుర్చుకోవటం మంచిదిగదా! అని భావించాడు.

రాబర్ట్ క్లైవ్ మద్రాసు నుండి బైలుదేరిన కొద్ది రోజులకు 225మంది సోల్జర్లతో కూడిన మరొక నౌక కార్నెల్లీ నాయకత్వంలో బయల్దేరి, మార్గమధ్యంలో చిల్లుపడి,

విశాఖపట్నం సమీపంలో నిలిచిపోయింది. దానిని బాగుచేయించుకొని 1757 మార్చి 1న అక్కడినుండి బైలుదేరి బెంగాలు చేరుకొనే సమయానికి ఆంగ్లేయులకు, ఫ్రెంచివారికీ మధ్య పోరు రాజుకుంది. క్లైవు నేతృత్వంలోని సైన్యాలకు కార్నెల్లీ నాయకత్వంలోని సైన్యం కూడా తోడైంది. ఇంగ్లీషువారిది పైచేయి అయ్యింది. ఇంగ్లీషువారిని సంతోషపెట్టాలని ఆరాటపడుతున్న సిరాజుద్దౌలా పాత ప్రత్యర్థులపై విజయం సాధించినందుకు వారిని అభినందించి, ప్రశంసించాడు.

## సిరాజుద్దౌలాలో రగిలిన ప్రతీకారేచ్ఛ

పరస్పరం సర్దుకుపోతూ, సహకరించుకొంటూ ప్రయోజనం పొందాలని ఎంతగా అనుకున్నా, అంతర్గతంగా ఉన్న ప్రతీకారాగ్ని ప్రజ్వరిల్లుతునే ఉంది. పైలా పచ్చీసు వయస్సులో ఉన్న సిరాజుద్దౌలా అంతకుముందు తమకు జరిగిన అవమానాలను మరిచిపోలేకపోయాడు. కలకత్తాను మరల విముక్తం చేయవలసిందేనన్న నిశ్చయానికి వచ్చాడు. అయినా మొగలు దర్బారు అలవాటుచేసిన కొన్ని మర్యాదలు పాటించేవానిగా, 'మీరు వ్యాపారంకోసం వచ్చినవారు, అది గుర్తుంచుకొని వ్యవహరించండి' అని ఒక రాజనీతిజ్ఞునిగా తాను వారికి సలహాయిస్తున్నట్లుగా కొన్ని పత్రాలు పంపాడు. వ్యాపారస్థులుగా వారు చేసిన వాగ్దానాలను నిలుపుకోగలరని ఆశించాడు. ఒక లేఖలో 'మహారాష్ట్రులు మీవలె (గ్రంథంలోని) దైవాన్ని విశ్వసించేవారు కాదు; అయినా వారు ఒప్పందాలను చాలా చక్కగా పాటిస్తారు' మరి జీససుక్రీస్తు, దైవముల సమక్షములో కుదిరిన ఒప్పందాన్ని, సువార్తచే ప్రబోధితులైన మీరు ఉల్లంఘించకుండా పాటించవలసి ఉంది కదా!' అని వ్రాశాడు.

కాని ఆంగ్లేయులు ఏవిధమైన హితోక్తులుగానీ వినడానికి సిద్ధంగా లేరు. గతంలో జరిగిన పరాభవాన్ని, ఇటీవలి పరాజయాల్ని అధిగమించి ముందుకు పోవాలంటే, పెద్ద ఎత్తున బలప్రయోగానికి దిగటమే ఏకైకమార్గమనే లెక్కలో ఉన్నారు. ఇంతకుముందే చెప్పుకొన్నట్లుగా పోప్ 250 సం॥ల క్రిందట ఇచ్చిన ఆదేశములు, బ్రిటీషు ప్రభుత్వం తమ వెనుక ఉంటుందని రాజకుటుంబం రాయల్ చార్టర్స్‌ద్వారా ఇచ్చిన ఆశ్వాసన, అమెరికా ఖండంలో సంపాదించిన అనుభవమూ–ఇవన్నీ కలిపి వారిని ఆగ్రహావేశ పరవశులను చేశాయి. నవాబు తరఫున ఎవరు తమను కొద్దిగా చిన్నబుచ్చినా, అదుపుచేయబూనినా, తమకేదో

పెద్ద అవమానము, ఈసడింపు జరిగిపోయినట్లుగా ఊహించుకొని, శత్రుకృత తిరస్కారం సహించేది లేదు అంటూ ఊగిపో నారంభించారు.

మరోవైపున సిరాజుద్దౌలా వ్యవహారశైలి కొన్ని లోటుపాట్లతో కూడినదై స్థానిక సమాజంలో అతనికి మిత్రులులేని స్థితికి నడిపించింది. 1757లో పాట్నాలోని వ్యాపారులు సిరాజుద్దౌలాను వదిలించుకోవాలని మంతనాలు చేయనారంభించారు. వారు రాయ్‌దుర్లభ్‌తోను, రాజధాని ముర్షీదాబాద్‌లో ఉన్న అధికారులతోనూ ఈ విషయమై రహస్యంగా చర్చించటం మొదలుపెట్టారు. జగత్‌సేఠ్ అని పిలువబడే షావుకార్లు (బ్యాంకర్స్) ఈ మంతనాలకు మూలపురుషులు. తమ వ్యాపారం వృద్ధి చెందడానికి అవసరమైన భద్రత కల్పించటంలో సిరాజుద్దౌలా విఫలమైనాడని వారు భావించారు. బ్రిటీషు ఈస్టిండియా కంపెనీవారి తెలివితేటలను, ఎటువంటి స్థితినైనా తమకు అనుకూలంగా మార్చుకోగల వారి ఎత్తుగడలను, వారివద్ద గల ఆయుధ సంపదను, ధనబలాన్ని గుర్తించి, వారి సహకారం సమకూర్చుకొంటే, తమ ప్రయత్నం సులభంగా నెరవేరగలదని అంచనా వేశారు.

### ఇరువైపులా జోరుగా సాగిన కుతంత్రాలు

1757 మేలో తిరుగుబాటు చేయదలచిన ముఖ్యులు ముర్షీదాబాద్‌లో ఉన్న కంపెనీ ప్రతినిధి విలియంవాట్స్‌ను కలిసి, సిరాజ్‌కి వ్యతిరేకంగా తమకూటమిలో చేరవలసిందిగా కోరారు. మొత్తంమీద నాటి పరిస్థితి ఎలా ఉందంటే, ఆంగ్లేయుల కంపెనీ భాగస్వామిగా చేరకపోయినా, తిరుగుబాటు కుట్ర జరిగిఉండేది. వ్యాపారులు కుట్ర చేయకపోయినా, బ్రిటీషువారు ఫ్రెంచిస్థావరమైన చంద్రనగొర్‌పైకి, ఆ తర్వాత ప్లాసీ (ఆ నగరం పేరు పలాశీ- ఆంగ్లేయులు ప్లాసీ అని వ్యవహరించారు) లోకి దూసుకుపోయే దుస్సాహసాన్ని చేసిఉండేవారే. కాగా ఆ ఉభయశక్తులూ ముందుగా మాట్లాడుకోవటంతో నవాబును తొలగించిన తర్వాత అతని స్థానంలో ఎవరిని గద్దె నెక్కించాలనే విషయంలో స్పష్టత వచ్చింది. సిరాజ్ ఎంతగా అసహ్యించుకో బడుతున్నాడో, అంతగా అందరిచేత గౌరవింపబడుతున్న వ్యక్తిగా, సైన్యాలకు జీతాలనిచ్చే దివాన్ మీర్‌జాఫర్ కనిపించాడు. అతడిని కలుపుకొంటే, సైన్యంలోనూ తమకు అనుకూలురు లభిస్తారు. ఈ విషయాలన్నీ కంపెనీకి చెందిన కలకత్తా కౌన్సిల్ క్షుణ్ణంగా చర్చించి ప్రభుత్వంలో విప్లవం సాధించి తీరాల్సిందేనని నిర్ణయించింది.

19 జూన్ 1757న క్లైవ్, వాట్సన్ తమ బలగాలను వెంటతీసుకొని చంద్రనగొర్ నుండి ఉత్తరదిశగా ముందుకు నడిచారు. క్లైవ్ నేతృత్వంలో ఉన్న 3000 మందిలో 784 మంది బ్రిటీషు సోల్జర్లు (171 మంది ఫిరంగిదళానికి, 613 మంది కాల్బలానికి చెందినవారు) వారందరూ ప్రతీకారం తప్ప మరేదీ సంతృప్తిని కలిగించజాలదనే పట్టుదలతో ఉన్నారు. బెంగాలు రాజధానికి 40 మైళ్ల దూరంలో ఉన్న కట్వా అనేచోటకు చేరారు. అంతకుముందు 1740లో మహారాష్ట్రులు సైనికశిబిరం నిర్వహించుకొన్న స్థానమది. మహారాష్ట్రులు అక్కడికి రానున్నారని వార్త రావటంతో, వారు వచ్చేవరకు ఆగి, వారితో కలిసి ముందుకు నడిస్తే మంచిదికదా, అన్న ఆలోచన వచ్చింది. (అప్పటికి 6 సం॥ల క్రిందట ఆర్కాట్ యుద్ధంలో మహారాష్ట్రులు, ఆంగ్లేయులు సహకరించుకున్నారు గదా!) మీర్ జాఫర్ సైన్యాలు ఎక్కడ ఉన్నాయో, ఏమేరకు సహకరించగలవో, స్పష్టంగా తెలియని ఆ స్థితిలో ముందుకుపోయే విషయమై తర్జనభర్జనలు జరిగాయి. 21 జూన్ సాయంత్రం జరిగిన సమావేశంలో మహారాష్ట్రుల తోడ్పాటులేకుండా ముందుకు పోరాదని 12:6 తేడాతో నిర్ణయించారు. అయితే ఈ నిర్ణయం తీసుకున్న ఒక గంటకే క్లైవు ఆలోచన మారిపోయింది.

ఆ మరునాడు బాగా ఎండకాసింది. అది తగ్గుముఖం పట్టాక రాత్రికి రాత్రి ఫలాశీ (15 మైళ్ల దూరం) చేరుకొనేవిధంగా ముందుకు నడవాల్సిందిగా సైనికులను క్లైవ్ ఆదేశించాడు. రాత్రి 3 గం॥లయ్యేసరికి వారు సిరాజుద్దౌలా సైన్యాలకు అభిముఖంగా ఒక మామిడితోటలో విడిశారు. కొద్ది సంఖ్యలోనే ఉన్న ఆ బ్రిటీషు కంపెనీ సైన్యాలను చుట్టుముట్టి ఫిరంగులతో పేల్చివేయాలని సిరాజుద్దౌలా అనుకున్నాడు. కాని అతని సైన్యంలో నాల్గింట మూడు భాగాలుగా ఉన్న మీర్‌జాఫర్ దళాలు పోరాడడానికి నిరాకరించాయి.

చీకటిపడే వరకు ఆగి, ఒక్కసారి ఆకస్మాత్తుగా దాడి చెయ్యాలని క్లైవు పథకం. ఆరోజు మధ్యాహ్నం వర్షం కురిసింది. ఫిరంగులు ప్రేల్చడానికి ఉపయోగించే మందును పొడిగా ఉంచుకోవటంలో సిరాజుద్దౌలా సైన్యం శ్రద్ధవహించలేదు. కంపెనీ సేనలు మాత్రం జాగ్రత్తపడి చెమ్మచేరకుండా ఉంచుకున్నాయి. క్లైవ్ తడిదుస్తులనుండి పొడి దుస్తులు మార్చుకోడానికి వెళ్లినపుడు నవాబుసైన్యం ముందుకు నడిచింది. జవాబుగా బ్రిటీషువారివైపు నుండి ఫిరంగులు ప్రేలటం ఆరంభించాయి.

తాను లేకుండానే తన తర్వాత అధికారి యుద్ధం ఆరంభించినందుకు క్లైవు మొదట కోపగించినా, వెంటనే సర్దుకొని యుద్ధంలో ముందుకు సాగడానికి తోడ్పడ్డాడు.

తన సైనికులలో అత్యధికులు కదలకపోవటం గమనించిన సిరాజుద్దౌలా, వర్షాన్ని తిట్టుకొంటూ, యుద్ధం మరోరోజు చేయవచ్చుననుకొంటూ, మూర్షిదాబాద్ వైపు నడవవలసిందిగా సూచించాడు. కాని భీతిచెందిన ఆ సైనికులు కకావికలై తలా ఒక దిక్కుకు పారిపోయారు.

## వెంటవెంటనే క్రొత్తనవాబులు-మీర్‌జాఫర్, మీర్ కాశిం, మళ్ళీ మీర్‌జాఫర్

క్లైవు సైనికులు మూర్షిదాబాద్ వరకు ముందుకు సాగిపోయారు. అక్కడ ప్రశాంత వాతావరణంలో నగరాన్ని చేజిక్కించుకొని విరాజిల్లుతున్న మీర్ జాఫర్ దర్శనమిచ్చాడు. జూలై 1న క్లైవు దగ్గరుండి మీర్‌జాఫర్‌ను గద్దెపై ఆసీనునిచేయగా, ఆ మరునాడు కొత్త నవాబు కుమారుని చేతిలో హతుడైన సిరాజుద్దౌలా భౌతికకాయం కనిపించింది. మీర్ జాఫర్ బెంగాలును చక్కగా పరిపాలించగలడని, అతడిని బెంగాలు నవాబుగా గుర్తించాలని కోరుతూ ఢిల్లీలోని మొగలు పాదుషాకు క్లైవ్ ఉత్తరం వ్రాసాడు.

ధనం కోసం ఆంగ్లేయుల ఒత్తిడి కారణంగానేకాని, తన రాజ్యంలో తన సైన్యాన్ని పోషించుకొనడానికి అవసరమైన ఆదాయాన్ని సమీకరించజాలని ఆశక్తత కారణంగానేగాని మీర్‌జాఫర్ ఎక్కువకాలం నవాబుగా కొనసాగలేకపోయాడు. అనేకమంది ఇంగ్లీషువారు తాము కంపెనీ తరఫున చేస్తున్నామంటూ, సొంతంగా క్రయవిక్రయాలు చేసేవారు. ఆవిధంగా పన్నులు ఎగ్గొట్టేవారు. స్థానికప్రభువులు నవాబు బలహీనపడటం గ్రహించి వారూ రాజస్వాన్ని చెల్లించటం తగ్గించివేశారు. సైన్యాలకు సకాలంలో జీతాలు చెల్లించని దుస్థితి, వారి గుఱ్ఱాల బక్కచిక్కిన స్థితికి దారితీసింది.

ఆంగ్లేయులకు, మీర్‌జాఫర్‌కి మధ్య ఘర్షణకు కారణమైన అంశం చిట్టగాంగ్ రేవు పట్టణం. ఆ రేవు పట్టణాన్ని, ఆ జిల్లానూ తమకు అప్పగించవలసిందిగా, ఇంగ్లీషువారు మీర్‌జాఫర్‌ని కోరారు. అతడు దానికి నిరాకరించాడు. ఆంగ్లేయులు అక్కడ ఒక ఫ్యాక్టరీ నిర్మించడానికి యత్నించగా, అక్కడి గవర్నరు దానిని అడ్డుకొన్నాడు. 1760 ఫిబ్రవరిలో క్లైవు హిందూదేశం విడిచి ఇంగ్లాండుకు వెళ్లాడు. క్రొత్తగా

బెంగాలుకు వచ్చిన బ్రిటీషు గవర్నరు మీర్‌జాఫర్‌ని తొలగించి, అతని అల్లుడైన మీర్‌ఖాసింను నవాబును చేశాడు. బర్ద్వాన్, మిద్నపూర్ (మేదినీపూర్) జిల్లాల్లో పన్నులు వసూలుచేసుకొనే అధికారం కంపెనీకి ఇస్తానన్న హామీతో మీర్‌ఖాసిం నవాబు అయ్యాడు. మీర్ జాఫర్ గద్దె వదిలిపెట్టి కలకత్తాకు పారిపోయాడు. 1760 అక్టోబరులో గద్దెనెక్కిన మీర్‌ఖాసిం కోశాగారం ఖాళీగా ఉండటం గమనించి నిర్ఘాంతపోయాడు.

సైనికులకు జీతాలివ్వలేనిస్థితి, కోశాగారానికి ఆదాయాన్ని సమీకరికంచలేని స్థితి కొనసాగుతూ ఉంది. ఆంగ్లేయుల ఈస్ట్ ఇండియా కంపెనీని కట్టడి చేస్తేగాని, తన అధికారం సాగదని గ్రహించిన మీర్‌ఖాసిం ఇతర యూరోపియన్ కంపెనీలకు, ఇతర వ్యాపారులకు-అందరికీ పన్నులు చెల్లించ నవసరంలేని వ్యాపారానికి అవకాశమిచ్చాడు. నవాబుగారి దగ్గర సైన్యాలు లేని స్థితిలో ఆయనమాట వినేవా రెవరు? మీర్‌ఖాసింను పదచ్యుతుని చేయడానికి ఇంగ్లీషువారి కంపెనీ సైన్యాలు మరోసారి ముర్షిదాబాద్ వైపు నడిచాయి-తామే స్వయంగా కూర్చొనబెట్టిన నవాబుకు వ్యతిరేకంగా. ఇది గ్రహించిన మీర్‌ఖాసిం తన దగ్గర ఉన్న కొద్దిపాటి సైన్యాన్ని తీసుకొని బిహారులోని మాంఘీర్‌కి రాజధానిని తరలించాడు. ప్రవాసంలో ఉన్న మొగలు పాదుషా రెండవ షా ఆలంతో జట్టుకట్టాడు. దారిలో అడ్డంవచ్చిన ఇంగ్లీష్ కంపెనీ అధికారులను సంహరించుకొంటూ పోయాడు.

**బకసార్ యుద్ధం-అలహాబాద్ సంధి - ఆంగ్లేయుల చేతిలో బెంగాల్**

1754లో పాదుషా అయిన 2వ ఆలంగీర్ ఆఫ్ఘనిస్థాన్ నుండి వచ్చిన ఆక్రామకుల చేతిలో 1759లో హతుడైనాడు. ఢిల్లీ సంగ్రామ రంగమైంది. మొగలు తక్తుకు వారసులమని చెప్పుకొనేవారిలో కొందరు ఆఫ్ఘనులను, మరికొందరు మహారాష్ట్రులను ఆశ్రయించారు. మహారాష్ట్రులు ఢిల్లీలో తామే చక్రం త్రిప్పటం ఎలా అని ఆలోచించి, రెండవ ఆలంగీర్ కుమారుడైన 2వ షా ఆలంను పాదుషాగా ప్రకటించారు (1759 డిసెంబరు). 1761లో పానిపట్టులో జరిగిన యుద్ధంలో మహారాష్ట్రులు బాగా నష్టపోయారు. 'ప్రపంచానికి రక్షకుడు' అని కీర్తింపబడే పాదుషా మరోమార్గం కానరాక ప్రవాస ప్రభుత్వం నడుపడానికై తూర్పుదిక్కుగా పారిపోయాడు.

అప్పటివరకు అయోధ్య నవాబు మద్దతులో ప్రవాసప్రభుత్వం నడుపుతున్న రెండవ

షా ఆలంకు ఇంగ్లీషు కంపెనీతో వైరం తెచ్చుకున్న మీర్‌ఖాసిం జతకలవటంతో వారు ముగ్గురు-అయోధ్య నవాబు, రెండవ షా ఆలం, మీర్‌ఖాసిం-ఇంగ్లీషువారిని కట్టడి చేయడానికి కలకత్తావైపుగా తమ సైన్యాలను నడిపించారు. కంపెనీ తమ సైన్యాలను పడమర దిశగా,, పై ముగ్గురి సేనలకు ఎదురునడిపించింది. బకసార్ వద్ద (1764 అక్టోబరులో) యుద్ధం జరిగింది. ఆంగ్లేయుల కంపెనీ నేరుగా మొగలులతో చేసిన 2వ యుద్ధమైనందున దీనికి చరిత్రలో ప్రాధాన్యం లభించింది. అంతక్రితం జరిగిన మొదటి యుద్ధానికి భిన్నంగా ప్రత్యర్థులు సమస్థాయిలో యుండి భారీగా ఇరువైపులా నష్టపోయిన యుద్ధమిది. బ్రిటీషువారి తరపున యుద్ధంలో పాల్గొన్న 7వేల మందిలో నాల్గవవంతు నిహతులైనారు, లేదా తీవ్రంగా గాయపడ్డారు. ఏమైతేనేమి, విజయం ఆంగ్లేయుల కంపెనీకి దక్కింది.

మీర్‌ఖాసిం అయిపులేకుండా పోయాడు. ఆంగ్లేయులు కలకత్తాలో నివసిస్తున్న మీర్‌జాఫర్‌ని తీసికొని వచ్చి మళ్లీ నవాబును చేశారు. అతడు చిట్టగాంగ్, మిద్నపూర్ (మేదినీపూర్) నదియా జిల్లాలను ఆంగ్లేయులకు ధారపోశాడు.

అయోధ్య నవాబు షుజాఉద్దౌలా, మొగలు పాదుషా 2వ షా ఆలంలు 1765లో అలహాబాద్‌లో ఆంగ్లేయులతో సంధి చేసుకున్నారు. ఆ సంధి పర్యవసానంగా షుజాఉద్దౌలా యుద్ధానికి నష్టపరిహారంగా 50లక్షల రూపాయలు చెల్లించాడు. కారా, అలహాబాద్‌లను మొగలుపాదుషా 2వ షా ఆలంకు అప్పగించాడు (ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ రక్షణతో 2వ షా ఆలంకు ఆలహాబాద్ నివాస స్థానమైంది)

ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ ఏటేటా 26లక్షల రూపాయలు మొగలు పాదుషాకు చెల్లించేవిధంగా బెంగాలు, బీహారు, ఒరిస్సాల దివానీ హక్కులు (పన్నులు వసూలు చేసుకొనుట, క్రింది కోర్టులలో తీర్పు చెప్పు అధికారులను నియమించుట) కంపెనీకి అప్పగించబడినవి.

ఈవిధంగా బెంగాలు (బీహారు, ఒరిస్సాలతోసహా) విశాల ప్రాంతాలపై ఇంగ్లీషువారి అధికారానికి మొగలు సామ్రాజ్యం గుర్తింపు లభించింది. ఆంగ్లేయులకు మహారాష్ట్రులనుండి, వాయవ్యం నుండి రాగల విదేశీ దండయాత్రలనుండి రక్షణ నివ్వగల మధ్యవర్తి రాజ్యంగా అయోధ్య నవాబు పాలిత ప్రాంతం ఆసరాగా నిలిచింది. దక్షిణ భారతంలో నిజాం నవాబు కోస్తా ఆంధ్రప్రాంతంలోని ఉత్తర సర్కార్లను అంతకుముందే ఆంగ్లేయులకు అప్పగించగా, మొగలు పాదుషా 2వ షా

ఆలం దానికీ అంగీకారం తెలిపాడు. ఆవిధంగా విశాలమైన బెంగాలు ప్రాంతానికి, ఉత్తర కోస్తా ఆంధ్రప్రాంతానికి ఇంగ్లీషు ఈస్ట్ ఇండియా కంపెనీవారు పాలకులయ్యారు.

బెంగాలులో ఇంగ్లీషువారు నెలనెలా పన్నులు వసూలుచేసే పద్ధతి ప్రవేశపెట్టారు. అది అప్పటివరకూ ఉన్న పద్ధతికి పూర్తిగా భిన్నమైనది, రైతుల తాహతుకు మించినది కావటంతో-కొద్దికాలంలోనే బెంగాలు రూపమే మారిపోయింది. పన్నులు చెల్లించలేనివారిని శిక్షించడానికి అన్నట్లుగా ఇంటిలోని బంగారం, వెండి లోహాలను, ఇత్తడి రాగి పాత్రలను, నాగళ్లను, తీసికొనిపోవటమేగాక, ఎద్దులనూ తోలుకొని పోయారు. అంతేకాదు ఇండ్లకు ఉండే ద్వారబంధాలను కూడా పీక్కొని తీసుకొని పోయారు. అలా ప్రజానీకాన్ని తినడానికి తిండిలేనివారుగా, ఉండడానికి ఇల్లులేనివారుగా, కట్టుకొనడానికి గుడ్డలేనివారిగా చేయటమేగాక, మహమ్మారి రోగాలకు, కఱవులకు బలిఅయ్యేట్లుగా చేశారు. ఈ వివరాలు కూడా ఈ గ్రంథంలోని వివిధ అధ్యాయాలలో వివరంగా ఇవ్వబడినవి.

## References

1. Jon Wilson, India Conquered, 2016.
2. R.C. Majumdar (ed), The History and Culture of The Indian People, vol ix-x Bharatiya Vidya Bhavan, Mumbai, 2017.



# 3

# ప్లాసీ విజయంతో పారిశ్రామిక విప్లవం-బెంగాల్ అధోగతి

పాశ్చాత్య క్రైస్తవదేశాల వలసపాలనకు, క్రైస్తవ సామ్రాజ్యాల విస్తరణకు కాథలిక్ మతపెద్దలు ఎప్పుడూ వెన్నుదన్నుగా నిలిచేవారు. క్రైస్తవ దేశాల సామ్రాజ్యవాదానికి కాథలిక్ చర్చి రాజకీయ, నైతిక, సైద్ధాంతిక మద్ధతును 1100ల సంవత్సరం నుండి ప్రకటిస్తునే ఉంది. క్రైస్తవేతరులపై దాడిచేసి, వారి భూభాగాలను కబ్జాచేసి, వారందర్నీ భయపెట్టిగాని, ప్రలోభ పెట్టి గాని క్రైస్తవులుగా మార్చి క్రైస్తవ రాజ్యవిస్తరణకు పూనుకొమ్మని ప్రబోధిస్తునే ఉంది (Doctrine of Discovery). క్రైస్తవ మతాధినేతలు యిచ్చిన అటువంటి ఆదేశాలలో రెండు అతిముఖ్యమైనవి. 1455లో పోప్ నిఖిలస్ పోర్చుగల్‌కు ఆఫ్రికాతో వ్యాపార సంబంధాలు నెరపటానికి గుత్తాధిపత్య హక్కును యిచ్చాడు. అంతేకాక అక్కడి నల్లజాతీయులను వేటాడి, బానిసలుగా పట్టుకొని, వారిని విక్రయించటానికి క్రీస్తు పేరుతో అనుమతిని యిచ్చాడు. నల్లజాతీయుల కష్టాలకు, దయనీయస్థితికి, వారిపై సాగించిన అమానుషకృత్యాలకు పోప్ నిఖిలస్ యిచ్చిన ఆదేశాలు, అనుమతులు, హక్కులు ప్రధానకారణం. పోప్ అలెగ్జాండర్ 1493లో యించుమించుగా అటువంటి హక్కులనే స్పెయిన్‌కు దఖలు పర్చాడు. పడమటి అర్ధగోళంలోని దేశాలపై తిరుగులేని అధికారాన్ని స్పెయిన్‌కు యిచ్చాడు. ఆసియా, ఆఫ్రికా, ఐరోపా ఖండాలను 'పాతప్రపంచమని' పడమటి అర్ధగోళంలోని ఉత్తర దక్షిణ అమెరికా ఖండాలను 'కొత్త ప్రపంచమని' అని ఆనాడు పిలిచేవారు. ఆ కొత్త ప్రపంచంలోని దీవులు, భూభాగాలు, నదులు, గనులు, కొండలు, అడవులు, జాతులపై సర్వాధికారాలు స్పెయిన్‌కు పోప్ అలెగ్జాండర్ కట్టబెట్టాడు. వారు కనుగొన్న ద్వీపాలు, ద్వీపకల్పాలు, భూభాగాల పైన మాత్రమే కాదు, సమీప భవిష్యత్తులో కాని, సుదూర భవిష్యత్తులో కాని 'కనుగొనబోతున్న' అన్నిటిమీద క్రైస్తవదేశాలకు పూర్తి హక్కుభుక్తాలు ఉన్నాయని పోప్ అలెగ్జాండర్ ప్రకటించాడు. అయితే అవి క్రైస్తవేతరులకు చెందినవై ఉండాలి.

క్రైస్తవ దేశానికి చెందిన ఏ నావికుడైనా, భూభాగాల అన్వేషకుడైనా ఏదైనా ఒక భూభాగాన్ని కనుగొంటే, ఒక క్రైస్తవ చక్రవర్తి పేరుతో కనుగొన్నానని ప్రకటించి, ఆభూమిపై జెండా పాతితే, ఆ భూభాగం ఆ రాజ్యానిదే అవుతుంది. అతను చేయవలసిందిల్లా ఆ సమాచారాన్ని చక్రవర్తికి అందించి తిరిగిరావటం. ఆ భూభాగంలో అంతకు ముందు ఎవరైనా నివసిస్తున్నా కూడా ఆభూమి క్రొత్తగా కనుగొని అడుగు పెట్టినవారిదే అవుతుంది. ఆ భూభాగంపై ఎప్పటినుండో ఉంటున్నవారికి ఎటువంటి హక్కు ఉండదు. క్రైస్తవుడు జెండా పాతిన తర్వాత ఆభూభాగంలో నివసిస్తున్న ఆదివాసులు ఆపై స్వంతదారులు కాబోరు. క్రైస్తవుల దయాదాక్షిణ్యాలపై మాత్రమే వారు అక్కడ కాలంగడపవలసి ఉంటుంది. వారిని సామూహికంగా చంపి, వారి ఆస్తులను, భూములను, వనరులను స్వంతం చేసుకొనే హక్కు క్రైస్తవులకు ఉంటుంది. పోప్ నికోలస్, పోప్ అలెగ్జాండర్ ఇచ్చిన ఆదేశాలు, చేసిన ప్రకటనలు, శ్వేత జాతీయులకు ఇతరజాతులవారిపై యిచ్చిన అధికారం తెల్లవారిలో జాత్యంహకారానికి దారితీసింది. క్రైస్తవేతర ప్రపంచాన్ని జయించి, వారి మతసంస్కృతులను ధ్వంసం చేసి, వారిని క్రైస్తవీకరణ చెయ్యటం తెల్లవాడికి దేవుడు యిచ్చిన ప్రత్యేక కర్తవ్యంగా బాధ్యతగా భావించి తాము సాగించిన ఆర్థిక అమానుష దోపిడులకు మత సంబంధమైన ముసుగు తొడిగారు.

ఈ 'డాక్ట్రిన్ ఆఫ్ డిస్కవరీ' ప్రకారం క్రైస్తవులు నివసించని ఏ భూభాగాన్ని అయినా కనుగొనటానికి ద్వారాలు తెరిచారు. కాథలిక్ విశ్వాసాలను, క్రైస్తవమతాన్ని సమున్నతస్థానంలో నిలిపి, మతవ్యాప్తికి వారు పూనుకోవాలి. అక్కడ నివసిస్తున్న 'ఆటవిక' 'అనాగరిక' జాతులను, ప్రజలను క్రైస్తవీకరణ చెయ్యాలి. ఈ సిద్ధాంతం పాశ్చాత్య సామ్రాజ్యవాదానికి ముఖ్యచోదక శక్తిగా పనిచేసింది. 1823లో అమెరికా సుప్రీంకోర్టు ఈ సిద్ధాంతం ప్రకారం కొత్త ప్రపంచంలోని భూములపై పాశ్చాత్యులకు తిరుగులేని హక్కులు లభించాయని, స్థానిక జాతులకు కూడా అక్కడ ఉండే హక్కు మాత్రమే ఉందని, దాన్ని కూడా రద్దు చేయవచ్చని తేల్చిచెప్పింది. పోర్చుగల్, స్పెయిన్‌లతోపాటు ఇంగ్లండ్, ఫ్రాన్స్, బెల్జియం, హాలెండులు కూడా ఈసిద్ధాంతాన్ని ఆధారం చేసుకొని క్రైస్తవేతర దేశాలను తమ పాదాక్రాంతం చేసుకోవటానికి విజయవంతమైన ప్రయత్నాలు చేశారు.

భారతదేశం చేరటానికి సముద్రమార్గాన్ని కనుగొనటానికి క్రిష్టఫర్ కొలంబస్ చేపట్టిన సముద్రయాత్రలు అమెరికాను కనుగొనటానికి దారితీసిన విషయం

అందరికీ తెలిసిందే. సామాన్యశకం 1492, 1493 సంవత్సరాలలో కొలంబస్ కనుగొన్న 'కొత్త ప్రపంచం' నుండి సంపదను కొల్లగొట్టేందుకు స్పానిష్ చక్రవర్తికి పోప్ నుండి అనుమతి లభించటంతో మంది మార్బలం యిచ్చి అమెరికా ఖండంపైకి పంపాడు. దక్షిణ అమెరికా ఖండంలోని వివిధ దేశాల సహజవనరులు, సంపద, అపారంగా లభ్యమవుతున్న బంగారం, వెండి చూసి వారు ఆశ్చర్యచకితులై, వాటిని కొల్లగొట్టేందుకు స్థానికులపై దౌర్జన్యాలకు దిగారు. సంపద కొల్లగొట్టటం మాత్రమే కాదు. ఒక ప్రపంచ ప్రఖ్యాత పురాతన సంస్కృతిని ('మాయన్') సమూలంగా నాశనం చేసారు. ప్రకృతి ఆరాధకులు, విగ్రహారాధకులు, బహుదేవతారాధకులు అయిన 'మాయన్' ప్రజలను బలవంతంగా క్రైస్తవంలోకి మార్చాలనే లక్ష్యం కూడా వారికుంది. అది తమ విధ్యుక్తధర్మంగా భావించి, బలప్రయోగంచేసి స్థానికులను వారి మత, సంస్కృతులనుండి దూరం చేశారు. ఈ విధ్వంసానికి, దోపిడీకి నాయకత్వం వహించిన వారిలో ప్రముఖులు హెర్నాన్ కోర్ట్స్ (Hernan Cortes), ఫ్రాన్‌సిస్కో పిజారో (Francisco Pizarro). కరేబియన్ దీవులపై స్పానిష్ సాహసికులు విరుచుకుపడ్డారు. క్యూబా, పూర్టోరికో, జమైకా, శాంటోడోమింగో దేశాలను ఒకదాని తర్వాత మరొకదాన్ని కబళించి, వారి బంగారు నిల్వలను దోచుకొని స్పెయిన్‌కు చేరవేశారు. 1503 నుండి 1530 వరకు సంవత్సరానికి ఒక టన్ను చొప్పున స్పెయిన్‌కు తరలించటంతో 1530 నాటికి ఆ దేశాల బంగారు నిల్వలు అదృశ్యమయ్యాయి.

16వ శతాబ్దపు మూడవ దశాబ్దంలో వారి డేగకన్ను నేటి మెక్సికో దేశంమీద పడింది. క్రూరత్వానికి, జిత్తులమారితనానికి పేరుగాంచిన హెర్నాన్ కోర్ట్స్ మెక్సికోయొక్క అజ్‌టెక్ నాగరికతను సమూలంగా విధ్వంసం చేశాడు. మెక్సికోకు దక్షిణాన 'పెరూ' దేశంలో ఇంకాస్ (Incas) రాజ్యముంది. వారి దగ్గర అపారమైన బంగారు నిల్వలు ఉన్నాయి. వారు సూర్యారాధకులు. సూర్యుడికి స్వర్ణదేవాలయం కట్టారు. ఆ వార్తలు స్పెయిన్‌కు చేరాయి. ఫ్రాన్‌సిస్కో పిజారో 1531-34 మధ్య 'పెరూ' పై దాడిచేసి, వారి రాజును చంపి, పెరూను కొల్లగొట్టాడు. ఓడలకొద్దీ బంగారం, వెండినిల్వలు స్పెయిన్‌కు తరలించారు. పెరూ జనాభాలో 90 శాతం పాశ్చాత్యులద్వారా సంక్రమించిన మలేరియా, పొంగు, మశూచి వ్యాధులద్వారా చనిపోయారు. మెక్సికో, పెరూ దేశాలను పూర్తిగా కాథలిక్ దేశాలుగా మార్చి, అధికారభాషగా 'స్పానిష్'ను ప్రవేశపెట్టారు. క్రూరత్వం, దోపిడీ, అణిచివేతలలో వారికి వారే సాటి.

ఆంగ్లేయులకు హెర్నాన్ కోర్ట్స్ (Hernan Cortes), ఫ్రాన్సిస్కో పిజారో (Francisco Pizarro) ఆదర్శప్రాయులైనారు. వారు కొల్లగొట్టి, తమవెంట తెచ్చుకొన్న బంగారం, వెండి నౌకలను చూసిన ఆంగ్లేయులు నిద్రపోలేదు. తాముకూడా తమకంటె సంపన్న దేశాలపై పడి వారిసొమ్ము కొల్లగొట్టాలని, వారిమత, సంస్కృతులను చిన్నాభిన్నం చెయ్యాలని క్రైస్తవరాజ్యాన్ని విస్తరింపజేయాలని ఉవ్విళ్లూరారు. అందుకే ప్రముఖ ఆంగ్లచరిత్రకారులు థామ్సన్, గారట్‌లు ఆనాటి ఆంగ్లేయుల మనస్తత్వాన్ని ఈవిధంగా వర్ణించారు. "స్పెయిన్‌కు చెందిన హెర్నాన్‌కోర్ట్స్, ఫ్రానిసిస్కో పిజారోలు (మెక్సికో, పెరూలను) కొల్లగొట్టి నౌకలనిండా తమ దేశానికి చేరవేసిన బంగారం ఆంగ్లేయులను నిద్రపోనివ్వలేదు. తాము కూడా అదేవిధంగా (వలసలు ఏర్పాటుచేసుకొని) కొల్లగొట్టాలని వారు తపించారు. అంతే. ఆ తర్వాత బెంగాల్‌కు ప్రశాంతత అనేది లేకుండా పోయింది. దాన్ని పూర్తిగా కొల్లగొట్టిన తర్వాతే, అంటే అది పూర్తిగా వట్టిపోయిన తర్వాతనే బెంగాల్‌కు కొంత ప్రశాంతత చేకూరింది"[1].

ఆంగ్లేయులు తమ అధికారాన్ని విస్తరించుకోవటానికి చేయని నైచ్యము లేదు. ఒడిగట్టని దౌర్జన్యంలేదు. రెండు శతాబ్దాల పాటు భారత్‌ను ఆర్థికంగానూ, రాజకీయం గానూ, సాంస్కృతికంగాను అస్తవ్యస్తం చేశారు. అమెరికా ఖండంలో స్పెయిన్ చేసిన అత్యాచారాలు, దోపిడీనుండే వీరు స్ఫూర్తిని పొందారు. మొదటి జేమ్సు నుండి పరిచయ పత్రంతో 1608లో జహంగీర్ చక్రవర్తి దగ్గరకు మొదటి ఆంగ్లేయుల వ్యాపారబృందం వచ్చింది. విలియమ్ హాకిన్సు ఈ బృందానికి నాయకుడు. ప్రముఖ చరిత్రకారుడు హెచ్. హెచ్. విల్సన్ వారిగురించి చెపుతూ మొదటినుండి వారు క్రూరంగాను, తమవ్యాపార ప్రయోజనాలను కాపాడుకోవటమే లక్ష్యంగానూ పనిచేసేవారని వ్రాశారు. తమ వ్యాపారానికి అడ్డుగా ఉన్నవారిని తొలగించటానికి వారు ఎంతకైనా తెగించేవారు. వీలయితే నేరుగా చంపేవారు. లేకుంటే అపహరించి, తిండి పెట్టకుండా మాడ్చి చంపేవారు. ఇతర పాశ్చాత్య వ్యాపారులను సైతం వారు వదిలేవారుకాదు. వారి ఓడలను ముట్టడించి, సరకును, విలువైన వస్తువులను, బంగారాన్ని దోచుకొనేవారు.[2]

ఒక ఆంగ్ల మతప్రచారకుడు వారి ప్రవర్తనను, భారతీయులకు వారిపట్ల ఉన్న భావాన్ని ఈ విధంగా చెప్పాడు. "(ఆంగ్లేయులలో) చాలామంది హింసాత్మక

చర్యలకు, అవినీతికి, అక్రమాలకు పాల్పడేవారు. హిందువుల, ముస్లింల దృష్టిలో ఆంగ్లేయులు క్రూరజంతువులు. ఆంగ్లేయులవెంటఉన్న వేటకుక్కలకంటె తెల్లదొరలు భయంకరమైనవారని భావించేవారు. దెయ్యాలవలె దెబ్బలాటకు దిగేవారని, తండ్రులను సైతం మోసంచేసేవారని అనుకొనేవారు. వీధుల వెంటపడి కొట్లాటలకు, పదునైన ఆయుధాలు ఉపయోగించటానికి ఎంత సిద్ధంగా ఉండేవారో, ఒక బేలు వస్తువులను కొనటానికి, ఒక సంచెడు రూపాయలను యివ్వటానికికూడా అంతే సిద్ధంగా ఉండేవారు." వారి ప్రవర్తన కారణంగా క్రైస్తవంపట్ల కూడా భారతీయులకు ఏవగింపు ఏర్పడిందని ఆయన ఆవేదన చెందారు.[3]

బెంగాల్ పాలకుడిగా ఉన్న అలీవర్దీఖాన్ బెంగాల్‌లో ఆంగ్లేయుల ఉనికివలన అనేక దుష్ఫలితాలు సంభవించ వచ్చునని అంచనావేసి, వారిని, ఇతర పాశ్చాత్యులను అణచివేయాలని నిర్ణయానికి వచ్చాడు. దురదృష్టంకొద్ది ఆయన తన ప్రణాళికను అమలుచేయకుండానే మరణించాడు. ఆ తర్వాత వచ్చిన నవాబులుసైతం ఆంగ్లేయులను నియంత్రించటానికి ప్రయత్నించారు. అయినప్పటికీ భారత్‌తో వ్యాపారాన్ని కొనసాగించటానికే ఆంగ్లేయులు నిర్ణయించుకొన్నారు. మానాభి మానాలను వారు దూరంగా పెట్టారు. ఎటువంటి నైతికవిలువలు, ప్రమాణాలు వారికి లేవు. మొదటినుండి వ్యాపారంతోపాటుగా దోపిడీ (Plunder)ని కూడా జతచేసారు. వాస్తవానికి ఈస్టిండియా కంపెనీ ఒక వ్యాపారస్థుల సంస్థకాదు. అదొక దుస్సాహసికులసంస్థ. ఆడమ్స్ వంటి పండితులు వారిని వ్యాపారులుగా ఎప్పుడూ పరిగణించలేదు. వారిని 'సముద్రపుదొంగలు' (Pirates) అని, 'బక్కనీర్లు' (Buccaneers) అని పిలవటానికే యిష్టపడేవారు. జె.ఎమ్.కీన్సు ప్రఖ్యాత ఆర్థికవేత్త. సామ్రాజ్యవాదానికి గట్టి మద్దతుదారుడు కూడా. ఆయన సైతం ఈ ఆంగ్లవ్యాపారుల (దోపిడీదొంగల) గురించి ఈవిధంగా వ్యాఖ్యానించక తప్పలేదు.

"డ్రేక్ తన 'గోల్డెన్ హింద్' నౌకలో దోచుకొచ్చిన సంపద విలువ ఆరులక్షల పౌండ్లు. ఆంగ్లేయుల విదేశీ పెట్టుబడులకు మూలం, ప్రేరణ ఆ సంపదనుండే కలిగాయి. ఎలిజబెత్ రాణి ఆ సొమ్ముతో తన మొత్తం విదేశీ ఋణాలను తీర్చివేసి, 42 వేలపౌండ్లను 'లెవాంట్ కంపెనీ'లో పెట్టుబడిపెట్టింది. లెవాంట్ కంపెనీ లాభాలనుండే ఈస్టిండియా కంపెనీ పుట్టుకొని వచ్చింది. అది 17,18 శతాబ్దాలలో ఆర్జించిన లాభాలే ఇంగ్లండు విదేశాలలో పెట్టిన పెట్టుబడులకు కారణం అయ్యాయి."[4]

1580లో పెట్టిన 42 వేల పౌండ్ల పెట్టుబడి 1700 నాటికి 25 లక్షల పౌండ్లు అయింది. ఈస్టిండియా కంపెనీ, రాయల్ ఆఫ్రికన్ కంపెనీ మరియు హడ్సన్‌బే కంపెనీల ఉమ్మడి మూలధన విలువ అది. ఆనాటికి ఒక పేదదేశమైన ఇంగ్లండ్‌కు అది గొప్ప సంపద. కనుకనే ఈ ఆదాయ వనరులను వారు పోగొట్టుకోదల్చుకోలేదు. మానాభిమానాలు లెక్క చేయకుండా ఏదోవిధంగా భారతదేశంలో తమ గుడారాల్లోనే ఉండి వ్యాపారం చేయటానికి సంసిద్ధులయ్యారు. ఆనాటికి బెంగాల్‌లో వారిస్థాయి ఒక చిల్లరవ్యాపారుల స్థాయి. బెంగాల్ వాణిజ్యపటంలో వారు ఒక చిన్న బిందువు మాత్రమే. 1740 నాటికి సైతం వారి ప్రభావం పెద్దగా లేదు. రెండు మూడు వేల మందికంటె ఆంగ్లేయులు బెంగాల్‌లో లేరు. ఒక చదరపు మైలువిస్తీర్ణంలో పావు వంతు మాత్రమే వారికి నివాసంగా ఉండేది.

**బెంగాల్ నిలువు దోపిడీ :**

కంపెనీ ఏ పరిస్థితులలో పుట్టిందో, అందుకు అనుగుణంగానే ఆ తర్వాత అనుసరించిన వారి పద్ధతులు ఉన్నాయి. చిన్నచిన్న వ్యాపారులకు ఉండే అల్పబుద్ధి, సముద్రపు దొంగలకు ఉండే దుర్మార్గం, అత్యాశ వారిని ఎప్పుడూ వదలలేదు. స్థానికుల నుండి ఎక్కువ సంపద రాబట్టుకోవటానికి ఎంతకైనా తెగించే మనస్తత్వం వారిది. వ్యూహాత్మకంగా స్థానికవనరులను కొల్లగొట్టటానికి, బలప్రయోగం చేయటానికి కూడా వారు ఎప్పుడూ సిద్ధంగా ఉండేవారు[5].

అందుకే బ్రిటీషువారు కర్ణాటక యుద్ధాలలో తల దూర్చారు. ఆధిపత్యం కోసం ఇతర పాశ్చాత్య వ్యాపార సంస్థలతో పోటీపడ్డారు. బెంగాల్ నవాబుల అధికార ప్రాబల్యాన్ని తగ్గించటానికి శక్తివంచన లేకుండా కృషిచేశారు. ప్లాసీయుద్ధం అందుకే అంత ప్రాముఖ్యం వహించింది. యుద్ధానికి దారితీసిన పరిస్థితులకంటె, యుద్ధంయొక్క ప్రభావం, ఫలితాలవల్ల ఆ యుద్ధానికి అంత ప్రాముఖ్యం వచ్చింది. బెంగాల్ చరిత్రలో అది ఒక పెద్దమలుపు. దాని కారణంగా భారతదేశ చరిత్రలోనూ అది ఒక పెద్దమలుపు. ఆ యుద్ధంతో కంపెనీ రాజ్యాధికారాన్ని చేజిక్కించుకుంది. బెంగాల్‌ను లూటీ చెయ్యటానికి దానికి సువర్ణ అవకాశం దొరికింది. ఆ లూటీ కారణంగా ఇంగ్లాండ్‌లోనూ, ఆ తర్వాత మొత్తం ఐరోపాలోనూ పారిశ్రామిక విప్లవానికి అది కారణభూతమైంది[6]. భారతీయులను అనేక కడగండ్లకు గురి చేసింది. బెంగాల్ నవాబు సిరాజ్-ఉద్దౌలా వారికంటె బలవంతుడిగా

నిరూపించుకొన్న తర్వాత, రాబర్ట్‌క్లైవు అనేక కుట్రలకు తెరతీశాడు. ప్లాసీగ్రామంలో జరిగిన యుద్ధం నిజానికి యుద్ధమే కాదు. క్లైవు స్వయంగా ఇలా చెప్పాడు "అక్కడ జరిగింది కేవలం యుద్ధమే కాదు. మోసం, కుయుక్తులు, రాజకీయం, దుష్టపన్నాగాలు ఇంకా అనేకం కలసిన పోరాటం అది. ఇంకా ఏమేమి ఉన్నాయో అవన్నీ భగవంతుడికే ఎరుక !"[7] (A mixture of fighting, tricks, chicanery, intrigues, politics and Lord knows what not !)

బెంగాల్‌ను తమ వశంలోకి తెచ్చుకొనడానికి ఆంగ్లేయులు ఎటువంటి పద్ధతులు అనుసరించారో తెలుసుకొంటేనే బెంగాల్‌వారికి వశమైన తీరు అర్థమౌతుంది; ఎన్నో విషయాలలో సర్వసమర్థులైన హిందూదేశపాలకులు బ్రిటీషువారి కూటనీతిముందు ఎలా విఫలురైనారో అర్థం చేసుకోగలము. వారి వంచన, మోసము, ద్రోహముల ముందు హిందూదేశపాలకులు నిలబడలేక పోయారని చెప్పక తప్పదు. ఆంగ్లేయుల దృష్టి ముందుగా బెంగాల్‌మీద పడటానికి కారణాలు ఉన్నాయి. అన్ని ప్రాంతాలకంటె బెంగాల్ జనాభాలోనూ, విస్తీర్ణంలోనూ పెద్దది. పాడిపంటలతో, సారవంతమైన భూములతో, నాజూకైన, తేలికైన, నాణ్యత కల్గిన వస్త్రరంగంతో, ధనధాన్యాలతో వర్ధిల్లుతున్న బెంగాల్‌ను కొల్లగొట్టగలిగితే, అంతులేని సంపద వారి కైవసం అవుతుందని వారు అంచనాకు వచ్చారు. బ్రెజిల్, పెరూ దేశాలను బ్రిటిషువారు కొల్లగొట్టలేకపోయ్యారు. ఆ నష్టాన్ని భర్తీ చేసుకోవటానికి ఒక్క బెంగాల్‌ను కొల్లగొట్టితే సరిపోతుందని భావించారు. వాస్తవానికి ఆ రెండు దేశాలలో వారి ప్రత్యర్థులు కొల్లగొట్టిన దానికంటె రెట్టింపును ఆంగ్లేయులు బెంగాల్‌నుండి కొల్లగొట్టారు.

జూన్ 23, 1757న ఆసియాలోనే అత్యంత ధనిక ప్రాంతాలలో ఒకటైన బెంగాల్ తనని తాను రక్షించుకోలేని స్థితిలో రాబర్ట్ క్లైవుకు లొంగిపోయింది. 8 లక్షల పౌండ్లను హుగ్లీనది మీదుగా కలకత్తాకు ఒకేఒక నౌకద్వారా రవాణా చేసారు. క్లైవు షుమారు 3 లేక 4 లక్షల పౌండ్లను తనస్వంతానికి తీసుకొన్నాడు. అయినా అతని ధనదాహం తీరలేదు[8].

ప్లాసీ తరువాత బ్రిటీషువారిమీద కురిసిన కనకవర్షపు వివరాలు గురించి క్లైవు జీవిత చరిత్రలో మెకాలే చాలా వ్రాశాడు. క్లైవు గురించి ఇలా వ్రాశాడు 'ఏ ఆంగ్లేయుడు కూడా 34 ఏళ్ళ వయస్సులో ఏ మార్గంలో కూడా అంత సంపదను

అంతకు ముందెన్నడూ సృష్టించలేదు".” “క్లైవు ధనదాహానికి పరిమితులు లేవు. బెంగాల్ కోశాగారం తలుపులు క్లైవు ముందు బార్లా తెరుచుకున్నాయి. బంగారం, వెండి రాశులమధ్య నడుస్తూ, వజ్రాలను, కెంపులు ధరిస్తూ అందినంత స్వంతం చేసుకోగల అపారమైన స్వేచ్ఛ క్లైవుకు లభించింది.”[10]

రాబర్ట్ క్లైవు భారతదేశంలో ఆంగ్లసామ్రాజ్య స్థాపకుడిగా ప్రసిద్ధుడు. సముద్రపుదొంగలైన డ్రేక్, హాకిన్సు, రెలీ (Raleigh), క్రామ్‌వెల్ జాతికే చెందిన వాడతను. ఒక చిన్న రైతు పెద్దకొడుకు క్లైవు. ఇంగ్లాండ్ ‘సాహసికులలో’ (Adventurers) అతనిని మించినవారు మరొకడు లేడు. 1725లో పుట్టిన క్లైవు ఒక జులాయి. అందరితోనూ తగవులు పెట్టుకొనేవాడు. ముష్టియుద్ధాలకు దిగేవాడు. చాలా ఉద్రిక్త స్వభావం గల అతన్ని తల్లిదండ్రులు నియంత్రించలేక పొయ్యారు. అందువల్ల అతని 18వ ఏటనే భారతదేశానికి ఈస్టిండియా కంపెనీలో గుమస్తాగిరి చేయటానికి ఆనందంతో పంపారు. మద్రాసులో గుమస్తాగా చేరిన క్లైవుకు వాతావరణం సరిపడలేదు. ఒంటరి జీవితం గడిపాడు. ఎవ్వరూ అతని గురించి పట్టించుకోలేదు. ఆరోగ్యం చెడిపోయినప్పటికీ, ఎలాంటి చికిత్సకు నోచుకోలేదు. నిరాశకు, నిస్పృహకు లోనై క్లైవు రెండుసార్లు ఆత్మహత్యా యత్నం చేశాడు. చేతిలో చిల్లిగవ్వ కూడా లేకుండా, పొట్టకూటికోసం గుమస్తాగిరికోసం భారతదేశం వచ్చిన క్లైవు ఏడాదికి 40 వేల పౌండ్లు ఆదాయం వచ్చే సంపదను చేజిక్కించుకొని ఇంగ్లాండు చేరాడు. అంతేకాక తన సమీప బంధువులకు కానుకల రూపంలో 50 వేల పౌండ్లు పంచాడు. దోచుకొని వచ్చిన సొత్తు కారణంగా, ఇంగ్లండ్‌లోని అత్యంత ధనికులలో ఒకడిగా ఆయనకు గుర్తింపు వచ్చింది. 1757-65 మధ్య 6 మిలియన్ల (60 లక్షల) పౌండ్లు బ్రిటిషువారు ఒక్క బెంగాల్‌నుండే కొల్లగొట్టారు. బెంగాల్ భూమిశిస్తుకు ఆ మొత్తం 4 రెట్లు ఎక్కువ[11]

**కుర్చీలాట-8 ఏండ్లలో 5గురు నవాబులు - కొనసాగిన దోపిడీ :**

క్లైవు తర్వాత కూడా కొనసాగిన నిలువు దోపిడీతో పోలిస్తే క్లైవు తనకోసం, తన కంపెనికోసం దోచుకున్నది నామమాత్రమే అని చెప్పాలి. బెంగాల్ తమ అధీనంలోకి వచ్చిన తర్వాత, ఆంగ్లేయులు దాన్ని అడ్డూ అదుపూలేకుండా దోచుకున్నారు. దురాశాపూరితులైన అనేకమంది ఆంగ్లఅధికారులు, ఉద్యోగులు బెంగాల్‌ను అనేక విధాలుగా దోచుకున్నారు. ఒకరితర్వాత మరొకరిని బెంగాల్‌కు

నవాబుగా కుర్చీలో కూర్చోబెట్టటానికి లంచాలు భారీఎత్తున వసూలుచేశారు. బెంగాల్ వారిపాలిట కల్పవృక్షమైంది. ప్రాచ్యదేశాల పగోడా చెట్టు అయింది. దానిని కదిలిస్తే పువ్వులు రాలినట్లు బెంగాల్ కల్పవృక్షాన్ని కేవలం తాకితేనే కనకవర్షం కురిసేది. ప్లాసీ యుద్ధానికి ముందు రాబర్ట్ క్లైవ్‌తో షరీకైన మీర్‌జాఫర్ సిరాజుద్దౌలాను చంపివేసిన తర్వాత నవాబు అయ్యాడు. అందుకుగాను 12 లక్షల 38వేల 575 పౌండ్లు ఆంగ్లేయులకు ప్రతిఫలంగా ముట్టింది. అందులో 35వేల 500 పౌండ్లు క్లైవు తన వాటాగా తీసుకొన్నాడు. అంతేకాక సంవత్సరానికి 27వేల పౌండ్లు ఆదాయం యిచ్చే జాగీరును తనస్వంత ఖాతాలో వేసుకున్నాడు. 1760లో మీర్ ఖాసింను నవాబును చేసినపుడు రెండు లక్షల రెండువందల అరవైతొమ్మిది పౌండ్లు బ్రిటీషు అధికారులకు ముట్టింది. తిరిగి మీర్‌జాఫర్‌ను 1763లో గద్దె ఎక్కించినపుడు 5 లక్షల పౌండ్లు వారికి ముట్టాయి. 1765లో నజీముద్దౌలాను నవాబు స్థానంలో కూర్చోబెట్టినందులకు, 2 లక్షల 30వేల, 356 పౌండ్ల విలువయిన బహుమతులు వారికి దక్కాయి. ఈవిధంగా రెండుపిల్లులమధ్య రొట్టె గురించి కోతి తీర్పు చెప్పిన చందంగా 1757-65 మధ్య సాగించిన ఈ కుర్చీలాటలో 21,69,565 పౌండ్లు ఆంగ్లేయులకు పారితోషికాలుగా ముట్టాయి. ఆపైన అప్పుడప్పుడు అదనంగా 37,70,833 పౌండ్లు నష్టపరిహారంగా వసూలు చేశారు[11].

భారతీయ జమీందారుల నుండి, జాగీర్‌దారుల నుండి, ఈనాముదారుల నుండి, వ్యాపారులనుండి ఆంగ్లేయులు ముక్కుపిండి మరీ వసూలుచేశారు. ఆనాడు ఆంగ్లేయులకు ఒకటే లక్ష్యం ఉంది. ఎంతవీలైతే అంత, వీలు అయినంత త్వరగా భారతీయులను దోచుకోవటం, తమదేశం చేరి తాము దోచుకొనితెచ్చిన సొత్తును ప్రదర్శించటం. బ్రూక్స్ ఆడమ్స్ ఇలా వ్రాసాడు "కలకత్తాలో అంతులేని సంపదలను వారు పోగుచేశారు. ఆ కారణంగా 3 మిలియన్ల (30 లక్షల) మంది దుర్భర దారిద్ర్యంలోకి నెట్టివేయబడ్డారు".[12] క్లైవు ఏమీ దాచుకోకుండానే ఆనాటి పరిస్థితిగురించి ఇలా చెప్పాడు. "అక్రమార్జనకై అర్రులు జాచిన వేళ, అంతులేని ధనదాహంతో మునిగిన వేళ, మంచి, చెడు వంటి సెంటిమెంటులు, జన బాహుళ్యానికి ప్రయోజనకరమా లేక హానికరమా అన్న సంశయాలు మంటకలిసి పోయ్యాయి." "గ్రీసు సంపదను రోమన్లు, పోంటస్ (Pontus) సంపదను ఇటలీకి తరలించినట్లుగా, శతాబ్దాలపాటు లక్షలాది భారతీయులు కూడబెట్టిన సంపదను

ఇంగ్లీషువారు చేజిక్కించుకొని లండన్‌కు తరలించారు".[13] అలా తరలించబడ్డ భారతీయుల సంపద విలువను లెక్కించటం అసాధ్యమని ఆడమ్స్ అంటారు. "ఆ సంపద విలువను లెక్కించటం అసాధ్యం. బహుశా దానివిలువ చాలా మిలియన్ల పౌండ్లు ఉండవచ్చు. ఆనాటికి పాశ్చాత్యులందరి దగ్గర ఉన్న బంగారం, వెండి, మొత్తాల విలువ కంటె చాలా ఎక్కువ అని మాత్రము కచ్చితంగా చెప్పవచ్చు".[14]

భారతదేశంనుండి చేసుకొనే దిగుమతులకు చేసిన చెల్లింపులతో ఇంగ్లాండ్ బంగారం, వెండి నిల్వలు కరిగిపోతూ ఉండేవి. ఇంగ్లాండ్‌నుండి భారత్‌కు చేయదగ్గ ఎగుమతులు వారి దగ్గర ఏమీలేవు. ఆ ఏకపక్ష వాణిజ్యంలో ఇంగ్లాండ్‌నుండి భారత్‌కు బంగారం, వెండి తరలిపోతూ ఉండటం ఆంగ్లేయులకు నచ్చలేదు. వారి దృష్టిలో నిజమైన సంపద అంటే బంగారం, వెండి మాత్రమే. ఈ సమస్యకు పరిష్కారంకోసం వారు శతాబ్దాలపాటు ఎదురుచూస్తున్నారు. బానిసల వ్యాపారంలో సంపాదించిన బంగారం, వెండిలతో భారత్‌కు చెల్లింపులు చేసేవారు. బెంగాల్ వారికి కైవసం అయ్యాక, బ్రిటన్‌నుండి బంగారం, వెండి రవాణా అవసరం లేకపోయింది. సుగంధ ద్రవ్యాలు, నాజూకయిన వస్త్రాలు, ఇతర భారతీయ ఉత్పత్తుల కొనుగోలుకు వారు కొల్లగొట్టిన బెంగాల్ బంగారం, వెండిలనే వాడారు. అంటే మన బంగారం, వెండిలతోనే మన ఉత్పత్తులను కొని వారి దేశానికి తీసుకొని వెళ్ళి, వాటిని ఇతర పాశ్చాత్య దేశాలకు అమ్మి అంతులేని లాభాలు గడించారు. బెంగాల్ లూటీ తర్వాత ఈస్టిండియా కంపెనీది పెట్టుబడి లేని వ్యాపారం అయింది. ఇంగ్లాండు బంగారం, వెండి నిల్వలు కదలకుండా భారత ఉత్పత్తులు వచ్చి పడటంతో అక్కడి ప్రభుత్వం వారి దోపిడీకి తన సహకారాన్ని అందించింది[15].

అదే విషయాన్ని క్లైవు సలహా మండలి సభ్యుడైన స్క్రాఫ్టన్‌కి కూడా వివరించాడు. ప్లాసీ తర్వాత భారత్ ఉత్పత్తులకోసం ఒక ఔన్సు బంగారం కూడా ఇంగ్లాండ్‌నుండి భారత్‌కు రాలేదని గర్వంగా చెప్పాడు. అంతేకాక వారు సాధించిన అఖండవిజయం వల్ల మూడు మిలియన్ల (30 లక్షల) పౌండ్లకు పైగా మొత్తం ఇంగ్లాండ్‌కు తరలించబడిందని కూడా చెప్పాడు.[16]

1783లో బ్రిటీషు పార్లమెంట్ సెలక్ట్ కమిటీ చేసిన వ్యాఖ్య ఆనాటి పరిస్థితికి అద్దంపట్టుతుంది. "బెంగాల్ నుండి వచ్చిన ఆదాయంలో కొంతశాతాన్ని భారతీయ

ఉత్పత్తులను కొనుగోలు చేయటానికి వినియోగించారు. దీన్ని భారతదేశంలో ఇంగ్లాండ్ 'పెట్టుబడి'గా పిలుస్తున్నారు. భారతదేశం పేదరికంలో దిగజారటానికి కారణమైన ఆ మొత్తాన్ని కంపెనీ యొక్క సంపదకు, పురోభివృద్ధికి సూచికగా తీసుకొంటున్నారు. అభివృద్ధికి ఊతమిచ్చే వాణిజ్యంగా కాక, కప్పం చెల్లింపు మాదిరిగా ఉన్న ఈ వాణిజ్యం పైకి మంచిగా, అంతుచిక్కని రూపాన్ని సంతరించుకొన్నది. బెంగాల్, ఇంగ్లాండ్‌లమధ్య జరుగుతున్నది వాణిజ్యం కాదు. భారతదేశంనుండి కంపెనీ చేస్తున్న ఎగుమతులు వస్తుమారక పద్ధతిలో జరిగే వాణిజ్య ప్రక్రియకాదు. ఎటువంటి ప్రతిఫలం లేక ఎటువంటి చెల్లింపులు లేని ఏకపక్ష దోపిడీ వ్యాపారం.[17]

**బరితెగించిన ఈస్టిండియా కంపెనీ :**

1757కు ముందు ఈస్టిండియా కంపెనీ తన వ్యాపారాభివృద్ధికోసం అనేక మోసాలకు, వీలయిన సందర్భాలలో దౌర్జన్యాలకూ పాల్పడుతుండేది. కాని రాజదండనకు భయపడేది. ప్లాసీ యుద్ధం తర్వాత, అధికారం కైవసం చేసుకొన్నాక, అహంకారంతో వ్యవహరించటం మొదలుపెట్టింది. నటనకు ముగింపు పలికి తన నిజస్వరూపమైన దోపిడీ మనస్తత్వాన్ని బహిరంగపర్చింది. థామ్సన్, గారెట్‌ల అభిప్రాయంలో వాణిజ్యానికి, దోపిడీకి మధ్య ఉన్న వ్యత్యాసాన్ని మొదటినుండి కంపెనీ గుర్తించేదికాదు. సముద్రపు దొంగతనాలలో వారి వ్యాపార సాహసికులు బహునేర్పరులు. అందువల్ల ప్లాసీ తర్వాత రైతులను, వ్యాపారులను, నేతన్నలను వారు నిలువుదోపిడీ చేశారు. వారి ఉత్పత్తులను బలవంతంగా ఎత్తుకెళ్ళేవారు. ఎదురుతిరిగితే నోరుమూయించేవారు. అకారణంగా హింసకు పాల్పడేవారు. ఒకవేళ మూల్యం చెల్లించవలసి వస్తే నాలుగవ వంతు మాత్రమే యిచ్చేవారు. అది అసలు వ్యాపారమేకాదు. దోపిడీని వ్యాపారంగా పరిగణించకూడదు. ఇలాంటి వ్యాపారాలు చరిత్రలో బహుకొద్దిగానే నమోదు అయ్యాయి.[18]

కర్నల్ మేల్లేసన్ (Malleson) ఈ విధంగా వ్యాఖ్యానించాడు. "చరిత్రలో ఇలాంటి సంఘటనలు బహు అరుదు. ఇది ఏ కొద్ది కాలమో జరిగింది కాదు. అనేక రూపాలతో, అనేక పేరులతో తరాల తరబడి జరిగింది. ఎలాంటి సంకోచాలు లేకుండా జరిపిన దోపిడీ, ఆ తర్వాత కాలంలో చట్టబద్ధమైన దోపిడీగా మారింది. పైకి కనిపించకపోయినా, అత్యంత దారుణమైన దోపిడీ. అవినీతి, పక్షపాతం, హింస, మితిమీరిన లంచగొండితనం, ధనదాహం భారతదేశంలోని ఆంగ్ల

అధికారులకు పర్యాయపదాలు అయ్యాయి. హిందూస్థానీ పదమైన 'లూట్' ఇంగ్లీషు భాషలో భాగం అవటానికి కూడా ఇదే కారణమని ఎడ్వర్డ్ థాంప్సన్ పేర్కొన్నారు. ఆంగ్లేయుల అవినీతి ఒక్క బెంగాల్ ప్రాంతానికే పరిమితంకాలేదు. భారతదేశంలో ఆంగ్లేయుల పరిపాలనాకాలం అవినీతికి పరాకాష్ఠగా ఉండేది. ప్రపంచ చరిత్రలోనే అంత భ్రష్ట రాజకీయ వ్యవస్థ మరొకటి లేదు".[19]

ఈస్టిండియా కంపెనీకి పోటీ అంటేగిట్టదు. ఇంగ్లీషువారు 'స్వేచ్ఛా వాణిజ్యం' ప్రయోజనాలగురించి ఎన్ని సిద్ధాంతాలు చెప్పినా, అవన్నీ బయటివారికోసమే. తమ పోటీదారులైన డచ్, పోర్చుగీసు, ఫ్రెంచి కంపెనీలను పోటీనుండి తప్పించి, భారతమార్కెట్ పై గుత్తాధిపత్యంకోసం నిరంతరం ప్రయత్నం చేసారు. అందుకు ఎన్నో కుయుక్తులను పన్నేవారు. తమకుతప్ప మరెవ్వరికీ అమ్మవద్దని భారతీయ వ్యాపారులను, ఉత్పత్తిదారులను అభ్యర్థించేవారు, బెదిరించేవారు. పాలకులను అటువంటి ఆదేశాలు యిమ్మని అభ్యరించేవారు. స్థానిక అధికారులను మచ్చిక చేసుకొని, లంచాలు యిచ్చి, ఉత్తర్వులు యిప్పించేవారు. ఇది అంతా అధికారం చేజిక్కించుకోకముందు. అధికారం ఒకసారి చేపట్టాక వారిది యిష్టారాజ్యం అయ్యింది. యథేచ్ఛగా దోపిడీకి పాల్పడ్డారు.

ప్రతిముఖ్యమైన వాణిజ్యకేంద్రంలోనూ కంపెనీ ప్రతినిధులు నిత్యం ఇదే లక్ష్యంతో పనిచేసేవారు. ఏదో ఒక రకంగా ప్రతి వాణిజ్యకేంద్ర లావాదేవీలను నియంత్రించి, వస్తువుల క్రయవిక్రయాలపై గుత్తాధిపత్యం కోసం యత్నించేవారు. సూరత్‌లోనూ, మరి ఇతర ప్రదేశాలలోనూ కంపెనీ ఇట్టి చర్యలకు పాల్పడేది. ప్రత్యర్థి కంపెనీల ప్రతినిధులను బెదిరించటం, వారికి సరుకు అందకుండా నిరోధించటం, వారిమీద స్థానికఅధికారులకు చాడీలు చెప్పటం, వీలు అయితే వారి పీడను తొలగించటానికి వారిని పట్టి చంపటం మొదలైనవి వారు అనుసరించిన "స్వేచ్ఛావాణిజ్య పద్ధతులు." పాట్నాలోని కంపెనీ ప్రతినిధి ఈ విధంగా వ్రాశాడు " ఒక అర్మేనియన్ వ్యాపారి వారి నవాబుకోసం కొద్ది పరిమాణంలో పొటాషియం నైట్రేటును కొనుగోలు చేశాడు. ఈ చర్య కంపెనీ హక్కులకు భంగం కలిగించిందని ఆరోపించి, అతనిని అరెష్టు చేసి కలకత్తా జైలుకు పంపారు".[20]

బెంగాల్‌లోనూ ఇలాంటి దురంతాలకు కొదవేమీ లేదు. సిల్కు వస్త్రాల కొనుగోళ్ళ పై ఎలాంటి నియంత్రణ సాధించారో చెప్పటానికి ఒక్క ఉదంతం చాలు. 1827లో

సిల్కు ధరలు బాగా పెరిగాయి. కాని పెరిగిన ధరల దగ్గర సిల్కు వస్త్రాలు కొనుగోలు చేస్తే తమ లాభాలు తగ్గుతాయని భావించి, తక్కువ ధరలకే వస్త్రాలు తమకు ఉత్పత్తిదారులు యివ్వక తప్పని పరిస్థితులను సృష్టించారు.

1837లో సాండర్ అనేవాడు బ్రిటన్ పార్లమెంటరీ కమిటీముందు వారు అనుసరించే విధానాల గురించి స్పష్టపరిచాడు. పట్టుగూళ్ళను సేకరించే వారిని, నూలు వడికేవారిని గుర్తించి వారికి అవసరం ఉన్నా లేకున్నా వారికి ముందుగా కొంతమొత్తం (అడ్వాన్సు) యిచ్చేవారు. ఇక వారు కంపెనీ నిబంధనల మేరకు, కంపెనీ గుమస్తాల పర్యవేక్షణలోనే పనిచెయ్యాలి. అనుకున్న సమయానికి అందించక పోయినా, నాణ్యత ఏమాత్రమూ లోపించినా, లేక తమకు పనిచేస్తూ వేరెవ్వరికైనా పనిచేసినా దౌర్జన్యానికి దిగేవారు. లేదా దొంగతనం నేరం మోపేవారు. అందుకు వారు ఒక చౌకబారైన ఎత్తుగడను వేసేవారు. ఎవరిని దొంగగా చిత్రీకరించ దల్చుకొన్నారో, వారి యింట్లోకి ఒక నాణెం విసిరేవారు. ఆ తరువాత ఆ ఇంట్లోకి వెళ్ళి, నాణెంకోసం వెతికి దానిని దొరకపుచ్చుకొనేవారు. వారియింట్లో దొరికింది కాబట్టి వారిమీద దొంగతనం నేరంమోపి జైలుకు పంపేవారు[21].

ఈస్టిండియా కంపెనీ జిత్తులమారి ఎత్తుగడలకు, దౌర్జన్యాలకు రైతులు, నేతపనివారు, నూలుపనివారు తల్లడిల్లి పొయ్యారు. అణచివేత ప్రధానఅంశంగా ఉన్న వాణిజ్యవిధానం ప్రపంచ వాణిజ్య చరిత్రలోనే మరొకటి కనపడదు. ఉత్పత్తుల ధరలు మార్కెట్‌లో గిరాకీ, సరఫరా మీద ఆధారపడి నిర్ణయం అవుతాయని మన పాఠ్యగ్రంథాలలో చదువుతాం. ఇంగ్లీషువారు అందుకు మినహాయింపు. ధరలు ఏకపక్షంగా వారే నిర్ణయించేవారు. రైతులకు, నేతపనివారికి అవి ఎప్పుడూ గిట్టుబాటుగా ఉండేవికావు. కంపెనీకి సరఫరా చేయటం వారికెప్పుడూ యిష్టం ఉండేదికాదు. దేశీవ్యాపారులకు, ఇతర పాశ్చాత్య కంపెనీలకు సరఫరా చేసేందుకు మొగ్గుచూపేవారు. వారు ఇంగ్లీషు కంపెనీ కంటే ఎక్కువ ధరయిచ్చేవారు. వారి నిబంధనలు కూడా సరళతరంగా ఉండేవి. అయితే ఈస్టిండియా కంపెనీ రకరకాల మార్గాలలో ఉత్పత్తిదారులు తమకు మాత్రమే సరఫరా చేసేటట్లు ప్రభావితం చేసేది. ముందుగా ప్రలోభపెట్టేవారు. ప్రలోభానికి లొంగకపోతే భయపెట్టేవారు. అప్పటికీ లొంగకపోతే ప్రత్యక్షనరకం చూపేవారు. విలువలో నాల్గవ వంతు మాత్రమే చెల్లించి,

బలవంతంగా సిల్కు, నూలు వస్త్రాలను ఎత్తుకెళ్ళేవారు. దానితో ఉత్పాదకులు లబోదిబోమనేవారు.[22]

థామస్ మన్రో బ్రిటీషు పార్లమెంటు కమిటీ ముందు "కంపెనీ అధికారులు ముఖ్యమైన నేత పనివారిని సమావేశపర్చి, వారు కంపెనీకి మాత్రమే సరఫరా చేస్తామన్న ఒప్పందానికి వచ్చినప్పుడే వారిని విడుదల చేసేవారని" చెప్పాడు.[23] ఇంకా ఆయనే ఇలా అంటున్నారు."తమ శ్రమకు, నైపుణ్యానికి తగ్గ ధరరాలేదని ఇంగ్లీషువారికి గాక ఇతరులకు అమ్మటానికి చేనేత కార్మికులు ప్రయత్నిస్తే, ఆ విషయం బయటకు పొక్కితే, కంపెనీ ఉద్యోగులు వారి ఇంట్లోకి అక్రమంగా ప్రవేశించి, మగ్గంమీద ఉన్న బట్టను ఎవరికీ ఉపయోగపడకుండా కత్తిరించేవారు".[24] అందువల్ల "కంపెనీ ప్రతినిధులను, ఉద్యోగులను పై అకృత్యాలు నిర్వహించకుండా అడ్డుకోవటం శిక్షార్హం చేశారు".[25] "అనుకున్న ప్రకారం చెప్పిన సమయానికి వస్త్రాలు నేసి యివ్వటంలో జాప్యం జరిగితే, ధరమీద 35 శాతం అపరాధ రుసుం వసూలు చేసేవారు".[26]

సూరత్ కోఠీలో ఇంకా కఠినతరమైన నిబంధనలు, తీవ్రమైన అణచివేత ఉండేవని రిచర్డ్సు అనే బ్రిటీషు వ్యాపారి పేర్కొన్నాడు. నేతన్నలు కంపెనీకి తప్ప మరెవ్వరికీ పనిచేయకూడదని బలవంత పెట్టేవారని, అందుకు యిష్టపడనివారు హెచ్చు మొత్తంలో అపరాధ రుసుం చెల్లించి బయటపడేవారని చెప్పాడు. కంపెనీ లక్ష్యం ఒక్కటేనని, అది గుత్తాధిపత్యం సాధించటమని, కంపెనీ నిర్ణయించిన ధరలకు, లేదా కారుచౌకగా నూలు, సిల్కు వస్త్రాలను కొనుగోలు చేయటమేనని కూడా ఆయన వ్రాసాడు. కంపెనీ వేధింపులు, అణచివేత తట్టుకోలేక, అనేక వందలమంది తాము తరతరాలనుండి నమ్ముకొన్న వృత్తినుండి వైదొలిగేందుకు సైతం సిద్ధమయ్యేవారని ఆయన పేర్కొన్నారు. అయితే ఆ అవకాశం కూడా వారికి లేకుండా చేసేందుకు ప్రత్యామ్నాయ ఉపాధి అవకాశాలు వారికి లేకుండా చేసేవారు. సైన్యంలో చేరటానికి వృత్తినైపుణ్యంగల కార్మికులను అనర్హులుగా ప్రకటించారు. అవకాశాలు వెదుక్కుంటూ వేరే ప్రాంతానికి వెళ్ళకుండా నిరోధించేందుకు ఇంగ్లీషువారి అనుమతిలేకుండా అట్టివారు పట్టణం విడిచిపెట్టి వెళ్ళకుండా కట్టుదిట్టం చేసారని ఆయన పేర్కొన్నట్లుగా వ్రాశారు.[27]

సన్నని, నాజూకు అయిన సిల్కు లేక పట్టుదారాలను వడికేవారిపట్ల చాలా అనాగరికంగా, అమానుషంగా ప్రవర్తించేవారని, ఆనాటి సమాజపు అత్యంత పవిత్ర చట్టాలను అత్యంత తేలికగా ఉల్లంఘించేవారని విలియమ్ బోల్ట్స్ అనే బ్రిటీషు వ్యాపారి వ్రాసాడు. చెప్పిన విధంగా ఒప్పందానికి రానివారి వస్తువులను, పరికరాలను, ఉత్పత్తులను ఆంగ్లేయులు జప్తుచేసి, అక్కడికక్కడే అమ్మి డబ్బు చేసుకొనేవారు. బ్రిటీషు వారికి పనిచేయటం యిష్టంలేనివారు, వారు పెట్టే అణచివేతను తట్టుకోలేని వారు, వారి బొటనవేళ్ళు కోసుకొనేవారు. దానితో వారు పనిచేయటానికి పనికిరాకుండా పోయేవారు. బ్రిటీషువారి అణచివేతను తట్టుకోవటానికి వారికి అదొక్కటే మార్గంగా కన్పించింది.[28] ఈస్టిండియా కంపెనీ భారతదేశంలో అనుసరించిన పైపద్ధతులు 'స్వేచ్ఛా వాణిజ్యం, కిందకు వస్తాయా? స్వేచ్ఛా వాణిజ్యం సంగతి దేవుడు ఎరుగు, అసలు వాటిని వాణిజ్య పద్ధతులు అని అనవచ్చా?

**అధికారుల స్వంతవ్యాపారాలు :**

ఈస్టిండియా కంపెనీ ఆర్జిస్తున్న లాభాలు చూసి, కంపెనీ అధికారులకు, ఉద్యోగులకు ఆశపుట్టింది. తామెందుకు స్వంతంగా కొన్ని ఎగుమతులు చేయకూడదని భావించి కొందరు ఉన్నత అధికారులు స్వయంగా ఎగుమతులు చేయటం ప్రారంభించారు. అది లాభాలబాట కావటంతో అనేకమంది వారిని అనుసరించారు. కొన్ని దశాబ్దాల తర్వాత అధికారులు, ఉద్యోగులు ఒక సమాంతర వ్యాపారానికి కారణమయ్యారు. అయితే రానురానూ వారి వ్యాపారం వలన అటు నవాబులు, ఇటు ప్రజలు నష్టపొయ్యేవారు.

భారతదేశపు ఉత్పత్తులు కొని ఎగుమతి చేయటానికి కంపెనీకి అనుమతిని 1717లో యిచ్చారు. సరుకు వివిధ ప్రాంతాలనుండి రేవు పట్టణానికి తరలించటానికి ఆ కాలంలో పన్ను చెల్లించాలి. ఆపన్నునుండి కూడా ఈస్టిండియా కంపెనీకి మినహాయింపును యిచ్చారు. కంపెనీ చేసే ఎగుమతులవలన బంగారం దేశంలోకి వస్తున్నది కాబట్టి సరుకురవాణాపై విధించే పన్ను నుండి మినహాయింపును యిచ్చారు. అయితే కంపెనీ అధికారులు, ఉద్యోగులు చేసే ఎగుమతి వ్యాపారానికి అలాంటి అనుమతి లేదు. దానికే అనుమతి లేనప్పుడు, సరుకు రవాణా పన్నునుండి మినహాయింపు అన్న ప్రశ్నే ఉత్పన్నంకాదు.

కాని కంపెనీ అధికారులు, ఉద్యోగులు ఎట్టి అనుమతులు లేకుండా, పన్ను చెల్లించకుండా వ్యాపారం చేసేవారు. కంపెనీకి కూడా దేశంలోనే-ఒకచోట నుండి మరొకచోటకు చేసే అంతర్గత వ్యాపారం చెయ్యటానికి అనుమతిలేదు. కాని అధికారులు, ఉద్యోగులు బెంగాల్‌లో ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి వడ్లు, బియ్యం, గడ్డి, నూనెలు, తమలపాకులు, కలప మొదలైనవి రవాణా చేసి, అమ్ముకొనేవారు. అంతర్గత వ్యాపారంలో కంపెనీ అధికారుల, ఉద్యోగుల అక్రమ జోక్యం, భాగస్వామ్యం స్థానిక వ్యాపారులకు ప్రాణసంకటంగా మారింది. దానికితోడు ఎటువంటి పన్నులు కట్టనందున కోశాగారానికి ఆదాయం రావటం లేదు. దానితో బెంగాల్ నవాబులు వీరిని నియంత్రించేందుకు పూనుకొన్నారు. కఠినమైన చర్యలకు ఉపక్రమించారు. తమ స్వంత వ్యాపారాలను దెబ్బకొట్టే ఈ చర్యలు నచ్చక కంపెనీ అధికారులు రాజకీయాలలో జోక్యం చేసుకోవటం మొదలుపెట్టి చివరకు రాజ్యాధికారాన్నే స్వంతం చేసుకున్నారు. బెంగాల్‌లో జరిగిన రాజకీయ, ఆర్థిక, వాణిజ్య పరిణామాలవెనుక కంపెనీ అధికారుల అక్రమ స్వంతవ్యాపారాలను కాపాడుకోవాలనే కాంక్ష బలంగా ఉందని ప్రముఖ చరిత్రకారుడు రమేష్ చంద్రదత్ అంటారు.[29]

కాలక్రమంలో గవర్నర్‌గా పనిచేసిన వెరెల్‌స్ట్ (Verelst) ఈవిధంగా వ్యాఖ్యానించాడు. "ఎటువంటి పన్నులూ చెల్లించకుండా వ్యాపారం చేశారు. అందుకుగాను పరిమితులులేని తీవ్రమైన అణచివేతకు పాల్పడ్డారు. ప్రజలకు హానిచెయ్యటంతో తృప్తిపడక, ప్రభుత్వాధికారాన్ని సైతం ధిక్కరించారు. ఎప్పుడైనా నవాబుల అధికారులు జోక్యం చేసుకుంటే వారిని బంధించి, శిక్షించేవారు".[30]

వారెన్ హేస్టింగ్సు కంపెనీపట్ల స్థానికులకు ఉన్న భయాల గురించి చెప్తూ "మా ముందు సిపాయిల గుంపు కవాతు చేస్తూ వెళ్తున్నది. వారి పేరాశ, పెంకితనాల గురించి ప్రజలనుండి అనేక ఫిర్యాదులు అందాయి. కంపెనీవారికి భయపడి అనేక పల్లెలు, చిన్న పట్టణాలు ఖాళీ అయ్యాయి. వాటిని విడిచిపెట్టి స్థానికులు ఎక్కడికో పారిపొయ్యారు. దుకాణాలు అన్నీ మూతబడి ఉన్నాయి".[31]

"ఒక గుమస్తాను వస్తువులను అమ్మటానికో, కొనటానికో పంపినప్పుడు, అతను తనకు సర్వాధికారాలు లభించాయని అనుకుంటాడు. తనకు వస్తువులు అమ్మటానికి నిరాకరించిన వారిని లేదా కంపెనీ వస్తువులను కొనటానికి తిరస్కరించిన వారిని

క్రొరదాతోనో, కట్టెతోనో కొట్టటమో లేక బంధించటమో చేసేవాడు. ఈ దుశ్చర్యల కారణంగా బెంగాల్‌లోనే అత్యంత ధనికప్రాంతం నేడు (బేకర్‌గంజ్ జిల్లాలో) అనాథల నిలయంగా మారిపొయ్యింది. ప్రతిరోజూ అనేకమంది భద్రతకోసం ఈ ప్రాంతం విడిచి వెళ్ళిపోతున్నారు. ఒకప్పుడు అనేక వస్తువులతో కళకళలాడే మార్కెట్లు నేడు కళావిహీనంగా నిలబడ్డాయి. ఉపయోగకరమైన ఉత్పత్తులు ఒక్కటీ అక్కడ దొరకటంలేదు. కంపెనీ ప్యూనులు సైతం బెదిరింపులకు దిగి పేదలను భయభ్రాంతులకు గురిచేస్తున్నారు. అద్దుకుంటున్న జమీందార్లను సైతం బెదిరిస్తున్నారు. కచేరీలలో న్యాయనిర్ధారణ జరగకముందే, ప్రతిగుమస్తా న్యాయమూర్తి అవుతున్నాడు. ప్రతిగుమస్తా ఇల్లు ఒక కచేరీ అయింది. జమీందార్లకు సైతం శిక్షలు విధించేస్థాయికి ఎదిగారు. శిక్షలు తప్పించటానికి వారినుండి భారీమొత్తం జరిమానాగా వసూలు చేసేవారు".[32]

"బజారుధరలకంటె తక్కువకే పొగాకు, పత్తి, ఇనుము, ఇంకా అనేక ఇతర వస్తువులు సరఫరా చేసే విధంగా వ్యాపారస్థులను బలవంతపెట్టేవారు. తమ దగ్గర ఉన్న వస్తువులను బజారుధరలకంటె ఎక్కువకే వారికి కట్టబెట్టేవారు. వారినుండి బలవంతపు వసూళ్ళకు పాల్పడేవారు. తమ సేవకుల (అమ్మటానికి వచ్చినా, కొనటానికి వచ్చినా) దినసరిభత్యాలను సైతం వ్యాపారులనుండి వసూలుచేసేవారు. ఒప్పందాలు ఉల్లంఘిస్తే, లేదా వాటిని అమలుచేయలేని పరిస్థితులు ఏర్పడినా, భారీగా నష్టపరిహారం, అపరాధరుసుములు వసూలుచేసేవారు. ఈ రకమైన దుశ్చర్యలవల్ల అనేక ప్రాంతాలు నిర్మానుష్యమైనాయి, శిథిలమయ్యాయి".[33]

"షెవలియర్ (Chevalier) కొత్తమార్కెట్లను, కొత్త ఫ్యాక్టరీలను బలప్రయోగంతో నెలకొల్పాడు. ఎవరినిపడితే వారిని బంధించి, జరిమానాలు విధించాడు. తమకు ఎదురుతిరిగిన వారందరికీ శిక్షలు తప్పేవికావు. ఆ కారణంగా అనేక హాట్లు (మార్కెట్లు), ఘాట్లు, పరగణాలు పూర్తిగా నాశనమయ్యాయి".[34]

జేమ్సుమిల్ భారతవ్యతిరేకధోరణికి ప్రతీక. ఆయన సైతం తన 'హిస్టరీ ఆఫ్ బ్రిటీష్' ఇలా వ్రాయక తప్పలేదు. "ఈస్టిండియా కంపెనీ అధికారగణం, సేవకుల ప్రవర్తనతీరును, పాలనతీరును గమనిస్తే, స్వంతలాభంకోసం అధికారాన్ని చెలాయించేవారు న్యాయాన్యాయాల స్పృహ లేకుండా, కనీసం సిగ్గు ఎగ్గు లేకుండా

తమ అధికారాన్ని ఏవిధంగా దుర్వినియోగపరుస్తారో తెలుసుకొనేందుకు ఒక మంచి దృష్టాంతం అవుతుంది".[36]

"బెంగాల్ ప్రజలకు నియంతృత్వ పోకడలు క్రొత్తకావు. శతాబ్దాలపాటు పాలకుల నియంతృత్వాన్ని వారు చవిచూశారు. అయితే ఇంత అణచివేతను, క్రూరత్వాన్ని వారు ఎన్నడూ ఎదుర్కొనలేదు. ప్రతిగ్రామానికి, ప్రతిమగ్గానికి, ప్రతి మార్కెట్టుకు ఆంగ్లేయుల దౌర్జన్యం ప్రాకింది. అధికారంలో ఉన్నవారు వారి యిష్టానుసారం నిర్ణయాలు తీసుకోవటం క్రొత్తఏమీకాదు. ప్రజల అనుభవంలో ఉన్నదే అది. అయితే వారి వ్యాపారాలను, వృత్తులను, వారి జీవితాలను అంత దగ్గరగా ప్రభావితం చేసి, వారిని ఇబ్బందులకు, అంతులేని బాధలకు గురిచేసిన పాలనా వ్యవస్థను వారెన్నడూ ఎరగరు. వారి పరిశ్రమల జవసత్త్వాలు క్రుంగిపొయ్యాయి. వారి ఆదాయ వనరులన్నీ ఎండిపొయ్యాయి".[36]

తన ప్రజల కష్టాలు చూసి, ఇంగ్లీషు వారితో సమానంగా వారు తిరిగి వ్యాపారం చేసేందుకు వీలుగా బెంగాల్ నవాబు మీర్‌ఖాసిం (1760-63) అంతర్గత వ్యాపారంపై ఉన్న అన్ని పన్నులును రద్దుచేసాడు. అందువల్ల కోశాగారానికి నష్టం వాటిల్లినా కూడా ఆయన వెనుకాడలేదు. భారతీయ వ్యాపారులకు మేలుచేసే ఏ చర్యకూడా కంపెనీ వారికి నచ్చిందికాదు. మీర్‌ఖాసిం ఆక్ట్రాయ్‌పన్ను (సరుకును మార్కెట్‌లో విక్రయించేముందు చెల్లించవలసిన పన్ను) రద్దుచేయటం ఇంగ్లీషుజాతిపట్ల నమ్మకద్రోహంగా వారు భావించారు. ఆక్ట్రాయ్ పన్ను రద్దు అంశంపైనే బకసార్ యుద్ధం జరిగింది. కంపెనీ ఉద్యోగులు, అధికారులు తమ స్వంతవ్యాపారాలకోసం, స్వలాభంకోసం, అన్నిరకాల నియమ నిబంధనలను గాలికి వదిలి, నైతిక విలువలకు తిలోదకాలు యిచ్చి బెంగాల్ ఆర్థికవ్యవస్థను తమ ధృతరాష్ట్ర కౌగిలిలోకి తెచ్చుకొన్నారు. ఒక పెద్ద నాగరిక సమాజపు ఆదాయ వనరులను చేజిక్కించుకోవాలనే తపనతో దాని ఆర్థికమూలాలను దెబ్బకొట్టారు. తరతరాలుగా ప్రజలు తాము నైపుణ్యంగా ఉత్పత్తి చేయకలిగింది చేస్తూ, ఇతరులతో వస్తుమార్పిడి చేసుకొని సుఖసంతోషాలతో బ్రతికారు. స్వేచ్ఛగా ఉత్పత్తి చేసేహక్కు, స్వేచ్ఛగా వస్తుమార్పిడి హక్కు భూమిమీద ఉన్న అన్ని నాగరిక సమాజాలలో ఉంటాయి. ఆ హక్కులను భారతీయులకు లేకుండా చేశారు. ఒకటి, రెండు ఉత్పత్తుల వ్యాపారంలో సాధించిన గుత్తాధిపత్యంతో ఆంగ్లేయులు తృప్తిపడలేదు. అన్ని రకాల వస్తు ఉత్పత్తుల వ్యాపారంలో గుత్తాధిపత్యం కోసం వారు బలప్రయోగానికి దిగారు. హింసకు దిగారు. అణచివేతలకు, అక్రమాలకు, అన్యాయాలకు దిగారు. ఒక్కమాటలో

చెప్పాలంటే ద్రవ్యార్జన కోసం బరితెగించారు. విదేశీ వ్యాపారులు ఒక పరాయి దేశపు మార్కెట్లను శాసించటానికి, తమ గుప్పెట్లో పెట్టుకోవటానికి విచక్షణారహితంగా హింసకు దిగి ఒక గొప్ప దేశపు ప్రజల ఆర్థిక సాంస్కృతిక విలువలను మంటకలిపారు.

**ఇంగ్లాండ్ 'స్వదేశీ' ఉద్యమం :**

నాజూకైన భారతీయ వస్త్రాల ప్రాచుర్యంగురించి ఇంతకుముందు కూడా చెప్పుకున్నాము. భారతదేశంనుండి దిగుమతి అవుతున్న ఈ వస్త్రాలవల్ల ఇంగ్లాండు ఉన్ని వస్త్రాలకు డిమాండ్ క్రమంగా తగ్గుతూ వచ్చింది. 'రాబిన్‌సన్‌క్రూసో' నవలను వ్రాసిన ప్రముఖరచయిత డేనియల్ డెఫో (Defoe) భారతీయవస్త్రాల వాడుక ఇంగ్లండ్‌లో ఎలా పెరిగిందో చెప్తూ "అవి మా నివాసాలలోకి చొరబడ్డాయి. మాలోపలి గదులలోకి, పడకగదులలోకి వచ్చాయి. తలుపులు, కిటికీలకు తెరలుగా వచ్చాయి. కుషన్సుగా కుర్చీలలోకి వచ్చాయి. తివాచీలుగా మారాయి. పరుపులకు సైతం కాలికోలు లేదా భారతదేశంనుండి దిగుమతి అయిన ఉత్పత్తులే. సర్వమూ భారతదేశంనుండి దిగుమతి చేసుకున్నవే" భారతదేశపు వస్త్ర దిగుమతులు యిచ్చే పోటీ తట్టుకోలేక ఇంగ్లాండ్ ఉన్ని వస్తుపరిశ్రమ చతికిలపడింది. భారత్ ఉత్పత్తులకు వ్యతిరేకంగా లండన్‌లో ఊరేగింపులు, నిరసన ప్రదర్శనలు జరిగేవి. అల్లర్లు చెలరేగేవి. దిగుమతులను నిషేధించి, స్వదేశీ పరిశ్రమలను రక్షించాలని ప్రభుత్వంమీద తీవ్రమైన ఒత్తిడి పెట్టారు. ఈస్టిండియా కంపెనీ లాభాలలో ప్రభుత్వం వాటా తీసుకొని, స్థానిక పరిశ్రమలను కాపాడాలని డిమాండ్ చేయటం మొదలుపెట్టారు. స్వదేశీ నూలుమిల్లులను ప్రారంభించి, కాలికోలను ఇంగ్లాండ్‌లోనే ఉత్పత్తిచేయటానికి కృషిచేశారు. అయినా నాలుగు ఐదు దశాబ్దాల తర్వాతకూడా భారతీయ వస్త్రాలతో పోటీపడగల సన్నని, నాజూకైన వస్త్రాలను ఉత్పత్తి చేయలేకపోయారు. వారు ఉత్పత్తి చేసిన వస్త్రాలు చాలా ముతకగా ఉండేవి. వాటితో దుస్తులు కుట్టటం వీలుకాలేదు. వాటిని ఉతకటం కూడా కష్టంగా ఉండేది. అలాంటి నాసిరకం వస్త్రాలను వాడటానికి ఎవరూ ముందుకురాలేదు. ఆ వస్త్రాలకు డిమాండ్ సృష్టించాలంటే భారతదేశపు నాజూకైన వస్త్రాల దిగుమతిని నిషేధించకతప్పని పరిస్థితులు ఏర్పడ్డాయి.

1775లో ఒక దేశభక్తుల సంఘాన్ని ఎడింబరోలో ప్రారంభించారు. అది ఇంగ్లండు 'స్వదేశీ' ఉద్యమం. విదేశీ వస్త్ర బహిష్కరణ దాని ఎజెండా. భారతీయ వస్త్రాలు

కట్టే మహిళలను దూరంగా పెట్టమనికోరారు. కనీసం జేబురుమాలు సైతం వాడకూడదని, అలా వాడేవారిపైన 200 పౌండ్ల జరిమానా విధించేవారు. భారతీయ నూలు వస్త్ర ఉత్పత్తులను కలిగిఉండటం సామాజిక నేరంగాను, దేశద్రోహంగాను ఇంగ్లాండ్ దేశభక్తులు భావించిన దశాబ్దాలు అవి. వారి ఆందోళన వలన తొలినాళ్ళలో ఈస్టిండియా కంపెనీ ఏమాత్రమూ నష్టపోలేదు. దాని లాభాలు ఏమాత్రమూ తగ్గలేదు. ఎందుకంటె భారతీయ నూలువస్త్రాలపట్ల సామాన్య ప్రజానీకానికి విపరీతమయిన మోజు ఉండేది. అందువలన భారతీయ వస్త్రాలు చట్టబద్ధంగా కొంత, చట్టం కళ్ళుకప్పి మరికొంత దిగుమతి చేసేవారు. అక్రమంగా రవాణా చేసేవారు. 1719లో తీసుకొని వచ్చిన నిషేధచట్టాల సందర్భంగా ప్రభుత్వంకూడా ఈ వాస్తవాన్ని ఒప్పుకొంది. పన్ను చెల్లించి దేశంలోకి తీసుకొని వచ్చిన వస్త్రాలకంటె, ప్రభుత్వం కళ్ళుగప్పి, పన్ను చెల్లించకుండా, దేశంలో దిగుమతి చేసుకున్న వస్త్రాలు పరిమాణంలోనూ, విలువలోనూ ఎక్కువ. కంపెనీ ఈ చట్టాలను పెద్దగా లక్ష్యపెట్టలేదు. దాని వ్యాపారం నిర్విఘ్నంగా కొనసాగటానికి ముఖ్యకారణం భారతీయ నూలువస్త్రాల నాణ్యత, నాజూకుతనం, మన్నిక, పనితనం, సరసమైన ధర. అన్ని రకాల నిషేధాలను అధిగమించి, భారతీయ వస్త్రాలు తమ ప్రత్యేకతద్వారా ఇంగ్లాండు మార్కెటును పూర్తిగా ఆక్రమించాయి.[37]

అయితే 'ప్లాసీ' యుద్ధం తర్వాత, బెంగాల్ కోశాగారం కొల్లగొట్టటం మొదలయిన తర్వాత పరిస్థితులు అకస్మాత్తుగా భారత్‌కు వ్యతిరేకంగా మారాయి. బ్రిటన్ పార్లమెంటుసభ్యులు ఈస్టిండియా కంపెనీకి పోటీదారులైన వర్తకసంఘాలతోనూ, స్వదేశీ ఎజెండాను ఎత్తుకున్న దేశభక్త బృందాలతోనూ చేతులు కలిపారు. కొత్తగా నూలు పరిశ్రమలోకి ప్రవేశించిన ఔత్సాహికులు వీరికి తోడు అయ్యారు. వారందరూ ఒకటే ధ్యేయంతో పనిచేశారు. ఈస్టిండియా కంపెనీని నియంత్రించి, భారతదేశ వాణిజ్యంమీద దానికున్న గుత్తాధిపత్యాన్ని నిలువరించాలన్నదే ఆ ధ్యేయం.

"ఈస్టిండియా కంపెనీ బ్రిటీషు ప్రభుత్వానికి ఏటా కప్పం చెల్లించాలనే ప్రతిపాదనను ప్రజల ముందు పెట్టి, అందుకు ప్రజాభిప్రాయాన్ని కూడగట్టారు.....చివరకు ఇంగ్లాండ్ ప్రభుత్వం వీరి ఒత్తిడికి లొంగి 1767లో అట్టి చట్టం చేయకతప్పలేదు. ప్రతిసంవత్సరం

4 లక్షల పౌండ్లు ప్రభుత్వానికి ఈస్టిండియా కంపెనీ చెల్లించాలని చట్టం చేశారు. కంపెనీమీద వివిధవర్గాలకు వారివారి భయాలు వారికి ఉన్నాయి. కంపెనీ, దాని అధికార ఉద్యోగగణం తాము భారత్‌నుండి దోచుకొనితెచ్చిన సొత్తుతో ఇంగ్లీషుజాతిని, ఇంగ్లీషు రాజకీయాలను భ్రష్టు పట్టిస్తారన్న భయం వారిని వెంటాడింది. ఎందుకంటె బ్రిటన్ పార్లమెంటరీ రాజకీయాలు అప్పటికే భ్రష్టుపట్టాయి. పార్లమెంటు సభ్యత్వాన్ని బహిరంగ వేలంలో కొనుక్కునే వారు. ప్రజలు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఎన్నిక చేసుకొనే పద్ధతి ఇంకా అప్పటికిలేదు. కంపెనీ, దాని ఉన్నత అధికారులు తమ ధనబలంతో తమ ప్రతినిధులకు ఇంగ్లండ్ చట్టసభలలో సభ్యత్వం కల్పించారు. కొందరు వారే సభ్యులయ్యారు. భారతదేశ దోపిడీదారులు కాలక్రమంలో ఇంగ్లాండ్‌కు పెద్ద ప్రమాదకారులు కాగలరని భావించి, వారిని నియంత్రించటానికి పూనుకొన్నారు. కంపెనీని దాని వ్యాపార, రాజకీయ సామ్రాజ్యాన్ని నియంత్రించకపోతే అదే బ్రిటన్‌ను నియంత్రిస్తుంది."[38]

1776లో అర్థశాస్త్ర పితామహుడిగా పేరుగాంచిన ఆడమ్‌స్మిత్ 'స్వేచ్ఛావాణిజ్య' సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. స్వేచ్ఛావాణిజ్యంవల్ల అన్ని దేశాలకు మేలు కల్గుతుందని ఆయన అభిప్రాయం. (వర్తకుల, ఉత్పత్తిదారుల గుత్తాధిపత్య ధోరణులను ఖండించిన ఆయనే ఇంగ్లండ్ యొక్క నౌకాయాన చట్టాలను గట్టిగా సమర్థించాడు. క్రామ్‌వెల్ కాలంనుండి చేసిన చట్టాలనే నౌకాయాన చట్టాలు అని అంటారు. వాటి ప్రధాన ఉద్దేశ్యం తమకుపోటీదారులైన డచ్ నావికా సంపదను ధ్వంసం చేయటం. ఆంగ్లేయుల వాణిజ్య లక్ష్యాలలో అది కూడా ఒకటి). ఈస్టిండియా కంపెనీ గుత్తాధిపత్యాన్ని ఆయన తీవ్రంగా వ్యతిరేకించాడు. అలాంటి గుత్తాధిపత్యం ఉన్న కంపెనీలు ఏదేశంలో ఉన్నా ప్రమాదకరమని, అటువంటి కంపెనీలు రాజ్యాధికారంలోకి వచ్చిన దేశాలు సర్వనాశనం కాక తప్పదని హెచ్చరించాడు.[39]

ఎట్టకేలకు వీరందరి యత్నాలు ఫలించి, 1813లో ఈస్టిండియా కంపెనీ గుత్తాధిపత్యానికి ముగింపు పలికింది. భారతదేశంతో, ఇంగ్లాండుకు చెందిన ఏ వర్గమైనా, ఏ వ్యాపారసంస్థ అయినా వాణిజ్యసంబంధాలు పెట్టుకోవచ్చు అని చట్టం చేశారు.

**బెంగాల్ క్షామంతో కోటిమంది అభాగ్యులు ప్రాణాలు కోల్పోయారు :**

బెంగాల్ ఆర్థికవ్యవస్థ చిన్నాభిన్నం అవటంతో, దేశ విదేశవాణిజ్యాలు దెబ్బతిన్నాయి. అన్ని ఉత్పత్తిరంగాలు కుదేలు అయ్యాయి. అదే సమయంలో ఆంగ్లేయులు బెంగాల్‌లో భూమిశిస్తులు గణనీయంగా పెంచారు. పెరిగిన భూమిశిస్తులు చెల్లించలేక పెద్ద భూస్వాములు సైతం దివాలా తీసారు.

బక్సార్ యుద్ధం 1764 అక్టోబరులో జరిగింది. ఆ యుద్ధంలో కనివినీ ఎరగని జననష్టం జరిగింది. ఆంగ్లేయుల అధికారానికి ఎదురు లేకుండా పోయింది. 1769 నుండి 1773 వరకు బెంగాల్‌లో తీవ్రమైన క్షామం ఏర్పడింది. ఆంగ్లేయుల అధికారం విస్తరించిన బెంగాల్, బీహార్ ప్రాంతాలలో ఒకకోటి మంది పైగా ప్రాణాలు కోల్పోయారు. లక్షలాదిమంది కనబడకుండా పోయారు. చేయటానికి పనిలేక, కులవృత్తులు ధ్వంసం అవటంతో, అనేక వేలమంది యాచకులుగా దిగజారారు. వారి కడగండ్ల గురించి వ్రాయటానికి మాటలు సరిపోవు. ఒకప్పుడు వైభవానికి మారుపేరుగా నిలిచిన ఢాకా, మూర్షిదాబాద్‌లలో ఆకలి, పేదరికం విలయతాండవం చేసాయని మార్టిన్ పేర్కొన్నాడు. ఢాకా జనాభా 1,50,000 నుండి 30 వేలకు పడిపోయిందని, మలేరియాతో జనవాసాలు అన్నీ రోగగ్రస్తమైనాయని, సిరిసంపదలతో తులతూగిన నగరం ఒక చిన్న మురికివాడగా దిగజారిందని 1840లో ఛార్లెస్ వ్రాశాడు.[40]

**పారిశ్రామిక విప్లవానికి కావలసిన మూలధనం ఎక్కడిది ?**

1760వ సంవత్సరంనుండి ఇంగ్లాండ్‌లో పారిశ్రామిక విప్లవం ప్రారంభం అయింది. మానవ చరిత్రలోనే 'ఒక కొత్తమలుపు'గా కొందరు, 'ఒక కీలకమైన మైలురాయి' అని మరికొందరు ఆ పారిశ్రామిక విప్లవాన్ని వర్ణించారు. ఇ.జె.హాబ్స్‌బామ్ (E.J.Hobsbawm) లిఖిత చరిత్ర ప్రారంభం అయిన తర్వాత ప్రపంచ చరిత్రలో ఏర్పడిన ఒక కీలకమైన పెద్ద పరిణామంగా దీనిని పేర్కొన్నారు. అంతేకాక కొద్దికాలం పాటు ఆ పారిశ్రామిక విప్లవం బ్రిటన్‌కు మాత్రమే పరిమితం అవటం విశేషం.[41]

18వ శతాబ్దం మధ్యవరకు వారికి వ్యవసాయము, గొఱ్ఱెల పెంపకం ప్రధాన జీవనాధారం. అక్కడ పరిశ్రమలు అని పిలువదగ్గవి ఏవీ లేవు. వారికి చెప్పుకోదగ్గ పరిశ్రమ ఉన్నిఉత్పత్తులు మాత్రమే. వారికున్న సాంకేతిక పరిజ్ఞానం కూడా నామ

మాత్రమే. వాడే పనిముట్లు, ఉత్పత్తి ప్రక్రియలు ఆదిమకాలానికి చెందినవి. కనుక 1760లో వచ్చిన పారిశ్రామిక విప్లవం అంతకుముందు శతాబ్దాలలో వారు ఎన్నడూ ఎరగనిది. ప్రత్యామ్నాయ ఆదాయ వనరులు లేక ఆఫ్రికా ఖండంపై పడి నల్లజాతీయులను పట్టి, వారిని అక్రమంగా రవాణా చేసి, బానిసల వ్యాపారంద్వారా, సముద్రపు దొంగతనాలకు పాల్పడటం ద్వారా వారు ఆదాయాన్ని సమకూర్చుకునేవారు. అందుకు ఇంగ్లాండ్ రాజరిక ప్రభుత్వం అండగా నిలబడటమే కాక, ప్రోత్సహించింది. అలాంటి నేపథ్యంలో 1760లో వచ్చిన మార్పులు వారికి భవిష్యత్తుపై కొత్త ఆశలు రేకెత్తించాయి. అందుకే వారి దృష్టిలో పారిశ్రామిక విప్లవం ఒక అపూర్వ సంఘటన.

పారిశ్రామిక విప్లవం వల్ల ఇంగ్లాండ్ లాభపడితే, భారతదేశం దానివలన పూర్తిగా నష్టపోయింది. ఇంగ్లాండ్ పారిశ్రామీకరణ భారతదేశ వ్యవసాయం, తయారీరంగం, కుటీర పరిశ్రమల విధ్వంసంమీదే జరిగింది. ఇది విపులంగా అర్థం కావాలంటే ప్లాసీ యుద్ధానికి ముందు, ఆ తర్వాత భారత్, ఇంగ్లాండ్‌లలో జరిగిన ఆర్థిక పరిణామాలను క్షుణ్ణంగా పరిశీలించవలసి ఉంటుంది. ఇంగ్లాండ్‌కు ఆరోజులలో ప్రమాదకరమైన పోటీదారు భారతదేశం మాత్రమే. కనుక భారత్ పరిశ్రమలను సమూలంగా నాశనం చేస్తే కాని, ఇంగ్లాండ్ ఎదుగలేదు. ఈస్టిండియా కంపెనీ అదే చేసింది.

**పారిశ్రామిక విప్లవానికి కావలసిన మూలధనం ఎక్కడిది? :**

ఏ దేశపు ఆర్థిక పురోభివృద్ధికి అయినా పెట్టుబడులు కీలకమైనవి, పెట్టుబడులు పెట్టటానికి మూలధన సంచయనం (Capital Accumulation) కావాలి. ఇందుకు ఇంగ్లాండు మినహాయింపు కాదు. అందుకే తగినంత మూలధనం సమకూరిన తర్వాతే ఇంగ్లాండ్‌లో పారిశ్రామిక విప్లవం 1760లో మొదలయిందన్న విషయంలో ఆర్థికవేత్తలమధ్య ఏకాభిప్రాయం ఉంది. అయితే ఒక ముఖ్యవిషయాన్ని మాత్రం వీరు విశ్లేషణ చేయరు. లేదా బహిరంగపర్చరు. కావలసిన మూలధనాన్ని ఇంగ్లాండు ఎలా సమకూర్చుకోగలిగింది? ఈ ప్రశ్నను దాటవేస్తూ ఇ.జె.హాబ్స్‌బామ్ (E.J. Hobsbawm) ఇలా వ్రాశాడు. "పారిశ్రామిక విప్లవానికి కావలసిన ఆర్థికవనరుల గురించి ప్రశ్న ఇక్కడ లేవనెత్తటం లేదు. విస్తరణకు కావలసిన మూలధన సమీకరణ,

సంచయనం గురించి చర్చించటం కంటె ఏవిధంగా ఇంగ్లాండ్‌లో పారిశ్రామిక విప్లవం ప్రారంభం అయిందనేది ముఖ్యప్రశ్న".[42]

ఇంగ్లాండు తన పారిశ్రామికీకరణకు కావలసిన మూలధనాన్ని ఎలా సమీకరించుకొంది అన్న విషయాన్ని కావాలనే వదిలివేశారు. ఎందుకంటే ఆప్రశ్నకు సమాధానం ఇంగ్లాండుకు అనుకూలంకాదు. సమాధానాన్ని అన్వేషిస్తే అనేక దిగ్భ్రాంతికరమైన వాస్తవాలు వెల్లడి అవుతాయి. అందుకనే ఆ ప్రశ్నను దాటవేయటానికి గతంలో పాశ్చాత్యులు ముఖ్యంగా ఆంగ్లమేధావులు ప్రయత్నించారు. ఆర్నాల్డ్ టాయిన్‌బీ (Arnold Toynbee) పారిశ్రామిక విప్లవాన్ని లోతుగా అధ్యయనం చేసిన చరిత్రకారుడు. ఆయన సైతం ఈ ప్రశ్నకు సమాధానం దాటవేశారు. బహుశా అనాలోచితంగా ఇలా వ్రాసాడు "చారిత్రక పద్ధతి చాదస్తమైంది. అది మనం గౌరవించే వ్యవస్థలు ఎలా మొదలయ్యాయో, ఎలా అంచెలంచెలుగా వృద్ధి చెందాయో వివరిస్తుంది. అయితే ఆ క్రమంలో, ఈ అభివృద్ధి ప్రక్రియలో భాగంగా జరిగిన దురన్యాయాలను, దుర్మార్గాలను కూడా బహిరంగ పరుస్తుంది. ఆ దురన్యాయాలను, దుర్మార్గాలను పెరిగే క్రమంలో గుడ్డిగా విస్మరించటం జరిగిందన్న విషయాన్ని కూడా బయటపెట్టుతుంది".[43]

ప్రసిద్ధ బ్రిటీషు పార్లమెంటేరియన్ విలియమ్ డిగ్బీ వాస్తవాన్ని బయటపెట్టారు. "పారిశ్రామికంగా ఇంగ్లాండ్ యొక్క ఆధిక్యతకు మూలం బెంగాల్, కర్ణాటక ప్రాంతాల నుండి తరలించబడ్డ భారతనిధులు (ఇప్పటి తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌లోని దక్షిణ ప్రాంతాలుకూడా అప్పట్లో కర్ణాటక ప్రభువుల ప్రభావక్షేత్రంలో ఉండేవి.) ప్లాసీయుద్ధానికి ముందు, భారతదేశపు నిధులను బ్రిటన్‌కు తరలించకముందు ఇంగ్లాండ్‌లోని పరిశ్రమలు చాలా అధమస్థాయిలో ఉన్నాయి".[44] అంటే ఇంగ్లాండ్‌కు కావలసిన మూలధనం 18వ శతాబ్దిలో భారతదేశంనుండే సమకూర్చుకోవటం జరిగింది. భారత్‌నుండి వచ్చిన నిధుల వెల్లువవలననే ఇంగ్లాండ్‌లో వచ్చిన శాస్త్ర, సాంకేతిక ఆవిష్కరణలను ఉపయోగించుకోవటానికి వీలుచిక్కింది. ప్లాసీయుద్ధం 1757లో జరిగింది. ఆ తర్వాత 3 సంవత్సరాలకే పారిశ్రామిక విప్లవం మొదలయింది. 1815లో వాటర్‌లూ యుద్ధం జరిగింది. ప్లాసీయుద్ధానికి–వాటర్‌లూయుద్ధానికీ మధ్య అంటే 1757–1815 మధ్య వెయ్యి

మిలియను (100 కోట్ల) పౌండ్లు భారతదేశంనుండి లూటీ చేశారు. ఈ 58 సంవత్సరాలలో సగటున సంవత్సరానికి 18 మిలియను (ఒక కోటీ 80 లక్షల) పౌండ్లు చొప్పున ఈస్టిండియా కంపెనీ తరలించింది. అమెరికన్ ఆర్థిక వేత్త ఆడమ్స్ ఈ విధంగా అంటున్నారు "ప్లాసీయుద్ధం ముగిసీముగియగానే బెంగాల్‌నుండి దోచుకొన్న సొత్తు (Bengal Plunder) లండన్‌కు చేరింది. దాని ప్రభావం వెనువెంటనే కనిపించింది. పారిశ్రామిక విప్లవం 1760లో మొదలైంది".[45]

బెంగాల్‌నుండి కొల్లగొట్టిన సొమ్మురావటం, ఆ వెనువెంటనే పారిశ్రామిక విప్లవం రావటం యాదృచ్ఛికముకాదు. ఆరెండింటి మధ్య కార్యకారణ సంబంధమే ఉందని ఆయన అన్నారు. దాన్ని వివరిస్తూ బ్రూక్ ఆడమ్స్ ఇంకా ఇలా అన్నాడు. "1757లో ప్లాసీ యుద్ధం జరిగింది. దాని ప్రభావం వెనువెంటనే కన్పించింది. అంతకు సమానమైన మరొక సంఘటన ఆ తర్వాత జరగలేదు. 1760లో ఎగిరే షటిల్ (Flying Shuttle loom) ను జాన్ కే ఆవిష్కరించాడు. కాల్చి, కరిగించి, లోహాన్ని శుభ్రపరిచే ప్రక్రియ (Smelting)లో చెక్కలు బదులు బొగ్గు వాడకాన్ని మొదలుపెట్టారు. 1764లో హర్‌గ్రివిస్ స్పిన్నింగ్ జెన్నీని కనుగొన్నాడు. 1766లో క్రాంప్టన్ నూలు వడికేయంత్రాన్ని (Spinning Mule), 1785లో కార్ట్‌రైట్ మరమగ్గాన్ని, అన్నింటి కంటె ముఖ్యంగా జేమ్స్‌వాట్ 1768లో ఆవిరి ఇంజన్‌ను కనుగొన్నారు. ఈయంత్రాలన్నీ తక్కువ కాలవ్యవధిలో ఎక్కువ ఉత్పత్తి చేయటానికి ఉద్దేశించబడినవే. కాలం కదలికను మరింత వేగవంతం చేసేవి (Outlets for the accelerating movement of time). కాని వాటంతట అవే వేగవంతం చెయ్యలేవు (They did not cause that acceleration). చాలా ఆవిష్కరణలు చాలా శతాబ్దాలపాటు వెలుగులోకి రాకుండా నిరుపయోగంగా పడిఉంటాయి. అలాంటి ఆవిష్కరణలు ఉపయోగంలోకి లేదా వాడకంలోకి రావటానికి అందుకు అనువైన బలవత్తరమైన చోదకశక్తులు పనిచెయ్యాలి. అలాంటి చోదకశక్తులలో డబ్బు (మూలధనం) ప్రధానమైంది. దాచిపెట్టిన డబ్బువల్ల ఎట్టి ప్రయోజనములేదు. వేగంగా చేతులు మారుతూ ఆర్థికయత్నాలకు ప్రోత్సాహకశక్తిగా డబ్బుమారాలి. భారతకోశాగారంనుండి నిధుల వెల్లువ మొదలు కాకముందు, తగినంతగా ఋణవిస్తరణ జరగలేదు. జేమ్స్‌వాట్ ఏభై సంవత్సరాలు ముందు జీవించి ఉంటే, ఆయన, ఆయనతోపాటు ఆయనచేసిన

ఆవిష్కరణలు కాలగర్భంలో కలసిపోయేవి". [46] బ్రూక్ ఆడమ్స్ "ప్రపంచం మొదలయిన తర్వాత భారతదేశాన్ని దోచుకోవటంలో వచ్చినంత లాభం ఏ పెట్టుబడిమార్గంలోనూ రాలేదు. ఎందుకంటె 50 ఏళ్ళపాటు దోచుకోవటంలో ఇంగ్లాండ్‌కు పోటీదారుడేలేడు". 1694 నుండి ప్లాసీయుద్ధంవరకు బ్రిటన్ వృద్ధిరేటు చాలాతక్కువ. ఆ తర్వాత చాలా అద్భుతవేగంతో వృద్ధి చెందింది (Prodigious)". [47]

పెర్రీస్ (Perries) తన 'ఇండ్రస్టియల్ హిస్టరీ ఆఫ్ మోడరన్ ఇంగ్లాండు'లో ఈ విధంగా వ్రాశాడు. ప్లాసీ తర్వాత అనేక ఆవిష్కరణలు వచ్చాయని, సామాజిక పరిస్థితులు అటువంటి ఆవిష్కరణలు రావటానికి అనువుగా మారాయని, అంతకు ముందుచేసిన ఆవిష్కరణలకు దిక్కులేకుండా పోయిందని అన్నారు. ఆయన వ్యాక్యాల్లో "1733లోనే కే తన ఎగిరే షటిల్ మగ్గానికి (Fly Shuttle loom), 1738లో జేమ్స్‌వాట్ జలశక్తితో పనిచేసే రోలర్ స్పిన్నింగ్ మిషనుకు పేటెంటు హక్కులు తీసుకొన్నారు. కాని ఆ ఆవిష్కరణలు ఉపయోగంలోకి రాలేదు". [48]

బ్రిటన్ పారిశ్రామిక చరిత్రను అధ్యయనం చేసిన కన్నింగ్‌హామ్ (W. Cunningham) ఇలా అంటున్నారు. "నూతన ఆవిష్కరణల యుగం కేవలం ఆవిష్కరణలు చేయగల్గిన వారి మేధస్సు, తెలివితేటలపైనే ఆధారపడదు. తగినంత మూలధన సంచయనంమీద ఎక్కువగా ఆధారపడుతుంది. ఎందుకంటె ఆవిష్కరణలు లాభసాటి అయినప్పుడు అవి ఎక్కువగా ఆవిష్కరించబడుతుంటాయి. వాటిని ఉపయోగంలోకి తీసుకొని రాగలిగిన పరిస్థితులు ఏర్పడినప్పుడే ఎక్కువ ఆవిష్కరణలు పుట్టుకొస్తాయి. ఆర్క్‌రైట్ (Arkwright) , జేమ్స్‌వాట్ (James Watt)లు చాలా అదృష్టవంతులు. విలియమ్ లీ (William Lee) కానీ డడ్లీ (Dodo Dudley)కానీ దురదృష్టవంతులు". [49]

కొత్త యంత్రాలకు, కొత్త సాంకేతిక ప్రక్రియలకు చాలా ఖర్చు అవుతుంది. అంతపెట్టుబడి పెట్టటం ఏ ఒక్కరికీ సాధ్యంకాదు. కావలసినంత మూలధనం సమకూరితేనే తప్ప ముందుకు వెళ్ళటం సాధ్యంకాదు. కాని అదొక్కటే కూడా సరిపోదు. మార్కెట్లు కూడా లభ్యమవ్వాలి. 18వ శతాబ్దంలో ఇంగ్లాడుకు ఇవన్నీ ఇంచుమించుగా సరికూడినాయి. [50]

17వ శతాబ్దంలో బ్యాంకు ఆఫ్ ఇంగ్లాండ్‌కు పారిశ్రామిక ప్రగతికి కావలసిన పరపతిని అందించే నిధులు లేవు. 18వ శతాబ్దపు మధ్యవరకు కూడా అదే పరిస్థితిలో

బ్యాంకు ఆఫ్ ఇంగ్లాండ్ ఉంది. పెద్దపెట్టున పరపతి సౌకర్యం విస్తరించగల స్థితిలో బ్యాంకు ఆఫ్ ఇంగ్లాండ్ లేదు. ఆ తర్వాత కాలంలో ఒక్కసారిగా పరిస్థితి మారిపోయింది. కారల్ మార్క్స్ చెప్పినట్లుగా పైనుండి నిధులు వఱద(ప్రవాహంలా వచ్చిపడ్డాయి. ఈ నిధులన్నీ భారతదేశంనుండి కొల్లగొట్టటం మూలంగానే వచ్చిపడినవి. ఇంకొక పండితుడు ఈ సత్యాన్ని మరొకరకంగా వ్యక్తీకరించారు. 18వ శతాబ్దపు పారిశ్రామిక విప్లవానికి ఇంగ్లాండు దేశం సిద్ధంగా ఉన్నప్పుడు, భారతదేశంనుండి దోచుకున్న సొమ్ము మంచి పోషకాలు ఉన్న ఎరువుగా ఉపయోగ పడిందని చెప్పాడు. మనం ఇప్పుడు ఖచ్చితంగా విలియమ్ డిగ్బీతో ఏకీభవించవచ్చు. "ఆధునిక పాశ్చాత్యదేశాలు ప్రాచీన నాగరికతలకు నెలవైన దేశాల వనరుల దోపిడీతోనే సుసంపన్నం అయ్యాయి".[51]

వాస్తవాలు ఇలా ఉండగా చాలామంది ఇంకా ఈ క్రింది ప్రశ్నలకు సమాధానం దాటవేయటానికి ప్రయత్నిస్తున్నారు. అయినా కూడా హబ్స్‌బామ్ వంటివారు సైతం సమాధానం యివ్వకతప్పలేదు. ఎందుకంటె ఈ ప్రశ్నలు అంత మౌలికమైనవి.

మొదటిప్రశ్న–పారిశ్రామిక విప్లవం ఇంగ్లాండ్‌లోనే ఎందుకు ప్రారంభం అయ్యింది? ఎందుకు ప్రపంచపు మొదటి వర్క్‌షాపుగా ఇంగ్లాండు రూపాంతరం చెందింది?

రెండవప్రశ్న–మొదటి ప్రశ్నతో సంబంధం ఉన్నదే. ఎందుకని విప్లవంగా పిలువబడుతున్నది 18వ శతాబ్దపు చివరిలో వచ్చింది? ముందుగాని, వెనుకగాని ఎందుకురాలేదు?

పాశ్చాత్య ఆర్థిక శాస్త్రవేత్తలు ఇలాంటి మౌలికమైన ప్రశ్నలను దాటవేయటం ఆశ్చర్యకరం. వారి సిద్ధాంతాలలో ఈ చారిత్రక వాస్తవాలకు ఎట్టి ప్రాధాన్యం లేకపోవటం కూడా దిగ్భ్రాంతికరం.

**భారతీయ పరిశ్రమల సమాధిపైనే ఇంగ్లాండ్ పారిశ్రామిక ప్రగతి :**

సన్నని, నాజూకయిన నూలు వస్త్రాలను చౌకగా, మన్నికగా ఉత్పత్తి చేస్తున్న భారతదేశపు పరిశ్రమను కుటీర పరిశ్రమగా పేర్కొని, ఇంగ్లాండ్‌లో ముతక వస్త్రాల తయారీకే పరిమితమయిన వారి పరిశ్రమను ఒక గొప్ప సాంకేతిక ఆవిష్కరణగా, పారిశ్రామిక విప్లవాన్ని తెచ్చిన పరిశ్రమగా ఆంగ్లేయులు అభివర్ణించిన తీరు ఆశ్చర్యం కల్గించక మానదు.

నిజంగా సాంకేతికంగా గణనీయమైన అభివృద్ధి సాధించి ఉంటే, ఇంగ్లాండు నాణ్యత కల్గిన, మన్నికైన వస్త్రాలను చౌకధరలకే సరఫరా చేసి మార్కెటును చేజిక్కించుకోవాలి. కాని అలా జరగలేదు. భారతదేశంనుండి వస్త్ర దిగుమతులను ఇంగ్లాండ్ నిషేధించింది. ప్రతిచర్యలు తీసుకోవడానికి దానికి స్వేచ్ఛ లేకపోవటంతో భారతీయ వస్త్రపరిశ్రమ కుదేలు అయింది. హెచ్.హెచ్. విల్సన్ ప్రముఖ చరిత్రకారుడు. ఆయన ఇలా అంటున్నారు. "అధికసుంకాలు, దిగుమతులపై నిషేధాలు లేకుంటే పైస్లే, మాంచెస్టరు మిల్లులు ఏనాడో మూతబడి ఉండేవి. ఆవిరి శక్తితో కూడా వాటిని తిరిగి తెరిపించటం, నడిపించటం వీలు అయ్యేదికాదు. భారతీయ పరిశ్రమల సమాధులపైనే వాటిని నెలకొల్పారు. స్వతంత్రదేశం అయినట్లయితే, భారత్ ప్రతిచర్యలకు పూనుకొనేది. బ్రిటన్‌నుండి వచ్చే దిగుమతులపై సుంకాలు విధించి, తన పరిశ్రమలను కాపాడుకొనగలిగేది. తన పరిశ్రమలు నాశనం కాకుండా కాపాడుకొనే ఆత్మరక్షణ చర్యలు తీసుకోవటానికి భారతదేశానికి అనుమతిలేదు. ఒక అపరిచితుడి దయా దాక్షిణ్యాలపై అది పూర్తిగా ఆధారపడింది. ఎట్టి దిగుమతిసుంకాలు వేయని బ్రిటీష ఉత్పత్తులు వారిపై బలవంతంగా రుద్దబడ్డాయి. భారతీయ ఉత్పత్తిదారులతో సమాన ఫాయిదాతో పోటీ చేయలేక విదేశీ ఉత్పత్తిదారులు దొంగదెబ్బ కొట్టారు. భారత ఉత్పత్తిదారులకు ఊపిరి ఆడకుండా చేయటానికి రాజకీయ దురన్యాయమనే శస్త్రాన్ని ప్రయోగించారు".[52]

డా॥ మార్టిన్ ఒక బ్రిటీష అధికారి. ఆయన ఇలా అంటున్నారు. "బ్రిటన్ ఉత్పత్తులు దేశీయ ఉత్పత్తుల స్థానాన్ని భర్తీచేయటాన్ని, భారతమార్కెటును చేజికించుకోవటాన్ని కొందరు బ్రిటీషువారు వారి పరిశ్రమల నైపుణ్యానికి, విజయానికి ఉదాహరణగా కీర్తిస్తున్నారు. వాస్తవానికి అది బ్రిటీష వారి నియంతృత్వానికి ఒకమంచి ఉదాహరణ. అంతేకాక తన పరిశ్రమలను కాపాడుకోవటానికి బ్రిటీషువారు భారతీయ ఉత్పత్తుల పై విధించిన దిగుమతి సుంకాల పెనుభారం వలన భారతదేశం ఏవిధంగా పేదరికంలోకి నెట్టివేయబడిందో చెప్పటానికి కూడా ఉదాహరణగా నిలుస్తుంది".[53]

హాబ్స్‌బామ్ ఇలా వ్రాస్తున్నారు "మన (ఇంగ్లాండు) పారిశ్రామిక విప్లవం వెనుక వలసదేశాలతోపాటు, అభివృద్ధి చెందని దేశాలు ఉన్నాయి. వాటికి ప్రపంచ మార్కెట్లు

అందకుండా చేయగలగటం వలననే మన పారిశ్రామిక విప్లవం సఫలం అయింది."[54]

**సమాధానంలేని ప్రశ్నలు :**

మొదటగా, పారిశ్రామిక దేశాలు నిజంగా సాంకేతికంగా అంతగా అభివృద్ధి సాధించి ఉంటే, దిగుమతిసుంకాలు, దిగుమతులపై ఆంక్షలు ఎందుకు అవసరం అవుతాయి? ఆ దేశాల పరిశ్రమల రక్షణకు ఎందుకు ఇంకా వాటిపైనే ఆధారపడు తున్నాయి?

రెండవది, ప్రపంచదేశాల మధ్య పోటీవల్ల, వారు చెప్తున్నట్లుగా నైపుణ్యంపెరిగి, ఉత్పత్తి వ్యయం తగ్గి, అందరికీ ప్రయోజనం కలిగేటట్లయితే పోటీ పెరగకుండా ఎందుకు నిరోధిస్తున్నారు? అంతేకాక పోటీదారులను దెబ్బతీయటానికి ఎందుకు అభివృద్ధి చెందిన దేశాలు పనిచేస్తున్నాయి?

మూడవది, స్వేచ్ఛావాణిజ్యం వలన ప్రపంచ వనరుల సద్వినియోగం జరిగి, మరింత న్యాయబద్ధంగా, సమంగా, అందరికీ అభివృద్ధి ఫలాలు అందుబాటులోకి రావటానికి అవకాశం ఉన్నప్పుడు, ధనికదేశాలు ఎందుకు జట్లు కట్టి, సామూహికంగా వర్ధమానదేశాల ఎగుమతులను అడ్డుకోవటమే కాక, సేచ్ఛా వాణిజ్యాన్ని తమ దేశాలకే పరిమితం చేసుకుంటున్నాయి?

తమను రాజకీయంగా వ్యతిరేకిస్తున్న దేశాలను, సైనికపరంగా, ఆర్థికపరంగా దెబ్బతీయటానికి ఎందుకు ప్రయత్నిస్తున్నాయి? వారు అనుసరించే విదేశీ విధానాల, దౌత్యనీతుల అంతిమలక్ష్యం ఏమిటి? మార్కెట్లను కైవసం చేసుకోవటం, వారికి అనుకూలమైన షరతులు, నిబంధనలమేర విదేశీ వాణిజ్యం జరిగేటట్లు ప్రభావితం చెయ్యటమేనా ఆ లక్ష్యం? నాణ్యమైన, చౌక అయిన వస్తువులు ఖరీదైన, నాసిరకం ఉత్పత్తులను మార్కెట్లనుండి తమంతతాముగా నెట్టివేయగలిగితే రాజకీయ ఒత్తిడులు, సైనికపరమైన జోక్యాలు, కుటిల దౌత్యనీతి వారికి ఎందుకు అవసరమైంది?

## References


1. Thompson and Garrat, *Rise and Fulfilment of British Rule in India*
2. H.H.Wilson, *History of British India*.
3. Rev. Phillip Anderson, *The English in Western India*, p. 22
4. John Maynard Keynes, *Treatise on Money*, pp. 156-7
5. Brooks Adams, *The Law of Civilization and Decay*, pp. 291-2
6. Ibid, p. 295

7. R.W. Harris, *England in the Eighteenth Century*, p.160
8. Brooks Adams, p. 293
9. Ibid, p. 294
10. Ibid, p 290
10a. Ibid, p 290
11. R.C.Dutt ,*The Economic History of India*, Vol 1, p. 22
12. Brooks Adams, p. 294
13. Ibid, p. 290
14. Ibid, p. 240
15. L.C.A. Knowles, *The Economic Development of British Overseas Empire*,p. 74
16. L. Scrafton, *Reflections on the Government of Indostan*, 1963.Cf. R.P. Dutt, p. 105
17. House of Commons Select Committee's 9th Report, 1783 pp.54-55, Cf. R.P. Dutt, p.106
18. Memorandum of the Nawab of Bengal to the English Governor, Cf. R.C. Dutt, *The Economic History of India*, Vol 1, p.15
19. Col. Malleson, *The Decisive Battles of India*, p. 133
20. Quoted in B.D. Basu, The Ruin of Indian Trade and Industries, p. 78
21. Henry Gouger, *A Personal Narrative of Two Years Imprisonment in Burma*, p. 2
22. Memorandum of Nawab, op. cit
23. Thomas Munro Before the Commons Committee.*Minutes of Evidence on the affairs of the East India Company (1813)* Cf. R.C. Dutt, Vol. I, pp. 181-82
24. Op cit.
25. Op .cit
26. Op. cit
27. B.D. Basu, Op.cit
28. William Bolts, Op. cit
29. R.C. Dutt, Vol 1, p.12
30. Letter of Verelst who later succeeded as Governor of Bengal. Cf. R.C.Dutt, Vol 1, p.13
31. Letter of Warren Hastings to the Governor on 25th April 1762, Cf.

R.C.Dutt Vol 1, p.14

32. Private Letter of Sergeant Brego Cf. R.C. Dutt Vol.1. p. 13
33. Letter of Mahomed Ali (Collector of Dacca). R.C. Dutt, Vol.1. p.18
34. Ibid , p. 20
35. James Mill, *History of British India.*
36. R.C. Dutt, Vol.1, pp. 23-36
37. K.N. Choudhury, *The Trading world of Asia and the English East India Company*, pp. 278-279
38. Bipan Chandra, *Modern India*, p. 89
39. Adam Smith, *An Enquiry into the Nature and Causes of Wealth of Nations*, Book IV, Chapter VII
40. Charles Trevelyan before the Select Committee in 1840. Cf. R.C. Dutt Vol.1.
41. Simon Digby "The Maritime Trade of India" The Economic History of India, Vol 1, pp. 134-5
42. E.J. Hobsbawm, p. 40
43. Arnold Toynbee, p. 58
44. William Digby, *'Prosperous' British India*, p. 30
45. Brooks Adams, *The law of Civilization and Decay*, pp. 297-298
46. Brooks Adams, p. 298
47. William Digby, p. 30
48. G.H. Perris, *The Industrial History of Modern England*, p.16
49. W. Cunningham, *Growth of English Industry and Commerce in Modern times,* Vol II, p. 610
50. *Ibid*
51. William Digby, p. 30
52. H.H. Wilson, *History of British India*, Vol.1, p. 385
53. Quoted in Frederick Clairmont, *Economic Liberalism and Under-development*, p. 90
54. E.J. Hobsbawm, p. 54



# 4

# 18వ శతాబ్దంలో భారతదేశం

పాశ్చాత్య మేధావులు ప్రాచుర్యంలోకి తెచ్చిన ఆర్థికసిద్ధాంతాలు వర్ధమాన దేశాల గతానికి, వర్తమానానికి మధ్యగల సంబంధాన్ని పరిపూర్ణంగా విశ్లేషణ చేయటానికి సహకరించవు. ఈ సిద్ధాంతాలలో అనేకం కారల్‌మార్క్స్ సమాజపరిణామ క్రమాన్ని ఇంచుమించుగా అంగీకరించి, ఆ క్రమంలోనే విశ్లేషణకు పూనుకుంటాయి. ప్రతి సమాజం తన పరిణామ క్రమంలో ఫ్యూడల్ దశనుండి పెట్టుబడిదారీ దశకు, ఆ తర్వాత సోషలిస్టు దశకు చేరుకుంటుందని, అప్పుడు వర్గరహిత సమాజం ఏర్పడుతుందని, మార్క్స్ ప్రతిపాదించాడు. దేశాలమధ్య, సమాజాలమధ్య సహజంగా ఉండే స్థూల, సూక్ష్మభేదాలను, చారిత్రక, సాంస్కృతిక వ్యత్యాసాలను, వివిధ సమాజాలలో ఉండే వ్యక్తుల స్పందనలలో, ఆలోచనలలో, చర్యలలో సహజంగా ఉండే ప్రత్యేకతలను ఆయన పరిగణనలోకి తీసుకోలేదు.

మార్క్సిస్టు తర్కాన్ని ఆధారం చేసికొని మధ్యయుగాన్ని ఫ్యూడల్ యుగంగా గుర్తించారు. భూస్వాముల చేతులలో సంపద, అధికారం కేంద్రీకృతం అవటం ఫ్యూడల్ వ్యవస్థ లక్షణం. వెనుకబాటుతనం, ఆర్థిక స్తబ్దత, నిస్తేజం, వ్యక్తుల చొరవకు అవకాశం లేకపోవటం, శాస్త్ర సాంకేతిక రంగాలలో పురోభివృద్ధి లేకపోవటం, మతం గుప్పిట్లో సామాన్యజనం నలిగిపోవటం మొదలైనవి ఫ్యూడలిజంలో ప్రస్ఫుటంగా కనిపించే ఇతర లక్షణాలు. పాశ్చాత్యదేశాలలో ఈ లక్షణాలు అన్నీ కనపడ్డాయి. శతాబ్దాల తర్వాత ఫ్యూడలిజం దశనుండి పెట్టుబడిదారీ దశకు సమాజాలు చేరుకున్నప్పుడు, లాభార్జనే ధ్యేయంగా, వ్యక్తుల చొరవకు, ప్రయోగాలకు అవకాశాలు మెరుగు అవుతున్నకొద్దీ పెట్టుబడులు పెట్టి నూతన ఆర్థిక కార్యకలాపాలు చేపట్టేందుకు ఔత్సాహికులు ముందుకు వస్తారు. శాస్త్ర సాంకేతిక ఆవిష్కరణలు చేయటానికి, వాటిని వినియోగంలోకి తేవటానికి తగిన ప్రోత్సాహకాలు లభ్యమవుతున్న కారణంగా సాంకేతిక అభివృద్ధి చోదకశక్తిగా పనిచేసి ఆర్థికాభివృద్ధికి

దారితీస్తుంది. పెట్టుబడిదారీ వ్యవస్థ ఇంగ్లాండ్‌లో మొదలయి, మిగిలిన పాశ్చాత్య దేశాలకు క్రమంగా ప్రాకింది. హాలెండ్, జర్మనీ, ఆస్ట్రియా, అమెరికా వంటి దేశాలు పెట్టుబడిదారీ దేశాలుగా కాలక్రమంలో రూపాంతరం చెందాయి. పాశ్చాత్యదేశాల జనసమాజాల చైతన్యం, చొరవ, సాహసం, ప్రగతిని సాధించాలనే తపన వారిని ఫ్యూడల్ బంధనాలనుండి విముక్తులను చేసి ఒక నూతన ఆర్థికవ్యవస్థ నెలకొనే దిశగా నడిపించాయని, ఆ వ్యవస్థ అంతులేని ఆర్థికాభివృద్ధిని, సంపదను వారికి యిచ్చిందని ఆర్థికవేత్తల అభిప్రాయం.

**వక్రీకరణలు :**

మార్క్సిస్టు ప్రతిపాదనలపట్ల గ్రుడ్డినమ్మకంతో భారతదేశ ఆర్థికాభివృద్ధికి సంబంధించి కూడా కొన్ని ముఖ్యమైన ప్రశ్నలను వారు లేవనెత్తారు. దేశాలమధ్య పోటీలో భారతదేశం ఎందుకు వెనుకబడింది? పాశ్చాత్యదేశాలలో మాదిరిగా ఇక్కడ విప్లవాలు ఎందుకు రాలేదు (శాస్త్ర సాంకేతికరంగాలలో వాణిజ్య, బ్యాంకింగ్, రవాణారంగాలలో ఎందుకు పెనుమార్పులు రాలేదు?). బ్రిటీషు వారి ఆగమనంతో భారతదేశం విదేశీవాణిజ్య రంగంలోకి అడుగుపెట్టినా ఎందుకని అభివృద్ధిపథంలోకి దూసుకొని వెళ్ళలేదు? భారతదేశంగురించి మార్క్స్ జోస్యం ఎందుకు నిజంకాలేదు? (మార్క్స్ ప్రకారం భారతదేశంలో ఇంగ్లాండు సాధించదలచిన మహత్కార్యాలు రెండు ఉన్నాయి. మొదటిది అక్కడ ఉన్న పాత ఆసియా సమాజాన్ని పూర్తిగా నామరూపాలు లేకుండా ధ్వంసం చేయటం, రెండవది ఒక పాశ్చాత్య సమాజానికి భారతదేశంలో పురుడుపోయటం. మొదటిది వినాశాత్మకం అయితే రెండవది సృజనాత్మకం) పాశ్చాత్య సమాజానికి భారతదేశంలో భౌతికపునాదులు పడిన కారణంగా ఆర్థికాభివృద్ధి సత్వరమే జరగగలదని మార్క్స్ భావించాడు. కానీ భారతదేశం వేగంగా అభివృద్ధి సాధించలేదు. ఎందువల్ల?

ఆర్థికాభివృద్ధి సిద్ధాంతాలను గ్రుడ్డిగా నమ్మిన మేధావులు ఒకేఒక కారణంగా భారతదేశం అభివృద్ధి సాధించలేదని సూత్రీకరించారు. ఇంకా 'ఫ్యూడల్'గానే ఉన్నందున, దాని ఆర్థికవ్యవస్థ ఏమార్పులకు నోచుకోకుండా ఉందని, తన పాత వ్యవస్థలను పాశ్చాత్యదేశాల మాదిరిగా పూర్తిగా రద్దు చేసుకోలేకపోయిందని, అందువలననే అది ఎక్కడ ఉందో అక్కడే ఉందని, అంతకంటె ఒక్క అడుగుకూడా ముందుకు వెయ్యలేకపోతున్నదని రోగనిర్ధారణ చేసారు. చరిత్రకారుడైనా,

రాజకీయశాస్త్ర నిపుణుడైనా, సామాజిక శాస్త్రవేత్త అయినా, ఆర్థికవేత్త అయినా అందరూ ఒకే సమాధానానికి వచ్చారు. 'గతం తాలుకూ భారంతో' భారతదేశంలో నిస్తేజం ఆవరించిందని వారు 'కనుగొన్నారు'. 18వ శతాబ్దపు భారతదేశపు స్వరూప, స్వభావాలు గురించిన వాస్తవస్పృహ వారికి లేకపోవటం విచారించదగ్గ విషయము.

గతంగురించి మనదగ్గర ఉన్న సాక్ష్యాధారాలు బహుస్వల్పం. 18వ శతాబ్దపు భారతదేశంగురించి ఆనాటి క్రైస్తవమిషనరీలు, ఆంగ్లసామాజిక శాస్త్రవేత్తలు వ్రాసిన రచనలమీదనే ఎక్కువగా ఆధారపడాలి. వారు వ్రాసిన వ్రాతలను ప్రామాణికంగా తీసుకొని విదేశీచరిత్రకారులు భారతదేశ చరిత్రను వ్రాయటానికి పూనుకొన్నారు. తమ జోక్యాన్ని సమర్థించుకొనేందుకు చారిత్రక కథనాలను వ్రాసారు. ఆంగ్లేయుల పాలన యొక్క ఆవశ్యకతను పదేపదే తెలియచెప్పటమే లక్ష్యంగా వారి రచనలు సాగాయి. భారతీయమైన ప్రతిదాన్ని వారు విమర్శించారు. నిరసించారు. కొట్టిపారవేశారు. ప్రగతి నిరోధకమైనదని పదే పదే చెప్పారు. ఇతిహాసాలు, సంస్కృతి, సంగీతం, శిల్పం, జానపద కళారీతులు, సామాజిక జీవనం, కుటుంబవ్యవస్థ, సంప్రదాయాలు, సామాజిక సంబంధాలు, నమ్మకాలు, విశ్వాసాలు, భాష, నడవడిక, పాలనాపద్ధతులు, ఆరాధనా పద్ధతులు ఇలా భారతీయమైన ప్రతిదాన్నీ వారు విమర్శించి, ప్రగతికి అవరోధంగా నిలిచాయని వ్రాసారు. ఆవిధంగా వారు అందించిన చరిత్ర వక్రీకరించబడినది, మిడిమిడిజ్ఞానంలో వ్రాయబడినది. మోసపూరితమైనది, వాస్తవదూరమైనది.

తగినంత చారిత్రక పరిశోధన చేయకుండానే, కావలసిన చారిత్రక సాక్ష్యాధారాలు సేకరించకుండానే తమ వక్రభాష్యాలతో చరిత్రను నిర్మాణం చేశారు. ఆ తర్వాత దశాబ్దాలలో ఇటువంటి వాస్తవదూరమైన చరిత్ర ఆధారంగానే భారతదేశపు అభివృద్ధిలేమిని, అందుకు దారితీసిన కారణాలను వివరించపూనుకొన్నారు. ఎప్పుడైనా చర్చలు జరిగినా, ఆంగ్ల చరిత్రకారులు వండివార్చిన చరిత్రను ఆధారంగా చేసుకొనే గతాన్ని అర్థం చేసుకోవటానికి ప్రయత్నించారు. అంతేకాక సమస్యలకు పరిష్కారాలు కూడా ఆంగ్లచరిత్రకారులు యిచ్చిన నేపథ్యంనుండే వెదికారు. అంటే ఒక వక్రీకరణ మరొక వక్రీకరణకు దారితీసి, గతాన్ని అర్థం చేసుకోవటంలో పొరపాట్లుకు దారితీసి, అసలు వాస్తవాలను మరింతగా వెనుకకు నెట్టివేయటం జరిగింది.

ఆంగ్ల మేధావులకు ఆధారభూతమైన కొన్ని ప్రమేయాలగురించి తెలుసుకుందాం. మూడువందల సంవత్సరాలక్రితం, ప్రపంచం ఆర్థికంగా వెనుకబడి ఉందని, ఫ్యూడల్ వ్యవస్థ బలంగా పాతుకొనిపోయిందని. ఆర్థికంగా ఎదుగుదలకు అవకాశం లేని స్తబ్ధత నెలకొనిందని వారు భావించారు. అట్టి పరిస్థితులలో వ్యవసాయమే ప్రధాన జీవనాధారమై, వ్యాపారాలు, పరిశ్రమలు చాలా ప్రాథమిక స్థాయిలో ఉండేవని, విదేశీ వాణిజ్యం లేనేలేదని, శ్రమవిభజనగురించి తెలియనే తెలియదని వారు అభిప్రాయపడ్డారు. రాజులు, ప్రభుత్వాలు ప్రజలగురించి పట్టించుకోలేదని, విందులు, విలాసాలతో కాలక్షేపం చేసేవారని, ప్రజలు కడుపేదరికంలో బ్రతుకులు వెళ్ళదీసేవారని. కఱవుకాటకాలు, పేదరికం, అంటువ్యాధులు విలయతాండవం చేసేవని వారు పేర్కొన్నారు. సామాజిక ఆర్థిక వ్యవస్థలు దోపీడీకి కేంద్రంగా ఉండేవని, ఇతరుల శ్రమను, మేధస్సును దోచుకొనేవని, ప్రజలకు ఎలాంటి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, హక్కులు లేనేలేవని వారు తీర్మానించారు.

వాస్తవానికి ఈ పరిస్థితులు ఇంచుమించుగా అన్ని పాశ్చాత్య దేశాలలో ఉన్నవే. పాశ్చాత్యదేశాలలో ఎలాంటి పరిస్థితులు నెలకొని ఉన్నాయో అలాంటి పరిస్థితులే ప్రాచ్యదేశాలలోనూ, ఇంకాచెప్పవలసివస్తే ప్రపంచం మొత్తంమీద నెలకొని ఉన్నాయని, ఉంటాయని వారు భావించారు. భారతదేశంలో కూడా అలాంటి పరిస్థితులే నెలకొని ఉంటాయని వారు భావించారు. కాలక్రమంలో ఇలాంటి అభిప్రాయాలే వారు నిర్మాణం చేసిన సిద్ధాంతాలకు, విశ్లేషణా నమూనాలకు, చూపిన పరిష్కారాలకు ఆధారభూతమయ్యాయి. ఇవి వారికి అనువంశిక ఊహాగానాలు (Genetic Assumptions) అయ్యాయి!

**పాశ్చాత్య దృష్టికోణంనుండే విశ్లేషణలు :**

రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత తృతీయ ప్రపంచదేశాల అభివృద్ధి అంశం చర్చకు వచ్చినప్పుడు, ఈ ప్రాథమిక నమ్మకాలను ప్రశ్నించాలన్న భావనే చాలామందికి కలుగలేదు. తృతీయ ప్రపంచపు నేపథ్యపు వాస్తవాలను సక్రమంగా అవగాహన చేసుకోకుండానే ఆ దేశాల అభివృద్ధికి ప్రణాళికలు రూపొందించారు. ఈనాటికి మన సామాజిక శాస్త్రవేత్తలు పాశ్చాత్యదృష్టికోణాన్ని ప్రశ్నించటానికి సిద్ధంగా లేరు. వలసవాదులు మన ముందు ఉంచిన భూమికయొక్క శాస్త్రీయతను ప్రశ్నించటంలేదు. కొందరు స్వతంత్ర పరిశోధకులు మాత్రం వినూత్నంగా ఆలోచించి

 వలసపాలనకు పూర్వమున్న భారతదేశంలో ఎంతో వ్యయ ప్రయాసలకులోనై పరిశోధనలు చేసి, అబ్బురపరిచే వాస్తవాలను వెలికితీస్తున్నారు. స్థితిగతులపై విశేషమైన 18వ శతాబ్దపు భారతదేశాన్ని ఒక వెనుకబడ్డదేశంగా, మూఢనమ్మకాలతో కూడిన వ్యవసాయిక దేశంగా, ఏమాత్రం ఐకమత్యం లేని సమాజంగా పాశ్చాత్య మేధావులు ప్రచారం చేసారు. అయితే ధర్మపాల్, కె.యస్. చౌదరి, రోథర్‌ముండ్, తపన్‌రాయ్ చౌదరి, పీయర్‌సన్, యస్.చౌదరి, ఏ.దాస్‌గుప్తా, హెచ్. ఫర్బర్, వాన్ ఐయర్, పి.నైటింగేలు, యస్. అర్సరత్నం, వి.యస్.నయిపాల్, అశీష్‌నంది, కుసుమలతా కేడియా మొదలైన వారు వలసపాలన కాలంలో భారతసమాజపు తీరుతెన్నులను వివిధ కోణాలలో ఆవిష్కరించారు.

**18వ శతాబ్ది భారతదేశపు శతాబ్ది :**

18వ శతాబ్దపు భారతదేశానికి సంబంధించి, కేవలం ఒకేఒక అంశాన్ని పరిశీలించినా, పాశ్చాత్యమేధావుల జాతిపరమైన పక్షపాత విశ్లేషణల డొల్లతనం తెలుసుకోవచ్చు. భారతదేశం ఇతరదేశాలతో చేసిన సముద్ర వాణిజ్యపు తీరుతెన్నులను పరిశీలిస్తే ఆనాడు మనదేశం ఏస్థాయిలో ఉన్నదో తెలుస్తుంది. 'కేంబ్రిడ్జి చరిత్ర గ్రంథం' (Cambridge History of India) కూడా ఈ విధమైన హెచ్చరిక చెయ్యకతప్పలేదు "హిందూమహాసముద్రం ద్వారా జరిగిన వాణిజ్యాన్ని పాశ్చాత్యకోణం నుంచే చూస్తున్నారు. పాశ్చాత్యదేశాల ప్రాచీన భాండాగారాలలో మిగిలి ఉన్న పాతదస్తావేజుల ఆధారంగానే వారు విశ్లేషణ చేయటం వలననే ఈ పరిస్థితి నెలకొంది".[1]

భారతదేశ సముద్ర వాణిజ్యవివరాలు వెలుగులోకి తీసుకొని రావటానికి చేసిన పరిశోధనలు ఎక్కువగా ఈస్టిండియా కంపెనీ తన రిజిష్టర్లలో నమోదు చేసిన ఉత్తరప్రత్యుత్తరాలు, లండన్‌లోని తన ప్రధాన కార్యాలయానికి పంపిన వివరాలు, మెమోలు మొదలైన వాటిపై ఆధారపడ్డాయి. కె.ఎన్.చౌదరిగారి 'ట్రేడింగు వరల్డ్ ఆఫ్ ఏసియా' అనే గ్రంథం ఈస్టిండియా కంపెనీవారి రిజిష్టర్లమీద ప్రధానంగా ఆధారపడి తయారుచేసింది. ఏ. దాస్‌గుప్తా వ్రాసిన 'మలబార్ ఇన్ ఏసియన్ ట్రేడ్ 1740-1800', 'ఇండియన్ మర్చంట్ అండ్ డిక్లైన్ ఆఫ్ సూరత్ 1700-50' కూడా అదే విధంగా వ్రాసినవే. డచ్ వ్యాపారసంస్థ నమోదుచేసిన వాణిజ్య వివరాలు ఆధారంగా జె.సి.వాన్‌లియర్ (J.C. Van Leur) 'ఇండోనేషియన్ ట్రేడ్ అండ్ సొసైటీ'

అనే గ్రంథం వ్రాశారు. ఈ గ్రంథాలన్నీ పాశ్చాత్యకోణంనుండి వ్రాసినవే. ఆసియాలో వారు ప్రవేశించటం, విస్తరించటం, పాశ్చాత్య దేశాల ఆర్థిక చరిత్రలో భాగంగానే వీటిని అధ్యయనం చేశారు. భారతదేశ లేక ఆసియా దృష్టికోణంనుండి సముద్రవాణిజ్యాన్ని అర్థంచేసుకొనే ప్రయత్నం ఇప్పుడిప్పుడే మొదలైంది. ఆసియాయొక్క సముద్ర వ్యాపారచరిత్ర బహువిస్తృతమైంది. సుదీర్ఘకాలం కొనసాగింది. దాని పూర్తివివరాలు వెలుగులోకి రావటానికి మరికొన్ని దశాబ్దాలు పట్టవచ్చు.

మొగలాయి చక్రవర్తుల దస్తావేజులను పరిశీలించి, భారతదేశ సముద్రవాణిజ్య చరిత్రను అధ్యయనం చేసినవారు బహుకొద్దిమందే ఉన్నారు. సూరత్, హుగ్లీ, బాలాసోర్‌లలోని రేవు పట్టణ కార్యాలయాలు ఆనాటి ఎగుమతులు దిగుమతుల వివరాలను చాలా జాగ్రత్తగా నమోదు చేసాయి. మొగలాయిల దస్తావేజులు అనేకం 'హేగ్' నగరంలోని భాండాగారంలో నేటికి లభిస్తున్నాయి. ఆ దస్తావేజులను నిష్పాక్షికంగా పరిశీలన చెయ్యగలిగితే, అనేక వాస్తవాలు వెలుగులోకి రాగలవు.[2]

ఆ కాలంలో ఆసియా సముద్రవాణిజ్యంలో పాశ్చాత్య దేశాలవాటా నామమాత్రంగా ఉండేదని తెలుస్తున్నది. 17, 18 శతాబ్దలలో ఆసియా వ్యాపారులతో పోల్చితే, పాశ్చాత్యవ్యాపారులు బహుకొద్దిమంది. వాస్తవానికి 18వ శతాబ్దం ఆసియా శతాబ్దం అనిచెప్పవచ్చు. వాన్‌లియర్ ఇదే అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. ఆసియా శతాబ్దిలో ఐరోపాఖండం యొక్క పాత్ర నామమాత్రంగా ఉండేదని ఆయన వ్రాసారు.[3] అప్పుడప్పుడు వచ్చిపోయే పాశ్చాత్య వ్యాపారులు కొంత ఉత్సుకతతోనూ, మరికొంత అనుమానస్పద అపనమ్మకంతోనూ చూడబడేవారు. అయినప్పటికి వారిగురించి, వారు చేసిన సాహస సముద్రయానాలగురించి ఎక్కువప్రచారం కల్పిస్తూ చారిత్రక కథనాలు వ్రాశారు. అదే సమయంలో అరేబియా, చైనా, భారతదేశ, ఇతర ఆసియాదేశాల వ్యాపారుల గురించిన ప్రస్తావన ఎక్కడా కన్పడదు. ఈ కారణంగా 18వ శతాబ్దపు భారతదేశంగురించి వివరాలు ఎక్కువగా లభ్యమవటంలేదు.

ప్రముఖ చరిత్రకారుడు ఇ.హెచ్.కార్ (E.H.Carr) 'వాట్ ఈజ్ హిస్టరీ' అనే ఉద్గ్రంథాన్ని వ్రాశారు. ఆయన చరిత్రకారుని పక్షపాతానికి హేతువు ఏమిటో

తెలియచేస్తూ ఈవిధంగా వ్యాఖ్యానించారు "వాస్తవాలు బెస్తవాని దుకాణంలోని బల్లమీద పరచబడిన చేపలవంటివి కావు. అవి లోతైన నీటిలో ఈతకొట్టే చేపల వంటివి. చరిత్రకారుడికి అందే వాస్తవాలు రెండు అంశాలపై ఆధారపడి ఉంటాయి. ఎటువంటి చేపలు పట్టగోరుతున్నాడో, అవి లభించే చోటుకు, తగిన సాధనంతో వెళ్లాడు. మొత్తంమీద ఎలాంటి వాస్తవాలు రాబట్టుకుందామని అనుకొంటున్నాడో, అలాంటి వాస్తవాలే చరిత్రకారుడికి దొరుకుతాయి".[4]

## సముద్రవాణిజ్యంలో అగ్రగామిగా భారతదేశం :

ఉత్పత్తుల ధరల వ్యత్యాసంమీదే ఎగుమతులు-దిగుమతులు ఆధారపడతాయి. ఇతర దేశాల కంటె చౌకగాను, నాణ్యంగాను ఉత్పత్తి చేయగలిగితే మన ఎగుమతులకు అంతర్జాతీయంగా గిరాకీ ఉంటుంది. 17,18 శతాబ్దాలలో భారతదేశపు వాణిజ్యతీరును వివరిస్తూ రాయ్‌చౌదరి ఈవిధంగా వ్యాఖ్యానించాడు "ఇతరదేశాల నుండి కనకం, వెండి ప్రవాహంలా దేశంలోకి వచ్చిపడ్డాయి. ఎందుకంటె మననాజూకైన ఉత్పత్తులకు అంత గిరాకీ నాగరిక ప్రపంచంలో ఉంది".[5] భారతదేశానికి సోనే కీ చిడియా (బంగారుపక్షి) అనే ప్రశస్తి ఉంది. వివిధ దేశాలలో గనులనుండి వెలికితీయబడిన బంగారం ఎగుమతి-దిగుమతుల సందర్భంలో వినిమయంద్వారా భారతదేశం వచ్చిచేరేది. ఆ శతాబ్దాలలో ఆసియాదేశాలు ఐరోపా ఖండంనుండి దిగుమతి చేసుకోగల వస్తుసేవలు ఏవీ లేవు. ఒకవేళ ఐరోపానుంచి ఏవైనా దిగుమతి చేసుకున్నా, అవి ఇతర ఆసియాదేశాలలో ఉత్పత్తి చేయబడ్డవే.[6] "ఇంగ్లాండులోని బంగారం వ్యాపారులు తమ సంపదంతా ఆసియాకు తరలివెళ్ళటం చూసి ఆందోళన చెందేవారు. అనతికాలంలోనే ఆ బదిలీవలన ఐరోపా పేదరికంలోకి నెట్టివేయబడుతుందని భయపడ్డారు".[7]

పై వ్యాఖ్యానాలను బట్టి చూస్తే ఒక శక్తిమంతమైన, చైతన్యవంతమైన ఆర్థికవ్యవస్థ ఆ శతాబ్దాలలో భారతదేశంలో ఉన్నట్లుగా సూచనాప్రాయంగా తెలుస్తుంది. ఉత్పత్తి ప్రక్రియలు, సాంకేతిక పరిజ్ఞానం అత్యున్నతస్థాయిలో ఉన్నప్పుడే, తక్కువ ఉత్పత్తి వ్యయంతో ఎక్కువ ఉత్పత్తి చేయగల ఉన్నతస్థాయి సమతుల్యత ఆర్థికవ్యవస్థలో ఏర్పడుతుంది. చరిత్రకు అందని కాలంనుండి భారత్‌కు సుదూర ప్రాంతాలతో వర్తక వాణిజ్య సంబంధాలు ఉండేవి. దేశంలో సైతం ప్రతిప్రాంతం కొన్ని వస్తుసేవల ఉత్పత్తిలో ప్రావీణ్యతను సంతరించుకొన్నది. ఉన్నతమైన ఆర్థిక ప్రావీణ్యత (Economic specialisation) వలన ప్రతిప్రాంతం మరొక ప్రాంతానికి

యివ్వటానికి తనదగ్గర ప్రత్యేకవస్తుసేవలు ఉండేవి. దానితో వివిధ ప్రాంతాలమధ్య పెద్ద ఎత్తున కొను గోళ్ళు, అమ్మకాలు, రవాణాలు జరుగుతూ ఉండేవి. అందువలన ప్రభుత్వాలకు పెద్ద ఎత్తున ఆదాయం వచ్చేది. ప్రభుత్వవ్యయం కూడా అదే స్థాయిలో ఉండి ప్రజలకు మేలు చేకూరేది.

పై విషయాలు పోర్చుగీసువారు హిందూమహాసముద్రవ్యాపారం గురించి నమోదు చేసిన వివరాలనుబట్టి తెలుస్తున్నాయి. వారి ప్రకారం ఆసియా, ఆఫ్రికా, అమెరికా, ఐరోపా ఖండదేశాలతో భారతదేశం వ్యాపారం చేసేది. హిందూమహాసముద్రం మీదుగా భారతదేశం చేసే వ్యాపారం చాలా చురుకుగా జరిగేదని, మిరియాలు మాత్రమేకాక అనేక వస్తువులు భారతదేశం ఎగుమతి చేసేదని ఆశ్చర్యంతో నమోదు చేశారు. తుదకు నౌకలకొద్దీ ధాన్యాన్ని కూడా ఎగుమతి చేసేదని వ్రాశారు. ఆఫ్రికా, పర్షియన్‌గల్ఫ్ ప్రాంతాలలోని అనేక రేవులకు గుజరాత్‌నుండి పెద్దపెట్టున బియ్యం ఎగుమతులు జరిగేవని తెలుస్తుంది.[8] అదే విధంగా నాజూకైన వస్త్రాలు మధ్యప్రాచ్యం, ఆగ్నేయ ఆసియా దేశాలప్రజల బట్టల అవసరాలు తీర్చేవి. నూలు వస్త్రాల ఉత్పత్తిలో భారతదేశానికి ఉన్న నైపుణ్యానికి భయపడి బ్రిటీషు ఉత్పత్తిదారులు తమ పరిశ్రమల రక్షణకై ఇంగ్లాండులో దిగుమతులపై సుంకాలు విధించవలసిందని డిమాండ్ చేసేవారు. క్లుప్తంగా చెప్పాలంటే పరిమాణంలోనూ, వైవిధ్యంలోనూ మిగిలిన అన్ని దేశాలకంటె భారతదేశ ఎగుమతుల వ్యాపారం మిన్నగా ఉండేది.[9]

**భారతవ్యాపారుల పేరుప్రతిష్టలు :**

భారతీయ వ్యాపారులగురించి కూడా అలాంటి ప్రశంసలు ఆనాటి విదేశీ వ్యాపారులు కురిపించారు. ఈస్టిండియా కంపెనీ రికార్డులలో పెద్దపెద్ద వ్యాపారుల గురించి పదేపదే ప్రస్తావన కన్పిస్తుంది. సూరత్‌కు చెందిన వీర్‌జీ వోరా (Virji Vora), దక్షిణ భారతానికి చెందిన చిన్నన్నచెట్టిలు ప్రముఖ వ్యాపారులుగా ఖ్యాతి గడించారు. వోరా తలుచుకుంటే మొత్తం వ్యాపారాన్ని తలక్రిందులు చేయగలడని, సూరత్ వ్యాపారవర్గాలలో ఆయన మాటే చెల్లుబాటు అయ్యేదని, ఎవరూ ఆయనకు పోటీగా నిలిచేవారు కాదని 1636లో ఇంగ్లీషు కౌన్సిల్ అభిప్రాయపడింది. కంపెనీ బ్రోకర్లు సైతం వ్యాపారం కోసం ఆయన దయాదాక్షిణ్యాలపై ఆధారపడి ఉండేవారు. కంపెనీ దిగుమతులను ఆయన అనుమతిలేనిదే ఇతర వ్యాపారులెవ్వరూ కొనటానికి సాహసించరని కూడా వ్రాశాడు. ఒకరకంగా వోరా ఒక్కడే సూరత్ మార్కెటును

శాసించేవాడు. ఆయనను కాదని కంపెనీ ప్రతినిధులు ఏ వస్తువునూ అమ్మగలిగేవారు కాదు.[10] మొదట్లో అట్లాంటిక్ మహాసముద్రంలో ఓడల్ని దోచి తెచ్చి బంగారం సమర్పించుకొన్న ఆంగ్లేయులు ప్లాసీ యుద్ధానంతరం మనదేశంలో లభించిన బంగారంతోనే లావాదేవీలు జరిపి లాభా లార్జించారు. ధనవంతులయ్యారు.

అలెగ్జాండర్ హామిల్టన్ అనే బ్రిటన్ వ్యాపారి ఇంకొక పెద్ద భారతవ్యాపారి గురించి కూడా వ్రాసాడు. ఆయన పేరు అబ్దుల్‌గఫూర్. ఈస్టిండియా కంపెనీ వ్యాపారంతో సమానంగా వ్యాపారం చేసేవాడని, ఆయన వ్యాపారం అనేకరకాలుగా విస్తరించిందని వ్రాశాడు. "ప్రతి సంవత్సరం 20 లేక 30 నౌకలు సూరత్‌తీరంనుండి బయలుదేరేవి. ఒక్కొక్క నౌకలో 300 నుండి 800 టన్నుల సరుకు రవాణా అయ్యేది. అందులో సగానికి పైగా ఆయన సరుకే ఉండేది. వాటి విలువ 10వేలనుండి 25వేల పౌండ్లు ఉండేది. విదేశాలకు పంపగా, అంత మొత్తం సరుకు దేశంలో అమ్ముకోవటానికి ఆయన దగ్గర నిల్వ ఉండేది. రాబోయే సంవత్సరాల అవసరాల నిమిత్తంగా కూడా అపారంగా సరుకునిల్వలు ఉండేవి" ఆయన సంపాదించిన ఆస్తులు 18వ శతాబ్దం మధ్యవరకు ఆయన వారసులు అనుభవించారు.[11] అహమ్మద్ చెల్లాబే (సూరత్), అర్మేనియన్ సోదరులు కోర్ఖూసర్హాద్, కోర్ఖూవజీద్ (బెంగాల్), సుంకురామ చెట్టి (తూర్పు తీరం) మొదలైన వ్యాపారులు సుప్రసిద్ధులు. జగత్‌షా అనే వ్యాపారి ప్రపంచవ్యాపారిగా పేరు గాంచాడు. బెంగాల్ నుండి వచ్చే ఆదాయాన్ని ఒకే ఒక హుండీ ద్వారా ఢిల్లీకి బదిలీ చెయ్యగల సత్తా ఆయనకు ఉండేది.[12]

విదేశీవ్యాపారుల నివేదికలనుంచి బయటపడ్డ ఈ వివరాలు కొన్ని మాత్రమే. అలాంటి పెద్ద వ్యాపారులు అన్ని రేవుపట్టణాలలోనూ ఉండేవారు. జాన్‌హెన్రీ సూరత్‌ను 18వ శతాబ్దపు మధ్యలో దర్శించాడు. హిందూ వ్యాపారుల ఆర్థిక స్తోమత గుర్తించి బహుధా వారిని ప్రస్తుతించాడు. ఈస్టిండియా కంపెనీ కాని, ఇతర పాశ్చాత్య కంపెనీలు కాని తెచ్చిన సరుకును మొత్తం ఒకేఒక వ్యాపారే కొనగలడని ఆయన వ్రాసాడు. అంతేకాక వెంటనే మొత్తం సరుకుకు డబ్బుచెల్లించేవారని కూడా వ్రాసాడు. వెనువెంటనే కొన్న సరుకుకు మూల్యం చెల్లించటం వ్యాపారంలో మాటలుకాదు. అందులో నౌకల నిండా వచ్చేమొత్తం సరుకును కొని, డబ్బురూపంలో వెంటనే చెల్లించటం అసామాన్యమైన విషయం.

1735లో కేవలం 5గురు కాఫీ వ్యాపారులు కంపెనీ కొనుగోలు చేసిన దానిలో 80 శాతం పైగా కాఫీని సరఫరా చేసారని కూడా నమోదు చేశారు. యెమన్ దేశపు కాఫీ మార్కెటును భారతీయ వ్యాపారులే చేజిక్కించుకున్నారు. వీర్‌జీ వోరా, సుంకురామ చెట్టి వంటి వ్యాపారులకు స్వంతంగా వ్యాపారనౌకలు ఉండేవని, వాటితో అన్ని ఆసియా దేశాలతో వ్యాపారం చేసేవారని కూడా కంపెనీ వారి రికార్డులు తెలియచేస్తున్నాయి.[13]

రష్యావంటి దూరదేశాలకు కూడా భారతీయ వ్యాపారస్థులు సరుకును రవాణా చేసేవారని హెూల్డెన్ ఫర్బర్ పేర్కొన్నాడు. 1625 నాటికే భారతీయ వ్యాపారులు వోల్గానదీ తీర ప్రాంతంలో వ్యాపారం చేసేవారని, 1650 నాటికి 23 రకాల వస్తువుల వ్యాపారంలో భారతీయులు ఎంతో మిన్నగా ఉన్నారని కూడా ఆయన నమోదు చేసాడు.[14]

భారతీయ వ్యాపారులు సుదూర ప్రాంతాలకు వస్తువులను రవాణాచేసి రెండు చేతులా తరతరాలకు సరిపడా విశేషంగా సంపాదించారు. రాజులను, చక్రవర్తులను ప్రభావితం చేయగల స్థితిలో ఉండేవారు. డచ్‌వారితో దృఢంగా వ్యవహరించమని ఒత్తిడి తెచ్చేందుకు సూరత్‌లోని వ్యాపారులందర్నీ అబ్దుల్‌గఫూర్ కూడగట్టాడు. పాశ్చాత్య సముద్రపు దొంగలు కొల్లగొట్టిన నౌకల యజమానులకు నష్టపరిహారం యిచ్చేలా డచ్‌వారి మెడలువంచే ప్రయత్నం చేసి, సఫలీకృతుడయ్యాడు. వ్యాపారస్థులకు స్వంతనౌకలు ఉండేవి. తమ స్వంత నౌకలతోనే వారు సముద్రవాణిజ్యం చేసేవారు. కులీన వర్గాలకు, ప్రభుత్వాలకు సైతం అప్పులు యిచ్చేవారు. బ్యాంకర్లుగా, మనీ ఛేంజర్స్‌గా వ్యవహరించే వారు.

స్వంతనౌకలు లేని వ్యాపారులు నౌకలను అద్దెకు తీసుకొనేవారు. వారి ప్రతినిధులు అన్ని ముఖ్య రేవుపట్టణాలలో ఉండేవారు. ఆగ్రా పట్టణాన్ని గల్ఫ్‌దేశాల ముఖ్యరేవు పట్టణాలతో అనుసంధానంచేసి, విదేశీ వాణిజ్యంలో చురుకుగా పాల్గొనేవారు. సూరత్ వ్యాపారస్థుల ప్రతినిధులు ఆసియాలోని అన్ని ముఖ్యరేవు పట్టణాలలో ఉండేవారు. ప్రామిసరీనోట్లు అప్పటికే వాడుకలోకి వచ్చాయి. వాటిని యిచ్చేవారు, తీసుకునేవారు. అలాగే వాటి ఆధారంగా డబ్బు చెల్లించేవారు. దానితోపాటుగా వ్యాపారానికి అవసరమైన సమాచారాన్ని (commercial intelligence) కూడా సరఫరా చేసేవారు.[15]

ఇటువంటి పెద్దవ్యాపారులముందు పాశ్చాత్య వ్యాపారస్థుల నక్కజిత్తులు పనికివచ్చేవికావు. బెంగాల్‌లో తొలినాళ్ళలో బ్రిటీషువారి విస్తరణను అడ్డుకొన్న రెండు ప్రధాన అంశాలు గురించి ఫర్బర్ వ్రాశాడు. కొందరు నవాబులు సమర్థవంతంగా పనిచేయటం మొదటికారణంకాగా, కొన్ని వ్యాపారకుటుంబాల వారు చాలా శక్తిమంతులు అవటం కారణంగా ఈస్టిండియా కంపెనీ జిత్తుల మారితనం పనికిరాలేదు. బెంగాల్ కరెన్సీమీద సేఠ్ కుటుంబం నియంత్రణ ఉండేది. ఇంగ్లీషు కంపెనీ బెంగాల్‌లో ఒకసారి నాణేలు ముద్రించేయత్నం చేసింది. 1713 నుండి 1743 మధ్య లండన్‌నుండి భారతదేశానికి వచ్చే వెండి విలువ ఏటా 75 వేల పౌండ్లనుండి లక్ష పౌండ్లకు పెరిగింది. అయినప్పటికి నాణెములు ఇంగ్లీషు కంపెనీ ముద్రించకుండా సేఠ్ కుటుంబం చాలా ఏళ్ళు అడ్డుకొన్నది. అంతశక్తి మంతంగా ఆ కుటుంబం ఉండేది.[16]

ఈస్టిండియా కంపెనీ ప్రారంభమైన తొలినాళ్ళలో సైతం ఆసియా విదేశీ వాణిజ్యంలో పాశ్చాత్యుల వాటా నామమాత్రంగా ఉండేది. కంపెనీ ప్రతినిధులు వారి ఈ దురవస్థ గురించి వారి ప్రధాన కార్యాలయానికి తెలియచేస్తూ ఉత్తరప్రత్యుత్తరాలు జరిపేవారు. భారతదేశంలో అనేకమంది వీర్‌జీ వోరాల వంటి ప్రముఖ వ్యాపారులు ఉండేవారు. ఈస్టిండియా కంపెనీ బాగా ఎదిగిన తర్వాత కూడా, అది చేసే వ్యాపారం భారతీయ వ్యాపారులకు ఏమాత్రమూ పోటీగా నిలబడగల స్థితిలో లేకపోవటంతో వారిని ఎవ్వరూ లెక్కచేసేవారు కాదు. భారతీయవ్యాపారుల విదేశీవాణిజ్యం అప్రతిహతంగా కొనసాగుతుండేది. అంతకుముందు దశాబ్దాలతో పోల్చిచూసినప్పుడు ఈస్టిండియా కంపెనీ వాటా పెరిగినప్పటికి, భారతీయ వ్యాపారులకు కంపెనీ ఆనాడు పోటీదారుగా ఎదగలేదు. ఈస్టిండియాకంపెనీ రాజ్యాధికారాన్ని చేజిక్కించుకోకపోతే, వారివ్యాపారం భారతదేశ సముద్రవాణిజ్యంలో అప్రధానంగానే ఉండిపోయోదేమో.

1753లో ఢాకా నుండి ఎగుమతి అయిన వస్త్రాలలో కేవలం మూడవ వంతువాటా మాత్రమే పాశ్చాత్య వ్యాపారులది. అదే కాలంలో ఆగ్నేయ ఆసియా దేశాలతో సాగించిన సుగంధ ద్రవ్యాల ఎగుమతుల వ్యాపారంలో భారతవ్యాపారులదే పైచేయిగా ఉండేది. సుగంధ ద్రవ్యాలకోసం డచ్‌వ్యాపార సంస్థలు భారతవ్యాపారులతో వాణిజ్య సంబంధాలు పెట్టుకొనేవి.[17]

**వాణిజ్యాభివృద్ధిలో రాజుల పాత్ర :**

పాశ్చాత్య చరిత్రకారులు వారిదేశాల రాజులు, రాణులు ఆ దేశాల విదేశీ వాణిజ్య విస్తరణలో నిర్వహించిన పాత్రను ఎక్కువచేసి చూపిస్తూ, అదే సమయంలో భారతదేశపాలకులు నిర్వహించిన పాత్రను అవహేళన చేస్తూ అనేక వ్యాఖ్యానాలు చేశారు. యుద్ధాలతోనూ, విందు విలాసాలతోనూ భారతదేశపు పాలకులు కాలం గడిపేవారని వ్రాసారు. కానీ అది సత్యదూరం. భారతదేశపు సముద్రవాణిజ్యం అత్యంత ప్రశాంత వాతావరణంలో జరిగేది. సముద్రపు దొంగతనాలు చాలా తక్కువగా జరిగేవి. భారత వ్యాపారుల నౌకలను రక్షించేందుకు సాయుధులైన సైనికులు ఉండేవారు. ఎప్పుడైనా సముద్రపు దొంగతనాలు జరిగితే, వారిని పట్టి శిక్షించేందుకు ప్రత్యేక రక్షకదళాలు పనిచేసేవి. నావికాదళం భారత సముద్రమార్గాలను గస్తీ చేస్తుండేది. పాశ్చాత్య దేశపు సముద్రపు దొంగలు భారతీయ నౌకలజోలికి రావటానికి జంకేవారు. సముద్రపుదొంగల ప్రాబల్యం పెరిగిన 18వ శతాబ్దంలో సైతం వారు భారతీయ పాలకుల భద్రతాదళాలకు భయపడేవారు. పాశ్చాత్యుల వ్యాపారనౌకలు అవసరానికి మించి ఆయుధాలు కల్గిఉంటే తీరం చేరటానికి వాటికి అనుమతులు యిచ్చేవారు కాదు. 'హిస్టరీ ఆఫ్ బ్రిటీష' పుస్తకంలో ఒక మొగలాయి అడ్మిరల్ బెంగాల్, బాంబేల నుండి ఈస్టిండియా కంపెనీని ఎలా బహిష్కరణకు గురిచేశాడో హంటర్ వ్రాశాడు. మరాఠాల నౌకాదళం 18వ శతాబ్దంలో ఈస్టిండియా కంపెనీ యొక్క బాంబే వ్యాపారానికి పెద్ద సవాలుగా మారిందని పేర్కొన్నారు.[18]

ఆసియాదేశాల విదేశీ వాణిజ్య పద్ధతులకు, పాశ్చాత్యుల వ్యాపార పద్ధతులకు మౌలికమైన తేడాలు ఉన్నాయి. ఆసియానుండి ఐరోపాఖండానికి ఉత్పత్తులు వెల్లువలా ప్రవహించేవి. పాశ్చాత్యదేశాలు ఈ ఏకపక్షవాణిజ్యాన్ని నియంత్రించి, లబ్ధి పొందటానికి ప్రయత్నించేవారు. అందుకు రెండు మార్గాలను ఎంచుకొన్నారు. మొదటిది సముద్రపు దొంగతనాలను వ్యవస్థీకృతం చేసి, పాలకులే వాటిని ప్రోత్సహించటం. రెండవది సముద్రపు మార్గాల వెంట ముఖ్యమైన రేవుపట్టణాలలో కష్టమ్స్ స్టేషనులను ఏర్పాటుచేసి, రవాణా సుంకాలను వసూలు చేయటం. సముద్రపు దొంగతనాలను ప్రోత్సహించటానికి అనుమతిపత్రాలను మంజూరు చేసి, దోచుకొని వచ్చిన సొత్తులో కొంతభాగం వాటాగా ప్రభుత్వాలు తీసుకొనేవి. అనుమతిపత్రం ఉన్న సముద్రపుదొంగలు పట్టుబడితే వారిని యుద్ధఖైదీలుగా చూడాలి.

లేని వారిని దొంగలుగానే పరిగణించి ఉరిశిక్ష విధించేవారు. ఈ అనుమతిపత్రాలు లేని వారిని దొంగలుగానే పరిగణించి ఉరిశిక్ష విధించేవారు. ఈ అనుమతిపత్రాన్ని CARTAZ అని అంటారు.[19]

సముద్రవాణిజ్య మార్గాలను నియంత్రించటం, సముద్రమార్గాలను రక్షించే నెపంమీద సుంకాలు వసూలు చేయటం (Protection Rent) అనే ఆలోచన ఆసియా ఉత్పత్తులను దిగుమతిచేసుకొనే దేశాలకు వచ్చింది. వెల్లువలా వచ్చి పడుతున్న ఉత్పత్తులకు పోటీని యివ్వలేక, కనీసం సముద్రమార్గాల రక్షణ పేరుతో కొంత ఆదాయాన్ని ఆర్జించాలని వారి ఆకాంక్ష. మధ్యధరా సముద్రంలో 'వెనిస్' వ్యాపారులు (వెనిటియన్లు) ఈ పద్ధతినే చాలా దశాబ్దాలుగా అనుసరిస్తూ వచ్చారు. వారి నమూనాను మొదటగా పోర్చుగీసువారు హిందూమహాసముద్రంలో ప్రవేశ పెట్టారు. ఆ తర్వాత వచ్చిన 'డచ్' వారు వారి పద్ధతినే అనుసరించి పోర్చుగీసు గుత్తాధిపత్యాన్ని పోగొట్టి, అంతిమంగా వారినే హిందూ మహాసముద్రంనుండి వెళ్ళగొట్టారు. బ్రిటీషువారు వారి అడుగుజాడలలోనే నడిచి, పూర్తిగా సముద్రమార్గాలను వారి గుత్తాధిపత్యంలోకి తెచ్చుకున్నారు. ఆసియాదేశపు ఉత్పత్తులకు మరింత గిరాకీని వారు సృష్టించటమేకాక, ఖండాంతర వాణిజ్యంలో ఎదురయ్యే సమస్యలను సత్వరమే పరిష్కరించటానికి ప్రయత్నం చేశారు. అంతేకాక దృఢమైన, వేగవంతమైన నౌకలను నిర్మాణం చేశారు. వాటికి సాయుధ రక్షణ కవచాన్ని ఏర్పాటు చేశారు. ఈ కారణాలవలన ఆనాటి కాలానికి తగ్గట్లు, వేగంగా, భద్రంగా సరుకు రవాణా చేయగల నౌకలతో ఖండాంతర వ్యాపారానికి అనువైన పరిస్థితులు నెలకొల్ప గలగటంతో బ్రిటీషువారి గుత్తాధిపత్యానికి ఎదురులేకుండా పోయింది.[20]

మధ్యయుగంలో పాశ్చాత్యదేశాలమధ్య ఆధిపత్యపోరులు తరుచూ జరుగుతూ ఉండేవి. అవి ఆ తర్వాత దశాబ్దాలకు కూడా విస్తరించాయి. హిందూ మహాసముద్ర వాణిజ్యమార్గాలను కైవసం చేసుకునేందుకు వాటిమధ్య నెలకొన్న తీవ్రమైన పోటీ కూడా ఆ ఆధిపత్య ఆకాంక్షలనుండి పుట్టిందే. ఇతరదేశాలను పోటీనుండి తప్పిస్తే, గుత్తాధిపత్య లాభాలు మెండుగా ఉండటంతో వాటిమధ్య ఎప్పుడూ యుద్ధవాతావరణమే నెలకొని ఉండేది. మిరియాల వ్యాపారంలో పోర్చుగీసువారు గుత్తాధిపత్యంకోసం తీవ్రంగా శ్రమించి, సాధించారు. చాలా దశాబ్దాలపాటు ఆ వ్యాపారం వారి చేతులలో ఉంది. తాము కనిపెట్టిన లేక ఉపయోగిస్తున్న సముద్రమార్గాలను ఇతరదేశాలకు తెలియకుండా జాగ్రత్తపడేవారు. తమ సముద్రమార్గ

రహస్యాలను శత్రుదేశాలకు చేరవేసే ప్రయత్నం చేసేవారికి ఉరిశిక్ష విధించేవారు. ఇందులో కూడా వెనిస్ వారికి మార్గం చూపింది. సముద్రమార్గాన్ని తెలియచెప్పినా, సముద్రమార్గపటాలను ఇతరదేశాలతో పంచుకున్నా అట్టివారిని నిర్దాక్షిణ్యంగా చంపివేసేవారు. 100 సంవత్సరాలపాటు పోర్చుగీసువారు భారతదేశానికి తాము కనుగొన్న సముద్రమార్గాన్ని అత్యంత రహస్యంగా కాపాడుకోగలిగారు. తాముతప్ప మరెవ్వరూ భారతదేశంతో కాని, ఇతర ఆసియా దేశాలతో కాని వ్యాపారం చెయ్యకుండా నిరోధించగలిగారు.[21]

**సముద్రపు దొంగలే నావికాధికారులు :**

ఇటువంటి పరిస్థితులలో పోటీదారులు అనేక వ్యూహాలు పన్నుతూ ఉండేవారు. సముద్రంమీద నడిచే వాణిజ్యనౌకలను దోచుకోవటంవలన వచ్చేలాభాలు అపారంగా ఉండటంతో, ఆ వృత్తిని అనేకులు ఎంచుకున్నారు. ఆ వృత్తిని వదిలి వేసేందుకు కూడా వారెప్పుడూ ఆలోచించలేదు. ఎందుకంటే దానిద్వారా వచ్చే ఆదాయం అంత ఆకర్షణీయంగా ఉండేది. అందువలన పాశ్చాత్య దేశాలు ఈ 'సముద్రవ్యాపారులకు' (సముద్రపుదొంగలకు) ప్రభుత్వరక్షణ కల్పించేవి. పాశ్చాత్యుల పరిభాషలో సముద్రపు దొంగతనం అనేది కాలక్రమంలో ఒక చట్టబద్ధమైన జప్తుగా (Lawful Seizure) లేక 'మంచి బహుమతి'గా (Fair Prize) మారిపోయింది. ఈ రెండు పదాలు అంతర్జాతీయ చట్టాలలో కూడా చోటు చేసుకున్నాయి.[22]

ఈ సముద్రపు దొంగలు, సాహసికులు, దోపిడీ దొంగలను 'లబ్ధ ప్రతిష్ఠులైన' తర్వాత వారిని సైన్య, నావికాధికారులుగా నియమించేవారు. స్పానిష్ యుద్ధనౌకల సమూహాన్ని ఓడించటంలో బ్రిటన్‌కు చెందిన ప్రసిద్ధ సముద్రపు దొంగ 'డ్రేక్' కీలకమైన పాత్రను పోషించాడు. పాశ్చాత్యదేశాలకు, భారతదేశానికి మౌలికమైన తేడా ఇక్కడే ఉంది. పాశ్చాత్యదేశాలు సముద్రపు దొంగతనాలను ప్రోత్సహించటమేకాక, సముద్రపు దొంగలకు బిరుదులు యిచ్చి, సత్కరించి, తమతమ నావికాదళాల నాయకత్వం కూడా వారికి అప్పగించేవారు. ఇందుకు భిన్నంగా భారతపాలకులు సముద్రపు దొంగలను పట్టి వారికి ఉరిశిక్ష విధించేవారు. సముద్రపుదొంగలకు ఎట్టి గౌరవమూ ఉండేదికాదు. వారిని దొంగలుగానే చూసేవారు. ఆ కారణంగా భారతదేశ సముద్రవాణిజ్యం ఎలాంటి అవాంతరం లేకుండా, శాంతియుతంగా, స్వేచ్ఛగా కొనసాగుతుండేది.

ఔరంగజేబు 1707 లో మరణించాడు. కొందరు సుబేదార్లు స్వతంత్రం ప్రకటించుకొన్నారు. కేంద్రీకృత అధికారం బలహీనపడిన కారణంగా అనేక ప్రాంతాలు స్వతంత్రం ప్రకటించుకున్నాయి. అంతేకాక అవి అతివేగంగా అభివృద్ధి సాధించాయని చెప్పేందుకు ఇప్పుడు సాక్ష్యాధారాలు లభిస్తున్నాయి. వస్తు ఉత్పత్తిలో, వాణిజ్య విస్తరణలో అనేక ప్రాంతాలు పుంజుకొన్నాయి. బెంగాల్ నవాబుల చొరవతో ఆ ప్రాంతం ఒక పెద్ద పట్టు, నూలువస్త్ర ఉత్పత్తి కేంద్రంగా అనతికాలంలోనే ఎదిగి, ఎగుమతులకు నెలవుగా మారింది. భారతదేశంనుండి ఎన్నడూ ఎగుమతులు ఆగలేదు. సముద్ర వాణిజ్యం కుంటుపడలేదు. పాలకులు మారినా, పద్ధతులు మారలేదు. 18వ శతాబ్దపు భారతదేశం అనేకరంగాలలో అభివృద్ధి సాధించి, ఎగువస్థాయి ఆర్థిక సమతుల్యత (High level Economic Equilibrium)లో ఉన్నదని చెప్పటానికి ఇప్పుడు సాక్ష్యాధారాలు బలంగా లభిస్తున్నాయి.

**18వ శతాబ్దిలో శాస్త్ర సాంకేతిక రంగాలలో భారతదేశపు ఔన్నత్యం :**

శాస్త్ర సాంకేతిక రంగాలలోను భారతదేశం 18వ శతాబ్ది నాటికే ఎంతో అభివృద్ధి సాధించిందని ధర్మపాల్‌గారి ఉద్గ్రంథం 'Indian Science and Technology in the Eighteenth Century' బట్టి తెలుస్తుంది. ఈస్టిండియా కంపెనీకి చెందిన కొందరు అధికారులు, పాశ్చాత్యశాస్త్రవేత్తలు వ్రాసిన రచనలను ధర్మపాల్ ఆ గ్రంథంలో సంకలనం చేశారు. గణిత, ఖగోళశాస్త్రాలలో హిందువుల అపూర్వప్రతిభాపాటవాల గురించి ప్రపంచానికి తెలుసు. 18వ శతాబ్దపు భారతదేశంలో శాస్త్రసాంకేతిక రంగాలస్థాయిని తెలుసుకోవటానికి ఇప్పుడు ఆంగ్లేయుల రచనలే ముఖ్య ఆధారం. ఆ రచనల ఆధారంగానే ధర్మపాల్‌గారు 18వ శతాబ్ది భారతదేశ శాస్త్రసాంకేతిక రంగాలగురించి ఎంతో విలువైన సమాచారాన్ని సంకలనం చేసారు.

పాశ్చాత్య లేక ఆంగ్లరచయితలు మన పూర్వీకుల గొప్పతనాన్ని ఒకవైపు మెచ్చుకొంటూనే, 18వ శతాబ్దపు భారతదేశపు శాస్త్రవేత్తల స్థాయిని కించపరుస్తూ అనేక వ్యాసాలు వ్రాసారు. వారి దృష్టిలో ఆనాటి భారతీయ శాస్త్రవేత్తలకు, బ్రాహ్మణ పండితులకు పూర్వీకులు వారికి యిచ్చిన జ్ఞానాన్ని వాడుకోవటమే తప్ప, వాటి వెనుక ఉన్న మౌలిక కల్పనలు, సిద్ధాంతాలు ఏవీ తెలియవని వ్రాశారు. బెనారస్‌లోని

నక్షత్రశాల, భారతీయుల బీజగణితం, బైనామియల్ థీరమ్‌ల గురించి ఆంగ్లపండితులు లోతైన విశ్లేషణలను చేసారు.

జాన్ ప్లేఫెయిర్ ఎడిన్‌బరో విశ్వవిద్యాలయంలో గణితశాస్త్ర ఆచార్యుడు. ఖగోళ శాస్త్రంలో కూడా నిష్ణాతుడు. 1789లో ఆయన వ్రాస్తూ క్రీస్తుకు పూర్వం 3102 సంవత్సరంలో (అంటే కలియుగ ప్రారంభ సంవత్సరంలో) ఉన్న గ్రహగతులను భారతఖగోళశాస్త్రజ్ఞులు కచ్చితంగా లెక్కగట్టగలగటం వారి అసాధారణప్రతిభకు నిదర్శనంగా పేర్కొంటునే, ఆ సంవత్సరంలో జీవించిన కొందరు ఆనాటి ఖగోళపరిస్థితులను చూసి, నమోదు చేసి ఉంటారని పేర్కొన్నాడు. అయితే ఆ అభిప్రాయంపైన కూడా వారు ఆ తర్వాత నిలబడలేదు. క్రైస్తవమత ఛాందసవాదం పెరిగిన తర్వాత, బైబిలు పాతనిబంధన కాలగణనకులోబడి మానవచరిత్రలోని ప్రధానఘట్టాల జరిగిన కాలాన్ని నిర్ధారించటం మొదలుపెట్టారు. ప్రాచీనకాలంలో హిందువులు సాధించిన వైజ్ఞానిక ప్రగతిని అంగీకరించటం క్రైస్తవమత విశ్వాసాలకు ద్రోహం చేసినట్లు అవుతుంది కనుక-భారతీయుల వేదాలను, ఉపనిషత్తులను, చరిత్రను, కళలను, శాస్త్రసాంకేతిక వైజ్ఞానిక ప్రగతిని, ఆవిష్కరణలను మరీపురాతన కాలానికి చెందినవి కావని చెప్పటానికి తప్పుడు కథనాలను, వక్రీకరణలకు పూనుకొన్నారు.

పాతనిబంధనలో పేర్కొనబడ్డ జలప్రళయం ("The Deluge") క్రీస్తుకుపూర్వం 2348వ సంవత్సరంలో వచ్చి ఉంటుందని అనేక తర్జనభర్జనల తర్వాత తేల్చారు. జలప్రళయానికి ముందు కాలానికి చెందిన కొన్ని శాస్త్రాలు, కొంత శాస్త్రపరిజ్ఞానం ఆ ప్రళయంలో మునిగిపోకుండా మిగిలిపొయ్యాయని, అందులో భారతీయ ఖగోళశాస్త్ర పరిజ్ఞానం కూడా ఒకటి అయిఉండవచ్చునని ప్రఖ్యాత ఎడిన్‌బరో రివ్యూ పత్రిక పేర్కొంది. ఆనాటి పాశ్చాత్య శాస్త్రవేత్తలలో అనేకులు పాతనిబంధన గ్రంథంలోని జలప్రళయాన్ని మానవచరిత్రలో ఒక ఉపప్రమాణం (Reference Point)గా అంగీకరించారు. హిందువుల ఖగోళశాస్త్ర గ్రహగతుల పట్టికలు (ephemeral tables) అతిపురాతన కాలానికి చెందినవని ఒప్పుకోవటం వారికి యిష్టంలేక, అవి జలప్రళయ ముప్పుకు కొన్ని ముందు సంవత్సరాలనాటివి మాత్రమేనని నిరూపించాలనే వ్యర్థప్రయత్నం పాశ్చాత్య శాస్త్రజ్ఞులు చేసారు. (The Edinburgh review, Vol 22, Jan 1814 pp 474-75).

**హిందువుల ఖగోళశాస్త్ర పరిజ్ఞానం :**

హిందువుల ఖగోళశాస్త్ర ప్రాచీనతను గురించి ఒప్పుకోకతప్పనప్పుడు కూడా, 18వ శతాబ్దపు భారతదేశపు శాస్త్రజ్ఞులను, పండితులను పెద్దగా శాస్త్ర పరిజ్ఞానమూ అవగాహన లేనివారుగా ఆంగ్లేయులు పేర్కొన్నారు. ప్లేఫెయిర్ తన వ్యాసంలో గ్రహగతులపట్టికల నిర్మాణంవెనుక ఉన్న సిద్ధాంతభూమిక, శాస్త్రపరిజ్ఞానం 18వ శతాబ్దపు బ్రాహ్మణపండితులకు లేదని, తెలుసుకోవాలన్న ఆసక్తి కూడా వారికి ఉన్నట్లు కన్పించదని వ్రాసారు. అయితే వారి సహాయంతోనే పాశ్చాత్యులకు హిందూ ఖగోళశాస్త్ర పరిజ్ఞానం గురించి తెలియవచ్చిందన్న విషయం వారు కావాలనే మర్చిపొయ్యారు. 1769లో భారతదేశానికి వచ్చిన ఎమ్.లీజెంట్ బ్రాహ్మణ పండితుల సహకారంతోనే హిందూ ఖగోళశాస్త్రపద్ధతులపై ఒక పెద్ద గ్రంథాన్ని వ్రాసాడు. దీనిని బట్టి 18వ శతాబ్దంలో ఖగోళశాస్త్రంలో నిష్ణాతులైన వారు ఎందరో ఉండేవారని తెలుస్తుంది. ఆకాలంలో ప్రచురించిన ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికాలో కూడా ఈవిషయాన్ని పేర్కొన్నారు.

ఆ తర్వాత దేశంలో పర్యటించటానికి వచ్చిన పాశ్చాత్యులు తమ జాత్యహంకారంతో విశ్లేషణలు చేసారు. “అన్నీ వేదాలలోనే ఉన్నాయిష!” అని అగ్నిహోత్రావధాన్లు కన్యాశుల్కం నాటకంలో అంటాడు. ప్రపంచంలో ఏమూల ఏది ఆవిష్కరించబడ్డా, అవన్నీ హిందువులు తమ గ్రంథాలలో ఉన్నాయని చెప్పుకుంటారని పాశ్చాత్యులు అవహేళన చేస్తూవ్రాసేవారు. హిందువుల గ్రంథాలలో చెప్పబడే శ్వేతద్వీపం యూరోపు ద్వీపకల్పమేనని కూడా ఆంగ్లేయులు వెటకారంగా చెప్పేవారు.

అటువంటి నేపథ్యంలో ఎన్నోతప్పుడు కథనాలు వారు అల్లారు. అందులో ముఖ్యమైంది బెనారస్‌లోని నక్షత్రశాల గురించి చేసిన విశ్లేషణలు. దశాశ్వమేధఘాట్‌కు కొన్ని వందల గజాల దూరంలోని ఆ నక్షత్రశాల భారతీయ ఖగోళశాస్త్ర ప్రాచీనతకు చిహ్నంగా నేటికీ నిలిచిఉంది. సర్‌రాబర్ట్ బేకర్ 1772లో దానిని దర్శించి, అది బహుశా రెండు శతాబ్దుల వెనుకకాలానికి చెందిఉంటుందని బ్రిటీషు రాయల్ సొసైటీ పత్రికలో వ్రాసాడు. అయితే కొందరు రాయల్ సొసైటీ సభ్యుల కోరికమేరకు 1793లో జె.ఎల్.విలియమ్స్ ఆ నక్షత్రశాలను దర్శించి, అది కేవలం 50-60 సంవత్సరాలక్రితం నాటిదని వ్రాసాడు. అందుకు నిదర్శనంగా ఒక మేజిస్ట్రేటు

యిచ్చిన వాఙ్మూలాన్ని ఉటంకించాడు. 19వ శతాబ్దంలో అనేకమంది పాశ్చాత్యశాస్త్రవేత్తలు ఆ నక్షత్రశాలను దర్శించారు. కాని వారు వెలుబుచ్చిన అభిప్రాయాలమీద చర్చను ప్రచురించటం మానివేసారు.

1920లో భారతీయ పురాతత్వ సర్వేక్షణ సంస్థ పాతనక్షత్రశాలలపై ప్రచురించిన పుస్తకంతో తిరిగి బెనారస్ నక్షత్రశాల గురించిన చర్చ మొదలయింది. ఆ నక్షత్రశాలను నెలకొల్పిన భవనం 17వ శతాబ్దం ప్రారంభం నాటిదని, నక్షత్రశాల ఉపకరణాలను రాజా జైసింగ్ 1737లో సమకూర్చి ఉంటాడని ఆ పుస్తకంలో వ్రాసారు. నిర్మాణం కచ్చితంగా ఎప్పుడు జరిగిందో చెప్పలేమని, ఒకరు వ్రాసిన దానికి మరొకరు వ్రాసిన దానికి పొంతనేలేదని అంటూనే విలియమ్స్ వ్రాసినట్లుగా 1737లో దాని నిర్మాణం జరిగి ఉంటుందని పేర్కొన్నారు. ప్రఖ్యాత శాస్త్రజ్ఞులు బార్కర్, పియర్స్, కాంప్‌బెల్‌లు ఈ నక్షత్రశాలను 1772లో సందర్శించారు. దాని నిర్మాణం ఆ పుస్తకంలో పేర్కొన్నట్లుగా 1737లోనే జరిగిఉంటే, దాని నిర్మాణాన్ని కళ్ళారా చూసిన ప్రత్యక్షసాక్షులు కొందరైనా అప్పటికి లభించి ఉండేవారు. దాని నిర్మాణకాలం గురించి 1772లో వివాదమేలేదు. అంతకుముందు రెండు శతాబ్దాలవెనుక దాని నిర్మాణం జరిగిఉంటుందని బార్కర్ పేర్కొన్నాడు కూడా. అయితే 200 సంవత్సరాల ప్రాచీనతను ఒప్పుకొంటే తద్వారా దానికి వచ్చే ప్రాముఖ్యాన్ని జీర్ణించుకోలేక అది అప్పటికి 35 సంవత్సరాల వెనుక మాత్రమే అంటే 1737లోనే నిర్మాణం జరిగిఉంటుందని పేర్కొనటం వారి జాత్యంహకారానికి, పక్షపాత వైఖరికి నిదర్శనం.

ఖగోళశాస్త్ర పరిజ్ఞానంగురించే ఇంకొక ఉదాహరణను చూద్దాం. కల్నల్ డి.టి.పియర్స్ భారతదేశాన్ని సందర్శించి 1782లో ఒక పరిశోధనాపత్రాన్ని లండన్‌లోని రాయల్ సొసైటీకి పంపాడు. గురుగ్రహానికి 4 ఉపగ్రహాల ఉనికి గురించి, అలాగే శనిగ్రహానికి గల ఏడు ఉపగ్రహాల ఉనికి గురించి హిందువులకు చాలాకాలంగా తెలుసునని వ్రాసాడు. గురుగ్రహానికి గల 4 ఉపగ్రహాల గురించి పాశ్చాత్యులకు 1609 వరకు తెలియనే తెలియదు. ఆయన వ్రాసిన 1782 నాటికి శనికిగల ఆరో ఉపగ్రహం గురించి కూడా వారికి తెలియదు. ఆ తర్వాత ఏడు ఏళ్ళకు (ఆగష్టు 28, 1789) హిర్షల్ అనే శాస్త్రజ్ఞుడు దానిని మొదటగా కనుగొన్నాడు. ఏడవ ఉపగ్రహాన్ని ఆతర్వాత 20 రోజులకు సెప్టెంబరు 17, 1789న ఒక పెద్ద 40 అడుగుల ఫోకల్ నిడివిగల టెలిస్కోపుతో కనుగొన్నాడు. శనిఉ

ఉపగ్రహాలు చాలా చిన్నవి, భూమికి చాలా దూరంలో ఉంటాయి. వాటిని చూడటానికి ఎంతో సామర్థ్యంకల టెలిస్కోపులు కావాలి. అటువంటి టెలిస్కోపుల సహాయంతోనే హిందువులు ఆ ఉపగ్రహాలను కనుగొనిఉంటారని పియర్స్ తన పత్రంలో పేర్కొన్నాడు. 18వ శతాబ్దం నాటికి అటువంటి టెలిస్కోపులు దేశంలో కనుమరుగు అయ్యాయి. ద్విపదసిద్ధాంతం (Binomial Theorem) గురించి భారతీయగణిత మేధావులకు ఆ సిద్ధాంతాన్ని యూరోపులో ఆవిష్కరించిన బెర్నొలే (1654-1705) కంటె ముందే తెలుసునని చెప్పటానికి సైతం సాక్ష్యాధారాలు నేడు లభిస్తున్నాయి.

జాన్ ప్లేఫెయిర్ ప్రాచ్యదేశాలనుండి సేకరించిన గ్రహగతులపట్టికలకు ధ్రువరేఖగా బెనారస్ ఉండటాన్ని గమనించి ఆశ్చర్యం ప్రకటించాడు. వారి శకసంవత్సరం మార్చి 21, 638 నుండి ప్రారంభం అవుతుందని పేర్కొన్నాడు. దక్షిణ భారతదేశం నుండి సేకరించిన గ్రహగతులపట్టికలన్నిటికి 'కలియుగం' ప్రారంభం శకసంవత్సరం అవటాన్ని ఆయనగమనించాడు. కలియుగం క్రీస్తుకు పూర్వం 3102 సంవత్సరంలో మొదలయింది. 46 శతాబ్దాల వెనుకకు వెళ్ళి ఆనాటిగ్రహగతులను లెక్కించగలగటం ఒక అపూర్వమైన విషయంగా ఆయన పేర్కొన్నాడు. భూమ్యాకర్షణ సిద్ధాంతం, కలన గణితం వంటి ఆధునిక పద్ధతులద్వారానే ఆధునికులు అంత వెనుకకు వెళ్ళి లెక్కించగలరు. అటువంటిది బ్రాహ్మణ పండితులు తమ దగ్గఱ ఉన్న ప్రాచీనపట్టికల ద్వారా కచ్చితంగా లెక్కించగలగటం వారి ప్రతిభాపాటవాలకు హిందువుల ఖగోళశాస్త్ర విజ్ఞానపరిణతికి నిదర్శనమని వ్రాసారు. అంకగణితం, త్రికోణమితి వంటి శాస్త్ర పరిజ్ఞానం కూడా వారికి తెలిసిఉండకపోతే ఆ విధంగా కచ్చితంగా లెక్కించటం అసాధ్యమని ఆయన పేర్కొన్నాడు. 18వ శతాబ్దిలోనూ ఖగోళశాస్త్ర ప్రవీణులు దేశమంతటా ఉన్నట్లు ఆయన వ్రాసిన వ్యాసాన్నిబట్టి విదితం అవుతుంది.

### అపూర్వ వైద్యచికిత్సా పద్ధతులు :

శస్త్రచికిత్సా పద్ధతులకు సుశ్రుతుడు పితామహుడు. భారతీయులకు గల శస్త్రచికిత్సా నైపుణ్యంగురించి కల్నల్ క్లైడ్ వ్రాసాడు. 18వశతాబ్దంలో పుండ్లు (ulcers) ను శస్త్రచికిత్సచేసి తొలగించటం మారుమూల ప్రాంతాలలో నివసిస్తున్న వారికి కూడా తెలుసునని ఆయన పేర్కొన్నాడు. పశ్చిమభారతదేశంలో ప్లాస్టిక్‌సర్జరీలు చేసేవారని డా॥ డి. హెచ్. స్కాట్ రాయల్ సొసైటీకి పంపిన పత్రంలో పేర్కొన్నాడు.

భారతీయుల ఔషధప్రయోగంకంటె, వారి శస్త్రచికిత్సా నైపుణ్యాలను ప్రశంసించకతప్పదని, పాశ్చాత్యులకు ఆనాటికి తెలియని ఆ చికిత్సాపద్ధతులను ఆయన తన పత్రంలో పేర్కొన్నాడు. ప్రమాదవశాత్తునగాని, యుద్ధం కారణంగాని కోల్పోయిన ముక్కులను తిరిగి అతికించగలిగే నైపుణ్యం భారతీయులకు ఉందని కూడా ఆయన వ్రాశాడు. జంతువుల శరీరభాగాలను నైపుణ్యంతో అతికించగలరని పేర్కొంటూ, అందుకు అవసరమైన ఒక రకమైన సిమెంటు కాటీ (caute)ని ఆయన సేకరించి లండన్‌కు పంపాడుకూడా.

మశూచి నిరోధక టీకాలను ఎడ్వర్డ్ జెన్నర్ 1796లో ఆవిష్కరించారు. అయితే భారతదేశంలో మశూచి వ్యాధి రాకుండా టీకాలు ఎప్పటినుండో అమలులో ఉన్నట్లుగా తెలుస్తుంది. 1802-3లో దేశీయ టీకాలను వలసపాలకులు బెంగాల్‌లో నిషేధించారు. ప్రభావంలోనూ, పనితీరులోనూ ఆధునిక టీకాలకు ఏమాత్రమూ తీసిపోని టీకాలను భారతీయులు తయారుచేయగలిగారు. పదిలక్షలలో ఏ ఒక్కరికో మశూచి సోకేదని, లేదా ఇతర ఇబ్బందులు వచ్చేవని, ఇది చాలా అద్భుతమైన విషయం అని ప్రముఖ బ్రిటీష్ వైద్యులు డా॥ హల్‌వెల్ లండన్ వైద్యులకు 1767లో వ్రాసిన పత్రంలో పేర్కొన్నారు. 18వ శతాబ్ది వరకు దేశీయ టీకాలు అందరికీ అందుబాటులో ఉండేవి. సర్వజనులకూ టీకాలను ఉచితంగా యిచ్చేవారు. అయితే 1800వ సంవత్సరంనాటికి పాశ్చాత్యులు ముఖ్యంగా ఆంగ్లేయులు ఈ టీకాలు తీసుకోవటానికి యిష్టపడలేదు. అవి ప్రమాదకరంగా, తమమత విశ్వాసాలకు వ్యతిరేకంగా వారికి తోచాయి. దానితో కలకత్తాలోనూ, మరికొన్ని ఇతర పట్టణాలలోనూ వాటిని తయారుచెయ్యటాన్ని, ఉపయోగించటాన్ని నిషేధించారు. అయినప్పటికీ 1870 వరకు దేశీయ టీకాలను జనం తీసుకుంటూనే ఉన్నారు. అంతకుముందు బహిరంగంగా తీసుకొనేవారు. నిషేధాజ్ఞలు కారణంగా రహస్యంగా తీసుకొనేవారు. 1870 నాటికి కలకత్తాలో కేవలం 10 శాతం మంది, బెనారస్‌లో 36 శాతంమంది మాత్రమే టీకాలు వేయించుకోలేదని వారే ప్రకటించారు కూడా.

పాలకుల ప్రోత్సాహం కఱవైన కారణంగా, టీకాల ఉత్పత్తి క్రమంగా తగ్గిపోయింది. నిషేధం దానికి తోడయ్యింది. దేశీయ టీకాలు తీసుకోవటం తగ్గిపోయిన కారణంగా దేశంలో మశూచి మహమ్మారి విజృంభించింది. 19వ శతాబ్దంలో విస్తారంగానూ, 20వ శతాబ్దిలో తరచుగానూ మశూచివలన

లక్షలాదిమంది ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. అంగవికలురు అయ్యారు. ప్రజలకు అందుబాటులోకి వచ్చిన దేశీయ టీకాల నిషేధం, ప్రజారోగ్యం ఏమాత్రం పట్టని పాలకుల నిర్లక్ష్యం అందుకు ప్రధానకారణాలు. ఇతర ప్రాంతాలతో పోల్చినప్పుడు, దేశీయ టీకాలు విస్తృతంగా వాడుకలో ఉన్న బెంగాల్‌లో మశూచివ్యాధి సంక్రమణం, మశూచి మరణాలు తక్కువగా ఉన్న విషయాన్ని చరిత్రకారులు గుర్తించారు కూడా. హాల్‌వెల్ వర్ణించిన ప్రకారం సూక్ష్మజీవకారక అంటువ్యాధులు సోకుతాయన్న విషయం భారతీయులకు తెలుసు అని స్పష్టం అవుతున్నది. 18వ శతాబ్దపు టీకాల నిపుణులకు అందుకు సంబంధించిన సిద్ధాంత పరిజ్ఞానం తప్పకుండా ఉండే ఉంటుంది.

**వ్యవసాయ, తయారీరంగాల నైపుణ్యాలు :**

అలెగ్జాండర్ వాకర్ 1820లో దేశీయ వ్యవసాయ, సాగునీటి యాజమాన్య పద్ధతులగురించి సవివరంగా వ్రాసారు. 18వ శతాబ్దంలో సహజసిద్ధంకాని (మానవ నిర్మిత) సాగునీటి వనరులు దేశంలో లేనేలేవని మనపాఠ్యగ్రంథాలలో వ్రాసారు. కాని అది పచ్చిఅబద్ధమని, వాకర్ రచనలనుబట్టి తెలుస్తున్నది. చైనా, ఈజిప్టు, పాశ్చాత్యదేశాలలో ఆనాటికి వాడుకలో ఉన్నపద్ధతులతో పోల్చితే భారతదేశపు సాగుపద్ధతులు, భూసార పరిరక్షణా పద్ధతులు, సేంద్రియ ఎరువుల తయారీ, వాడుకమెలకువలు, డ్రిల్ నాగలి (Drill Plough) ద్వారా విత్తటం, వ్యవసాయ పనిముట్ల తయారీ, వాడకం, సాగునీటి యాజమాన్య పద్ధతులు, వర్షపు నీరు వృధాకాకుండా నిల్వచేసుకోవటం మొదలైన పద్ధతులు భారతీయ రైతులకు తెలుసునని ఆయన వ్రాసారు. వివిధ రకాల నేలలు, వాటి నాణ్యతలకు సంబంధించిన పరిజ్ఞానం, నేల స్వభావాన్ని బట్టి అనువైనపంటలను ఎంచుకొనే నైపుణ్యం రైతులకు తరతరాల నుండి ఉంది. నీటివనరుల లభ్యతనుబట్టి సంవత్సరానికి మూడు లేక రెండు పంటలు వారు పండించేవారు. అయితే ఆంగ్లేయుల భూమిశిస్తు విధానం వారిని ఆర్థికంగా క్రుంగదీసి, పేదరికంలోకి నెట్టివేసింది. పండిన పంటలో 50 శాతం భూమిశిస్తుగా వారు వసూలు చేసేవారు. మద్రాసు ప్రెసిడెన్సీలో పంటలో నాల్గింటమూడువంతులు భూమిశిస్తుగా చెల్లించవలసి వచ్చింది. కొన్ని సంవత్సరాలలో పండిన పంటనంతా శిస్తుగా జమచేసుకున్నారు. మరికొన్ని సందర్భాలలో పండిన దానికంటె రెట్టింపు శిస్తువిధించారు కూడా.

మంచుగడ్డల తయారీ (ice) 18వ శతాబ్ది నాటికి దేశమంతటా విస్తరించింది.

పాశ్చాత్యులకు 1775 నాటికి సైతం మంచుముక్కలను కృత్రిమంగా తయారు చెయ్యటం తెలియదంటే ఆశ్చర్యం కలిగినా అది వాస్తవం. నీటిని అధిక ఉష్ణోగ్రత దగ్గఱ మరిగించటం మంచుగడ్డల తయారీ ప్రక్రియలో ఒకదశ. చాలాకాలంపాటు మంచుగడ్డల తయారీకి, మరిగిన నీటికి సంబంధం ఏమిటో పాశ్చాత్య జిజ్ఞాసువులకు అర్థం కాలేదు. చివరకు ఎడిన్‌బరో విశ్వవిద్యాలయానికి చెందిన రసాయనికశాస్త్ర ఆచార్యుడు ఒకరు ఈ చిక్కుముడిని విప్పాడు.

డి. హెచ్. స్కాట్ 1775లో భారతదేశంలో పర్యటించి రంగులు, అద్దకాలకు సంబంధించి దేశీయులు అనుసరిస్తున్న పద్ధతులు పాశ్చాత్యులకు తెలియనే తెలియవని పేర్కొన్నాడు. వస్త్రాలమీద అద్దకాల గురించి మాత్రమేకాక, నౌకల అడుగుభాగంలో నీరుయింకని అద్దకాలు, రసాయనాల గురించి కూడా భారతీయులకు తెలుసునని 1790లో వ్రాసాడు. దేశీయ ఉక్కు (Wootz Steel) ఎంతో శ్రేష్ఠమయిందని గ్రహించి, దాని నమూనాను పరిశోధనార్థం ఇంగ్లాండ్‌లోని రాయల్ సొసైటీకి పంపాడు. అనేకమంది శాస్త్రజ్ఞులు ఆ ఉక్కును పరిశీలించి, ఇంగ్లాండ్‌లో ఆనాటికి ఉత్పత్తి అవుతున్న ఉక్కురకాలలో మేలైన దానికి దీటుగా భారత్ ఉక్కు ఉందని అభిప్రాయపడ్డారు. పదనైన పరికరాలకు, ఆయుధాలకు, శస్త్రచికిత్సాపరికరాలకు ఆ ఉక్కు చక్కగా ఉపయోగపడగలదని ప్రశంసించారు. దానితో 1794లో భారత ఉక్కుకు ఇంగ్లాండ్‌లో డిమాండ్ విపరీతంగా పెరిగింది.

19వ శతాబ్ది వరకు ఇంగ్లాండ్ తన ఉక్కు అవసరాలకోసం ఇతరదేశాలమీదే ఎక్కువ ఆధారపడేది. ముఖ్యంగా స్వీడన్, రష్యాలనుండి దిగుమతి చేసుకొనేది. ఇంగ్లాండ్‌లో లభ్యమయ్యే బొగ్గు, ఇనుప ఖనిజాలు నాసిరకమైనవి. నాణ్యమైన ఖనిజం నుండే నాణ్యమైన ఉక్కుతయారీ వీలు అవుతుందని కూడా వారి అభిప్రాయం. భారతదేశపు ఇనుపఖనిజం నాణ్యమైనది కనుక, ఉక్కు కూడా నాణ్యత కలిగి ఉండటంలో ప్రత్యేకత ఏదీలేదని వారు అనుకున్నారు. అంతేకాని ఉక్కు తయారీకి అనుసరిస్తున్న పద్ధతులు భారతదేశంలో మెరుగైనవిగా వారు భావించలేదు. మూడు దశాబ్దాల తర్వాత వారు తమ అభిప్రాయాన్ని మార్చుకోకతప్పలేదు. దేశీయ ఉక్కుతయారీ పద్ధతులు మేధస్సుకు అందటంలేదని, అంత నాణ్యమైన ఉక్కుతయారీ అసాధ్యమని వారు పేర్కొన్నారు. కార్బన్ సంయోగప్రక్రియ ద్వారా ఉక్కు తయారీ పద్ధతి అప్పటికి ఇంకా కనుగొనబడలేదు. 1825లో అందుకు

దగ్గఱగా ఉండే ఉత్పత్తి ప్రక్రియకు ఇంగ్లాండ్‌లో పేటెంటు యిచ్చారు. "భారతీయులు కేవలం రెండున్నర గంటలలో ఇనుమునుండి ఉక్కును తయారు చెయ్యగలుగు తున్నారు. ఇంగ్లాండ్‌లో అందుకు కనీసం 4గంటలు పడ్తుంది..." అని ప్రముఖ ఉక్కు ఉత్పాదకుడు జె.ఎమ్.హీత్ పేర్కొన్నాడు.

అయితే ఆనాటి ఇనుము-ఉక్కు పరిశ్రమ ఈరోజులలో మాదిరిగా పెద్దపెద్ద కర్మాగారాలలో కేంద్రీకృతం కాలేదు. దేశమంతటా ఇనుపఖనిజంనుండి ఉక్కు తయారుచేసే కొలిమిలు ఉండేవి. 18వ శతాబ్దిలో 10వేలకు పైగా కొలిమిలు ఉన్నట్లుగా పాశ్చాత్యులు అంచనావేసారు. వారానికి ఒక్కొక్కకొలిమిలో అరటన్ను ఉక్కు తేలికగా తయారుచేసేవారు. సంవత్సరానికి 35-40 వారాలు ఈ కొలిమిలు పనిచేసేవి. ఒక్కొక్కకొలిమిలో ఆ లెక్కన సగటున 20 టన్నుల ఉక్కు ఉత్పత్తి అయ్యేది. ఖనిజం నుండి పొందగలిగిన ముడిఇనుము శాతం, అందుకుకావలసిన బొగ్గు పరిణామ శాతం పెద్దఎత్తున ఉత్పత్తి చేసే స్వీడన్ వంటి దేశాలతో పోల్చదగినవిగా ఉండేవి. లోహపరిశ్రమలో పెద్దఎత్తున నీటి యంత్రాలను (Water Mills) వాడేవారు. ఇనుప ఖనిజాన్ని ముక్కలు చెయ్యటానికి నీటిని ఎక్కువ ఒత్తిడితో ఉపయోగించటం ఒక తెలివైన ప్రయోగమని, అందుకు భారతీయులే ఆద్యులని ఆంగ్లేయులు వ్రాసారు.

ఆంగ్ల మేధావులలో అనేకమందికి భారతీయులకు ఉన్న లోహపరిజ్ఞానాన్ని, సాంకేతిక మెలకువలను, నేర్పరితనాన్ని ఒప్పుకోవటం యిష్టంలేదు. అందుకని వారు కొన్ని వక్రీకరణ కథనాలను ప్రాచుర్యంలోకి తెచ్చారు. మెలకువలు తెలిసినా, నేర్పరితనం ఉన్నా, ఉత్పత్తి ప్రక్రియల వెనుక ఉన్న రసాయన శాస్త్ర సిద్ధాంతాల గురించి భారతీయులకు ఎట్టి అవగాహనాలేదని, వారి పూర్వీకుల పద్ధతులను ఇప్పటివారు గ్రుడ్డిగా అనుసరిస్తుంటారని విమర్శలు గుప్పించారు. చివరికి భారతీయుల ఇనుము-ఉక్కు ఉత్పత్తి ప్రక్రియలు పాశ్చాత్యులు అనుసరిస్తున్న పద్ధతులకంటె మెరుగైనవని వారు ఒప్పుకున్నారు. అయినా దేశీయ ఇనుము-ఉక్కు పరిశ్రమ ఎందుకు క్రమంగా అదృశ్యమయింది?

వలసపాలకులు అనుసరించిన విధానాలు దేశీయ ఉత్పత్తిదారులను కోలుకోలేని దెబ్బకొట్టాయి. 1800 సంవత్సరంనుండి భారతదేశం ఇంగ్లీషువారి ఉత్పత్తులకు నిర్బంధమార్కెట్‌గా మారిపోయింది. దేశీయ పరిశ్రమల సమాధుల పునాదులమీదనే

ఇంగ్లండ్ పారిశ్రామికంగా అభివృద్ధిచెందిదన్న వాస్తవం ఈనాడు జగద్విదితమే. దేశీయ పరిశ్రమలు, సాంకేతికంగా ఎంతో ఉన్నతస్థానంలో ఉన్నప్పటికి, ఉత్పాదకులు ఎంతో అద్భుతనైపుణ్యం కలిగిఉన్నప్పటికి ఆంగ్లేయులు అమలుచేసిన అణచివేత కారణంగా అవి తమ అస్తిత్వాన్ని కోల్పోయాయి.

**తప్పుడుకథనాలు :**

ఒక రంగంకాదు, అనేక రంగాలలో భారతదేశం 18వ శతాబ్దిలో అగ్రగామిగా ఉంది. వాస్తవానికి 18వ శతాబ్ది భారతదేశపు శతాబ్ది. అయినప్పటికీ 18వ శతాబ్ది భారతదేశచరిత్రలోనే అత్యంత అంధకార శతాబ్దం అని ఆంగ్లేయులు ప్రచారం చేసారు. ఆ అంధకారంనుండి బయటపడటానికి వలసపాలన భారతదేశానికి అత్యంత అనివార్యమని కూడా వారు సెలవిచ్చారు. 18వ శతాబ్దం ముగిసే నాటికి భారతీయమైన ప్రతి దానిని, వారు అవహేళన చేశారు. నిర్లక్ష్యం చేసారు. ఎందుకు పనికిరానిదిగా ప్రచారం చేసారు. ఉదాహరణకు బీజగణితంగురించి ఎన్‌సైక్లోపీడియా బ్రిటానియా 8వ సంచిక (1850)లో ప్రొఫెసర్ జాన్ ప్లేఫెయిర్ భారతీయ బీజగణిత చరిత్ర గురించి వ్రాసిన పరిశోధనాత్మక వ్యాసంగురించి వ్రాస్తూ వాస్తవాలను ఏవిధంగా వక్రీకరించారో చూడండి. "1817లో హిందువుల గణితశాస్త్ర చరిత్ర గురించి జాన్‌ప్లేఫెయిర్ వ్రాసిన వ్యాసం ఒక పరిణతి చెందిన పండితుని నిజాయితీ విచారణ ఫలితంగా వెలువడింది. బెయిలీ భారత ఖగోళశాస్త్రంగురించి వెలిబుచ్చిన అభిప్రాయంమీద ఆయనకు మొదట ఉన్న నమ్మకం కొంచెం సడలింది. అదేవిధంగా హిందువుల ఖగోళశాస్త్ర ప్రాచీనత గురించి ఏర్పరుచుకున్న విశ్వాసము కొంత సన్నగిల్లింది. భారతదేశ ఖగోళశాస్త్రానికి ఆపాదించబడ్డ ప్రాచీనతను ఈ దేశంలో చాలామంది ప్రశ్నిస్తున్నారు.... ప్రొఫెసర్ వెస్లీ తన ఫిలాసఫీ ఆఫ్ అరిథ్మాటిక్ పుస్తకంలో 225-266 పుటలలో గణితశాస్త్రజ్ఞురాలు లీలావతి గురించి వ్రాస్తూ, ఆమె తక్కువస్థాయికి చెందిన ప్రతిభకు తార్కాణంగా నిలుస్తుందని, కొన్ని పరిమితమైన ఆలోచనలను జ్ఞాపకం పెట్టుకోగల అస్పష్టపద్యాల రూపంలో కూర్చిందని చెప్పారు..."

1835 ఫిబ్రవరి 2న మెకాలే తన వివరణ (Minute) ద్వారా తెల్లదొరలకు భారతీయ విజ్ఞానశాస్త్రాలపట్ల ఉన్న ఏహ్యాభావాన్ని తెలియచెప్పాడు. భారతీయగ్రంథాలను అవి పురాణాలు అయినా, విజ్ఞానశాస్త్ర గ్రంథాలు అయినా,

 'ఎందుకు పనికిరాని' చెత్తగా ఆయన అభివర్ణించాడు. అటువంటి, సాహిత్యం అయినా 'ఎందుకు పనికిరాని' చెత్తగా ఆయన అభివర్ణించాడు. అటువంటి,
ఎందుకు పనికిరాని చెత్త గ్రంథాలను ప్రచురించటం ప్రజాధనాన్ని దుర్వినియోగం చేయటమేనని, ఆ గ్రంథాల ముద్రణకు వినియోగించబడే కాగితాల విలువకంటె ఆ గ్రంథాల విలువ తక్కువేనని అవహేళన చేసాడు. భారతీయుల చరిత్ర, తత్వశాస్త్రం, భౌతికశాస్త్రం, మతశాస్త్రం మొదలైనవి పూర్తిగా అర్థరహితమైనవి అని పేర్కొన్నాడు. అటువంటి అర్థరహిత చరిత్ర, అర్థరహిత తత్వశాస్త్రం, అర్థరహిత భౌతికశాస్త్రం, అర్థరహిత మతశాస్త్రాలకు యిచ్చే ప్రోత్సాహం వలన 'పనికిమాలిన పండితులు' తయారు అవుతారని, వారు నేర్చుకున్న చదువే వారి ముందరికాళ్ళకు బంధం అవుతుందని, అటువంటి చదువులు నేర్చుకున్నందుకు వారు సిగ్గుతో కుమిలిపోతారని ఒక్క వాక్యంతో భారతీయ చదువులను కొట్టిపారవేసాడు. పనికిరాని చదువులు చదివినవారి చదువు ప్రజలకు ఉపయోగపడదని, పైపెచ్చు ఆ చదువులు కయ్యే ఖర్చును ప్రభుత్వం భరిస్తే, అది ప్రజలపై భారం మోపడటం తప్ప మరేది కాదని కూడా సెలవిచ్చాడు. అటువంటి చదువులు చదివినవారు సైతం అనతికాలంలోనే ఆ చదువులు ఎందుకు పనికిరానివిగా గ్రహిస్తారని, వారు ఆకలితో అలమటించటమో, లేక పరాన్నజీవుల మాదిరిగా ఇతరులపై జీవితాంతం ఆధారపడటమో చేస్తారు కనుక, ఆ చదువులకు ప్రోత్సాహం యివ్వటం శుద్ధదండగ అని ప్రకటించాడు.

అవాస్తవాలు, అర్ధసత్యాలు, అతిశయోక్తులు, వక్రభాష్యాలు, వ్యంగ్య విమర్శలు, శబ్దాడంబరంతో విలియమ్ ఫోర్బ్స్, జేమ్సుమిల్, మెకాలేలు భారతదేశంగురించి, భారతీయులగురించి, వారి విజ్ఞానంగురించి అవహేళన చేస్తూ రచనలు, ప్రసంగాలు సాగించారు. మెకాలే చేసిన ప్రతిపాదనలు, ప్రసంగాలు, సూచనలు, వివరణలు శ్వేతజాత్యంహకారానికి నిలువెత్తు దర్పణాలు. 18వ శతాబ్దపు భారతదేశంగురించి వారి అవగాహన లేమి, ఉదాసీనత వారి ప్రేలాపనలకు, పెడర్థాలకు, వక్రభాష్యాలకు కారణం కావచ్చు. కాని అంతకంటె భారతీయమైన ప్రతిదానిని ధ్వంసం చేసితీరాలన్న దుర్లక్ష్యమే వారి వ్యర్థప్రేలాపనలకు కారణం. కాకపోతే ఎంతో చరిత్ర, శాస్త్ర సాంకేతిక, వైజ్ఞానిక రంగాలలో ఎంతో ఎత్తుకుఎదిగిన ఒక దేశాన్ని, దాని విజ్ఞానసంపదను అంత తక్కువచేసి అవహేళన పాలుచేసి, వక్రీకరించరు. 18వ శతాబ్దపు ఇంగ్లీషు సమాజంతో పోల్చిచూసినప్పుడు నాటి భారతదేశం అన్నిటా వారికి అందనంత ఎత్తులో ఉన్న విషయం వారికి తెలియనిది కాదు. ప్లాసీ యుద్ధంలో

సాధించిన విజయమే వారి అభివృద్ధి బాటకు పునాదులు వేసిందన్న విషయమూ వారికి తెలుసు. భారతదేశపు సాంస్కృతిక పునాదులను పెకలించటద్వారా శాశ్వతంగా భారతదేశాన్ని తమ ఆధిపత్యంలో పెట్టుకోవాలనే లక్ష్యంతోనే వలసపాలకులు దేశీయ విద్యావ్యవస్థను, విజ్ఞాన సంపదను నామరూపాలు లేకుండా చేసారు.

**లక్ష్యాలు వేఱు :**

తూర్పు పడమర దిక్కులు ఏరకంగా ఒకదానికి మరొకటి ఎదురో, తూర్పు, పడమటి దేశాలు కూడా భిన్న సంస్కృతులకు, నాగరికతలకు చెందినవి. తూర్పు దేశాలలో శాస్త్రసాంకేతిక రంగాలకు నిర్దేశించబడ్డ లక్ష్యాలు పాశ్చాత్యదేశాల వ్యాపారలక్ష్యాలకు భిన్నమయినవి. కేంద్రీకరణ పడమటి దేశాలలో అన్ని అంశాలలోనూ కన్పడుతుంది. వారిది వ్యవస్థీకృతమైన మతం. రాజకీయ, పాలనా వ్యవస్థలుకూడా కేంద్రీకృతం చేసుకున్నారు. అందుకు భిన్నంగా భారతదేశంలో వ్యవస్థీకృతమైన మతంలేదు. అన్ని రంగాలలోనూ వికేంద్రీకరణ స్పష్టంగా కన్పడుతుంది. సామాన్యమైనవి, చిన్నవి, ఎక్కువ పెట్టుబడి అవసరంలేని వికేంద్రీకృత పద్ధతులలోనే అత్యున్నత ప్రమాణాలతో ఉత్పత్తి చేసేవారు. భారతదేశమంతటా 18వ శతాబ్దంలో విస్తరించి ఉన్న ఇనుము–ఉక్కు కొలిములు అందుకు ఉదాహరణ. వికేంద్రీకరణకు కారణం కేంద్రీకృత వ్యవస్థలు నెలకొల్పటం చేతకాక కాదు. రాజకీయ, సామాజిక, ధార్మిక పరిణతి కారణంగానే వికేంద్రీకరణను ఎంచుకున్నారు. చిన్నతరహా, కుటీర పరిశ్రమల ద్వారా ఉత్పత్తిని వికేంద్రీకరించి, ప్రజల అవసరాలను తీర్చటాన్ని, ఏ ప్రాంతానికి ఆ ప్రాంతాన్ని స్వయం సమృద్ధిగా నిలబెట్టటానికి ప్రయత్నం చేశారు. ఉపయోగించిన పనిముట్లు సాధారణమైనవిగా కన్పించినా, ఉత్పత్తి ప్రక్రియలు అసాధారణమైనవి. పర్యావరణానికి అనుకూలమైనవి, ఉపాధి కల్పించేవి, కళాదృష్టిని పెంపుచేసేవి.

ఆ కారణంగానే ఫ్రెంచి తత్వవేత్త వోల్టెర్ (Voltaire) దాని చట్టాలు, శాస్త్రాలు కారణంగా వన్నె కెక్కిన భారతదేశాన్ని పాశ్చాత్యులు వ్యక్తిగతంగానూ, సమష్టిగానూ తమ ఆధిపత్యంలోకి తెచ్చుకొని, కొల్లగొట్టటాన్ని తీవ్రంగా వ్యతిరేకించాడు. పాశ్చాత్యుల దురాశ, ఆధిపత్యపోరు ప్రపంచమంతటా అనేక ఘర్షణలకు, మారణకాండలకు దారి తీయటాన్ని వోల్టెర్ గమనించాడు. **"హిందువుల గురించి తురుష్కులకు, మంగోలులకు, మాకు (పాశ్చాత్యులకు) తెలియకుండా ఉంటే వారు ప్రపంచంలోని అన్నిజాతులకంటె సుఖ సంతోషాలతో బ్రతికేవారు"** అని ఆయన వ్రాసాడు.

తూర్పుదేశపు సమాజంగురించి, పాశ్చాత్యులకు ఉన్న అభిప్రాయాలు సహేతుకమైనవికావు. ఒక జాతి గురించి, దాని ప్రజలు, వారి మత సంస్కృతుల గురించి వాడుకలో ఉన్న కొన్ని దురభిప్రాయాలను వారు గ్రుడ్డిగా నమ్మారు. తమగ్రుడ్డి నమ్మకాలను వాస్తవాలుగా వక్రీకరించటానికి వారు ప్రణాళికాబద్ధంగా పనిచేసారు. 17,18,19 శతాబ్దాల ప్రాచ్యసమాజాల గురించి వారు ఏర్పరుచుకొన్న అభిప్రాయాలకు, ఆ సమాజాల వాస్తవస్థితిగతులకు సంబంధమే లేదు.

### దేశీయ శాస్త్రసాంకేతిక రంగాలకు మొండిచేయి :

ఎనిమిది, పది తరాలకు ముందున్న శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం నైపుణ్యాలు పూర్తిగా కనుమరుగు అయ్యాయా? అవి పూర్తిగా అంతరించి పొయ్యాయని చెప్పటానికి కూడా వీలులేదు. ఎందుకంటె అనేకచోట్ల వాటి అవశేషాలు నేటికి సజీవంగా దర్శనం యిస్తునే ఉన్నాయి. కాని వాటికి తగిన గుర్తింపు, ప్రచారం, ఆదరణ లేని కారణంగా చాలా అరుదుగానూ, తక్కువస్థాయిలోనూ కన్పడుతున్నాయి. 1750–1900 మధ్యజరిగిన చారిత్రక పరిణామాలవలన దేశం ఆర్థికంగా ఎంతో నష్టపోయింది. దేశీయ పరిశ్రమలు, కళలు, రకరకాల నైపుణ్యాలు ఎంతో దెబ్బతిన్నాయి. రైతుల ముక్కుపిండి అధికమొత్తంలో భూమిశిస్తు రూపంలో చేసిన ఆర్థికలూటీ పచ్చటి పల్లెలను మరుభూములుగా మార్చాయి. ప్రతివర్గమూ ఆర్థికదోపిడికి గురిఅయింది. గిరిజనులను, ఆదివాసులను సైతం ఆంగ్లేయులు వదిలిపెట్టలేదు. అడవులనుండి, కొండలనుండి వారిని వెళ్ళగొట్టి సహజవనరులను వారు కొల్లగొట్టారు. అటువంటి దుస్థితిలో దేశీయశాస్త్రాలు, సాంకేతిక నైపుణ్యాలు వర్ధిల్లటంమాట అటుంచి వాటి కనీస మనుగడకూడా ప్రశ్నార్థకమైంది.

సమాజాల వృద్ధి, క్షీణతల గురించి అనేక తాత్విక సిద్ధాంతాలు ఉన్నాయి. క్షీణత సిద్ధాంతం (Theory of Atrophy) అందులో ఒకటి. దానిని భారతదేశానికి వర్తింపచేసారు. అభివృద్ధి సాధించటం, పరమవైభవస్థితికి చేరుకోవటం, ఆ స్థితి నుండి పతనం మొదలయి, క్షీణదశకు చేరుకోవటం వివిధసమాజాల పరిణామక్రమంలో భాగమని ఆ సిద్ధాంతం ప్రతిపాదన చేస్తుంది. అయితే పరమవైభవస్థితినుండి ఏ సమాజమూ దానంతటఅదే పతనమవ్వదు. విదేశీదాడులు, పరతంత్రమూ, బానిసత్వం, ఆర్థిక సాంస్కృతిక దోపిడీలు సమాజాలను బలహీనపరుస్తాయి. విదేశీముస్లిం దాడులను తట్టుకొని నిలబడటానికి

ప్రయత్నంచేస్తున్న భారతదేశం పాశ్చాత్యుల ఆధిపత్యంలోకి వచ్చి, అనేక రకాలదోపిడీలకు గురి అయింది. అందులో ముఖ్యమయినది ఆర్థిక దోపిడీ. ఆంగ్లేయులు రాకముందు స్థానికంగా వసూలుచేసిన పన్నుల రాబడిలో ఎక్కువశాతం స్థానికఅవసరాలకు కేటాయించేవారు. వలసపాలకులు ముక్కుపిండి పన్నులు వసూలుచేశారు తప్ప, స్థానిక అవసరాలకు ఖర్చుపెట్టలేదు. స్థానిక అవసరాలకే కాదు, దేశంలోనే ఖర్చుపెట్టలేదు. వసూలుచేసిన మొత్తాన్ని ఇంగ్లాండ్‌కు తరలించారు. కాలక్రమంలో గ్రామప్రాంతాలనుండి వసూలుచేసిన పన్నుల ఆదాయం అధిక మొత్తాలతో తమ సౌకర్యాలకోసం పట్టణాలలో ఖర్చుచేశారు. ఈ ప్రక్రియలో దేశీయ విద్యకు, దేశీయ శాస్త్ర సాంకేతిక శిక్షణకు మొండిచెయ్యి చూపారు. ఆర్థిక సహాయం, పాలనాప్రోత్సాహం లేక ప్రజల జ్ఞాపకాలనుండి సైతం అవి కనుమరుగు అయ్యే దుస్థితికి కారణమయ్యారు. 18వ శతాబ్ది నాటికి శాస్త్రసాంకేతిక రంగాలలో భారతదేశం వెనుకబడిలేదు. ఆనాటి సమకాలీన దేశాలతో పోల్చితే ఎంతో మెరుగైనస్థితిలో కూడా అది ఉన్నది. అయితే పాశ్చాత్య దృక్కోణంనుండి వాటిని మదింపు వేసి, అవి ఎందుకూ పనికిరానివని ఆంగ్లేయులు కొట్టివేసి, నిరాదరణకు, నిర్లక్ష్యానికి వాటిని గురిచేసిన కారణంగా, శాస్త్రసాంకేతిక రంగాలలో అభివృద్ధి మందగించింది. కొత్త ఆవిష్కరణలకు ప్రోత్సాహం లేదు. పరిశోధనలకూ, ప్రయోగాలకు అవకాశమే లేదు.

సైనిక, రాజకీయ, వ్యవస్థాపరంగా బలహీనంగా ఉన్నప్పటికీ రాజకీయ, సామాజిక భావనలు, న్యాయవిచారణ పద్ధతులు, శాస్త్రసాంకేతికతలు, సంస్కృతీ సంప్రదాయాలు ఆంగ్లేయులు దేశంలో అడుగుపెట్టకముందే పరిణతి చెందిన దశలో ఉన్నాయి. నెలకొల్పబడిన రాజకీయ సామాజిక ఏర్పాట్లు పాశ్చాత్యదేశాలలో నెలకొల్పబడిన వాటికి ఏమాత్రమూ సంబంధంలేనివి. అయినప్పటికీ ప్రజలు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అనుభవించారు. ప్రతి గ్రామమూ ఓచిన్న గణతంత్రరాజ్యంగా ఉండేది. సామాజిక భద్రత, సంపాదనావకాశాలు, ప్రజాసంక్షేమం మొదలైన అంశాలలో 18వ శతాబ్ది భారతదేశం. సమకాలీన పాశ్చాత్య సమాజాలకంటె మెరుగుగా ఉండేది. వివాదాల పరిష్కార పద్ధతులు, శిక్షాస్మృతి, లైంగికమర్యాదలు, ధార్మికస్వాతంత్ర్యం వంటి విషయాలలో 18వ శతాబ్ది భారతదేశం ఆనాటి ఏదేశానికి తీసిపోదు. దురదృష్టవశాత్తు రాజకీయ, సైనిక వ్యవస్థాపరమైన ఏర్పాట్లు విదేశీ దాడులకు అనుకూలంగా ఉండటంతో దేశం తెల్లవారి నిరంకుశత్వ పాలనలోకి

 పశ్చిమ తీరంలో శివాజీ, ఆయన వారసుల నౌకాసైన్యం నెట్టివేయబడింది. ఉదా: పశ్చిమ తీరంలో శివాజీ, ఆయన వారసుల నౌకాసైన్యం జాగరూకతతతో ఉండగా, తూర్పుతీరాన అలాంటి వ్యవస్థలు లేవు. అక్కడ ఆంగ్లేయులకు లోనికి చొచ్చుకొనిపోగల దారి దొరికింది.

12-17శతాబ్దాల మధ్య హిందూదేశంపై లెక్కలేనన్ని దాడులు జరిగాయి. ఈ దాడులను ప్రతిఘటించటానికి చేసిన ప్రయత్నాలమీదే ప్రజలదృష్టి ఎప్పుడూ ఉండేది. విదేశీముస్లిం దాడులను తట్టుకొని నిలబడటానికి చేసిన ప్రయత్నాలు పూర్తిగా సఫలం కాలేదు. అయినప్పటికీ అనేక హిందూరాజ్యాలు ఏర్పాటు అయ్యాయి. నిరంతర ఘర్షణలతో, తిరుగుబాటులతో సమాజంలో శాంతిభద్రతలు కఱవయినాయి. కాలక్రమంలో రాజకీయంగా, సైనికంగా బలహీనపడటానికి ఆ ఘర్షణలు, తిరుగుబాట్లు కారణమయ్యాయి. ప్రజల రోజూవారి జీవితం ఘర్షణలమయం అవటంతో మేధాపరమైన కృషికి ప్రోత్సాహం లభించలేదు. వివిధ ప్రాంతాలమధ్య, తెగలమధ్య అంతకుముందున్న ఆధ్యాత్మిక, మేధోపరమైన, జాతిపరమైన అనుబంధాలు బలహీనపడ్డాయి. ఆత్మవిస్మృతి ఒక జాడ్యంగా వ్యాపించినప్పటికీ, అప్పటికి ఉన్న వ్యవస్థాపరమైన ఏర్పాట్లు ప్రజల భౌతిక, సామాజిక, ఆధ్యాత్మిక అవసరాలను చాలావరకు తీర్చగలిగాయి అని చెప్పటానికి సందేహపడవలసిన పనిలేదు.

పాశ్చాత్యులు ఈ దేశంలో అడుగుపెట్టేనాటికి హిందూసమాజపు పునరుజ్జీవన స్థాయి చాలా తక్కువగా ఉంది. పాశ్చాత్యుల ఆధిపత్యం స్థిరపడేనాటికి అది పూర్తిగా అణిచివేయబడ్డది కూడా. ఒక రకమైన నిస్తేజం సమాజం అంతటా వ్యాపించింది. ఊహించటానికి కూడా వీలుకాని అస్తవ్యస్త పరిస్థితులు నెలకొన్నాయి. విదేశీ దాడులు, ఆధిపత్యం హిందూదేశానికి కొత్తకాదు. కాని పాశ్చాత్యులు వేరే ఖండానికి చెందినవారు. అంతకుముందు ఎన్నడూ ఇక్కడి సమాజాన్ని ఎరగనివారు. పాశ్చాత్యసమాజపు ఫ్యూడల్ మనస్తత్వాన్ని, భావనలను వారు తమతోపాటు తెచ్చారు. పైపెచ్చు అంతకుముందు రెండుమూడు శతాబ్దాలనుండే, హిందూదేశాన్ని తమ ఆధిపత్యంలోకి తెచ్చుకోవాలని వ్యూహాత్మకంగా ఎత్తుగడలు వేశారు. ముందుగా సైనికంగా, ఆయుధాలపరంగా పైచేయి సాధించారు. రాజకీయంగా జిత్తులమారితనంతో అధికారాన్ని చేజిక్కించుకున్నారు. ఆర్థికంగా దోచుకున్నారు. సాంస్కృతిక బానిసత్వంలోకి హిందూ సమాజాన్ని నెట్టివేసి, తన అస్తిత్వాన్ని మర్చిపోయేలా చేశారు. జాత్యంహంకారంతో దేశీయమైన ప్రతిదానినుండి ప్రజలను

దూరంచేశారు. దేశీయ శాస్త్రసాంకేతిక పరిజ్ఞానాన్ని ఎందుకు పనికిరానిదిగా ప్రచారం చేసి, పాశ్చాత్యులపై శాశ్వతంగా ఆధారపడేటట్లు చేసారు. ఈ నేపధ్యంలో 18వ శతాబ్దిలో భారతదేశ శాస్త్రసాంకేతిక పరిజ్ఞానంగురించి మరింతగా పరిశోధన, చర్చ జరగవలసిన అవసరం ఎంతైనా ఉంది.

**18వ శతాబ్దిలో విద్యావ్యవస్థ :**

హిందూదేశంలో విద్యావకాశాలు కొందరికే పరిమితం చేశారని ఆంగ్లేయులు ప్రచారంచేసారు. కాని అది సత్యదూరం. ప్రముఖగాంధేయవాది శ్రీధర్మపాల్‌గారు తన 'బ్యూటీఫుల్ ట్రీ' అనే పరిశోధనాత్మక గ్రంథంద్వారా 18వ శతాబ్దంలో దేశంలో నెలకొన్న విద్యావ్యవస్థ తీరుతెన్నుల గురించి కలకత్తా, మద్రాసు, బాంబే, ప్రెసిడెన్సీలలో, పంజాబులో వేఱువేఱుగా చేపట్టిన సర్వేక్షణ నివేదికల ఆధారంగా సవివరంగా వ్రాసారు.

18వ శతాబ్దంలో భారతదేశపు విద్యావ్యవస్థ గురించి థామస్ మన్రో ఇంగ్లాండ్ పార్లమెంటుకు యిచ్చిన నివేదిక (1812-13), 1822-26 మధ్య థామస్ మన్రో మద్రాసు గవర్నర్‌గా పనిచేసినప్పుడు సేకరించిన 23 జిల్లాల సమాచారం, 1830వ సంవత్సరంలో విలియమ్ ఆడమ్ బెంగాల్-బీహార్‌లలో జరిపిన విద్యావిషయక సర్వేక్షణ నివేదిక (Report on State of Education in Bengal including some account of the State of Education in Bihar) 1850 సంవత్సరంనాటి స్థితిపై జి.డబ్ల్యూ.లీట్నర్ పంజాబులో చేయించిన అధ్యయనపు నివేదిక (History of Indigenous Education in the Punjab since Annexation and in 1882) నివేదికలు ధర్మపాల్ గ్రంథానికి ఆధారం.

ఆ నివేదికలు పాఠశాలల సంఖ్య, ఉపాధ్యాయుల అర్హతలు, విద్యార్థులసంఖ్య, విద్యార్థుల సామాజిక ఆర్థిక నేపధ్యం, బోధనా పద్ధతులు, బోధనాంశాలు, విద్యాసంస్థల యాజమాన్య పద్ధతులు, వాటి ఆర్థిక వనరులు మొదలైన వాటిగురించి అనేక వాస్తవాలను బయటకు తెచ్చాయి. ఆ నివేదికలప్రకారం పాఠశాలలసంఖ్య చాలా ఎక్కువగా ఉండేది. పాఠశాలలు లేని గ్రామాలు ఉండేవికావు. ప్రతిగ్రామంలోనూ పాఠశాల ఉండేది. ప్రజలసహకారంతో, స్థానికవనరులతో అవి నడిచేవి. ప్రతి ప్రెసిడెన్సీలోనూ లక్షపాఠశాలలు ఉండేవని, పిల్లలకు ఉచితంగా విద్యనేర్పేవారని తెలుస్తుంది. అంతేకాదు, విద్యావకాశాలు అందరికీ అందుబాటులో

ఉండేవి. ఇంగ్లాండ్‌లోవలె ఏ కొందరికో అవి పరిమితం చెయ్యబడలేదు. కులీనులు, సామాన్యులు, ధనిక, పేద తారతమ్యంలేకుండా అందరూ చదువుకోవటానికి అర్హులని, అదేవిధంగా ఉపాధ్యాయులు కూడా అన్ని రకాల సామాజిక నేపథ్యాలనుండి వచ్చిన వారని ఆ నివేదికలు చెప్తున్నాయి. సంఖ్యాపరంగా ఆనాటి పాఠశాలలో నిమ్నకులాలకు చెందిన విద్యార్థులే అగ్రకుల విద్యార్థులకంటె అధికసంఖ్యలో చదువుకుంటున్నారని కూడా సర్వేక్షణ నివేదికలు బయటపెట్టాయి. ఆంగ్లేయులు వచ్చేనాటికి విద్యావకాశాలు నిమ్నకులాల విద్యార్థులకు లేవని జరుగుతున్న ప్రచారంలో వాస్తవం లేదని ఆ నివేదికలనుబట్టి తెలుస్తుంది. ఇంగ్లాండ్‌లోవలె మతగ్రంథాలు అందరూ చదవకూడదన్న నియమాలు ఇక్కడ లేవు. రామాయణ, భారతాలను పాఠశాలలలో అందరికీ బోధించేవారు. అందువలన విద్యార్థుల నైతిక, సామాజిక, ధార్మికస్థాయి పెరుగుతుందని ఆశించేవారు. గణితం, ఖగోళం పిల్లల పాఠ్యాంశాలలో చేర్చారు.

**ఇంగ్లాండ్‌లో విద్యాస్థాయి :**

18వ శతాబ్ది మధ్యవరకు ఇంగ్లాండ్‌లో విద్య అందరికీ అందుబాటులో లేదు. 16 నుండి 18వ శతాబ్ది చివరివరకు విద్యావ్యాసంగం చాలా తక్కువస్థాయిలో ఉండేది. విద్యావ్యాప్తి అవసరాన్ని వారు గుర్తించలేదు. 16వ శతాబ్ది మధ్య ఇంగ్లాండ్‌లో ఉన్న ముఖ్యమైన ఉచిత విద్యాలయం ఆక్స్‌ఫర్డ్ ఒక్కటే. స్వంతభూమిలేనివారు సంవత్సరానికి 20 షిల్లింగులకంటె తక్కువ ఆదాయం వచ్చేవారు తమ పిల్లలను వృత్తిశిక్షణకు గాని, చదువుకోవటానికి గాని పంపరాదన్న చట్టం అమలులో ఉండేది. వారు కావాలంటే సాహిత్యం చదువుకోవచ్చు. ఆవిధంగా విద్య కేవలం ధనికులకు, కులీనులకు మాత్రమే పరిమితం చేశారు. 1542-43లో చేసిన చట్టంద్వారా చర్చిలలో ఇంగ్లీషు బైబిలు చదువరాదని నిషేధించారు. కులీనులు, ధనికులు, వ్యాపారులకు మాత్రం మినహాయింపును యిచ్చారు. పవిత్రగ్రంథాలను స్వేచ్ఛగా చదువుకొన్నందువలన గందరగోళం ఏర్పడుతుందని నిషేధాజ్ఞలో పేర్కొన్నారు. ఆ చట్టం ప్రకారం పొలందున్నే రైతుకొడుకు పొలమే దున్నాలి. ఎవరు ఏ వృత్తి చేస్తున్నారో ఆ వృత్తినే వారి వారసులుకూడా చేపట్టాలి. అందరూ చదువుకోవటానికి అర్హులు కాదని నిషేధాలు విధించి విద్యావకాశాలను పరిమితం చేసారు.

17వ శతాబ్దిలో హిందూదేశంతో సంపర్కం ఏర్పడిన తర్వాతనే ఇంగ్లాండ్‌లో ఉచిత పాఠశాలలు నెలకొల్పే ప్రయత్నం జరిగింది. ఆనాటికీ భారతదేశంలో

సార్వత్రికవిద్య అమలులో ఉంది. సాధారణ విద్యతోపాటు, వృత్తి విద్యలను విద్యార్థులకు నేర్పేవారు. బైబిలు చదవటం నేర్పి, ఆదివారం ప్రార్థనలకు వారిని తయారుచేయటానికి ఇంగ్లాండ్‌లో పెద్దఎత్తున ఉద్యమం చేపట్టారు. బైబిలు పాఠశాలలు లౌకిక విద్యలకు దూరంగా ఉండేవని వేరే చెప్పనవసరమేలేదు. అయితే ఉచిత పాఠశాలల ఉద్యమం అనతికాలంలోనే దెబ్బతిన్నది. ఉచిత పాఠశాలల స్థానంలో ఆదివారం పాఠశాలలు బయలుదేరాయి. 1834 నాటికి కూడా ఇంగ్లాండ్ పాఠశాలల్లో మత విషయాలకే ప్రాముఖ్యం ఉండేది. చదవటం, వ్రాయటం నేర్పటం, చిన్న చిన్న లెక్కలు చేయించడం ముఖ్యపాఠ్యాంశాలుగా ఉండేవి. కొన్ని పాఠశాలల్లో వ్రాయటం నేర్పితే, దుష్పరిణామాలు వస్తాయని, వ్రాయడాన్నికూడా నిషేధించారు. కాని అటువంటి పోకడలు భారతదేశంలో లేవు. ఆదివారం పాఠశాలల ఉద్యమాన్ని బలోపేతం చేయటంకోసం 1802లో పీల్సు చట్టం వచ్చింది. కాని ప్రజాదరణ కొరవడిన కారణంగా ఆ ఉద్యమం విస్తృతం అవలేదు. 1857 వరకు ఇంగ్లాండు పాఠశాలల్లో గణితం నేర్పటం రోజువారీ పాఠ్యక్రమంలో లేదు. గణితం నేర్పేందుకు సమర్థులైన పూర్తికాలపు ఉపాధ్యాయులు లేరు.

18వ శతాబ్దిలో కూడా ఇంగ్లాండ్‌లో పాఠశాల విద్య కొన్ని వర్గాలకే పరిమితం అయింది. రైతుల కూలీల పిల్లలను, పాఠశాలవిద్యకు దూరంగా పెట్టారు. వారి దృష్టిలో 'అలగాజనానికి' చదువులు అక్కరలేదు. 1807లో బ్రిటీషు శాస్త్రవేత్త దేవిస్ గిలబర్ట్ ఇంగ్లాండ్ శాసనసభలో మాట్లాడుతూ అన్న మాటలను చూద్దాం "..... చదువు వారికి ఆనందాన్ని దూరం చేస్తుంది. నైతికంగా దిగజారుస్తుంది. వారి జీవితాలు శ్రమ చేయటానికి ఉద్దేశించబడినవని సమాజం నిర్దేశించింది. చదువు నేర్పితే, వారు ఎదురుతిరుగుతారు. క్రైస్తవానికి వ్యతిరేకంగా ప్రచురించబడ్డ కరపత్రాలు, పుస్తకాలు చదివి మత ద్రోహులుగా, రాజద్రోహులుగా మారుతారు....". రైతుల, కూలీల పిల్లలకు విద్యను అందించాలన్నవారు సైతం విద్యను ఒక సామాజిక నియంత్రణా సాధనంగానే చూశారు తప్ప, వారిని ఉద్ధరించేందుకు ఉపయోగపడే ఉపకరణంగా చూడలేదు. వారికి చదువు నేర్పి, తద్వారా వారిని విధేయులుగా, సంతోషంతో యిచ్చింది తీసుకొని కష్టపడి పనిచేస్తూ మతాన్ని అనుసరిస్తూ బ్రతికే కొత్త శ్రామికవర్గంగా తయారుచెయ్యటమే లక్ష్యంగా పేర్కొన్నారు.

ధనికవర్గాలు క్రైస్తవమిషనరీలు ప్రారంభించిన బైబిలు పాఠశాలలు, ఆదివారం పాఠశాలలవలన తమ వర్గప్రయోజనాలు కాపాడబడతాయని భావించాయి.

బైబిలుబోధనవలన యజమానులకు మాటకు ఎదురు చెప్పకుండా పనిచేయటాన్ని వారు గమనించారు. యాజమాన్యంకు ఎదురుతిరుగకూడదన్న బైబిలు సూక్తులు వారు తలకెక్కించుకోవటమే అందుకు కారణం. 1844లో గనుల కార్మికులు వేతనాలుపెంచాలని సమ్మెకు దిగారు. అది మిగిలిన రంగాలకు కూడా ప్రాకుతుందని పెట్టుబడిదారీవర్గం భయపడింది. ఆదివారం పాఠశాలలద్వారా వారిలో క్రమశిక్షణను, దైవభయాన్ని, విధేయతను పెంపొందించాలని కోరుతూ ఉన్నతవర్గాలవారు చర్చికి పూర్తి సహాయసహకారాలు అందించారు.

ఉపాధ్యాయులను వారి విద్యార్హతలు, విషయ బోధనా ప్రావీణ్యాల ఆధారంగా కాకుండా బైబిలుపట్ల, ప్రభువుపట్ల, ప్రభువు అద్భుత కార్యాలపట్ల వారికున్న విశ్వాసం కారణంగా ఎంపిక చేసేవారు. 19వ శతాబ్దివరకు ఇంగ్లాండ్‌లో ఆ ధోరణులే కొనసాగాయి. విద్యాప్రమాణాలు నాసిగా ఉండేవి.

**దేశీయ విద్య-వాకర్ నివేదిక :**

అలెగ్జాండర్ వాకర్ ఈస్టిండియా కంపెనీ ఉద్యోగి. 1780నుండి దేశంలో వివిధ హెూదాలలో పనిచేసాడు. ఆయన వ్రాసిన నివేదిక ప్రకారం మనదేశంలో విద్యార్థులు పరస్పర భాగస్వామ్యంతో, సహకారంతో, ఒకరినొకరు సరిచేసుకుంటూ, ఉపాధ్యాయుడి మార్గదర్శకత్వంలో చదువు నేర్చుకొనే పద్ధతి మద్రాసు ప్రెసిడెన్సీలో ఉండేదని, ఆ విధంగా చదువు నేర్చుకోవటం చక్కటి, సులభమైన, భద్రమైన పద్ధతి అని వ్రాసాడు. ఆ విద్యాఅభ్యసన పద్ధతికి ఆయన 'మద్రాసుపద్ధతి' లేదా 'మానీటర్ పద్ధతి' అని పేరుపెట్టాడు. దీనిని మొదటగా పీటర్ డెల్లావాలే అనే యాత్రికుడు 1623వ సంవత్సరంలో మలబారు ప్రాంతంలో విస్తృతంగా పర్యటించినప్పుడు గమనించాడు అని పేర్కొన్నాడు. డెల్లావాలేకి రెండువందల సంవత్సరాల తర్వాతకూడా అదే మానీటర్ పద్ధతి ఇంకామెరుగుగా అమలులో ఉండటాన్ని వాకర్ గమనించాడు. పిల్లలను కొట్టకుండా, తిట్టకుండా, వారి భాగస్వామంతోనే విద్యాబోధన జరిగే ఈ పద్ధతి భారతవిద్యావ్యవస్థ పరిణతిని తెలియజేస్తుందని కూడా పేర్కొన్నాడు. ఫాదర్ బార్తలోమియో 1776-89 మధ్య మన దేశానికి వచ్చి పర్యటించాడు. మన విద్యావ్యవస్థ పనితీరుగురించి ఆయన ఒక నివేదికను సమర్పించాడు.

1822-26 మధ్య మద్రాసు ప్రెసిడెన్సీకి గవర్నరుగా పనిచేసిన థామస్ మన్రో ప్రెసిడెన్సీలో ప్రతిగ్రామంలోనూ ఒక పాఠశాల ఉన్నట్లుగా పేర్కొన్నాడు. 1820లో బొంబాయి ప్రెసిడెన్సీ ఉన్నతాధికారి జి.ఎల్. ప్రెండర్‌గాస్ట్ కనీసం ఒక్క పాఠశాల అయినా లేని గ్రామం తమ ప్రెసిడెన్సీలో లేదని చెప్పాడు. విలియమ్ ఆడమ్ బెంగాల్, బీహార్‌ప్రాంతాలలో షుమారుగా లక్షపాఠశాలలు పనిచేస్తున్నట్లుగా వ్రాసాడు. లీట్నర్ గ్రామగ్రామానికి పాఠశాల ఉందని పంజాబు ప్రాంతం గురించి వ్రాసాడు. పతనావస్థలో ఉన్న ఆనాటి భారతీయవిద్యయే అలా ఉంటే వైభవంగా ఉన్నప్పుడు భారతదేశంలో విద్య ఎంత విస్తృతంగా ఉండేదో ఊహించవచ్చు. వారు యిచ్చిన నివేదికలనుబట్టి విద్య అందరికీ అందుబాటులో ఉండేదని, నిమ్నకులాలకు చెందిన విద్యార్థుల సంఖ్య అగ్రకులాలకు చెందిన విద్యార్థుల సంఖ్య కంటె ఎక్కువగా ఉండేదని, ఉపాధ్యాయులలో అన్ని కులాలకు చెందిన వారు ఉన్నారని తెలుస్తున్నది.

**భారతదేశపు బోధనా పద్ధతులతోనే ఇంగ్లాండ్ విద్యాప్రగతి:**

18వ శతాబ్దిలో కొన్ని వర్గాలకు మాత్రమే పరిమితం అయిన పాఠశాల విద్య ఆ తర్వాత 150 సంవత్సరాల తర్వాత మాత్రమే ఇంగ్లాండ్‌లో సార్వత్రిక దశకు చేరుకుంది. దీనికి కారణం భారతదేశపు విద్యాబోధనా, అభ్యసన పద్ధతులను ఇంగ్లాండ్‌లో ప్రవేశపెట్టిన తర్వాతే విద్యావ్యాసంగంపట్ల అభిరుచి పెరిగి. ఆదరణ పెంపొందటమే. జోసెఫ్ లాంకెస్టరు, ఆండ్రూబెల్‌లు భారతదేశపు బోధనా పద్ధతులను ఇంగ్లాండ్‌లో ప్రవేశపెట్టిన తర్వాతే పాఠశాల విద్య పుంజుకొంది. అయితే మన బోధనా, అభ్యాసన పద్ధతులను ఇంగ్లాండ్‌లో అనుసరించారని తెలిసిన భారతీయులు బహుకొద్దిమాత్రమే. జె.డబ్ల్యూ ఆడమ్స్ 1919లో వ్రాసిన 'ఏ షార్ట్ హిస్టరీ ఆఫ్ ఎడ్యుకేషన్' పుస్తకంలో ఈ విషయాన్ని స్పష్టపరిచాడు "మానిటర్' లేక మద్రాసు' విధానాన్ని ఆంగ్లేయులకు ఆండ్రూబెల్ 1797లో ప్రచురించిన ఒక కరపత్రంద్వారా పరిచయం చేశాడు...." ఈ విషయమై విస్తృతంగా పరిశోధన చేసిన ధర్మపాల్‌గారు 1814 జూన్ 3న ఇంగ్లాండ్ నుండి బెంగాల్‌కు పంపబడ్డ ఒక అధికార పత్రంలో ఈవిధంగా పేర్కొనబడిందని వ్రాసారు. **"అతిపురాతన కాలంనుండి హిందూదేశంలో అమలులోఉన్న బోధనాపద్ధతిని ఈ దేశంలో అమలుచేయటంద్వారా దానికి ఎంతో**

విశిష్టత చేకూరింది. ఈ దేశం ఆ పద్ధతికి యిచ్చిన నివాళియిది. ఒకభాషను నేర్చుకోవటానికి బోధనా ప్రక్రియను అది సులభతరంచేస్తుందన్న నమ్మకంతో మన జాతీయ విద్యాసంస్థలలో అది ప్రధాన బోధనాపద్ధతి అయింది".

అప్పటి బళ్ళారి జిల్లాకలెక్టరు భారతదేశపు పాఠశాలల్లో చదవనూ, వ్రాయనూ నేర్పే బోధనా, అభ్యసన పద్ధతులు సరళతరము, సులభతరము, తక్కువఖర్చుతో కూడినవని ప్రశంసించాడు. చదువులలో రాణిస్తున్న పిల్లలు తమ చదువు తాము చదువుకుంటూనే, చదువులో వెనుకబడిన తమతోటి విద్యార్థులకు ఓర్పుతో, నేర్పుతో వారికి చదవనూ, వ్రాయనూ నేర్పే క్రమంలో పాలుపంచుకోవటాన్ని ఒక అద్భుతమైన, అరుదైన ప్రయోగం అని అభినందిస్తూ, ఆ పద్ధతులను ఇంగ్లాండ్ అనుకరించటం, అనుసరించటం చక్కటి విద్యా సంస్కరణ అవుతుందని వ్రాసాడు. ఆ విధంగా భారతదేశపు చదువులచెట్టు అంటుమొక్కలను ఇంగ్లాండ్‌కు తీసుకొని వెళ్ళి నాటి, అందువల్ల బహుళప్రయోజనం పొందారు. ముందు ఇంగ్లాండ్, తర్వాత మిగిలిన పాశ్చాత్య దేశాలు 'మద్రాసు పద్ధతి'ని ప్రవేశపెట్టిన తర్వాతే, ఆయాదేశాలలో విద్యావ్యాప్తి జరిగింది.

ధర్మపాల్‌గారు మనదేశపు విద్యావ్యవస్థ ఇంగ్లాండ్ విద్యావ్యవస్థకంటే ఎంత మెరుగైనదిగా ఉన్నదో ఈ క్రింది వాక్యాలలో తెలియచెప్పాడు.

"1823 సంవత్సరంలో మద్రాసు ప్రెసిడెన్సీ జనాభా 1,28,50,941. 1811లో ఇంగ్లాండ్ జనాభా 95,43,610. ఉచితపాఠశాలలు, ఆదివారం బైబిలు పాఠశాలలు కలుపుకొని ఇంగ్లాండ్‌లో 75 వేల పాఠశాలలు ఉండగా మద్రాసు ప్రెసిడెన్సీలో 1,24,498 పాఠశాలలు ఉండేవి. కాలక్రమంలో అక్కడ పాఠశాలల సంఖ్య, విద్యార్థుల సంఖ్య పెరుగుతూ రాగా మద్రాసు ప్రెసిడెన్సీలో తగ్గుతూ వచ్చింది. కేవలం 50 సంవత్సరాలలో దేశీయ విద్యావ్యవస్థ క్రుంగికృశించి పోయింది. దాని ఫలితంగా 1822-25 మధ్య మద్రాసులో ప్రతి నూరుమందిలో 25మందికి పాఠశాలలకు వెళ్తుండగా, 1879-80 నాటికి ఆ సంఖ్య పెరగవలసిందిపోయి, దారుణంగా 13కు పడిపోయింది. వలసపాలన మొదలయి, క్రైస్తవీకరణ పుంజుకొన్న తరుణంలోనే ఈ ఘోరం జరిగిపోయింది. విద్యావకాశాలు తెల్లవారి పాలన మొదలయ్యాక

సామాన్యులకు అందుబాటులోకి రాకుండా పొయ్యాయి. వాస్తవాలను వక్రీకరించి, తమకారణంగా విద్యావకాశాలు పెరిగాయని తెల్లవారు డప్పుకొట్టుకొన్నారు.

బోధించే అంశాలను బట్టికాని, పాఠశాలలకు హాజరు అవుతున్న విద్యార్థుల శాతం బట్టికాని, 1800 సంవత్సరంలో భారతదేశంలో అమలులో ఉన్న విద్యావ్యవస్థ ఇంగ్లాండ్ విద్యావ్యవస్థకంటె ఏమాత్రమూ తీసికట్టు కాదు. అంతేకాక అనేక అంశాలలో భారతీయపాఠశాల విద్యావిధానం ఎంతో విస్తృతమైంది కూడా..... బోధించే పాఠ్యాంశాలు ఇంగ్లాండ్‌లోకంటె మెరుగైనవి, లోతైనవి–ఉపయోగపడేవి. పిల్లల చదువు నేర్చుకొనేకాలం కూడా ఎక్కువ. బోధనాపద్ధతులు ప్రత్యేకమైనవి. శతాబ్దాలపాటు అమలులో ఉన్న భారతీయ బోధనాపద్ధతులు ఇంగ్లాండ్‌లో ప్రవేశపెట్టిన తర్వాతే అక్కడ విద్యాభ్యాసంపట్ల ఆసక్తి పెరగటంతోపాటు, విద్య సార్వత్రికమైంది. మద్రాసు ప్రెసిడెన్సీలో పాఠశాలలకు హాజరయ్యే పిల్లలశాతం పతనావస్థకు దగ్గరగా ఉన్న 1822–25 మధ్య కూడా ఇంగ్లాండ్‌లో ఉన్న అన్నిరకాల పాఠశాలలకు వెళ్ళే విద్యార్థుల శాతంతో పోలిస్తే చాలా ఎక్కువ. భారతదేశంలో విద్యాబోధనా అభ్యసన పద్ధతులు సహజంగానూ, పిల్లలకు నేర్చుకోవటానికి వీలుగానూ ఉండేవి. ఉపాధ్యాయులు ఇంగ్లాండ్ ఉపాధ్యాయులతో పోల్చితే అంకిత భావంతో పనిచేసేవారని, మృదుస్వభావులని ఈ నివేదికలు తెలియచేస్తున్నాయి. ఉపాధ్యాయులలో అన్నికులాలకు చెందిన వారు ఉన్నారు. బ్రాహ్మణేతరుల శాతమే ఎక్కువగా ఉండేది. అలాగే విద్యార్థులలోనూ బ్రాహ్మణేతరుల శాతమే ఎక్కువ. కనుక విద్య అగ్రకులాలకే పరిమితం అయిందన్నది దుష్ప్రచారంతప్ప వాస్తవం కాదు".

"భారతదేశం ఈరోజున 50, 100 సంవత్సరాలకంటె మరింతగా నిరక్షరుల దేశం అయింది. బర్మాకూ అదే గతి పట్టింది. ఆంగ్లపాలకులు ఈ దేశంలోకి అడుగుపెట్టాక జరుగుతున్నదాన్ని జరగనివ్వకుండా, దాన్ని సమూలంగా పెకలించి వేయటానికి పూనుకొన్నారు. మట్టిని తవ్వారు. వేళ్ళను పరిశీలించారు. వేళ్ళను సంరక్షించకుండా వదిలివేశారు. దానితో అందమైన చదువుల చెట్టు ఎండిపోయింది. జీవం పోగొట్టుకొంది. భారతదేశ గ్రామీణ పాఠశాల విద్యావ్యవస్థ ఆంగ్లపాలకులకు

నచ్చలేదు. దానిని నిర్వీర్యంచేసి, తమదైన విద్యాప్రణాళికను అమలుచేశారు.... అయితే పాశ్చాత్య పద్ధతిలో ఏర్పాటుచేసిన పాఠశాలలు ఖరీదైనవి. దీనితో అవి అందరికీ అందుబాటులోకి రాలేదు. అందరికీ నిర్బంధ ప్రాథమిక విద్యను ఒక శతాబ్దంలో ఈ పాఠశాలలు అందించలేవు. నాపేదదేశం అటువంటి ఖరీదైన చదువును భరించే శక్తి లేనిది......" (గాంధీ-అక్టోబరు 20, 1931) ఆంగ్లవిద్య గురించి గాంధీ మహాత్ముడు వెలుబుచ్చిన ఈ అభిప్రాయంతో మనం ఏకీభవించకుండా ఉండలేం

18వ శతాబ్దపు భారతదేశ సమాజం వలసపాలకులు అనేక సందర్భాలలో వర్ణించినట్లుగా జవసత్వాలు ఉడిగి, శిధిలమయ్యేందుకు సిద్ధంగా ఉన్న సమాజంకాదు. భారతదేశం పేదదేశం అయిఉంటే, దానిని కొల్లగొట్టటానికి వారు అంతదూరంనుండి వచ్చేవారు కాదు. వలసపాలన కారణంగానే భారతదేశం అనేక రకాలుగా దెబ్బతిన్నది. వలసపాలకులు ఆ సమాజపు సంపదను కొల్లగొట్టి, పీల్చిపిప్పిచేశారు. హిందూదేశపు కల్పవృక్షమూలాలను త్రవ్వితీసి కొలుకోలేని దెబ్బకొట్టారు. వెయ్యి సంవత్సరాల విదేశీ ముస్లిం పాలనలో తీవ్రంగా కోల్పోయినా కూడా వారు చేయలేనిది ఆంగ్లేయుల రెండువందల సంవత్సరాల కాలంలో చేయగలిగారు. సమూలంగా దేశాన్ని దెబ్బకొట్టారు.

18వ శతాబ్దపు భారతదేశం ఆనాటి ఇతరదేశాలతో పోల్చి చూసినప్పుడు ధనధాన్యాలతో తులతూగుతున్నది. విద్యావిషయకంగా, వ్యవసాయికంగా, శాస్త్రసాంకేతిక అభివృద్ధిపరంగా ఇంగ్లాండ్ కంటె ఎంతో ముందంజలో ఉంది. భారతదేశాన్ని తమ పాదాక్రాంతం చేసుకున్న తర్వాతే ఇంగ్లాండ్ అభివృద్ధి మొదలయింది. భారతదేశంనుండి కొల్లగొట్టబడిన ఆర్థికవనరులే కాదు, మేధాపరమైన ఆలోచనలు, భావనలు సైతం భారతదేశంనుండి తీసుకొని, వారు అభివృద్ధి సాధించారు. 19వ శతాబ్దిలో ఇంగ్లాండ్ వేసిన ప్రతిముందు అడుగువెనుక భారతదేశపు భౌతిక, మేధాపరమైన వనరుల తోడ్పాటు ఉంది.

## References

1. Simon Digby, The Maritime Trade of India, *The Cambridge Economic History of India*, Vol .1,pp.134-5

2. Holden Furber,*Rival Empires of Trade in the Orient 1600-1800*, p. 331
3. K.N. Chaudhuri, 'Markets and Traders in India during the Seventeenth and Eighteenth Centuries', Dewey, and Chaudhuri (ed), *Economy and Society, p. 161*
4. E.H. Carr, *What is History, p .23*
5. Tapan Raychaudhuri, *Mughal India,* Cambridge Economic History of India, Vol 1, p. 261
6. Dietmar Rothermund,*Asian Trade and European Expansion in the Age of Mercantilism* p. 65
7. Holder Furber, Rival Empires of Trade in India in the Orient 1600-800, p. 234,264,298
   For more details see K.N. Chaudhary, Op cit, pp 191-208.
8. Rothermund, p. 12
9. Tapan Ray Chaudhari 's article in *Cambridge Economic History of India*, Vol. II,p. 32
10. K.N. Chaudhari, op.cit.p. 150
11. K.N. Chaudhari, op. cit. 151
12. Tapan Ray Chaudhari's article, op cit, *Cambridge Economic History of India,* Vol. II, p. 3 0
13. Cambridge Economic History of India, Vol 2, p. 31
14. Holden Furber, p. 24
15. Rothermund, p. 73
16. Holden Furber, pp. 132-33
17. Tapan Ray Chaudhary's article in *Cambridge Economic History of India*, Vol. II, p. 25,26
18. W.W.Hunter, *A History of British India*, p. 21
19. Rothermund, p.19
20. Rothermund, p.12
21. Furber, pp. 120-123.
22. For details see W.W. Hunter, pp. 218-20



# 5

# దేశమంతటినీ ఆంగ్లేయులు తమ గుప్పిట్లోకి ఎలా తెచ్చుకున్నారు?

ఒకప్పుడు ధనధాన్యాలతో వైభవంగా వర్ధిల్లిన వంగదేశము ఈస్టిండియా పాలనలోకి వచ్చిన కొన్ని దశాబ్దాలలోనే అణిచివేతకు మారుపేరైన భూస్వామ్య వ్యవస్థతోనూ, పరాన్నభుక్కులైన వడ్డీవ్యాపారులతోనూ, ఋణభారంతో క్రుంగిపోయిన రైతులతోనూ నిస్తేజంగా తయారైంది. తన చైతన్యాన్ని, గతిశీలతను కోల్పోయింది. కంపెనీ ప్రవేశపెట్టిన భూమిశిస్తు విధానాలు రైతాంగాన్ని పేదరికంలోకి నెట్టివేయగా, ఆ విధానాలవలన కంపెనీ, దాని అధికారగణం అపరిమితంగా లబ్ధి పొందారు. వంగదేశంలో ఆంగ్లప్రభువులు ప్రవేశపెట్టిన 'భూసంస్కరణలు' గురించి తెలుసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఎందుకంటె తరువాత కాలంలో భారతదేశం అంతటా అవే భూవిధానాలు అంతే తీవ్రతతో అమలుచేశారు. 'భూసంస్కరణలు' పేరుతో వారు తీసుకొని వచ్చిన వ్యవస్థాగత మార్పులను ఎందుకు చేపట్టారు? మన వ్యవసాయరంగంలో ఆ వ్యవస్థాగత మార్పులు ఎలాంటి ప్రభావం చూపాయి? ఆ మార్పులవల్ల ఎవరు ఎంతమేరకు లాభపడ్డారు? ప్రస్తుతం వ్యవసాయరంగం ఎదుర్కొంటున్న అనేక సంక్షోభాలకు-గ్రామీణఋణభారం, భూపంపిణీలో ఉన్న అసమానతలు, వ్యవసాయంలో వెనుకబాటుతనం, ప్రచ్ఛన్న నిరుద్యోగిత మొదలైనవాటికి ఆంగ్లేయులు ఆ కాలంలో ప్రవేశపెట్టిన వ్యవస్థాగత మార్పులు కారణమా? ఈ ప్రశ్నలకు సమాధానాలు భారత రైతాంగం కోణంనుంచి అన్వేషించాలి.

ఫలసాయాన్నిబట్టి, పంట స్వభావాన్నిబట్టి, భూసారాన్నిబట్టి, కల్పించిన నీటివసరుల సౌకర్యాన్ని బట్టి, పంటవిలువను బట్టి అనాదిగా భారతదేశంలో పాలకులు సశాస్త్రీయంగా భూమిశిస్తును నిర్ణయించేవారు. అది ఏనాడూ పండిన

పంటలో అరవవంతు మించి ఉండేదికాదు. విదేశీ ముస్లిం పాలనాకాలంలో అనేక అవకతవకలు చోటుచేసుకున్నాయి. వారనుసరించిన విధానాలవలన రైతాంగం దుస్థితిలోకి నెట్టివేయబడ్డారు. కాగా, ఈస్టిండియా కంపెనీ ప్రవేశం, పన్నులు విధించే అధికారాన్ని చేజిక్కించుకోవటం ఆపై వందేండ్లకు కంపెనీ నుండి ఇంగ్లాడులోని కిరీటానికి అధికార బదిలీ రైతాంగ దుస్థితిని మరింత తీవ్రతరం చేసింది. ఆంగ్లపాలకులు అశాస్త్రీయంగా, అహేతుకంగా, నిర్దయగా శిస్తును నిర్ణయించటమే కాకుండా, దాని వసూలుకు క్రూరమైన పద్ధతులను ప్రవేశపెట్టారు.

**శిస్తు వేలం పాటలు :**

1762 నుండి రైతులనుండి భూమిశిస్తు వసూలుకు భారతదేశంలో అంతకుముందెన్నడూ లేని ఒక విచిత్రమైన పద్ధతిని తెల్లదొరలు ప్రవేశపెట్టారు. ప్రస్తుతం సారాయి అమ్మకాలకు అనుసరిస్తున్న వేలంపద్ధతి వంటిదే భూమిశిస్తు వసూలుకు కూడా ప్రవేశపెట్టారు. గ్రామాలవారీగానూ, కొన్ని గ్రామాల కూడిక వారీగానూ అధికమొత్తంలో రైతులనుండి శిస్తు వసూలు చెయ్యటానికి ముందుకు వచ్చిన వారికి శిస్తు వసూలు హక్కును కట్టబెట్టారు. వేలంపాటలో చివరికంటా నిలబడి అందరికంటే ఎక్కువ శిస్తు వసూలుచేసి తెల్లదొరలకు చెల్లించటానికి సిద్ధపడిన గుత్తేదారులకు శిస్తు వసూలు అధికారం కట్టపెట్టారు. ప్రభుత్వానికి రైతాంగానికి మధ్య ఒక పెద్ద వర్గాన్ని ఆంగ్లపాలకులు సృష్టించారు. తమ చేతికి మట్టి అంటకుండా, రైతాంగాన్ని, వ్యవసాయ మిగులును దోచుకోవటానికి ఆంగ్లేయులు ప్రవేశపెట్టిన ఈ కుట్రపూరిత విధానంలో కొందరు భారతీయులు సైతం భాగస్వాములు అవ్వటం విచారకరం.

1762లో కంపెనీ బెంగాల్‌లో మిద్నపూర్, చిట్టగాంగ్, బర్ద్వాన్ జిల్లాలలో ఈ కొత్త పద్ధతిని ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టింది. 1793 వరకు అంటే మూడు దశాబ్దాలపాటు అది కొనసాగింది. ఈ విధానం ఫలితంగా, పంటనంతా రైతులు శిస్తు రూపంలో చెల్లించినా, శిస్తు బకాయిలు తీరేవికావు. తరతరాలుగా ఉంటున్న పల్లెలు, గ్రామాలను విడిచిపెట్టివెళ్ళలేక, శిస్తులు చెల్లించలేక రైతులు నానాయాతనలు పడ్డారు. రైతుల దుస్థితిగురించి ఆంగ్లపాలకులకు పట్టలేదు. వర్షాభావ పరిస్థితులు నెలకొన్నా, కఱవుకాటకాలు వచ్చినా శిస్తువసూళ్ళు ఆగేవికాదు. శిస్తుచెల్లింపులు తప్పేవికాదు. నెలవారీ శిస్తు చెల్లింపు ఏ రైతుకూ అనుకూలం కాదు. ఈస్టిండియా కంపెనీ పరిమితులు లేని ధనాశతో ఎప్పటికప్పుడు శిస్తువసూళ్ళ

లక్ష్యాన్ని పెంచుతూ ఉండేది. కంపెనీకి చెల్లించవలసినది చెల్లించి, మిగిలినది తాము అట్టిపెట్టుకోవచ్చు కనుక గుత్తేదారులు రైతులను పీడించి మరీ శిస్తులు వసూలు చేసేవారు. కంపెనీకి సింహభాగం, శిస్తువసూలుదారులకు మలిభాగం మొత్తం కలిపి తడిసి మోపెడు అయిన భూమిశిస్తు చెల్లించలేక రైతుల నడ్డి విరిగేది. ఈ 'కొత్తభూస్వాములు' గ్రామాలమీదపడి దోపిడీదొంగల మాదిరిగా రైతులను దోచుకొనేవారు. ఆరుగాలం శ్రమించి పండించినదంతా దోచుకుపొయ్యేవారు.[1]

1769లో ఈ కొత్తవ్యవస్థ పనితీరును పరిశీలించారు. వేలంపాటలో శిస్తువసూలు హక్కును పొందిన గుత్తేదారులవలన అనేకప్రాంతాలలో అరాచకపరిస్థితులు నెలకొన్నట్లుగా, గుత్తేదారులు రైతులను విచక్షణారహితంగా దోచుకున్నాకూడా, వారు వసూలుచేసి యిస్తామని హామీ యిచ్చిన శిస్తుమొత్తాన్ని చెల్లించలేకపోతున్నారని ఆంగ్ల అధికారులు తమ అంతర్గత నివేదికలలో పేర్కొన్నారు. ఈ కొత్త శిస్తువసూలు పద్ధతిలో పాతభూస్వాములుసైతం తీవ్రంగా నష్టపోగా, సామాన్యరైతులు తీవ్రఅణిచివేతకు గురిచేయ బడ్డారని వారి నివేదికలలో పేర్కొనటం విశేషం.[2]

వ్యవసాయరంగాన్ని కొల్లగొట్టేందుకు ఈస్టిండియా కంపెనీ ఒక పెద్దకుట్ర చేసింది. ఆనాటి జమీందార్లు అప్పటికి చెల్లిస్తున్న శిస్తు మొత్తాలకు రెట్టింపు చెల్లించాలని ఆదేశాలు యిచ్చింది. తాము అడిగినంత శిస్తుచెల్లించటానికి యిష్టపడని వారి భూములపై హక్కులను బహిరంగంగా వేలంవేసింది. శిస్తుచెల్లించలేని వారికి కూడా అదే గతి పట్టింది. జమీందార్లు రైతులనుండి శిస్తువసూలు చేసి ప్రభుత్వానికి చెల్లించే ఏర్పాటు ఎప్పటినుండోఉంది. కాలక్రమంలో గ్రామాలలో జమిందార్ల మాట చెల్లుబాటు అయ్యేది. కాగా ఇప్పుడు తమపాలనను సుస్థిరపర్చుకోవటానికి ఒకకొత్త వర్గం కంపెనీకి అవసరమయింది. పాత జమీందార్లమీద వారు ఆధారపడదల్చు కోలేదు. జమీందార్లలో అనేకమందికి సామాన్య ప్రజలపట్ల సానుభూతి ఉండేది. వారిమీద ఆధారపడితే, తాము అనుకొన్నట్లుగా వ్యవసాయరంగాన్ని యథేచ్ఛగా దోచుకోవటం అసంభవమని ఆంగ్లేయులు భావించారు. పూర్తిగా తమకు అనుకూలమైన ఒక వర్గాన్ని వారు సృష్టించదల్చుకొన్నారు. అందుకుగానూ జమీందార్ల స్థానంలో కొత్త వ్యవస్థను తీసుకురాదల్చుకున్నారు. తాము ఏకపక్షంగా నిర్ణయించిన అధికశిస్తులను చెల్లించలేని జమీందార్లకు వారి భూములపై గల శిస్తువసూలు హక్కులను కంపెనీ వేలంవేసింది. ఎవరు తాముకోరినంత శిస్తువసూలు చేసిపెడ్తామని ముందుకొస్తారో వారికి 3 ఏళ్ళపాటు ఆ శిస్తువసూలు హక్కును కట్టబెట్టింది.

**పరపీడన పరాయణులకు హక్కుల బదిలీ :**

అనేకమంది జమీందార్లు రైతుల ముక్కుపిండి అధికశిస్తు వసూలు చెయ్యటానికి సిద్ధపడలేదు. దానితో జమీందార్లకు తరతరాలుగా వస్తున్న వారసత్వ హక్కులను కంపెనీ కాలరాచింది. రైతులను వేధించి, పీడించి, అధికశిస్తు వసూలు చెయ్యగల పరపీడన పరాయణులైన మధ్యవర్తులకు హక్కులను బదిలీచేసింది. దానితో నీతి, నిజాయితీ లేనివారు, దౌర్జన్య ప్రవృత్తి గలవారు, శిస్తువసూలు చేయటానికి ఎంతకైనా తెగించగలవారు, స్వార్థపరులు, అత్యాశాపరులు, పీడకులు, పాపభయం లేనివారు రంగంలోకి వచ్చారు. రాత్రికి రాత్రేవారు 'కొత్తజమీందార్లు' అయ్యారు. లేదా 'భూస్వాములు' అయ్యారు. 1765 తర్వాత ఈ 'దివానీ' హక్కు ఇతర ప్రాంతాలకు కూడా వ్యాపించింది. ఏమాత్రం కనికరం లేకుండా వారు శిస్తుల వసూళ్లకు తెగబడ్డారు. ఇదివరలో జమీందార్లదగ్గర ఉన్నత ఉద్యోగాలలో ఉన్నవారు నిరుద్యోగులయ్యారు. కిందిస్థాయి ఉద్యోగులను పరిమితకాలానికి శిస్తువసూలు ఉద్యోగులుగా నియమించారు. జమీందార్లనుండి, రైతులనుండి, కవులదార్ల నుండి శిస్తువసూలు చేసే బాధ్యతను వారికి ఒప్పగించారు".[3]

ఈస్టిండియా కంపెనీ ప్రవేశపెట్టిన ఈ అరాచకవ్యవస్థ దుష్ఫలితాలు అన్నీ, ఇన్నీ కావు. పాతకాలపు జమీందార్ల వారసులు తమభూములు 'కొత్తభూస్వాముల' చేతుల్లోకి వెళ్ళటాన్ని నిస్సహాయంగా చూశారు. కొత్తభూస్వాములలో కొందరు వడ్డీవ్యాపారులు మరి కొందరు మట్టావ్యాపారులు. పాత జమిందార్ల విధవలు, మైనరు వారసులు, తమ ప్రజలు కంపెనీవారు నియమించిన ఈకొత్త భూస్వాముల చేతుల్లో నలిగిపోవటాన్ని చూసి కూడా ఏమీ చెయ్యలేకపొయ్యారు. ఇంత అణచివేత, దౌర్జన్యం జరిగినా కంపెనీ ఆశించినమేరకు శిస్తు వసూళ్ళురాలేదు. పాతజమీందార్లు అదృశ్యం అవటంతోనూ, కొత్తభూస్వాములు నిర్దాక్షిణ్య అణచివేత కారణంగానూ, రైతులు కంపెనీ అధీనంలోని ప్రాంతాలనుండి పారిపొయ్యారు. ఆకలి, కఱవు కాటకాలు, అంటువ్యాధులు ప్రబలి బెంగాల్‌లో మూడవవంతు సాగుభూమి బీడుభూమిగా మారిపొయ్యింది. ఏభూములను కొల్లగొట్టి, తమకోశాగారం నింపుకొందామని వారు కొత్త వ్యవస్థను తీసుకొచ్చారో, అది అసలుకే మోసం తెచ్చిపెట్టింది. ఇది వారు ఊహించని పరిణామం. జనావాసాలు ఖాళీ అయితే, సంపదప్రవాహానికి అడ్డుకట్టపడుతుంది. కనుక ఏదోఒకటి చేసి తమ ఆదాయం

తగ్గకుండా చూసుకోవాలని కంపెనీ తాపత్రయపడింది. దాని ఫలితమే 'శాశ్వత శిస్తు నిర్ణయపద్ధతి' అమలులోకి రావటం.

1770లనాటికి ఇంగ్లీషువారి ఈస్ట్ ఇండియా కంపెనీలో 430 మంది సివిల్ ఆఫీసర్లు ఉండేవారు. వారిలో ఐదింట నాల్గువంతులమంది వారికి ప్రధాన కేంద్రాలుగా ఉన్న కలకత్తా, మద్రాసు, బొంబాయిలలో ఉండగా ఐదింట ఒక వంతు మంది మాత్రమే ఇతర స్థలాలలో ఉండేవారు. వారిలో ఎక్కువమంది వ్యాపారంలో నిమగ్నమై ఉన్నవారే. 1790ల నాటికి ఇంగ్లాండులో జన్మించి సివిల్ సర్వీసు అధికారులుగా వచ్చినవారి సంఖ్య 600 అయ్యింది. వారిలో సగం మంది ప్రెసెడెన్సీ కేంద్రాలకు బయటనే పన్నుల వసూలు అధికారులుగానో, జిల్లా జడ్జీలుగానో ఉండేవారు. వ్యాపారుల చేతినుండి అధికారం ప్రశాసన అధికారుల చేతులలోకి బదిలీ అయ్యింది.

ఇంగ్లీషువారు రాకముందు రైతులు గ్రామం ఉమ్మడిఆస్తి అయిన భూమి నుండి తమకు కేటాయింపబడినమేర ఉన్న భూమికి కర్షకులు మాత్రమే. భూమిని అమ్ముకొనే అధికారం (ఆమాటకు వస్తే అవసరమూ) వారికి ఉండేదికాదు. ఇప్పుడు ఇంగ్లీషు కంపెనీవారు రైతులకు భూములను అమ్ముకొనే హక్కు కల్పించారు. క్రయవిక్రయాలకు రిజిస్ట్రేషను పద్ధతి పెట్టారు. రిజిస్ట్రేషనులకు రుసుము వసూలుచేశారు. అలా రిజిస్ట్రేషను చేసిన క్రయాలకు కంపెనీ అధికార యంత్రాంగంద్వారా రక్షణ కల్పిస్తామన్నారు. వాదవివాదాలు చెలరేగినపుడు విచారించి, తీర్పుల నివ్వడానికి కోర్టులు ఏర్పరిచారు. వాదుల తరఫున మాట్లాడడానికి న్యాయవాదులు/అధివక్తలు/ప్లీడరులు అనే ఒక క్రొత్త వృత్తికి బీజారోపణ చేశారు. ఈ వివాదాలలో చిక్కుకున్నవారు న్యాయం పొందే మాట అలా ఉంచి ఒక కోర్టు నుండి పై స్థాయిలో ఉండే మరో కోర్టుకు అప్పీలుకు వెళ్తూ బికారులయ్యే వ్యవస్థను సృష్టించారు.

ఆ తర్వాత దేశంలో వివిధ ప్రాంతాలలో ఉన్న పాలకులనుండి ఆయా రాజ్యాలను తమ అదుపులోకి తెచ్చుకొనడానికి రకరకాల జిత్తులు ప్రయోగించారు. ఉదాహరణకు రెండు మూడు మాత్రమే ఇక్కడ చెప్పుకొందాం.

### గ్రామీణ ఆర్థిక వ్యవస్థ విధ్వంసానికి ఉదాహరణ పోలవరం

కంపెనీ నిర్వహణ (ప్రశాసన) వ్యవస్థల్లో మార్పులు తాకిడికి ప్రభావితమైన

జమీందారీలలో పోలవరం(ప.గో.జిల్లాలోఉంది) ఒకటి. ఈ సంస్థానం ఏలుబడిలో కొన్ని గిరిజను ఉండే గ్రామాలు, కొంత మైదానప్రాంతమూ ఉన్నవి. వారికి దగ్గరగా ఉన్న ప్రముఖ వ్యాపారకేంద్రం రాజమహేంద్రవరం. నల్లరేగడినేలలో పండే పత్తి రాజమహేంద్రవరం చేరి, వ్యాపారులకు అందుబాటులో ఉండేది. వ్యాపారులు అక్కడినుండి ఆసియా, యూరప్‌లలో వ్యాపించిన అనేక కేంద్రాలకు తీసుకుపోయి అమ్మేవారు. పోలవరాన్ని ఏలే రాజవంశం 1600లలో అక్కడికి వచ్చింది. ఇంగ్లీషువారు ఉత్తరకోస్తా జిల్లాలలోకి అడుగుపెట్టే సమయానికి ఈ వంశం తగినంతగా బలపడి కుదురుకొని ఉంది.

సకాలంలో పన్ను చెల్లించనివారిని బెదిరించడానికి దండధారులైన మనుషులను పంపటం రివాజు. రైతులకు పన్నులు చెల్లించలేని స్థితిలో రెండు ప్రత్యామ్నాయాలు ఉండేవి. ఈ రాజ్యం బయట ఉన్న ఇతర గ్రామాలకు వెళ్లి, భూమి అడిగి తీసుకొని, మడిదున్నుకొంటూ, కుటుంబాలను పోషించుకోవటం ఒకటైతే, తాత్కాలికంగా కొండలమీదకు చేరిపోవటం రెండవది. వసూలైన పన్నులనుండి రాజు అనేకానేక ప్రజాహిత కార్యకలాపాలు నిర్వహిస్తుండేవాడు. దుకాణాల సముదాయాలను నిర్మించటం, సత్రాలను, నిర్మించటం, దేవాలయాలకు, విద్యాలయాలకూ నిధులు సమకూర్చటం, కఱవులు సంభవించినపుడు తిండిగింజలు పంచిపెట్టటం, పొలాలలో ఊడ్పులు జరగడానికి (నాట్లు వేయడానికి) ముందు విత్తనాలను, అప్పులనూ సమకూర్చటం-మొదలైన బాధ్యతలపట్ల శ్రద్ధ వహించేవారు. పోలవరంలో కుదురుకున్న రాజవంశం 1790నాటికి వందగ్రామాలపైన, నాలుగు రేవుల మీద, పది పన్నెండు దేవాలయాలమీద బాధ్యతలు నిర్వహిస్తూ ఉంది. ఆనాడు బెంగాలులోగాని, దక్షిణ హిందూస్థానంలోగాని, రాజవంశాల పని తీరు ఇంచుమించుగా ఇలాగే ఉండేది.

దేవిరెడ్డి మంగపతి 1780లలో పోలవరం రాజుగా ఉన్నాడు. ఆ ప్రాంతానికి ఈస్టిండియా కంపెనీ కార్యకలాపాలు విస్తరించి, మొగలాయిలు ఆ ప్రాంతాన్ని కంపెనీకి ధారాదత్తం చేసిన తర్వాత, రాజు ఏటేటా మాసులిపట్నం (బందరు) లేదా చెన్నపట్నం (మద్రాసు) వెళ్లి, కంపెనీ అధికారులను కలిసి, తాను చెల్లించవలసిన పన్ను ఎంతో నిర్ధారించుకొని వస్తుండేవాడు. 1780ల తొలినాళ్లలో మంగపతి కుటుంబసభ్యులు, బంధువులు అతడిని తొలగించి, అధికారం హస్తగతం

చేసుకోబూనిపుడు బ్రిటీషువారు తమ సైన్యాలను పంపించి, ఆ తిరుగుబాటును అణిచివేసి, మంగపతి అధికారాన్ని పదిలపరిచారు. తిరుగుబాటుదారులను సమర్థించిన వారిని కూడా తిరుగుబాటుదారులుగా, సంస్థానానికి కంపెనీకి వ్యతిరేకులైన ద్రోహులుగా పరిగణిస్తామని హెచ్చరించారు. అయితే 1790లలో కంపెనీ ప్రశాసన వ్యవస్థలో వచ్చిన మార్పులతో కథ మారిపోయింది.

బెంజమిన్ బ్రాన్‌ఫిల్ 1794లో రాజమండ్రికి జిల్లా కలెక్టరుగా వచ్చాడు. అతడు 19 సం.ల వయస్సులో 1780లో (మంగపతి కూడా ఆ సంవత్సరంలోనే రాజయ్యాడు) కంపెనీ సేవలలో నియుక్తుడైనవాడు 14 సం.లపాటు వివిధ బాధ్యతలు నిర్వహించి 33 ఏళ్ల వయస్సులో భార్యాసమేతంగా, కొద్దిమంది సిబ్బందితో (వీరందరూ హిందూదేశీయులే) రాజమండ్రికి వచ్చాడు. గ్రామీణ హిందూదేశాన్ని ఎలా ఏలాలో తెలియజెప్పే మార్గదర్శక సూత్రాలున్న పుస్తకాన్ని, కొన్ని లెక్కలు వ్రాసిపెట్టి ఉన్న పుస్తకాలనూ తనతో తెచ్చాడు.

1790 నుండి కొన్ని సంవత్సరాలు వరుసగా అధిక వర్షపాతంతో వరదలు వచ్చిన సంవత్సరాలు. రైతులకు పంటలు చేతికి రాలేదు. అటువంటి స్థితిలో-గృహకలహంకూడా తోడైనందున మంగపతికి రైతులనుండి పన్నులు వసూలుచేయటం సాధ్యపడలేదు. రాజు అప్పులపాలైనాడు. కాబట్టి కంపెనీ కోరుతున్న స్థాయిలో తాను పన్ను చెల్లించజాలనని క్రొత్త కలెక్టరుకు తెలియజేశాడు. బ్రాన్‌ఫిల్‌కి ఏమి చేయాలో తోచలేదు. రాజు పరిస్థితిని తెలియజెప్పి, పన్నులు కట్టేందుకు కొంత గడువు ఇవ్వటం సమంజసమని మద్రాసులో ఉన్న పైఅధికారులకు నచ్చజెప్ప యత్నించాడు. మంగపతి కంపెనీవారికి విశ్వాసపాత్రుడైన మద్దతుదారు కదా! కాని కంపెనీ క్రొత్తగా రూపొందించుకొన్న ప్రశాసన సూత్రాలు అందుకు అనుమతించలేదు.

దానితో బ్రాన్‌ఫిల్ రెండవ ప్రత్యామ్నాయంగా మంగపతిని రాజుగా తొలగించి, మరొకరిని రాజుగా చేయటం ప్రతిపాదించాడు. అయితే అ పని చేయాలంటే వెల్లువెత్తగల తిరుగుబాటును అణిచివేయగల సైనికబలం తనకు అందుబాటులో ఉండటం అనివార్యమని విన్నవించాడు. రాజమండ్రి-మద్రాసుల మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలలో బ్రాన్‌ఫిల్ మంగపతి గురించి అవమానకరమైన భాష ఉపయోగించేవాడు. మంగపతికి సమర్థనగా రైతులు, గిరిజనులు, తిరగబడగలరన్న

భయమే అందుకు ప్రధాన కారణం. బ్రాన్‌ఫిల్ మంగపతికి వ్రాసిన లేఖలలో సకాలంలో సొమ్ము జమచేయకపోయినట్లయితే, అతడిని, అతని అనుచరులను ఎక్కడదాగి ఉన్నప్పటికీ ఎవరి ఆశ్రయం పొంది ఉన్నప్పటికీ మట్టుపెట్టటం ఖాయమని బెదిరించేవాడు.

## దౌర్జన్యానికి జవాబుగా తిరుగుబాటు

దీనికి జవాబుగా మంగపతి పోరాటానికి సిద్ధమైనాడు. దుర్గాన్ని పటిష్టం చేసుకొని, తనకు రక్షణగా మరికొందరు సేవకులను సమకూర్చుకొన్నాడు. (వారి దగ్గర ఫిరంగులు, తుపాకులు కాదు గదా, ఖడ్గాలుకూడా లేవని చెప్పాలి) అటువైపున 30 మైళ్ల దూరంలో రాజమండ్రిలో ఉన్న జిల్లా కలెక్టరు తనకు సహాయంగా ఉన్న సైనిక శిబిరం చిన్నదైనందున ఎప్పుడు ఏమి జరుగుతుందోనని భయంతో బిక్కుబిక్కుమంటూ 1799 ద్వితీయార్ధం వెళ్లబుచ్చాడు. అతడి అదృష్టంకొద్దీ దక్షిణ హిందూదేశంనుండి బెంగాలు దిక్కుగా వెళ్తున్న కంపెనీ సైన్యాలు సహాయంగా వచ్చాయి. తిరుగుబాటును అణిచివేయడానికి ఆసైన్యాలను వినియోగించుకొనడానికి అనుమతి లభించింది. సాయుధులైన 200 మంది సైనికులతో పోలవరంమీద దాడిచేసి, కోటను స్వాధీనపరుచుకున్నారు. పోరు అనుకున్న దానికంటే క్లిష్టంగానే ఉండింది. మంగపతి ఆంగ్లేయులకు దొరకకుండా తప్పించుకున్నాడు. ఎదురుదాడి జరుగగలదన్న భయంతో బ్రాన్‌ఫిల్ సైనికులను గ్రామాలలోకి, గూడేలలోకి పంపించి అనేకమందిని చంపించాడు. ఊళ్లకు ఊళ్లు తగలబెట్టించాడు.

1801 నాటికి రాజు పరారీలో ఉన్నాడు. సంస్థానం అమ్మకానికి పెట్టబడింది. ఆ తర్వాత కొద్ది సంవత్సరాలలో సంస్థానం అనేకసార్లు చేతులు మారింది. సంస్థానాన్ని కొనుగోలు చేసినా, రైతులనుండి పన్నులు వసూలుచేయటం వారికి సాధ్యమయ్యేది కాదు. అంతక్రితం కళకళలాడుతూ ఉండిన గ్రామాలు ఇప్పుడు మసిబారినవైనాయి. చివరికి 1813లో కొచ్చెర్లకోట జగ్గయ్య అనే స్థానికుడు కంపెనీలో జిల్లా కలెక్టరుకు నమ్మినబంటుగా పనిచేసే ధూర్తుడు 43,210 రూ॥లకు సంస్థానాన్ని కొనుగోలు చేశాడు. స్వతహాగా ధనవంతుడుకాని జగ్గయ్య స్వల్పవ్యవధిలో అంత ధనాన్ని ఎలా సమకూర్చు కోగలిగాడు? అందరికీ ఆశ్చర్యమే. కంపెనీ లెక్కలలో గడబిడ చేసి అంత సొమ్మును వెనుకవేసి ఉంటారనే అనుమానం

సత్యదూరమైనది కాదు. జగ్గయ్య గ్రామస్థులను మంచి చేసుకొనడానికి కొన్నిచోట్ల దేవాలయాలను నిర్మించటంవంటి ఎత్తుగడలు వేసినా, గిరిజన గూడేలలోని వారు అతడిని ఎంతమాత్రం అంగీకరించలేదు. 19వ శతాబ్దం ముగిసేవరకు కూడా ఆ కొండలు, కొండలలోని గ్రామాలు ఆంగ్లేయులకు తలనొప్పిగానే ఉన్నాయి. నీటిపారుదల వ్యవస్థలో మరమ్మతులకుగాని, విత్తనాల కొనుగోలు తదితర అవసరాలకు రైతులకు అప్పులిచ్చేందుకుగాని ధనం సమకూడని స్థితి ఏర్పడింది. జగ్గయ్య భూములుకూడా ఆదాయం సమకూర్చజాలనివైనాయి. ముసలితనం మీదపడేవరకు జగ్గయ్య బ్రతుకు సాగించి, ఎవరికీపట్టని తీరులో మరణించాడు.

## ప్రశాసన వ్యవస్థలో మార్పులు ప్రాణాంతకాలయ్యాయి !

బ్రాన్‌ఫిల్ కూడా పెద్దగా బావుకున్నదేమీలేదు. మద్రాసుకు విలియం బెంటింక్ గవర్నరుగా వచ్చాడు. ఈస్టిండియా కంపెనీపాలనలో ఉన్న పాలితులతో సౌమ్యంగా వ్యవహరిస్తూ పని జరిపించుకోవాలనే తత్త్వం ఆయనది. అవసరమైనదానికంటే, ఎక్కువగా హింస ప్రయోగించి, కంపెనీకి చెడ్డపేరు తెచ్చావని బ్రాన్‌ఫిల్ మందలింపుకు గురైనాడు. కొండలలోకి సైనికులను నడిపించటం ద్వారా, వారి ఆరోగ్యం ప్రమాదంలో పడిందని, స్థానిక ప్రజల దృష్టిలో మిలటరీపట్ల భయభక్తులు పలచబడ్డాయని, స్థానికులతో సౌమ్యంగా ఉంటూ వారినుండి రాబట్టవలసిన వాటిని రాబట్టాలని, వారి మతపరమైన నమ్మకాల విషయంలో జాగ్రత్తగా వ్యవహరించాలని బెంటింక్ పాఠాలు బోధించాడు. నేను గనక అలా మెత్తగా వ్యవహరించి ఉంటే, ఎప్పుడో చచ్చి ఉండేవాడిని అనుకొన్నాడు బ్రాన్‌ఫిల్.

థామస్ టాకెరే నాయకత్వాన ముగ్గురు సభ్యుల విచారణ సంఘం రాజమండ్రికి వచ్చింది. మంగపతికి వ్యతిరేకంగా కంపెనీలో ఉద్యోగులు (స్థానికులైనవారు) పన్నిన కుతంత్రాల కారణంగా పోలవరం సంస్థానం మసిబారినదని, జగ్గయ్యతో సహా వారందరూ రైతులనుండి లంచాలు వసూలు చేయడానికి యత్నించటం బ్రాన్‌ఫిల్ గుర్తించనేలేదని, పద్దుల నిర్వహణలో అవకతవకలూ పట్టించుకోలేదని, వారి కుతంత్రాల కారణంగానే ఆ ప్రాంతం అరాజకస్థితిలో పడిందని, జమీందారు తిరుగుబాటు చేయక తప్పనిస్థితికి నెట్టివేయబడ్డాడని టాకెరే అభిప్రాయపడ్డాడు. 1805లో తనకు వ్యతిరేకంగా ఫిర్యాదులు, నివేదికలూ లండన్‌కు పంపబడుతున్నవని తెలుసుకొన్న బ్రాన్‌ఫిల్ తాను కంపెనీ ఆదాయాన్ని, గౌరవాన్ని నిలబెట్టడానికి ఎంతో

శ్రమించగా, ఈవిధంగా తనపై దోషారోపణలు చేయబడుతూ ఉండటంవల్ల ఖేదపడ్డాడు. 1806 ప్రారంభంలో కంపెనీ సేవలకు రాజీనామా సమర్పించి, లండన్‌కు వెళ్లిపోయాడు.

బెంజమిన్ బ్రాన్‌ఫిల్‌గాని, దేవిరెడ్డి మంగపతిగాని, పోలవరం పరిసరగ్రామాల రైతులుగాని అందరూకూడా క్రొత్తగా ప్రవేశపెట్టబడిన నూతన ప్రభుత్వ వ్యవస్థవల్ల బాధింపబడినవారే, బలియైనవారే. అంతకుముందు కష్టసుఖాలను చెప్పుకొని కొన్ని రాయితీలు, మినహాయింపులూ పొందే వెసులుబాటు ఉండేది. ఇప్పుడు ప్రతిదీ లిఖితపూర్వకంగా నమోదుచేసే పద్ధతి వచ్చాక, అటువంటి వెసులుబాటు ఏమాత్రం లేకుండా పోయింది.

కొన్ని సంవత్సరాల తర్వాత కంపెనీ హిందూదేశంలోని తన ఉద్యోగులతో జరిపిన ఉత్తరప్రత్యుత్తరాలను పరిశీలించిన జాన్ స్టువర్ట్ మిల్ ప్రతిదీ లిఖితపూర్వకంగా నిర్వహించి భద్రపరచిన కారణంగానే హిందూదేశంలో ప్రభుత్వ నిర్వహణ విజయవంతమైనదని కితాబు నిచ్చాడు. ప్రపంచంలో మరియే దేశంలోనూ ఇంతటి ఉత్తమ వ్యవస్థ లేదని, కచ్చితమైన నియమనిబంధనలు రూపొందింపబడటమూ, అవి అమలుజరిగిన తీరునూ బ్రిటీషు అధికారులు పరిశీలిస్తూ ఉండటమూ, ఉత్తమ ప్రభుత్వ నిర్వహణకు అవసరమైన భద్రతను కల్పించినవని ప్రశంసించాడు.

కాగా వాస్తవమేమిటంటే, పెద్ద పెత్తున జరిగిన పత్ర వ్యవహారంగాని, పెద్దపెద్ద పద్దుల పుస్తకాల నిర్వహణగాని-గ్రామీణ సమాజం స్వరూప స్వభావాలను అర్థం చేసుకోలేకపోయాయి. అర్థం చేసుకొనడానికి అవరోధాలైనాయి. అంతకుముందు పరస్పరం సంప్రదింపులతో ప్రభుత్వానికి, జమీందారులకు మధ్య ఏవిధమైన అవగాహన కుదురుతూ ఉండేదో, క్రొత్త పద్ధతి వచ్చాక అది మాయమైంది. నిర్ణయాలను పదిమంది సమక్షంలో తీసుకొనబడటం అటకెక్కి మూసిన తలుపులవెనుక తీసికొనబడటం మామూలైపోయింది. అంతకుముందు సామాన్యప్రజలుకూడా తమ గ్రామాలకు వచ్చిన అధికారులను నిలదీసేవారు. ఇప్పుడు వారిగోడు చెప్పుకొనడానికిగాని, నిలదీయడానికిగాని అవకాశం లేకపోవటంతో కుట్రలకు, కుహకాలకు అవకాశాలు హెచ్చయినాయి. పాత జమీందార్లు ప్రజల కష్ట సుఖాలు అర్థం చేసుకోగల్గినవారుగా ఉండేవారు. ఇప్పుడు

వారి స్థానాలలో నియమితులైనవారు కొత్త నిబంధనల ననుసరించి రికార్డులు నిర్వహించేవారు, వాటిని తమ అవసరాల కనుగుణంగా అటూ ఇటూ మార్చేవారు అయ్యారు. 19వ శతాబ్దం తొలినాళ్లకే, స్థానికంగా పరస్పర సమర్థనతో విరాజిల్లుతూ ఉండిన ఆర్థిక వ్యవస్థలు భగ్నమైపోయి, వాటి స్థానంలో అవినీతితో నిండిన వ్యవస్థలు చోటుచేసుకున్నాయి. ఈవిధంగా గ్రామీణ హిందూదేశం అరాచకస్థితిలోకి నెట్టివేయబడింది.

దీనికి ఆశ్చర్యపడవలసింది ఏమీ లేదు. ఈ వ్యవస్థలు ఏవీకూడా హిందూదేశ గ్రామీణ ప్రాంతాల ఉద్ధరణకు, స్థిరమైన ప్రభుత్వ నిర్వహణకు ఉద్దేశించబడినవి కావుగదా! కంపెనీ కార్యనిర్వహణలో అవినీతి, లంచగొండితనము, అక్రమవ్యవహారములు లేవని ఇంగ్లాండు ప్రజానీకాన్ని, రాజకీయ ప్రముఖులను నమ్మించటంకోసం మొత్తం లిఖితపూర్వకంగా రికార్డులు ఉండే ఆ వ్యవస్థ ఏర్పరచబడింది. ఇది మనం గుర్తించాలి.

### ఆంగ్లేయుల ఆటలో పావు రాజా రవివర్మ హెగడె

మైసూరు రాజ్యంలోని విఠల అనే సంస్థానాధిపతి రవివర్మ నరసింహ దొంబ హెగ్గడే. సముద్రతీరాన ఉన్న మంజేశ్వర్ పట్టణానికి 25 మైళ్లు లోపలికి ఆ సంస్థానం ఉంది. ఆ సంస్థానపు పూర్వపు అధిపతులు ఆంగ్లేయులతో పోరు సాగించిన హైదరాలీ, టిపూసుల్తాన్‌లకు ససైన్యంగా సహకరించియున్నారు. కాగా టిపూసుల్తాన్ ఆంగ్లేయులతో చేసిన చివరి యుద్ధ సమయానికి రవివర్మ ఆంగ్లేయులకు సమర్థకునిగా మారాడు. బ్రిటీషువారు రవివర్మకు కొన్ని తుపాకులను అందజేశారు. వాటితో యుద్ధం సాగించిన రవివర్మ టిపూపై విజయం సాధించటంలో కీలకపాత్ర వహించాడు. మంజేశ్వర్ చుట్టుప్రక్కల ప్రాంతం సైనికులుగా జీవితం గడిపేవారికి పట్టుగొమ్మగా ఉండేది. 'కళరి' అనే యుద్ధ విద్యలకు కేంద్రం. టిపూమీద విజయం సాధించామనుకొన్న ఆంగ్లేయులకు మంజేశ్వర్-కనరా ప్రాంతాలు తమను ధిక్కరిస్తున్నట్లుగా కనిపించాయి. అలజడిని అదుపుచేసి, రాజస్వాన్ని (రెవిన్యూని) రాబట్టుకొని రావడానికి కంపెనీ లెఫ్టినెంట్ కర్నల్ థామస్ మన్రోను పంపించింది.

ఆ ప్రాంతంలోని సంస్థానాధీశులు తమ ప్రభావాన్ని విస్తరించుకొనే ప్రయత్నంలో ఉన్నట్టుగా మన్రోకి తోచింది. అలా తన ప్రభావాన్ని విస్తరించుకొనడానికి, ప్రదర్శించడానికి ఉత్సాహపడుతున్నవారిలో రవివర్మ ఒకడు. బ్రిటీషువారితో

సహకరించినందుకు బదులుగా, స్థానిక సంస్థలపై తన ఆధిపత్యాన్ని ప్రదర్శించు క్రోవటంలో భాగంగా 1799 మేలో 150మంది సైనికులను పంపించి మంజేశ్వర్‌లోని ఒక ఆలయాన్ని కూలగొట్టించి, అందులోని ఆభరణాలను సంచులలో తెప్పించాడు. ఆ దేవాలయం ఆ ప్రాంతంలోని గౌడసారస్వత బ్రాహ్మణులకు శ్రద్ధా కేంద్రంగా ఉన్నది. వారు ఒక ప్రతినిధి బృందంగా థామస్ మన్రోని దర్శించి రవివర్మపై చర్య తీసుకోవలసిందిగా కోరారు. రవివర్మ బలపడటం కంపెనీ ప్రయోజనాలకు అవరోధమని భావిస్తున్న థామస్ మన్రో, ఈ ఫిర్యాదును అవకాశంగా తీసుకొని తాము యుద్ధ సమయంలో ఇచ్చిన తుపాకులను తిరిగి అప్పజెప్పవలసిందిగా కోరాడు. రవివర్మ తుపాకులను తిరిగి అప్పగించడానికి నిరాకరించటమేగాక, బ్రిటీషువారు ఇస్తామన్న పింఛను తీసుకొని, సంస్థానాధిపత్యం వదులుకొని విశ్రాంత జీవనం గడపాలనే ప్రతిపాదనను కూడా తిరస్కరించాడు. సమీప గ్రామాలలోని స్థానిక నాయకులను సమీకరించి, బ్రిటీష్‌వారితో తలపడడానికి సిద్ధమయ్యాడు.

1800 ఏప్రియల్‌నాటికి వారంతా కలిసి మంజేశ్వర్‌కి చుట్టూ అన్ని వైపులా 30 మైళ్ల వరకు విస్తరించిన భూభాగంనుండి బ్రిటీషువారిని తరిమివేశారు. గ్రామాలలో ఆధిపత్యాన్ని ప్రస్థాపించుకొని, పన్నులు వసూలుచేయ నారంభించారు. బ్రిటీషువారు కొందరు మిత్రులనుండి అదనపు బలాలను కూర్చుకొని వీరిని మళ్లీ వెనక్కి నెట్టారు. రవివర్మ విఠలలోని దుర్గంలో ఉన్నాడు. గతంలో తమ మధ్యనగల మైత్రిని పురస్కరించుకొని తనపట్ల ఉదారంగా వ్యవహరించగలరన్న విశ్వాసంతో రవివర్మ లొంగిపోయాడు. కాని మన్రో ఆలోచనలు, మనస్తత్వమూ వేఱుగా ఉన్నాయి. 22 ఆగస్టున రవివర్మను, అతని ముగ్గురు సమీపబంధువులను, అయిదుగురు అనుచరులతోకలిపి, మొత్తం 9మందిని మంగుళూరులో ఉన్న ఎత్తయిన ప్రదేశమైన లైట్‌హౌస్ ఉన్న కొండనుంచి ఉరితీయించాడు.

"మంచి ఉదాహరణగా ఈ శిక్షను అమలుచేశాము. కెనరాలో ఇకపై అలజడులు ఉండబోవు" అని మన్రో ప్రకటించాడు. సైనికపాలన ప్రవేశపెట్టి, ప్రజలవద్ద ఎటువంటి ఆయుధాలూ లేకుండా గుంజుకోవాలి. స్థానిక పాలకులను పదచ్యుతులను చేయాలి. ఇది జరిగేంతవరకు, మనం ఆధిపత్యం సంపాదించినట్లుకాదు" అనేది ఆయన సిద్ధాంతం.

కాగా ఇక్కడ గమనించవలసిందేమిటంటే, రవివర్మను బంధించటంలో గాని, ఉరితీయటం లోగాని, బ్రిటీషువారు తాముగా నిర్ణయించగలస్థితిలో అధికారంలో లేరు. అక్కడుండే సంస్థానాధిపతుల తరఫున, వారిచేతనే ఈ పనులు చేయించవలసి ఉంది. రవివర్మ సైన్యాలను ఓడించి, వెనుకకు తరిమినవారు కంపెనీ సైనికులుకారు. వారు రవివర్మకు ప్రత్యర్థిగా ఉన్న బంట్వాల్ సంస్థానాధిపతి కుమార్ హెగ్గడే సైనికులు. బ్రిటీషువారితో సహకరించటంలో కుమార్ హెగ్గడేకు తనవైన సొంత ఆలోచనలు ఉన్నాయి. రవివర్మ స్థానంలో తాను ఆ ప్రాంతంలో బలపడడానికి ఆంగ్లేయులు ఇచ్చే మద్దతు, ఆర్థిక పుష్టి తనకు లాభప్రదం కాగలవని, తగిన సందర్భం చూసుకొని తాను ఆంగ్లేయులను అక్కడినుండి వెడలగొట్టగలనని అతడు ఊహించుకున్నాడు.

## వీరపాండ్య కట్టబొమ్మన వీరోచిత పోరాటం

దక్షిణ హిందూస్థానంలో ఉన్న ఆర్కాట్ నవాబ్ పాలిస్తున్న రాజ్యంలో ఉన్న సామంతరాజులను పాలెగాళ్లు అంటారు. మొత్తం 70 మంది పాలెగాళ్లు ఆ రాజ్యంలో ఉండేవారు. 1792లో ఆర్కాట్ నవాబు ఒక ఫర్మానా జారీచేశాడు. దాని ప్రకారం ఇకపై పాలెగాళ్లందరూ ఇంగ్లీషువారి ఈస్ట్ ఇండియా కంపెనీకి కప్పం కట్టాలి. పాలెగాళ్లందరూ అందుకు తల ఒగ్గారు-ఒక్కరు తప్ప. అతని పేరు వీరపాండ్య కట్టబొమ్మన. అతడు పాంచాలన్ కురిచ్చికి రాజు. వారి వంశానికి మూల పురుషునిపేరు కట్టబొమ్మన్ అనీ, క్రీ.శ. 1100లో అతడు ఆంధ్రదేశం నుండి తమిళప్రాంతానికి వలసపోయి, పుదుక్కోట దగ్గర ఉన్న పాంచాలన్ కురిచ్చిలో కోట నిర్మించాడని చెప్తారు. వీరపాండ్యునికి కుమారస్వామి (ఇతడు చాలా తక్కువగా మాట్లాడేవాడు, కాబట్టి మూగదొర అని వ్యవహరించేవారు), దొరసింగం అని ఇద్దరు తమ్ముళ్లు ఉండేవారు. వీరికి దాయాది అయిన ఎట్టియాపురం ఎల్లప్ప ఇంగ్లీషువారి పంచనచేరి, వీరపాండ్యునిపై కొండెములు చెప్తూ ఉండేవాడు. రామనాథపురంలో జిల్లా కలెక్టరుగా ఉన్న జాక్సన్ వీరపాండ్యునికి ఒక లేఖ పంపి, రామనాథపురంవచ్చి రామలింగవిలాస్ భవనంలో తనను కలుసు కోవలసిందిగా కోరాడు. రామనాథపురం సేతుపతిరాజు పాలనలో ఉంది. ఒంటరిగా రప్పించి, బందీచేసే దుర్మార్గపు ఆలోచన ఆంగ్లేయులకు ఉండి ఉండవచ్చునని తమ్ముడు దొరసింగం హెచ్చరించినప్పటికీ వీరపాండ్యుడు జాక్సన్‌ని కలవడానికి వెరువలేదు.

ఒంటరిగా రామలింగవిలాస్ రాజభవనానికి అశ్వారోహియై వచ్చిన వీరపాండ్యుని

ధైర్యానికి, అతడు నిశ్చయంగా తన వైఖరిని ప్రకటించిన తీరుకు జాక్సన్ నిర్ఘాంతపోయాడు. కాళ్లా వ్రేళ్లాపడి అనుమతులు పొంది వ్యాపారం సాగించడానికి వచ్చిన ఆంగ్లేయులు ఈ దేశపు రాజులను కప్పం కట్టమని అడగటం తగదని వీరపాండ్యుడు హెచ్చరించాడు. ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర, వంగ ప్రాంతాల్లో తాము సాధించుకున్న రాజ్యాధికారాన్ని చూపించి భయపెట్టజూచిన జాక్సన్ మాటలను లెక్కచేయలేదు. ఇక్కడికి వచ్చి నా మాటలు ధిక్కరించి బయటకు పోలేవు, చుట్టూ మా సైనికుల పహరా ఉందన్న జాక్సన్‌ను విదిలించివేసి వీరపాండ్యుడు బయటకు నడిచాడు. అతడిని పట్టుకొనడానికి ప్రయత్నించిన సేనాపతి క్లార్క్‌తోసహా కొందరు సైనికులు ప్రాణాలు కోల్పోయారు.

జాక్సన్ స్థానంలో వచ్చిన బానర్‌మన్ పాంచాలన్ కురిచ్చిపై దాడిచేసి, వీరపాండ్యుని అంతమొందించడానికి ఆజ్ఞలు జారీచేశాడు (1799 ఆగస్టు 14) ఆ సమయంలో తిరుచెందూరులో కట్టబొమ్మన్ వంశీకుల కులదైవం జక్కమ్మదేవి తిరునాళ్లు జరుగుతూ ఉండటమూ, వీరపాండ్యుని పెద్దతమ్ముడు మూగదొర అక్కడకు వెళ్లి ఉన్నాడని, అతడు వచ్చేలోగానే కార్యాన్ని ముగించాలని ఎల్లప్ప ఇచ్చిన సలహాను అనుసరించి వెంటనే దాడికి నిర్ణయించేశాడు.

పాంచాలన్ కురిచ్చి ఒక ప్రత్యేక పద్ధతిలో నిర్మించిన మట్టికోట. మూడు రోజులపాటు ఫిరంగుల ప్రేల్చినా, అది చెక్కుచెదరలేదు. నాల్గవరోజున రెండుమూడు చోట్ల కోటకు గండిపడింది. కోటలోపలికి ప్రవేశించి యుద్ధం చేయబోయిన లెఫ్టినెంట్ జనరల్ కాలిన్స్ వీరయ్య దేవుడనే వీరుని కత్తికి ఎర అయ్యాడు. వీరయ్య దేవుడిని డగ్లస్ తుపాకితో కాల్చాడు. జక్కమ్మదేవి తిరునాళ్లనుండి తిరిగివచ్చిన మూగదొర డగ్లస్‌ను జక్కమ్మదేవికి బలి ఇస్తానని ప్రతిన బూనాడు.

ఆంగ్లేయుల సేనానులలో ప్రముఖులు బరెల్లీ, బ్రూస్ ప్రాణాలు కోల్పోయారు. మూగదొర అన్నట్లుగానే డగ్లస్‌ను కూడా సంహరించాడు. అయితే మట్టికోట ధ్వంసమైన స్థితిలో, అధిక సంఖ్యాకులుగా ఉన్న కంపెనీ సైన్యాలను నిలువరించటం కష్టమని గ్రహించిన మంత్రి వీరపాండ్యుని, అతని సోదరులను ప్రక్కకు తప్పుకొని, కొంత వ్యవధి తీసుకొని కంపెనీవారిపై పోరాటం కొనసాగించాలని గట్టిగా అభ్యర్థించటంతో ఆ ముగ్గురూ రంగంనుండి తప్పుకొనక తప్పిందికాదు (1799 సెప్టెంబరు 7)

పుదుక్కోట పరిపాలకుడైన తొండమాన్ కట్టబొమ్మన్ సోదరులకు ఆశ్రయం ఇచ్చి ఉంటాడని కంపెనీవారికి అనుమానం వచ్చింది. కట్టబొమ్మన్ సోదరుల ఆచూకి తెల్పిన వారికి బహుమతి ఇస్తామని తాము చేసిన ప్రకటనకు ఫలితం లేకపోవటంతో కంపెనీ ప్రముఖులు పుదుక్కోటకు వెళ్లి తొండమాన్‌పై ఒత్తిడి తెచ్చారు. అప్పటికి అనేక గ్రామాలు, అడవులూ తిరిగిన సోదరులు పుదుక్కోటకు రాగా, తొండమాన్‌నుండి వారికి ఆదరణతో కూడిన ఆశ్రయం లభించింది. అతని మంచితనంతో ముగ్గురై వారు ఆదమరచి ఉన్న సమయంలో తొండమాన్ కంపెనీ సైన్యాధికారులకు సమాచారమిచ్చి వారు ముగ్గురు బందీలు కావడానికి కారకుడయ్యాడు.

**వీరపాండ్యుని బలిదానం**

1799 అక్టోబరు 16న కయత్తారు గ్రామంలో విడిసిన కంపెనీ అధికారులు పాలెగాళ్లనందరినీ అక్కడికి పిలిపించారు. వీరపాండ్యునిపై విచారణ అనే నాటకం నడిపించి-అందరూ భయపడేవిధంగా శిక్షించాలని వారి ఆలోచన. పాలెగాళ్లందరూ ఒక వేపచెట్టు క్రింద వేసిన ఆసనాల్లో తలలు వంచుకొని కూర్చున్నారు. వీరపాండ్యుని గొలుసులతో బంధించి, పదిమంది సైనికులు పట్టుకొనగా వారిని ఈడ్చుకొంటూ అతడు ముందుకు నడిచి వచ్చాడు. బానర్‌మన్ విచారణ ఆరంభించి ఆర్కాటు నవాబు ఫర్మానా ఇచ్చినా, ఆరేళ్లుగా కప్పం చెల్లించలేదని నేరారోపణ చేశాడు. పాంచాలన్ కురిచ్చిపై ఫర్మానా ఇచ్చే అధికారం ఆర్కాట్ నవాబుకు లేదని, కప్పం కట్టమని అడిగే అధికారం ఆంగ్లేయులకు లేదని వీరపాండ్యుడు గర్జిస్తూ స్పష్టం చేశాడు.

క్లార్క్ మరణానికి బాధ్యత నీదేగదా అని ప్రశ్నించినపుడు, భారతీయులపై కత్తి ఎత్తినపుడు దానికి జవాబు చెప్పకుండా వదలటం జరగదని వీరపాండ్యుడు స్పష్టం చేశాడు. ఇలా కొంతసేపు విచారణ సాగించిన బానర్‌మన్ తన జేబులోంచి ముందే వ్రాసిపెట్టియున్న కాగితం తీసి, చదివి, తీర్పు వినిపించాడు. కట్టబొమ్మనకు ఉరిశిక్ష విధిస్తున్నట్లుగా దాని సారాంశం. దగ్గరలో ఉన్న చింతచెట్టుకు ఉరిత్రాడు వ్రేలాడుతూ ఉంది. వీరపాండ్యుడు ఆ దిక్కుగా నడిచాడు. హాహాకారాలు చేస్తున్న ప్రజలను ఓదార్చుతూ ధైర్యం చెప్పాడు. "రోదించవద్దు, నా ఆత్మబలిదానంతో కాని, భారత ఆత్మ మేలుకొనదు. ఈ బలిదానం అనివార్యం" అని చెప్పాడు.

"అమ్మా! మళ్లీ నీ కడుపునేపుట్టి, దేశ స్వాతంత్ర్య పరిరక్షణకు మళ్లీ బలిదానమయ్యే

అంగ్లేయుల ఏలుబడి-అంతులేని దోపిడీ

భాగ్యం కలిగించు తల్లీ" అంటూ మాతృభూమికి నమస్కరించి ఉరిత్రాటిని స్వయంగా మెడకు తగిలించుకున్నాడు. వీరపాండ్యుడు అమరుడైనాడు.

ముగ్గురిని ఒకేసారి విచారించి శిక్షించటం కాకుండా, విడివిడిగా విచారించి శిక్షించగోరటం ఆంగ్లేయుల రణనీతిలో ఒక ముఖ్యాంశం. అయితే, పాలెయాంకోటలో బందిఖానాలో ఉన్న మూగదొరను, దొరసింగంను గడ్డి అమ్ముతామంటూ వచ్చిన వారి బాల్యమిత్రులు ఇరువురు విడిపించుకుపోయారు. జైలు సిబ్బంది ఒకరిద్దరు తప్ప అందరూ ప్రాణాలు కోల్పోయారు.

కొద్ది నెలల్లోనే పాంచాలన్ కురిచ్చిలో మళ్లీ గతంలోవలె మట్టికోటను నిర్మించారు. ప్రాణభయంతో పారిపోయిన జైలు అధికారి మెకాలే ఆవైపులకు తొంగిచూడలేదు. కంపెనీ అధికారులు మెకాలేకు ధైర్యం చెప్పి, సైన్యాన్ని తోడుగా ఇచ్చి కట్టబొమ్మన తమ్ముళ్లను బంధించడానికి చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. మెకాలే మరోసారి రంగంనుండి పరారయ్యాడు. బండ్లకొద్దిగా ఆయుధాలు స్వాతంత్రవీరులకు వశమయ్యాయి.

చివరికి కర్నల్ ఆక్న్యూ, యావద్ దక్షిణ హిందూస్థానంలోని తెల్లసేనాధిపతులనూ సమావేశపరిచి, మరఫిరంగులను ప్రత్యేకంగా తెప్పించి వాటినుండి పాంచాలన్ కురిచ్చిపై నిప్పులవాన కురిపించాడు. "నీ స్వాతంత్ర్యాన్ని రక్షించడానికి, మళ్లీ ఇక్కడే జన్మిస్తాము తల్లీ" అంటూ కట్టబొమ్మన్ వీరసోదరులు, వందలాదిగా వారి అనుచరులు వీరరక్తం ధారపోస్తూ, మాతృభూమి ఒడిలో ఒదిగిపోయారు.

## పద్మనాభ యుద్ధం

తెలుగునాట రాజులు ఇంగ్లీషువారి ఈస్టిండియా కంపెనీతో జరిపిన పోరాటాలలో ముఖ్యమైనది పద్మనాభ యుద్ధం. చదువుకొన్న వారందరూ బొబ్బిలి యుద్ధం గురించి ఎంతో కొంత విని, చదివి, సినిమాచూసి ఎంతోకొంత తెలిసికొని ఉంటారు. కాగా పద్మనాభం (విజయనగరం జిల్లా)లో చరిత్రను మలుపు త్రిప్పిన ఒక యుద్ధం జరిగినదనే చాలామందికి తెలియదు. కారణం బొబ్బిలియుద్ధం స్థానిక పరిపాలకులకు ఫ్రెంచివారికీ మధ్య జరిగింది కాబట్టి, దానిగురించి పాటలు పాడుకొనడానికి, బుర్రకథలు చెప్పుకొనడానికి ఆంగ్లేయులు అనుమతించారు. పద్మనాభయుద్ధం ఆంగ్లేయులతో చేసి వేయిమందికి పైగా తెలుగుజోదులు అమరులైనారు కాబట్టి, ప్రజలలో ఆంగ్లేయులపట్ల వ్యతిరేకత ప్రబలే ప్రమాదం ఉంది కాబట్టి దానిని ఏమాత్రం వెలుగులోకి రానీయలేదు.

బొబ్బిలిమీదకు ఫ్రెంచివారిని ఉసిగొల్పి, బొబ్బిలి యుద్ధంలో అందరూ ప్రాణాలు కోల్పోవడానికి కారకుడైన విజయనగరం పాలకుడు పెద విజయరామరాజును బొబ్బిలిపులిగా ప్రసిద్ధుడైన సేనాని తాండ్రపాపయ్య సంహరించి, తానూ ఆత్మహత్య చేసుకున్నాడు. (తన వారందరూ చనిపోయి, తానొక్కడే బ్రతికి ఉండటం తగదని భావించి ఉంటాడు) (జనవరి 26, 1757) ఆ తర్వాత రాజ్యానికి వచ్చిన ఆనంద గజపతిరాజు, తన సోదరుని హత్యలో ఫ్రెంచివారి ప్రమేయం ఉన్నదని భావించి, వారితో సంబంధాలు త్రెంచుకొని ఆంగ్లేయులతో సంబంధాలు ఏర్పరుచుకున్నాడు.

బెంగాలులో ప్లాసీ యుద్ధానంతరం ఆంగ్లేయుల ఈస్టిండియా కంపెనీ బలపడటమేగాక, ఉత్తర సర్కార్లలోకి చొచ్చుకొని వచ్చింది. చెందుర్తి (అన్నవరానికి జగ్గంపేటకూ మధ్య) వద్ద జరిగిన యుద్ధంలో (7 డిసెంబర్ 1758) ఆంగ్లేయులు ఫ్రెంచివారిపై పైచేయి సాధించటమేగాక 1759లో ఫ్రెంచివారిని బందరు (మాసులిపటం) నుండి తరిమివేశారు. ఈ పరిణామాల పర్యవసానంగా నిజాం నవాబుగా ఉన్న సలాబత్ జంగ్ కూడా ఇంగ్లీష్‌వారివైపే మొగ్గాడు (1767). చెందుర్తివద్ద జరిగిన యుద్ధానికిముందు ఆంగ్లేయుల కంపెనీకి, విజయనగర రాజ్యానికి మధ్య కుదిరిన ఒప్పందంలో ఇరువురూ సమాన భాగస్వాములు. చెందుర్తి యుద్ధంలో గెలిచి, బందరు నుండి ఫ్రెంచివారిని తరిమివేసిన తర్వాత ఇంగ్లీషు కంపెనీవారు మాట మార్చారు. కంపెనీ డైరెక్టర్లు ఒప్పందాన్ని అంగీకరించలేదని, కాబట్టి దానిని మూలపడవేసి క్రొత్తగా ఒప్పందం కుదుర్చుకోవాలన్నారు. ఇంగ్లీషువారి కంపెనీ కార్యశైలిలో ఇలాంటి వ్యవహారం ఇదే మొదటిది కాదు. దాదాపుగా అన్నిచోట్లా ఇలాగే చేస్తూ వచ్చారు. మొదట కాళ్లూ గడ్డాలూ పట్టుకొని బ్రతిమిలాడటం, తమకు సందు దొరికి, వీలు చిక్కినపుడు అవతలివారిని లాగిపారవేయటం వారికి అలవాటు. ఆనంద గజపతి ఈ క్రొత్త పరిణామానికి స్పందించి ఒక నిర్ణయానికి రావడానికి ముందే మశూచి సోకి 1760లో మరణించాడు. నిజానికి ఆనందగజపతి రాజకీయంగా బలపడి కేవలం ఉత్తర సర్కారులలోనేగాక, యావత్తు దక్షిణ హిందూస్థానంలోనూ తన పలుకుబడిని ఉపయోగించి, తమకు ప్రతిబంధకం కాగలడని ఆంగ్లేయులు భయపడ్డారు. అతని మరణం వారికి సంతోషప్రదమైంది.

ఆనంద గజపతి మరణానంతరం దివంగత పెద విజయ రామరాజు దత్తపుత్రుడైన చిన విజయరామరాజు సింహాసనస్థుడైనాడు. అప్పటికి అతడి వయస్సు 12 సం॥లు

మాత్రమే. కాబట్టి చిన్న విజయరామరాజుకు సవతిసోదరుడైన సీతారామరాజు దివాన్‌గా ఉంటూ రాజ్యవ్యవహారాలు నడిపించుతూ ఉండేవాడు. సీతారామరాజును దివాన్‌గా నియమించడాన్ని నిజాం నవాబు, బ్రిటీష్ ఈస్టిండియా కంపెనీ కూడా సమ్మతించారు. నిజాం నవాబు, బ్రిటీష్ ఈస్టిండియా కంపెనీలు ఇతరత్రా సంభవిస్తున్న పరిణామాలలో తలమునకలు ఉండి, 7, 8 సంవత్సరాలు ఇటువైపు పెద్దగా దృష్టి పెట్టలేదు.

1765లో బకసార్ యుద్ధానంతరం జరిగిన అలహాబాద్ సంధి ననుసరించి మొగలు పాదుషా 2వ షాఆలం బెంగాలు (బిహారు, ఒరిస్సాలతోసహా) దివానీ హక్కులను కంపెనీకి అప్పగించాడు. ఆంగ్లేయులు హిందూదేశమంతటా పెద్ద ఎత్తున ఉత్సవాలు జరుపుకున్నారు. ఉత్తర సర్కార్లను కూడా మొగలు పాదుషా తమకు ధారపోసినట్లుగా ప్రచారం చేసుకొన్నారు. ఏటేటా విజయనగరరాజ్యం 3 లక్షల రూపాయలు కంపెనీకి కప్పం చెల్లించేలా బద్ధుని చేయటమే గాక 1759లో ఫ్రెంచివారు వదిలివెళ్లినాటి నుండి విజయనగరం అదుపులో ఉన్న మాసులిపటం రేవుకూడా కంపెనీకి బదిలీ చేయబడింది. దివాన్ సీతారామరాజుకు ఆంగ్లేయుల కంపెనీకి మధ్యన రహస్యమైన అవగాహన ఉండేది. అతడు చేసే అరాచకాన్ని కంపెనీ పట్టించుకొనేది కాదు. కంపెనీ తనకు అండగా ఉండేది కాబట్టి విజయనగరం చుట్టుప్రక్కల ఉన్న జమీందారీ లన్నింటిపైన సీతారామరాజు జులుం చలాయిస్తూ ఉండేవాడు. నామమాత్రంగా రాజుగా ఉన్న చినవిజయరామరాజు మద్రాసులో ఉన్న కంపెనీ అధికారులు తనకు సహకరించకపోవటంతో లండన్‌లోని కంపెనీ డైరెక్టర్లకు, బ్రిటీషు పార్లమెంటుకూ వినతిపత్రాలు పంపించాడు. ఆ విషయాలపై చర్చించిన కంపెనీబోర్డు, పార్లమెంటు ఈ విషయమై మద్రాసులోని కంపెనీ అధికారులను మందలించారు (1781–82)

ఆ తర్వాత రోజుల్లో కూడా జమిందారులు దివాన్ సీతారామరాజు పీడన కారణంగా ఎన్నో ఇబ్బందులు పడుతుండేవారు. వారు చిన్న విజయరామరాజును తమ రాజుగా భావించి గౌరవిస్తుండేవారు. దివాన్ సీతారామరాజును దారిలో పెట్టడానికి జరిగిన ప్రయత్నాలన్నీ విఫలం కావటంతో 1792లో–అతడిని పదవీబాధ్యతలనుండి విముక్తుని చేసి, కొంత పింఛను ఏర్పాటుచేసి మద్రాసులో నివసించవలసిందిగా చిన్న విజయరామరాజు ఆదేశించాడు.

**విజయనగరం కంపెనీ హస్తగతమౌతుందా ?**

మద్రాసుకు చేరుకున్న దివాన్ సీతారామరాజు ప్రశాంత జీవితం గడపడానికి బదులుగా, ఆంగ్లేయులను రెచ్చగొట్టాడు. విజయనగరం ఎంతో వైభవంతో తులదూగుతున్నదని, ఇప్పుడు కంపెనీ అందుకొంటున్న కప్పం-3 లక్షలు చాలా చిన్న మొత్తమని, బాగా పెంచి వసూలు చేసుకోవచ్చునని వారి చెవిలో ఊదాడు. వారు ఏటేటా 8.5 లక్షల రూపాయల కప్పం చెల్లించాలని తాఖీదు పంపారు. బకాయిలు చెల్లించాలన్నారు. తాను బకాయిపడి యుండలేదని చిన్నవిజయరామరాజు జవాబు పంపాడు. ఏదో ఒక మిషమీద స్వదేశీరాజులతో యుద్ధానికి దిగి, వారిని అధికారంనుండి తొలగించి, మొత్తం రాజ్యాన్నిగాని, లేదా సంపన్నమైన కొన్ని భూభాగాలనుగాని నేరుగా తమ ఏలుబడిలోకి తెచ్చుకొనడానికి అలవాటు పడిన ఆంగ్లేయుల కంపెనీ విజయనగరంమీదకు సైన్యాలను పంపించి 12 ఆగస్టు 1793న విజయనగరాన్ని హస్తగతం చేసుకొంది. 1200 రూ॥ల పింఛను పొందుతూ మాసులిపటంలో నివసించవలెనని కంపెనీ చిన్న విజయరామరాజును ఒత్తిడి చేసింది.

రాజు తప్పించుకొని ఎత్తైన కొండలలో ఉన్న అడవుల్లోకి వెళ్లిపోయాడు. రాజ్యంలోని ప్రజలు ఆంగ్లేయులకు పన్నులు చెల్లించడానికి నిరాకరించారు. ఆ తర్వాత ఒక సంవత్సరం గడిచిన పిదప 1794 జూలై 10న పద్మనాభంవద్ద చిన్న విజయరామరాజు తాను సమీకరించిన సైన్యంతో కంపెనీ సైన్యాలను ఎదుర్కొన్నాడు. ఆంగ్లేయుల వద్ద అధునాతన ఆయుధాలున్న సుశిక్షితులైన సోల్జర్లు, సిపాయిలూ కలిసి 3,000కు పైగా ఉన్నారు. దేశభక్తి, రాజభక్తి ఆవేశమే తప్ప, పెద్దగా శిక్షణగాని, ఆయుధ సంపత్తిగానిలేని 1200మంది విజయనగర సైనికులు సుమారుగా గంటన్నరపాటు జరిగిన యుద్ధంలో ప్రాణాలు కోల్పోవటమో, తీవ్రంగా గాయపడటమో జరిగింది. చిన్నవిజయరామరాజు కూడా ప్రాణాలు కోల్పోయాడు.

అతని కుమారుడు నారాయణరాజు సాలూరుదగ్గర మక్కువ గ్రామంలో కొండదొరల ఆశ్రయంలో గడిపి, మరల ఆంగ్లేయులతో ఒప్పందానికి వచ్చారు. ఏటేటా చెల్లించవలసిన కప్పం 50లక్షల రూ॥లకు పెంచబడింది. విజయనగర రాజ్యం స్థాయి తగ్గించబడి ఒక జమీందారీస్థాయికి కుదించబడింది. సీతారామరాజు దివాన్‌గా ఉండగా, జైలులో పెట్టబడిన అనేకమంది జమీందారులు విడుదల పొందారు. ఏటేటా 50 లక్షలు కంపెనీకి చెల్లించమంటే విజయనగరానికి

తలకుమించిన భారమే. ఆ తర్వాత ఒక దశాబ్దం కూడా గడవకుండానే రైతులనుండి నేరుగా పన్ను వసూలు చేసే పద్ధతి అమలులోకి వచ్చింది.

## మైసూరుతో ఆంగ్లేయుల ఘర్షణ

రిచర్డ్ వెల్లస్లీ 1798 ఏప్రియల్లో గవర్నరు జనరల్‌గా వచ్చాడు. 17వ శతాబ్దపు తొలినాళ్లనుండి దక్షిణ హిందూదేశంలోని మైసూరు చుట్టుప్రక్కల విశాలమైన భూభాగం–ఒడయార్ రాజులపాలనలో ఉంది. దక్షిణంలోకి చొచ్చుకుని రాజూస్తున్న నిజాంనుండి మహారాష్ట్రులనుండి తన రాజ్యాన్ని కాపాడుకొంటూ, పశ్చిమ సముద్రతీరంలోని మంగుళూరు, కోఝికోడ్‌లవరకు వ్యాపింపజేసే ప్రయత్నం చేస్తూ వచ్చింది. 1722లో జన్మించిన హైదరాలి మొదట్లో తన తండ్రివలెనె మైసూరు రాజ్యం రక్షకభటునిగా (పోలీసు కానిస్టేబుల్) ప్రభుత్వోద్యోగంలో చేరాడు. తన సోదరుడు సమకూర్చిన ధనంతో సొంత సైన్యాన్ని సమకూర్చుకొని మైసూరు తరఫున యుద్ధంచేసి విజయం సమకూర్చాడు. మహారాజా అతనికి నవాబ్ హైదరాలీ బహద్దర్ బిరుదు ఇచ్చాడు. 1757లో మైసూరుకు సేనాధిపతి అయినాడు. 1761లో మంత్రి అయినాడు. అప్పటినుండి క్రమంగా రాజును నామమాత్రం పాలకునిగా ఉంచి, తానే అన్ని వ్యవహారాలు నడిపించ నారంభించాడు. 1764లో బెద్నూరును కైవసం చేసుకొని, దానికి హైదర్‌నగర్ అని పేరుమార్చి అక్కడినుండే రాజ్యాన్ని నడిపించాడు. 1766లో ఒడయార్ రాజు మరణించగా, తానే రాజ్యాధిపతి అయినాడు. ప్రారంభంనుండి ఫ్రెంచివారి ఈస్టిండియా కంపెనీ సైనికులతో కలిసి పనిచేసి యుద్ధరంగపు మెళకువలను ఆకళించుకున్నాడు. ఆధునిక ఆయుధాలను సమకూర్చుకున్నాడు. తన సైనికులకు శిక్షణ ఇప్పించాడు.

1765 అలహాబాదు సంధిద్వారా బెంగాలు, తూర్పుతీరంలోని ఉత్తరకోస్తా జిల్లాలలోనూ అధికారాన్ని సంపాదించిన ఆంగ్లేయులు దేశమంతటా వేగంగా వ్యాపించే ప్రయత్నాలు చేస్తూఉండగా, సుదీర్ఘకాలం వారిని అడ్డుకొన్నవారుగా హైదరాలీ, అతని కుమారుడు టిపూసుల్తాన్ ఖ్యాతిగాంచారు. 1766లో హైదరాబాద్ నిజాం, మహారాష్ట్రులు, ఆంగ్లేయులు కలిసి మైసూరుపైకి యుద్ధానికి వచ్చారు. అయితే హైదరాలి తన కూటనీతిని ప్రయోగించి మహారాష్ట్రులను తనవైపుకు త్రిప్పుకొన్నాడు. కొన్ని ప్రాంతాలను వారికి వదలుకొన్నాడు. మరి కొన్నాళ్లకు మంగుళూరు, కోఝికోడ్ రేవు పట్టణాలను తన అదుపులోకి తెచ్చుకున్నాడు. హైదరాలీ తన రాజ్యాన్ని నలువైపులా విస్తరించి దక్షిణ హిందూదేశపు పాలకులలో

ముఖ్యుడైనాడు. 1769లో హైదరాలీ మద్రాసును ముట్టడించగా, దిక్కుతోచక గడగడ వణుకుతూ ఆంగ్లేయులు అతని కాళ్లపైబడి, మహారాష్ట్రులతో సంభవించబోయే యుద్ధంలో తాము సహాయపడగలమనిహామీ ఇచ్చారు. కాని మహారాష్ట్రులు శ్రీరంగపట్టణాన్ని ముట్టడించినపుడు వారేమీ సహాయపడలేదు. మహారాష్ట్రులకు పెద్ద ఎత్తున ధనమిచ్చి వారి బెడద వదలించుకోవలసి వచ్చింది. అప్పటి నుండి హైదరాలీ ఆంగ్లేయులకు నిలువ నీడలేకుండా చేయాలని నిశ్చయించుకున్నాడు. ఆంగ్లేయులతో యుద్ధాలు చేస్తూ ఒకసారి కొంత భూభాగాన్ని కోల్పోయి, మరోసారి మరల గెలుచుకొని, మొత్తం మీద హైదరాలీ తన రాజ్యాన్ని ఒక మేరకు విస్తరింపజేశాడు. 1782 డిసెంబరు 7న నవాబ్ హైదరాలీ బహద్దర్–పుట్టకురుపు వ్యాధితో మరణించాడు. చిత్తూరు సమీపంలోని నరసింహరాయనిపేటలో అతడు మరణించగా, అతని దివాన్ పూర్ణయ్య ఆ సమాచారం రహస్యంగా ఉంచి, మృత కళేబరాన్ని శ్రీరంగపట్టణానికి తరలించాడు. ఈ సమాచారం తెలియగానే పశ్చిమతీరంలో ఆంగ్లేయులతో పోరాడుతున్న టిపూసుల్తాన్ శ్రీరంగపట్టణానికి వచ్చి, తక్తు నధిరోహించాడు.

అప్పటినుండి పైచేయి సాధించడానికి ఆంగ్లేయులు, టిపూసుల్తాన్ పరస్పరం పోటీపడుతునే ఉన్నారు. టిపూసుల్తాన్ మరొకసారి ఫ్రెంచివారి సహాయం పొందేందుకు యత్నించాడు. ఫ్రెంచివారికి స్థావరంగా ఉన్న మారిషస్‌నుండి అదనపు సైన్యాలువచ్చి టిపూ పక్షాన నిలిచి, తమను తరిమివేయగలవని రిచర్డ్ వెల్లస్లీ శంకించాడు. అందుకు ఏమాత్రం అవకాశమివ్వరాదని భావించి, తాను వచ్చిన 8 నెలలలోనే టిపూపైకి యుద్ధానికి దిగాడు. పశ్చిమతీరంలోని రేవుపట్టణాలను తమ స్వాధీనంలోకి తెచ్చుకోవటం అతని ముందున్న తక్షణ లక్ష్యాలలో ఒకటి.

1799 ఫిబ్రవరిలో మద్రాసునుండి 26,000 మందితో కూడిన కంపెనీ సైన్యమూ హైదరాబాద్ నుండి 20,000 మందితో కూడిన నిజాం సైన్యము, పడమరతీరం నుండి మరో 4,000 ఆంగ్లసైన్యమూ–మూడువైపులనుండి వచ్చి ముట్టడించే యోజన చేశాడు. ఏప్రియల్‌లో కంపెనీ సైన్యాలు శ్రీరంగపట్టణం చేరాయి. ఎంతప్రయత్నించినా ఒక నెలపాటు ఫలితమూ లేకపోయింది. మొత్తంమీద 2 మే నాడు కోటగోడల్లో రంధ్రాలు వేసి, మరి రెండురోజుల్లో దారిచేసుకొని కోటలోపలికి వెళ్లారు. కోటలో పోరాడుతూ మరణించిన వారి వందలాది కళేబరాలలో టిపూసుల్తాన్ మృతదేహమూ కనుగొనబడింది.

గవర్నరు జనరల్ రిచర్డ్ వెల్లస్లీ తన సోదరుడైన ఆర్థర్ వెల్లస్లీని మైసూరు రాజ్యానికి సైనిక రాజ్యపాలకునిగా నియమించాడు. అతడు అరాచకం వ్యాపించకుండాను, వ్యాపారులకు ధైర్యం కలిగేవిధంగాను కట్టుదిట్టంగా సైనికుల పహారా ఏర్పాటు చేయటమేగాక, లూటీలకు పాల్పడుతున్న వారిని అప్పటికప్పుడే ఉరితీయించాడు. మైసూరులోను, శ్రీరంగపట్టణంలోనూ ఆర్థర్ వెల్లస్లీ ఇంటింటికీ తిరిగి వ్యాపారస్థులకు అశ్వాసన ఇచ్చి నాలుగురోజులలోనే మళ్లీ వ్యాపారాలు మొదలయ్యేలా చేయగలిగాడు.

**దేశమంతటా ఎక్కడికక్కడ ఎదురైన ప్రతిఘటన**

టిపూసైన్యంనుండి ఉద్యోగాలు కోల్పోయిన సైనికులను కేరళలో పఝస్సీవర్మ సమీకరించి, ఆంగ్లేయులను నిలువరించే ప్రయత్నం చేశాడు. వేలసంఖ్యలో సైన్యాన్ని దించి 1805లో ఆంగ్లేయులు వారి ప్రయత్నాలను అణిచివేశారు. అంటే 6 సంవత్సరాల పాటు కర్ణాటకలోని గ్రామీణ ప్రాంతము, కేరళ రగులుతునే ఉన్నవి. దక్షిణ కనరా తీరంలో 18 నెలలపాటు ఈ అలజడులను అణిచివేయటంలో ప్రముఖపాత్ర వహించిన థామస్ మన్రో ఆ తరువాత దత్తమండలాలుగా వ్యవహరింపబడే రాయలసీమకు వచ్చాడు. 26,000 చదరపుమైళ్ల వైశాల్యం గల ఆ ప్రదేశాన్ని నిజాంనవాబు ఆంగ్లేయులకు బదిలీ చేశాడు. టిపూను ఓడించినందుకు నిజాం ఇచ్చిన బహుమానమది. అయితే రాయలసీమలోని స్థానిక పాలకులైన పాలె గాళు 80మంది ఆంగ్లేయుల పాలనలో తల ఒగ్గి ఉండడానికి నిరాకరించి తిరుగుబాటు చేశారు. వారివద్ద 30,000పైగా సైనికులున్నారు. కొన్ని సందర్భాలలో సకాలంలో జీతాలు చెల్లించనందున నిజాంసైన్యం నుండి బయటకు వచ్చిన సైనికులు కూడా వీరితో చేతులు కలిపేవారు.

మన్రో సైనాధికారి కాదు. కాని 5,000 వేలమంది సైనికులతో కూడిన కంపెనీ దళాలు అతనికి అందుబాటులో ఉండేవి. తనకు అడ్డువచ్చిన వారినందరినీ ఉరితీయాలనే భావన అతనిలో ఉండేది. కాని సైనికాధికారి కానందున అలా తన నిర్ణయాలను అమలుచేయటం కుదరదు. అయిన సైనికబలాలను అటూఇటూ పరుగులెత్తిస్తూ, ప్రజలను బెదరగొట్టుతూ పరిస్థితిని తన వశంలోకి తెచ్చుకొనడానికి యత్నించాడు. 1801 మేలో వేముల కోటను హస్తగతం చేసుకున్నాడు. మరో రెండువారాల తర్వాత తెర్నెకల్లు కోటను స్వాధీనపరుచుకున్నాడు. ఈ రెండు యుద్ధాలలోనే (ఎవరికీ గుర్తులేని, లెక్కలోకిరాని యుద్ధాలివి) ప్లాసీ యుద్ధంలో

 ప్రాణాలను కంపెనీ బలిపెట్టింది. అప్పుడు వ్యాపించిన కంటే ఎక్కువమంది ప్రాణాలను కంపెనీ బలిపెట్టింది. అప్పుడు వ్యాపించిన భయోత్పాతంలో కొందరు పాలెగాళ్లు లొంగిపోయారు. అలాంటివారికి పింఛను ఏర్పాటుచేసి దూరంగా పంపారు. మరికొందరు అడవులలోకి వెళ్ళి పోరాటం కొనసాగిస్తూ, కాలక్రమాన అసువులు బాసారు. యుద్ధసమయంలోకంటే ఆ తర్వాత పరిస్థితిని అదుపులోకి తెచ్చుకొనే ప్రయత్నాలు మరింతగా హింసామయమైనవిగా ఉండేవి. టిపూసుల్తాన్ మరణం తర్వాత మైసూరు రాజ్యం ఒడయార్ రాజులకు తిరిగి అప్పగించబడింది. బ్రిటీష్ రెసిడెంట్ సూచనలను అనుసరించి పాలన సాగుతూ వచ్చింది.

**మహారాష్ట్రుల ప్రతిఘటన**

1761లో మూడవ పానిపట్ యుద్ధం తర్వాత మహారాష్ట్రులలో పరస్పర వైరుధ్యాలు ప్రబలినాయి. ఎవరికి వారు తమ అధికారాన్ని పటిష్టం చేసుకొనే ప్రయత్నాలు చేశారు. మహదాజీ సింధియా గ్వాలియర్‌లోను, రఘోజీ భోంస్లే నాగపూర్‌లోను, మానాజీరావ్ గాయిక్వాడ్ బరోడాలోను, అహల్యాబాయి హెూల్కర్ ఇండోర్‌లోనూ దాదాపుగా స్వతంత్రులుగా వ్యవహరిస్తూ తమ రాజధాని నగరాలను తీర్చిదిద్దారు. కవి పండితులను పోషించారు. మంచి పరిపాలనను అందించారు. కాగా పుణే కేంద్రంగా అప్పటి వరకూ ప్రముఖ పాత్ర వహిస్తూ వచ్చిన పేశ్వా కళ తగ్గిన వాడైనాడు. 1773లో పేశ్వా నారాయణరావు హత్యచేయబడ్డాడు. నానాఫడ్నవీస్ నాయకత్వంలో బారాభాయిాలు అనే 12 మంది మంత్రులు నారాయణరావు హత్యకు కారకుడైన రఘునాధరావు(రఘోబా) ను ఎదిరించారు. ఇంగ్లీషువారికి ప్రబల విరోధులయ్యారు. పేశ్వా నారాయణరావు హత్యానంతరం జననమంది నానాఫడ్నవీసు సంరక్షణలో పెంచబడిన రెండవ మాధవరావ్ అనే పేశ్వా 1795లో ఆత్మహత్య చేసుకొన్నాడు.

అప్పుడు సంభవించిన గృహకలహాలలో నూతనంగా పదవికి వచ్చిన పేశ్వా రెండవ బాజీరావు (రఘోబా కుమారుడు) పుణే నుండి తరిమివేయబడగా, అతడు మరల తన రాజధానిని చేజిక్కించుకొనడానికై బ్రిటీషు కంపెనీ సహాయం అర్థించాడు. పేశ్వాకు సమకూరే ఆదాయంలో మూడవవంతును తమ సైనిక దళాల నిర్వహణ నిమిత్తం చెల్లించాలని బ్రిటీషువారు పట్టుబట్టి అంగీకరింప జేసుకున్నారు. పేశ్వా ఈ విధంగా విదేశీశక్తితో ఒప్పందానికి రావటం మిగిలిన మహారాష్ట్ర ప్రముఖులను (సింధియా, హెూల్కర్, గాయిక్వాడ్, భోంస్లేలు) క్రుద్ధులను చేసింది. పేశ్వాకు మతి

చలించినదని, అతడిని మళ్లీ స్పృహలోకి తీసికొని రావాలంటే యుద్ధంలో ఓడించటమే మార్గమని భావించారు. 1800 సం॥లో నానాఫడ్నవీస్ మరణించాడు.

దేశంలోని మధ్య భాగాలలో జరిగిన యుద్ధాలలో బ్రిటీషువారు పైచేయి సాధించటంలో ఒక కీలకమైన అంశం ఉంది. అది సైన్యానికి కావలసిన ఆహారము, తదితర అవసరాలు ఎటువంటి అంతరాయం లేకుండా లభించేటట్లుగా చూసుకోవటం. 1803లో ఆరంభమైన ఈ యుద్ధాలలో (వీటిని ఆంగ్లేయులకు మహారాష్ట్రులకూ జరిగిన యుద్ధాలుగా పేర్కొన్నారు) 2 సంవత్సరాల ముందు బొంబాయి, మైసూరులకు బాధ్యత వహిస్తున్న ఆర్థర్ వెల్లస్లీ చాలా సమయం వెచ్చించి బ్రిటీషు అధికారులతోనూ, స్థానిక పాలకులతోనూ సుదీర్ఘమైన చర్చలు జరిపి అవి లభించడానికి అవసరమైన ఏర్పాట్లు, ఒప్పందాలూ సాధించాడు. 1803లో శ్రీరంగపట్టణంనుండి కంపెనీ సైన్యాలు ఉత్తరదిశగా ప్రయాణం ఆరంభించినప్పుడు వారివెంట 32,000 ఎద్దులు అనేకరకాల సంభారాలను మోసుకొంటూ వచ్చాయి.

స్థానిక ప్రభువులను తొలగించితేగాని, బ్రిటీషు కంపెనీ బలపడజాలదని, యుద్ధానికి అవసరమయ్యే సరఫరాలను అందించజాలదని థామస్ మన్రో ప్రతిపాదించగా, స్థానిక ప్రభువులను మచ్చిక చేసుకొని వారిద్వారా తమకు కావలసిన సరఫరాలను నిర్విఘ్నంగా అందుకొనే యోజనను గవర్నరు జనరల్ రిచర్డ్ వెల్లస్లీ అమలుచేశాడు. పేశ్వాను తిరిగి పుణేలో అధిష్టింపజేయడానికి తాము ప్రయత్నిస్తున్నామని చెప్పి వారినుండి సహకారం పొందటంలో కృతకృత్యుడైనాడు. గ్రామీణ ప్రాంతాలనుండి అమ్ముకొనడానికి తెచ్చే ధాన్యాన్ని, ఇతర తిండిగింజలను కొనుగోలు చేసి, విక్రయకేంద్రాలుగా ఉపయోగపడగల మార్కెట్లను నిర్మించవలసిందిగా వారిని ఉత్సాహపరిచాడు. వాటి నిర్వహణలో నష్టాలు రాకుండా తాము మద్దతు ఇస్తామని, దోపిడిగాండ్రనుండి రక్షణలోనూ సహకరిస్తామని నచ్చజెప్పారు. 1803 ఏప్రియల్‌లో బ్రిటీషు కంపెనీ పంపిన 20,000 సైనికులు, పేశ్వాకు మద్దతుగా నిలిచిన ఆరుగురు మహారాష్ట్ర సర్దారులు సమకూర్చిన మరో 20,000 సైనికులు పుణేలో ప్రవేశించారు. పోరాటం అవసరం లేకుండానే కోట స్వాధీనమైంది.

కోటలోపాగావేసిన బ్రిటీషు కంపెనీ ఇప్పుడు మహారాష్ట్ర ప్రముఖుడైన సింధే, హోల్కర్, భోంస్లేలపై దృష్టి సారించింది. కాన్పూరునుండి బ్రిటీషు కమాండర్ –

ఇన్-చీఫ్ జనరల్ జెరార్డ్ లాకే నాయకత్వంలో బైలుదేరిన 10,000 మంది సైనికులున్న దళం అలీఘుర్ ఢిల్లీలలో సింధేసైన్యాలను ఓడించింది. (ఆగస్టు 1803). అప్పటివరకు మహారాష్ట్రుల చేతిలో కీలుబొమ్మగా ఎలా చెప్పితే అలా వ్యవహరించిన మొగల్‌పాదుషా 2వ షా ఆలం ఇప్పుడు ఆంగ్లేయుల అదుపులోకి వచ్చాడు. ఆ తర్వాత యాభై సంవత్సరాలపాటు బ్రిటీషు కంపెనీవారిమాటే మొగలు దర్బారులో చెల్లుబాటు అవుతూ వచ్చింది.

## చరిత్రలో పేర్కొనబడని మహారాష్ట్రుల ఘనవిజయం

1803 జూన్‌లో పుణే నుండి ఆర్థర్ వెల్లస్లీ మారదర్శనంలో బైలుదేరిన సైన్యాలు అహమద్‌నగర్ కోటను స్వాధీనం చేసుకున్నవి. ఆ యుద్ధంలో చాలామంది మరణించారు. 23 సెప్టెంబరున 150 మైళ్ల ఉత్తరాన ఉన్న అస్సాయే అనేచోట యుద్ధం మొదలైంది. దీనిని వాటర్లూ యుద్ధం (ఫ్రెంచి జనరల్ నెపోలియన్‌పై ఆంగ్లేయులు విజయం సాధించిన యుద్ధం) కంటే జటిలమైన యుద్ధంగా ఆంగ్లేయులు పరిగణించారు. మహారాష్ట్రుల చేతిలో ఫిరంగులు ఉన్నవి. ఆంగ్లేయుల పక్షాన చురుకుగా కదిలే అశ్విక దళం ఉంది. మహారాష్ట్రుల ఫిరంగి దళం రాటుదేలినది. అయితే యుద్ధ విరామసమయంలో ఫిరంగులను లాగే ఎద్దులు మేతకు విడిచిపెట్టబడిన సమయంలో ఆర్థర్‌వెల్లస్లీ తన అశ్విక దళాన్ని ఒక్కసారిగా ముందుకు ఉరికించాడు. అయితే అప్పుడు కూడా వెల్లస్లీ తన ఎదుటిపక్షం సామర్థ్యాన్ని తక్కువగా అంచనా వేశాడు. బ్రిటీషు సైన్యంలో దాదాపుగా మూడవవంతు హతులైనారు లేదా తీవ్రంగా క్షతగాత్రులైనారు. క్షతగాత్రులైనవారి సంఖ్య ఎంత ఎక్కువగా ఉండినదంటే, వారినందరినీ బొంబాయికి తరలించడానికి వారికి ఎనిమిది నెలలు పట్టింది. అన్ని తలలు తెగిపడటం తాను ఇంతకుముందు ఏ యుద్ధంలోనూ చూడలేదని ఒక బ్రిటీషు అధికారి వ్రాసుకున్నాడు.

అస్సాయేలో విజయం సాధించిన తర్వాత మరి రెండు దుర్గాలపైకి బ్రిటీషువారు యుద్ధానికి వెళ్లారు. ఎవరికీ స్పష్టమైన విజయం లభించలేదు. బ్రిటీషు కంపెనీ అప్పుడు సింధేతోనూ, భోంస్లేతోనూ ఒప్పందాలు కుదుర్చుకొని యుద్ధం విరమించింది. ఈ యుద్ధాలతో పై రెండు రాజ్యాలూ కొంత బలహీనపడ్డాయి. అలాగని వాటి పస అయిపోయినదని అనుకొనే స్థితి ఏమీ లేదు. మొగలుల పూర్వపు రాజధానుల సమీప ప్రాంతాలనూ సింధే వదులుకొన్నప్పటికీ 1844వరకు 30,000 సైన్యాన్ని గ్వాలియర్ రాజ్యం కలిగిఉండేది. నాగపూర్ అధినేత అయిన భోంస్లే ఒరిస్సాను

ఈస్ట్ ఇండియా కంపెనీకి వదులుకున్నాడు. తద్వారా చిట్టగాంగ్ నుండి మద్రాసు వరకు గల తూర్పు తీర ప్రాంతమంతా బ్రిటీషు కంపెనీవారి అదుపులోకి వచ్చింది. అయినా మధ్యప్రాంతాలలో భోంస్లేరాజు తగినంత బలంగలవానిగానే పరిగణింపబడేవారు.

1803నాటి మహారాష్ట్రుల రాజ్యాలలో బలిష్ఠమైనదిగా పరిగణింపబడిన హెూల్కార్ రాజ్యం (ఇండోర్ కేంద్రంగా) పోరాటం సాగిస్తూనే ఉంది. అశ్విక దళాన్ని, ఫిరంగి దళాన్ని కలిపి నడిపించేవాడు. గుఱ్ఱాలద్వారా ఈడ్చుకుపోగల్గిన విధంగా బరువు తక్కువఉండే ఫిరంగులను రూపొందించారు. అవి బ్రిటీషు కాల్బలాలను తేలికగా చిత్తుచిత్తు చేసేవి. చివరికి 1805లో బ్రిటీషువారే రాజీకి వచ్చారు. రాజస్థాన్‌లోని భూములన్నింటినీ హెూల్కర్‌కి వదిలివేయడానికి బ్రిటీషువారు అంగీకరించారు. రెండు సంవత్సరాల తర్వాత యశ్వంతరావ్ హెూల్కర్ బ్రిటీషువారిని, హిందూదేశంనుండి తరిమివేయడానికి ఒక లక్ష సైన్యాన్ని సమీకరిస్తున్నాడన్న వదంతులు వ్యాపించాయి. బహుశా కొన్నినాళ్లు గడిస్తే అతడు కలకత్తా దిక్కుగా దూసుకునిపోయి ఉండేవాడేమో! కాని అతని అకాలమరణంతో అటువంటి అధ్యాయానికి తెరతీయబడలేదు.

## సమయోచితంగా ధనసమీకరణలో ఒడుపు ఆంగ్లేయుల ప్రత్యేకత

మొత్తంమీద మహారాష్ట్రులమీద సాధించిన విజయాలు పాక్షికమైనవే అయినప్పటికీ, అప్పటికి యావత్తు హిందూదేశంలో బలమైన శక్తి ఎవరు అంటే ఆంగ్లేయులే అనేస్థితి ఏర్పడిపోయింది. దానికి ప్రధానమైన కారణం హిందూదేశంలోని అన్ని ప్రాంతాలలోనూ వారికి కోటలు, సైన్యాలు ఉండటమేగాక, దేశంలోని రాజ్యాధిపతు లందరితోనూ వారికి ఏదో ఒకవిధమైన ఒప్పందం కుదిరి ఉండటం. దేశమంతటా బ్రిటీషు ఈస్టిండియా కంపెనీవారు ముద్రించిన నాణెములు చలామణీలో ఉండటమున్నూ.

యుద్ధాలలో ఆంగ్లేయులది పైచేయి కావడానికి అనేక కారణాలను అనేకమంది చెప్పవచ్చును. వారి ప్రతిస్పర్ధులకంటే మిన్నగా సాంకేతిక పరిజ్ఞానమో, ఆయుధ ప్రయోగపాటవమో, వ్యూహరచనా నైపుణ్యమో కారణాలు అనుకోవటంలో వాస్తవంకంటే భ్రమయే ఎక్కువగా ఉండింది. అసలు వాస్తవమేమంటే యుద్ధ సమయాల్లో అవసరమైన భారీఖర్చులకోసం అవసరమైన నిధులను సమీకరించు కోవటంలో వారికిగల ఒడుపు. అవసరమైన సందర్భాలలో హిందూదేశంనుండి,

ఇంగ్లాండులోనుండి మాత్రమేగాక, చైనావంటి దూరదేశాలనుండి సైతం కంపెనీ బంగారం సమీకరించుకొని వచ్చేది. మనదేశంలో సముద్రతీరంలోని పెద్దపెద్ద రేవు పట్టణాలలోఉండే షావుకార్లనుండేగాక, కాశీవంటి ఇతర ప్రముఖ వ్యాపార కేంద్రాలనుండి సైతం అప్పులు సమీకరించేది. మరీ అవసరమైన సందర్భాలలో కంపెనీ ఉన్నతాధికారులు కూడా షావుకార్ల దగ్గరకు ఇంటింటికీ వెళ్లి, లాభాల ఆశ చూపి, నచ్చజెప్పి డబ్బు పుట్టించగలిగేవారు. కాగా మహారాష్ట్రులుగాని, ఇతర రాజ్యాధినేతలుగాని, తమకు నిధులు అవసరమైనపుడు – బకాయిపడియున్న పన్నులను వసూలు చేసుకొనడానికి గ్రామాలమీదపడేవారు. ఇది అవకాశంగా తీసికొని మహారాష్ట్రులను బందిపోటులతో, దోపిడీ దొంగలతో సమానమైనవారిగా ప్రచారం జరిగిపోయేది. ధనబలం సిద్ధంగా, పుష్కలంగా ఉన్న బ్రిటీషు కంపెనీవారు తమకు అవసరమైన ఆహారాది వస్తుసంభారాలనేగాక, యుద్ధంలో కలిసిరాగల మిత్రులను కూడా కొనివేయగల్గేవారు. విజయాలను అందిపుచ్చుకొనటంలో ఆంగ్లేయులకుగల ఈ నిధుల సమీకరణ సామర్థ్యమే కీలకమైంది.

గవర్నరు జనరల్ వెల్లస్లీ యుద్ధ అవసరాలకోసం ఎక్కువ నిధులుకావాలని అడుగుతూ ఉండేవాడు. బ్రిటన్ జాతీయ ప్రయోజనాల సాధనకు అది మార్గమని చెప్పేవాడు. బ్రిటన్‌లో ఉన్న కంపెనీ డైరెక్టర్లు–ధనాన్ని పెట్టుబడిపెట్టవలసింది వ్యాపారం కోసమేగాని, యుద్ధంకోసం కాదని నివారించే ప్రయత్నం చేస్తుండేవారు. పెట్టుబడి పెట్టినవారికి ఏటేటా లాభాలు అందించటం తమ ప్రథమకర్తవ్యమని వాదించేవారు. అలా భిన్నమైన ఆలోచనలతో వారు వివాదపడుతూ ఉన్నప్పటికీ వెల్లస్లీ డైరెక్టర్లను లెక్కజేయకుండా తన మార్గంలో ముందుకు దూసుకుపోయాడు. కంపెనీవాటాదారులకు లాభాలు పంచటం తగ్గుముఖం పట్టింది. ఆ వివాద సమయంలో ఏ దారి సరైనదో నిర్ణయించేభారం బ్రిటన్‌లోని ప్రభుత్వంపై పడింది. విజయాలు సాధిస్తున్నంతవరకూ, బ్రిటీష్ ప్రభుత్వం వెల్లస్లీనే సమర్థించింది. కాని ఎప్పుడైతే 1805లో సింధియా (గ్వాలియర్) సైన్యాలను తట్టుకోలేక కంపెనీసేనలు అలసట ప్రదర్శించాయో, అప్పుడు బ్రిటీష్ ప్రధాని విలియం పిట్ట్ వెల్లస్లీని తప్పుపట్టాడు. అటువంటి వ్యక్తిని ముందుపెట్టుకొని కంపెనీ నష్టాలపాలు కావటం తగదన్నాడు. వెల్లస్లీ కంపెనీ సేవలనుండి తప్పుకొని 15 ఆగస్టు 1805న గృహోన్ముఖుడైనాడు.

## దేశమంతటా అడుగడుగునా ప్రతిఘటనలు

దేశీయపాలకుల అధికారం కుప్పకూలగా, ఎక్కడికక్కడ దళాలుగా ఏర్పడి ఆంగ్లేయులను ఎదిరించినవారు, తమ జీవికకై గ్రామాలను కొల్లగొట్టినవారు కొందరు ఆ రోజులలో ఉండేవారు. అలాగే తమదంటూ ఒకరాజ్యం లేకున్నా, విస్తృతంగా సాయుధ సైనికులకు శిక్షణయిచ్చి, కోరి ఒప్పందం కుదుర్చుకున్నవారికి సహకారం అందించిన స్వతంత్ర దళాధిపతులూ కనిపిస్తారు. వారిలో అమీర్‌ఖాన్, చిటూఖాన్ అనేవారు ముఖ్యులు. అమీర్‌ఖాన్ రోహిల్‌ఖండ్‌గా ఆనాడు పేర్కొనబడిన ప్రాంతం (నేటి ఉత్తరప్రదేశ్‌లో భాగం)లోని మొరాదాబాద్‌లో ఆఫ్ఘనిస్థాన్ నుండి వచ్చిన కుటుంబంలో జన్మించాడు. అతని బాల్యం భోపాల్‌లో గడిచింది. అనంతరకాలంలో చాలామంది పాలకులకు అతడు తన సేవ లందించాడు. 1798నాటికి 1500 అనుచరులతో ఫతేఫుర్ కేంద్రంగా ఉండేవాడు. అప్పుడే అతడు యశ్వంత్‌రావ్ హోల్కార్‌తో అవగాహనకు వచ్చాడు. హెూల్కార్ రాజస్థాన్‌లోని టోంక్ పట్టణాన్ని అమీర్‌ఖాన్‌కి అప్పగించి, 'నవాబ్' అనే బిరుదుతో గౌరవించాడు. అతడిని మంచి చేసుకోవాలని ఆర్థర్ వెల్లస్లీ ప్రయత్నించకపోలేదు. కాని ఆ ఎత్తులు పని చేయలేదు. ఆంగ్లేయులు మహారాష్ట్రులతో యుద్ధాలు చేస్తున్న ఒకానొక దశలో వారికి మించిన తలనొప్పిగా వీరికి కనిపించాడు. సందర్భాన్నిబట్టి 500 మంది నుండి 20,000 మంది వరకు తన అనుచరులను, 200 ఫిరంగులనూ యుద్ధరంగంలో నిలిపే సత్తా అతనికి ఉండేది. మహారాష్ట్రులకు ఒకటితర్వాత మరొకటిగా అనివార్యమౌతున్న యుద్ధాలను పకడ్బందీగా నిర్వహించడానికి తగినన్ని నిధులు చేతిలో లేకపోవటమూ, అందుకై గ్రామీణ ప్రాంతాలకు వెళ్లి పెద్దరైతులనుండి-ఒక మేరకు భయపెట్టి అయినా నిధులు సేకరించుకురావటమూ, అదేసమయంలో ఏరాజ్యానికీ చెందని అమీర్‌ఖాన్ లాంటివారు మహారాష్ట్రులతో కలిసి యుద్ధాలు సాగించటమూ-ఇవన్నీ కలిసి మహారాష్ట్రుల ఖ్యాతిని మసకబారజేశాయి. వారిది స్వాతంత్ర్యం నిలుపుకోవటంకోసం చేస్తున్న ప్రయత్నంగా కాక, దోపిడీదొంగల రాజ్యంగా ప్రచారం చేసేవారికి అవకాశ మిచ్చినట్లయింది.

## నెపోలియన్‌పై విజయం - ఆంగ్లేయుల ఆశలకు ప్రాణం పోసింది

ఇలా అడుగడుగునా ప్రతిఘటనలు ఎదుర్కొంటూ చీకాకుపడుతున్న ఆంగ్లేయులకు ప్రాణంపోసిన ఘటన 1813లో జరిగింది. అది యూరప్‌లో ఫ్రాన్స్

 బ్రిటన్ విజయం సాధించటం. అత్యంత కీలకమైన జనరల్ నెపోలియన్ బోనపార్టీపై బ్రిటన్ విజయం సాధించటం. అత్యంత కీలకమైన ఈ విజయం సాధించడంలో హిందూదేశంనుండి సమకూర్చుకున్న ఆర్థిక వనరులు కీలకపాత్ర వహించాయి. అక్కడ ఫ్రాన్స్ దిగ్గజం నెపోలియన్‌ను ఓడించినట్లుగానే, హిందూదేశంలోనూ దిగ్గజాలవంటి మహారాష్ట్రులనూ ఓడించగలమనే విశ్వాసం వారిలో చోటుచేసుకుంది. ఆ తర్వాత యురోప్‌లో బ్రిటన్ ఫ్రాన్స్‌ల మధ్య జరిగిన ఒప్పందాలను అనుసరించి హిందూదేశంలోనూ బ్రిటిష్ వారు ఫ్రెంచ్ వారు పరస్పర యుద్ధాలకు తలపడటం మాకున్నారు. ఫ్రెంచి వారు తమ స్థావరాలకు పరిమిత మయ్యారు.

అప్పుడు గవర్నరు జనరల్‌గా ఉన్న 'ఏర్ల్ ఆఫ్ మొయిరా' తనపట్ల భక్షకునిగా వ్యవహరిస్తున్న అమీర్‌ఖాన్ సంగతి తేల్చివేయాల్సిందేనని నిర్ణయానికి వచ్చి మహారాష్ట్రులతో సంప్రదింపులు జరిపాడు. మహారాష్ట్ర ప్రముఖులంతా కలసి ఒక సమైక్య బృందంగా ఏర్పడాలనీ, పరస్పరం ఒకరితో ఒకరు యుద్ధం చేయకుండా నియంత్రించుకోవాలని, దేశమంతటా స్వైరవిహారం చేస్తున్న అరాచకశక్తులకు సహకరించరాదని, వారిలో వారికి వివాదాలు వచ్చినపుడు తమ సలహాలను పాటిస్తూ వాటిని పరిష్కరించుకోవచ్చునని ప్రతిపాదించాడు. పైకి చాలా ఆకర్షణీయంగా కనిపించుతున్న ప్రతిపాదనలవెనుక ఉన్న ఏకైకఉద్దేశ్యం తమ స్వాతంత్ర్యాన్ని హరించటమేనని గ్రహించిన మహారాష్ట్ర ప్రముఖులు వాటిని నిర్ద్వంద్వంగా తిరస్కరించారు.

పేశ్వా రెండవ బాజీరావు, భోంస్లే, హెూల్కర్ సంస్థానాలు–వీరందరూ కలిసి ఆంగ్లేయులను పుణేనుండి తరిమికొట్టే ప్రయత్నం 1817 దసరా సమయంలో ఆరంభించారు. బ్రిటీషువారి స్థావరంవైపుగా బాజీరావు అశ్వికసైన్యం కదిలింది. అయితే ఆ సమయంలో పేశ్వా ఆర్థికంగా చాలా బలహీనస్థితిలో ఉన్నాడు. గ్రామాలలో వసూలుకాగలవని ఆశించిన విధంగా పన్నులు వసూలు కాలేదు. పేశ్వా యుద్ధంలో పరాజితుడు కావటమే కాదు, పుణేలో ప్రశాసన వ్యవస్థ నేరుగా బ్రిటీషువారి చేతులలోకి వెళ్లిపోయింది.

ఇంచుమించుగా అదేసమయంలో అమీర్‌ఖాన్ కూడా తనసైనికులకు జీతాలివ్వజాలని స్థితిలో ఉన్నాడు. ఒకానొక దశలో–తన సైనికులే తనను పట్టుకొని తీసుకుపోయి బ్రిటీషువారికి అప్పగిస్తారేమో నన్న భయం అతనిలో పొడసూపింది.

ఢిల్లీలో ఉన్న బ్రిటీషు కంపెనీ ప్రముఖులవద్దకు తన ప్రతినిధిని పంపించి సంప్రదింపులు జరిపి చివరికి 17 డిసెంబరు1817న లొంగిపోయాడు. అమీర్‌ఖాన్ అశ్వికదళంనుండి ఎంపిక చేసుకున్న 3,000 మందిని బ్రిటీష్ ఈస్టిండియా కంపెనీ తన సైన్యంలోకి తీసుకున్నది. టోంక్ పట్టణంపై అతని అధికారాన్ని కంపెనీ గుర్తించినందున 'నవాబ్ ఆఫ్ టోంక్' అన్న గుర్తింపుతో రాజస్థాన్‌లో ఏకైక ముస్లిం పాలకునిగా ఉండటమేగాక, అతని వారసులు కూడా 1947లో దేశానికి స్వాతంత్ర్యం వచ్చే వరకు ఆ హోదాలో కొనసాగినారు.

సుమారుగా అదే సమయంలో దోపిడి దొంగలుగా పేర్కొనబడిన పిండారీలు కూడా తల ఎత్తుతూ పాలకులకు కునుకులేకుండా చేసేవారు. ఒకానొక సమయంలో వారి సంఖ్య 30,000 వరకూ ఉంటుందని అంచనా వేయబడింది. మధ్యభారతంలోనే గాక దక్షిణ హిందూదేశంలోని రాజమండ్రి, మాసులిపటం వరకు వారు తమ కార్యకలాపాలు సాగించేవారు. పాలకులను భయభీతులను చేసేవారు. 1807 నుండి 1811 వరకు చిటుఖాన్ సింధియాలచేత గృహనిర్బంధంలో ఉంచబడ్డాడు. అయితే తమ అధికారం పలుచబడుతున్న దశలో దౌలత్‌రావు అతనికి కొన్ని సదుపాయాలు కలుగజేసి, అతని సేవలు వినియోగించుకోజూశాడు. యశ్వంతరావు హోల్కార్ అందుకు కోపగించి దౌలత్‌రావ్ సింధియాను మందలించాడు. కాని, రానురాను తమ పరిస్థితి బలహీనంకావటంతో, తమ అధికారం నిలుపుకోవటంకోసం పిండారీలనుండి యశ్వంతరావు సైనికులను చేర్చుకోనారంభించాడు (1814)

1817-18 మధ్య బ్రిటీషు ఈస్టిండియా కంపెనీ పెద్ద ఎత్తున సైన్యాలను దించి పిండారీలను వేటాడనారంభించింది. చిటుఖాన్ అడవిమార్గం పట్టాడు. అతని గుఱ్ఱం అడుగుజాడల్ని ఆధారం చేసుకొని వెంటాడుతూ పోయినవారికి పులిబారినపడి, శరీరం భక్షింపబడగా మిగిలిన చిటూఖాన్ తలమాత్రమే దొరికింది.

అలా 1818 నాటికి అమీర్‌ఖాన్ రంగంనుండి తొలగిపోయాడు. మహారాష్ట్ర ప్రముఖులు కూడా తలవంచారు. అప్పటివరకూ మహారాష్ట్రులు పాలించుతూ వచ్చిన భూభాగాలు చాలావరకు కంపెనీ వశమయ్యాయి. ఆ తర్వాతకూడా అక్కడక్కడా ధిక్కారాలు, తిరుగుబాట్లు ఎదురైనప్పటికీ, వారందరినీ ఏకం చేసి నడపగల రాజకీయశక్తి ఏదీ లేని స్థితి ఏర్పడిపోయింది.

## కిత్తూరు రాణి చెన్నమ్మ అసమాన పోరాటం

1824లో బ్రిటీషువారు మరో జటిలమైన యుద్ధాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. బెంగుళూరుకు పుణేకి మధ్యలో కిత్తూరు సంస్థానమున్నది. 1818లో పేష్వా భూములన్నింటినీ కంపెనీ హస్తగతం చేసుకొన్నపుడు కిత్తూరు కూడా ఆ జాబితాలో ఉంది. 1824లో అక్కడి రాజు (దేశాయి అని వ్యవహరిస్తారు) మరణించాడు. అతడికి సంతానం లేదు.అది అవకాశంగా తీసుకొని, మునుముందు రాజ్యవ్యవహారాలు నిర్వహించవలసిన వ్యక్తిని తాము నియమిస్తామని కంపెనీ చెప్పింది. దేశాయి పిన్నమ్మ, సవతితల్లి అయిన చెన్నమ్మ–ఈ ఇరువురూ తాము ఒక పిల్లవాడిని దత్తత తీసుకున్నామని, కంపెనీవారి జోక్యం అవసరం లేదని చెప్పారు. దేశాయి బ్రతికి ఉండగానే దత్తత స్వీకారం జరిగిందా లేదా అని పరిశీలించడానికి కంపెనీ కమీషనర్ జాన్ టాకెరే, కొందరు అధికారులను వెంట తీసుకొనివచ్చి, కోశాగారాన్ని స్వాధీనపరుచుకోజూశాడు. రాత్రి గుడారాలలో పండుకొని, తెల్లవారి లేచేసరికి తాము నిర్బంధంలో ఉన్నట్లుగా వారు గ్రహించుకొన్నారు. కోటను ప్రేల్చివేయగలమని వారు బెదిరించగా, టాకెరేని తుపాకీతో కాల్చి చంపివేశారు. అతని అనుచరులను బంధించి కోటలోపలికి తీసుకుపోయారు.

తాము ఎంపిక చేసిన దత్తతను అంగీకరిస్తేనే, వారిని విడుదల చేయగలమని చెన్నమ్మ ఖరాకండీగా చెప్పింది. ఈ సమస్యను ప్రతిష్ఠాత్మకంగా తీసుకున్న కంపెనీ ఆరు సైనికదళాలను తెచ్చి మోహరించింది. చెన్నమ్మ ఆ ఇద్దరు కంపెనీ ఉద్యోగులను వదిలిపెట్టినా, బ్రిటీషువారు విధ్వంసం ఆపలేదు. నవంబరులో జరిగిన ఆ యుద్ధంలో థామస్ మన్రో సన్నిహిత బంధువు, మరో ఇరువురు బ్రిటీషు సైనికులు మరణించారు. కిత్తూరు సంస్థానం రద్దుచేయబడి, 286 గ్రామాలు నేరుగా కంపెనీపాలనలోకి అప్పగింపబడినవి.

ఆ తర్వాత కూడా సమరం సమసిపోలేదు. గ్రామగ్రామాన, తమ గ్రామాన్ని రక్షించుకొనేందుకు అప్పటివరకు సైన్యంలో ఉన్నవారు తమ ప్రయత్నాలను కొనసాగించారు. 1830నాటికి అది బాగా తీవ్రమైంది. కంపెనీ కార్యాలయాలమీద, బొక్కసాలమీద దాడులు జరిగినవి. ఇలా దాడులు చేస్తున్నవారికి యావత్తు ప్రజానీకంయొక్క సానుభూతి ఉన్నదని కంపెనీ సైనిక అధికారులు గమనించారు.

చివరకు తిరుగుబాటుకు నాయకత్వం వహిస్తున్న వ్యక్తిని బంధించి కోటకు కొద్దిమైళ్ల ఉత్తరాన ఉన్న ఒక మర్రిచెట్టుకు ఉరితీశారు.

పంజాబ్‌ను పరిపాలించుతూ ఆంగ్లేయుల పాలిట సింహస్వప్నంగా ఉంటూ వచ్చిన మహారాజా రంజిత్‌సింగ్ మరణానంతరం పంజాబ్‌కూడా బ్రిటీషువారి కంపెనీ గుప్పిట్లోకి వచ్చింది.

హిందూదేశంలోని అన్ని ప్రాంతాలలోనూ ఆంగ్లేయుల ఆధిపత్యం ఏదో ఒక రూపంలో స్థిరపడినదనుకొంటున్న సమయంలో కూడా, అడుగడుగునా వారికి పరీక్షలు ఎదురవుతూ ఉండేవి. 1818లో ఆంగ్లేయులు సాగిస్తున్న యుద్ధాలకు పూర్ణవిరామం (ఫుల్‌స్టాప్) కాకుండా, స్వల్ప విరామం (కామా) మాత్రమే లభించినదని అనంతరకాలంలో వారి చరిత్రకారులు వ్రాసుకున్నారు. ఎందుకంటే, హిందూదేశంలో తమ సైనిక దళాలను వారు పెంచుతూ పోవలసిన అవసరం ఏర్పడింది. 1814లో 1,95,172 మంది వారి సైన్యంలో ఉండగా, 1818నాటికి దానిని 2,44,064కి పెంచవలసి వచ్చింది. 1826నాటికి ఎన్నడూ లేనంతగా 2,92,162కి పెంచవలసి వచ్చింది. అంతవరకు ఎన్నడూ లేని రీతిలో 1826లో కంపెనీయొక్క మొత్తం ఖర్చు 2.41 కోట్ల పౌండ్లు కాగా, సైన్యం నిమిత్తంగానే 1.28 కోట్ల పౌండ్లు ఖర్చు చేయవలసి వచ్చింది. ఈ యుద్ధాల నిమిత్తంగా అయిన ఖర్చు అంతా మనదేశంలో పన్నుల రూపంలో సేకరించిన దానినుండే సమకూర్చబడేది కావటం గమనార్హం.

1824లో బర్మాలో బ్రిటీషు ఈస్టిండియా కంపెనీ యుద్ధం చేయవలసి వచ్చింది. పెద్ద ఎత్తున సైనికదళాలను, బియ్యాన్ని అక్కడకు తరలించినప్పటికీ, మే నెలలో బ్రిటీషువారు అక్కడ పరాజయం చవిచూశాడు. 1824లో దేశంలో వివిధ ప్రదేశాలలో జరిగిన తిరుగుబాట్లను అణచివేసే ప్రయత్నాలలో 260మంది బ్రిటీషు సైనికాధికారులు ప్రాణాలు కోల్పోయారు. నిరంతరం పెద్దపెద్ద యుద్ధాలు జరుగుతున్నవని అనుకొంటూవచ్చిన గత 20 సంవత్సరాలలో కూడా, ఏ సంవత్సరంలోనూ అంతమందిని కోల్పోవటం జరగలేదు.

### హిందూదేశం గ్రహణగ్రస్తం ఎందుకయ్యింది?

ఇప్పటివరకు మనం చదివినది అంతా కూడా, ప్రధానంగా ఆంగ్లేయులు వ్రాసిన చరిత్ర పుస్తకాలనుండి సంగ్రహించినదే. ఆంగ్లేయులు హిందూదేశంలో అడుగుపెట్టిన

తర్వాత 220 సంవత్సరాలలో తాము దేశాన్ని అంతటినీ తమ గుప్పిట్లోకి తెచ్చుకోగల్గినామని భావించారు. అయితే ఆనాటి స్థితి వారిని ఎంతగా నిరంతరం భయపెట్టుతూ వచ్చిందో అదికూడా చెప్పుకోవటం అవసరమే.

హిందూదేశంలో ఆంగ్లేయుల రాజ్యానికి, తద్వారా రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యానికి పునాదివేసినవానిగా ఫ్రెంచి గవర్నరు డూప్లే కీర్తించబడుతున్నాడు. కొందరికి ఇది వింతగా తోచవచ్చుకూడా. హిందూదేశంలోని ఆనాటి పరిస్థితులను గమనించి "హిందూదేశీయుల సహాయంతోనే హిందూదేశమును మనం జయించవచ్చును" అని తమ చక్రవర్తికి నివేదించిన మొదటి వ్యక్తి డూప్లే. ఆ ప్రణాళికను (హిందూదేశస్థులను సిపాయిలుగా చేర్చుకొని వారితో యుద్ధాలు చేయించి తాము కోటలు గెల్చుకోవటం) అమలుపర్చుటంలో రాబర్ట్ క్లైవ్ దూసుకొనిపోయి ఫ్రెంచివారిని వెనుకకు నెట్టివేయటం వేరే విషయం. (Dupleix legacy is an ironic one : to be the intellectual founder of Britain's Indian Empire)

హిందూదేశాన్ని హస్తగతం చేసుకోవటంలో ఆంగ్లేయులందరూ ఒకే వ్యక్తిలాగా వ్యవహరించారు ఒక విషయాన్ని చర్చించే సందర్భంలో భిన్నమైన అభిప్రాయాలు వ్యక్తమైనా, వారు నిర్ణయానికి వచ్చి దానిని అమలు చేయనారంభించిన తర్వాత, దానిని వెనుకకులాగే వారుగాని, ప్రక్కదారి పట్టించేవారుగాని ఉండేవారు కాదు. ఆంగ్లేయులు మొగలులతో తొలిఘర్షణకు (బెంగాలులో షాయిస్తఖాన్ గవర్నరుగా ఉన్నప్పుడు) దిగకముందే "యుద్ధం చేస్తామని భయపెట్టి లొంగదీసుకొంటేగాని సత్వర ఫలితాలు లభించ"వని ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్లు హిందూదేశంలో ఉన్న తమ ఉద్యోగులకు స్పష్టంగా సూచించారు(పుట 45). "చొక్కా చేతులు పైకి మడిచి మేము పోరుకు సిద్ధంగా ఉన్నామన్న సంకేతాలు ఇస్తే తప్ప, అవకాశం చూసుకొని, దూసుకొనిపోతే తప్ప అధికారం సిద్ధించ"దని బ్రిటీషువారు సర్వదా భావిస్తూ ఉండేవారు(పుట 101).

బొంబాయి గవర్నరుగా ఉండిన ఆర్థర్ వెల్లస్లీకి పొలిటికల్ ఏజెంట్‌గా పనిచేసిన జాన్ మాల్కం ఒక కీలక వ్యక్తి. కొంతకాలం తర్వాత తానే బొంబాయి గవర్నర్ అయ్యాడుకూడా. మహారాష్ట్రులతో యుద్ధం జరుగుతూ ఉండగా 1832లో ఇలా వ్రాసుకున్నాడు. "తూర్పువైపున మన సామ్రాజ్యం కత్తిబలంమీదనే సాధించబడింది.

కత్తిబలంమీదనే నిలిపి ఉంచటం సాధ్యమౌతుంది. మనకు ప్రమాదం ముంచుకొని వచ్చేవేళ హిందూదేశ ప్రజలు మనల్ని సమర్థిస్తారనిగాని, రక్షిస్తారనిగాని అనుకోరాదు. విదేశీ దొరలకు వారు ఇచ్చేది చేవచచ్చిన విధేయత మాత్రమే–అంతకు మించి మరేమీ కాదు" (పుట 163). జో విల్సన్ రచించిన ఇండియా కాంకర్డ్ (India Conquered) గ్రంథంలోనుండి ఇటువంటి వాక్యాలను ఎన్నిటినైనా ఉటంకించవచ్చు.

జో విల్సన్ తన గ్రంథాన్ని 2016లో వెలువరించాడు. యూరోపియన్ల తాకిడి తగలకముందు హిందూదేశంలోని సమాజస్థితిని వివరిస్తూ సొసైటీ ఆఫ్ సొసైటీస్ (Society of Societies) అని వర్ణించాడు. అంటే హిందూదేశంలో ఉన్నది ఒక సమాజం కాదు. అనేక సమాజములు కూడి ఒక సమాజంగా సమన్వయంతో కూడిన జీవితం గడుపుతున్నవని ఆయన భావన. విశాలమైన దేశం కాబట్టి శీతోష్ణస్థితులకు అనుగుణంగా ఆహారవిహారాలలో, వేషభూషలలో, కాలగణనలో, భాషలలో, ఆధ్యాత్మిక సాధనలలో వైవిధ్యం ఉండటం చిత్రమేమీ కాదు. ఆమాటకువస్తే నాటి ఇంగ్లీషు సమాజం కూడా ఒక సమాజంగా కాక అనేక సమాజాల సమాహారంగానే ఉందని కూడా ఆయన వ్రాసాడు. మరి ఆంగ్లేయులు, హిందూదేశ వాసులు పడిన ఘర్షణలో ఆంగ్లేయులు ఎలా పైచేయి సాధించారు? పైన మనం చదివిన సంక్షిప్త కథనంలోను జో విల్సన్ వ్రాసిన విపులమైన వ్యాఖ్యానంలోనూ తరచుగా చెప్పబడే మాట–"పరిస్థితులు ఆంగ్లేయులకు కలిసివచ్చాయి, అదృష్టం వారిని వరించింది." జయాపజయములు దైవాధీనములు అనే మాట వందల ఏండ్లుగా మనం వింటున్నదే కాబట్టి వారు ఆమాట చెప్పగానే మనం నిజమే అనుకుంటాం. కాని ఇది పాక్షిక సత్యం మాత్రమే.

మరి అంతగా వెలుగులోకి రాని, ప్రచారం చేయబడని సత్యంయొక్క మరో పార్శ్వం ఏమిటి? భారతదేశ భవితవ్యాన్ని తీర్చిదిద్దుకోవలసిన బాధ్యత తమపై ఉన్న నేటి పౌరులు, విద్యావంతులు, విద్యార్థులు ఈ విషయాన్ని విశ్లేషించుకోవలసి ఉంది. దానిని రేఖామాత్రంగా సూచించటమే ఇక్కడ సాధ్యపడుతుంది.

1. హిమాలయాలనుండి కన్యాకుమారి వరకు గల భూభాగమంతా ఒకటే దేశమనే భావన రోజూ తాము చదివే పాఠాలలోను, సంధ్యావందనాది స్తోత్రాలలోను ఉన్నప్పటికీ దేశాన్ని అంతటినీ కలిపి నడిపించే నాయకత్వం లేదు. ఆ కారణాన వచ్చిపడుతున్న ముప్పు ఎలాంటిదో గ్రహించి ఒక్కుమ్మడిగా దానిని ఎదుర్కొనే ప్రయత్నం జరగలేదు.

2. వైవిధ్యాలతో కూడిన మన సమాజ జీవితాలలోని చిన్న చిన్న ఆచార భేదాలను పట్టుకొని మనమధ్య ఉన్న అంతరాలను పెద్దవి చేసి చూపెట్టి ఒకరిపై ఒకరిని ఉసిగొల్పే పనిని సాధించటంలో ఆంగ్లేయులు సఫలురైనారు.

3. 'తాను త్వరగా లాభపడాలి' అని, 'దగ్గరిదారిలో వెళ్లి ఫలాలను కైవసం చేసుకోవటం ద్వారా నా తెలివితేటలు వెలుగులోకి వస్తాయి' అని, 'వాడికంటే నేనేమి తక్కువ?' అని స్వార్థము, అహంకారం, ఈర్ష్యలతోకూడిన వ్యవహారం కారణంగా పరస్పరం సహకరించుకుంటూ సమష్టిసంపద (భౌగోళికంగా, సాంస్కృతికంగా, ధార్మికంగా, వైజ్ఞానికంగా, ఆధ్యాత్మికంగా, ఇంకా అనేక విధాలుగా)ను సంరక్షించుకోవటంలో విఫలమైనాము.

4. ఆనాటి పాలకులు, దివానులు (మంత్రులు), సేనానులు తమకున్న తెలివితేటలతో ఇతరదేశాలనుండి పొట్టచేతబట్టుకొని వచ్చినవారి సేవలను తాత్కాలికంగా ఉపయోగించుకొంటున్నామని, తాము ఎప్పుడు తలచుకొంటే అప్పుడు వారిని వదిలించుకోగలమని, విదిలించి పారవేయగలమని అనుకొన్నారు. తామే విదేశీయుల ఉచ్చులో తగులుకొంటున్నామని గ్రహించుకోలేకపోయారు. కాగా మన రాజులు ఆంగ్లేయులకు ఇచ్చిన వరాలను, రాయితీలను మినహాయింపులను వారు లిఖితపూర్వకంగా తీసుకొనేవారు. అది ఎంత ప్రమాదభరితమో గ్రహించు కొనేసరికి మనవాళ్లు తమ ప్రతిభాపాటవాలతో బైటపడగల సమయం మించి పోయింది.

5. 'గెలుపే ప్రధానం, మరేది కాదు'-అనేది ఆంగ్లేయుల నీతి. విజయం సాధించటం కోసం ఎటువంటి కపటోపాయాలను ప్రయోగించినా అది తప్పుకాదని వారి నిశ్చితాభిప్రాయం. అందితే జుట్టు, అందకపోతే కాళ్లు పట్టుకోవాలనే నీతిని కూడా వారు చాలాసార్లు అనుసరించారు. వారి తీయని మాటలకు మనవాళ్లు బోల్తా పడ్డారు. నీతిశ్లాఘ్యపథం తప్పకూడదని, ప్రాణంపోతున్నా దేశం కబంధ హస్తాలలోకి పోతున్నా, చెప్పినమాట తప్పకూడదని, ఇచ్చిన మాట నిలబెట్టుకోవాలని భావించినవారు, తీరాలకు పోతూ వాస్తవపరిస్థితిని గమనించి చక్కదిద్దుకోలేనివారూ మనకు చాలామంది కనిపిస్తారు. వారెవరూ దుర్మార్గులు కారు. కాని తమ సద్గుణాలు దేశ దుర్గతికి కారణంకారాదని గ్రహించలేకపోయిన వివేకశూన్యులని చెప్పక తప్పదు.

6. మీర్‌జాఫర్, ఎట్టియాపురం ఎల్లప్ప, కొచ్చెర్లకోట జగ్గయ్య, విజయనగరం మహారాజు విజయరామరాజు వంటివారు విదేశీ పాలకులకు స్వాగతం

పలికినవారిగా కనబడతారు. ఇలాంటి మరికొందరు ఉండవచ్చు వారిలో దేశభక్తి లోపించిందా, స్వార్థం ప్రకోపించిందా? లౌల్యం విజృంభించిందా? అనే విషయమై ఎంతయినా చర్చించవచ్చు కాని (ఒక గొలుసు బలం ఎంత అంటే దానిలోని అత్యంత బలహీనమైన కొక్కెం ఎంత బలమైనదో అంత మాత్రమే) (The Strength of the chain lies in its weakest link) అనే సత్యాన్ని విస్మరింపజాలం.

## References


1. Verelst, Governor of East Bengal, Quoted in R.C. Dutt, *The History of India*, Vol. 1, p.29.
2. R.C.Dutt, Vol, pp. 38-40
3. Phillip Frances, Cf. R.C.Dutt, Vol. I. p.40.
4. Jon Wilson, India Conquered, 2016
5. R.C. Majumdar(ed.) The History and Culture of The Indian People, British Paramountcy and Indian Renaissance, (Part s I & II), Bharatiya Vidya Bhavan, Mumbai - 2017




# 6

# నూతన రాజ్యాస్వ, అటవీచట్టాలు
# రైతుల గిరిజనుల అగచాట్లు

కంపెనీ తన ఆదాయాన్ని పెంచుకొనడానికి తొలిదశలో అనుసరించిన మార్గాలలో ముఖ్యమైనది శాశ్వత శిస్తు విధానం. 'వేలంపాట' ద్వారా శిస్తునిర్ణయ పద్ధతిలో ఎదురైన ఇబ్బందులను దృష్టిలో పెట్టుకొని తమకు భూములద్వారా సుస్థిర, నికర ఆదాయం తెచ్చే ప్రత్యామ్నాయ మార్గాలకోసం వారు అన్వేషించారు. అందులో వారికి నచ్చింది, కారన్‌వాలీస్ 1793లో ప్రవేశపెట్టిన 'శాశ్వతశిస్తు నిర్ణయపద్ధతి'. వేలంపాటలో శిస్తువసూలు హక్కును చేజిక్కించుకొన్న వారిని అధికారికంగా ఈ పద్ధతిలో 'భూస్వాములు' అనిపిలుస్తారు పాతపద్ధతిలో మాదిరిగా వేలంద్వారా శిస్తును నిర్ణయించటం కాక, కంపెనీయే శిస్తును నిర్ధారిస్తుంది. ఆ శిస్తును ఈ కొత్త భూస్వాములు వసూలు చేసిపెట్టాలి. కంపెనీ నిర్ధారించిన శిస్తుకంటె ఎక్కువ శిస్తును భూస్వాములు వసూలుచేసుకోవచ్చు. వారి ఈ శ్రమకు తగ్గ ఫలితం ఉండాలి కాబట్టి కొత్తభూస్వాములు ఎంతైనా శిస్తుగా వసూలు చేసుకొని, కంపెనీకి చెల్లించవలసింది చెల్లించి, మిగతాది తమకు ఉంచుకోవచ్చు. అయితే దురాశపోతులైన ఆంగ్లేయులు ఈకొత్త భూస్వాములతో సంప్రదించకుండానే ఏకపక్షంగా శిస్తులను ఏకంగా 80 శాతం పెంచారు.

**శాశ్వత శిస్తునిర్ణయ పద్ధతి :**

పాతజమిందార్లకు, కొత్తగా భూస్వాములు అనిపిలువబడుతున్న శిస్తువసూలు దార్లకు మధ్యగల ముఖ్యమైన తేడాలు తెలుసుకోవాలి. పాతజమీందార్ భూస్వామి కాదు. ఫౌజుదారు ఏవిధంగా తన ఫౌజుకు స్వంతదారుడుకాడో, సుబేదారుకు తన సుబా ఏవిధంగా తన స్వంతం కాదో, జమీందారు కూడా తన క్రింద ఉన్న భూములకు స్వంతదారుడుకాదు. జమీందార్‌కు కొన్ని స్వంతభూములు ఉండవచ్చు ఆ భూములకు మాత్రమే ఆయన స్వంతదారుడు. తన జమీలో ఉన్న అన్ని

గ్రామాల్లోని రైతుల భూములకు ఆయన స్వంతదారేమీకాదు. రాజులు కొందరిని గౌరవపదవులలో నియమించేవారు. అలాంటి పదవులలో జమీందార్ పదవి కూడా ఒకటి.

అయితే ఈస్టిండియాకంపెనీ ఒక కొత్త భూస్వామ్యవర్గాన్ని తన అవసరాలకోసం సృష్టించింది. రైతులనుండి శిస్తువసూలు చేసి తన కోశాగారాన్ని నింపటానికి ఈ కొత్తవర్గాన్ని నియమించారు. ఆంగ్లేయులకు అనుకూలంగా (రైతులకు వ్యతిరేకంగా) పనిచేయటానికి అణచివేత, బలవంతపు వసూళ్ళు అనే ఆయుధాలతో వారిని సృష్టించారు. పాతకాలపు జమిందార్లకు, ఈ కొత్తభూస్వామ్య వర్గానికి మధ్య ఎట్టి సారూప్యము లేదు. పాతకాలపు జమీందార్లలో అనేకులు రైతుల కష్టనష్టాలను పట్టించుకొనేవారు. ఆపత్కాలంలో ఆదుకొనేవారు. రైతులు చెల్లించవలసిన శిస్తులకోసం తమస్వంత ఆస్తులు, ఇళ్ళు, బంగారం అమ్మి కంపెనీకి చెల్లించినవారు సైతం పాతజమీందారీ వర్గంలో ఉన్నారు. అయితే ఈస్టిండియా కంపెనీ ప్రవేశంతో వదాన్యులైన జమీందారులు క్రమక్రమంగా అదృశ్యమయ్యారు. వారిని ఈస్టిండియా కంపెనీ తమ పదవులనుండి తొలగించింది. శతాబ్దాలతరబడి వారసత్వంగా అనుభవిస్తున్న వారి సంస్థానాలనుండి వారిని దూరం చేసింది.

ఈస్టిండియా కంపెనీ సృష్టించిన భూస్వామ్యవర్గం కేవలం శిస్తువసూలుదారులు మాత్రమే. నిర్ధారించిన మొత్తం మేరకు నిర్ణీతకాలంలో శిస్తులు వసూలుచేసి చెల్లించగలిగితేనే వారు ఆ పదవులలో ఉంటారు. ఏమాత్రము తేడావచ్చినా వారికి పదవీగండం తప్పదు. పేరుకుమాత్రమే వారు భూస్వాములు. వారి లెక్కలో అసలు భూస్వామి ఈస్టిండియా కంపెనీయే. ఒకరకంగా ఈ కొత్త భూస్వామ్యవర్గం ఈస్టిండియా కంపెనీ కవులుదారులు. రైతుల ముక్కుపిండి వసూలు చెయ్యటం తప్ప ఈ కొత్త భూస్వామ్య వర్గానికి వేరే వృత్తి లేదు. అందుకోసమే ఈ వర్గం సృష్టింపబడింది. అయితే ఇటువంటి భూస్వామ్యవర్గం భారతదేశంలో అంతకు ముందెన్నడూ లేదు. ఈ శాశ్వత శిస్తునిర్ణయ పద్ధతి గురించి ఆర్.సి. దత్తు ఇలా వ్యాఖ్యానించారు. "శాశ్వత శిస్తునిర్ణయపద్ధతి అటు జమీందార్లకు, ఇటు సామాన్య రైతులకు కూడా పెనుభారం అయ్యింది. ఏటా కొత్త భూస్వాములు 3 మిలియను (30 లక్షల) పౌండ్లు భూమిశిస్తురూపంలో వసూలుచేసి కంపెనీకి చెల్లించాలి. ఇది అంతకుముందు విధించబడ్డ శిస్తులకంటే ఎన్నో రెట్లు ఎక్కువ.

 సంప్రదాయజమీందార్లలో అనేకమంది రైతులపట్ల కొంత ఔదార్యంగా ఉండేవారు. వారు కష్టనష్టాలలో ఉన్నప్పుడు బలవంతపు శిస్తువసూళ్ళకు పాల్పడేవారు కారు. కాగా ఈ కొత్తపద్ధతిలో వారందరూ తీవ్రంగా నష్టపొయ్యారు. వారు ఆస్తులు అమ్ముకోవాల్సి వచ్చింది. కంపెనీ సృష్టించిన కొత్త భూస్వామ్యవర్గం అణాపైసలతో సహా రైతులనుండి వసూలు చేసింది. కంపెనీ కోశాగారం నింపటానికి, తమ జేబులు నింపుకోవటానికి వారు చేయని అకృత్యం లేదు. కంపెనీ వారిముందుపెట్టిన శిస్తువసూలు లక్ష్యం నెరవేరాలంటే దౌర్జన్యం చేయకతప్పదు. దౌర్జన్యం, అణచివేత, బలవంతపు వసూళ్ళు ఈ కొత్త భూస్వామ్య వర్గపు స్వభావాలు. వాస్తవానికి శాశ్వత శిస్తునిర్ణయపద్ధతి లక్ష్యమే అది".[1]

ఈ కొత్త భూస్వామ్యవర్గపు ఆకాంక్షలు తమ ఆకాంక్షలతో ముడిపడేటట్లుగా కంపెనీ వ్యూహాత్మకంగా ఎత్తు వేసింది. ఆంగ్లేయులకు ఆదాయం ఆర్జించిపెట్టే క్రమంలోనే వారికి కూడా ఆదాయం వచ్చేటట్లుగా శాశ్వత శిస్తు నిర్ణయపద్ధతిని రూపొందించారు. రైతులు చెల్లించే శిస్తుమొత్తం 11వంతులు అనుకుంటే అందులో 10 వంతులు కంపెనీ వాటాగా, 11వ వంతు ఈ కొత్త వర్గానికి వాటాగా నిర్ధారించారు. నిర్ణయించిన మొత్తంకంటె ఎక్కువ శిస్తు వసూలు చేయగలిగితే, ఆ మొత్తాన్ని తమ స్వంతానికే ఉంచుకోవచ్చు కూడా.

శాశ్వత శిస్తునిర్ణయ పద్ధతి వల్ల కంపెనీకి ఆర్థిక దోపిడీ సులభమైంది. అంతకంటే రాజకీయంగా కూడా బలపడటానికి, తమ వలసపాలనను కొనసాగించటానికి అనువైన పరిస్థితులు సృష్టించటానికి తోడ్పడింది. ఇంగ్లండ్‌వంటి చిన్న దేశం భారతదేశంవంటి పెద్దదేశాన్ని తనంతతానుగా నియంత్రించజాలదు. ఆ విషయం కంపెనీకి స్పష్టంగా తెలుసు. అందుకని తమకు మద్ధతుగా నిలిచే ఒక బలమైనవర్గాన్ని వారు నిలుపదలుచుకున్నారు. కారన్ వాలీస్ అందుకే ఈ కొత్తవర్గాన్ని సృష్టిస్తున్నట్లు చెప్పాడు.

సంస్కర్తగా పేరుగాంచిన విలియమ్ బెంటింక్ (గవర్నర్ జనరల్–1828–35) ఏమంటున్నాడో చూడండి. "ఈ కొత్త భూస్వామ్యవర్గం సామాజిక విప్లవం రాకుండా అడ్డుకోగలదు. భారతదేశ పరాధీనతలోనే తమ స్వంతలాభం ముడిపడి ఉందనుకొనే ఒక దేశద్రోహవర్గాన్ని సృష్టించాం" బెంటింక్ చెప్పినట్లుగా ఈ దేశద్రోహవర్గానికి

ఉన్న ఏకైక ఆకాంక్ష ఆర్థికంగా ప్రయోజనం పొందటమే, అందుకు ప్రతిగా వారు ఆంగ్లేయులకు రాజకీయంగా మద్దతుయిచ్చారు.

1842లో గవర్నర్ రాబర్ట్‌సన్ ఈ భూస్వామ్యవర్గం ఆంగ్లపాలనకు వ్యూహాత్మకంగా ఎంత అవసరమో చెపుతూ "ఇది ఒక భయంకరమైన ప్రయోగం. దేశప్రజలకు, ఆంగ్లపాలకులకుమధ్య వలసపాలనకు మద్దతుగా నిలబడే వర్గం లేకుండా పాలన చేయటం కష్టసాధ్యం. ఈ కొత్త భూస్వామ్యవర్గం ఆ లోటును భర్తీ చేసింది".[2] బెంటింక్ ఇంకా ఇలా అంటున్నారు "శాశ్వత శిస్తు నిర్ణయపద్ధతి అనేక రకాలుగా ఓ విఫలమైన ప్రయోగం. అయినప్పటికీ బ్రిటీషు వలసపాలన కొనసాగింపు పట్ల స్వార్థాసక్తి ఉన్న ఒక ధనిక భూస్వామ్యవర్గాన్ని అది సృష్టించగలిగింది".[3]

ఆంగ్ల పాలకవర్గానికి, వారికి పత్తాసుదార్లుగా ఎదిగిన ఈ కొత్త భూస్వామ్యవర్గానికి మధ్య ఉన్న అనుబంధం రెండువర్గాలకు మేలుచేసేది. సామాన్య భారతీయులకు హాని చేసేది. 18వ శతాబ్దం నాల్గవపాదంనాటికి దేశంలో అనేక ప్రాంతాలలో ఆంగ్లేయుల వలసపాలనకు వ్యతిరేకంగా తిరుగుబాట్లు మొదలయ్యాయి. అందుకే కంపెనీ మరింత తెలివిగా వ్యవహరించటం మొదలుపెట్టింది. ఇదివరకటి మొరటు విధానాలద్వారా వనరుల దోపిడీ చేయటంకంటె పరోక్షవిధానాలద్వారా దోపిడీ చేయటం మెరుగైన విధానంగా దానికి కనపడింది. శాశ్వత శిస్తునిర్ణయపద్ధతి అలాంటి విధానాలలో ప్రముఖమైంది. వాస్తవాలు ఇలా ఉండగా ఈ విధానాన్ని రైతుల ప్రయోజనంకోసం ప్రవేశపెట్టారని, అందువల్ల బెంగాల్ ఆర్థికంగా పుంజుకొందని, సంప్రదాయ పద్ధతుల కంటె ఇది మెరుగైన పద్ధతి అని చెప్పటం అసత్యాలను ప్రచారం చెయ్యటమే.

**రైతువారీ శిస్తు నిర్ణయ పద్ధతి:**

శాశ్వత శిస్తు నిర్ణయపద్ధతి వలన ఆశించిన ఫలితాలు ఆదాయం రూపంలో రాకపోవటంతో ప్రత్యామ్నాయ శిస్తువసూలు పద్ధతులకోసం కంపెనీ అన్వేషించసాగింది. కౌలుదార్ల మధ్య పోటీబట్టి కౌలు మొత్తం సామాన్యంగా నిర్ణయం అవుతుంది. అయితే సాగుభూమి విస్తీర్ణం పెరగటానికి అవకాశాలు లేవు. వ్యవసాయాన్ని తప్ప గ్రామీణుల వృత్తివ్యాపారాలన్నిటినీ ఆంగ్లేయులు ధ్వంసంచేశారు. అందుబాటులో ఉన్న భూములను కౌలుకు తీసుకోవటానికి రైతులమధ్య తీవ్రమైన పోటీ నెలకొనేది. దానితో కౌలు మొత్తాలు భారీగా పెరిగాయి.

దీనివలన బాగా లబ్ధిపొందింది ఆంగ్లేయులు సృష్టించిన నూతన భూస్వామ్య వర్గం. ఈస్టిండియా కంపెనీకి ఈ పరిస్థితివలన ఎట్టి ప్రయోజనం కలుగలేదు. రైతులనుండి భారీగా అంటే దాదాపు 12 మిలియన్లు (ఒకకోటి ఇరవై లక్షల) పౌండ్లు భూస్వాములు కౌలు మొత్తం కింద వసూలుచేస్తే, కంపెనీకి అందులో నాల్గవవంతు మాత్రమే ముట్టింది. ఇది వారికి ఎంతమాత్రమూ నచ్చని విషయం. "కొత్త భూస్వాములు" రైతులను దోచుకుంటున్నారని కంపెనీ ఆరోపించటం మొదలుపెట్టింది. రైతును ఈ కొత్త భూస్వాముల వర్గంనుండి కాపాడటం అవసరం అని చెప్పటం మొదలుపెట్టింది. అసలు ఉద్దేశ్యం వేరు. రైతులతోనే నేరుగా ఒప్పందం కుదుర్చుకుంటే మధ్యవర్గానికి వస్తున్న ఆదాయం తమకే సమకూరుతుందని కంపెనీ ఆశపడింది. దాని ఫలితంగానే 'రైతువారీ విధానం'ను ప్రవేశపెట్టారు. తాము సృష్టించిన కొత్త భూస్వామ్యవర్గాన్ని ఇప్పుడు తొలగించక తప్పలేదు. తమ స్వప్రయోజనం కోసమే కంపెనీ ఆ పెనుమార్పుకు దారితీసింది. ఆర్.సి.దత్ చేసిన ఈ విశ్లేషణ వాస్తవాలకు దర్పణం వంటిది.

శాశ్వత శిస్తునిర్ణయ పద్ధతి తర్వాత ఒక ప్రత్యామ్నాయ పద్ధతిని 1820లో మద్రాసు ప్రాంతంతో ప్రారంభించి, అనేక ఇతర ప్రాంతాలలోనూ ప్రవేశపెట్టారు. మధ్యవర్తులు లేకుండా, ప్రభుత్వమే నేరుగా రైతుల దగ్గరనుండి శిస్తువసూలుచేసే విధానమే రైతువారీ విధానం. రైతుచెల్లించే శిస్తు శాశ్వతంకాదు. అప్పుడప్పుడు లేదా తరచుగా శిస్తుమొత్తాన్ని సవరిస్తూ ఉంటారు. (సవరించటం అంటే హెచ్చిస్తూ ఉంటారు అని అర్థం చేసుకోవాలి) ఆ విధంగా శాశ్వత శిస్తునిర్ణయపద్ధతిలోని శిస్తును శాశ్వత ప్రాతిపదిక పై నిర్ణయించటం అనే ప్రధానలోపాన్ని ఈ పద్ధతిలో తొలగించారు. అంతేకాక వసూలుఅయ్యే శిస్తును మధ్యవర్తులతో లేదా వసూలుదారులతో పంచుకోవాల్సిన పని కూడా లేదు.

ఈ రైతువారీ విధానం అంతకుముందు భారతదేశంలో సంప్రదాయంగా అమలులో ఉన్న శిస్తువసూలు పద్ధతికి దగ్గరగా ఉందని వారు చెప్పుకున్నా అది వాస్తవం కాదు. రైతులవారీగా నేరుగా శిస్తు నిర్ణయించడం, శాశ్వత శిస్తు నిర్ణయపద్ధతిలో సృష్టించిన కొత్త భూస్వామ్యవర్గం ఏవిధంగా భారతీయ పద్ధతులకు భిన్నమైందో, రైతువారీ విధానం కూడా అంతే భిన్నమైంది".[4]

రైతువారీ విధానానికి ప్రాచీనకాలంలో అమలుచేయబడ్డ సామూహిక శిస్తు

నిర్ణయపద్ధతికి ఎందులోనూ పోలికలేదని మద్రాసు రెవిన్యూ బోర్డు అభిప్రాయపడ్డది. పాతకాలం భూములు ప్రజల ఉమ్మడి ఆస్తులు. వాటిమీద హక్కుభుక్తాలు గ్రామానికే తప్ప వ్యక్తులకు లేవు. వ్యక్తులు వాటిని సాగుచేసేవారు. అంతేకాని భూములు సాగుదారుల స్వంత ఆస్తులుకావు. శిస్తులు కూడా గ్రామాల వారిగానే నిర్ణయించారు తప్ప కర్షకులవారీగా నిర్ణయించేవారు కారు. రైతువారీవిధానం రైతును తన నాగలికి కట్టిపారవేస్తుంది. హెచ్చుమొత్తంలో శిస్తు చెల్లించలేక అతను సతమతమవుతాడు. ఒకవేళ అతను నేలతల్లిని విడిచివెళ్ళినా, అతనిని పట్టుకొని వచ్చి సాగుచేయిస్తారు. ప్రభుత్వానికి చెల్లించాల్సిన శిస్తు అణాపైసలతో సహా చెల్లిస్తేనే అతనికి విముక్తి. పంట కాపుకు వస్తే, పంటనంతా శిస్తురూపంలో జప్తుచేసుకొని పోతారు. చివరకు అతనికి మిగిలేది అతని ఎద్దులు, విత్తనాలకు సరిపడే ధాన్యంమాత్రమే. ఒకవేళ అవికూడా లేకపోతే, విత్తనాలను ఇచ్చి బలవంతంగా సాగుచేయిస్తారు. సాగుచేస్తేనే కదా పంట వచ్చేది. పంట వస్తేనే కదా జప్తుచేసేది. ఇది రైతువారీ విధానం అని ఆనాటి మద్రాసు రెవిన్యూ బోర్డు అభిప్రాయపడింది.[5]

రెవిన్యూబోర్డువారు వెలిబుచ్చిన అభిప్రాయం ప్రకారం రెండు ముఖ్యమైన విషయాలు బోధపడతాయి. మొదటిది రైతువారీ విధానం పాతగ్రామీణ సంబంధాలను దెబ్బతీస్తుంది. భూములు గ్రామాల ఉమ్మడి ఆస్తులు అయినప్పుడు, గ్రామీణులమధ్య పరస్పరసహకారం, సాన్నిహిత్యం, ఐకమత్యం ఉండేవి. గ్రామమంతా కట్టుబాటుగా ఉండేది. ఇప్పుడు ఆంగ్లేయులు ఆ ఐకమత్యాన్ని, కట్టుబాటును దెబ్బతీయాలన్న ఉద్దేశ్యంతోనే రైతువారీ విధానాన్ని ప్రవేశపెట్టారు. గ్రామీణుల ఐక్యతచూసి ఆంగ్లేయులు ఎప్పుడూ భయపడేవారు. దాన్ని దెబ్బ తీయటానికి రైతులకు భూమిపై హక్కుకల్పించారు. ఉమ్మడి హక్కుస్థానే వ్యక్తిగతహక్కులు ప్రవేశపెట్టారు. ఉమ్మడి పోరాటానికి అవకాశంలేకుండా చేయటానికే భూములపై హక్కులను వ్యక్తిగతం చేశారు. ప్రైవేటు ఆస్తిహక్కును కట్టబెట్టారు. అయితే అట్టి హక్కువలన, వారికంటె ఇతరులే ఎక్కువ ప్రయోజనం పొందేటట్లుగా ఆ హక్కును రైతులకు యిచ్చారు. రైతువారీ విధానంవలన రైతులు స్వంతదారులు అవలేదు. అనేకమంది మధ్యవర్తుల బదులు, జమీందార్ల బదులు, భూస్వాములకు బదులు, ప్రభుత్వమే ఇప్పుడు స్వంతదారు, పెత్తందారు అయింది.

(మొదటి అధ్యాయంలో వివరించిన **Papal Bull** గుర్తు తెచ్చుకోండి) వాస్తవానికి భూమిశిస్తు ఒకపన్నుకాదని, అది భాటకం **(Rent)** అని ఆంగ్లప్రభుత్వమే పలుసార్లు బహిరంగంగానే చెప్పింది.[6]

**సంప్రదాయ శిస్తునిర్ణయపద్ధతి :**

థామస్ మన్రో తను ప్రవేశపెట్టిన రైతువారీ విధానం భారతీయుల సంప్రదాయ శిస్తు నిర్ణయపద్ధతికి దగ్గరగా ఉందని గొప్పలు చెప్పుకొనేవారు. సంప్రదాయ విధానం ఎలా ఉండేదో ఇప్పుడు తెలుసుకుందాం. ఆ విధానంలో వ్యవసాయ భూములు, నీటి వనరులు, పశుగ్రాస భూములు అన్నీ ప్రజలందరి ఉమ్మడి వనరులు. రైతుకు సాగుచేసుకొనే హక్కుఉంది. అది అతనినుండి విడదీయరానిది. రాజుకు ఉన్న హక్కు పరిమితం అయింది. రాజు ఎన్నడూ భూములకు స్వంతదారుడుకాదు. కేవలం భూమిశిస్తు వసూలు చేసుకొనే హక్కు తప్ప మరే ఇతర హక్కు పాలకులకు భూములమీద లేదు.[7]

కల్నల్ జాన్ బ్రిగ్స్ భారతదేశంలో ప్రాచీన, ఆంగ్లేయ భూవిధానాలను విస్తృతంగా పరిశోధన చేశాడు. భూమిపై హక్కు ఎప్పుడూ భారతదేశంలో రైతులదేనని, రాజ్యం ఆ భూమిపై పన్నువిధించే హక్కు మాత్రమే కలిగి ఉందని, అంతకుమించి రాజ్యానికి భూములపై ఎటువంటి హక్కులేదని వ్రాశాడు. ఎవరైతే సాగుచేస్తున్నారో వారికే భూమిమీద హక్కు ఉంటుందని, వ్యవసాయ ఆదాయంలో పరిమితభాగం మాత్రమే పన్నుగా రాజుకు చెల్లించేవారని వ్రాసాడు. యుద్ధసమయాలలో ఈ పన్నును పెంచేవారని వ్రాసాడు. సార్వభౌముడు ఎప్పుడూ భూమికి అధిపతిగా, స్వంతదారుగా చెప్పుకోలేదని వ్రాసాడు. బ్రిటీషువారు భారతదేశంలో తీసుకొనివచ్చిన విధానాలగురించి చెప్తూ ప్రస్తుత ప్రభుత్వం దేశంలోని భూమి యంతటికీ తనే ఏకైక స్వంతదారుగా భావించుకొని, భూమిశిస్తును తనకుప్రధాన ఆదాయవనరుగా చేసుకొంది. రైతుపై అజమాయిషీ చేయటానికి ఎందరో ఉద్యోగులను నియమించింది. భూమిమీద వచ్చే ఫలసాయ మొత్తాన్ని తనే హస్తగతం చేసుకోవాలని అనుకొంది. ఆంగ్లపాలకులు వసూలుచేసినంత భూమిశిస్తు ఆసియాలోకాని, ఐరోపాలోకాని ఏ ప్రభుత్వమూ వసూలు చేయలేదు.[8]

ఫలసాయంలో 1/6 నుండి 1/12 భాగం సామాన్యంగా ప్రభుత్వ వాటాగా ఉండేది. దిగుబడి తగ్గితే ఆమేరకు ప్రభుత్వానికి చెల్లించే శిస్తు మొత్తంకూడా తగ్గుతూ ఉండేది. ఉమ్మడిగానో, లేక స్వయంపాలనా ప్రతిపత్తి కల్గిన గ్రామీణ సమాజంగానో శిస్తుచెల్లించేవారు. ఈ విధానంలో భారతీయ జమీందార్లు 'మధ్యవర్తులు'గా వ్యవహరించే వారు. శిస్తువసూలు చేసి, తనకు చెల్లించేందుకుగాను రాజు వారిని నియమించేవారు. ప్రాథమికంగా వారు శిస్తువసూలు చేసే అధికారులు మాత్రమే. పాశ్చాత్య ఫ్యూడల్ ప్రపంచంలో భూస్వాములకు భూములమీద హక్కులు ఉన్నాయి. ఆ భూములలో పనిచేసే రైతులపైన కూడా హక్కులు ఉన్నాయి. భారతదేశంలో జమీందారుకు అట్టి హక్కులు లేవు. భూమిమీదకాని, భూమిని సాగుచేసే రైతులమీదకాని ఎట్టి హక్కులులేవు. వారి విషయాలలో జోక్యం చేసుకొనే అధికారంకూడా లేదు. రైతుల దగ్గరనుండి శిస్తులు వసూలుచేయటమే వారి బాధ్యత. వ్యవసాయభూములనుండి రైతులను వెళ్ళగొట్టటం ఆయన పరిధిలోనిది కాదు. ఎందుకంటె ఆ భూములకు ఆయన యజమానికాదు, రాజుచేత నియమించబడ్డ ఒక అధికారి మాత్రమే. రైతులనుండి శిస్తు వసూలుచేసి, కోశాగారంలో జమచేసినందుకుగాను ఆయనకు, 2.5శాతం కమీషను ముట్టేది. అయితే బ్రిటీషువారు 'జమీందారు'కు బదులుగా 'భూస్వామి' అన్న పదాన్ని విస్తృతంగా వాడారు. రైతులమీద అనేక అత్యాచారాలు చేసి, అందుకు భూస్వాములను బాధ్యులను చేశారు.

ఇక్కడ మరొక ముఖ్యమైన తేడాను గమనించాలి. భారతీయ రైతు పాశ్చాత్య రైతుమాదిరిగా ఎప్పుడూ బానిస (Serf) గా లేడు. పాశ్చాత్య రైతులు తమ భూస్వాముల ఆదేశాలకు అనుగుణంగా ఉత్పత్తి చేసేవారు. ఫ్యూడల్ భూస్వాములు తన దగ్గర పనిచేసే బానిస రైతులను నిలువుదోపిడీచేసేవారు. ఇందుకు భిన్నంగా భారతదేశంలో రైతు తమ స్వేచ్ఛను ఎన్నడూ కోల్పోలేదు. తాను సాగుచేసే భూమిమీద తిరుగులేని హక్కును కల్గి ఉన్నాడు. భూమిని అమ్మటానికిగాని, బదిలీ చెయ్యటానికి గాని వీలులేదు. రాజుకు ఆ హక్కులేదు. కనుక భారతీయ రైతులను వారి భూమినుండి వెళ్ళగొట్టటం అన్న ప్రశ్నే ఉదయించేది కాదు.[9]

**మహాల్‌వారీ విధానం :**

19వ శతాబ్ది మధ్యలో ఈ విధానాన్ని పంజాబులో ప్రవేశపెట్టారు.

పంజాబుతోపాటుగా వాయవ్యసరిహద్దు ప్రాంతం, మధ్య పరగణాలు, ఆగ్రా, గంగానదీ తీర ప్రాంతంలోనూ దాన్ని అమలు చేశారు. మహారాజా రంజిత్‌సింగ్ మరణం తర్వాతనే బ్రిటీషువారికి పంజాబులో ప్రవేశం దొరికింది. అయినప్పటికీ గ్రామీణ ప్రాంతాలలో వారి ప్రభావం ఎక్కువగా ఉండేది కాదు. అందుచేత ఆ నాటికి అక్కడ అమలులో ఉన్న శిస్తునిర్ణయ పద్ధతిస్థానే తమకొత్త పద్ధతిని అక్కడ ప్రవేశపెట్టారు. 'మహల్' అంటే పంజాబీభాషలో 'గ్రామం' అని అర్థం. జమీందారీ, రైతువారీ విధానాల కలగలుపుగా ఈ పద్ధతిని తీసుకొనివచ్చారు. మొత్తం సాగుఅయ్యేభూమిని కొన్ని మహళ్లుగా విభజించారు. ప్రతి 'మహల్' కింద ఒకటి లేక అంతకంటె ఎక్కువ గ్రామాలు ఉంటాయి. భూమిమీద హక్కులు రైతులకు ఉంటాయి. గ్రామకమిటీలు శిస్తు వసూలుచేసి కోశాగారానికి చెల్లించాలి. రాజకీయ కారణాలవల్ల పంజాబు రైతులనుండి తక్కువశిస్తును వసూలుచేసారు.

**భూములకు స్వంతదారు ప్రభుత్వమే-అనగా కంపెనీయే ! :**

బ్రిటీషువారు ప్రవేశపెట్టిన శిస్తునిర్ణయ పద్ధతుల లక్ష్యం ఒక్కటే. రైతులనుండి గరిష్టంగా రాబట్టుకోవటమే. అంతకుమించి వేరే లక్ష్యంలేదు. అందుకే ఒక్కో ప్రాంతంలో ఒక్కోవిధానం వేరువేరు పేర్లతో ప్రవేశపెట్టినా, వాటి ఉద్దేశ్యం మాత్రము వ్యవసాయరంగంనుండి వీలయినంతగా వనరులను దోచుకోవటమే. అందుకోసం మొదటగా వారు చేసింది రైతులనుండి వసూలుచేసే భూమిశిస్తును ఏకపక్షంగా, అశాస్త్రీయంగా పెంచారు. శిస్తు వసూళ్ళకోసం కొత్తవసూలుదార్లను మధ్యవర్తులుగా నియమించారు. ముందుగా శిస్తు వసూళ్ళకోసం వేలంపాటను నిర్వహించారు. సంప్రదాయ జమీందార్ల స్థానే కొత్తవర్గాన్ని తెరమీదకు తెచ్చారు. ఆ తర్వాత శాశ్వత శిస్తునిర్ణయపద్ధతి ద్వారా ఒక కొత్త భూస్వామ్య వర్గాన్ని సృష్టించారు. ఆ తర్వాత రైతువారీ పద్ధతి ద్వారా శిస్తువసూళ్ళకు గ్రామాలలో రెవిన్యూ అధికారులను నియమించారు. పట్వారీలు, కరణాలు, మహాజనులు, గ్రామపెద్దలు, గ్రామకమిటీలు అలావచ్చినవారే.

గ్రామాలలో ఉన్న కట్టుబాట్లను, రైతులమధ్య ఉన్న ఐకమత్యాన్ని దెబ్బతీయటానికి రైతులకు 'ప్రైవేటు హక్కులు' కల్పించారు. అంతకుముందులేని హక్కులను రైతులకు భూములమీద యిచ్చారు. తమ భూములను అమ్ముకోవటానికి, కుదవ పెట్టుకోవటానికి, బదిలీ చేయటానికి అధికారం, స్వేచ్ఛలను రైతులకు యిచ్చారు.

భూములను అమ్ముకోవటానికి యిచ్చిన స్వేచ్ఛ వెనుక కూడా ప్రభుత్వానికి దురుద్దేశ్యమే ఉంది. భూములు అమ్మితేకాని, రైతులు శిస్తులు కట్టలేని దుస్థితిలోకి వారిని ఎప్పుడో నెట్టివేసారు. రైతులచేత భూములు అమ్మించి, శిస్తు బకాయిలను రాబట్టుకోవాలని ఆంగ్లప్రభుత్వం అంతకు ముందులేని భూములు అమ్ముకొనే స్వేచ్ఛను రైతులకు యిచ్చింది. వాస్తవానికి వారు భూమిమీద పన్ను వెయ్యలేదు. బ్రిటీషువారు రాకముందు భూమిశిస్తును 'పన్ను' రూపంలో వసూలు చేసేవారు.' కర్షకులు దిగుబడి లేక ఫలసాయంలో కొంతశాతాన్ని పన్నుగా చెల్లించేవారు. ఎవరికివారు ఈ పన్నును చెల్లించటం కాక, ఒక గ్రామంలోని రైతులందరూ కలసి సామూహికంగా పన్నును చెల్లించేవారు.

బ్రిటీషువారు దానిని 'పన్ను' అనటం మానివేసి, భాటకం (రెంటు) అనటం మొదలు పెట్టారు. 'రెంటు' ఎవ్వరు చెల్లిస్తారో వారుస్వంతదారులు కాదు అన్న విషయం మనందరికీ తెలుసు. కంపెనీ ఉద్యోగులు, అధికారులు 'రెంటు' అనేపదం కావాలనే వాడారు. దాని అర్థం ఆ భూములకు కంపెనీయే అసలు యజమాని. రైతులు కేవలం కౌలుదారులు మాత్రమే. కనుక రైతులను తాము సాగుచేస్తున్న భూములనుండి కంపెనీ యిష్టానుసారం ఎప్పుడైనా వెళ్ళగొట్టవచ్చు. ఇంగ్లండ్‌లో రైతు అంటే 'బానిస' లేక 'కౌలుదారు' మాత్రమే.

వీటన్నింటికీమించి, శిస్తువసూలుకు వారు అనుసరించిన పద్ధతులు అమానుషం. శిస్తువసూలుకు హింసాయుత పద్ధతులకు పాల్పడ్డారు. బకాయిపడ్డ రైతులను రోజంతా ఎండలో నిలబెట్టటం, భోజనానికి కాని, కనీసం కాలకృత్యాలు తీర్చుకోవటానికి కాని అనుమతిని యివ్వకపోవటం, నిర్బంధించటం, పశువులను పచ్చిక బయళ్ళలో మేతకు వెళ్ళకుండా నిరోధించటం, రైతులపై కాపలాపెట్టటం, వారిని వంగోపెట్టి కొట్టటం, వారి చెవులు పిండటం, వారిని ముంగాళ్ళమీద కూర్చోపెట్టటం, కొరడాతో కొట్టటం, వారి చేతివ్రేళ్ళు నులిమి పెట్టటం, వారిని పరుగులు పెట్టించటం, ఇద్దరు రైతుల తలలను వారిజుత్తుతో ముడివేసి తిప్పటం మొదలైన అమానుష చర్యలు ఆంగ్లేయుల పరిపాలనా కాలంలో శిస్తువసూలుకు సాధారణంగా అనుసరించిన పద్ధతులు. ఒక బ్రిటీషు పార్లమెంటు సభ్యుడు ఈ పద్ధతులను ప్రపంచంలోనే అత్యంత క్రూరమైనవిగా అభివర్ణించాడు. కాని భూమిశిస్తు అంత భారీస్థాయిలో వసూలుచేసుకోవాలంటే హింసాత్మక చర్యలకు పాల్పడటంతప్ప వారికి వేరే మార్గంలేదు.[10]

**వ్యవస్థీకృతమైన హింస :**

ఈ రకంగా భారతదేశంలో ఆంగ్లేయుల వలసపాలన హింసాత్మకంగానూ, క్రూరత్వంతోనూ పూర్తిగా నిండిపోయి, వ్యవస్థీకృతం అయింది. భారతీయులను వారి భూములనుండి బలవంతంగా వెళ్ళగొట్టారు. అయితే ఈ ప్రక్రియ నేరుగానూ, కంటికి కన్పడేటట్లుగానూ జరగలేదు. అర్థంలేని, అర్థంకాని అనేక నియమనిబంధనలు, చట్టపరిభాష సహాయంతో అనేక గందరగోళాలను సృష్టించారు. సంప్రదాయ పద్ధతులను తొలగించి వాటిస్థానే మిశ్రమ పద్ధతులను ప్రవేశపెట్టారు. ఎప్పటికి ఏది వారికి లాభమో దాన్ని అనుసరించారు. దానితో వివిధరకాల కౌలుపద్ధతులు, హక్కులు, శిస్తు నిర్ణయ పద్ధతులు ఏర్పడి భూమిశిస్తు విధింపు, అమలు ఎవరికీ అర్థంకాని విషయమైంది. స్వంతదారులుగా తరతరాలుగా ఉన్న రైతులు తమ భూములలోనే కౌలుదారులుగా దిగజారారు. ఇది చాలదన్నట్లుగా, వారికి కల్పించిన హక్కులవల్ల వారి కమతాలను కుదవపెట్టి ఋణాలు తీసుకోవలసిన పరిస్థితికి నెట్టివేసారు. ఋణభారంతో రైతులు క్రుంగిపొయ్యారు. అనేకమంది భూమిలేని నిరుపేదలు అయ్యారు. వ్యవసాయ జనాభాలో మూడవవంతు నుండి రెండువంతులు వరకు తమకంటూ ఏమీలేని వ్యవసాయ కూలీలుగా దిగజారారు. ఒకటిన్నర శతాబ్దంలో పరిస్థితులు తలక్రిందులు అవటంతో రైతులు నిరుపేదలుగా మారిపొయ్యారు. ఆర్.సి. దత్తు ఇలా అంటున్నారు "అటువంటి ప్రక్రియ అనేక దశాబ్దాల పాటు కొనసాగితే అత్యంత ధనికదేశం సైతం పేదదేశంగా మారకుండా ఉండటం నిజంగా ఒక అద్భుతం".[11]

**దోచుకున్న భాటకము**

| సంవత్సరము | దోచుకున్న భాటకము (Rent) | పౌండ్లలో |
|---|---|---|
| 1764-5 | మొఘలాయిల పాలనలో చివరి సంవత్సరం | 818 |
| 1765-6 | ఈస్టిండియా కంపెనీపాలనలో మొదటి సంవత్సరం | 14,70,000 |
| 1793-4 | శాశ్వత శిస్తు నిర్ణయపద్ధతి అమలు వచ్చిన తర్వాత | 30,91,000 |
| 1857-8 | బ్రిటీషరాణి పాలనలో మొదటి సంవత్సరం | 1,50,30,000 |
| 1900-1 | 19వ శతాబ్దం మొదట్లో | 1,70,50,000 |
| 1911-2 | మొదటిప్రపంచ యుద్ధకాలంలో | 2,00,00,000 |
| 1936-7 | రెండవ ప్రపంచయుద్ధ ప్రారంభం మొదట్లో | 2,39,00,000 |

## దోచుకున్న భాటకము-గ్రామీణ ఋణభారం-వడ్డీ వ్యాపారుల వ్యవస్థ

ఆంగ్లపాలకులు నిర్బంధంగా వసూలుచేసిన భూమిశిస్తు కట్టలేక లక్షలాదిమంది రైతులు ఋణభారంతో క్రుంగిపోయారు. ఆంగ్ల పాలకులు ఖజానా నింపు కోవాలంటే రైతులను ఋణగ్రస్తులను చేయకతప్పదు. ఈ ప్రక్రియలో వారు మరోవ్యవస్థను సృష్టించారు. వారు మరెవ్వరోకాదు. వడ్డీవ్యాపారులు. ఆ రోజులలో రైతులకు వారే దిక్కు అయ్యారు. ఆ కాలంలోనే కాదు. ఈ రోజులలో సైతం రైతులకు సమయానికి ఋణాలు యిచ్చి ఆదుకొనేది వడ్డీవ్యాపారులే. ఆ క్రమంలో వారు హెచ్చు వడ్డీవసూలు చేయటం, వడ్డీలు, కిస్తీలు కట్టలేక రైతులు ఋణభారంతో క్రుంగిపోవటం పరిపాటిగా వస్తున్న విషయమే.

అయితే కంపెనీ పాలనలోనూ, ఆ తర్వాత ఆంగ్ల ప్రభుత్వ పాలనాకాలంలోనూ వడ్డీవ్యాపారులను పెంచిపోషించారు. భూమిశిస్తు వసూలు చేసిపెట్టటానికి వడ్డీవ్యాపారులను వారు వాడుకొన్నారు. పెనుభారమైన భూమిశిస్తును సకాలంలో రైతులు చెల్లించలేకపోయేవారు. వారి తరఫున వడ్డీ వ్యాపారులు శిస్తు చెల్లించి, ఆ మొత్తాన్ని వడ్డీతో సహా రైతులనుండి రాబట్టుకొనేవారు. ఆ కారణంగా రైతులు చెల్లించలేని పరిస్థితులలో సైతం కంపెనీ రాబడికి ఆటంకం ఏర్పడలేదు. ఎందుకంటె వడ్డీవ్యాపారులచేత ఆ మొత్తాన్ని కట్టించేవారు. రైతులనుండి తరువాత వసూలుచేసుకొమ్మని ఆదేశాలు యిచ్చేవారు. వడ్డీ వ్యాపారులే లేకుంటే కంపెనీకి అంత భారీమొత్తంలో పెంచబడ్డ శిస్తులు ఎన్నటికీ వసూలు అయ్యేవికావు. అంతకుముందు భాటకం చెల్లింపులు ఉత్పత్తుల రూపంలో ఉండేవి (Rent in Kind). ఈ చెల్లింపుల స్వరూపాన్ని ఆంగ్లేయులు మార్చారు. ఉత్పత్తుల రూపంలో కాక ధనరూపంలో (Rent in Cash) చెల్లింపులకు తెరదీశారు.

ఎప్పుడైతే చెల్లింపులు ధనరూపంలో చేయవలసి వచ్చిందో, ఉత్పత్తులను పంటచేతికి రాగానే అమ్మవలసి వచ్చింది. వడ్డీవ్యాపారులు పంటను తీసుకొని ఫలసాయాన్ని డబ్బుగా యిచ్చేవారు. వారే పెట్టుబడికి ఋణాలు సమకూర్చేవారు. ఆంగ్లేయులకు చెల్లించవలసిన శిస్తులకు పెట్టుబడిని అప్పుగా యిచ్చేవారు. ఈ మొత్తం ప్రక్రియ సజావుగా సాగేందుకు వీలుగా వారికి చట్టబద్ధమైన రక్షణను ఆంగ్లేయులు కల్పించారు. ఋణగ్రహీతలు అప్పుచెల్లించకపోతే వారి భూములను బలవంతంగా ఆక్రమించేవారు. రైతులను బలవంతపెట్టి భూములను తమ పేరుమీద వ్రాయించుకొనేవారు. భూములను తనఖాగా పెట్టుకొని రైతులకు ఋణాలు మంజూరు

ఇందుకు కావలసిన చట్టబద్ధమైన రక్షణను వడ్డీవ్యాపారులకు ఆంగ్లేయులు కల్పించారు. దానితో వడ్డీవ్యాపారులు రైతులకు ఎక్కువ వడ్డీలకు అప్పులు యిచ్చి, వారి నిస్సహాయతను ఆధారంగా చేసుకొని, వారి భూములను కాజేయటానికి ప్రయత్నించేవారు. ప్రభుత్వం అండదండలు ఎటూ ఉన్నాయి. ప్రభుత్వానికి రైతులనుండి రావలసిన భూమిశిస్తును ముందస్తుగా చెల్లిస్తే వారు వడ్డీవ్యాపారుల జోలికి వచ్చేవారుకాదు. పైపెచ్చు వారిని ప్రోత్సాహించేవారు. వఅదలు వచ్చినా, కఱవుకాటకాలు వచ్చినా, తీవ్రక్షామ పరిస్థితులు నెలకొన్నా ఆంగ్లేయులకు రావలసిన భూమిశిస్తు చెల్లింపులకు ఇబ్బంది ఎప్పుడూ ఏర్పడలేదంటే, వారు ఎంతతెలివిగా వడ్డీ వ్యాపారవ్యవస్థను తమ దోపిడీకి సహకారిగా అభివృద్ధి చేశారో తెలుస్తుంది.

వడ్డీ వ్యాపారులు శిస్తులు వసూలుచేసి పెట్టటానికే పరిమితంకాలేదు. ధాన్యం కొనుగోలు చేసేవారు. ఋణాలు యిచ్చేవారు. పంటచేతికొచ్చే సమయానికి వేరే కొనుగోలుదారులు ఎవరూ రాకుండా చూసేవారు. గ్రామీణ మార్కెట్లమీద వారిదే గుత్తాధిపత్యం. దానితో సహజంగానే వారి ప్రాముఖ్యం పెరిగింది. పెరుగుతున్న వ్యవసాయ మిగులుతోపాటుగా, వారిప్రాముఖ్యం కూడా పెరిగింది. ఒక ఆంగ్లేయుడు ఈవిధంగా వ్యాఖ్యానించాడు "దేశం మన పాలనలోకి రాకముందు, ఒక షావుకారు భిల్లులతో, ఇతర కొండజాతి రైతులతో ఈ విధంగా ఎప్పుడూ వ్యవహరించి ఉండడు. మన పాలనకారణంగా, ఎవరిని చూసి వీరు ఇదివరకు భయపడి ప్రాణాలు కాపాడుకోవటానికి ప్రయత్నించారో, వారినే ఇప్పుడు అణిచివేసి, తమ బానిసలుగా చేసుకున్నారు".[12] మరొక ఆంగ్ల ప్రముఖుడు ఈవిధంగా అంటున్నాడు."మన పాలనాకాలంలో ప్రజలు ఋణగ్రస్తులయ్యారు. వారి ఋణభారం అనేకరెట్లు పెరిగింది. వార్షిక అమ్మకాలు, తనఖాలుకు సంబంధించిన వివరాల నివేదికలను పరిశీలించినపుడు, గత అర్ధశతాబ్దంలో ఋణభారం విపరీతంగా పెరిగిందని స్పష్టమవుతుంది".[13]

ఒకసారి రైతులభూములు వడ్డీ వ్యాపారస్థుల కబంధహస్తాలలోకి చిక్కుకున్న తర్వాత వారు భూమిలేని కూలీలుగా ఆ వడ్డీవ్యాపారులకే పనిచేసేవారు. లేదా తమ భూములనే కవులకు తీసుకొని సాగుచేసే దుస్థితికి నెట్టివేయబడేవారు. ఆ సాలెగూడు నుండి బయటపడటం వారికి అసాధ్యమయ్యేది. వారు ఎంత ఉత్పత్తి చేసినా, ఏమి ఉత్పత్తి చేసినా, అందులో సింహభాగం కౌలురూపంలో, వడ్డీ చెల్లింపుల

రూపంలో వ్యాపారులకే వెళ్ళేది. కాలక్రమంలో ఈ వడ్డీవ్యాపారులే 'చిన్నపెట్టుబడిదారులు' అయ్యారు.

రైతుల కంటికి కన్పించే నిర్దయుడుగా, పెట్టుబడి దోపిడీ ప్రక్రియలో అత్యంత అవశ్యమైన కిందిస్థాయి చిన్నయంత్రంగా గ్రామీణవ్యాపారి వలసపాలనా కాలంలో రూపాంతరం చెందాడు. ఆంగ్లేయుల దోపిడీపాలనకు మూలస్తంభాలుగా వారే సృష్టించి, పెంచి పోషించిన భూస్వాములు, వడ్డీ వ్యాపారులు నిలిచారు.[14] స్వాతంత్ర్యం వచ్చిన తర్వాతకూడా పరిస్థితిలో పెద్దగా మార్పు రాలేదు. చట్టాలలో మార్పురాలేదు. బ్రిటీషు కాలంనాటి చట్టాలు నేటికి అమలులో ఉన్నందున అవి కొన్ని వర్గాలకే అండగా ఉన్నాయి. వనరుల దోపిడీకి అనుకూలంగా చేయబడ్డ చట్టాలు ఎప్పుడూ దోపిడీకి గురిఅవుతున్న వర్గాల ప్రజల ప్రయోజనాలను పరిరక్షించవు. ఆ బ్రిటీషు చట్టాల కొనసాగింపువలన దోపిడీచేసే వర్గాలకే ప్రయోజనం చేకూరుతుందన్న వాస్తవాన్ని మన విధాన నిర్ణేతలు ఇంకా గుర్తించలేదు.

**అడవులపై ఆధిపత్యం :**

వలసపాలనకు ముందు అడవులు భారతదేశంలో ఉమ్మడి వనరులు. వలసపాలనాక్రమంలో భారతదేశపు తూర్పు ప్రాంతాలలో ఉన్న అడవుల విస్తీర్ణం తగ్గుతూ వచ్చింది. అడవులను నరికి వ్యవసాయానికి అనువుగా అటవీ భూములను తయారు చెయ్యటానికి ఈస్టిండియా కంపెనీ ప్రోత్సాహించటమే అందుకు కారణం. భూమిశిస్తు కంపెనీకి ప్రధాన ఆదాయవనరు. సాగుభూముల విస్తీర్ణం ఎంత పెరిగితే అంతగా భూమిశిస్తు పెంచుకోవచ్చునన్న దురాశతో అడవులను నరకటాన్ని ప్రోత్సాహించారు. వలసీకరణ ప్రక్రియ వేగవంతం అయిన తర్వాత, సహజవనరులపై సమాజానికి ఉన్న ఉమ్మడి హక్కుభుక్తాలను కంపెనీకి బదిలీచేయించుకోవటానికి పన్నాగం పన్నింది. సహజవనరులు వ్యాపార వస్తువులయ్యాయి. ఆంగ్లసామ్రాజ్య అవసరాలకుగాను దేశంనుండి వాటిని తీసుకొని వెళ్ళటం మొదలుపెట్టారు. నెపోలియన్‌తో చేసిన యుద్ధాల సందర్భంగా, నౌకలు కావలసివచ్చాయి. నౌకానిర్మాణానికి అవసరమైన నాణ్యమైన టేకుకలపను పెద్దపెట్టున తరలించారు. ఆంగ్లేయులకు సముద్రంమీద ఆధిపత్యం సమకూరటంలో భారతదేశపు టేకు కలప విశేషంగా దోహదం చేసింది. అదేవిధంగా రైల్వేల నిర్మాణంలోనూ మేలుజాతి వృక్షాలకలప కీలకపాత్ర పోషించింది[15]. 1860-1910

మధ్య 13493 కిలోమీటర్ల నుండి 51,658 కిలోమీటర్ల మేర రైలుమార్గాలనిర్మాణం జరిగింది. అంటే 50 ఏళ్ళలో 3.8 రెట్లు పెరిగింది. ప్రతిమైలు నిర్మాణానికి 850 దుంగలను స్లీపర్లుగా వాడారు. ప్రతి సంవత్సరం 10 లక్షల దుంగలు అవసరం అయ్యేవి. ఒక్కొక్క దుంగ 12 నుండి 14 సంవత్సరాలు పనిచేసేది. ఆ తర్వాత పాతవాటి స్థానంలో కొత్తవి అమర్చేవారు. సాల్(గుగ్గిలం), దేవదారు, టేకు జాతి దుంగలను వాడేవారు. కనుక ఆ వృక్షజాతులపై తీవ్రమైన ఒత్తిడి పెట్టారు[16].

బెంగాల్‌లోని జంగల్‌మహల్స్ జిల్లా అడవులనుండి స్థానిక రైల్వేలైను నిర్మాణంకోసం పెద్దపెట్టున సాల్ చెట్లను నరికి దుంగలుగా ముక్కలుచేసి ఉపయోగించారు. ఈ విధ్వంసంవలన, రైలుమార్గం నిర్మాణంవలన సంథాల్‌జాతి ప్రజలు నిర్వాసితులయ్యారు. 1898లో బెంగాల్ – నాగపూర్ రైల్వేమార్గ నిర్మాణానికి కూడా కావలసిన కలపను జంగల్ మహల్స్ జిల్లా అడవులనుండి, బీహార్ అడవులనుండి సేకరించారు. రైలుమార్గాల నిర్మాణం చేపట్టిన తొలిసంవత్సరాలలో ప్రతిపాదిత రైలుమార్గాలకు దగ్గరగానే సాల్‌చెట్లు సమృద్ధిగా ఉండేవి. రైలుమార్గాలను విస్తరిస్తున్నకొద్దీ అనేక వేల సాల్‌చెట్లు లభించటం కష్టమయిన తర్వాత వాయవ్యహిమాలయ అడవులనుండి దేవదారు వృక్షాలను ఉపయోగించటం మొదలుపెట్టారు. దక్షిణాదిలో రైలుమార్గాల నిర్మాణం కోసం మలబార్ తీరంలో వేలకొద్దీ టేకుచెట్లను కొట్టివేసారు.[17]

**అటవీ చట్టాలు, నిబంధనలు :**

రైలుమార్గాల నిర్మాణం ఒక్కసారిగా ఆర్థికంగా పెనుభారం అయ్యింది. కలప లభ్యత క్రమంగా తగ్గుతూవచ్చింది. అంటే అటవీఉత్పత్తుల సరఫరాకు పరిమితులు ఉన్న విషయం వలసపాలకులకు అర్థమైంది. అటవీ వనరుల లభ్యత తగ్గిపోతున్నందు వలన, ఆంగ్ల సామ్రాజ్య విస్తరణకు కావలసిన ముడి పదార్థాల కొరతను అధి గమించేందుకు, అటవీవనరులను నియంత్రించటం అత్యంత ఆవశ్యకమని వలసపాలకులు భావించినట్లున్నారు. అందుకోసం 1864లో ప్రత్యేకంగా అటవీశాఖను ఏర్పాటు చేసుకున్నారు. 1865లో ఒక అటవీ చట్టాన్ని తీసుకొనివచ్చారు. చెట్లగుబురులతో నిండిన ఏ భూమినయినా ప్రభుత్వం తన అధీనంలోకి తెచ్చుకొనేందుకు ఈ చట్టం వీలుకల్పిస్తుంది. అయితే వ్యక్తుల, సామూహిక

హక్కులకు భంగం వాటిల్లకుండా ఉండాలి. 1878లో మరింత కఠినమైన అటవీచట్టాన్ని తెచ్చారు. అడవులమీద ఆంగ్లేయులకు తిరుగులేని నియంత్రణకు ఈ చట్టం వీలు కల్పిస్తుంది. 1865లో యిచ్చిన కొన్ని రాయితీలను ఈ చట్టం తొలగించింది. ప్రభుత్వం వ్యక్తులకు గాని, సమూహాలకు గాని స్పష్టంగా మంజూరు చేయని హక్కులను తొలగించారు. శతాబ్దాలనుండి సంప్రదాయకంగా కొనసాగుతున్న అలిఖిత ఏర్పాట్లు, హక్కులను, సదుపాయాలను రద్దు చేశారు.[18]

1878 ఇండియన్ ఫారెస్టు చట్టంద్వారా భారతదేశపు అడవులమీద, అటవీవనరులమీద వలసప్రభుత్వం తనకు తానుగా తిరుగులేని అధికారాలను దఖలుపర్చుకొంది. అడవులు, అటవీవనరుల, ఉత్పత్తులమీద సార్వభౌమాధికారం వలస ప్రభుత్వానిదే అని ఈ చట్టం ప్రకటించింది. 1878 చట్టం చేయటానికి ముందుజరిగిన చర్చలలో టిప్పుసుల్తాన్, మరికొందరు పూర్వపు రాజులు కొన్ని రకాల వృక్షాలపై ముఖ్యంగా టేకువృక్షాలను రాచవృక్షాలు (Royal Trees) ప్రకటించి, వాటిపై పూర్తి హక్కు భుక్తాలు రాజ్యానిదే నని స్పష్టంచేశారు కాబట్టి, తాము ఇప్పుడు రాజ్యం ఏలుతున్నాం కనుక తమకు అట్టి హక్కుభుక్తాలు ఉన్నాయని ప్రకటించుకొన్నారు. ఉన్న కొద్దిపాటి సాక్ష్యాధారాలును తమకు అనుకూలంగా మార్చుకొని, తరతరాలనుండి అటవీ పుత్రులకు, స్థానికులకు ఉన్న హక్కులను బలవంతంగా లాక్కున్నారు. భారతదేశపు గతాన్ని తమకు అనుకూలంగా మలుచుకొని ప్రజల హక్కులను కాలరాయటమే వలసపాలకుల విధానం. వారి ఉద్దేశ్యంలో గ్రామీణ సమాజాలు, ప్రకృతికి, పర్యావరణ పరిరక్షణకు పూర్తి వ్యతిరేకులు. పర్యావరణాన్ని కాపాడాలన్న స్పృహ కూడా స్థానికులకు లేదని వారు గాఢంగా నమ్మి, వారికి హక్కులు యిస్తే వారు అడవులను పూర్తిగా ధ్వంసం చేస్తారని దుష్ప్రచారం చేశారు. జాతిపరమైన జనగణన, సర్వేక్షణలలో సమాజాన్ని కొన్ని గుంపులుగా, కుటుంబాలుగా, వ్యక్తులుగా, విభజించి వారిని లెక్కించటానికి అనువైన యూనిట్లుగా కుదించారు. అదేవిధంగా వనవాసులును తెగలుగా, కులాలుగా విడగొట్టారు. అడవులను కూడా జాతిపరంగా వర్గీకరించారు. జీవమున్న చెట్లను, మనుష్యులను, ప్రకృతి వనరులను జాతిపరవర్గీకరణ వారి వలసప్రాజెక్టులో భాగంగా సామ్రాజ్యవాద లక్ష్యాలకోసమే చేశారు.[19]

దేశంలో వివిధప్రాంతాలను కలుపుతూ కొండచరియలు తొలిచి రహదారులకు అనువుగా నిర్మాణాలు మొదలుపెట్టేందుకు అడ్డంగా ఉన్న అడవులను విచక్షణా

రహితంగా నరికివేసారు. ఈ అడవుల విధ్వంసం కొండజాతిప్రజలు ఎక్కువగా నివసించే ప్రాంతాలలో జరిగింది. అడవుల విధ్వంసం కారణంగా గిరిజనులు నష్టపోగా, ప్రభుత్వం వారి కష్టాలను మరింత ఎక్కువచేసింది. పోడుసాగును నిషేధించింది. అంతేకాక అడవులలోకి వారి ప్రవేశాన్ని నిషేధించింది.

సామాన్య రైతులకు అడవులు శరణార్థి కేంద్రాలు. తమ పశువులను మేపుకొనేవారు, వంట చెఱకును ఏరుకొనేవారు. పూలు, పండ్లను, తేనె, ఔషధ మొక్కలను సేకరించి వాడుకొనేవారు లేదా అమ్ముకొనేవారు. కాని వాటిని రక్షిత అడవులుగా ప్రకటించాక వాటిలోకి ప్రవేశం నిషేధించబడటంతో వంటచెఱకు, పశుగ్రాసం దొరకక నానాయాతనలు పడ్డారు. అటవీ సంపదను అంచనా వెయ్యటానికి పంపబడ్డ అధికారులు అడవులలోకి స్థానికులకు అనుమతులు కొనసాగిస్తే, అనతికాలంలోనే అడవులు విధ్వంసం చేయబడతాయని, నేలకోతకు గురిఅవుతుందని (Soil erosion), కొండచరియలు విరిగిపడతాయని, నీటి బుగ్గలు (Springs) ఎండిపోతాయని (Dessication), కనుక అటవీపరిరక్షణ అత్యావశక్యమని నివేదికలు మీద నివేదికలు యిచ్చారు. బొంబే ప్రెసిడెన్సీ మొదటి కన్జర్వేటర్ డా॥ గిబ్సన్ 1850లో మలబారుతీరంలో పూడిక అవసరం అయిన నదులు, ఏరులు, వాగులు, వంకలు, సముద్రపాయల జాబితాను తయారుచేశాడు. ఆనాటి వనరులను ప్రత్యక్షంగా చూడకుండానే, కొద్దిమంది తమ జ్ఞాపకాల ఆధారంగా పూర్వం అవి ఎలా ఉండేవో, ప్రస్తుతం ఎలా ఉన్నాయో చెప్పిన వివరాల ఆధారంగానే తన నివేదికను తయారుచేశాడు.

**జీవావరణ సామ్రాజ్యవాదం :**

అలెగ్జాండర్ గిబ్సన్‌తోపాటు, హ్యూక్లెఘోర్న్ (Hugh cleghorn) (మైసూరు), ఎడ్వర్డ్ బెలఫోర్ (మద్రాసు) మొదలైన వృక్షశాస్త్రజ్ఞులు పాలకుల అభిప్రాయాన్ని ప్రభావితం చేసినవారిలో ప్రముఖులు. లార్డ్ డల్‌హౌసీ అడవులపై వలసపాలకుల పెత్తనానికి తెరతీసిన వారిలో ప్రముఖుడు. వృక్షసంపద తరిగిపోవటానికి స్థానిక ప్రజలను బాధ్యులుగా చేసాడు, కఱవుకాటకాలకు కూడా వారినే బాధ్యులుగా చేశాడు. చెట్లను పరిరక్షించే జ్ఞానం, ఆసక్తి, వ్యూహం, స్థానికులకు లేదని ఆయన తేల్చాడు.[20]

వలసపాలనకాలంలో మొదలయిన జీవావరణ సామ్రాజ్యవాదం (ecological imperialism) ను అనేకరకాలుగా గుర్తించవచ్చు. ఎంపికచేయబడ్డ కొన్ని జాతుల

వృక్షాలను తమ వ్యాపార వాణిజ్య ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని వృక్ష సంపదను దోచుకున్నారు. వాటిని వేగంగా తిరిగి పెంచేందుకు ప్రయత్నంచేశారు. ఆ వృక్ష జాతులమీద చట్టాలు చేసి నియంత్రణకు పూనుకొన్నారు. నిర్దేశిత ప్రమాణాలకు అనుగుణంగా ఆ చెట్లను పెంచేందుకు శాస్త్రాధ్యాయనాలు చేశారు (Selvi cultural science). ఒక పద్ధతి ప్రకారం వాటిని పెకలించటానికి, వాటిని వర్గీకరణచేసి, వయసు నిర్ణయించి, గుర్తించారు. ఎన్నిరకాల వృక్షాలు ఉన్నాయో గుర్తించి, నమోదుచేశారు. అడవులను తమ పాలనకిందకు తెచ్చుకొన్న తర్వాత, వాటిని కాపాడటానికి ఒక ప్రత్యేక పాలనావ్యవస్థను ఏర్పాటు చేశారు. కఠినమైన శిక్షాస్మృతిని రూపొందించారు.[21]

రెవిన్యూ అవసరాలు, వ్యాపారపంటల విస్తరణ, గనుల పరిశ్రమ అభివృద్ధి, రైల్వేలనిర్మాణం అడవులమీద విపరీతమయిన ప్రభావాన్ని 19వ శతాబ్దిలో చూపాయి. రైల్వేనెట్‌వర్క్ అన్ని వలసపాలిత దేశాలలో కంటె భారతీయ దేశంలోనే పెద్దది. 1921 నాటికి 37 వేలమైళ్ళ నిడివిగల రైలుమార్గం నిర్మాణం జరిగింది. రేపు పట్టణాలను, ప్రధాన పట్టణాలను, వ్యవసాయ కేంద్రాలను అనుసంధానం చేస్తూ వ్యవసాయ ఉత్పత్తుల ఎగుమతికి, తయారీ వస్తువుల దిగుమతికి వీలుగా రైలుమార్గాలు నిర్మించారు. రైలుపట్టాలమధ్య వేసే దుంగలుగానూ, రైళ్ళకు ఇంధనంగానూ పెద్దపెట్టున కలపను తరలించారు. అడవులను మార్కెట్ ఆర్థికవ్యవస్థతో అనుసంధానం చేసారు.

బ్రాండిస్ మొట్టమొదటి ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ ఫారెస్ట్స్‌గా నియమించబడ్డారు. బర్మాలోని టేకు వృక్షాలను కేవలం బ్రిటీషు నౌకానిర్మాణానికి మాత్రమే అందుబాటులోకి తెచ్చిన ఘనమైన చరిత్ర ఆయనకు ఉన్నది. మొత్తం 19సంవత్సరాలు ఆ పదవిలో ఉన్నాడు. అనేక నివేదికలు తయారుచేసాడు. వాటి ఆధారంగానే అటవీశాఖ పనితీరును, ఆదాయాన్ని మెరుగుపర్చారు. అడవులనుండి రాబడిని పెంచటమే ప్రధానలక్ష్యంగా ఉండేది. 1920 నాటికి రాష్ట్రాల పరిధిలోని అడవులద్వారా రాబడి నాలుగురెట్లు పెరిగింది. 1880లో 5.5 మిలియన్ల (55 లక్షల) రూపాయలుగా ఉన్న ఆదాయం 1920 నాటికి 21 మిలియన్లు (2.1 కోట్లు) రూపాయలు అయింది.

ముడిపదార్థాలను, వ్యవసాయోత్పత్తులను తరలించేందుకు రైలుమార్గాల నిర్మాణం అత్యంత అవశ్యకం అయ్యాయి. 1857 విప్లవంతర్వాత వలస ప్రభుత్వానికి పన్నుల

ద్వారా వచ్చే రాబడి పడిపోయింది. ప్రభుత్వం తీవ్ర ఆర్థిక సంక్షోభంలో కూరుకుపోయింది. దీనితో మరింతగా రెవిన్యూ పెంచుకొనే మార్గాలవైపు వారు అన్వేషించారు. అడవులు, అటవీవనరులు వారి ధనదాహాన్ని, రెవిన్యూ అవసరాలను తీర్చగలవని వారు అంచనావేసి అడవులను పూర్తిగావారి అధీనంలోకి తెచ్చుకున్నారు[22].

**1878 అటవీచట్టం :**

1865లో ఒక చట్టాన్ని తెచ్చారు. ఎంతో చర్చజరిగిన తర్వాత 1878లో ఇండియన్ ఫారెస్టు చట్టాన్ని చేశారు. 1871లో భారతీయ నేరస్థతెగల చట్టాన్ని చేశారు. ఆ చట్టం పుట్టుకకు, అటవీచట్టం పుట్టుకకు సామీప్యం ఉందికూడా. 19వ శతాబ్దంలో జాన్ స్టువార్డ్ మిల్, మెకాలే, క్రైస్తవ మత మార్పిడి ఉద్యమం (evangelical movement) ల ప్రభావం వలసపాలకులమీద ప్రగాఢంగా ఉంది. ఉమ్మడి సామాజిక వ్యవస్థలు, వనరులపై ఉమ్మడి యాజమాన్యం, ఉమ్మడిహక్కులు వ్యక్తుల చొరవను ప్రోత్సాహించవని, అవి వనరుల వృధా వినియోగానికి దారి తీస్తుందని వలసపాలకులు, అధికారులు, ఆంగ్ల వ్యాపారులు, క్రైస్తవ మతప్రచారకులు (Missionaries) బలంగా నమ్మారు.

ప్రభుత్వానికి పన్నులరూపంలో ఎక్కువ రాబడి రావాలంటే ఉమ్మడి వ్యవస్థల స్థానంలో ప్రైవేటు వ్యవస్థలు వచ్చినప్పుడే ఉత్పాదకత, ఉత్పత్తి పెరిగి పన్నులరాబడి పెరుగుతుందని వారు సూత్రీకరించారు. ప్రైవేటు ఆస్తి, యాజమాన్యహక్కులు లేకుండా ఉత్పత్తిని, ఉత్పాదకతను పెంచటం అసాధ్యమని వారు నమ్మి అందుకు అనుగుణమైన విధానాలు రూపొందించారు. భూపరిపాలనా విధానాలు స్థూలంగా సామ్రాజ్యవాద లక్ష్యాలకు అనుగుణంగానే రూపొందించారు[23].

సాగుచెయ్యని భూములన్నీ ప్రభుత్వానికి చెందుతాయని చట్టంచేశారు. టేకు, గంధం వృక్షాలపై పూర్తి గుత్తాధిపత్య నియంత్రణ ప్రభుత్వానిదే. అడవులపై గుత్తాధిపత్యం ఏనాటినుండో పాలకులదే కాబట్టి వలసపాలకులు తామూ అదేబాటలో నడిచామని చెప్పుకున్నారు. అడవులలో అక్కడక్కడా కొన్నిచెట్ల సముదాయాలను పవిత్రమైనవిగా భావించి, వాటిజోలికి వెళ్ళరు. వాటిని పదిలంగా కాపాడుతారు. అట్టి వృక్షసముదాయాలను 'పవిత్ర ఉపవనాలు' (sacred groves) అని పిలుస్తారు. పవిత్ర ఉపవనాలు ప్రపంచవ్యాప్తంగా ఉన్న అడవులలో అన్నిచోట్లా దర్శనమిస్తాయి. వనభోజనాలకు, వనవిహారాలకు, వేటాడటానికి అడవులలో కొన్ని

ప్రాంతాలను కేటాయించేవారు. ఈ రెండూ ప్రభుత్వ జోక్యానికి ఉదాహరణలుగా చూపారు.

'ఎమినెంట్ డొమైన్' సూత్రాన్ని అనుసరించి ప్రజాప్రయోజనాల దృష్ట్యా అటవీభూములపై పూర్తి హక్కుభుక్తాలు ప్రభుత్వానిదేనని స్పష్టంచేశారు. అయితే ఈ సూత్రం ప్రకారం ప్రభుత్వం తీసుకొన్న భూముల నిమిత్తంగా వనవాసులకు ఎట్టి నష్టపరిహారం చెల్లించలేదు. ఆదివాసులు, గిరిజనులు తరతరాలనుండి అడవులలో ఉంటున్నారు. వారికి ఎట్టినష్టపరిహారం చెల్లించకుండా, అడవులన్నీ ప్రభుత్వానివేనని ప్రకటించి, వారిని అడవులనుండి వెళ్ళగొట్టారు. తరతరాలనుండి అటవీభూములపై పెరుగుతున్న వృక్షాలును, మొక్కలను వంటచెఱకుకోసమో, పశు గ్రాసంకోసమో ఉపయోగిస్తున్న గ్రామీణులకు ఆ భూములపై ఎటువంటి హక్కులేకుండా కూడా చేశారు. ఎందుకంటె అటువంటి హక్కును వారికి ఎవ్వరూ యివ్వలేదట, అందుకు అనుమతికూడా లేదుట. సంప్రదాయంగా వస్తున్నది ప్రత్యేక సౌకర్యమే తప్ప ప్రత్యేక హక్కుకాదట. హక్కులను ఉల్లంఘించకూడదు. హక్కులు ఎత్తివేస్తే నష్టపరిహారం చెల్లించాలి. కాని "సౌకర్యాలుగా (Previlage) వాడుకొంటున్నవాటిని నియంత్రించ వచ్చు. రద్దుచేయవచ్చు" అన్న వాదనను తీసుకొనివచ్చారు. గెజిట్‌లో యిచ్చిన ఒక సామాన్య ప్రకటనతో అటవీభూములను స్వంతం చేసుకొన్నారు. తమకున్న హక్కును లిఖితపూర్వకంగా చూపించగలిగినవారికి మాత్రమే నష్టపరిహారం వర్తిస్తుందని, లిఖితపూర్వక హక్కుకు సాక్ష్యాధారాలు చూపించలేని అనుభవదార్లకు వారు తరతరాలనుండి ఆభూముల ఫలసాయాన్ని అనుభవిస్తున్నా, అడవులలోనే నివాసం ఉన్నా వారికి ఎట్టి హక్కు ఉండదని కూడా తేల్చిచెప్పారు. నిరక్షరులైన అటవీపుత్రులకు, గ్రామీణులకు ఇది ఏకపక్షంగా వారికున్న సంప్రదాయహక్కును లాక్కోవడమే[24].

1878 చట్టం ప్రకారం అడవులను 3 రకాలుగా వర్గీకరించారు. రిజర్వుడు, రక్షిత, గ్రామీణ అడవులుగా వర్గీకరించారు. రిజర్వుడు అడవులుగా వర్గీకరించబడిన వాటిపై పూర్తి హక్కుభుక్తాలు ప్రభుత్వానివే. ఆ అడవులలో తరతరాలనుండి నివాసం ఉన్నవారికి గాని, ఆ అడవులచుట్టూ ఉన్న గ్రామాలలో నివశిస్తున్నవారికి గాని రిజర్వుడు అడవులలోకి ప్రవేశం లేకుండా నిషేధించబడ్డది. స్వీయ వినియోగానికి సైతం అటవీ ఉత్పత్తులపై స్థానికులకు ఎట్టి అనుమతులు లేవు.

రక్షితఅడవులమీదకూడా నియంత్రణ ప్రభుత్వానిదే. అవి కూడా ప్రభుత్వానికి చెందినవే. అయితే స్థానికులకు కొన్ని అనుమతులను యిస్తారు. విలువైన, మేలుజాతి వృక్షజాతుల జోలికి స్థానికులు వెళ్ళకూడదు. పశువులను మేపుకోవటానికి, వంటచెఱకు ఏరుకోవటానికి అనుమతి ఉన్నప్పటికీ, ఎప్పుడయినా సరే అనుమతి నిరాకరించవచ్చు. వలస సామ్రాజ్యపు కలప అవసరాలు పెరిగిన తర్వాత, రక్షిత అడవులపై ప్రభుత్వానికి ఉన్న పరిమిత అధికారాలు వలన పెద్దగా ప్రయోజనం కలగటం లేదని భావించి, అనేక రక్షిత అడవులను రిజర్వుడు అడవులుగా వర్గీకరించారు. 1878లో 14000 చదరపు మైళ్ళ విస్తీర్ణం కలిగి ఉన్న అడవులను కంపెని ప్రభుత్వం తన అధీనంలోకి తీసుకొంది. 1890 నాటికి 81,400 చదరపు మైళ్ళ అడవులను రిజర్వుడు అడవులు, 3300 చదరపు మైళ్ళ రక్షిత అడవులు ప్రభుత్వ ప్రత్యక్ష నియంత్రణక్రిందకు వచ్చాయి. తూర్పు భారతదేశంలో అనేకవేలమంది ఆదివాసీ తెగలకు చెందినవారు తరతరాలు వారసత్వంగా సాగుచేసుకుంటున్న భూములను కోల్పోయారు. బీహార్‌లో సింఘ్‌భూమ్ జిల్లాలో అటవీశాఖ ఆక్రమణల కారణంగా హుతెగ (Ho)కు చెందిన వేలాదిమంది ఆదివాసీలు తమ భూములను కోల్పోయారు. రిజర్వు అడవులకు హద్దులు నిర్ణయించే క్రమంలో వారు ఆ భూములను కోల్పోయారు. అటవీశాఖ చేసిన దురాక్రమణ అటవీశాఖకు ఆ తెగవారికి మధ్య ఘర్షణలకు కారణం అయింది.

1894లో జర్మన్ వృక్షశాస్త్ర వేత్త వోల్కర్ (Voelcker) చేసిన సిఫారసులకు అనుగుణంగా ఇంకొక చట్టాన్ని తీసుకొనివచ్చారు. అడవులను నాల్గు రకాలుగా రిజర్వుడు, రక్షిత, గ్రామీణ, ప్రైవేటుగా వర్గీకరించారు. సమృద్ధిగా వర్షాలు కురవటానికి కావలసిన విస్తీర్ణంలో అడవులు లేకపోతే, వ్యవసాయోత్పత్తి తగ్గి, భూమిశిస్తు పడిపోతుంది కాబట్టి ఆ మేర అడవుల విధ్వంసాన్ని అరికట్టాలని ఆయన పేర్కొన్నారు. దీర్ఘకాలంలో పర్యావరణ సమతుల్యతను కాపాడుకోవటానికి కూడా అడవులు అవసరం అవుతాయి, విచక్షణా రహితంగా వాటిని ధ్వంసం చెయ్యవద్దని చెప్పాడు. వాణిజ్యపరంగా కలప ఉత్పత్తికే పెద్దపీటవేసినప్పటికీ పర్యావరణ పరంగా కొన్ని జాగ్రత్తలు తీసుకోవటం మొదలుపెట్టారు.

పోడు వ్యవసాయాన్ని (shifting Agriculture) రిజర్వు అడవులలో నిషేధించారు. దానిమీద ఆధారపడి అనేకమంది బ్రతికేవారు మిగిలిన హక్కులను కుదించటమో, ఎత్తివేయటమో చేశారు. రక్షిత (Protected) అడవులలో నిబంధనలను కొంతమేర సడలించినప్పటికి నష్టపరిహారం చెల్లింపు ప్రశ్న లేనేలేదు. దానివలన వనవాసులు

తీవ్రంగా నష్టపొయ్యారు. ఇతర అడవులలో సైతం పశువులనుమేపటం, కొమ్మలు కత్తిరించటం, కొమ్మలు విరవటం, కొన్ని రకాల వృక్షజాతులను కోతకు గురిచేయటం (Harvesting) పూర్తిగా నిషేధించారు. వాణిజ్య, పారిశ్రామిక అవసరాలకు ఉపయోగపడే వృక్షజాతుల చెట్లసాగు, పెంపకం, దిగుబడులమీద అధికారం ప్రభుత్వానికి దఖలుపర్చుకోవటంకోసమే అడవులను వర్గీకరణచేశారు.

**నిర్వాసితులైన వనవాసులు, గిరిజనులు :**

19వ శతాబ్దిలో సైతం భారతదేశరైతులు ఇతరులమీదకంటె తమ జీవనోపాధికోసం ప్రకృతిపైనే ఎక్కువ ఆధారపడ్డారు. ప్రకృతితో మమేకం అయ్యారు. సహజీవనం చేశారు. ప్రకృతిని ఆరాధించారు. ప్రకృతి యిచ్చే పండ్లు, పూలు, కూరగాయలు, ఔషధాలు, మూలికలు (మొక్కల వేళ్ళు), వేటద్వారా లభ్యమయ్యే మాంసంలపైన ఎక్కువ ఆధారపడ్డారు. తమకు కావలసినవాటికోసం అడవులమీద, అటవీ ఉత్పత్తులమీద ఆధారపడేవారు. ఇతరులమీదకంటె ప్రకృతిమీదే ఎక్కువగా ఆధారపడి బ్రతికేవారి జీవితాలలో అటవీచట్టాలు పెనుమార్పులకు కారణం అయ్యాయి. అభయారణ్యాలు, రక్షిత అడవులు, 'శాస్త్రీయ అటవీవిధానాలు' పేరుతో అటవీ ప్రవేశాల నిషేధాలు ప్రకృతితో వారికున్న బంధాన్ని త్రెంచివేసాయి. స్వేచ్ఛగా తిరుగాడే వారి స్వేచ్ఛకు సంకెళ్ళు వేసారు. తరతరాలుగా సంచరిస్తున్న అటవీ ప్రాంతాలనుండి సంచారతెగలను బయటకు నెట్టివేసారు. అందుకుగాను వలసపాలకులు వాడిన పదాలైన 'పరిరక్షణ', 'శాస్త్రీయ అటవీ యాజమాన్య పద్ధతులను' వాటియొక్క సాంఘిక, రాజకీయ భావజాలకోణాలనుండే అర్థం చేసుకోవాలి.

ఇక్కడ 'పరిరక్షణ' అంటే స్థానికుల హక్కులను హరించటం, సంప్రదాయ వినియోగాన్ని నియంత్రించటం లేదా అడ్డుకట్టవేయటం అని అర్థం చేసుకోవాలి. పశుగ్రాసంకోసం, వంటచెఱకుకోసం గ్రామీణుల దురాశ అడవులు వినాశానికి కారణం అన్న భావనను బాగా వ్యాప్తి చేశారు. అడవులపట్ల అపూర్వమైన వృక్షజాతులపట్ల స్థానికులకు ఎట్టి అవగాహనలేదని, పర్యావరణ పరంగా అవి ఎట్టి ముఖ్యమైన పనిచేస్తున్నయో అవగాహన లేదని ప్రచారం చేసారు. ఇందుకు 1852లో బీజాలు నాటారు. ఈస్టిండియా కంపెనీకి అందచేసిన ఒక ఆంగ్లేయులబృంద నివేదిక అడవులపై నియంత్రణకు సిఫారసుచేసింది. జలవనరుల పరిరక్షణకు, నీటి నాణ్యతను కాపాడటానికి, నదీపరివాహక ప్రాంతాల పరిరక్షణకు (Catchment Protection) కోసం నియంత్రణ అవసరమని. స్థానికులు వారి, వారి

పశువుల అవసరాలకోసం అడవులను విచక్షణారహితంగా ధ్వంసం చేసారని, వారి దురాశకు ప్రకృతి నాశనం అవుతుందని పేర్కొన్నారు. పర్యావరణ క్షీణత (Environmentel degradation)ను నిరోధించే బాధ్యత ప్రభుత్వం చేపట్టాలని వ్రాసారు.

**అటవీ ఉత్పత్తుల దోపిడీ :**

అడవులను ఆవిధంగా జనసామాన్యానికి అందుబాటులోకి లేకుండా చేసి, వాటిని పరిరక్షించి వాటిద్వారా గరిష్ఠస్థాయిలో దీర్ఘకాలంలో దిగుబడి పొందాలనే (Maximum sustainable yield) లక్ష్యంతోనే 'శాస్త్రీయ యాజమాన్యపు' పద్ధతులపేరుతో అటవీవనరుల దోపిడీకి తెరదీశారు. అటవీఅభివృద్ధి ప్రణాళికలను రచించారు. శాస్త్రీయంగా మొక్కలను, చెట్లను పెంచవలసినతీరు తెన్నులను, తీసుకోవాల్సిన జాగ్రత్తలను, పెద్దవయిన వృక్షాలను పడగొట్టవలసిన ఆవృత్తి (cycles) ల గురించి స్వల్పకాలంలో అధిక దిగుబడి సాగించేందుకు మెరుగైన పద్ధతులను ఆ బృందం సిఫారసుచేసింది.

"భారతదేశంలో అడవులను దుర్వినియోగం చేయటంలో నైతిక, సామాజిక ఆంక్షలు లేనికారణంగా వ్యక్తుల అవసరాలు సామాజిక ప్రయోజనం రెండూ ఒకదానితో మరొకటి పొసగవు".[25] అని ప్రభుత్వం స్పష్టంచేసింది. అనేక వృక్షజాతులతో విస్తరించిన అడవులను క్రమంగా వ్యాపారపరంగా విలువైన వృక్షజాతుల చెట్ల అడవులుగా మార్చటమే అటవీశాఖకు యిచ్చిన నియంత్రిత అటవీ పెంపకపు అజెండా (Silvicultural agenda). మొదటిగా సాల్, టేకు, దేవదారు జాతులను వ్యాపారపరంగా ప్రధానమైనవిగా గుర్తించారు. రైల్వేలకు, నౌకానిర్మాణానికి, సైనిక అవసరాలకు అవి ఏంతో ముఖ్యమైనవి కనుక వాటిని ప్రధానమైన వృక్షజాతులుగా గుర్తించి, వాటిపెంపకాన్ని ప్రోత్సాహించారు. సాల్, టేకు, దేవదారు చెట్లను పెంచటం, వాటిని పెకలించటం, తిరిగి పెంచటం 'నియంత్రిత అటవీ పెంపక పరిశోధన'లో కీలకమైన అంశాలు అయ్యాయి. ఆ కారణంగా పశువులు మేపటానికి, పోడుసాగుకు వీలుగా చెట్లను తగలబెట్టటాన్ని నిషేధించారు. నిషేధం కారణంగా చట్టాన్ని ఉల్లంఘించినవారి సంఖ్య పెరిగింది. అదే సమయంలో ప్రభుత్వానికి రాబడి విపరీతంగా పెరిగింది. ఉదాహరణకు మధ్యపరగణాలలో అడవుల విస్తీర్ణం 16,941 చదరపు మైళ్ళు. 1900 నుండి 1930 వరకు ఈ విస్తీర్ణం పెరగకపోయినా, అటవీరాబడి రు.10.5 మిలియన్ల (ఒక కోటి 5 లక్షల) రూపాయల నుండి 60 మిలియన్ల (6 కోట్ల రూపాయల)కు పెరిగింది.[26]

వాణిజ్య పంటల సాగు వ్యాప్తి చెందటంతో జీవసంబంధ ఉత్పత్తులకు (Bio Mass Products) కు డిమాండ్ బాగా పెరగటంతో వ్యవసాయభూములు, అడవులు విపరీత దోపిడీకి గురికాబడ్డాయి. వాణిజ్య ప్రయోజనాలు ఉన్న చోట్ల శాస్త్రీయపద్ధతులను ప్రవేశపెట్టారు. మిగిలిన చోట్ల నిర్లక్ష్యం చేసారు. దానితో అడవులు నిర్మూలనకు గురి అయ్యాయి. ఫలితంగా ఎన్నో జీవజాతుల మొక్కలు నశించిపొయ్యాయి.

లాభాలు తెచ్చిపెట్టే వృక్షజాతులను గుర్తించి, వాటిని ఇబ్బడిముబ్బడిగా పెంచేందుకు పరిశోధనను విస్తృతపరిచారు. మొదటి ప్రపంచయుద్ధం అందుకు తగిన ప్రోత్సాహాన్ని యిచ్చింది. అంతగా ఎక్కువగా తెలియని వృక్షజాతుల గురించి ఆ తరువాత పరిశోధనలు చేయటం మొదలుపెట్టారు. అవి వాణిజ్యపరంగా ఎలా ఉపయోగపడతాయన్న అంశం మీద పరిశోధనను కేంద్రీకరించారు. పుల్లలు, టీపెట్టెలు, గుజ్జులకోసం ఏ చెట్లకలపలు ఎక్కువగా ఉపయోగపడతాయో చూశారు. టేకు, సాల్‌ల లభ్యత తగ్గిన తర్వాత రైల్వే స్లీపర్లగా ఉపయోగపడే ప్రత్యామ్నాయాలకోసం చూశారు. 1906లో డెహ్రాడూన్‌లో అటవీ పరిశోధనా సంస్థను నెలకొల్పారు. అక్కడ పరిశోధన ప్రధానంగా కలప సాంకేతిక పరిజ్ఞానం (Wood Technology), కలప పరీక్ష (Timber Testing), కలపను సీజనింగు, (Timber Seasoning) మీద చేశారు.

నిర్లక్ష్యం చేయబడ్డ తక్కువజాతివృక్షాలపై పరిశోధన చేసారు. వంతెనల నిర్మాణానికి, వాటిని వాణిజ్యపరంగా ఉపయోగించుకోవటానికి గల అవకాశాలను పరిశీలించారు. మంచి జాతివృక్షాలను అంతవరకు పండని ప్రాంతాలలో వేస్తే ఎదగటానికి గల అవకాశాలనూ అన్వేషించారు. నర్సరీలను పెంచారు. టేకు, సాలు, గంధం మహోగని మొక్కలను ఆఫ్రికాకు పెద్దపెట్టున ఎగుమతి చేశారు. దేశీయ జాతులను ఇతరకాలనీలలో పండించటం, ఇతర దేశాలజాతుల మొక్కలను భారతదేశంలో పండించటం, సంకరజాతి విత్తనాలను, మొక్కలను తయారు చేశారు. వాణిజ్యపరంగా లాభసాటిగా ఉండే వృక్షాల సాగు, వాటిని ఉపయోగిస్తున్నతీరే జనాభా పెరుగుదలకంటె అడవుల నాశనానికి కారణం.

అడవులు వలసీకరణ ప్రాజెక్టుకు చట్టాలు పునాదులు వేసాయి. అధికారులు ఆప్రాజెక్టు అమలులో భాగస్వాములు అయ్యారు. శాస్త్రీయ పరిజ్ఞానం వాణిజ్య

లక్ష్యాలకోసం వినియోగించారు. ఈ మొత్తం ప్రక్రియలో గ్రామీణ సమాజాలకు, వనవాసులకు, గిరిజనులకు ఎట్టి పాత్ర లేదు. మొదటగా అడవులను వారికి అందుబాటులోకి లేకుండా చేశాడు. అడవులలోకి వారి ప్రవేశాన్ని నిషేధించారు. ఆంగ్లేయులు రాకముందు వారికి అడవులే జీవనాధారం. అడవులమీద పెత్తనం అంతా వలసప్రభుత్వానిదే అని చట్టం చేసాక, అడవులును వాణిజ్యపరంగా ఉపయోగించుకోవటం మొదలుపెట్టాక, వాటి జీవవైవిధ్యం క్రమంగా అంతరించి పోయింది. వాణిజ్యపరంగా ఉపయోగపడే వృక్షజాతులనే పెంచారు. మిగిలిన వాటిని నిర్లక్ష్యంచేశారు. దీనితో అడవులు వాణిజ్య జీవన ఉత్పత్తుల కేంద్రాలుగా మారిపొయ్యాయి.

ఆంగ్లేయులు అడుగుపెట్టకముందు అడవులను వాణిజ్యపరంగా చూడలేదు. అటవీభూములకోసం, ఉత్పత్తులకోసం పోటీయేలేదు. వలసపాలన స్వయం సమృద్ధితో అలరాలుతున్న గ్రామీణ సమాజాలను చిన్నాభిన్నం చేసింది. కుల, వర్గ అసమానతలు ఎక్కువగా ఉన్నప్పటికీ వలసపాలనకు ముందున్న భారతదేశపు సమాజంలో ఒకరకమైన స్థిరత్వం, పొందిక (coherence) ఉండేవి. అందువల్ల రాజులుమారినా, రాజ్యాలు మారినా గ్రామస్థాయిలో పెద్దమార్పులు ఉండేవి కావు.[27]

సంస్కృతి, సంప్రదాయాలలో యిమిడిఉన్న దూరదృష్టి ఉత్పత్తి ప్రక్రియలు నిర్విఘ్నంగా కొనసాగటానికి దోహదం చేసేది. అంతేకాక ఆదివాసులు, గిరిజనతెగలు, గ్రామీణులు ప్రకృతి ప్రాముఖ్యాన్ని అర్థంచేసుకొని, తమజీవితాలు పర్యావరణ ఆరోగ్యంతో ముడిపడి ఉన్నాయని తెలుసుకొని, మొక్కలు, చెట్లు పెంపకం, వాటిని ఉపయోగించుకొనే పద్ధతులు ప్రకృతి పునరుత్పత్తి ఆవృతికి దోహదం చేసేటట్లుగా రూపొందించుకొన్నారు. పరిరక్షణ సూత్రానికి విలువను యిచ్చేవారు. దేశీయ పర్యావరణ పరిరక్షణ సూత్రాలు సంస్కృతి సంప్రదాయాలలో భాగంగానే అనాదిగా జనం వాటిని గౌరవిస్తూ ప్రేమిస్తూ, ఆచరిస్తూవచ్చారు.[28] అడవులను వాణిజ్యపరంగా ఉపయోగించుకోవటం దేశీయులకు తెలియదు. వలసపాలకులు సహజవనరులను చేజిక్కించుకోవటానికి పన్నిన పన్నాగంలో గతకాలపు సమతుల్యతను దెబ్బతీసారు.

**ఉమ్మడివనరులపై హక్కులు కోల్పోయిన అడవిబిడ్డలు :**

జీవావరణ మార్పులకు, రైతుల నిరసన ఉద్యమాలకు మధ్య సంబంధాన్ని మొదటగా విశ్లేషణచేసిన వాడు ఎరిక్ స్టోక్స్. ఉత్తర, మధ్య భారతదేశంలో వచ్చిన రైతుల తిరుగుబాట్ల వెనుక వలసపాలకుల భూ, అటవీ విధానలవల్ల వచ్చిన వ్యవస్థాగత, జీవావరణమార్పులే ప్రధానకారణాలుగా ఆయన పేర్కొన్నాడు. సంచారజాతులు, పశువులను మేపేవృత్తికి చెందిన సమాజాలు, ముఖ్యంగా గుజ్జర్లు, భట్టీలు, రంగర్లు జీవనాధారాలు కోల్పోయి తిరుగుబాటులలో పాల్గొన్నారు. బెంగాల్‌లో మిద్నపూర్ జిల్లాలో సంతాల్‌లు రైల్వేల నిర్మాణంవల్ల అడవులలోకి స్వేచ్ఛగా సంచరించటానికి, చేపలుపట్టుకోవటానికి అంతకు ముందున్న స్వేచ్ఛను కోల్పోయారు. రైల్వేల నిర్మాణానికి వారు తీవ్రంగా వ్యతిరేకించారు. తమ స్వేచ్ఛను హరించే ఇనుపయంత్రాలుగా వాటిని చూశారు. సంచారజాతుల ప్రజలను అడవులలోకి ప్రవేశాన్ని నిషేధించటమే కాక, వారిని స్థిరనివాసం ఏర్పాటు చేసుకోమని ఒత్తిడి చేశారు.

మధ్యపరగణాల గోండ్లు చెట్లను తగులబెట్టి బూడిదచేసి దుక్కిదున్ని చిరుధాన్యాలు– మొక్కజొన్నలు, జొన్నలు పండించి తినేవారు. అందుకు టేకుచెట్లబూడిద సారవంతమైన ఎరువుగా ఉపయోగపడేది. అటవీశాఖకు టేకు, సాల్ వృక్షజాతులు వాణిజ్యపరంగా చాలా విలువైనవి. దానితో అటవీశాఖకు గోండులకు ప్రత్యక్ష ఘర్షణ మొదలయింది. 1878 చట్టం పోడువ్యవసాయాన్ని నియంత్రించాలని, వీలయితే నిషేధించాలని నిర్దేశిస్తుంది. దీనితో అనేకచోట్ల సాయుధ తిరుగుబాట్లు జరిగాయి.[29]

1878 చట్టంద్వారా అడవులను వలసప్రభుత్వం తన అధీనంలోకి తెచ్చుకోవటం రాజకీయంగా, సామాజికంగా, పర్యావరణపరంగా ఒక పెద్దమలుపు. అడవులమీద, అటవీ వనరుల ఉత్పత్తులమీద గుత్తాధిపత్యంవలన ప్రభుత్వ అధికారాలకు, జోక్యానికి పరిమితులు లేకుండా పోయింది. దాని ఫలితంగా స్థానిక సమాజాలకు ఉండే హక్కులు పరిమితం అయ్యాయి. సామాజికంగా, స్థానికులకు అటవీ ఉత్పత్తులకు దూరం అవటంలో సంప్రదాయంగా వనరుల ఉత్పత్తి తీరుతెన్నులలో గణనీయమైన మార్పువచ్చింది. పర్యావరణపరంగా, వ్యాపారీకరణ ప్రక్రియలోభాగంగా అడవుల స్వభావమే మారిపోయింది. జీవవైవిధ్యానికి కేంద్రాలుగా విలసిల్లిన అడవులను వలసపాలకులకు లాభాలు తెచ్చిపెట్టగలిగిన వాణిజ్యవృక్షజాతుల పెంపకం తోటలుగా కాలక్రమంలో మార్చివేశారు.

అటవీ చట్టాన్ని కఠినతరంగా అమలుచేసినకారణంగా మొదటి ప్రపంచయుద్ధం ప్రారంభం అయ్యేనాటికి, దేశంలో వాణిజ్యఅటవీసంపద (Forest capital) గణనీయంగా పెరిగింది. అయితే మొదటి ప్రపంచయుద్ధం అవసరాలకు గాను ఆ అటవీసంపదలో ఎక్కువశాతం తరిగిపోయింది. అయితే సాంద్ర శాస్త్రీయపద్ధతులలో వేగంగానే ఆ లోటును భర్తీ చేయకలిగారు. రెండవ ప్రపంచయుద్ధం అవసరాలకుగాను కలప పెద్దపెట్టున కావలసి వచ్చింది. దానితో అడవులను విచక్షణా రహితంగా నరికారు. 1937-1945 మధ్య అంతకుముందు సంవత్సరాలతో పోల్చితే కలప దిగుబడులు 65 శాతం పెరిగాయి. అనధికారంగా కూడా కలపను పెద్దపెట్టున సేకరించారు. దానితో అనేక అడవులు, నాణ్యమైన మేలురకపు వృక్షజాతులు విధ్వంసానికి గురిఅయ్యాయి. స్వాతంత్ర్యం వచ్చేనాటికి అటవీసంపద గణనీయంగా తరలిపోయింది. పేరుకుమాత్రమే అడవులు మిగిలాయి.

## References


1. R.P. Dutt, *India Today*, pp.230-231
2. Cornwallis, Cf. Ibid. p. 232
3. A.B.Keith, *Speeches and Documents on Indian Policy1750-1921*, Vol.I, p. 215
4. R.P. Dutt, India Today, p. 234.
5. R.C.Dutt, The Economic History of India, Vol.II, pp. 34-57.
6. Bipan Chandra, p. 105
7. R. Mukherjee, *Land Problems of India*, p. 16
8. Col. Briggs, *The Present Land Tax in India*, pp. 393 - 416.
9. R. Mukherjee, *Land Problems of India*.
10. Mr. Blackett, M.P.Town of New Castle in 1854 quoted in R.C.Dutt, Vol II. pp. 51-.52
11. R.P.Dutt,op.cit. p. 229.
12. Report of the Captain Wise on Kandesh Bhils, quoted in Report of the Congress Agrarian Committee, p. 85.
13. Sir E. Maclagan, 1919, Ibid.
14. R.P.Dutt, p. 252

15. Madhav Gadgil & Ramachandra Guha (1992): *This Fissured Land: An Ecological History of India*, Oxford University Press.
16. Mark Poffenberger (1992): *Sustaining South East Asia's Forests*
17. Madhav Gadgil & Ramachandra Guha (1992):Ibid
18. Op.cit.
19. Siva Rama Krishnan, K (1995): *Colonialism and Forestry in India:* Imaging the Past in the present Politics, Society for Comparative study of Society and History, Yale University, pp 3-4.
20. Siva Rama Krishnan, K (1995): ibid 5
21. Madhav Gadgil & Ramachandra Guha (1992): Ibid
22. Guha, Ranjit (1989): The Unquiet Woods: *Ecological change and Peasant Resistance in Himalayas,* Oxford University Press.

    Guha, Ranjit (1983): *Elementary Aspects of Peasant Insurgency in India*, Oxford University Press.

    Tucker (1983): *The British Colonial System and The Forests of Western Himalayas in Global deforestation and the 19th Century World Economy*, Duke University Press.
23. Hard.J (1975): *Railways and Expansion of Markets in India,* 1861-1921, Explorations in Economic History, pp. 260-85.
24. Siva Rama Krishnan, K (1995): Ibid p.12
25. Stebbing. E (1992): *The Forest of India,* Vol.1
26. Guha, Ranjit (1989): Ibid
27. Madhav Gadgil & Ramachandra Guha (1992): Ibid, 114
28. Shiva Vandana (1991): *Ecology and Politics of Survival:* Conflicts over Natural Resources in India, Sage Publications.
29. Ibid.




# 7

# దేశీయ పరిశ్రమల విచ్ఛిన్నం

1813 వరకు భారతదేశంతో ఇంగ్లాండుకుగల వాణిజ్యంపై సర్వహక్కులు ఈస్టిండియా కంపెనీకే ఉండేవి. ఆ గుత్తాధిపత్యాన్ని అడ్డుపెట్టుకొని వాణిజ్యం పేరుతో పెద్దఎత్తున భారతదేశ వనరులను దోచుకొని, కంపెనీ వాటిని ఇంగ్లండుకు తరలించింది. ఈస్టిండియా కంపెనీ అక్రమార్జన అవినీతి సంపద చూసి సాటి ఆంగ్లవ్యాపారులు, వాణిజ్య సంస్థలకు కళ్ళుకుట్టాయి. తమకు కూడా భారతదేశంతో వ్యాపారం చేసేందుకు అనుమతులు యివ్వాలని ఆంగ్ల ప్రభుత్వాన్ని వారు వేడుకున్నారు. అదే కాలంలో ఇంగ్లాండ్‌లో కొత్తగా పరిశ్రమలు నెలకొల్పిన ఔత్సాహికులు తమపెట్టుబడులకు, సాహసానికి తగ్గట్లుగా ప్రతిఫలం పొందలేక పోతున్నామని ప్రభుత్వానికి ఫిర్యాదులు చేయటం మొదలుపెట్టారు. వారి ఉత్పత్తులు నాసిరకంగా ఉండటమేకాక, వాటి ఉత్పత్తి వ్యయంకూడా చాలా ఎక్కువగా ఉండటంతో, ఇంగ్లాండ్‌లోనే వారి ఉత్పత్తులకు సరిపడా గిరాకీ ఉండేదికాదు. ఇంగ్లండ్‌లో అంతకుముందెన్నడూ పత్తిని పండించలేదు. వారి నూలు పరిశ్రమకు కావలసిన సరిపడా పత్తి దిగుమతులు కూడా వారికి లభించటం లేదు. దానితో వారు పార్లమెంటు సభ్యులమీద ఒత్తిడి తీసుకొనివచ్చారు.

ఆనాటికే వారి పార్లమెంటరీ వ్యవస్థ మొత్తం అవినీతి మురికికూపంలో కూరుకొని పోయింది. కొనుక్కోగల వాడికే సభ్యత్వం తేలికగా లభించేది. రాజకీయ ఎదుగుదలలో డబ్బు కీలకపాత్ర పోషించేది. ఇంగ్లాండ్ కొత్త పారిశ్రామికవేత్తలు పార్లమెంటు సభ్యులను లంచాలు ఎరచూపి వశపర్చుకొన్నారు. అనతికాలంలోనే పార్లమెంటు వారిచేతుల్లో కీలుబొమ్మ అయిపోయింది. ఇంగ్లాండు మిల్లుయజమానుల ప్రయోజనాలను కాపాడేందుకు వారు ఎంత దూరమైనా వెళ్ళేందుకు సిద్ధమయ్యారు. సుంకాలు లేకుండా పత్తి దిగుమతులకు అనుమతులు యివ్వాలని, తమ (నాసిరకం) ఉత్పత్తులు అమ్ముకోవటానికి జాతీయ, అంతర్జాతీయ మార్కెట్లలో విధానపరంగా అనుకూలమైన నిర్ణయాలు తీసుకోవాలని వారు పార్లమెంటు సభ్యులను డిమాండ్ చేయసాగారు.

ఆంగ్లేయుల ఏలుబడి-అంతులేని దోపిడీ

నూలుమిల్లుల యజమానుల చేతులలో కీలుబొమ్మలుగా మారిన పార్లమెంటు సభ్యులు ప్రభుత్వంమీద ఒత్తిడి తీసుకొని వచ్చారు. 1813లో ఒక పార్లమెంటరీ కమిటీని నూలుమిల్లుల సమస్యల పరస్పర పరిష్కారంకోసం నియమించారు. తిరిగి 1833లో ఇంకొక పార్లమెంటరీ కమిటీని అదే లక్ష్యంతో నియమించారు. రెంటియొక్క మౌలిక ఉద్దేశ్యం ఒకటే. బ్రిటన్ నూలుమిల్లుల ముతక రకాల ఉత్పత్తులు అమ్ముడు పోవటానికి తగిన వాతావరణాన్ని నిర్మించటమే. వారి నాసిరకం ఉత్పత్తులను అమ్ముకోవటానికి, వారికి కావలసిన ముడిపదార్థాలను దిగుమతి చేసుకోవటానికి వారి వలసపాలనలో మ్రగ్గుతున్న భారతదేశం వారి పాలిట కల్పవృక్షంగా, కామధేనువుగా కన్పించింది.

1813కు ముందు ఈస్టిండియా కంపెనీ విధానాలు భారత ఆర్థిక వ్యవస్థను దెబ్బకొట్టినప్పటికీ, ఆ నష్టం, విధ్వంసం కంపెనీ పాలనలో ఉన్న బెంగాల్‌కు, మరికొన్ని ఇతర ప్రాంతాలకు పరిమితం అయింది. మిగిలిన ప్రాంతాలు ఇంకా సస్యశ్యామలంగానే వర్ధిల్లుతున్నాయి. ఆ ప్రాంతాలలో ఉత్పత్తిదారులమధ్య సహజమైన పోటీ నెలకొని, నాణ్యమైన, ఉత్పత్తులు చౌకగా ఉత్పత్తి అవుతున్నాయి. కంపెనీ పాలనలో ఉన్న ప్రాంతాలలో వారు పైకి చెప్పేది ఒకటి. అమలు చేసేది మరొకటి. 'స్వేచ్ఛావాణిజ్యం' అంటే వారికి మాత్రమే స్వేచ్ఛ. ఇతరులకు ఎట్టి వాణిజ్యస్వేచ్ఛలేకుండా చేయటం. 'సంపూర్ణపోటీ' అంటే తమకు పోటీదారులు లేకుండా చేసుకోవటం. అంటే పోటీని మొగ్గలోనే త్రుంచివేయటం. అందుకు హింసాత్మక చర్యలకు సైతం వెనుకాడకపోవటం. 'ప్రైవేటు ఆస్తిహక్కు' అంటే కంపెనీకి మాత్రమే ఆస్తులు కలిగిఉండే హక్కు ఉండటం. ఇతరులకు అట్టి హక్కు లేకుండా చేయటం. మోసం చేసో, హింసించో ఇతరుల ఆస్తులను బలవంతంగా కాజేయటం.

**దేశీయ పరిశ్రమల విధ్వంసం :**

1813 తర్వాత ఈ విధ్వంస ప్రక్రియ మిగిలిన ప్రాంతాలకు సైతం వ్యాపించింది. ఇంగ్లాండ్‌ను పారిశ్రామికంగా అభివృద్ధి చెయ్యాలంటే భారతదేశంలో పరిశ్రమలే లేకుండా చెయ్యాలి. తమదేశంలోనూ, ఇతర పాశ్చాత్యదేశాలలోను గిరాకీ లేని తమ నాసిరకం ఉత్పత్తులు అమ్ముకోవాలంటే, అందుకు తమ వలసపాలనలో మ్రగ్గుతున్న భారతదేశపు మార్కెట్లను పూర్తిగా కైవసం చేసుకోవాలి. భారత తయారీరంగాన్ని పూర్తిగా నిర్వీర్యం చేస్తే కాని, బ్రిటన్ తయారీపరిశ్రమ నిలదొక్కుకోలేదు. భారత

ఉత్పత్తిదారులు అత్యంత నైపుణ్యం కలవారు. కష్టపడి పనిచేసేవారు. అట్టివారివల్ల ఎప్పటికైనా ప్రమాదం ఏర్పడవచ్చు. కనుక వారిని వారి వృత్తులనుండి, వారి పరిశ్రమలనుండి తరిమికొట్టితేనే, ఇంగ్లాండ్‌లోని తయారీ పరిశ్రమ తలఎత్తుకొని నిలబడగల్గుతుంది. నెపోలియన్ బ్రిటన్ ఉత్పత్తులు పాశ్చాత్యరేవుపట్టణాలలో కనపడకూడదని గట్టి ఉత్తర్వులు జారీచేశాడు. తీవ్ర ఒత్తిడికి గురి అయిన ఆంగ్లవ్యాపారులకు, ఉత్పత్తిదారులకు భారతదేశపు మార్కెట్లను తమ ఉత్పత్తులతో నింపటం తప్ప వేరే ప్రత్యామ్నాయం కూడా కన్పించలేదు.[1] పార్లమెంటులో 1813లో చర్చ జరిగినప్పుడు ఒక సభ్యుడు అన్నమాటలు గుర్తుపెట్టుకోదగ్గవి. "ఇంగ్లాండ్ తన ఉత్పత్తులన్నిటిని భారతదేశంమీద బలవంతంగా రుద్దాలి. ఆ దేశంనుండి ఒక వస్తువును కూడా ఇంగ్లాండ్‌కు తీసుకొని రాకూడదు. వారికి మనం చెప్పాలి 'బట్టలు నేయకండి. మీకు కావలసిన వస్త్రాలు మేము ఉత్పత్తి చేసి మీకు సరఫరా చేస్తాం. మాకు ముడిపదార్థం సరఫరా చెయ్యండి చాలు. మీకు బట్టలు నేసి సరఫరా చేసే బాధ్యతను మేము మా భుజాలకు ఎత్తుకుంటాం'. ఈ రకంగా మాట్లాడేవారిని భారతదేశానికి స్నేహితులుగా చెప్పుకోవటం ఆశ్చర్యకరం. నిజానికి వారు ఆ దేశానికి శత్రువులు. ఆ దేశపు పరిశ్రమలను ధ్వంసం చేయటానికి సలహాలు యిచ్చేవారు అంతకంటె మరేమి చెప్తారు?"[2]

ఆ పార్లమెంటు సభ్యుడు ఆనాటి ఆంగ్లవ్యాపారుల, ఉత్పత్తిదారుల ఆకాంక్షల గురించి వెటకారంగా ఆ మాటలు చెప్తున్నాడు. 'యంత్రాలు', 'ఆవిరి ఇంజన్లు' సహాయంతో కూడా బ్రిటన్ వస్త్ర ఉత్పత్తులు భారతదేశపు ఉత్పత్తులముందు దిగదుడుపుగా ఉండేవి. నాణ్యతలోకాని, మన్నికలోకాని, ధరలో కాని భారతీయ వస్త్ర ఉత్పత్తులతో పోటీ చేయగల స్థాయిలో ఒక్క బ్రిటన్ మాత్రమే కాదు. ప్రపంచంలో ఏ దేశమూ కూడా ఆనాడు లేదు. కనీవినీ ఎరుగని సుంకాలు, దురన్యాయాలు. వ్యూహాత్మకంగా ఇంగ్లాండ్ మార్కెట్ నుండి భారతీయ వస్త్రాల బహిష్కరణ లేకుంటే బ్రిటన్ నూలు మిల్లులు పోటీలో నిలబడలేక ఏనాడో సహజంగా మూతపడి ఉండేవి.

బ్రిటీషు పార్లమెంటు నియమించిన రెండు కమిటీలు భారతదేశంలో పనిచేసి వచ్చిన లేదా భారతదేశం పర్యటించి వచ్చిన వారిని విచారించాయి. బ్రిటీషు వస్త్రాలకు భారతదేశపు డిమాండ్ మొదలైన అంశాలపై వారి అభిప్రాయాలను అడిగారు.

వారందరూ ముక్తకంఠంతో ఒక విషయాన్ని సుస్పష్టంచేశారు. భారతదేశానికి బ్రిటీషు వస్త్ర ఉత్పత్తులు అవసరంలేదని, ఆ ఉత్పత్తులను జన బాహుళ్యం వాడకంలోకి తీసుకొని రావటం కష్టసాధ్యమని తేల్చి చెప్పారు. భారతీయ ఉత్పత్తుల మెరుగైన నాణ్యత, ఆ ఉత్పత్తిదారుల అపారకౌశలం ఇందుకు కారణమని భారతదేశంలో దీర్ఘకాలం పనిచేసిన థామస్ మన్రో అభిప్రాయపడ్డారు.[3] బ్రిటీషు ఉన్ని ఉత్పత్తులకు భారతదేశంలో గిరాకీ సృష్టించటం కష్టమని ఆయన తేల్చి చెప్పారు. "నాకు కానుకగా యిచ్చినా పాశ్చాత్యదేశాల శాలువాను నేను వాడలేను" అని కూడా ఆయన అన్నారు. పాశ్చాత్యదేశాలలో బ్రిటీషు ఉన్ని ఉత్పత్తులకు మంచి మోజు ఉండేది. కాని భారతదేశంలో అవి చెల్లుబాటు కావటం కష్టమని మన్రో పేర్కొనటం బ్రిటీషు ఉన్ని ఉత్పత్తుల నాణ్యతను తెలియచేస్తుంది. తనకు ఎంతో అనుభవం ఉన్న ఉన్ని దుస్తులతయారీలో కూడా భారత్‌కంటె ఇంగ్లాండ్ ఎంతో వెనుకబడి ఉంటే, ఇంక నూలు ఉత్పత్తుల గురించి చెప్పవలసిన పనిలేదు. అలాంటి పరిస్థితులలో బ్రిటీషువారు భారత్ మార్కెట్లను కైవసం చేసుకోవటానికి అనేక పాశవిక చర్యలకు పాల్పడ్డారు.

**అణిచివేత చర్యలు :**

ఇంగ్లాండ్ నుండి దిగుమతి అయ్యే ఉత్పత్తులపై దిగుమతి సుంకాలు విధించలేదు. కొన్ని రకాల ఉత్పత్తులపై విధించినా, అవి నామమాత్రంగానే ఉండేటట్లు చూశారు. ఇందుకు భిన్నంగా భారతదేశం నుండి ఇంగ్లాండ్‌కు ఎగుమతి అయ్యే ఉత్పత్తులపై ఇంగ్లాండులో దిగుమతి సుంకాలను విధించటమే కాక, అవి చాలా ఎక్కువగా ఉండేటట్లు చూశారు. హెచ్చు దిగుమతి సుంకాలవల్ల ఇంగ్లండ్‌లో భారతీయ ఉత్పత్తుల ధరలు విపరీతంగా పెరిగాయి. దానితో భారతీయ వస్త్ర ఉత్పత్తులకు, ఇతర ఉత్పత్తులకు ఇంగ్లాండ్‌లో గిరాకీ గణనీయంగా పడిపోయింది. అలాగే ఆక్ట్రాయ్ పన్ను నిబంధనలను, పన్నురేట్లను తమకు అనుకూలంగా మలుచుకొని, భారతదేశంలోని వ్యాపారులకు తయారైన ఉత్పత్తుల ఎగుమతి కంటె ముడిపదార్థాల ఎగుమతి లాభదాయకంగా (గ్రుడ్డిలోమెల్ల) చేసారు. అదే విధంగా ఇంగ్లాండ్‌నుండి ఉత్పత్తులను దిగుమతి చేసుకొని, వాటిని స్థానిక మార్కెట్లలలో అమ్ముకోవటం సులభతరం, లాభదాయకం అయ్యేటట్లు భారతదేశ వ్యాపారవర్గాలను ప్రభావితం చేశారు.

భారతదేశపు ఉత్పత్తిదారుల నైపుణ్యాలకు గల కారణాలు అధ్యయనం చేసి, ప్రింటింగ్, డైయింగ్ రహస్యాలను తెలుసుకొని, ఆంగ్ల ఉత్పత్తిదారులకు వాటిలో శిక్షణ

యిప్పించారు. భారత చేనేత కార్మికుల హస్తకళా నైపుణ్యానికి అబ్బురపడి, ఆ తర్వాత అసూయచెంది, వారి చేతివేళ్ళను నరికించారు. తమ రాజకీయ అధికారాన్ని క్రమంగా విస్తృతపరుచుకొని, దేశీయ మార్కెట్లను పూర్తిగా తమ అధీనంలోకి తెచ్చుకొని, తమ ఉత్పత్తులను భారతీయులమీద బలవంతంగా రుద్దారు.

భారతీయ పరిశ్రమలను నామరూపాలు లేకుండా చేయటానికి సామ, దాన, భేద, దండోపాయాలన్నిటిని తనను తాను రక్షించుకోలేని స్థితిలో ఉన్న దేశీయ పరిశ్రమలపై వారు ప్రయోగించారు. భారతీయుల నైపుణ్యాలు తరతరాలనుండి వస్తున్నాయి. అది వారి వారసత్వ సంపద. ఎంత అణచివేసినా వారిలోని సృజనాత్మకత నాశనం అయ్యేదికాదు. వారి పట్టుదల, కష్టించి పనిచేసే వారి స్వభావం అన్ని అణచివేతలను ఎదుర్కొని నిలబడగలగటం వారికి అలవాటుగా మారింది. వెయ్యిసంవత్సరాల విదేశీ ముస్లిం పాలనలో సైతం వారు ఎన్నో దుర్మార్గాలను ఎదుర్కొని, తమ హస్తకళలను, నిర్మాణ కౌశలాన్ని, ఉత్పత్తిలో నేర్పరితనాన్ని కాపాడుకొన్నారు. అందుకే ఆంగ్లేయులకు వారి అణచివేతకు, విధ్వంసానికి చాలా దశాబ్దాలు పట్టింది. రాజకీయ, ఆర్థిక, సైనిక అస్త్రాలను ఒకే ఒకలక్ష్యంతో ప్రయోగించారు. భారతీయ పరిశ్రమలను, చేతిపనివారిని, కళాకారులను సమూలంగా నాశనం చెయ్యటమే ఆ లక్ష్యం. ఇంతచేసినా బ్రిటన్ ఉత్పత్తులు భారతీయ ఉత్పత్తులతో పోటీపడలేకపోవటం ఆశ్చర్యకరం. వారి పారిశ్రామిక విప్లవంయొక్క డొల్లతనాన్ని తెలుసుకోవటానికి ఈ ఒక్క అంశమే చాలు. తనంతతానుగా పోటీకి నిలువలేని వారి పరిశ్రమలు నిలదొక్కుకోవటానికి అనేక తప్పుడు, అనైతిక, అప్రజాస్వామిక పద్ధతులు వారికి కావలసివచ్చాయి.

భారతదేశంనుండి ఎగుమతులను నిరుత్సాహపర్చటానికి, ఇంగ్లాండ్‌నుండి దిగుమతులను గణనీయంగా పెంచటానికి వారు ఒడిగట్టిన 'దిగుమతి సుంకాల యుద్ధాల' గురించి ఎంత చెప్పినా, ఎన్నిసార్లు చెప్పినా తక్కువే అవుతుంది. భారత పరిశ్రమలకు, వాటి ఎగుమతులకు ఎన్నో అవరోధాలు, అడ్డంకులు కల్పించారు. ఇంతకుముందు చెప్పినట్లుగా భారతదేశంనుండి ఒక్క వస్తువుకూడా ఇంగ్లాండ్‌కు దిగుమతి అవకూడదని, ఇంగ్లాండ్ ఉత్పత్తుల వాడకం పెంచాలని వారు కట్టుదిట్టమైన వ్యూహాన్ని అమలుచేశారు. ఉదాహరణకు భారతదేశంనుండి దిగుమతి చేసుకొనే నూలు వస్త్రాలపై రెండు రకాల సుంకాలు విధించారు. బ్రిటన్ రేవుపట్టణాలకు చేరిన

తర్వాత దిగుమతి సుంకాన్ని, బ్రిటీషు మార్కెట్లకు చేరిన తర్వాత మార్కెటింగ్ సుంకాన్ని విధించారు. పూర్తిగా నూలు వస్త్రాలపై 10 శాతం దిగుమతిసుంకాన్ని, 27.5 శాతం మార్కెటింగ్ సుంకాన్ని విధించారు. 'కాలికో'ల మీద ఏకంగా 72 శాతం సుంకాన్ని విధించారు. ఇక ఇంగ్లాండ్‌లో వాడకం నిషేధింపబడిన కొన్నిరకాల వస్త్రాలను, కేవలం ఎగుమతి చేయటానికి మాత్రమే ఉద్దేశించబడిన వాటిని, దిగుమతి చేసుకున్న వెంటనే ఇతర పాశ్చాత్య దేశాలకు ఎగుమతి చెయ్యాలి. వాటిని ఇంగ్లాండ్ మార్కెట్‌లలో కనీసం ప్రదర్శించకూడదు. అట్టి ఉత్పత్తులపై 68.3 శాతం దిగుమతి సుంకాన్ని రేవుపట్టణాలలోనే చెల్లించాలి. రాబర్ట్ బ్రౌన్ అనే ఆంగ్ల వస్త్రవ్యాపారి ఈ దిగుమతి సుంకాల వివరాలను 1813లో పార్లమెంటరీ కమిటీకి వివరించాడు. 1830వ దశకంలో భారతదేశంలో చేతితో తయారైన నాజూకైన, సున్నితమైన నూలు వస్త్రం వందరూపాయలకు ఇంగ్లాండ్‌లో లభ్యమయితే, ఇంచుమించుగా అలాంటి నాణ్యత కల్గినవస్త్రాన్ని తయారుచేయటానికి ఇంగ్లాండ్‌కు 450 రూపాయలు ఖర్చు అయ్యేదని ఆయన ఉదాహరణంగా చెప్పారు. అన్ని రకాల దిగుమతి, మార్కెటింగ్ సుంకాలు చెల్లించిన తర్వాత స్థితేయిది.

ఇంగ్లాండ్‌నుండి దిగుమతి అయ్యే ఉత్పత్తులపై భారతదేశంలో ఏ స్థాయిలో దిగుమతి సుంకాలు విధించేవారో ఇప్పుడు తెలుసుకుందాం. బ్రిటన్ ఉత్పత్తులపై ఎటువంటి దిగుమతి సుంకాలు ఉండేవి కావు. కొన్నిరకాల ఉత్పత్తులపై కేవలం 2.5 శాతం మాత్రమే సుంకం విధించేవారు. ఇంగ్లాండ్ ప్రభుత్వానికి తెలియకుండా ఆ దేశపు ఉత్పత్తుల దిగుమతులపై ఎటువంటి సుంకము విధించకూడదని 1813లో ఒక చట్టాన్ని సైతం తీసుకొని వచ్చారు.

**దేశంలో ఉత్పత్తే జరగకుండా పన్నాగం :**

దిగుమతి సుంకాలు ఈ విధంగా ఉంటే, ఇంకా ప్రవేశపన్ను (ఆక్ట్రాయ్ పన్ను)ను వారికి ప్రయోజనకరంగా ఉండేటట్లుగా మలుచుకున్న తీరు ఆశ్చర్యం కల్గిస్తుంది. దేశంలో ఉత్పత్తి అయిన వస్తువులను దేశీయ మార్కెట్లలోకి రాకుండా నిరోధిస్తేనే దిగుమతి అవుతున్న బ్రిటన్ ఉత్పత్తులను అమ్ముకోవటం సాధ్యం అవుతుంది. దేశీయ వ్యాపారులు మాత్రమే ఆక్ట్రాయ్ పన్నును చెల్లించాలి. ఆంగ్ల వ్యాపారస్థులు, కంపెనీ ఎటువంటి పన్నును స్థానికంగా అమ్ముకోవటానికి చెల్లించ నవసరంలేదు. పన్నుభారంతో స్థానిక ఉత్పత్తులు స్థానిక మార్కెట్లకు రాకుండా చేయటం ఒక లక్ష్యం అయితే, అసలు

ఉత్పత్తి జరగకుండా చూడటమే అసలు పన్నాగం. అమ్ము కోలేనప్పుడు, ఉత్పత్తి చేయరుకదా. స్థానిక వ్యాపారులు దేశీయ ఉత్పత్తిదారుల నుండి కొనుగోలు చేయటాన్ని వారు నిరోధించలేరు. కాని వాటిని అమ్మటాన్ని నిరోధించకల్గితే, వారు కొనుగోలు చేయలేరు. కొనుగోళ్ళు లేకపోతే, ఉత్పత్తి జరగదు. ఈ సాధారణ సూత్రాన్ని అర్థం చేసుకొని, ప్రత్యక్షంగా భారతీయ వ్యాపారులను, పరోక్షంగా ఉత్పత్తి దారులను కోలుకోలేని దెబ్బ కొట్టారు. ఫ్రెడరిక్ షోర్ అనే ఆంగ్లేయుడు ఈ విషయాన్ని చాలాబాగా వివరించాడు. "ప్రజలు పేదరికంలోకి నెట్టివేయబడుతున్నారని, దేశీయ వ్యాపారాలు సన్నగిల్లుతున్నాయని, ఉత్పత్తిదారులు, తయారీదారుల సంఖ్య పెరగటానికి బదులు తరుగుతున్నదని అనేక ఫిర్యాదులు వింటున్నాం. ఆ ఫిర్యాదులగురించి ఆశ్చర్యం దేనికి? మనం విధించిన సుంకాలవల్ల, పన్నులవల్ల వ్యాపారులు నానా అగచాట్లకు గురి అవుతు న్నప్పుడు, అంతకంటె వేరే ఫలితాలు ఎక్కడనుండి వస్తాయి?..... ఇలా మరి కొంతకాలం కొనసాగితే, భారతదేశం కేవలం తన అవసరాలకు మాత్రమే సరిపడా తిండిగింజలను, కొన్ని మట్టిపాత్రలను, కొన్ని ముతక వస్త్రాలను తప్ప ఇంకేమీ ఉత్పత్తి చేయలేని దుస్థితికి నెట్టివేయబడుతుంది. పెనుభారమైన ఈ అవరోధాలు, అడ్డంకులు (వివిధ సుంకాలు) తొలగించి చూడండి. అప్పుడు పరిస్థితులన్నీ ఆశ్చర్యకరంగా వారికి అనుకూలంగా మారిపోతాయి".[4]

ఆంగ్లేయులు అనుసరించిన ఆక్ట్రాయ్ పన్ను విధాన అణచివేత స్వభావం గురించి అనేకమంది వ్రాసారు. 1826లో వచ్చిన ఛార్లెస్ ట్రావిల్యాన్ నివేదికలో "దేశమంతటా వ్యాపారులనుండి లంచాలు గుంజుతున్నారు. నిర్బంధవసూళ్ళు మామూలైపోయాయి. తయారీదారులలో అనేకమందిని చంపివేశారు. సుంకాలు వసూలుచేసే ఉద్యోగులకు యిచ్చే జీతభత్యాలు సరిపోక వ్యాపారుల ముక్కు పిండివసూలుచేస్తున్నారు. అంతర్గత వ్యాపారం అచేతన స్థితికి చేరింది. పర్యాటకులను, ప్రయాణీకులను సైతం వదిలిపెట్టటంలేదు. సుంకాలు వసూలు చేసే కార్యాలయాల, కేంద్రాల ముందు నుండి నడిచి వెళ్ళే మహిళల గౌరవమర్యాదలకు భద్రతలేదు. ఈ మొత్తం అణచివేతవ్యవస్థను దానిద్వారావచ్చే ఆదాయం తక్కువైనా, కావాలని దాన్ని నిలిపి ఉంచారు" అని పేర్కొన్నారు.[5]

లార్డ్ ఎలిన్‌బోరో మాటల్లో "235 రకాల వస్తువులపై అంతర్గత సుంకాలు విధిస్తున్నారు. వ్యక్తిగత గృహఅవసరాలకు ఉపయోగించే ప్రతివస్తువుమీద సుంకం

విధించారు. సుంకం చెల్లించకుండా వాడుతున్నారేమోనని సోదాలు నిర్వహించేవారు. ఈ సోదాలు ప్రజలకు ప్రయాస కలిగించేవి. అవమానకరంగా ఉండేవి. వాటివలన వసూలు అయిన సుంకాలకంటె అవి సృష్టించిన మానసిక సంక్షోభం పెద్దది. అంతేకాదు, నైతిక విలువలమీద వాటి ప్రభావం చాలా ఎక్కువ. ప్రతి వ్యాపారి, ప్రతి ఉత్పత్తిదారుడు, ప్రతి పర్యాటకుడు తమ ఆస్తుల భద్రతకోసం, సౌకర్యంకోసం, తమ స్త్రీల గౌరవమర్యాదల కోసం ప్రభుత్వ అధికారులతో లాలూచీ పడుతున్నారు. ఆంగ్లేయ ఉద్యోగులను, అధికారులను నైతికంగా ఈ పద్ధతులు దిగజారుస్తున్నాయి. విదేశీ వ్యాపారులంటేనే అసహ్యించుకొనే స్థితికి భారతీయులు వచ్చారు. బ్రిటీషువారు ప్రవేశపెట్టిన ఆక్ట్రాయ్ విధానం అణచివేతకు మారుపేరై, అవినీతికి ఆలవాలమయి, భారతీయ వ్యాపారుల ఆర్థిక, సామాజిక, నైతిక మూలాలను శాశ్వతంగా దెబ్బతీసింది".[6]

**నౌకానిర్మాణ పరిశ్రమను ధ్వంసం చేసినతీరు :**

ఈస్టిండియా కంపెనీ రాకముందు కలకత్తా, మచిలీపట్నం, కోరంగి సూరత్, కాలికట్, క్విలన్‌లలో నౌకల నిర్మాణం జరిగేది. బంగాళాఖాతం, అరేబియా సముద్ర జలాల్లో భారతీయ నౌకలు వస్తువులను రవాణాచేస్తూ గొప్ప విదేశీ వాణిజ్యం చేసేవి. 16వ శతాబ్దంలో మరాఠాలు గొప్ప నావికాశక్తి కలిగినవారిగా పేరు పొందారు. శివాజీ భోన్‌స్లే పశ్చిమతీరాన్ని పోర్చుగీసువారి బెడదనుండి నిరంతరం రక్షిస్తూ ఉండేవారు. 17వ శతాబ్దం మొదట్లో బెంగాల్‌లో 4 నుండి 5 వేలవరకు నౌకలు ఉండేవని చరిత్ర చెప్తున్నది. ఆ నౌకలన్నీ బెంగాల్‌లో తయారైనవే. నౌకా నిర్మాణానికి కలకత్తా రేవుపట్టణం ప్రసిద్ధిగాంచింది. 18వ శతాబ్ది మధ్యవరకు నౌకానిర్మాణం వర్ధిల్లింది. బ్రిటీషువారి ప్రవేశంతో నౌకాయానానికి, నౌకానిర్మాణ సంస్కృతికి తీవ్రమైన అడ్డంకులు ఎదురయ్యాయి.

1757 తర్వాత బ్రిటీషు నౌకలకు వాణిజ్యమార్గాలపై గుత్తాధిపత్యహక్కును కల్పించారు. భారతీయ వ్యాపారులు అంతకుముందు ఉపయోగించిన వాణిజ్యమార్గాలపై కూడా కంపెనీనౌకలకు, బ్రిటీషు నౌకలకే సర్వహక్కులు ఇచ్చారు. భారతదేశంలోని రేవుపట్టణాలకు వస్తురవాణాచేసే భారతవాణిజ్య నౌకలమీదకూడా సుంకాలు విధించారు. దీనితో భారతీయ నౌకానిర్మాణానికి తీవ్ర విఘాతం కల్గింది. అయితే నెపోలియన్‌తో జరిపిన యుద్ధాల సందర్భంగా, తన నౌకాయాన విధానాలలో తీసుకొని వచ్చిన మార్పు బ్రిటీషువారి స్వార్థబుద్ధిని బయటపెట్టుతుంది.

 1803లో జరిగిన ఆ యుద్ధంలో, 1,73,000 టన్నులు రవాణా చేయగల సామర్థ్యాన్ని బ్రిటన్ కోల్పోయింది. దానితో బ్రిటన్ సముద్రవ్యాపారం సజావుగా కొనసాగటానికి భారతీయుల నౌకలను, నావికులను ఉపయోగించుకొని వారి పబ్బం గడుపుకొన్నారు. ఆ యుద్ధం ముగియగానే తిరిగి అంతకు ముందులాగా భారతీయనౌకలపట్ల, నావికులపట్ల వివక్షచూపారు.

నౌకల నిర్మాణంలో భారతీయులకు అపారమైన కౌశలం ఉంది. ఎన్నో నౌకలను భారతీయులు నిర్మాణం చేశారు. ఒకనాడు భారతీయ నౌకా నిర్మాణ పరిశ్రమ మూడు పువ్వులు, ఆరుకాయలుగా వర్ధిల్లింది. భారత నౌకానిర్మాణ పరిశ్రమ ఇచ్చిన పోటీకి ఇంగ్లాండ్ తట్టుకోలేకపోయింది. భారతదేశ నౌకా నిర్మాణ పరిశ్రమను నిషేధించండని బ్రిటన్ పార్లమెంటుకు మొరపెట్టుకున్నారు. 1813లో మొదటి చట్టం వచ్చింది. 350 టన్నుల కంటె తక్కువ రవాణా సామర్థ్యంగల ఓడలను భారతదేశం ఇంగ్లాండ్‌ల మధ్య రవాణాకు ఉపయోగించకూడదని నిబంధన తీసుకొని వచ్చింది ఆ చట్టం. అప్పటివరకు హిందూదేశంలో తయారవుతున్న ఓడలు అటు సముద్రంలోను, ఇటు నదులలోనూ రవాణాకు ఉపకరించేవిగా ఉండేవి. దానితో బెంగాల్‌లో తయారయ్యే నౌకలలో షుమారు 40 శాతం భారత్-ఇంగ్లాండ్ మధ్య వాణిజ్యానికి పనికిరాకుండా పొయ్యాయి. ఆ మరుసటి సంవత్సరం అంటే 1814లో మరొక చట్టాన్ని తీసుకొని వచ్చారు. భారతదేశంలో తయారైన వాణిజ్య నౌకలు అమెరికాకు, యూరప్‌కు సరుకు రవాణా చేయకూడదని నిషేధించారు. చైనాకు సరుకు రవాణా చేయటానికి అనుమతి ఉన్నా అది లాభదాయకమైంది కాదు. ఇంతకుముందు కలకత్తానుండి చైనాకు సరుకు తీసుకొని వెళ్ళి, ఆ సరుకును అక్కడ దించి చైనానుండి తేయాకును లండన్‌కు తీసుకొని వెళ్ళేవారు. లండన్ నుండి సరుకు తీసుకొని కలకత్తా వచ్చేవారు. ఎప్పుడైతే లండన్ వెళ్ళేందుకు అనుమతి లేదో, చైనా వరకే వెళ్లి హిందూదేశానికే తిరిగి రావాలి. అయితే చైనా ఉత్పత్తులకు భారతదేశంలో అప్పట్లో గిరాకీలేదు కనుక, చైనానుండి ఖాళీగానే భారతదేశం రావాలి కనుక వాణిజ్య నౌకాయానం గిట్టుబాటు కాకుండా చేశారు. (అప్పట్లో భారతీయులు 'టీ' త్రాగేవారు కాదు).

18వ దశాబ్దపు చివరి నాలుగు దశాబ్దాలలో నౌకా నిర్మాణ పరిశ్రమ తిరిగి పుంజుకొంది. అందుకు ఆంగ్లేయులు నౌకా నిర్మాణకళలో భారతీయ శ్రామికులకు ఉన్న ప్రతిభను గుర్తించటమే కారణం. కారుచౌకగా కలకత్తాలో అనేక నౌకలను నిర్మాణం చేసారు. 1800 సంవత్సరం నాటికి, కలకత్తాలో 10వేల టన్నుల సామర్థ్యం

గల వాణిజ్యనౌకలను నిర్మాణం చేసినట్లు ఆనాటి గవర్నర్ జనరల్ చెప్పాడు. 1801-1839 మధ్య 327 నౌకలు ఒక కలకత్తాలోనే నిర్మాణం చేసారు. అంత హఠాత్తుగా ఆంగ్లేయులకు కలకత్తాలో నౌకానిర్మాణాన్ని ప్రోత్సహించటానికి కేవలం ఆర్థిక అంశాలే కారణం. భారతీయుల నౌకానిర్మాణ కౌశలాన్ని ఆంగ్ల పెట్టుబడిదారులు గుర్తించటమే కాక, వారు నిర్మించే నౌకలయొక్క నిర్మాణ క్రమంలో భారతీయ పద్ధతులను అవి మెరుగైనవి కాబట్టి ప్రవేశపెట్టారు. నౌకల నిర్మాణానికి అవసరమైన కలప, ఇనుము, ఇత్తడి మొదలైన వాటిని తగిన రీతిలో వినియోగించి మన్నిక, అందం, ఉపయోగం కలబోసిన నౌకలను నిర్మాణం చేయటంలో భారతీయులకున్న నేర్పరితనం ఆనాటికి మరెవ్వరికీ లేదు.

అంతేకాక భారతదేశంలో తయారుచేసిన నౌక జీవితకాలం 20 సంవత్సరాల కంటె ఎక్కువగా ఉండేది. అదే బ్రిటీషువారు నిర్మాణం చేసిన నౌకల జీవితకాలం 10-12 సంవత్సరాలకు మించేదికాదు. ఈ లోపుగానే అవి మరమత్తులకు వచ్చేవి. భారతీయ నౌకలు ఆవిధంగా ఎక్కువకాలం మన్నేవి. వాటి ఉత్పత్తివ్యయం తక్కువగా ఉండేది. వాటి తరుగుదల (Depreciation) కు చాలాకాలం పట్టేది. దానితో భారతీయ నౌకల విలువ ఎక్కువగా ఉండేది. వాటి ఖరీదు తక్కువ కనుక సరుకు రవాణాకు వసూలు చేసే రుసుం కూడా తక్కువగా ఉండేది.

లెఫ్టినెంట్ కల్నల్ వాకర్ భారతీయ నౌకల మన్నిక గురించి ఇలా చెప్పాడు. "బొంబాయిలో నిర్మాణమయిన భారతీయ నౌకలు 14-15 సంవత్సరాల నిరంతర సముద్రయానం తర్వాత కూడా దృఢంగా ఉండటంతో బ్రిటీష్ నావికాదళం కొనేది. పాశ్చాత్యులు తయారుచేసిన ఏ నౌక కూడా 6 సార్లు కంటె భారతదేశం వెళ్ళిరావటానికి పనికి వచ్చేది కాదు"[7] కనుక భారతదేశపు నౌకలను నౌకాదళానికి కొనుగోలు చేయటం సహేతుకంగా ఉంటుందని బ్రిటన్ పార్లమెంటుకు హితవు చెప్పాడు. ఎందుకంటె మరమత్తుల కింద ఎక్కువ ఖర్చు పెట్టవలసిన పనిలేదు. తక్కువ ధరకే లభిస్తాయి. ఎక్కువకాలం మన్నికగా ఉంటాయి. అయినప్పటికి ఇంగ్లాండ్ భారతీయ నౌకానిర్మాణ పరిశ్రమను సర్వనాశనం చెయ్యా లనుకొంది. ఖచ్చితంగా అది ఆర్థిక సిద్ధాంతాలకు వ్యతిరేకం. కాని ప్రముఖ ఆర్థికశాస్త్రవేత్త శ్రీమతి రాబిన్సన్ చెప్పినట్లుగా వారి స్వంత

ప్రయోజనానికి భంగం వాటిల్లుతుందని వారు భావించినపుడు, మిగిలినదేదీ వారికి ప్రాధాన్యం కాదు. ఫ్రెడరిక్ లిస్ట్ అనే జర్మనీకి చెందిన ఆర్థికవేత్త ఇంగ్లీషువారి గురించి ఈ విధంగా చెప్పాడు. "ఇంగ్లండ్ ఆవిధంగా ప్రవర్తించటానికి అదేమన్నా మూర్ఖుల దేశమా? ఆడమ్ స్మిత్, జె.బి.సే వంటి ఆర్థికవేత్తల ప్రకారం ఇంగ్లాండ్ ఏ దేశంలో చౌకగా లభిస్తుందో, ఎక్కడ నాణ్యమైన సరుకు దొరుకుతుందో ఆ దేశంనుండి కొనాలి. అలాకాకుండా ఎక్కువ వ్యయంతో అవే వస్తువులు ఉత్పత్తి చేయటం దేనికి? అందుకు కారణం అన్వేషించటం కష్టమయిన పనేమీకాదు. ఇంగ్లాండ్ ఒక తయారీశక్తిగా ఎదుగదల్చుకొంది. అందుకే తక్కువధరకు లభ్యమవుతున్నా, వాటిని కాదని, ఎక్కువ వ్యయంతో ఉత్పత్తి చేసి, క్రమంగా అనుభవం సంపాదించి, బహుకాలాలు తన ప్రయోజనాలను కాపాడుకొనేందుకు ఒక తయారీశక్తిగా ఎదిగింది".[8]

**జాతి వివక్ష :**

భారతీయ నావికులను బ్రిటీషు నౌకలమీద నియమించ వద్దని ఆదేశాలు యిచ్చారు. బ్రిటీషు నౌకలమీద పనిచేయటానికి తగినంతమంది ఆంగ్ల నావికులు దొరకనప్పుడు మాత్రమే, తప్పని పరిస్థితులలో భారతీయ నావికులను పనిలో పెట్టుకొనేవారు. 'ఆంగ్లనావికులు సరిపడా లభ్యం అవటం లేదన్న ధ్రువీకరణ పత్రం చూపిస్తేనే భారతనావికులను తీసుకోవటానికి అనుమతిని యిచ్చేవారు. భారతనావికులకు ఉపాధి లేకుండా చేయటమే దానిలక్ష్యమని వేరే చెప్పనవసరం లేదు. చట్టరీత్యా అమలుచేసిన జాతివివక్షవలన భారతదేశనావికులకు నష్టం జరిగింది. నౌకా రవాణా మీద పెట్టిన ఆంక్షలు జాతిపరమైనవే. ఆంగ్లనౌకలకు వర్తించే రాయితీలు, అనుమతులు భారతీయ నౌకలకు వర్తించవు. ఇక నౌకానిర్మాణాన్ని ఘోరంగా దెబ్బతీసారు. "ఒకప్పుడు ఎంతో వైభోవోపేతంగా వర్ధిల్లిన నౌకానిర్మాణ పరిశ్రమ కుదేలు అయింది. 1850 నాటికే పూర్తిగా అంతరించింది. సాంకేతిక పరిజ్ఞానంలో వచ్చిన మార్పులవల్లో మరి అలాంటి ఇతరకారణాలవల్లో ఈ దుస్థితి ఏర్పడలేదు. ఎందుకంటె ఆవిరితో నడిచే నౌకల రంగప్రవేశానికిముందే ఈ దుర్దశ వచ్చింది. వాస్తవానికి ఆవిరితో నడిచే నౌకలను నిర్మాణం చేయటం అనతికాలంలోనే భారతీయులు నేర్చుకున్నారు. వివక్షాపూరితమైన నౌకాయాన చట్టాలు, కఠినతరమైన నియమనిబంధనలు భారతీయ

నౌకానిర్మాణ పరిశ్రమను చావుదెబ్బకొట్టాయి. ఆ చట్టాలు దేశంలో నౌకానిర్మాణానికి ఉన్న అవకాశాలను ఆవిరి చెయ్యటంతో నిర్మాణ కార్యక్రమాలు స్తంభించి పోయాయి."

అప్రతిష్టకు మారుపేరైన నౌకాయానచట్టాలు ఆధారంగా బ్రిటీషుప్రభుత్వం భారతీయ నౌకానిర్మాణం పరిశ్రమను పూర్తిగా ధ్వంసం చేసిన వైనంగురించి ఒక బ్రిటీషు పార్లమెంట్ సభ్యుడు ఇలా వ్యాఖ్యానించాడు "తూర్పున సముద్రప్రియురాలిని అత్యంత హేయంగా హత్యచేసిన తీరు తప్ప నా మనసుకు మరేదీ గుర్తుకు రావటం లేదు". బ్రిటీషు వారి 'బ్లూబుక్' ఆధారంగా అందుకు సాక్ష్యాధారాలు కూడా యిచ్చాడు.[9]

| సంవత్సరం | నౌకల సంఖ్య | రవాణాసామర్థ్యం (టన్నులు) |
|---|---|---|
| 1857 | 34,286 | 12,19,958 |
| 1898-99 | 2802 | 1,33,033 |
| 1899-00 | 1676 | 1,09,813 |

కేవలం నాలుగు దశాబ్దాలలో భారత నౌకల సంఖ్యలు 34,286 నుండి 1676కు పడిపోవటం గమనించవచ్చు. ఆ నాటి వలసపాలకులు భారతీయ నౌకానిర్మాణాన్ని చరిత్రగా మార్చివేసారు. ఆసియా దేశాలతో వ్యాపారం చెయ్యటానికి 1789 నాటికి పోర్చుగల్‌కు కేవలం 3 నౌకలు మాత్రమే ఉన్నాయి. డచ్‌వారికి 5 నౌకలు, ఫ్రాన్సుకు ఒకే ఒక నౌక మాత్రమే ఉన్నాయి. అమెరికాకు 15 నౌకలు, ఇంగ్లాండుకు 40 పైగా నౌకలు ఉండేవి. విధ్వంసానికి ముందు మొత్తం ఆసియా సముద్రవాణిజ్యం అంతా భారతీయుల చేతులలోనే ఉండేది. వారి నౌకలు చైనా, రష్యా, ఎర్రసముద్రందాక సరుకురవాణా చేస్తూ ఉండేవి. అట్లాంటిక్ మీదుగా కూడా రవాణా చేసేవి. పాశ్చాత్యులకు 'రినైజాన్స్' తర్వాతనే ఆ విషయం తెలిసింది.[10]

20వ శతాబ్దపు మొదట్లో వి.ఓ.చిదంబరం పిళ్ళై మద్రాసులో ఒక నౌకాయాన సంస్థను నెలకొల్పాడు. మొదటి ప్రపంచయుద్ధ సమయంలో ఆయన మంచి వ్యాపారమే చేశాడు. ఆయన విజయం ఆంగ్లేయులకు నచ్చలేదు. కఠినమైన నిబంధనలు అమలుచేసినా ఆయన వ్యాపారం దెబ్బతీయలేక పోయిన కారణంగా, చిదంబరం పిళ్ళైను నిర్బంధించారు. తద్వారా ఆయన స్ఫూర్తిని, ఆయన వ్యాపారాన్ని దెబ్బతీసి, దివాలా తీయించారు.

**ఉక్కుపరిశ్రమను నాశనం చేసిన తీరు :**

ఆంగ్లేయులు భారత ఉక్కు పరిశ్రమను ధ్వంసం చేసిన తీరుసైతం వివక్షకు గుర్తుగా చరిత్రలో నిలిచిపోతుంది. వలసపాలకులు తమ ప్రయోజనాలకోసం ఏవిధంగా దేశీయ పరిశ్రమలను ధ్వంసం చేస్తారో తరతరాలకు తెలియచెప్పే గాథ యిది. భారత ఉక్కుపరిశ్రమ పట్ల వివక్ష 20వ శతాబ్దంవరకు కొనసాగింది.

మొట్టమొదటి నుండి భారతఉక్కు పరిశ్రమకు వారు వ్యతిరేకులు. అనాదిగా భారతీయులకు ఇనుమునుండి ఉక్కుతయారు చేయటంతెలుసు. 6వ శతాబ్దం మొదటకే ఉక్కు తయారుచేశారు. ప్రపంచంలో కెల్లా చక్కటి ఉక్కును తయారుచేసిన ఘనత భారతదేశానిదే. అరబ్బులు ఉక్కుతయారు చేయటం భారతీయుల నుండే నేర్చుకున్నారు. 12వ శతాబ్దం నాటికి డమాస్కస్ ఉక్కు ప్రపంచ ప్రసిద్ధి గాంచింది. భారత ఉక్కు పరిశ్రమే వారికి ప్రేరణ. భారతదేశంలో తయారైన ఉక్కుఖడ్గాలకు ప్రపంచవ్యాప్తి గుర్తింపురావటంతో, వాటికి మంచి గిరాకీ ఉండేది. వలసపాలన తొలినాళ్ళలో బ్రిటీషు సైనికులు ఓడిన భారతీయ సైనికుల కత్తులను తీసుకొనటానికి పోటీపడేవారు. వాటి సామర్థ్యం, పనితీరు ముచ్చట గొలిపేదిగా ఉండటమే అందుకు కారణం ఆంగ్లేయులు భారతీయ లోహపరిశ్రమల సాంకేతిక పరిజ్ఞానాన్ని అధ్యయనం చేసి, ఆకళింపు చేసుకున్నాక, ఆ పరిశ్రమను మిగిలిన పరిశ్రమల మాదిరిగానే ధ్వంసం చేశారు. 18వ శతాబ్ది చివరకే వాటికి సమాధి కట్టారు. వాటిని పునరుద్ధరించటానికి చేసిన ప్రతిప్రయత్నాన్ని నిరోధించారు. నీరు గార్చారు. జాతిపరంగా హేళనచేశారు.

జంషెడ్జీ టాటా మొట్టమొదటి ఆధునిక ఉక్కు కర్మాగారాన్ని ప్రారంభించటానికి పూనుకొన్నప్పుడు, ఆంగ్లేయులనుండి తీవ్రవ్యతిరేకతను ఎదుర్కొన్నారు. 1883లో బ్రిటీషు పార్లమెంటుకు అనుమతులకై అభ్యర్థించారు. పెట్టుబడులను సమకూర్చుకున్నప్పటికి, అనుమతులను యివ్వలేదు. అనేకసార్లు తిరస్కరించారు. ఎట్టకేలకు 1912లో ఆయన కొడుకు హయంలో ఆ కర్మాగారం ఉత్పత్తిని ప్రారంభించింది. (1904లోనే జంషెడ్జీ టాటా మరణించారు) "ఆ కర్మాగారం ఉత్పత్తి చేసిన ప్రతి ఔన్సు ఉక్కును తనే తినివేస్తానని" ఒక వలస అధికారి ఎగతాళి చేసాడు. అయితే జంషెడ్జీ టాటా వారసులు 2006లో బ్రిటీషు ఉక్కుకంపెనీ కోరస్

(Corus) ను హస్తగతం చేసుకోవటాన్ని చూడటానికి దురదృష్టవశాత్తూ ఆ ఆంగ్ల అధికారి లేడు.

టాటాలు ఆధునిక ఉక్కు పరిశ్రమను నెలకొల్పి ముందుకు సాగుతున్న వైనం అనేకమంది భారత ఔత్సాహికులను ఉత్తేజపరిచింది. కాని బ్రిటీషువారు వారిని నిరుత్సాహపర్చటానికి వారికి పరిపాటి అయిన కుటిల పద్ధతులను ప్రయోగించారు. ప్రభుత్వము, ప్రభుత్వ ఆధీనంలోని భారతీయ రైల్వేలు 'బ్రిటీషు స్టాండర్డ్ స్పెసిఫికేషన్ స్టీల్' (B.S.S.S) ను మాత్రమే వాడాలని నిబంధనను తెచ్చారు. వారు నిర్దేశించిన నాణ్యతా ప్రమాణాలు భారతదేశపు ఉక్కు నాణ్యతా ప్రమాణాల కంటె ఎక్కువ. దానితో రైల్వేలకు కావలసిన ఉక్కునంతా దిగుమతిచేసుకోవటం మొదలుపెట్టారు. టాటాలతోపాటు, ఇతర భారతీయ ఉక్కుతయారీదారులు ఆ ప్రమాణాలను అందుకోవటానికి ప్రయత్నించారు.

చట్టంద్వారా నిర్దేశించబడిన బ్రిటీషు నాణ్యతా ప్రమాణాలను అందుకొనే ప్రయత్నంలో, తక్కువ నాణ్యతాప్రమాణాలు గల ఉక్కును తయారుచేయలేక పొయ్యారు. ఇంగ్లండ్‌లో తప్ప మిగిలిన పాశ్చాత్య దేశాలలో చౌకగా లభించే 'నాన్‌బ్రిటీషు స్టాండర్డ్ స్పెసిఫికేషన్ స్టీల్' (N.B.S.S.S) కు ఎక్కువ డిమాండ్ ఉండేది. దానితో భారతదేశ పరిస్థితి రెంటికీ చెడ్డ రేవడి అయ్యింది. బ్రిటీషువారు నిర్దేశించిన నాణ్యతా ప్రమాణాలు గల ఉక్కుఉత్పత్తికి ఎక్కువ వ్యయం అయ్యేది. దానికి డిమాండ్ తక్కువ. ఎక్కువ డిమాండ్ ఉన్న తక్కువ నాణ్యతా ప్రమాణాలు గల ఉక్కును సరఫరా చేయలేకపోయినందున రెండు ప్రపంచయుద్ధాల సందర్భంగానూ 1930 నాటి ఆర్థికమాంద్యం అనంతరకాలంలో పెరిగిన డిమాండ్‌కు తగ్గట్లు ఉక్కు సరఫరాలో భారత్ ఉక్కుపరిశ్రమ వెనుకబడింది. మిగిలినదేశాలు నాన్ బ్రిటీషు స్టాండర్డ్ స్టీలును పెద్దమొత్తంలో ఉత్పత్తి చేసి ఎగుమతిచేసి, లాభాలు ఆర్జించాయి. కాని భారత ఉక్కు ఎగుమతులపై ఇంగ్లాండ్ ఆంక్షలు విధించటంతో, ప్రమాణాలకు అనుగుణంగా ఉత్పత్తి చేసినా ప్రయోజనం లేకపోయింది. ఎగుమతి చేయటానికి అవకాశాలు లేక, విస్తరించటానికి కావలసిన ప్రోత్సాహకాలు లేక ఉక్కు పరిశ్రమ విలవిలలాడింది.

**కాగితం, పంచదార పరిశ్రమల ధ్వంసం :**

నూలు, సిల్కు, స్టీల్, నౌకానిర్మాణ పరిశ్రమలను మాత్రమేకాదు. వలసపాలకులు కాగితం, చక్కెర పరిశ్రమలను సైతం వదలలేదు. వలసపాలకుల ఉద్దేశ్యం కేవలం దోచుకోవటం మాత్రమేకాదు. దేశీయ పరిశ్రమలను ధ్వంసంచేయటం కూడా వారి లక్ష్యం. వారి మనస్తత్వం, వారి కుటిలనీతి, ఎత్తుగడలు, దౌర్జన్యం, అణచివేత మొదలైనవి వారు ఆనాడు అనుసరించిన విధివిధానాలద్వారా బయటపడ్డాయి. భారతదేశ ప్రజల శక్తి సామర్థ్యాలను, కౌశలాన్ని చూసి వారు నిరంతరం భయపడేవారు. సమూలంగా వారిని నాశనం చెయ్యకపోతే, ఏనాటికైనా వారు లేచి నిలబడగలరని, అది తమకు నష్టం కల్గిస్తుందని వారు ఆందోళనకు లోనయ్యేవారు. పార్లమెంటరీ కమిటీ ముందు హాజరయిన ఒక సభ్యుడు ఈ విషయాన్నే కుండబద్దలు గొట్టినట్లు చెప్పాడు "భారతదేశాన్ని మనం కోల్పోయినట్లయితే, తూర్పుదేశాలతో మనం వ్యాపారం చెయ్యటానికి మనకేమీ ఉండదు... కాని భారతదేశం తన అపారమైన సహజవనరులతో, అనాదిగా వస్తున్న వారి నైపుణ్యంతో, కష్టించిపనిచేసే స్వభావంతో అనతికాలంలోనే ఒక పెద్ద తయారీ జాతిగా ఎదగగలదు. చౌకగా లభించే శ్రామికశక్తితో పుష్కలంగా లభించే ముడిపదార్థాలతో ప్రాచ్య ప్రపంచ వాణిజ్యంలో మనలను అధిగమించిపోగలదు".[11]

వైస్రాయి డఫెరిన్ తన భయాలను ఇలా చెప్పాడు "వాస్తవానికి భారతదేశంలో మన సామ్రాజ్యానికి ఏదైనా పెద్ద విపత్తు వాటిల్లినా, మన హిందూస్థాన్ ద్వీపకల్పంతో రాజకీయ సంబంధాలు కనీసం పాక్షికంగా దెబ్బతిన్నా, దానివలన ఇంగ్లాండ్‌లో తయారీ కేంద్రాలలో దెబ్బతినని కుటీర పరిశ్రమ ఒక్కటైనా ఉండదు. ఆ భరించరాని విపత్తువలన అనేక దుష్ఫలితాలను అవి ఎదుర్కొంటాయి".[12] అయినప్పటికీ భారత దేశపు సహజవనరులను, శ్రామికశక్తిని, వారి కష్టించి పనిచేసే స్వభావాన్ని నేర్పరితనాన్ని దృష్టిలో పెట్టుకొని భారత పరిశ్రమలను కోలుకోలేని దెబ్బకొట్టటానికి ఆంగ్లేయులు వ్యూహాత్మకంగా వ్యవహరించారు.

భారతదేశానికి కాగితం తయారీ ఎప్పటినుండో తెలుసు. చక్కటి, నాజూకైన, మెరిసే, తెల్లటి కాగితాల తయారీలో వారు నిష్ణాతులు. 1801 నాటికి కూడా ఇంగ్లాండ్ కాగితం పరిశ్రమ పుంజుకోలేదు. నాణ్యతలోనూ, మన్నికలోనూ భారతీయ కాగితపు ఉత్పత్తులతో ఇంగ్లండ్ ఉత్పత్తులు పోటీ పడలేకపోయ్యాయి. ఛార్లెస్

వుడ్ 'సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా'గా నియమితుడైన వెనువెంటనే భారతదేశ అవసరాలకు కావలసిన కాగితాలను బ్రిటన్ నుండే కొనుగోలు చేయాలని ఉత్తర్వులు యిచ్చాడు. దానితో బ్రిటన్ కాగితపు ఉత్పత్తులే భారతదేశాన్ని ముంచెత్తాయి.[13]

ఒకప్పుడు భారతదేశం చెఱకుసాగుకు, నాణ్యమైన చక్కెర ఉత్పత్తికి ప్రపంచ ప్రసిద్ధిగాంచింది. చక్కెర దేశపు ప్రధాన ఎగుమతులలో ఒకటి. కాని ఆంగ్లేయులు వచ్చాక చక్కెర పరిశ్రమను దెబ్బతీయాలని పన్నాగం పన్నారు. భారతదేశపు చక్కెర దిగుమతులపై దిగుమతిసుంకాలను రెట్టింపు చేశారు. ఎగుమతులపై ఆంక్షలు విధించారు. ఇంగ్లాండ్‌నుండి చక్కెర దిగుమతులకు సుంకాలు లేకుండా అనుమతించారు. ఇంగ్లాండ్ కనుక ఆంక్షలు విధించకుండా ఉంటే, కనీసం ఇంగ్లాండ్ భారతదేశంనుండి కొనుగోళ్ళు నిలిపివేయకుంటే, పంచదార పరిశ్రమ విస్తరించేది. చెఱకు సాగు విస్తీర్ణం గణనీయంగా పెరిగేది. కాని ఆ అవకాశం లేకుండా పోయింది. దిగుమతి చేసుకొనే తినటానికి, తాగటానికి ఉపయోగపడే వస్తువుల విలువలో 53.3 శాతం పంచదారదే అయింది. గతంలో నూలు వస్త్రాలు, పంచదార భారతదేశపు ప్రధాన ఎగుమతులు. సుగంధ ద్రవ్యాలతోపాటుగా ఈ రెంటిని విదేశాలకు ఎగుమతి చేసేది. గతంలో వేటిని అయితే పెద్దఎత్తున విదేశాలకు ఎగుమతి చేసిందో వాటినే- నూలు వస్త్రాలు, చక్కెర, కాగితం దిగుమతిచేసుకునే దుస్థితిని దేశానికి తీసుకొనివచ్చారు.[14]

వలసపాలనను గ్రుడ్డిగా సమర్థించే కొందరు పాశ్చాత్య ఆర్థికవేత్తలు చేస్తున్న వాదనను సమర్థిస్తుంటారు. బ్రిటీషువారు ఒక విధానంగా భారతదేశాన్ని పరిశ్రమల రహితంగా చేయలేదని, పారిశ్రామికీకరణ బస్సును సకాలంలో భారతదేశం ఎక్కలేక పోయిన కారణంగానే వెనుకబడిందని వారి అభిప్రాయం. పాశ్చాత్య దేశాలను సమూలంగా మార్చివేసిన పారిశ్రామిక, శాస్త్రీయ ఆవిష్కరణలను భారత్ మిగిలిన దేశాల మాదిరిగా అందిపుచ్చుకొని ఉపయోగించుకోని కారణంగానే మిగిలిన ప్రపంచం పురోగమనంలో ఉంటే, మనదేశం తిరోగమనంలో ఉందని పిడివాదం చేస్తుంటారు.

వారు చేస్తున్న వాదనలో పస లేదు. అది వాస్తవవిరుద్ధం. రెండు వందల సంవత్సరాలపాటు భారతదేశం ఆంగ్లేయుల వలసపాలనలో మ్రగ్గింది. **మొదటినుండి**

భారతదేశపు పరిశ్రమలను, శ్రామికుల నైపుణ్యాన్ని చూసి అసూయపడి, దేశాన్ని పరిశ్రమల రహితదేశంగా చెయ్యాలని ఆంగ్లేయులు కుట్రపూరితంగా వ్యవహరించారు. ఉన్న పరిశ్రమలను నాశనం చేసారు. కొత్త పరిశ్రమలను రానివ్వలేదు. ఒక్కోపరిశ్రమ పెరిగిన తీరును అధ్యయనం చేసి దాన్ని సమూలంగా నాశనం చేశారు. అందుకు వారు దిగుమతి సుంకాలను, అణచివేతను, విపక్షను ఆయుధాలుగా ఎంచుకున్నారు. భారతీయ మార్కెట్లను ఇంగ్లాండ్ ఉత్పత్తులతో నింపారు. దేశీయఉత్పత్తులు దేశంలోనే అమ్ముడు కాకుండా చూశారు. ఎగుమతులు అసలేలేవు. ఆర్థికంగా నిలువుదోపిడీ చేయటమే వలసపాలకుల లక్ష్యం. దాన్ని వారు ఎప్పుడూ రహస్యంగా ఉంచుకోలేదు. బహిరంగంగానే చెప్పారు. దోచుకున్నారు. ఆత్మరక్షణ చేసుకోలేని ఒక దేశంమీద అనేక ఆర్థిక శస్త్ర అస్త్రాలను ప్రయోగించి కోలుకోలేని దెబ్బకొట్టారు. వలసపాలనే లేకుంటే మిగిలిన దేశాల మాదిరిగా భారతదేశమూ అభివృద్ధి సాధించేది. **18, 19** శతాబ్దాలలో భారతదేశంలో ఆవిష్కరణలు ఎందుకు జరగలేదు? అణిచివేతకే తప్ప ఆవిష్కరణలకు అనువైన వాతావరణాన్ని వారు నెలకొల్పలేదు. పై పెచ్చు అనాదిగా ఉన్న చేనేత, నౌకానిర్మాణ, ఉక్కు తయారీ, కాగితం, పంచదార పరిశ్రమలను సమూలంగా వలసపాలకులు నాశనం చేశారు. దేశీయ పరిశ్రమల విచ్ఛిన్నంతో భారతదేశం పరిశ్రమల రహితదేశంగా మారిపోయింది.

భారతీయ పరిశ్రమల విధ్వంసం అనేక ఇతర దుష్పరిణామాలకు దారి తీసింది. వాటిలో కొన్నింటిని ఇక్కడ చర్చిద్దాం.

**పట్టణప్రజల వలస :**

భారతదేశంతో వాణిజ్యంవలన ఇంగ్లాండ్ ఆర్థికంగా పలుముఖాలుగా అభివృద్ధి సాధించింది. కొత్తగా పట్టణాలు, నగరాలు వృద్ధిచెందాయి. అంతవరకు గ్రామీణంగా ఉన్న ఇంగ్లాండ్‌లో గ్రామీణ ప్రాంతాలనుండి కొత్తగా వెలసిన పట్టణ కేంద్రాలకు వలసలు పెరిగాయి. కానీ భారతదేశంలో అందుకు భిన్నంగా పట్టణకేంద్రాలనుండి గ్రామీణ ప్రాంతాలకు జనం ఉపాధులు కోల్పోయి వలస వెళ్ళారు. ఒకప్పుడు గొప్పతయారీ కేంద్రాలుగా వెలిగిన ఢాకా, ముర్షిదాబాద్, సూరత్‌లతోపాటు అనేక పట్టణాలలో ఉన్న పరిశ్రమలు మూతపడటంతో, వాటి మీద ఆధారపడ్డజనం దిక్కులేని వారు అయ్యారు. మార్టిన్ ఈ విధంగా ఆనాటి స్థితిని చెప్పాడు "సూరత్,

మూర్షిదాబాద్, ఢాకా మొదలైన ఇతర ఉత్పత్తి కేంద్రాల పతనం వివరించటానికి సైతం చాలా బాధాకరం." 1840 పార్లమెంటరీ కమిటీ ముందు ఛార్లెస్ ట్రివిల్యన్ ఏవిధంగా ఢాకా జనాభా లక్షాయాభైవేల నుండి మూడవ వంతుకు పడిపోయిందో వివరించాడు, అడవులు పెరిగి, మలేరియా వ్యాపించి, ఢాకాను అతలాకుతలం చేసిన వైనాన్ని కూడా తెలియచెప్పాడు.

ఒక ఢాకాలోనే అంతకుముందు ఏడాదికి కోటి రూపాయలకు పైగా వ్యాపారం జరిగేదని హెన్రీ కాటన్ అంచనా వేసారు. 1787 నాటికి అది 30 లక్షలకు పడిపోగా, 1817 నాటికి వ్యాపారం శూన్యమైందని ఆయన వ్రాసారు. నాణ్యమైన నూలు వడకటం, నాజూకైన వస్త్రాలు తయారు చేయటం తరతరాలుగా వారి సొత్తు అయిన చేనేత కార్మికులకు ఉపాధి లేకుండా పోయింది. దానితో ఒకప్పుడు బాగాబ్రతికినవారు చితికిపోయ్యారు. వారు నమ్ముకున్న పట్టణాలు శిధిలమవటంతో పొట్టకూటికోసం గ్రామాల బాటపట్టారు. ఇది ఒక్క ఢాకాకే పరిమితమయిన దరిద్రంకాదు. ప్రసిద్ధి చెందిన అనేక పారిశ్రామిక పట్టణాలకు కూడా అదే దుర్గతిపట్టింది. నూలు వస్త్రపరిశ్రమ అంతరించటంతో చేనేత కార్మికుల సంఖ్య గణనీయంగా పడిపోయిందని 1911 జనాభా లెక్కల నివేదికలో పేర్కొన్నారు.

ఈ విధ్వంసం కేవలం పారిశ్రామిక కేంద్రాలకే పరిమితంకాలేదు. ఎగుమతులు తగ్గటం, వాణిజ్య వ్యాపారాలు సన్నగిల్లటానికే ఈ విధ్వంసం పరిమితం కాలేదు. స్వయంసమృద్ధితో విలసిల్లిన గ్రామీణ గణతంత్ర వ్యవస్థకు ముప్పు వాటిల్లింది. వ్యవసాయానికి, పరిశ్రమలకు ఉన్న బంధం తెగిపోవటంతో అనేకమంది వృత్తికళాకారులు, నూలువడికేవారు, బట్టలు నేసేవారు, కుండలు చేసేవారు, చర్మకారులు, వడ్రంగులు ఇంకా అనేక వృత్తులవారికి వృత్తిపరమైన డిమాండ్ కఱువైంది. అపారకౌశలం, అబ్బురపడే నైపుణ్యంతో అలరారిన చేతులు తప్పనిపరిస్థితులలో వ్యవసాయంమీద ఆధారపడవలసి వచ్చింది. దానితో వ్యవసాయరంగంమీద తీవ్రఒత్తిడి పెరిగింది. బ్రిటీషు వారి దుర్న్యాయాలవలన, దుష్టవిధానాలవలన వ్యవసాయ పారిశ్రామిక రంగాల సమతుల్యతతో అభివృద్ధిపథంలో అన్ని దేశాలకంటె అగ్రగామిగా ఉన్న భారతదేశం ఆంగ్లేయుల దెబ్బకు వ్యవసాయం దిశగా వలస ప్రాంతంగా దిగజారింది. వ్యవసాయమే అందరికీ జీవనాధారం అవటంతో ఎవరికీ పూర్తిగా ఉపాధి దొరకలేదు. దానితో ప్రచ్ఛన్న

నిరుద్యోగం పెరిగింది. ప్రచ్ఛన్న నిరుద్యోగం (Disguised Unemployment) భారతదేశంయొక్క సహజలక్షణం ఎప్పుడూ కాదు. బ్రిటీషువారి నిర్వాకంవలన ఏర్పడిన ఆ స్థితిని భారతదేశ సహజలక్షణంగా ప్రచారం చేసారు. తాము చేసిన దురన్యాయాలను కప్పిపుచ్చుకొనేందుకే అలాంటి ప్రచారం చేసారని వేరే చెప్పనవసరంలేదు. వలస పాలనకారణంగా దేశంలో అనేక కఱవు కాటకాలు వరుసగా సంభవించాయి. వ్యవసాయం మీదే తీవ్రమైన ఒత్తిడి కారణంగానే ఇవన్నీ సంభవించాయని బ్రిటీషు వారి కఱవు కమీషన్ తేల్చింది. నివారణకు ప్రత్యామ్నాయ ఉపాధి అవకాశాలు కల్పించటమే మార్గమని చెప్పింది. వాటన్నిటినీ వారే ధ్వంసం చేశారన్న విషయాన్ని మర్చిపోయారు.

మొట్టమొదటిసారిగా జనాభా లెక్కలు 1881లో తీశారు. 1891లో వ్యవసాయరంగంమీద 61 శాతం ఆధారపడ్డారు. 1901 నాటికి వారిశాతం 67 అయింది. 1921 నాటికే వ్యవసాయంమీద ఆధారపడ్డ జనాభా శాతం 73 అయింది. అంటే 130 సంవత్సరాలలో వ్యవసాయంపై ఆధారపడ్డ జనాభాశాతం తగ్గటానికి బదులు 12 శాతం పెరిగింది. వ్యవసాయేతర రంగాలమీద ఆధారపడ్డశాతం 39 శాతం నుండి 27 శాతానికి తగ్గింది. వ్యవసాయంమీద పెరిగిన ఒత్తిడిని ఈ గణాంకాలు స్పష్టం చేసాయి. దీనితో వ్యవసాయ కమతాల విభజన జరిగింది. కుటుంబ సభ్యులందరూ వ్యవసాయమే ఆధారం అవటంతో కుటుంబ కమతాల విస్తీర్ణం క్రమక్రమంగా తగ్గుతూ వచ్చింది. ప్రతి తరానికి కమతాల విస్తీర్ణం తగ్గి, చిన్న కమతాల సంఖ్య అసంఖ్యాకంగా పెరిగాయి. వ్యవసాయంమీద అధిక ఒత్తిడి కారణంగా కమతాల విభజన జరిగింది. దానితో వ్యవసాయం గిట్టుబాటు అయ్యేది కాదు. మిగులు స్వల్పంగా ఉండేది. దానితో వ్యవసాయం కేవలం బతికి బట్టకట్టటానికి మాత్రమే సరిపోయేది. పెట్టుబడులకు కావలసిన మూలధనం వారికి సమకూరేది కాదు. కనుక అభివృద్ధికి అవసరమైన వనరులు ఉండేవి కావు. అభివృద్ధి ఉండేదికాదు. ఈ పేదరికపు విషవలయాన్ని (Vicious Circle of Poverty) ఛేదించటం అంత తేలిక కాలేదు. కాని ఇది ఏర్పడటానికి కారణమైన వలసపాలన దురన్యాయాలను ప్రస్తావించకుండా మన అల్పాభివృద్ధికి దాన్నే కారణంగా చూపటం అన్యాయం. చిన్నరైతులు సన్నకారు రైతులు ఇంకా ఈ విషవలయంలోనే ఉన్నారు. వారు బయటపడటానికి యత్నిస్తున్నా, బయటపడలేకపోతున్నారు. అంతర్జాతీయ సంస్థలు చూపిస్తున్న పరిష్కారాలు ఈ విషవలయాన్ని శాశ్వతం చేసేవి తప్ప దాన్ని ఛేదించేవి కావు.

**వలసపాలనలో ఆంధ్రప్రాంత చేనేత పరిశ్రమ :**

భారతదేశ తూర్పుతీరప్రాంతం విదేశీ వలసపాలనలోకి రావడం మచిలీపట్నం తోనే ప్రారంభమయిందని చెప్పవచ్చు. 1606లో పోర్చుగీసువారు, 1608లో డచ్‌వారు, 1611లో ఆంగ్లేయులు తమ వర్తక స్థావరాలను మచిలీపట్టణంలో ఏర్పాటు చేసుకున్నారు. తమ ఉత్పత్తుల కంటే, భారతదేశ తూర్పు తీరప్రాంతంలో తయారైన నాజూకైన, నాణ్యమైన నూలు వస్త్రాలకు తమ దేశాలలో మంచిగిరాకీ ఉందన్న విషయాన్ని పాశ్చాత్య వర్తకులు గమనించారు. దానితో తూర్పుతీరంలో వర్తక స్థావరాలు ఏర్పాటు చేసుకోవటం కోసం, వస్త్రాల కొనుగోలు కోసం పాశ్చాత్య వర్తకులు పోటీపడ్డారు. ఆ పోటీలో ఆంగ్లేయుల ఈస్ట్‌ఇండియా కంపెనీది పైచేయి అయింది. తుదకు అది మన దేశాన్ని బ్రిటీష్ వలస పాలనలోకి నెట్టివేసింది.

**రాజకీయ అస్థిరత్వం-ఆదరణకు నోచుకోని చేతివృత్తుల వారు :**

విజయనగర సామ్రాజ్య పతనానంతరం ఆంధ్ర ప్రాంతంలో గ్రామీణ ఆర్థిక వ్యవస్థ ఛిన్నాభిన్నమైంది. రాజకీయ అస్థిరత్వం నెలకొనటంతో గ్రామీణ చేతివృత్తులవారు నిరాదరణకు గురి అయినారు. 1707లో ఔరంగజేబు మరణానంతరం మొగలు సామ్రాజ్యం విచ్ఛిన్నమైంది. దానితో కేంద్రీకృత అధికార వ్యవస్థ కుప్పకూలింది. ఎవరికి వారు స్వతంత్రం ప్రకటించుకోవటంతో అరాచక పరిస్థితులు నెలకొన్నాయి. చేతి వృత్తులవారు ముఖ్యంగా నేతపనివారు తమ ఉపాధికై విదేశీ కంపెనీలపై ప్రధానంగా ఆధారపడవలసి వచ్చింది. డచ్, పోర్చుగీసు, ఫ్రెంచి వ్యాపారస్తులు నేతపనివారిపట్ల కొంచెం ఉదారంగానే వ్యవహరించేవారు. నిర్దేశించిన నాణ్యతా ప్రమాణాలు లేకున్నా పురమాయించిన వస్త్రాలు తీసుకునే వారు. మజూరీలు ముందుగానే ఇచ్చి పని చేయించుకొనే వారు. కాని ఆంగ్ల వ్యాపారులు మాత్రం చాలా కఠినంగా వ్యవహరించేవారు. తక్కువ వేతనాలు ఇవ్వటం, నిర్బంధంగా పనిచేయించటం, ఏ మాత్రం తేడా వచ్చినా ఉత్పత్తులను తిరస్కరించడం చేసేవారు. సహజంగానే చేనేతకార్మికులు డచ్, పోర్చుగీసు, ఫ్రెంచి వ్యాపారులకోసం పనిచేయటానికి ఇష్టపడేవారు. గోల్కొండనుండి తీసుకువచ్చిన 5,000 మంది చేనేత పనివారితో డచ్‌వారు మచిలీపట్టణంలో ప్రత్యేకంగా ఒక నివాస ప్రాంతం ఏర్పాటు చేసారు.

**రాజకీయశక్తిగా ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రస్థానం :**

1759లో మచిలీపట్నం కోటను ఫ్రెంచి వారినుండి బ్రిటీష్ వారు వశం

చేసుకున్నారు. తూర్పు తీర ప్రాంతమంతా క్రమేపీ ఆంగ్లేయుల అధీనంలోకి వచ్చింది. గుండ్లకమ్మ నదినుండి చిల్కా సరస్సువరకు విస్తరించి ఉన్న తీరప్రాంతమంతా కంపెనీ ఏలుబడిలోకి వచ్చింది. ఆ తరువాత ఏడు సంవత్సరాలపాటు సర్కారు జిల్లాల్లో అరాచకత్వమే నెలకొన్నది. ఆధిపత్యంకోసం ఆంగ్ల, ఫ్రెంచి కంపెనీలు వేసిన ఎత్తుకు పైఎత్తులు, నడిపిన కుట్ర రాజకీయాలు, ఒకరితో ఒకరు చేసిన యుద్ధాలు వర్తకవాణిజ్య చరిత్రలో కాని, నాగరికత చరిత్రలో కాని లిఖించతగ్గవి కావు. 19వ శతాబ్దం వచ్చేసరికి ఈస్ట్ ఇండియా కంపెనీ ఒక పెద్ద రాజకీయశక్తిగా ఎదిగింది. స్వదేశీ సంస్థానాల వ్యవహారాలలో తలదూర్చి వారసులమధ్య చిచ్చుపెట్టి భూభాగాలమీద అధికారాన్ని సంపాదించింది.

**ఉత్తర సర్కారు జిల్లాల దానం :**

1766లో నైజాం నవాబు తన ఏలుబడిలో వున్న ఉత్తర సర్కారులుగా పిలువబడే అయిదు జిల్లాలను- శ్రీకాకుళం, రాజమండ్రి, ఏలూరు, ముర్తుజానగర్ (కొండపల్లి), ముస్తఫానగర్ (గుంటూరు)-ఈస్ట్ ఇండియా కంపెనీకి కానుకగా ఇచ్చాడు. అందుకు ప్రతిగా నైజాంకు అవసరం అయినప్పుడు సైనిక సహాయం ఆంగ్లేయుల ఈస్ట్ ఇండియా కంపెనీ అందించాలి. వాస్తవానికి ఈ అయిదు జిల్లాలను 15 లక్షలకు కౌలుకు తీసుకోవటానికి ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రయత్నం చేసింది. మచిలీపట్టణంలో ఉన్న కంపెనీ రెసిడెంటు జాన్‌పైబస్ ఇందుకోసం కాండ్రేగుల జోగిపంతులును రాయబారం పంపాడు. జోగిపంతుల దౌత్యం ఫలించి, ఆ అయిదు జిల్లాలను ఎటువంటి షరతులు లేకుండా నైజాం నవాబు కానుకగా ఈస్ట్ఇండియా కంపెనీకి ఇచ్చాడు. 1800లో బళ్ళారి, అనంతపురం, కడపజిల్లాలు సైనిక ఒప్పందం ఫలితంగా ఈస్ట్ ఇండియా కంపెనీ వశమయ్యాయి.

గుంటూరు (కొండవీడు) జిల్లా విస్తీర్ణం 2500 చదరపు మైళ్ళు. మూర్తుజానగర్‌గా పిలువబడిన కొండపల్లి జిల్లా విస్తీర్ణం 3400 చ.మై. మచిలీపట్నం నుండి హైదరాబాదు వెళ్లేదారిలో ఈ జిల్లా వ్యాపించి వుంది. కృష్ణా, గోదావరి నదులమధ్య విస్తరించి ఉన్నదే ఏలూరు జిల్లా. తూర్పున మచిలీపట్నం జిల్లా, పడమరన ఖమ్మంమెట్టు జిల్లాలు దానికి హద్దులు. గోదావరి అవతల ఒడ్డున్న రాజమండ్రి జిల్లా విస్తీర్ణం 500 చ.మై. మిగిలిన జిల్లాల కంటే విస్తీర్ణంలో తక్కువైనా, కంపెనీకి అత్యధిక రెవిన్యూరాబడి ఈ జిల్లానుండే వచ్చేది. శ్రీకాకుళం

జిల్లాను వైజాగ్, జైపూర్‌లుగా విభజించి గంజాం ముఖ్య పరిపాలకుడి పాలనా నియంత్రణలో ఉంచారు. ఉప్పుతయారీకి నిజాంపట్నం, మచిలీపట్నం ఓడరేవులలో సుంకాలు వసూలుకువీలుగా మచిలీపట్నం జిల్లాను కొత్తగా ఏర్పాటు చేశారు. తూర్పు తీరప్రాంతం మచిలీపట్నం జిల్లా కిందకి వచ్చింది.

భారతదేశంలో పెరుగుతున్న ఈస్ట్ ఇండియా కంపెనీ ఆర్థిక రాజకీయ ప్రాబల్యాన్ని చూసి బ్రిటీష్ ప్రభుత్వం భయపడింది. భారత్‌నుండి ఈస్ట్ ఇండియా కంపెనీ దిగుమతి చేస్తున్న అందమైన, నాజూకైన వస్త్రాలిచ్చిన పోటీని తట్టుకొనే పరిస్థితుల్లో అప్పుడప్పుడే విస్తరిస్తున్న బ్రిటీష్ వస్త్రపరిశ్రమ లేదు. భారత తూర్పుతీరప్రాంతంనుండి వస్త్ర దిగుమతులను నిలిపివేయాలన్న ప్రతిపాదనను బ్రిటీష్ సామ్రాజ్య విస్తరణకు మూలకారణమైన ఈస్ట్ ఇండియా కంపెనీ ఆర్థిక ప్రయోజనాలకు విరుద్ధంగా బ్రిటీష్ ప్రభుత్వం ఎటువంటి చర్యలూ తీసుకొనడానికి సాహసించలేదు. "100 సంవత్సరాల యుద్ధం"లో బ్రిటీష్ ప్రభుత్వానికి ఈస్ట్ ఇండియా కంపెనీయే ఋణాలిచ్చింది. షుమారు 100 సంవత్సరాలపాటు ఈస్ట్ ఇండియా కంపెనీ భారతదేశంలో తమ వర్తక, వాణిజ్యాలను కొనసాగించడమేగాక తిరుగులేని అధికారాన్ని చలాయించింది. వారి ఏలుబడిలో పరిస్థితులు అంతకుముందు కంటే అధ్వాన్నంగా తయారయ్యాయి. ఆంగ్లేయులు తమ తొలిఅడుగు మచిలీపట్నంగడ్డమీద, రెండవ అడుగు చేనేత కార్మికుల గుండెలమీద వేసారు.

**అణచివేతలో చేనేత :**

తీరప్రాంత గ్రామాలన్ని మంచి నైపుణ్యం కల నేతపనివారితో మగ్గాల ధ్వనితో ప్రతిధ్వనించేవి. కంపెనీ ప్రతినిధులు సంవత్సరానికి సరిపడ చెల్లింపులను ముందుగానే ఒప్పుకొనే వారు. వారి మాయాజాలంతో నేతపనివారే చివరకు కంపెనీకి బకాయి పడేవారు. ఈ ప్రక్రియలో అంతా కంపెనీకే లాభించేది. తక్కువధరకే వస్త్రాలు దొరకేవి. చేనేత కార్మికులు బకాయిల కారణంగా కంపెనీకి 'వెట్టిచాకిరి' చేసేవారు. సాంప్రదాయ పద్ధతులు, పరికరాలద్వారా ఉత్పత్తి జరగటంవలన, వేగంగా పెరుగుతున్న పాశ్చాత్య మార్కెట్ల డిమాండ్‌కు అనుగుణంగా ఉత్పత్తి సాధ్యమయ్యేదికాదు. కాలక్రమేణ రైతులు, చేనేతకార్మికుల సామాజిక సంఘాలు బయలుదేరి పెరుగుతున్న జీవనవ్యయం దృష్ట్యా, వేతనాలు పెంచమని అడిగినా

ప్రయోజనం లేకపోయింది. తక్కువవేతనాలకు కర్మాగారపు నాలుగుగోడలమధ్యే చేనేతకార్మికులను నిర్బంధించి కంపెనీ పనిచేయించేది.

1777లో సర్కారుజిల్లాల్లో పరిస్థితులను అధ్యయనం చేయడానికి సర్ క్యూట్ కమిటీని నియమించారు. 1788లో ఈ కమిటీ తన నివేదికను సమర్పించింది. ఆ రోజుల్లో నెలకొన్న పరిస్థితులను తెలుసుకోవటానికి ఈ నివేదికే మంచి ఆధారం. వ్యవసాయ భూములు ఎక్కువ భాగం జమిందార్ల చేతుల్లో ఉండేవని, జమిందార్లలో ఎక్కువమంది బ్రాహ్మణ, కమ్మ, వెలమ, క్షత్రియ కులాలకు చెందినవారని నివేదికలో పేర్కొన్నారు. భూమిపై జమిందార్లకున్న ప్రాథమికహక్కును అర్థం చేసుకోవటంలో సర్ క్యూట్ కమిటీ విఫలమైంది. భారతీయ జమీందార్లకు, పశ్చిమదేశాల ఫ్యూడల్ వ్యవస్థకు మధ్య వున్నతేడాను అది అర్థంచేసుకోలేకపోయింది. రైతులకు భూములకు మధ్య ఉన్న బంధాన్ని, రైతులకు జమీందార్లకు మధ్యఉన్న సంబంధాన్ని కూడ సర్ క్యూట్ కమిటీ అర్థచేసుకోలేక పోయింది. ఫలసాయంలో తమకు అధిక వాటా ఉండాలని కంపెనీ డిమాండ్ చేసేది. రైతులవాటా గురించికాని, వారికి న్యాయంగా చెందవలసిన భాగంగురించి కాని అది పట్టించుకోలేదు. సర్క్యూట్ కమిటీ నివేదిక ప్రకారం సర్కారుజిల్లాల్లో అరాచక పరిస్థితులు నెలకొన్నాయి. రైతుల పరిస్థితి దయనీయంగా మారింది. రైతుల బాగోగులగురించి కంపెనీ కాని, జమీందార్లు కాని ఏనాడు పట్టించుకోలేదు. వ్యవసాయ భూములను సాగుచేయడానికి మనుషులు దొరకక జమీందార్లు భూములను బీడుపెట్టారు. ఆహారధాన్యాలను ఇతర ప్రాంతాలనుండి దిగుమతి చేసుకోవలసిన దుస్థితిలోకి సర్కారు జిల్లాలు నెట్టివేయబడ్డాయి. అధిక ధరలు, కఱవుకాటకాలతో సామాన్యుల పరిస్థితి దయనీయంగా మారిందని సర్ క్యూట్ కమిటీ తన నివేదికలో పేర్కొంది.

ప్రతిమగ్గంమీద, ప్రతి వస్త్రంమీద, ప్రతి కుటుంబంమీద, ప్రతి వాషింగ్ గ్రీన్ (అద్దకానికి ఉపయోగించే బెరడు)మీద, ప్రతి చాపింగ్ సెంటర్‌మీద కంపెనీ పన్నువిధించేది. ఈ పన్నులు ఎత్తివేయండని కమిటీ చేసిన సిఫారసును కంపెనీ పట్టించుకోలేదు. అధికపన్నులు, బలవంతంగా వాటిని వసూలుచేసే తీరు, అందుకు ఉపయోగిస్తున్న రాజకీయాధికారంతో విసిగిపోయిన నేతపనివారు తరతరాలనుండి చేస్తున్న నేతపని మానివేసి వేరేవృత్తులకు మారటం, సుదూర ప్రాంతాలకు వలసవెళ్ళటం మొదలుపెట్టారు. వస్త్రాలమీద ముఖ్యంగా మస్లిన్ మీద విధించిన పన్నులు చేనేత తలరాతను మార్చివేసాయి.

అంతులేని దోపిడీ

విదేశీపాలన, దాని కారణంగా వచ్చిన ఆర్థికసంక్షోభం తూర్పు తీరప్రాంతంలో చేనేత పరిశ్రమను తీవ్రమైన సంక్షోభంలోకి నెట్టివేశాయి. భీమునిపట్నం, విశాఖపట్నం, తుని, నేలపల్లి, బెండమూర్లంక, ఇంజరం, మాడపాలెం, మచిలీపట్నం ప్రాంతాలకు చెందిన నేతపనివారు వ్యవసాయ కూలీలుగా మారారు. నూలు ఖరీదు ఏడు రెట్లు పెరగగా, బియ్యంధర ఇరవైరెట్లు పెరిగింది. దానితో నేతపనివారికి పూట గడవని పరిస్థితి ఏర్పడింది. ఎక్కువ వేతనాలు ఇవ్వమని డిమాండ్ చేశారు. కాని కంపెనీ వేతనాలు పెంచలేదు. అంతేకాక ఎక్కువ వేతనాలు ఇచ్చే డచ్, ఫ్రెంచ్, పోర్చుగీసు కంపెనీలకు నేతపనివారు పనిచేయకుండా నిర్బంధాలు విధించారు. తమకు మాత్రమే నేతపనివారు ఊడిగంచేసే దుస్థితికి కంపెనీ వారిని నెట్టివేసింది. కంపెనీ ఉద్యోగులు నిరంతరం నేతపనివారిమీద నిఘావేసేవాళ్ళు. నిర్ణీత సమయానికి ఉత్పత్తులు ఇవ్వకపోతే నిఘావేయడానికి వచ్చిన ఆ ఉద్యోగులకు తిండిపెట్టే బాధ్యతకూడా నేతపనివారిదే. అంతేకాక వారిని కోటకు పిలిపించి కొట్టేవారు. ఇది చాలదు అన్నట్లు అరువుకు పనిచేయమని నిర్బంధించేవారు. ఉత్పత్తులు రాబట్టుకోవడం, వాటిని ఎగుమతి చేయడంపట్ల వారికి ఉన్న శ్రద్ధ నేతపనివారిపట్ల లేదు. నేతపనివారికి చెల్లింపులు కంపెనీ సావకాశంగా వీలునుబట్టి చేసేది. అర్ధాకలితో బ్రతుకులు వెళ్ళదీస్తున్న నేతకార్మికులు కంపెనీకి పనిచేయటానికి ఇష్టపడక, ఎదురుతిరిగారు. ఒక అంగుళంగుడ్డ కూడా కంపెనీకోసం నేయబోమని ప్రకటించారు. వారిని శాంతింప జేయటానికి కంపెనీ ప్రతినిధులు ప్రయాసపడవలసి వచ్చింది. మాడపాలెం చేనేత కార్మికులు 1792 జూలైలో కంపెనీకి ఇచ్చిన వినతిపత్రంలో ఈ విధంగా పేర్కొన్నారు. "మా ఇబ్బందులను మీరు పట్టించుకోలేదు. కఱవు కాటకాలలో మమ్మల్ని ఆదుకోలేదు. ఫ్రెంచ్, డచ్చి కంపెనీలవారు మీకంటే ఎక్కువ మజూరీలు, ఎక్కువ ముందస్తు చెల్లింపులు ఇస్తున్నారు. తయారీకి మీ కంటె రెండు నెలల ఎక్కువ గడువు ఇస్తున్నారు. మా సమస్యలు మీరు పట్టించుకోలేదు. మద్రాసు ప్రభుత్వానికి విన్నవించలేదు. మా వేతనాలు పెంచలేదు. మా మహజరులు పట్టించుకోలేదు. కాని మామీద నిఘా పెట్టి మమ్మల్ని అవమాన పరిచారు."

కంపెనీ ఈ ప్రతినిధి ఈ వినతిపత్రాన్ని కంపెనీ వాణిజ్య బోర్డ్‌కు పంపాడు. దానికి సమాధానం ఈ విధంగా వచ్చింది. "నిన్ను గుమస్తాగా వేశాము. మండపేట, ఇతర ప్రాంతాలలో నేతపనివారిమీద అజమాయిషీ చేయటానికి నిన్ను

నియమించాము. కంపెనీకి తప్ప నేతపనివారు వేరెవ్వరికీ పనిచేయకూడదు. ఇతరులకు పని చేస్తున్నట్లు నువ్వు గమనిస్తే, మగ్గంమీద ఉన్న గుడ్డను కత్తిరించు. మన పని అయ్యేటట్లు చూడటానికి నువ్వు ఏ పద్ధతైనా అవలంబించు. ఏ చర్య అయినా తీసుకో, కంపెనీకితప్ప వారు ఇంకెవ్వరికి ఆ పనిచేయకూడదు". ఈ సమాధానంతో నివ్వెరబోయిన కంపెనీ ప్రతినిధి కంపెనీ యాజమాన్యం దృష్టికి సమస్య తీవ్రతను తెలియజేస్తే వాళ్ళుకూడా ఏమీ చేయకపోగా, జమీందార్లను, సంస్థానాధీశులను నేతపనివారిని ఒప్పించాలని కంపెనీ ప్రయోజనాలు కాపాడాలని నొక్కిచెప్పారు.

**చేనేత సమ్మె:**

తమ సమస్యలు పరిష్కారానికి నోచుకోకపోగా తమపై అనేకవిధాలుగా ఒత్తిడి పెరగడంతో నేత కార్మికులు తీరప్రాంత జిల్లాల్లో పెద్ద సమ్మెకు పూనుకున్నారు. నిడదవోలులో ఒకరాత్రి 300 మంది చేనేతరంగ పెద్దలు సమావేశమై ఈస్ట్ ఇండియా కంపెనీకి ఒక్క అంగుళం గుడ్డ కూడా నేయకూడదని తీర్మానించారు. నిడదవోలునుండి మిగిలిన ప్రాంతాలకు సమ్మెను వ్యాపింపచేయడానికి బయలుదేరి వెళ్ళారు. ఈ సమ్మెను కంపెనీ చాలా తీవ్రంగా పరిగణించింది. తన తిరుగులేని అధికారానికి, బ్రిటన్ ఆర్థిక ప్రయోజనాలకి, ఆర్థికాభివృద్ధికి చేనేతపనివారి సమ్మె గొడ్డలిపెట్టు వంటిదని భావించింది. సామ దాన దండ ప్రయోగం చేసి సమ్మెను విఫలం చేయాలని ప్రయత్నించింది. సంప్రదింపులకు పిలిపించి అనేక హామీలు ఇచ్చారు. సమ్మెను బలవంతంగా విరమింపచేశారు. సమ్మెను విరమించకుంటే నిత్యావసర వస్తువులను, నేతకు అవసరమైన ముడివస్తువులను నేతకార్మికులను అమ్మవద్దని వర్తకులకు శాసించారు. నిస్సహాయస్థితిలో చేనేత కార్మికులు సమ్మె విరమించారు.

ఇంజరంలో కూడా పెద్ద సమ్మె జరిగింది. నౌకలు ఆగటానికి వసతులున్న ఇంజరంలో సరుకులు చౌకగా దొరికేవి. మంచి నైపుణ్యం కలిగిన 1200 మంది చేనేతవారు ఈ గ్రామంలో ఉండేవారు. కంపెనీ పెట్టే బాధలు భరించలేక డచ్‌వారికి, ఫ్రెంచ్‌వారికి కూలీలుగా, మేనాలు మోసే బోయీలుగా పనిచేయడానికి ఇష్టపడేవారు తప్ప కంపెనీకి పనిచేయడానికి ఇష్టపడేవారు కాదు. అక్కడి కంపెనీ ప్రతినిధి నేతపని వారిని కంపెనీ ఫ్యాక్టరీనుండి బయటకు వెళ్ళకుండా నిర్బంధించి గంటలకొద్దీ పని చేయించేవారు. ఇది సహించలేక అనేకమంది ఎదురుతిరిగారు. వేతనాలు పెంచేదాక, సుంకాలు తగ్గించేదాక కంపెనీకి పని చేయబోమని ప్రకటించారు. 150 గ్రామాలు ఇంజరం ఫ్యాక్టరీక్రింద ఉండేవి. ఈ సమ్మెను కూడా కంపెనీ అణిచివేసింది.

మచిలీపట్నంలో తయారయ్యే, నాజూకైన రంగు రంగుల వస్త్రాలకు పర్షియా, ఈజిప్ట్, ఇరాన్, ఫ్రాన్స్, పశ్చిమదేశాలలో మంచి గిరాకీ ఉండేది. ఏటా 5,000 మిలియన్ పగోడాల (500 కోట్ల పగోడాల) విలువైన వస్త్రాలు వివిధ దేశాలకు ఎగుమతులయ్యేవి. ఈ ఎగుమతి వ్యాపార మంతా మొగలాయిల, ఆర్మేనియన్ల చేతుల్లో ఉండేది. కంపెనీ మచిలీపట్నంలో అడుగుపెట్టాక ఈ ఉత్పత్తులను తమకు మాత్రమే అమ్మాలని, వేరెవ్వరికీ అమ్మకూడదని నేతపనివారిని హింసించే వారు. అందుకు ఇష్టపడని నేతగాళ్ళలో కొందరు ప్రత్యామ్నాయ ఉపాధి వెతుక్కున్నారు. మరికొందరు పారిపోయారు. వారందరిని వెతికిపట్టుకుని, నిర్బంధించి కంపెనీ వాళ్ళు పనిచేయించుకున్నారు. 1787–94 మధ్య నెలకొన్న కఱవు పరిస్థితుల్లో నేతపనివారికి పని కల్పించడం తమ ఉదారతకు నిదర్శనంగా కంపెనీ వాళ్ళు ప్రచారం చేసుకొనేవాళ్ళు. కంపెనీ ఔదార్యానికి కృతజ్ఞులుగా మెలగాలని నేతపనివారిని డిమాండ్ చేసేవారు. అయితే స్వాభిమానంగల నేతపనివారు ఎదురుతిరగడంతో కంపెనీ దిగిరాక తప్పలేదు. కొన్ని రకాల సుంకాలను తగ్గించారు. కొన్ని మినహాయింపులు ఇచ్చారు. అయితే ఇంగ్లీషువారికి పనిచేస్తేనే మినహాయింపులు వర్తిస్తాయని ఉత్తర్వులు ఇచ్చారు. వేతనాలు పెంచుతామని, నిర్బంధించటం ఉండదని కంపెనీ హామీ ఇచ్చింది. కాని ఇచ్చిన హామీ నిలబెట్టుకోలేదు. నేతపనివారు తీవ్రమైన అసంతృప్తికి లోనయ్యారు. కాని గత్యంతరంలేని పరిస్థితులలో, మరో మార్గములేక కంపెనీవారికి పనిచేయక తప్పలేదు.

విశాఖపట్నం, భీమునిపట్నం, నాగపట్నం డచ్ ఫ్యాక్టరీలలో నాణ్యమైన నాజూకైన పొడవు వస్త్రాలు తయారయ్యేవి. వాటికి ఇంగ్లాండ్, ఫ్రాన్స్, హాలెండ్‌లలో మంచి గిరాకీ ఉండేది. మంచి ధర ఇచ్చి బయటకూడా డచ్‌వారు కొనేవారు. ఇంగ్లీష్ వర్తకులు గుత్తాధిపత్యానికి ప్రయత్నం చేశారు. పరోక్షంగా నేతపనివారిమీద ఒత్తిడిపెంచారు. విజయనగరం, శ్రీకాకుళం, కైకలూరు ప్రాంతాలలో ఇంగ్లీషు వారికి కాక ఇతరజాతీయులవారికి అమ్మే వస్త్రాలమీద అధిక సుంకాలు విధించండని అక్కడి జమీందార్లను ఆదేశించారు. ఇంగ్లీషువారి ఈ నిర్బంధ దమనకాండలో విసుగెత్తి నేతపనివారు పనిచేయడం మానివేశారు. ఒంటరిగా ఉంటే ప్రమాదమని, గుంపులు గుంపులుగా తిరిగేవారు. అయితే 18వ శతాబ్దం చివర వచ్చిన కఱవు ఇంగ్లీషువారికి నెత్తిన పాలుపోసింది. నిస్సహాయ స్థితిలో నేత కార్మికులు విధిలేక కంపెనీకి పనిచేయవలసి వచ్చింది. అయితే వారు ఈసారి సంఘటిత దోపిడీకి

గురయ్యారు. ఇతరులకంటే 40% తక్కువ వేతనాలివ్వటం, తెల్లకాగితాలమీద సంతకం పెట్టించడం, ఎదురుతిరిగినవారిని చెట్టుకు కట్టి హింసించడం మొదలైన అమానుష కృత్యాలకు కంపెనీ పాల్పడింది.

అయినప్పటికీ తూర్పుతీర వస్త్రాలు ప్రపంచమార్కెట్లలో మన్నికకు, నాణ్యతకు, లావణ్యానికి తమకున్న పేరును నిలబెట్టుకుంటూనే ఉన్నాయి. పశ్చిమదేశాల మిల్లు వస్త్రాలు మన నేత వస్త్రాలతో పోటీపడలేక పోయేవి. దేవాంగులు, పద్మశాలీలు నేతలో వారివారి ప్రత్యేకతను నిలబెట్టుకుంటూనే ఉన్నారు. సంపన్నులు తమ తోటివారిని ఆ దుర్భర పరిస్థితులలో ఆదుకుంటూనే ఉండేవారు. నెల్లూరు, గూడూరు, రాపూరు, కావలి, మచిలీపట్నం, గంజాం ప్రాంతాలలో ఉత్పత్తులవిలువ అప్పటిరోజులలో సంవత్సరానికి 15-20కోట్ల రూపాయలు ఉండేది. అయినా కంపెనీ ప్రతినిధులు నేతగాళ్ళు త్రాగుబోతులని, పనిచేయరని, బద్ధకస్తులని నిరంతరం ప్రచారం చేస్తూ ఉండేవాళ్ళు.

**వ్యాపారమే లక్ష్యం :**

18వ శతాబ్దిలో విదేశీ వాణిజ్యం తన ఆర్థికాభివృద్ధికి అవసరమని ఇంగ్లాండ్ భావించింది. విదేశీ వ్యాపారాన్ని వృద్ధిచేసుకునే క్రమంలోనే అది అనేక యుద్ధాలు చేసింది. వాటి పర్యవసానంగానే రాజ్యాన్ని విస్తరించుకుంది. పారిశ్రామిక విప్లవం, నూతన ఆవిష్కరణలు, క్రొత్త సమాచార రవాణాసాధనాలు, రాజ్య విస్తరణకు తోడ్పడ్డాయి. కోస్తాంధ్రజిల్లాల అసంఘటితరంగ పరిశ్రమలను పణంగా పెట్టి ఇంగ్లాండ్ తన పరిశ్రమలను వృద్ధిచేసుకుంది. పారిశ్రామికంగా పుంజుకోగానే ఆంధ్రవస్త్ర ఉత్పత్తులమీద దిగుమతి సుంకాలను పెంచింది. 1800-07 మధ్య 30%గా వున్న దిగుమతి సుంకం 44%కి పెంచారు. 1788-1803 బ్రిటీష్ వస్త్రపరిశ్రమ స్వర్ణయుగం. జె.యస్.మిల్ చెప్పినట్లు "భారతదేశం స్వతంత్రదేశం అయిఉంటే, ఇంగ్లీషు ఉత్పత్తులమీద సుంకాలు విధించి, తన పరిశ్రమలను కాపాడుకొనగల్గేది. కాని భారతదేశం ఇంగ్లాండ్ దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి ఉంది. తనను తాను కాపాడుకొనే అవకాశం తనకు లేదు. ఎటువంటి సుంకాలు లేకుండా, బ్రిటన్ ఉత్పత్తులు బలవంతంగా భారత్‌మీద రుద్దబడ్డాయి. భారత ఉత్పత్తిదారులతో సమానంగా పోటీపడలేక తమ రాజకీయాధికారంతో వారిని లొంగదీసుకున్నారు. వారన్ హేస్టింగ్స్, థామస్ మన్రో మొదలైన వారు తూర్పుతీర వస్త్ర పరిశ్రమలపట్ల కంపెనీ అనుసరించిన అమానుష విధానాలను విమర్శించారు.

ఆంగ్లేయుల ఏలుబడి - అంతులేని దోపిడీ

బ్రిటీష్ పార్లమెంటు వారి విమర్శలను పట్టించుకోకపోగా, బ్రిటన్ ఉత్పత్తులు మార్కెట్లలో ఆంధ్రాఉత్పత్తుల స్థానాన్ని ఎంత చక్కగా ఆక్రమిస్తున్నాయో కనుగొనే ప్రయత్నంచేసింది.

గ్రామాలలో వ్యవసాయం ప్రధానవృత్తిగా ఉండేది. భూసారాన్ని బట్టి, నేల రకాలను బట్టి, వేర్వేరు జిల్లాలో వేర్వేరు పంటలు పండించేవారు. గంజాం, మచిలీపట్నం, రాజమండ్రి, గుంటూరు జిల్లాల్లో పత్తి పండించేవారు. మచిలీపట్నంలో తాటి తోటలకు, ఈత తోటలకు తప్ప మిగిలిన పంటలకు భూములు అనువుగా లేకపోవడంతో ఈతోటల పెంపకానికి కొన్ని ప్రోత్సాహకాలు, శిస్తు రాయితీలు ఇవ్వాలని కలెక్టర్ సిఫారసు చేసినా కంపెనీ పట్టించుకోలేదు. ఆహారధాన్యాల, ఉత్పత్తులకంటే వాణిజ్య పంటల వైపు కంపెనీ మొగ్గుచూపింది. పత్తి, చెరకు, మలబరి, నీలిమందు, ఉన్ని కోసం గొర్రెల పెంపకం మొదలైన వాణిజ్య ప్రధాన పంటలను ప్రోత్సహించింది.

ఇళ్ళమీద, భూమిమీద, నీటిమీద, బళ్ళమీద, వృత్తులమీద, వివిధ వ్యాపారాల మీద, పశువులమీద, వివిధ నిత్యావసర వస్తువులమీద పన్ను విధించారు. నేత పనివారి మీద, బంగారం పనివారిమీద, మత్స్యకారులమీద పన్ను విధించారు ధాన్యం, పొగాకు, తమలపాకులు, వక్కలు, కొబ్బరికాయలు, నెయ్యి, నువ్వులు, నూనె గింజలు, నీలిమందు, నల్లమందు, వస్త్రాలు, బెల్లం, మిరపకాయలు, సుగంధ ద్రవ్యాలు, ఉప్పు, మందులు, పండ్లు, బంగారం, దారం, సంచులు, తేనె, బంక మీద పన్నులు వేశారు. ఇవి కాక రహదారి పన్నులు, రవాణా పన్నులు, దిగుమతి సుంకాలు, ఎగుమతి సుంకాలు, అపరాధ సుంకాలు విధించేవారు.

**కఱవు కాటకాలు-శిస్తు వసూళ్ళకు అమానుష పద్ధతుల :**

వరుసగా కఱవు కాటకాలు, పతనమవుతున్న ధరలు, తగ్గుతున్న లాభాలతో రైతులకు జీవనం గడపటం దుర్భరమైంది. 1805, 1807, 1811, 1823, 1824, 1833, 1839, 1853, 1854, 1864-1868, 1885, 1889, 1890-1892, 1896, 1897-1898, 1900, 1901, 1919, 1922, 1924, 1931-1932, 1934-35 సంవత్సరాలలో కఱవు కాటకాలు ఆంధ్ర ప్రాంతంలో వచ్చాయి.[16]

1805, 1807 సంవత్సరాలలో వచ్చిన కఱవు కోస్తా ఆంధ్ర, రాయలసీమ జిల్లాల్లో తీవ్రనష్టాన్ని కలుగజేసింది. అంతకుముందు ప్రభుత్వం ధాన్యాన్ని

కరువుకారణంగా ప్రజలకు ధాన్యం/బియ్యం అవసరమైనప్పుడు సేకరించడం, తక్కువధరకు అమ్మటం ఉండేది. కంపెనీ ఈ విధానాన్ని రద్దుచేసింది. నెల్లూరు, గుంటూరు, మచిలీపట్నం, దత్తమండలాల్లో వర్తకులు నిత్యావసర వస్తువులు దాచిపెట్టడమో, ఎగుమతి చేయటమో చేశారు. కాని మద్రాసుకు ఇవేమి పట్టలేదు. ఎంత వీలైతే అంత శిస్తువసూలే లక్ష్యంగా కంపెనీ పని చేసింది. కరువుకాలంలో ఉపాధికల్పనలకు పనులు చేపట్టలేదు. కరువుపనులు చేపట్టితే సోమరితనం పెరుగుతుందని కంపెనీ భావించింది. శిస్తు తగ్గించమని రైతులు మొరపెట్టుకున్నా వినలేదు. ఆహారధాన్యాల ధరలు తగ్గించటానికి ఎట్టి ప్రయత్నమూ చేయలేదు. 1811లో వచ్చిన దారుణమైన నెల్లూరు కరువుకూడా కంపెనీ విధానంలో ఎటువంటి మార్పు తీసుకురాలేదు. అక్రమంగా సరుకు నిలువచేసి లాభపడటాన్ని నియంత్రించటం అవసరం లేదని కంపెనీ భావించింది. అనేకమంది కలెక్టర్లు చౌకధరలకు ఆహార ధాన్యాలు అమ్మాలన్న ప్రతిపాదనలు చేశారు. అలాచేస్తే అది మార్కెట్ వ్యవస్థలో అనవసర జోక్యమవుతుందని కంపెనీ అందుకు అంగీకరించలేదు. 1823లో వచ్చిన మరింత తీవ్రమైన కరువు కడప, కర్నూలు, బళ్ళారి, విశాఖపట్నం జిల్లాలను దుర్భిక్షంలో ముంచివేసింది. ఆ ధరలు ఆకాశా న్నంటాయి. కొన్ని ప్రాంతాలలో కలెక్టర్లు కరువు పనులుచేపట్టారు. 1833లో ఇంకా తీవ్రమైన కరువు ఏర్పడింది. పశునష్టం, పంటనష్టంతోపాటు కలరా వ్యాప్తితో అనేక వందలమంది మృత్యువాతకు గురి అయ్యారు. ప్రభుత్వం కరువు పనులు చేపట్టక తప్పలేదు. 1839లో రాజమండ్రి, విశాఖపట్నం, బళ్ళారి, మచిలీపట్నం జిలాల్లో తీవ్రమైన ఆహార ధాన్యాల కొరత ఏర్పడింది. ప్రభుత్వ, దాతల సహాయం ఏ మూలకూ సరిపోలేదు. ఎంతోమంది ఆకలిచావులకు గురి అయ్యారు 1853, 1854ల్లో వచ్చిన కరువులతో గ్రామాలకు గ్రామాలు తుడిచిపెట్టుకుపోయాయి. బళ్ళారిలో గ్రామాలన్నీ పశుకళేబరాలతో నిండిపోయాయి. వరుసగా వస్తున్న కరువు కాటకాల నివారణకు కంపెనీ పూనుకోలేదు. నీటివనరుల అభివృద్ధికి, ప్రజాపంపిణీ వ్యవస్థ నిర్మాణానికి ఎట్టి ప్రయత్నమూ చేయలేదు.

**శిస్తు వసూళ్ళకు అమానుష పద్ధతులు :**

కానీ తీవ్రమైన కరువు కాటకాల సమయంలో కూడా శిస్తువసూళ్ళకు కంపెనీ ఎప్పుడూ వెనుకాడలేదు. శిస్తు సకాలంలో కట్టకపోతే రైతులను ఎండలో నిలబెట్టడం, కాలకృత్యాలు తీర్చుకోనివ్వకపోవడం, అన్నం తినటానికి అనుమతించకపోవడం,

నిర్బంధించడం, పశువులను మేతకు విప్పకపోవటం, అనుక్షణం నిఘాపెట్టడం సర్వసాధారణం. చెంపదెబ్బలు కొట్టడం, చెవులు మెలితిప్పడం, వ్రేళ్ళు కత్తిరించడం, తక్కువ కులం వాడిని నెత్తిమీద లేక వీపు మీద ఎక్కించడం, గాడిద లేదా గేదెతోకకు జుట్టుముడివేయడం, ఎముకలహారాన్ని మెడలో వేయడం మొదలైన నికృష్టచర్యలన్నీ శిస్తువసూలుకు చేసేవారు. మచిలీపట్నం జిల్లాలో శిస్తు కట్టని రైతులకు చిడతలు ఇచ్చి వాళ్ళ ప్రత్యర్థుల ఇంటిముందు ఆడమనేవాళ్ళు. శారీరకంగా, మానసికంగా, క్రుంగదీసి, పేదరైతుల మెడలువంచి శిస్తు వసూలుచేయటం కఱవు కాటకాల సంవత్సరాలలో కూడా చేసేవారు.

1880 కఱవు కమీషన్ సిఫారసులను అమలుచేయని కారణం వ్యవసాయ రంగంలో చాలా సంవత్సరాలు స్తబ్దత చోటు చేసుకుంది. భూమిశిస్తు పెంచుకోవటం మీదనే దృష్టినిలిపిన ఆంగ్లేయులు రైతుల పేదరికాన్ని మరింతగా పెంచారు. 1,000 చిన్న కాలువలు, 3,000 చెరువులు మరమ్మతులను తక్షణమే చేయాలన్న కఱవు సిఫారసును బుట్టదాఖలు చేశారు. జమీందార్లు నీటివనరుల వృద్ధికి ఏమీచేయకపోగా, నీటితీరువా భారాన్ని రైతులమీద నెట్టివేసే ప్రయత్నం చేశారు. నీటితీరువా రద్దుచేయాలని, నీటి పారుదల విస్తరణకు పన్ను మినహాయింపు ఇవ్వాలని కఱవు కమీషన్ చేసిన సిఫారస్‌ను పట్టించుకోలేదు. నీటిపారుదల సౌకర్యాన్ని విస్తరింపజేయటానికంటే రహదారుల అభివృద్ధికి, రైలుమార్గాల నిర్మాణానికి ఎక్కువ నిధులను వెచ్చించారు.

**ఆనకట్టలు :**

ఈ నేపథ్యంలో కృష్ణా, గోదావరి నదుల మీద ఆనకట్టలు కట్టడం ఆశ్చర్యం కల్గిస్తుంది. కఱవు కాటకాలవల్ల తగ్గుతున్న రెవిన్యూ ఆదాయాన్ని క్రమబద్ధీకరించు కోవటానికి గోదావరి, కృష్ణా, పెన్నా, నాగావళి నదులపై ఆనకట్టలు కట్టారు. కడప, కర్నూలు, కాలువల త్రవ్వకాలూ జరిగాయి. 18వ శతాబ్ది మొదట్లోనే గోదావరిమీద ఆనకట్ట కట్టాలన్న ప్రతిపాదనలను పరిశీలించటం జరిగింది. సర్ ఆర్థర్ కాటన్ నిర్విరామ కృషివల్లనే గోదావరిమీద ఆనకట్ట వచ్చింది. మొత్తం ప్రాజెక్టుకు రూ॥ 12 లక్షలు ఖర్చవుతుందని కొద్ది సంవత్సరాలలోనే మొత్తం ఖర్చు రాబట్టు కోవచ్చునని, వచ్చే రెవిన్యూ ఆదాయం కొన్ని రెట్లు ఎక్కువగా ఉండగలదని కాటన్ కంపెనీకి, మద్రాసుప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపించారు. హెన్రీ కాటన్ ప్రతిపాదనలు కంపెనీ యాజమాన్యానికి నచ్చలేదు.

మద్రాసుప్రభుత్వానికి కంపెనీబోర్డుకు పదేపదే విజ్ఞప్తిచేసి కాటన్ ఆనకట్టకట్టేందుకు అనుమతి సంపాదించాడు. కాటన్ ప్రతిపాదనలు పరిశీలించడానికి నియమించబడ్డ కమిటీ రెవిన్యూ పెరిగేపక్షంలో వెంటనే ఆనకట్ట నిర్మాణం చేయడం మంచిదన్న అభిప్రాయానికి రావడంతో మార్గం సులభమైంది. గోదావరి ఆనకట్టకంటే ముందుగానే 1792లో కృష్ణానదిమీద ఆనకట్ట పనులు ప్రారంభించారు. కాని కృష్ణమీద ఆనకట్ట పూర్తికావడానికి 61 సం॥లు పట్టింది. ఈ రెండు ప్రాజెక్టులవల్ల కఱవు కాటకాల తీవ్రత కొంతవరకు తగ్గింది. పంట దిగుబడులు, రైతుల ఆదాయం పెరిగాయి. అయితే పంట దిగుబడులతోపాటు భూమిశిస్తు కూడా పెరిగింది. దీనితో ప్రభుత్వ ఆదాయం గణనీయంగా పెరిగింది. నీటి తీరువాను విధించారు. సరఫరా చేసిన నీటినికొలిచి, నీటి వాడకాన్నిబట్టి పన్ను విధించాలని ప్రభుత్వం సంకల్పించింది. మచిలీపట్నం జిల్లాలో మొదటిపంటకు రూ॥ 6-8-0, (వరుసగా రూపాయలు, అణాలు, కాణీలు) రెండవ పంటకు రూ॥ 1-12-0 ఎకరాకు నీటితీరువగా నిర్ణయించారు. రెండు పంటలకు కలిపి ఎకరాకు రూ॥ 8-4-0, నీటి తీరువాద్వారా, భూమిశిస్తు ద్వారా ఆనకట్టలమీద పెట్టిన పెట్టుబడిని ప్రభుత్వం కొద్ది సంవత్సరాలలోనే రాబట్టుకుంది. పెట్టిన పెట్టుబడి మీద రైల్వేలద్వారా ఏడాదికి 4 శాతం ఆదాయం వస్తే, నీటి ప్రాజెక్టులద్వారా ఏడాదికి 16 శాతం ఆదాయం కంపెనీకి వచ్చింది.

బెజవాడకు ఎగువన 130 కి.మీ దూరంలో నీటిని నిలువ చేయడానికి 150 అడుగుల ఎత్తుతోను, 30,000 నుండి 40,000 ఘనపుటడుగుల నిలువ సామర్థ్యంతో ఒక జలాశయ నిర్మాణానికి 1901లో ప్రతిపాదన చేశారు. ఈ జలాశయంద్వారా కృష్ణాజిల్లాలోని మెట్టప్రాంతాలకు, దివితాలూకాలో 50,000 ఎకరాలకు నీరు అందించడానికి, ఎగువప్రాంతాలకు త్రాగునీటి, సాగునీటి అవసరాలు తీర్చడానికి వీలవుతుందని ప్రతిపాదించారు. ఈ ప్రాజెక్టుకు రూ॥12 లక్షలు ఖర్చు అవుతుందని, దీని నిర్మాణానికి అత్యంత ప్రాధాన్యం ఇవ్వాలని ఇరిగేషన్ కమీషన్ 1901లో సిఫారసు చేసింది. కాని ఈ ప్రతిపాదన అమలుకు నోచుకోలేదు.

**అప్పుల ఊబిలో రైతులు :**

1896, 1907, 1913, 1930లలో రైతుల స్థితిగతులపై కమిటీలు వేశారు. కృష్ణాజిల్లా రైతుల దయనీయస్థితి ఈ కమిటీల నివేదికలవల్ల వెల్లడైంది. ప్రతి ముగ్గురు రైతులలో ఒకరు అప్పుల ఊబిలో కూరుకుపోయి వున్నారు. 1881లో ఎకరాకు ఫలసాయం రూ॥ 160గా అంచనా వేశారు. అందులో సగం భూమిశిస్తుకు, ఇతర వ్యయం రూ॥ 43గా అంచనా వేశారు. ఎకరాకు రైతుకు మిగిలేది రూ. 10

మాత్రమేనని లెక్కలు తేల్చారు. ఇంతకు తక్కువ ఆదాయం వచ్చే రైతు అప్పు చేయకతప్పదు. 1930లో వచ్చిన ఆర్థిక విచారణ కమిటీ నివేదిక ప్రకారం సన్నకారు రైతులలో 60% మంది అప్పుల్లో మునిగితేలుతున్నారు. ఈ శాతం కృష్ణాజిల్లాలో తక్కువగా వుంది. ఉదాహరణకు తూర్పు గోదావరి జిల్లాలో సన్నకారు రైతులలో 92% మంది, పశ్చిమ గోదావరి జిల్లాలో 69% మంది ఋణగ్రస్తులుగా ఉన్నారు. వ్యవసాయ ఆదాయం రైతులకు సరిపోవటం లేదని, శిస్తులు, పన్నులు, ఎక్కువగా ఉన్నాయని వాటిని తగ్గించాలని నివేదికలో పేర్కొనటం జరిగింది.

**హైదరాబాద్‌తో వ్యాపారం :**

మచిలీపట్నం, హైదరాబాదులమధ్య వ్యాపారం జోరుగా సాగుతుండేది. ఈ రెండు వ్యాపార కేంద్రాలమధ్య నారాయణపురం సంస్థాన్‌లో ఒక వాణిజ్య కూడలి వుండేది. మార్గమధ్యంలో సరుకులు నిలువ చేసుకోవటానికి గిడ్డంగులు, వసతి సౌకర్యాలు నారాయణపురంలో ఉండేవి. మచిలీపట్నంనుండి ఉప్పు, రంగు రంగుల వస్త్రాలు, మస్లిన్స్, బెంగాలు మరియు గంజాం ప్రాంతంనుండి వచ్చే ఉత్పత్తులు, రాగి, తగరం, తివాచీలు మొదలైనవి హైదరాబాదుకు ఎగుమతి అయ్యేవి. హైదరాబాదు నుంచి ధాన్యం, చక్కెర, ప్రత్తి, నూలు, బియ్యం, వెల్లుల్లి, కాగితం, గోధుమలు, సుగంధ ద్రవ్యాలు మొదలైనవి దిగుమతి అయ్యేవి. లంబాడీలు ఈ ఎగుమతి, దిగుమతుల రవాణాలో ముఖ్యపాత్ర వహించేవారు. 1802లో కుదుర్చుకున్న ఒప్పందం కారణంగా హైదరాబాదు నవాబుకు మచిలీపట్నం రేవును ఉచితంగా ఉపయోగించుకొనేందుకు వీలు కలిగింది. నిజాం జెండా వున్న ఓడలకు బ్రిటీష్‌వారు రక్షణ కల్పించేవారు. ప్రాంతాలమధ్య వస్తురవాణా, ఉత్పత్తుల మార్పిడికి 5% సుంకం తప్ప అన్నిరకాల సుంకాలను రద్దుచేయడంతో హైదరాబాదు, మచిలీపట్నంమధ్య వ్యాపారం బాగా జరిగేది. 1864లో వచ్చిన పెనుతుఫాను కారణంగా మచిలీపట్నం ఓడరేవు బాగా దెబ్బతిన్నది. రేవు పునరుద్ధరణకు పాలకులు పూనుకోనందున మచిలీపట్నం రేవు తన ప్రాముఖ్యాన్ని తరువాత కాలంలో కోల్పోయింది.

**ముగింపు :**

ఈస్ట్ ఇండియా కంపెనీ ఇక్కడి ప్రజల జీవితాలను, జీవన వ్యవస్థలను ఛిన్నాభిన్నం చేయకముందు ప్రజలు ఎవరి వృత్తి వారు చేసుకొనేవారు,

ఎవరుపాలిస్తున్నారు ఏ రాజ్యాధికారం క్రింద ఉన్నాము, ఏ రాజు అధికారంలో ఉన్నాడు అనే విషయాన్ని ప్రజలు ఏనాడు పట్టించుకోలేదు. కంసాలులు, వడ్రంగులు, కమ్మరులు మొదలైన చేతివృత్తులవారు తమపనిముట్లతో అద్భుతమైన నైపుణ్యంతో ప్రజలకు కావలసిన వస్తువులు తయారుచేసేవారు. నేతపనివారు తమమగ్గాలపై ప్రపంచంలోకెల్లా నాణ్యమైన వస్త్రాలను నేసేవారు. వాటిపై రంగులు వేయటం, అద్దకాలు అద్దటంలో కూడా నైపుణ్యం చూపేవారు. ఇనుము వెలికితీత బాగా ప్రాచుర్యంలోనికి రాని రోజుల్లో ఇక్కడ ఇనుము వెలికితీసి ఉక్కు తయారుచేసేవారు. ఇంగ్లండ్‌లో పరికరాలు చేయడంలో దిట్ట అయిన స్నాడ్ గ్రాస్ ఈ జిల్లాల్లో తయారయ్యే ఉక్కు తాను ఇతరదేశాలలో చూసిన వాటికన్న శ్రేష్ఠమైనదని కితాబు యిచ్చాడు.

ఈస్ట్ ఇండియా కంపెనీ మచిలీపట్నం, ఇతర సర్కారు జిల్లాల్లో చేతి వృత్తులను పూర్తిగా దెబ్బతీసింది. అత్యుత్తమ నైపుణ్యం కలవారి నందరిని రకరకాల పద్ధతుల్లో వేధించింది. పారిశ్రామిక విప్లవ అనంతరం మిల్లు ఉత్పత్తులతో ఆంధ్ర ప్రాంతాలను నింపివేసింది. వలస పాలనలో రైతులు, కూలీలు, సామాన్య ప్రజానీకం పడరాని కష్టాలు పడ్డారు. కఱవు కాటకాలతో సతమతమయ్యారు. ప్రభుత్వ దృష్టంతా పన్నులవసూళ్ళ మీద తప్ప ప్రజలమీద లేదు. కఱవు విచారణకు, కఱవు కాలంలో ఉపాధి కల్పనకు పథకాలు చేపట్టలేదు.

1600 సం॥నుండి ఆంధ్ర చేనేతవారు తమ నైపుణ్యంతో, పనితనంలో అపురూపమైన వస్త్ర ఉత్పత్తులతో విదేశీ వ్యాపారులను తమచుట్టూ తిప్పుకున్నారు. కంపెనీ అడుగుపెట్టాక చేనేత పరిశ్రమ రూపురేఖా విలాసాలు తిరగబడ్డాయి. మారాయి. పనికోసం షావుకారులచుట్టూ ప్రదక్షిణచేసే దుస్థితికి వారు నెట్టివేయబడ్డారు. చేనేత వస్త్రాలకు తగ్గుతున్నగిరాకీ, వాటి స్థానంలో బ్రిటీష్ మిల్లు వస్త్రాలకు పెరుగుతున్న గిరాకీ దృష్ట్యా షావుకారులు పెట్టుబడులు పెట్టి పని చేయించడానికి జంకేవారు.

ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామ కారణంగా కంపెనీ పాలనకు తెరపడింది. భారత భూభాగంనుండి కంపెనీ నిష్క్రమిస్తూ తన భయంకరమైన నీడను భారత ప్రజానీకం పై వేసింది. కంపెనీ చేసిన ఋణాలు భారతదేశం ఋణాలుగా మార్చారు. కంపెనీ బ్రిటిష్ ప్రభుత్వానికి ఏటాచేసే చెల్లింపులు కంపెనీ నిష్క్రమణ తరువాత కూడా భారతదేశమే చెల్లించాలని ఆదేశించారు. ఒక షిల్లింగ్ కూడా చెల్లించకుండా భారతదేశాన్ని విక్టోరియా మహారాణి తన ఏలుబడిలోకి తెచ్చుకుంది. అందుకు

భారత ప్రజానీకమే ఋణరూపంలో, ఇతర చెల్లింపుల రూపంలో 'కొనుగోలు ధర' చెల్లించింది.

## References


1. R.C.Dutt, The Economic History of India, Vol.p. 105
2. Mr. Tierney in the House of Commons, 1813.
3. Minutes of Evidence on the Affairs of East India Company (1813), p.123 & p. 172
4. Frederick Shore, Notes on Indian Affairs.
5. G.O. Trevelyan, Life and Letters of Lord Macaulay.
6. Ellenborough to Chairman and Deputy Chairman of the EIC, 18th March, 1835.
7. Col. A. Walker, Consideration on the Affairs of India, p. 316. Cf. William Digby, Prosperous British India, p.p 86-87.
8. Federick List, National system of Political Economy, Translated by Sampsons. Lloyd, M.P., p. 42.
9. William Digby, p. 88
10. W. S. Lindsay, History of Merchant Shipping, Vol.II, pp. 454 - 55.
11. W. Sedwick, Major R.E, India for Sale, p. 4
12. John Murray, Lord Dufferin's Speeches on India, p. 284
13. George Watt, Commercial products of India, pp. 865-866
14. Ibid p. 959.
15. A.V. Ramana Rao, The Economic Development of Andhra Pradesh (1766-1957)




# 8

# ఆధునికీకరణముసుగులో...

భారతదేశంలో బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ వాణిజ్య కార్యకలాపాలకు యిచ్చిన అనుమతిని బ్రిటిష్ పార్లమెంటు పొడిగిస్తూ, అదే సమయంలో గుత్తాధిపత్యాన్ని తొలగించి ఇతర వాణిజ్య సంస్థలకూ అవకాశమిస్తూ 1813లో ఒక చట్టాన్ని చేసింది. ఈ చట్టాన్ని 'బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ చట్టం' లేదా 'ఛార్టర్ యాక్ట్ ఆఫ్ 1813' అని పిలిచారు. భారతదేశంమీద బ్రిటిష్‌వారి సార్వభౌమాధికారాన్ని ఈ చట్టం పునరుద్ఘాటించి, భారతదేశంలో ఈస్టిండియా కంపెనీ పాలన కొనసాగింపుకు అనుమతిని యిచ్చింది. భారతదేశ చరిత్రలో ఈ చట్టం ఒక పెద్దమలుపు. ఈస్టిండియా కంపెనీకి భారతదేశ వాణిజ్యంమీద గుత్తాధిపత్యం ఈ చట్టంతో పోయింది. కేవలం నల్లమందు, తేయాకు వ్యాపారాలకు మాత్రమే కంపెనీ గుత్తాధిపత్యాన్ని పరిమితంచేసి, మిగిలిన అన్ని ఉత్పత్తుల వ్యాపారంలో కంపెనీకి ఉన్న వాణిజ్య గుత్తాధిపత్యాన్ని తొలగించారు. వ్యాపారసంస్థలు స్వేచ్ఛగా భారతదేశంలో ప్రవేశించవచ్చు. ఎగుమతులు, దిగుమతులు చేసుకోవచ్చు. ఈ చట్టంతో ఈస్టిండియా కంపెనీకే కాక ఆంగ్లేయు లందరికీ భారతదేశం బహిరంగ వ్యాపార క్రీడాస్థలం అయింది. ఎవరైనా ప్రవేశించవచ్చు. ఎరవేయవచ్చు. వేటాడవచ్చు. వెంట తీసుకొనిపోవచ్చు. ఒకసారి ఆంగ్లేయుల అందరికీ ప్రవేశార్హత లభించాక, భారతదేశం పూర్తిగా వారి వలసరాజ్యంగా మారిపోయింది. ఆంగ్లేయులు దేశంలోని వివిధ ప్రాంతాలకు వలస వచ్చారు. ఆ ప్రాంతాలను వారి అవసరాలు, సౌకర్యాల నిమిత్తం 'ఆధునికీకరించటం' మొదలుపెట్టారు. భారతీయుల యిష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండానే ఈ ఆధునికీకరణ ప్రక్రియ మొదలైంది.

"ఈ కారణంగా భారత ఆర్థికవ్యవస్థలో పెనుమార్పులు వచ్చాయి. దోపిడీ పద్ధతులలో, మార్గాలలో మార్పుతీసుకొనిరావటం అనివార్యమైంది. అప్పటివరకూ ఈస్టిండియా కంపెనీ అనుసరించిన తెలివితక్కువ, మూర్ఖపు, నిర్లక్ష్యపు దోపిడీ పద్ధతుల వలన అసలుకే ఎసరు వచ్చింది. దోపిడీ చేయటానికి ఉన్న అవకాశాలు వారి

నిర్లక్ష్యపు పద్ధతులవలన సన్నగిల్లాయి. మూలాలనే వారు దోపిడీచేయటంతో కొత్త దోపిడీమార్గాలను వారు అన్వేషించక తప్పలేదు. మరింత శాస్త్రీయంగా, (కేవలం ఈస్టిండియా కంపెనీకే కాక), మొత్తం బ్రిటిషు పెట్టుబడిదారీవర్గానికి అంతటికీ లాభదాయకంగా ఉండే దోపిడీ పద్ధతులను ప్రవేశపెట్టారు. పారిశ్రామిక పెట్టుబడులకు అనువైన దోపిడీమార్గాలను వారు సిద్ధం చేసుకున్నారు. ఇంతకుముందువలె అస్తవ్యస్తంగా జరిగిన దోపిడీ కాక, మరింత ప్రమాదకరమైన, మొత్తం ఆర్థికవ్యవస్థనే అతలాకుతలం చేయగల మార్గాలను వారు ప్రవేశపెట్టారు".[1]

భారతదేశంనుంచి దోచుకువచ్చిన వనరులతో బ్రిటన్ ఒక పారిశ్రామిక దేశంగా ఎదగటం మొదలుపెట్టింది. 19వ శతాబ్దంలో పెరుగుతున్న తన పారిశ్రామిక అవసరాలకోసం ముడిపదార్థాలు కావలసివచ్చాయి. ఇంగ్లాండ్‌లో ఏ ముడిపదార్థాలూ లభ్యంకావు. ముడిపదార్థాలతోపాటు, తన ఉత్పత్తులను అమ్ముకోవటానికి 'రక్షిత మార్కెట్లు' (Protected Markets) కూడా అవసరమయ్యాయి. తన ముతక ఉత్పతులను అమ్ముకోవటానికి దిగుమతి సుంకాలను యథేచ్ఛగా వినియోగించి రక్షితమార్కెట్లను నిర్మించుకొంది. ముడిపదార్థాలకోసం వాణిజ్యపంటలను ప్రోత్సహించింది. వాటి రవాణాకోసం రైల్వేలను ప్రవేశపెట్టింది.

1813 నుండి భారత విదేశీ వాణిజ్యం యొక్క తీరుతెన్నులు మారాయి. గొప్ప ఆర్థికవేత్తలుగా పేరుబడ్డ ఆర్థికవేత్తలు సాపేక్ష వ్యయ సిద్ధాంతాన్ని (Comparative cost theory of International Trade) ప్రతిపాదించారు. దానితోపాటుగా అంతర్జాతీయ శ్రమవిభజన (International Division of Labour) సిద్ధాంతాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చారు. క్లుప్తంగా చెప్పాలంటే, ఈ సిద్ధాంతాలు ప్రకారం సాపేక్షంగా ఏ దేశానికి ఏ వస్తుఉత్పత్తిలో వ్యయం తక్కువగా ఉంటుందో, ఆ వస్తువునేవారు ఎగుమతి చెయ్యాలి. మిగిలినవి దిగుమతి చేసుకోవాలి. ఈ సిద్ధాంతాలను అనుసరించి ఆంగ్ల మేధావులు మరొక ప్రతిపాదన చేశారు. ఇంగ్లాండ్ తయారీ వస్తువుల (Manufactured Products)ను, భారతదేశం ఇంగ్లాండ్‌కు కావలసిన ముడిపదార్థాలను (Farm Products) ఎగుమతి చేస్తున్నాయి కనుక, ఈ రెండూ దేశాలు అదే విధంగా కొనసాగితే ఇరుదేశాలకు లాభదాయకంగా ఉంటుందని సూత్రీకరించారు. అంతర్జాతీయ శ్రమవిభజనవలన రెండు దేశాలకు ప్రయోజనమని చెప్పారు.

ప్రముఖ ఆర్థిక పండితుడు జాన్ మేనార్డ్ కీన్సు 1911లో ఏమన్నాడో ఇప్పుడు చూద్దాం. "భారతదేశంలో చదువుకున్నవారు దేశభక్తితో వారి దేశం పారిశ్రామికంగా అభివృద్ధి కావాలని కోరుకుంటున్నారు". కాని ఆయన అభిప్రాయంలో "అటువంటి మార్పు వాంఛనీయం కాదు. లేదా భవిష్యత్తులో జరిగేది కాదు". ఎందుకంటే మార్పు చేయటానికి లేదా తిరగవ్రాయటానికి వీలుకాని ఒక చారిత్రక పరిణామ ప్రక్రియ జరిగిపోయిందని ఆయన నమ్మి, అందర్నీ నమ్మమని కోరుతున్నాడు. "వాతావరణం, ప్రజల అభిరుచులు, అలవాట్లు, శక్తిసామర్థ్యాలు పరిగణనలోకి తీసుకొన్నప్పుడు, భారతదేశం ఇప్పుడు తన ముడిపదార్థాలను పాశ్చాత్యదేశాలకు ఎగుమతి చేసి సంపాదిస్తున్న దానికంటే ఎక్కువగా దాని మూలధనాన్ని, రైతులను ప్రస్తుతం దిగుమతి చేసుకుంటున్న ఉత్పత్తులను దేశంలోనే ఉత్పత్తి చేయటానికి మళ్ళిస్తే, అది పొందగలదన్న నమ్మకం కుదరటంలేదు".[2]

ఆంగ్లమేధావులు వారి దేశ స్వప్రయోజనాలు కాపాడేందుకే అటువంటి సిద్ధాంతాలను వ్యాప్తి చేస్తారనటంలో వాస్తవం ఎంతైనా ఉంది. ఆంగ్లేయులు ప్రారంభించిన భారతదేశ 'ఆధునికీకరణ' అనే ప్రక్రియ లక్ష్యం స్పష్టమే. వ్యాపారపరంగా భారతదేశంలోకి మరింతగా చొచ్చుకొనిపోవటమే వారి లక్ష్యం. ఇందుకుగాను కొత్తగా రైలుమార్గాలను నిర్మాణం చేయవలసి వచ్చింది. రహదారులను అభివృద్ధి పరచవలసి వచ్చింది. అంతవరకు నిర్లక్ష్యం చేయబడ్డ సాగునీటి సౌకర్యాలను పునరుద్ధరించటానికి, విస్తరించటానికి పూనుకోవాల్సి వచ్చింది. తంతితపాల సేవలను ప్రారంభించవలసి వచ్చింది. ఆంగ్లభాష తెలిసిన గుమస్తాలను తయారుచేసే విద్యావిధానాన్ని ప్రవేశపెట్టవలసి వచ్చింది. పాశ్చాత్య బ్యాంకింగ్ సర్వీసులు వారికి అవసరం అయ్యాయి. కనుక వాటిని మొదలుపెట్టవలసి వచ్చింది. వీటన్నిటి వెనుక ఉన్న మౌలిక ఉద్దేశ్యం దేశం నలుమూలలా ఆంగ్లేయులు విస్తరించటానికి దోహదపడే యంత్రాంగాన్ని సిద్ధం చెయ్యటం మాత్రమే. దీనినే ఆధునికీరణ అన్నారు. అయితే అందుకు అయిన వ్యయాన్ని భారతప్రజలమీద రుద్దారు. వీటివలన విపరీతంగా లబ్ది పొందింది మాత్రము ఆంగ్లపెట్టుబడిదారులు.

**తోటల పెంపకం (Plantation) :**

ఇంగ్లాండ్‌లో వస్త్రపరిశ్రమ విస్తరణతో ముడిపత్తి అవసరాలు పెరిగాయి. ప్రధానంగా భారతదేశం, అమెరికా, ఈజిప్టు దేశాలనుండి ఇంగ్లాండ్ ముడిపత్తిని దిగుమతి చేసుకొనేది. అంతర్గతయుద్ధం (Civil War) కారణంగా, అమెరికానుండి

ఆంగ్లేయుల ఏలుబడి–అంతులేని దోపిడీ

పత్తి దిగుమతులు ఆగిపొయ్యాయి. దీనితో మాంచెస్టరు మిల్లులు మూతపడే స్థితి వచ్చింది. మిగిలిన పాశ్చాత్యదేశాలుకూడా ముడిపదార్థాలకై తమ వలసదేశాలను కొల్లగొట్టడం మొదలుపెట్టాయి. పాశ్చాత్యదేశాలు అన్నీ యించుమించుగా ఒకేసారి పారిశ్రామికీకరణకు పూనుకోవటంతో ప్రపంచవ్యాప్తంగా పారిశ్రామిక ముడిపదార్థాలకు డిమాండ్ ఒక్కసారిగా పెరిగింది.

దీనికితోడు ఇంగ్లాండ్ విదేశీవాణిజ్యం పెరుగుతున్నకొద్దీ, ఉత్పత్తులను రవాణా చేయటానికి సంచులు కావలసి వచ్చాయి. అందుకు జనపనార సంచులు అనువైనవిగా తోచాయి. కాబట్టి జనపనార ఉత్పత్తికి, సంచుల తయారీకి ప్రాధాన్యం పెరిగింది. కొత్త పానీయాలు-కాఫీ, టీలతోపాటుగా పంచదారకు కూడా 16,17 శతాబ్ధాలలో ఇంగ్లాండ్‌తోపాటు మిగిలిన పాశ్చాత్యదేశాలలోనూ గిరాకీ పెరిగింది. ప్రతివారు కాఫీ, టీ లకు అలవాటుపడటంతో రెంటికి గిరాకీ విపరీతంగా పెరిగింది. పెరిగిన గిరాకీకి తగ్గట్లుగా వాటిని సేకరించటం కష్టమయ్యింది. పాశ్చాత్యదేశాలమధ్య వాటి సేకరణకు తీవ్రమైన పోటీ నెలకొనింది.

బ్రిటిష్ సామ్రాజ్యం తమకు కావలసిన ఆహారధాన్యాలను, పారిశ్రామిక ముడిపదార్థాలను తనకు తానుగా సమకూర్చుకోవాలని భావించింది. అంటే తన వలస ప్రాంతాలలో వాటిని ఉత్పత్తి చేసి, ఇంగ్లాండ్‌కు రవాణా చేయటానికి గల అవకాశాలను పరిశీలించింది. చైనానుండి తేయాకు దిగుమతులు తగ్గి, భారతదేశం క్రమంగా చైనా స్థానాన్ని ఆక్రమించటం వారికి ఆశాకిరణంగా కన్పించింది. కాఫీ కూడా భారతదేశం అదేవిధంగా సరఫరా చేయగలిగితే, ఇక ఇంగ్లాండ్‌కు కొఱత ఉండదు. అంతకు ముందు వెస్ట్ ఇండీస్ నుండి పంచదారను ఎక్కువ మొత్తంలో దిగుమతి చేసుకొనేది. అక్కడ బానిసత్వం రద్దు అయ్యాక, దిగుమతులు సరిపడాలేవు. వెస్ట్ఇండీస్ స్థానాన్ని భారతదేశం భర్తీ చేయగలదా అని ఆలోచన కూడా వారు చేసారు. అమెరికా ముడిపత్తి లాంక్‌షైరు మిల్లుల పత్తి దాహాన్ని అంతవరకు తీరుస్తూ వచ్చింది. అమెరికాకు బదులుగా భారతదేశమే తన వస్త్ర పరిశ్రమకు అవసరమైన ముడిపత్తిని మంచి నాణ్యతతో సరఫరా చేస్తే ఇంగ్లాండ్ ఇక వెదుక్కోవలసిన పనిలేదు. కాఫీ, తేయాకు, పంచదార, ముడిపత్తి ఎక్కువ పరిమాణంలో భారతదేశంనుండి వారు సేకరించదల్చుకొన్నారు.

**పరదామాటున దాగిన అమానుష బానిసత్వం :**

భారతభూములను ఆంగ్లేయులకు కేటాయించి, తోటల పెంపకానికి 1833లో

ప్రకటించిన ప్రోత్సాహకాల విధానంలో వనరుల దోపిడీకి వారు ఎన్నుకొన్న కొత్త మార్గపుఛాయలు బయటపడ్డాయి. ఈ కొత్త తోటల పెంపక విధానం (Plantation System) పల్చటి పరదామాటున దాగిన బానిసత్వం (Thinly veiled slavery) తప్ప మరొకటి కాదు. వెస్టిండీస్‌లోనూ, అమెరికాలోనూ బానిసత్వాన్ని పెంచి పోషించి వ్యవస్థీకృతం చేసిన వారు ప్రప్రథమంగా తోటల పెంపకందార్లు (Planters) అని మనం గుర్తుంచుకోవాలి. ఆంగ్ల ప్రభుత్వం పూర్తి సమ్మతి, ప్రోత్సాహాలతోనే బానిసల అక్రమరవాణా జరిగి, బానిసత్వం ఆ దేశాలలో పరాకాష్ఠకు చేరింది. తోటల పెంపకంలోనూ, శ్రామికులను నిర్బంధించి, కట్టుబానిసలుగా పనిచేయించటంలోను బాగా అనుభవం ఉన్న వారిని భారతదేశానికి పంపించారు. పరపీడనను అలవోకగా చేయగలవారు భారతదేశపు కాఫీ, తేయాకు తోటలలో అవే పద్ధతులను పాటించారు.[3]

1867లో అస్సాంలో తేయాకు తోటలలో పనిచేయటానికి కూలీలను తోటల యజమానులు నియమించుకున్న తీరుగురించి నాస్సాలీ ఈ విధంగా వ్రాసారు. “కూలీల సంఖ్యను పెంచి చూపించారు. అవినీతి, అణచివేత ఈ రెండూ కూలీల నియామకంలో ప్రధానపాత్ర పోషించాయి. వృద్ధులను, బలహీనులలను, యువకులను, పిల్లలను, అంగవైకల్యం ఉన్నవారిని, చివరకు గుడ్డివాళ్ళను, వ్యాధిగ్రస్తులను, చావటానికి సిద్ధంగా ఉన్నవారిని సైతం వదలకుండా అందరినీ తోటలలో పని చేయటానికి పురమాయించేవారు. అస్సామ్, కచార్ లలో 1861-62 లో జరిగిన ఈ దారుణాలముందు బానిసవ్యాపారంలో జరిగిన దారుణాలు తేలిపోతాయి అని చెప్తే అది సత్యదూరం కాదు”.[4]

**తోటల యజమానులు, పెంపకందార్లు అమలుచేసిన కట్టు బానిసత్వ విధానం ఏ ఒక్క ప్రాంతానికో పరిమితం కాలేదు. ఆంగ్లేయులు దేశంలో ఎక్కడెక్కడ కాలు మోపారో, అక్కడల్లా ఇవే విధానాలను అమలుచేశారు. తోటల యజమానుల, పెంపకందారుల ప్రయోజనాలను కాపాడేందుకు బ్రిటిష్ ప్రభుత్వం 'బానిస చట్టాలు' (Slave Laws)ను తీసుకొని వచ్చింది. నిరక్షరాస్యులు, అజ్ఞానులు అయిన సాధారణ స్త్రీ, పురుషులను, యువతీ యువకులను, పిల్లలను, పెద్దలను, తోటలలో పనిచేయటానికి ఒక ఒప్పందం మీద సంతకం చెయ్యమని అడిగేవారు. అక్షరాస్యత లేదు కనుక వారి వేలిముద్రలు తీసుకొనేవారు. ఆ ఒప్పందం ప్రకారం వారు నిరంతరాయంగా తోటలలో అహర్నిశలు పనిచెయ్యాలి. క్రమశిక్షణతో పనిచెయ్యాలి. పనికి రానివారిని, పనిలో ఏమరుపాటుగా ఉన్నవారిని అరెస్టు చేసేవారు. శిక్షించేవారు.**

వారు పారిపోవటానికి ప్రయత్నిస్తే క్రూరంగా చిత్రహింసలు పెట్టేవారు. వారిమీద వివిధ సెక్షన్ల క్రింద పోలీసులకు ఫిర్యాదు చేసేవారు. మోసం చేసో, బలప్రయోగం చేసో, అపహరించో కూలీలను మళ్ళీ తోటలకు చేరవేసేవారు. వారు తప్పించుకొని పోవటానికి వీలులేని నిర్బంధ వాతావరణం, భయానక పరిస్థితుల అక్కడ సృష్టించేవారు. ఏదోరకంగా కూలీలను తెచ్చుకొనేందుకు, వారిచేత నిర్బంధంగా పనిచేయించేందుకు చట్టబద్ధతను ఇంగ్లీషు ప్రభుత్వం బానిసచట్టాలద్వారా కల్పించింది. వివిధ వాణిజ్య పంటలను భారతదేశంలో ప్రోత్సాహించటానికి, పెంపు చేయటానికి, ఆంగ్లేయులకు అన్ని విధాలైన స్వేచ్ఛను, ప్రోత్సాహకాలను వారి ప్రభుత్వం కల్పించింది. వాణిజ్య పంటలను నిర్బంధంగానే పెంపుచేశారు. చట్టబద్ధ శ్రామికదోపిడీ బ్రిటీష్‌వారు సృష్టించిన నూతనమార్గాలలో ఒకటి.

1858లో ఒక పార్లమెంటరీ కమిటీని నియమించారు. పాశ్చాత్యుల వలసకు, వారి స్థిరనివాసానికి భారతదేశంలో ఉన్న అవకాశాలను, ఆ దిశగా సాధించిన ప్రగతిని సమీక్షించి, మరింత త్వరితగతిన వలసీకరణను పూర్తిచేయటానికి తీసుకొనవలసిన చర్యలగురించి అధ్యయనం చేయటానికి ఆ కమిటీని నియమించారు. శ్వేతజాతీయులు నివసించడానికి బాగా అనుకూలంగా ఉండే కొండ ప్రాంతాలలో, ఆరోగ్యకరమైన ప్రాంతాలలో ఈ వలసీకరణను వేగవంతంచేసే ప్రక్రియగురించి ప్రత్యేకంగా అధ్యయనం చెయ్యటం కూడా కమిటీకి యిచ్చిన బాధ్యత[6].

**భారత భూముల దందా :**

భారతదేశంలో చెఱకు, కాఫీ, తేయాకు, పత్తి, జనుము, నూనెగింజలు, గంజాయి, నీలిమందు, పొగాకు తోటలను యుద్ధప్రాతిపదికమీద అభివృద్ధి చేయటానికి ఆంగ్లేయులను, ఇతర శ్వేతజాతీయులను ఆహ్వానించి మరీ, ప్రోత్సాహించారు. ఇవేవీ రహస్యంగా చెయ్యలేదు. పెద్ద పార్లమెంటరీ కమిటీలు ఇంగ్లాండ్ అవసరాలకోసం భారతదేశంలో వాణిజ్యపంటలను ఎలా పండించాలో అధ్యయనం చేసి, అందుకు అనువైన ప్రోత్సాహకాలను గుర్తించి చేసిన సిఫారసులకు అనుగుణం గానే తీసుకున్నచర్యలు. ఆంగ్లేయులకు పెట్టుబడులకు గమ్యంగా ఆనాడు భారతదేశం నిలిచింది. తాము పెట్టిన పెట్టుబడులకు పదింతలు వారు లాభాలుగా పట్టుకొనిపోయారు. 1848లో వేసిన ఒక పార్లమెంటరీ కమిటీ చక్కెర, కాఫీ తోటల

పెంపకానికి సంబంధించి రెండువేల పేజీల నివేదికను తయారుచేసిందంటే ఆనాడు భారతదేశం వారికి ఎంత కల్పవృక్షం అయ్యిందో అర్థం చేసుకోవచ్చు.[6] భారతదేశంలో తోటల పెంపకందార్లకు అనేక ప్రోత్సాహకాలు ప్రకటించారు. వారందరూ ఆంగ్లేయులే అని వేరే చెప్పవలసిన పనిలేదు. కావలసిన పెట్టుబడి ఋణాలను తక్కువ వడ్డీరేట్లకే ప్రభుత్వమే సమకూర్చింది. దేశంలోని వివిధ ప్రాంతాలలో వందల వేల ఎకరాల భూములను ఉదారంగా వారికి కేటాయించారు. ప్రభుత్వానికి నామమాత్రం భాటకం వారు చెల్లించేవారు. సుదీర్ఘకాలంపాటు అంటే వందల సంవత్సరాలపాటు ఆ భూములను వారు సాగుచేసుకోవచ్చు. ఆ ప్రాంతాలలో బ్యాంకింగ్ సౌకర్యాలు కల్పించి, రహదారులు నిర్మించారు. భారత శిక్షాస్మృతిని ఆంగ్ల పెట్టుబడిదారీ వర్గానికి అనుకూలంగా రూపొందించారు. ఆ ప్రోత్సాహకాల కారణంగా ఇంగ్లాండ్ నుండి పెట్టుబడిదారులు తండోపతండాలుగా బయలుదేరారు. బంగారం తవ్వకాల సందర్భంగా ఏర్పడిన సంరంభంతో సమానంగా భారతదేశంలో భూములను స్వంతం చేసుకొనేందుకు విపరీతమైన పోటీ ఏర్పడింది. ఒక్క 1838లోనే 10,401 ఎకరాలను ఆంగ్లేయులైన తోటల పెంపకందార్లకు ప్రభుత్వం అమ్మివేసింది. 1841లో ఏకంగా 78,685 ఎకరాలను ఆంగ్ల పెట్టుబడిదారులు స్వంతం చేసుకున్నారు.[7]

1858 పార్లమెంటరీ కమిటీ ముందు, ఆంగ్ల పెట్టుబడిదారులకు ఇస్తున్న సదుపాయాల గురించి వాఙ్మూలం యిచ్చిన బ్రిటిష్ అధికారులు ప్రభుత్వ ఉదార విధానాలను ఏకరువు పెట్టారు. అస్సాంలో, నీలగిరి కొండలలో ప్రత్యేక తోటల పెంపకందార్ల ఆవాసాల (Plantation Colonies) సముదాయాలు వెలిశాయి. నీలిమందు ఉత్పత్తి చేయటంలో నిష్ణాతులైన వారిని వెస్టిండీస్‌నుండి పిలిపించి బీహార్, బెంగాల్ రాష్ట్రాలలో నీలిమందు (Indigo) తోటలు అభివృద్ధి చెయ్యటానికి వారికి సైతం వందలాది ఎకరాలను ఉచితంగా కేటాయించారు.

**తేయాకు తోటల పెంపకము :**

జాన్‌బ్రైట్ అధ్యక్షుడిగా ఒక పార్లమెంటరీ కమిటీని తేయాకు, పత్తి సాగుల విస్తీర్ణం పెంచేందుకు తీసుకోవలసిన చర్యలగురించి అధ్యయనం చేసేందుకు నియమించారు. అస్సాంలో తేయాకు తోటల అభివృద్ధికి ముందుకువచ్చే ఆంగ్లేయులకు అన్ని సదుపాయాలను, వసతులను ప్రభుత్వమే కల్పించాలన్న బ్రైట్ కమిటీ సిఫారసును ప్రభుత్వం అంగీకరించింది. ఔత్సాహకులను చైనాకు పంపి, తేయాకు విత్తనాలను సేకరించుకొని రమ్మని, సాగులో మెలుకువలు నేర్చుకొని

రమ్మని పంపింది. అంతేకాక చైనానుండి తేయాకు నిపుణులను రప్పించి వారి సహాయంతో అస్సాంలో తేయాకు తోటల పెంపకాన్ని భారీస్థాయిలో చేపట్టింది. అయితే ఇందుకయిన వ్యయమంతా భారతదేశమే భరించింది. 1888 నాటికే ఇంగ్లాండ్‌కు చైనానుండి తేయాకు దిగుమతులు తగ్గి, ఇండియానుండి ఎగుమతులు పెరిగాయి.

**కంపెనీ గంజాయి వ్యాపారం :**

అనేక శతాబ్దాలనుండి ఇంగ్లాండ్‌కు తేయాకును, టీ పొడిని చైనా ఎగుమతి చేస్తున్నది. తేనీరు సేవించటం ఇంగ్లాండ్‌లో నాగరికమయ్యాక, చైనా టీ కి విపరీతంగా డిమాండ్ పెరిగింది. దానితో చైనానుండి దిగుమతులు పెరిగాయి. చైనాకు చెల్లింపులు సుగంధద్రవ్యాల రూపంలో కాని, బంగారం రూపంలో కాని చెయ్యాలి. 1792లో చైనాకు నికరంగా £1.3 మిలియన్ల (13 లక్షల) పౌండ్లు ఇంగ్లాండ్ చెల్లించవలసి వచ్చింది. 1807 నాటికి ఇంగ్లాండ్ నికర చెల్లింపుల స్థాయి £10.5 మిలియన్ల (ఒక కోటి 5లక్షల) పౌండ్లకు పెరిగింది. దీనితో ఇంగ్లాండ్‌కు దిక్కు దోచలేదు. ఎలాగైనా చైనాకు చేసే నికర చెల్లింపుల స్థాయిని తగ్గించాలనుకొన్నది. అందుకు ఒక కుట్రపూరిత విధానాన్ని ఎంచుకుంది. ఒక వ్యూహం ప్రకారం నల్లమందును చైనీయులకు క్రమంగా అలవాటు చేసింది. మాదకద్రవ్యాల వ్యాపారానికి ఇంగ్లాండ్ తెరతీసింది. నల్లమందు నిషేధిత పదార్థం కనుక దానిని అక్రమంగా చైనాకు రవాణా చేసేవారు. నల్లమందును రేవు పట్టణాలకు చేరవేసి, దానిని రహస్యంగా అమ్మి, ఆ అక్రమమార్గాన సంపాదించిన బంగారంతో చైనా టీ పొడిని వారు కొనటం మొదలుపెట్టారు. 1750లో కేవలం 400 పెట్టెల (Chests) నల్లమందును చైనాకు అమ్మితే, 1810 నాటికి 4500 పెట్టెలను అమ్మారు. 1830-31 నాటికి 40 వేల పెట్టెల స్థాయికి నల్లమందు ఎగుమతులు చేరుకున్నాయి. దీనితో చైనానుండి ఇప్పుడు నికర నిధుల ప్రవాహం మొదలైంది. 1829-40 మధ్య ఈస్టిండియా కంపెనీ £47 మిలియన్ల (4 కోట్ల 70 లక్షల) పౌండ్ల విలువైన సుగంధ ద్రవ్యాలను చైనానుండి రాబట్టుకోగల్గింది.[8]

ఈ మొత్తం ప్రక్రియలో ఈస్టిండియా కంపెనీ అక్రమంగా ఎగుమతిచేసిన నల్లమందును భారతదేశంలోనే తయారుచేశారు. అందుకోసం గంజాయి సాగును పెద్ద ఎత్తున ప్రోత్సహించారు. గంజాయిసాగును ఇంగ్లాండ్ ప్రభుత్వమే గుత్తకు తీసుకొన్నది. కొన్ని దశాబ్దాలపాటు నల్లమందు తయారుచేసి అమ్మటంద్వారా ఇంగ్లాండ్ ఆదాయాన్ని సమకూర్చుకొంది. మాదకద్రవ్యాల ఉత్పత్తి, అక్రమంగా

 కోసం చైనీయులకు, భారతీయులకు నల్లమందు ఎగుమతి చేయటం, దాని మార్కెట్ కోసం చైనీయులకు, భారతీయులకు నల్లమందు తీసుకోవటాన్ని అలవాటు చేయటం ఇంగ్లాండ్ ప్రభుత్వం సాధించిన 'ఘనత'ల్లో ఒకటి.[9]

బ్రిటన్, ఇండియా, చైనాలమధ్య జరిగిన ఈ ముక్కోణపు వ్యాపారంలో విదేశీమారకద్రవ్య సముపార్జనలో నల్లమందు ఎగుమతి ఇంగ్లాండ్‌కు ప్రధాన వనరైంది. "నల్లమందు వ్యాపారంద్వారా గౌరవనీయ ఈస్టిండియా కంపెనీ సంవత్సరాల తరబడి అంతులేని ఆదాయాన్ని సంపాదించింది. దానిద్వారా బ్రిటీష ప్రభుత్వం, బ్రిటీషు జాతి కూడా రాజకీయంగా, ఆర్థికంగా ఎంతో ప్రయోజనాన్ని పొందారు. నల్లమందు వ్యాపారం కారణంగా ఇంగ్లాండ్, చైనాలమధ్య వాణిజ్యం ఇంగ్లాండ్‌కు అనుకూలంగా మారింది. దీనివలన భారతదేశంలో ఇంగ్లండ్ ఉత్ప త్తుల వినిమయం పదిరెట్లు పెరిగింది. అంతేకాక ప్రాచ్యదేశాలలో ఆంగ్ల సామ్రాజ్య ఆధిక్యత కొనసాగింపుకు ఆర్థిక వనరులు పుష్కలంగా లభించాయి. భారతదేశంలో ఆంగ్ల సామ్రాజ్యపాలనా వ్యవస్థమీద పెడ్తున్న వ్యయమంతటనీ ఈ ఆదాయంలో కొంతభాగంతో పూడ్చుకొన్నారు. 'టీ' ఎగుమతులద్వారా కూడా బ్రిటీషు కోశాగారానికి సమృద్ధిగా నిధులు వచ్చిపడ్డాయి. ఈ వాణిజ్య కార్యకలాపాలవల్ల ఏడాదికి నికరంగా £6 మిలియన్లు (60 లక్షల పౌండ్లు) సమకూరింది".[10]

నల్లమందు వ్యాపారానికి అంతటి మహత్తు ఉంది కనుకనే, చైనా నల్లమందు వాడకాన్ని అధికారకంగా నిషేధించటాన్ని ఇంగ్లాండ్ సహించలేకపోయింది. నల్లమందుకు బానిసలు అయిన చైనీయులు ఎందుకు కొరగానివారుగా తయారయ్యేవారు. అందువల్ల క్వింగ్ వంశపు రాజులు దాన్ని అనేక దఫాలుగా నిషేధించినా అక్రమంగా దేశంలోకి రవాణా అవుతున్న నల్లమందు ప్రజలకు తేలికగా లభ్యం అవటంతో ఫలితం లేకుండా పోయింది. రేవు పట్టణాలకు చేరవేస్తున్న నల్లమందు పెట్టెలను స్వాధీనం చేసుకొని, ధ్వంసం చెయ్యటం మొదలుపెట్టింది చైనా. ఇది తమ వ్యాపార ప్రయోజనాలకు దెబ్బ కనుక, ఈస్టిండియా కంపెనీ ఇంగ్లీషు ప్రభుత్వ మద్ధతుతో చైనాపై రెండుసార్లు యుద్ధం చేసింది. ఈ యుద్ధాలనే 'నల్లమందు యుద్ధాలు' (Opium Wars) అని చరిత్రలో ప్రసిద్ధిగాంచాయి. 'మొదటి నల్లమందు యుద్ధం' 1839-42 మధ్య జరగగా, 'రెండవ నల్లమందు యుద్ధం' 1856-60 మధ్య జరిగింది. రెండు యుద్ధాలలోనూ ఆంగ్లేయులదే విజయమయింది. కొన్ని రేవు పట్టణాలు, హాంగ్‌కాంగ్ ద్వీపం చైనానుండి ఇంగ్లాండ్

ఆంగ్లేయుల ఏలుబడి-అంతులేని దోపిడీ

వశపర్చుకోవటమే కాక, యుద్ధవ్యయాన్ని కూడా రాబట్టింది. నల్లమందు అమ్ముకొనే 'స్వేచ్ఛా వాణిజ్య హక్కు'ను యుద్ధాలు చేసి మరీ ఇంగ్లాండ్ దక్కించుకొంది.

**జనపనార మిల్లుల స్థాపన :**

ఇంగ్లాండ్ వాణిజ్య పరిమాణం పెరుగుతున్నకొద్దీ జనపనార సంచులకు గిరాకీ పెరిగింది. 1846 తర్వాత ఆహారధాన్యాలను నిల్వచేయటానికి, ఎగుమతి చేయటానికి జనపనార సంచులకు గిరాకీ ఏర్పడటంతో జనపనార సాగును విస్తరించటానికి ఆంగ్లేయులు పూనుకొన్నారు. 1850 నాటికి స్కాట్‌లాండ్‌లో జనపనార మిల్లులు స్థిరపడ్డాయి. 'క్రిమియన్ యుద్ధం' కారణంగా సంచులకు, మేజోళ్ళకు డిమాండ్ పెరిగింది. 1857లో కలకత్తా సమీపంలో జనపనార మిల్లులను స్థాపించారు. 1883 నాటికి ఒక్క ముడిజనపనారకే విపరీతమయిన డిమాండ్ ఏర్పడి, వాటి ఎగుమతులవిలువ ఆ ఒక్క సంవత్సరానికే 6 మిలియను (60లక్షల) స్టెర్లింగులు (పౌండ్లు) అయింది. బ్రిటన్, స్కాట్‌లాండ్‌లు భారతీయ జనపనారను పెద్దపెట్టున దిగుమతి చేసుకున్నాయి.

బెంగాల్ జనపనార పంటకు కేంద్రం. వారి సంస్కృతిలో అది భాగం. 17వ శతాబ్దం మొదటినుండి ఈస్టిండియా కంపెనీ జనపనార వ్యాపారంలో ప్రవేశించింది. ఆధునికీకరణ ప్రక్రియ ప్రారంభం అవటంతోనే జనపనార మిల్లులను ఆంగ్లేయులు స్థాపించారు. ఆంగ్ల జనపనార కర్మాగార యజమానులు కొద్దికాలంలోనే కుబేరు లయ్యారు. జనపనారను సేకరించి, జనప ఉత్పత్తులను ఎగుమతి చేసేవారు. 1895 నాటికి బెంగాల్ జనపనార పరిశ్రమ స్కాట్‌లాండ్ జనపనార పరిశ్రమను అధిగమించింది. అనేకమంది స్కాట్‌లాండ్‌నుండి వలసవచ్చి మరీ బెంగాల్‌లో జనపనార మిల్లులు స్థాపించారు. మొదటి ప్రపంచయుద్ధం సందర్భంగా ఒక బిలియన్(వందకోట్ల)కు పైగా జనపనార సంచులను ఒక్క బెంగాల్‌నుండే ఎగుమతి చేశారు. అమెరికాకు కూడా యించుమించుగా అంతే ఎగుమతులు చేశారు.

**ఆంగ్ల సామ్రాజ్యాభివృద్ధిలో పత్తి :**

ఇంగ్లాండుకు అత్యంత ముఖ్యమైనది ముడిపత్తి. ప్రపంచం మొత్తానికి కావలసిన పత్తిని ఉత్పత్తి చేయగల సామర్థ్యం భారతదేశానికి ఉందని మేజర్ జనరల్ బ్రిగ్స్ వ్యాఖ్యానించాడు[11]. ఈ సామర్థ్యాన్ని సాకారం చెయ్యాలంటే పత్తి సాగును దేశం నలుమూలలా విస్తరించాలి. ఇందువల్ల ఇంగ్లాండుకు కావలసిన నాణ్యమైన దేశవాళీ పత్తి చౌకగా లభిస్తుంది. 1848లో ఒక పార్లమెంటరీ కమిటీని పత్తిసాగు విస్తీర్ణం

పెంచేందుకు తగిన సూచనలు చెయ్యమని నియమించారు. మొట్టమొదటిసారిగా భూమిశిస్తు తగ్గింపు గురించి, భూముల కౌలు కాలపరిమితిగురించి ఆంగ్లపాలకులు కనీసం వినటానికి సిద్ధమయ్యారు. భారతీయరైతులపట్ల సానుభూతి వ్యక్తపరుస్తూ రైతులకు పెట్టుబడులు పెట్టేందుకు మూలధనం కూడా లేదని, లేదా మూలధనం సమకూర్చి పెట్టగల పరికరాలు, వసతులు సైతం లేవని, అందువలన పత్తి సాగును బలోపేతం చేయటం, సాగు విస్తీర్ణాన్ని దేశంలో పెంచటానికి వీలవటం లేదని కమిటీ అభిప్రాయపడింది. భూమిశిస్తు, భూముల కౌలు స్వభావం, కాలపరిమితి, ఉత్పత్తులను తరలించటానికి రహదారులు, వాహనాలు లేకపోవటం పత్తి సాగు విస్తీర్ణత పెంపుకు ప్రధాన ప్రతిబంధకాలుగా పార్లమెంటరీ కమిటీ గుర్తించింది.[12]

కమిటీయొక్క ఈ అభిప్రాయాలను చదివి కొందరు భారత పేదరైతుల దుస్థితికి ఆంగ్లపాలకులు కరిగిపోయారు అని అనుకో నారంభించారు. కాని వాస్తవాన్ని కుండబద్దలు కొట్టినట్లు చెప్పిన థామస్ బేజ్లీ (Thomas Bazley)కు మనం కృతజ్ఞులమై ఉండాలి. కమిటీముందు సాక్ష్యం యిస్తూ ఆయన ఇలా అన్నాడు. "భారతదేశానికి విశాలమైన భూభాగం ఉంది. దానిమీద ఉన్న జనాభా బ్రిటన్ తయారీ ఉత్పత్తులలో సింహభాగాన్ని వినిమయం చేయగలదు. వారి ఉత్పత్తులతో మనకు తగిన చెల్లింపులు చేయగలరా లేదా అన్నదే భారతదేశంలో మన వాణిజ్యానికి సంబంధించిన ప్రధానమైన ప్రశ్న"[13].

ఆంగ్లేయులకు ఇప్పుడు పత్తి భారీస్థాయిలో అవసరమైంది కనుక అనేక సానుకూల చర్యలు చేపట్టారు. ముడిపత్తి ఎగుమతులపై విధించిన సుంకాలను రద్దుచేశారు. 1836లో బెంగాల్ నుండి, 1838లో బాంబే నుండి, 1844లో మద్రాసు నుండి చేసే పత్తి ఎగుమతులపై సుంకాలను రద్దు చేశారు. దానితో పత్తి ఎగుమతులకు రెక్కలొచ్చాయి. పత్తి ఎగుమతులు 10 నుండి 18 మిలియను స్టెర్లింగులకు 1862-63లో, 35మిలియను స్టెర్లింగులకు 1864లో, 37 మిలియను (3 కోట్ల 70 లక్షలు) స్టెర్లింగులకు 1865 లో దూసుకొని వెళ్ళాయి. (ఒక మిలియన్‌కు పదిలక్షలు)

రైతులకు పత్తి సాగు చేయటానికి ప్రోత్సాహకంగా ఋణసౌకర్యం కల్పించ దలుచుకొన్నారు. గ్రామీణ వ్యవసాయ సహకార సంఘాలను ప్రారంభించారు. పత్తి పరిశోధనా కేంద్రాలను నెలకొల్పారు. సాగుకు నీరు అందించటానికి, కొన్ని ప్రాంతాలలో నీటిపారుదల సౌకర్యాలను మెరుగుపర్చటానికి పూనుకొన్నారు.

1861-65 మధ్య రైలు బండ్లను నడిపించటం ప్రారంభించటంతో, ఉత్పత్తి అయిన ముడిపత్తిని రేవు పట్టణాలకు చేర్చటం వేగవంతం అవటంతో పత్తి ఎగుమతులు పుంజుకొన్నాయి.

ముడిపత్తి ఆంగ్ల సామ్రాజ్య విస్తరణలో కీలకపాత్ర పోషించింది. ముడిపత్తి సరఫరా అనేది అతి ముఖ్యమైన ప్రభుత్వ బాధ్యత అయింది. ఆంగ్ల ప్రభుత్వం నియమించిన కాటన్ కమిటీ శాశ్వతరూపం దాల్చి 'ది ఎంపైర్ కాటన్ గ్రోయింగ్ కార్పోరేషన్'గా రూపాంతరం చెందింది. అమెరికాలో పత్తిని పెద్దపెద్ద తోటలలో పండించేవాళ్ళు. భారతదేశంలో అది సామాన్యరైతుల పంట అయింది. దానితో పత్తి సాగును అజమాయిషీ చేయటం ఇప్పుడు అవసరం అయింది. పత్తి విత్తనాలను ప్రభుత్వమే సరఫరా చేసేది. పత్తి దిగుబడులను పరిశీలించి, వాటి నాణ్యతను పరీక్షించే పని కూడా ప్రభుత్వానిదే. ముడిపత్తిని నాలుగు గ్రేడులుగా విభజించి, ప్రభుత్వమే కొనుగోలు చేసేది.

**వ్యవసాయ వ్యాపారీకరణ :**

ఆంగ్లేయులకు వాణిజ్యపంటలు అవసరమయ్యాయి కాబట్టి వాటి అభివృద్ధి మీదే దృష్టి నిలిపారు. కొత్తరకపు వాణిజ్యపంటలను, హెచ్చు దిగుబడి రకాల సాగును ప్రోత్సహించేవారు. దీనితో వరి, గోధుమ, ఇతర ఆహారపంటల సాగు నిర్లక్ష్యం చెయ్యబడ్డాయి. భూమిశిస్తులు, కఱవుకాటకాలు, నిత్యావసర వస్తువుల కొఱతలతో పూర్తిగా దెబ్బతిన్న రైతాంగం ఇప్పుడు ఆహారపంటల సాగును వదలిపెట్టి ప్రభుత్వం తమపై రుద్దుతున్న వాణిజ్యపంటలను ప్రభుత్వం ఇస్తున్న అరకొర సాయంతో సాగుచేయక తప్పని పరిస్థితులలోకి నెట్టివేయబడ్డది. అయితే ఆంగ్లేయులకు రైతాంగం దుస్థితి పట్టలేదు. భారతదేశ అభివృద్ధికి పెట్టుబడులు పెడ్తున్నట్లుగా, దాని వనరులను అభివృద్ధి చేస్తున్నట్లుగా చెప్పుకున్నది. ఒకటి రెండు తరాలు తర్వాత ఆంగ్లేయులు చెప్పిందే వాస్తవమని నమ్మటం ప్రారంభించారు. ఆంగ్లేయులు చేపట్టిన తోటల పెంపకం (Plantation Economy), సాగునీటి ప్రాజెక్టులు, పరపతి సంఘాలు, రైల్వేలు, రహదారులు ఆధునికతకు ప్రతీకలుగా అంగీకరించి, వారికి కృతజ్ఞులుగా ఉండటం మొదలుపెట్టారు. ఆంగ్లేయులకు వారి స్వార్థమే పరమావధి అని మర్చిపోయి, వారి ఆధునికీకరణ ప్రతీకలు అన్నీ వారి దోపిడీకి ఎంచుకున్న కొత్త మార్గాలని ఎక్కువమంది భారతీయులు తెలుసుకోకపోవటం ఆశ్చర్యకరం.

వ్యవసాయ వ్యాపారీకరణ (Commercialisation of Agriculture) ఫలితాలు వెనువెంటనే కనిపించాయి. ఇంగ్లాండ్ భారతదేశంనుండి పెద్దఎత్తున వ్యవసాయ ముడిపదార్థాలను తన పారిశ్రామిక అవసరాలకు తరలించింది. ఆహారపంటల సాగు విస్తీర్ణం తగ్గి, వాణిజ్యపంటల సాగు విస్తీర్ణం పెరిగింది. వాణిజ్యపంటల సాగు విస్తీర్ణం 1892-93 మరియు 1919-20 మధ్య 43 శాతం పెరిగింది. ఈ ప్రక్రియ మరింత వేగవంతమై 1934-35 నాటికి వాణిజ్యపంటల సాగు విస్తీర్ణం 54 శాతానికి పెరిగింది. ఆ మేరకు ఆహార పంటల కింద విస్తీర్ణం 1.5 మిలియను ఎకరాలకు తగ్గింది. బెంగాల్‌లో కొన్ని జిల్లాల్లో వరి సమృద్ధిగా పండించే ప్రాంతాలన్నీ జనుము పంటకే కేటాయించారు.

| <u>**ఎగుమతులు**</u> | **1859** | **1877** |
|---|---|---|
| | (£) | (£) |
| ముడిపత్తి | 40,94,100 | 1,17,46,184 |
| టీ | 60,533 | 26,20,140 |
| జనపనార | 9,17,523 | 26,36,647 |
| అపరాలు | 20,59,445 | 53,19,447 |
| చర్మాలు | 5,44,680 | 30,00,552 |
| టీ (1900-40) | 190 | 359 టన్నులు |
| ముడిపత్తి (1900-37) | 1,78,000 | 7,62,133 టన్నులు |
| నూనెగింజలు(1900-39) | 5,49,000 | 11,72,802 టన్నులు |

సర్‌జాన్ రస్సెల్ అనే వ్యవసాయ శాస్త్రవేత్త ఈ విధంగా వ్యాఖ్యానించాడు. "పత్తి, చెఱకు, గోధుమలక్రింద విస్తీర్ణం పెరిగింది. నీటిపారుదల సౌకర్యాల విస్తరణతో పాటుగా ఈ పంటల సాగువిస్తీర్ణం కూడా పెరిగింది. ఆహారపంటల క్రింద విస్తీర్ణం తక్కువగా పెరిగింది. ఆహారధాన్యాలు సాగు చేస్తున్న భూవిస్తీర్ణం తలసరి ప్రమాణంతోచూస్తే వాస్తవానికి గణనీయంగా తగ్గింది".[14]

భారతదేశంలో వివిధ పంటల కింద సాగు చేస్తున్న భూవిస్తీర్ణం పెరుగుదల వల్ల ప్రధానంగా ఇంగ్లాండ్ ప్రయోజనం పొందింది. వాణిజ్య పంటల ఉత్పత్తులతో పాటు ఆహారధాన్యాల ఉత్పత్తులను సైతం ఇంగ్లాండ్‌కు తరలించారు. పారిశ్రామిక అభివృద్ధి ఒకవైపు జరుగుతుండగా, ఇంగ్లాండులోని గ్రామీణప్రాంతాలు 'ఎన్‌క్లోజర్

ఉద్యమం' కారణంగా ఆర్థికంగా దెబ్బతిన్నాయి. పట్టణాలకు, నగరాలకు కావలసిన ఆహారాన్ని ఇంగ్లండ్ గ్రామీణ ప్రాంతాలు సరఫరా చెయ్యలేకపోతున్నాయి. దానితోపాటుగా అధిక వేతనాలకోసం డిమాండ్ ఇంగ్లాండ్‌లో పెరుగుతున్నది. కనుక ఆహారధాన్యాల ధరలు తగ్గించటం వారికి అనివార్యమైంది. ఆ సందర్భంగానే 'కారన్ చట్టాలు'ను (తిండిగింజల దిగుమతులపై విధించిన అదనపు సుంకాలను ఉపసంహరించుకొనే) ఆలోచన చేశారు. 1876-77లో భారతదేశంలో తీవ్రమైన కఱవు ఏర్పడింది. అయినప్పటికి భారతదేశంనుండి పెద్దపెట్టున గోదుమలను, బియ్యాన్ని ఇంగ్లాండ్‌కు తరలించారు.

వ్యవసాయ వ్యాపారీకరణద్వారా భారతదేశ రైతులు పొందింది ఏమిటి? బానిసత్వం, ఆకలి, కఱవులు. కొన్ని రకాల వాణిజ్య పంటలవల్ల భూసారం దెబ్బతినటం తప్ప రైతులుకు అదనంగా గిట్టింది ఏమీలేదు. నీలిమందు కమిషన్ రైతులు ఏవిధంగా ఇండిగో ప్లాన్టర్ల చేతుల్లో బానిసలుగా మారారో హృదయవిదారకంగా వర్ణించింది. ఏ రైతు అయినా నిర్బంధంగా అయినా, యిష్టపూర్వకంగా అయినా యజమానులనుండి ఒక్కసారి బయానా (Advance) తీసుకొంటే, ఆ తర్వాత అతను తన వ్యక్తిగతస్వేచ్ఛకు శాశ్వతంగా దూరం అవుతాడు".[15]

తేయాకు తోటలలో పనిచేసే రైతుల దుస్థితి కూడా అంతే. ఆధునికీకరణ ఈ దశలో బానిసత్వంలోకి నెట్టివేయబడ్డ భారతీయ రైతుల దుస్థితికి సరిసమానమైన సంఘటనలు చరిత్రలో కనిపించవు. ఆహారపంటలు పండించే భూములను బలవంతంగా వాణిజ్య పంటలకు మళ్ళించటంతో చాలా దుష్ఫలితాలు ఏర్పడ్డాయి. ఆహారధాన్యాల ఉత్పత్తి తగ్గింది. అయినప్పటికి ఆహారధాన్యాలను ఇంగ్లాండ్‌కు ధాన్యవ్యాపారం పేరుతో పెద్దపెట్టున తరలించారు. దానితో భారతదేశంలో ఆహారధాన్యాలకు తీవ్రమైన కొఱత ఏర్పడింది. లక్షలాది పేదలకు అన్నం కఱవైంది. ఆహారధాన్యాల ఎగుమతులతో, దేశంలో వాటి ధరలు పెరిగి, సామాన్యులకు అవి అందుబాటులో లేకుండా పోయాయి. దానితో తిండిగింజలకు కటకట వచ్చి, ఆకలి చావులు సంభవించాయి. బ్రిటిషువారు 20 మిలియను ఎకరాల బంజరు, అటవీ భూములకు సాగునీటి వసతిని కల్పించి, సాగులోకి తెచ్చారు. కాని అందువలన భారతీయులకు ఎట్టి ప్రయోజనమూ కలుగలేదు. ఆహారధాన్యాల సరఫరా మెరుగుపడలేదు. ఇంగ్లాండ్‌కు ఎగుమతి చేసేందుకు వాణిజ్య పంటలనే

పండించారు. దానితో భారతదేశం తీవ్రంగా నష్టపోయింది. పాలకులు సృష్టించిన కఱవు కాటకాలతో దేశం క్రుంగిపోయింది.[16]

వ్యవసాయరంగ వ్యాపారీకరణవలన కళ్ళకు కనపడని మరో నష్టం కూడా జరిగింది. వాణిజ్య పంటలమూలంగా, భూములలో సహజంగా ఉండే నత్రజని పాళ్ళు తగ్గి, దిగుబడులు పడిపోయాయి. 'నూనెగింజల' ఎగుమతి వలన ఎరువుగా ఉపయోగపడే సహజ ఉత్పత్తుల లభ్యత మందగించింది. నూనెగింజలనుండి నూనె తీసిన తర్వాత మిగిలే పిప్పిని అనాదిగా సహజఎరువుగా భారతదేశంలో కొన్ని ప్రాంతాలలో ఉపయోగిస్తారు. నూనెగింజలనుండి నూనెతీసి, దాన్ని ఎగుమతి చేసి ఉంటే, పిప్పిని రైతులు వాడుకొనేవారు. కాని దాన్ని కూడా భారతీయులకు వారు మిగల్చదలుచుకోలేదు. డా॥ వోల్కర్ (Voelcker) చాలా చక్కగా ఈ విషయాన్ని ఈ మాటల్లో చెప్పాడు. "మొత్తం విత్తనాన్ని ఎగుమతి చేయటం అంటే, భూసారాన్ని కూడా ఎగుమతి చేసినట్లే".[17]

**ఆంగ్లేయుల రైల్వే ప్రాజెక్టు:**

భారతదేశ నలుమూలలా చొచ్చుకొని పోవటానికి వీలుగా ఆంగ్ల పెట్టుబడిదారులు ఒక సరికొత్త రవాణా విప్లవానికి భారతదేశంలో పురుడుపోశారు. దాని పేరే రైల్వేలు. భారతదేశంలో వారు మొదలుపెట్టిన 'ఆధునికీకరణ' ప్రక్రియలో కీలకమైన భూమికను రైల్వేలు పోషించాయి. ఉష్ణమండల దేశపు (Tropicals) సంకెళ్ళను బ్రిటిషు వారు యంత్ర రవాణా తాళంతో తొలగించారని ఎల్.సి.ఏ.నౌల్స్ (L.C.A. Knowles) వ్యాఖ్యానించారు.[18]

భారతదేశంనుండి భూమిశిస్తుల రూపంలో, వాణిజ్య లాభాల రూపంలో ఆర్థికవనరులు ఇంగ్లాండ్‌కు వఱదలెత్తాయి. ఆంగ్ల పెట్టుబడిదారులకు వారికి సమకూరిన మూలధనాన్ని ఉపయోగించుకొని తిరిగి లాభాలు సంపాదించుకోవటానికి తగిన మార్గాల కోసం అన్వేషించారు. 1830,40వ దశకాలలో ఇంగ్లాండ్‌లో పెట్టుబడులకు గల అవకాశాలు అన్నింటినీ వాడుకున్నారు. బయట దేశాలలో పెట్టుబడులు పెట్టేందుకు, తద్వారా లాభాలు ఆర్జించేందుకు వారు తహతహలాడుతున్న దశాబ్దాలు అవి. ఇంగ్లాండ్‌లో వస్త్ర పరిశ్రమ, ఉక్కుపరిశ్రమ పుంజుకొనే దశలో ఉన్నాయి. ఉక్కును విదేశాలకు ఎగుమతి చేయగల అవకాశాలు కోసం ఎదురుచూస్తున్నారు ఉక్కు పరిశ్రమాధిపతులు. భారతదేశానికి వాగన్లు, ఇంజన్లు, పట్టాలు, ఇతర యంత్రాలు, పరికరాలు ఎగుమతి చేయగలిగితే ఇంగ్లాండ్

ఉక్కు పరిశ్రమకు పట్టపగ్గాలు ఉండవు. అలాంటి అవకాశం కల్పించండని వారు పార్లమెంటును ఒత్తిడి చేయసాగారు. పత్తి సరఫరాదారులు, వ్యాపారులు, ఇనుము-ఉక్కు పరిశ్రమల యజమానులు, రైల్వేప్రమోటర్లు ప్రభుత్వంమీద తీవ్రమైన ఒత్తిడి తీసుకొని రాసాగారు. భారతదేశపు నలుమూలలనుండి ముడిపదార్థాలను తెచ్చుకోవటానికి, ఉత్పత్తులను అమ్ముకోవటానికి రైల్వేలు తప్ప వేరే ప్రత్యామ్నాయ రవాణా సదుపాయం మరొకటి లేదని రైల్వేప్రమోటర్లు అనేకసార్లు బ్రిటిషు ప్రభుత్వం దృష్టికి తీసుకొని వచ్చారు. దీనికితోడు రైల్వేల కారణంగా సైనికులను, రక్షక భటులను ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి వేగంగా తరలించవచ్చని, రాజకీయ, అధికార సుస్థిరతకు సైతం భారతదేశంలో రైల్వే నిర్మాణమార్గాలను చేపట్టటం అవసరమని పార్లమెంటు సభ్యుల దృష్టికి తీసుకొని వచ్చారు.

ఇంగ్లాండ్ ఆర్థికసలహాదారు పీటర్ రైల్వేలద్వారా మరింతగా ముడిపత్తిని సేకరించవచ్చని తలచాడు. భారతదేశంలో రైల్వేల నిర్మాణానికి ఆద్యుడైన డల్‌హౌసీ రైల్వేల విధానం గురించి ఇలా వ్రాశాడు. "ఇంగ్లాండుకు ముడిపత్తి అవసరం ఎంతైనా ఉంది. భారతదేశం సరిపడా మొత్తాన్ని మంచి నాణ్యతతో ఉత్పత్తి చేయగల స్థితిలో ఉంది. అయితే ముడిపత్తిని ఉత్పత్తికేంద్రాలనుండి రేవుపట్టణాలకు చేరవేయటానికి తగిన రవాణా సౌకర్యాలు ఉంటేనే ఇంగ్లాండుకు అందువల్ల ప్రయోజనం చేకూరుతుంది".[19] భారతదేశం ఇంగ్లాండ్‌కు ఉపయోగపడాలంటే, పత్తి, ఆహారధాన్యాలు, కాఫీ, టీ, పంచదార, నీలిమందు, జనుము, ఖనిజాలు మొదలైనవి చేరవేయటానికి రేవుపట్టణాలకు రహదారులు, రైలుమార్గాలు తప్పనిసరిగా నిర్మాణం చేసితీరాలి. ఈ వ్యవసాయ ముడిపదార్థాలు అన్నీ పరిమాణంలో బరువైనవి కనుక వాటి రవాణా వారికి పెద్ద సమస్యగా మారింది. రైల్వేలు అందుకు సరైన పరిష్కారమయ్యాయి.

**అవసరం వారిది, అందుకైన ఖర్చు మనది :**

కేవలం ముడిపదార్థాల తరలింపు కోసమే కాదు. ఇంగ్లాండ్ తన ఉత్పత్తులను దేశపు నాలుగు చెఱగులా ఉన్న గ్రామాలకు చేరవేయాలన్నా రవాణా సౌకర్యాలు పెంపుచెయ్యాలన్న అవసరాన్ని వారు గుర్తించారు. అంతవరకు వారి అమ్మకాలు కేవలం కొన్ని పట్టణాలకు మాత్రమే పరిమితం అయ్యాయి. దేశంలో అనేక చిన్న పట్టణాలు, గ్రామాలు ఉన్నాయి. దేశం నలుమూలలా జనావాసాలు ఉన్నాయి. వారి ఉత్పత్తులను ఆ ప్రాంతాలకు చేరవేస్తే వారికి కాసులపంట కురుస్తుంది.

అందుకే డల్‌హౌసీ ఇలా అంటున్నాడు "కొత్త మార్కెట్లు ప్రపంచపు ఈ భాగంలో మనకోసం ఎదురుచూస్తున్నాయి. వాటి కొనుగోలు సామర్థ్యాన్ని మనలో అత్యంత తెలివిగలవారు సైతం అంచనావేయటం కష్టసాధ్యం. భవిష్యత్తులో ఆ మార్కెట్లు ఏవిధంగా విస్తరిస్తాయో కూడా అంచనా వేయటం కష్టం. కనుక ఆ మార్కెట్లను చేరుకోవటం మన తక్షణ కర్తవ్యం".[20]

అందుకు రైల్వేలు వారికి అవసరం అయ్యాయి. వాస్తవానికి బ్రిటన్ ఆక్రమించిన వలసదేశాలు 1850 తర్వాత బ్రిటన్ ఉత్పత్తులలో సింహభాగాన్ని వినిమయం చేశాయి. కనుక వాటి అభివృద్ధిద్వారా సమీప భవిష్యత్తులో వాటిని మరింత పెద్ద మార్కెట్లుగా తీర్చిదిద్దవచ్చునని ఆంగ్లేయులు ఆశించారు. 1873-86 మధ్య ఇంగ్లాండ్‌లో వచ్చిన ఆర్థికమాంద్యంనుండి ఇంగ్లాండ్ బయటపడటానికి వలసదేశాల మార్కెట్లే కారణ మయ్యాయి. ఈ అవగాహన వారిలో కొత్త ఆశలు రేకెత్తించాయి. తమ వలస దేశాలతో మరింత లోతైన, విస్తృతమైన, వర్తక వాణిజ్య సంబంధాలవల్ల ఆర్థిక రంగపు ఆటుపోట్లను బ్రిటన్ తట్టుకోగలదన్న విశ్వాసం వారికి కల్గింది. బ్రిటన్ కనుక మార్కెట్లను విస్తరించు కోకపోతే తన పెరుగుతున్న జనాభా అవసరాలను ఏ మాత్రం తీర్చలేదు. వారికి ఉపాధి అవకాశాలు పెరగవు. కనుక మార్కెట్ల విస్తరణ మీద ఇంగ్లాండ్ దృష్టి పెట్టక తప్పలేదు. అందుకు భారతదేశం ఒక పెద్ద ప్రయోగశాల అయింది.[21]

దానికి తోడు ఆంగ్లవ్యాపారులు, పరిశ్రమల యజమానులు సైతం మెరుగైన రవాణా సౌకర్యాల అవసరం కోసం పదేపదే విజ్ఞప్తి చేయటం మొదలుపెట్టారు. మారుమూల ప్రాంతాలకు ఉత్పత్తులను చేరవేయటానికి రవాణాసౌకర్యాలను మెరుగుపర్చాలని, రహదారులను నిర్మించాలని డిమాండ్ చేయటం మొదలుపెట్టారు. అంతేకాదు, భారతదేశ పేదప్రజానీకానికి ఇంగ్లాండ్‌లో యంత్రాలమీద తయారైన చౌకవస్త్రాలను అందజేయాలంటే బ్రిటిషు ప్రభుత్వం రవాణాసౌకర్యాలు కల్పించాలని, అలా చేయకుంటే పేదల నమ్మకాన్ని బ్రిటిషు ప్రభుత్వం కోల్పోతుందని కూడా హెచ్చరించారు. అకస్మాత్తుగా ఇంగ్లండ్ మిల్లు యజమానులకు భారతదేశంలోని నిరుపేదలు గుర్తుకువచ్చారు! కట్టుకోవటానికి వారికి బట్టలు సరఫరా చేయటం తమ బాధ్యతగా కూడా వారికి తోచటం చారిత్రక విద్దూరం కదూ! అంతేకాదు ఈస్టిండియా కంపెనీ ప్రజల బాగోగులను పట్టించుకోకుండా, తన స్వంత ప్రయోజనం చూసుకుంటుందని వారు విమర్శించారు. ఈ 'పవిత్ర లక్ష్యాల' కోసం

బ్రిటిష పార్లమెంటు సభ్యులమీద వారు ఒత్తిడి తీసుకొని వచ్చారు. భారతదేశంలో రైల్వే మార్గాలను నిర్మాణం చెయాలని, రేవు పట్టణాలను, మారుమూల ప్రాంతాలను కలుపుతూ సులభంగా సరుకు రవాణాకు మార్గం సుగమం చెయ్యాలని డిమాండ్ చేయసాగారు. అందుకు చాలా వ్యయం అవుతుంది కాబట్టి, ఆంగ్ల పెట్టుబడిదారులకు రైల్వేల నిర్మాణానికి అనుమతులు యివ్వాలని చెప్పారు. ఒకవేళ వారు అందుకు ముందుకు రాకపోతే, లేదా అది ప్రభుత్వానికి యిష్టం లేకపోతే, ఆంగ్ల ప్రభుత్వమే రైలు మార్గాలను భారతదేశంలో నిర్మించాలని వారు డిమాండ్ చేయసాగారు.

భారతదేశంలో రైల్వేల నిర్మాణంవల్ల ఆంగ్ల పెట్టుబడిదారులు, కంపెనీ ప్రమోటర్లు, ఇనుము ఎగుమతిదారులు, బొగ్గు గనుల యజమానులు, రైల్వే ఇంజనీర్లు, డైరక్టర్లు, వారితోపాటుగా రైల్వేలలో ఆకర్షణీయమైన ఉద్యోగాలలో నియమింపబడే ఆంగ్లేయులు ప్రధాన లబ్ధిదారులు. వ్యాపారులు, మిల్లుల యజమానులగురించి చెప్పవలసిన పనిలేదు. వారి ఉత్పత్తులను దేశమంతటా ఇప్పుడు అమ్ముకోవచ్చు. వారికి కావలసిన ముడిపదార్థాలును సేకరించుకోవచ్చు. భారత ఆర్థిక వ్యవస్థలోకి మరింత లోతుగా, విస్తృతంగా చొచ్చుకొని పోవటానికి ఆంగ్లేయులకు రైల్వేలు చక్కటి రాజమార్గమని వారు గుర్తించారు. వాస్తవాలు ఇలా ఉండగా ఆంగ్లేయులు భారతీయులకు కాకమ్మ కథలు చెప్పటం ప్రారంభించారు. రైల్వేలవల్ల భారతదేశపు పేదరికం పోతుందని, కఱవుకాటకాల నుండి రక్షణ కల్గుతుందని, రాజకీయ ఐక్యత ఏర్పడుతుందని, పారిశ్రామికీకరణ వేగవంతం అవుతుందని, దేశవిదేశీ వాణిజ్యాలు అభివృద్ధిచెంది రైతులకు మేలు జరుగుతుందని, మొత్తం ఆర్థికవ్యవస్థ ఆధునికీకరణ అవుతుందని చెప్పారు.[22]

**రైల్వే ప్రమోటర్లకు రాయితీలు, హామీలు :**

భారతదేశంలో రైల్వేమార్గాల నిర్మాణానికి, ఆ మార్గాలలో రైల్వేల నిర్వహణకు ప్రభుత్వం అనేక రాయితీలు ప్రకటించింది. హామీలు యిచ్చింది. రైలు మార్గాల నిర్మాణానికి కావలసిన భూములను ఉచితంగా సమకూర్చి పెట్టింది. పెట్టుబడిదారులకు తక్కువ వడ్డీకి అప్పులు యిచ్చింది. ఆ పెట్టుబడులమీద వచ్చే రాబడికి ప్రభుత్వమే హామీ యిచ్చింది. రాయితీలు, హామీలు యివ్వకపోతే భారతదేశంలో వేగంగా రైలుమార్గాల నిర్మాణం జరగదని ఆంగ్ల ప్రభుత్వం భావించింది. అయితే అందుకు అయిన వ్యయమంతా భారతీయులనుండే

శిస్తులరూపంలో వసూలు చేశారు. కాబట్టి ఆంగ్ల ప్రభుత్వానికి వచ్చిన నష్టమేమీలేదు. నష్టపోయిందల్లా భారతదేశం, దాని ప్రజలు.[23] 1872లో పార్లమెంటు స్థాయీ సంఘం ముందు తన అభిప్రాయాన్ని చెప్తూ కల్నల్ చెస్నీ ఇదే విషయాన్ని చెప్పారు. "ప్రైవేటు వ్యక్తులకు, సంస్థలకు గట్టి ప్రోత్సాహకాలు యివ్వాలి. భారతదేశంలో రైలు మార్గాల నిర్మాణానికి రాయితీలు కల్పించాలి. నష్టాలు రాకుండా చూడాలి. వారికి కేవలం లాభాలు మాత్రమే వచ్చేటట్లుగా హామీలు యివ్వాలి".[24]

మరే దేశంలోనూ అంగ్లపెట్టుబడిదారులకు ఇటువంటి రాయితీలు, హామీలు లభించలేదు. కనీసం వారి దేశంలో కూడా అట్టి సదుపాయం వారికి దక్కలేదు. దానితో భారత్‌లో పెట్టుబడులకు వారు ఉరకలు వేశారు. పెట్టుబడులమీద ఆకర్షణీయమైన లాభశాతాన్ని ఇవ్వటానికి ప్రభుత్వం హామీ ఇచ్చింది. రాబడి రేటు స్థిరంగా ఉంటుంది. ఎక్కువ పెట్టుబడిమీద ఎక్కువ రాబడి, తక్కువ పెట్టుబడిమీద తక్కువ రాబడి వస్తుంది. కనుక పెట్టిన దానికంటే ఎక్కువ మొత్తాన్ని పెట్టుబడి పెట్టినట్లుగా చూపించి ప్రభుత్వంనుండి లాభాలు గుంజుకొన్నారు. నిర్మాణవ్యయాన్ని తగ్గించేందుకు వారెట్టి ప్రయత్నం చెయ్యలేదు. రైలుమార్గాలు నిర్మాణం చేసాక సరుకు రవాణాద్వారా గరిష్ఠ ఆదాయాన్ని పొందటానికి వారు ప్రయత్నం చెయ్యలేదు. నష్టపోతామన్న భయం వారికి లేదు. ప్రభుత్వమే పెట్టుబడులమీద ఇంత రేటు చొప్పున లాభాలు పంచుతున్నప్పుడు వ్యయాన్ని తగ్గించుకోవాలని, ఆదాయాన్ని పెంచుకోవాలని ఎవరికి ఉంటుంది?

రాయితీలవల్ల, ఖచ్చిత లాభార్జన హామీ వల్ల ప్రపంచంలో మిగిలిన దేశాలలో కంటే వేగంగా భారతదేశంలో రైలు మార్గాల నిర్మాణం జరిగింది. 1860లో కేవలం 1349 మైళ్ళమేర మాత్రమే నిర్మాణం జరగగా, 1890 నాటికి 25495 మైళ్ళమేర రైలుమార్గాలను నిర్మాణం చేశారు. 1920 నాటికి 56,980 మైళ్ళమేర రైలు మార్గాల నిర్మాణం చేశారు. 1946 నాటికి 65,217 మైళ్ళు అంటే భారతభూభాగంలో 78శాతం ప్రాంతాలకు రైలు మార్గాలు నిర్మించారు. మొదటి నాలుగు దశాబ్దాలలో (1850-91) కేవలం 17,308 మైళ్ళమేర నిర్మాణం జరగ్గా, ఆతర్వాత రెండు దశాబ్దాలలోనే (1892-1905) 10,746 మైళ్ళ రైళ్ళ మార్గాల నిర్మాణం జరిగింది. అంతవేగంగా ఇంగ్లాండ్‌లోనూ, ఫ్రాన్సులోనూ నిర్మాణం జరగలేదు. అయితే నిర్మాణ వ్యయానికి ఆకాశమే హద్దు అయింది. డల్‌హౌసీ ప్రతిమైలుకు 800 పౌండ్లు ఖర్చు అవుతుందని

అంచనావేస్తే, 1800 పౌండ్లు ఖర్చు అయింది. బ్రిటిషు పెట్టుబడిదారులకు రాయితీల రూపంలో, లాభాలరూపంలో కేవలం 1849-1900 మధ్యే £ 568 మిలియన్లు (56.8 కోట్ల పౌండ్లు) చెల్లించారు. భారతదేశంలో రైల్వేలు భారతీయులకోసం ప్రవేశపెట్టలేదు. బ్రిటన్‌కు రైల్వేలు ఉపయోగపడతాయి కాబట్టి, వాటి నిర్మాణాన్ని భారతదేశంలో భారతనిధులతో చేపట్టారు. నిర్మాణ ప్రక్రియలో భాగంగానూ, విస్తరణ ప్రక్రియలో భాగంగాను ఎవరికి తోచినంత వారు దోచేశారు.

కొందరు కీన్సు పండితుని అభిమానులైన ఆర్థికవేత్తలకు రావలసిన అనుమానమే వచ్చింది. రైల్వేలలో పెట్టుబడుల రూపంలో ఇంగ్లాండ్‌నుండి పెద్ద ఎత్తున విదేశీ పెట్టుబడులు భారతదేశానికి వచ్చినా, వాటివలన భారతదేశం ఎందుకు ప్రయోజనం పొందలేక పోయిందన్న అనుమానం చాలామందికి కలిగింది. 19వ శతాబ్దంలో అంతస్థాయిలో విదేశీ పెట్టుబడులు ఏ దేశంలోకి ప్రవహించలేదు. అయినప్పటికీ ఆ పెట్టుబడుల ప్రభావం దేశంమీద పడలేదు. పరిశ్రమలు వృద్ధిచెందటానికి ఆ పెట్టుబడులు దోహదం చెయ్యలేదు. దానికి కారణాలకోసం ఎక్కువగా వెదకవలసిన పనిలేదు. అమెరికా, కెనడా, జపాన్, ఫ్రాన్సు, జర్మనీ, బ్రిటన్‌లలో రైలు మార్గాల నిర్మాణానికి, రైల్వేల అభివృద్ధికి ఎంచుకొన్న మార్గాలు వేఱు. ఆ దేశాలలో రైల్వేల అభివృద్ధి లక్ష్యాలు వేఱు. భారతదేశంలో ఆంగ్లేయుల లక్ష్యాలు వేఱు. అందువల్ల రైలుమార్గాలు ఏర్పడినా, రైల్వేలద్వారా సరుకు రవాణా జరుగుతున్నా వాటివలన భారతదేశానికి కానీ, దాని ప్రజానీకానికి కానీ ఎట్టి ప్రయోజనం జరుగలేదు.

రైల్వేలకు లాభసాటి వ్యాపారం కల్పించేందుకుగాను ప్రత్యామ్నాయ రవాణా మార్గాలను కావాలనే అభివృద్ధి చెయ్యలేదు. 1878లో రైల్వే కమిటీ ముందు సర్ ఆర్థర్ కాటన్ వాఙ్మూలం ఇస్తూ ఈ విధంగా అన్నాడు. "భారత ప్రభుత్వం సాగునీటి సౌకర్యాలను, రవాణాకు అనుకూలమైన కాలువలను అభివృద్ధి చేయలేదు. ఎందుకంటే వాటివల్ల రైల్వేలకు దెబ్బ. తూర్పు బెంగాల్ రైల్వేలు రెండు లక్షల టన్నుల సరుకు రవాణా చేయగలవు. రైలు మార్గాల పక్కనే ఉన్న కాలువలు 20 లక్షల టన్నుల సరుకును, పెద్ద సంఖ్యలో ప్రయాణికులను రవాణా చేయగలవు. కనుక జలరవాణాను ప్రోత్సహిస్తే, అభివృద్ధి పరిస్తే రైల్వేలు మనుగడ సాగించటం కష్టం".[25]

**సరుకు రవాణా ఛార్జీలలో జాతివివక్ష :**

పోటీకి వచ్చే రవాణా సదుపాయం మరొకటి లేదు కనుక, ఆంగ్ల రైల్వే కంపెనీలు సరుకు రవాణాకు వారికి యిష్టం వచ్చిన ధరలను నిర్ణయించారు. ప్రభుత్వం ఎప్పుడూ రైల్వేలను నియంత్రించడానికి పూనుకోలేదు. వారిది యిష్టారాజ్యం అయింది. కేవలం లాభార్జన దృష్టితోనే రైల్వే కంపెనీలు నడిచాయి. రైల్వేలు సరుకు రవాణా ఛార్జీల వసూలులో సైతం ఎంతో వివక్ష చూపేవారు. రైల్వేల వివక్షాపూరిత విధానాలవలన దేశీయ కంపెనీలు విదేశీ కంపెనీలతో పోటీ పడలేకపోయాయి. బొగ్గు గనులు ఎక్కువగా తూర్పుప్రాంతంలో ఉన్నాయి. 'ఈస్టిండియా రైల్వేకంపెనీకి' ఈ గనులనుండి బొగ్గు రవాణా చేయటానికి గుత్తాధిపత్య హక్కు ఉంది. దానితో భారతదేశపు బొగ్గు ఖరీదు ఇంగ్లండ్‌నుండి నౌకలద్వారా దిగుమతి చేసుకొనే బొగ్గు ఖరీదుకంటే ఎక్కువైంది. దీనివలన రెండు దుష్ఫలితాలు కలిగాయి. మొదటిది భారతీయ బొగ్గు పరిశ్రమ కుంటుపడింది. కాగా ఇంగ్లాండ్‌లో బొగ్గుపరిశ్రమ పుంజుకొంది. రైల్వేలు సైతం దిగుమతి చేసుకున్న బ్రిటిషు బొగ్గునే తమ ఆవిరి ఇంజన్లలో వాడారు. తాము రవాణా చేస్తున్న భారతదేశపు బొగ్గుకంటే దిగుమతి చేసుకున్న బొగ్గు చౌకగా లభ్యం అవటంతో, దిగుమతి బొగ్గును వాడారు. ఇక్కడ గమనార్హమైన అంశం ఒకటి ఉంది. ఉత్పత్తి వ్యయం కారణంగా భారతదేశపు బొగ్గు ఖరీదు అవలేదు. వాస్తవానికి భారతదేశంలో బొగ్గు వెలికితీతకు ఎక్కువ లోతుకు వెళ్ళనవసరం లేదు. అంతేకాక శ్రమశక్తితో, తక్కువ ఖర్చుతో దానిని వెలికితీసేవారు. కాని రవాణాపై ఈస్టిండియన్ రైల్వేలకు ఉన్న గుత్తాధిపత్యం కారణంగా, వారి యిష్టానుసారంగా రవాణా ఛార్జీలను నిర్ణయించిన కారణంగా, భారతదేశపు బొగ్గు ఖరీదు విచిత్రంగా దిగుమతి చేసుకొన్న బొగ్గు ఖరీదు కంటే ఎక్కువైంది.[26]

ఇంగ్లాండ్‌కు ఎగుమతి అయ్యేవాటి రవాణాకు, ఇంగ్లాండ్‌నుండి దిగుమతి అయ్యేవాటి రవాణాకు తక్కువ ఛార్జీలు ఉండేవి. భారత ఉత్పత్తిదారుల ఉత్పత్తులకు రవాణా ఛార్జీలు ఎక్కువగా ఉండేవి. జాతి వివక్ష కొట్టవచ్చినట్లు కన్పడేది. ఎగుమతికి ఉద్దేశించబడిన పారిశ్రామిక ముడిపదార్థాలు, ఆహారధాన్యాలకు మొదటి ప్రాముఖ్యత ఉండేది. వాటిని తక్కువరేట్లకే రవాణా చేసేవారు. అలాగే ఇంగ్లండ్ నుండి దిగుమతి అయ్యే ఉత్పత్తులను భారతదేశంలోని మార్కెట్లకు చేరవేయటానికి కేవలం నామమాత్ర ఛార్జీలు వసూలు చేసేవారు. కొన్ని రకాల ఉత్పత్తులను ఉచితంగానే భారతమార్కెట్లకు చేరవేసేవారు. కాని భారతదేశ ఉత్పత్తిదారుల ఉత్పత్తి రవాణాపై ఆంక్షలు

ఉండేవి. ఎన్నో నియమనిబంధనలు ఉండేవి. రవాణాఖర్చు తడిసిమోపెడు అయ్యేది. భారత ఉత్పత్తిదారుల ఉత్పత్తులు సుదూర మార్కెట్లకు చేరకూడదన్న కుట్ర ఈ విధానాలవెనుక ఉంది. అలాగే భారత ఉత్పత్తిదారులు దిగుమతి చేసుకున్న ముడిపదార్థాలు, యంత్రాలు, యంత్రసామాగ్రి చేరవేయటానికి సైతం ఆంక్షలు విధించేవారు. వాటి రవాణాకు ఛార్జీలు కూడా అధికంగానే ఉండేవి. రేవు పట్టణాలను అనుసంధానం చేస్తూ నిర్మించిన రైలుమార్గాలపై రవాణాఛార్జీలు తక్కువగా ఉండేవి. అదే భూభాగంపై ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి అంతే దూరానికి రవాణా ఛార్జీలు ఎక్కువగా ఉండేవి. ఇంగ్లండ్ నుండి దిగుమతి అయ్యే బొగ్గు, నూలువస్త్రాలు, ఉప్పు, నూలు మొదలైన వాటికి, రవాణా ఛార్జీలు తక్కువగా నిర్ణయించారు. ఆ విధంగా ఆంగ్లేయులు నిర్మించి నిర్వహించిన రైల్వేలు భారతీయులకు ప్రయోజనకరంగా కాక తెల్లవారికి లాభాలు తెచ్చిపెట్టే సాధనాలు అయ్యాయి.

సరుకురవాణా తేలిక అవటంతో ఇంగ్లండ్ నుండి దిగుమతులు పెరిగాయి. మారుమూల గ్రామాలకు సైతం ఇంగ్లాండ్ ఉత్పత్తులను చేరవేయగలిగారు. 1862–1929 మధ్య దిగుమతుల విలువ 350శాతంకు పైగా పెరిగింది. అలాగే రైల్వేలకు వచ్చిన ఆదాయంలో 60శాతం ఎగుమతులకు ఉద్దేశించిన వ్యవసాయ ఉత్పత్తుల ద్వారాను, 20శాతం దిగుమతి చేసుకున్న ఇంగ్లాండ్ ఉత్పత్తులద్వారాను లభించింది. అంటే వాటిని ఎవరి అవసరాలకోసం అభివృద్ధి పరిచారో తెలుసుకోవటం తేలిక అవుతుంది. అంతేకాదు. రైల్వేలకు ముందు వ్యవసాయ ఉత్పత్తులలో కొంత శాతం మాత్రమే ఎగుమతి అయ్యేది. రైలు మార్గాల నిర్మాణం జరిగాక, ఆహార, వాణిజ్యపంటల ఉత్పత్తులలో సింహభాగం ఎగుమతి అయ్యాయి.[27]

**భారతదేశాన్ని కొల్లగొట్టటంలో కీలకపాత్ర పోషించిన రైల్వేలు :**

కనుక విదేశీ పెట్టుబడులు రైల్వేలలోకి పెద్దపెట్టున వచ్చినా, వాటివలన భారతీయులకు జరిగిన మేలు శూన్యం. పైపెచ్చు భారతీయ విదేశీ వాణిజ్య తీరుతెన్నులను రైల్వేలు సమూలంగా మార్చివేశాయి. భారతదేశాన్ని ఇంగ్లండ్‌కు మరింతగా చేరువ చెయ్యటంలో రైల్వేలు కీలకపాత్ర పోషించాయి. భారతదేశ వ్యవసాయ ఉత్పత్తులను మరింత నేర్పుతో, వేగంతో వారు కొల్లగొట్టగలిగారు. తమ ఉత్పత్తులకు భారతదేశమంతటా మార్కెట్టును సృష్టించుకొన్నారు. విదేశీ పెట్టుబడులు వచ్చిపడినంత మాత్రాన ఏదేశమూ అభివృద్ధి చెందదు. ఆ పెట్టుబడులను ఏరకంగా ఎవరికి ప్రయోజనం కలిగేటట్లు వినియోగించారన్నది కీలకమైంది. అంటే పెట్టుబడుల

లక్ష్యం, సందర్భం, వాటిని వినియోగించిన తీరు మొదలైనవన్నీ కూడా ప్రాధాన్యం సంతరించుకొంటాయి.

1843లో మొదటిసారిగా రైల్వేలవల్ల ఆంగ్లేయులకు ఉపయుక్తంగా ఉంటుందని గవర్నర్ జనరల్ లార్డ్ హార్డింజ్ వాదన లేవదీసాడు. వ్యాపారానికి, ప్రభుత్వానికి, సైనిక పాలనకు రైల్వేలు అత్యంత ఆవశ్యకమని ఆయన వాదన. 10 సంవత్సరాల తర్వాత డల్‌హౌసీ ఇంగ్లాండ్‌కు ముడిపదార్థాల సరఫరాలో, బ్రిటీషు ఉత్పత్తులకు మార్కెట్‌గా భారతదేశంయొక్క ప్రాముఖ్యమును గుర్తించటంతో రైలుమార్గాల నిర్మాణానికి బీజాలు పడ్డాయి. రైలుమార్గాల అభివృద్ధితో మారుమూలలకు కూడా సరుకు రవాణా చెయ్యవచ్చు. శ్రామికులను ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి తీసుకొని వెళ్ళవచ్చు. గనులు తవ్వి, ఖనిజాలు వెలికితీసి, ఇంగ్లాండు 'దయ్యపు మిల్లులకు' (Satanic Mills) సరఫరా చేయవచ్చు.

**వలసపాలకుల అవినీతికి ఉదాహరణ రైల్వేలు :**

భారతదేశంలో రైల్వేల నిర్మాణ ఆలోచన పుట్టినప్పటినుండి, రైలు మార్గాలు నిర్మాణం చేసి రైళ్ళు నడిపేవరకు కూడా రైల్వేలు వలసపాలకుల అవినీతికి ఉదాహరణగా నిలిచాయి. బ్రిటీషు పెట్టుబడిదారులు మరియేయితర పెట్టుబడి మార్గంలోనూ రానంత లాభార్జన చేశారు. ప్రభుత్వం వారు పెట్టిన పెట్టుబడులమీద 5శాతం నికరఆదాయహామీని యిచ్చింది. ఆ రోజుల్లో పెట్టుబడిమీద 5 శాతం నికర ఆదాయం ఊహాతీతమైన విషయం. ఇంగ్లాండ్‌లో పన్నులద్వారా వచ్చిన ఆదాయంతో కాక భారతదేశపు పన్ను వసూళ్ళనుండే పెట్టుబడిదారులకు చెల్లించారు. దానితో అమెరికాలో ఒకమైలు రైలుమార్గ నిర్మాణానికి £2000 అయితే భారత దేశంలో £18,000 అయింది. ఆంగ్ల పెట్టుబడిదారుల దోపిడీ ఎక్కువ అవ్వటంతో 1880వ దశకంలో ప్రభుత్వమే రైలుమార్గాల నిర్మాణం చేపట్టింది. అయితే ప్రభుత్వం నియమించిన ప్రైవేటు గుత్తేదారులు సహితం అవినీతిబాట పట్టటంతో కెనడా, ఆస్ట్రేలియాలలో కంటే నిర్మాణవ్యయం రెట్టింపు అయింది.

భారతదేశంలో పన్ను చెల్లింపుదారుని మినహాయించి ప్రతివాడికి అది అంతులేని అక్రమార్జన అవకాశమార్గమైంది (Splendid racket for every one). రైల్వేల వాటాలకు లండన్ స్టాక్ మార్కెట్‌లో విపరీతమైన ఆకర్షణ ఏర్పడింది. 1870 వరకు స్టాక్ మార్కెట్‌లో పెట్టిన పెట్టుబడులలో 5వ వంతు రైల్వే వాటాలలో

(Shares)నే పెట్టారు. మొట్టమొదటి రైల్వేమార్గం 1853లో ప్రారంభించారు. ఆంగ్లేయులే పెట్టుబడి పెట్టారు. సాంకేతిక పరిజ్ఞానాన్ని వారి చేతులలోనే పెట్టుకున్నారు. రైల్వేలకు కావలసిన యంత్ర పరికరాలను, యంత్రాలను వారే సరఫరా చేశారు. పెట్టుబడులమీద వచ్చిన లాభాలను ఇంగ్లాండ్‌కు తరలించారు. ఆ శతాబ్దంలో దానిని (Private Enterprise at Public Risk)గా పిలిచారు. నష్టాలు అన్నీ భారతీయులు భరించారు. లాభాలను ఆంగ్లేయులు తన్నుకెళ్లారు. ఇంగ్లాండ్ ఉక్కుపరిశ్రమ భారతదేశంలో రైల్వేలవలన బహుళ లాభాలు పొందింది. తన ఉత్పత్తులను ఎక్కువ ధరలకు భారతదేశానికి అమ్మింది. రైల్వేలకు కావలసిన ప్రతిదీ ఇంగ్లండ్‌నుండే వచ్చింది. ఉక్కు పట్టాలు, ఇంజన్లు, సరుకురవాణా పెట్టెలు, యంత్రాలు, యంత్రసామాగ్రి మొత్తం అంతా ఇంగ్లాండునుండి వచ్చింది. రైల్వేలవల్ల భారతపరిశ్రమలకు ఎట్టి ప్రయోజనం కలగకపోగా ఇంగ్లాండ్ పరిశ్రమలకు ఎంతో లాభసాటి అయిన వ్యాపారం దొరికింది. రైల్వేలవల్ల భారతీయులకు ఒరిగిందేమీ లేదు. ముడి ఖనిజాలను, బొగ్గు, ఇనుము, పత్తి మొదలైన వాటిని ఓడరేవులకు తరలించి, ఇంగ్లాండ్‌కు ఎగుమతి చేయటానికి రైలుమార్గాలను నిర్మించారు. రైళ్ళను నడిపారు.

ప్రయాణికుల రవాణాకోసం వాటిని నిర్మించలేదు. నడపలేదు కూడా. వలస పాలకుల అవసరాల నిమిత్తం ప్రయాణీకుల రైళ్ళను నడిపేవారు. మొదటితరగతిలో తెల్లవారు ప్రయాణించేవారు. అది వారికే కేటాయించేవారు. ఆ రైళ్ళలో మూడవ తరగతి బోగీలలో భారతీయులు క్రిక్కిరిసి ప్రయాణం చేసేవారు. మూడవ తరగతి బోగీలలో ఎటువంటి సౌకర్యాలు ఉండేవి కావు. అయినా వారినుండి ఎక్కువ రుసుం వసూలు చేసేవారు. సరుకు రవాణా ఛార్జీలు ప్రపంచం మొత్తంమీద తక్కువ. రైల్వేలకు లాభాలు ప్రయాణీకులనుండే వచ్చేవి. అదీ మూడవ తరగతి ప్రయాణీకుల ద్వారానే రైల్వేలకు లాభాలు దండిగా వచ్చేవి. అయినా ప్రయాణీకుల సౌకర్యార్థం సదుపాయాలు మెరుగు పర్చటం కాని, కొత్త రైలుమార్గాల నిర్మాణాన్ని చేపట్టటం కాని జరగలేదు. ప్రముఖ చరిత్రకారుడు విల్ డ్యూరాంట్ బ్రిటిషు వ్యాపారులకోసం, సైనికుల కోసం రైల్వేలను నిర్మించారని, ప్రధాన ఆదాయవనరు మూడవతరగతి ప్రయాణికులయిన హిందువులనుండి వచ్చేదని, అయితే వారిని వధ్యశాలలకు తీసుకొని వెళ్ళే జంతువులలా బోగీలలో కుక్కేవారని వ్యాఖ్యానించారు.

**జాతి వివక్షకు మారుపేరు నాటి రైల్వేలు :**

భారతీయులెవ్వరినీ రైల్వే ఉద్యోగాలలలో నియమించేవారు కాదు. రైల్వే నిర్వహణకు సంబంధించిన యాజమాన్య, సాంకేతిక నైపుణ్యాలు ఆ కారణంగా భారతీయులకు బదిలీ కాలేదు. కేవలం ఆంగ్లేయులను లేదా పాశ్చాత్యులను మాత్రమే ఉన్నత ఉద్యోగాలలోనేకాక, క్రిందస్థాయి ఉద్యోగాలలోనూ నియమించేవారు. సిగ్నల్‌మెన్, ఆవిరి ఇంజనులు నడిపేవారిని, మరమత్తు చేసేవారిని నియమించేటప్పుడు జాతి వివక్ష చూపేవారు. రైల్వేబోర్డు డైరక్టర్లు మొదలు టికెట్ కలెక్టర్ల వరకు తెల్లవాళ్ళే ఉండేవారు. నల్లవారికి ప్రవేశంలేదు. వారందరి జీతభత్యాలు పాశ్చాత్యదేశాలలో అటువంటి ఉద్యోగాలు చేసేవారికి ఇచ్చేస్థాయిలో ఉండేవి. కొన్ని దశాబ్దాల తర్వాత విధానంలో కొంత సడలింపు వచ్చినా, తెల్లవారిగా కన్పించేవారిని అంటే ఆంగ్లో- ఇండియన్లను నియమించారు. ఆంగ్లేయుల జాతివివక్ష సిద్ధాంతాలు అడుగడుగునా రైల్వేలకు సంబంధించిన అన్ని అంశాలలోనూ కన్పించేవి. భారతీయులకు ఏకాగ్రత తక్కువని, సమయానికి తగ్గట్లు నిర్ణయాలు తీసుకోలేరని, అందువల్ల ప్రమాదాలు ఎదురైనప్పుడు నష్టం జరగకుండా నిర్ణయాలు వెనువెంటనే తీసుకొనలేరని అభిప్రాయపడేవారు. క్రమశిక్షణకు భారతీయులు ఆమడదూరమని, విధేయులుగా వారు పనిచేయలేరని, ఒక పాశ్చాత్యుడు లేదా తెల్లవాడు చేసే పనికి ముగ్గురు భారతీయులు అవసరం అవుతారని వారు పదేపదే అభిప్రాయపడేవారు. తెల్లవారు నల్లవారికంటే ఎక్కువ తెలివితేటలు, శక్తి సామర్థ్యాలు కలవారని గర్వంతో విర్రవీగుతూ నల్లవారిని చిన్నచూపు చూసేవారు. దానితో భారతీయులను రైల్వే చోదకులుగా నియమించేవారు కాదు. ప్రారంభించిన 3 సంవత్సరాలకే అందుకు ఉద్దేశించిన శిక్షణను సైతం నిలిపివేశారు.

జాతివివక్ష నియామకాలలోనూ, పదోన్నతులలోనూ ప్రస్ఫుటం అయ్యేది. ఇంగ్లాండ్‌లో ఫైర్‌మెన్లను చోదకులుగాను, గ్రామప్రాంతాల రైల్వేస్టేషన్ల మాస్టర్లను కాలక్రమంలో పెద్ద స్టేషన్లకు మాష్టర్లుగా నియమించేవారు. కాని భారతదేశంలో ఆ పద్ధతిని పాటించలేదు. పదోన్నతిని కల్పిస్తే తెల్లవారితో వారు సమానం అవుతారు. పోటీపడతారు. అది వారికి యిష్టం లేదు. 1900లో వేతనాలు, పదోన్నతులు, ఉద్యోగార్హతలు మొదలైన వాటికి నియమనిబంధనలను రూపొందించారు.

ఉద్యోగులను పాశ్చాత్యులు, యూరో ఏసియన్లు, నీగ్రోలు, నాన్-ఇండియన్ ఏసియాటిక్, ఇండియన్లుగా వర్గీకరించారు. నియామకాలు, యిచ్చే వేతనాలు, పనిగంటలు, పదోన్నతులు, సెలవు దినాలు మొదలైన వాటన్నిటిలోనూ జాతిపరమైన వివక్ష చూపేవారు. భారతీయులు ఎట్టి పదవులకు అర్హులుకారు. పనిగంటలు ఎక్కువ. శలవు దినాలు తక్కువ. వేతనాలు మిగిలిన అన్ని జాతుల వారికంటే తక్కువ. సమానమైన పనికి సమానమైన వేతనం లేదా జీతం అన్నది ఆనాడు వారు పాటించలేదు.

1872లో లండన్‌లో రాయల్ ఇంజనీరింగ్ కళాశాలను ప్రారంభించారు. భారతదేశానికి కావలసిన ఇంజనీర్లను తయారుచేయటం ఆ కళాశాల బాధ్యత. అయితే అందులో ప్రవేశ అర్హతకు గణితం, భౌతిక రసాయనిక శాస్త్రాలతోపాటుగా లాటిన్, గ్రీకు, జర్మన్, ఇంగ్లీషు భాష, చరిత్రలోనూ ప్రావీణ్యత కలిగి ఉండాలి. భారతీయులను ఇంజనీరింగ్ చదువుకు అనర్హులుగా చేయటం దీని ఉద్దేశ్యమని వేరే చెప్పనవసరం లేదు. 1886లో ప్రజాపనులశాఖ (PWD)లో 1015 మంది ఇంజనీర్లు ఉంటే కేవలం వ్రేళ్ళతో లెక్కపెట్టగల సంఖ్యలోనే భారతీయులు ఇంజనీర్లుగా ఉన్నారు. 1862లో బెంగాల్‌లో జమాల్‌పూర్‌లోనూ, రాజస్థాన్‌లో అజ్మేర్‌లోనూ రైల్వే వర్క్‌షాపులు నెలకొల్పారు. 1878నాటికి భారతీయ మెకానిక్స్ స్వతంత్రంగా ఇంజన్ల, భవనాల రూపురేఖలను అభివృద్ధి చేయగల స్థితికి వచ్చారు. వారి విజయం బ్రిటిషువారిని భయపెట్టింది. వారి డిజైన్ ప్రకారం తయారుచేస్తే ఎక్కువ గమనశక్తి కల ఇంజన్లను తక్కువధరకే తయారుచేయవచ్చు. ఇవి బ్రిటిషు ఇంజన్ల కంటే మెరుగైనవి. దీన్ని సహించలేని రైల్వే అధికారులు ఏకంగా బ్రిటిష్ పార్లమెంటు సభ్యులమీద ఒత్తిడి తీసుకొనివచ్చారు. దానితో 1912లో బ్రిటిషు పార్లమెంటు ఒక చట్టాన్ని చేసింది. ఆ చట్టం ప్రకారం రైల్వేవర్క్ షాప్‌లలో ఎటువంటి డిజైన్లుగాని, ఇంజన్ల తయారీనిగాని భారతదేశంలో చేపట్టకూడదు. కేవలం మరమ్మతులకు మాత్రమే పరిమితం అవ్వాలి. ఇంకేరకమైన సృజనాత్మక పనులు మెకానిక్కులు చెయ్యకుండా నిరోధించారు. 1854-1947 మధ్య 14,400 రైల్వే ఇంజన్లను దిగుమతి చేసుకున్నారు. ఇది షుమారుగా ఇంగ్లాండ్ చేసిన ఉత్పత్తిలో 10శాతానికి సమానం. మరొక 3వేల ఇంజన్లను కెనడా, అమెరికా, జర్మనీ నుండి దిగుమతి చేసుకున్నారు. ఒక్క ఇంజన్‌ను కూడా భారతదేశంలో 1912 తర్వాత

తయారు చెయ్యలేదు. తయారీ చెయ్యనీయలేదు. దానితో స్వాతంత్ర్యం తర్వాతసైతం కొన్నాళ్ళపాటు ఇంజన్ల తయారీకి ఇంగ్లాండ్‌పై భారతదేశం ఆధారపడక తప్పలేదు.

అయితే కాలక్రమంలో దేశంలో సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి చెందింది. ప్రస్తుతం బ్రిటీషు రైల్వేలకు భారతీయ ఇంజనీర్లే సాంకేతిక సలహాలు యిచ్చేస్థాయిలో ఉన్నారు. రైట్స్ (Rail India Technical and Economic Services) సంస్థ రైల్వేల అనుబంధ సంస్థ. ప్రపంచవ్యాప్తంగా రైల్వేలకు సాంకేతిక, ఆర్థికసేవలు అందించే సంస్థలలో అత్యుత్తమ మైనదిగా పేరు పొందింది. ఇదంతా మనం గర్వపడే విషయం. కాని 1884లో 'సమాచార్' అనే పత్రికలో "ఉక్కుపట్టాలు కావు అవి. భారతదేశానికి ఉక్కుసంకెళ్ళు" అని రైల్వేలగురించి వ్రాసారంటే, ఆనాడు పరిస్థితి ఎంత దారుణంగా ఉండేదో ఊహించవచ్చు. అనేకమంది రైల్వేలవలన భారతదేశానికి ఒరిగిందేమీ లేదని నిరసన గళాన్ని వినిపించారు. శ్రీయుతులు జి.వి.జోషి, జి.యస్.అయ్యర్, గోపాలకృష్ణ గోఖలే, దాదాభాయి నౌరోజీల వంటివారు బహిరంగంగానే రైల్వేలవల్ల ఆంగ్లేయులు ఎట్టి లబ్ధిపొందుతున్నారో, భారతీయులు ఎట్లా నష్టపోతున్నారో వివరించారు. రైల్వేలవలన భారతదేశంమీద మోయలేని ఆర్థికభారం పడుతున్నదని సాక్ష్యాధారాలతోసహా వివరించారు.

ఇంగ్లాండ్‌కు తరలిస్తున్న రైల్వేలనుండి ఆర్జిస్తున్న లాభాలతో, పెట్టుబడులమీద సంపాదించిన వడ్డీతో ఏవిధంగా భారతదేశంలో మౌలికవసతులు మెరుగుపర్చవచ్చో, నీటిపారుదల సౌకర్యాలను విస్తరించవచ్చో వారు వివరించారు. గోఖలే మాటలను గుర్తుకు తెచ్చుకుందాం "రైల్వేమార్గాల నిర్మాణం కేవలం బ్రిటీషు వాణిజ్యవర్గపు, వడ్డీ వ్యాపారవర్గపు ప్రయోజనాలను పెంపు చేసేందుకే చేపట్టారని భారతీయుల అభిప్రాయం. మరింతగా భారతదేశపు వనరులను కొల్లగొట్టటానికి అవి సహకరిస్తాయి." రైల్వేలవల్ల కఱవు కాటకాలు రావని, ప్రజల జీవనస్థితిగతులు మెరుగుపడతాయని ఆంగ్లేయులు చేస్తున్న వాదనలను భారతీయులు కొట్టి పారవేసారు. కఱవులకు ప్రధాన కారణం సైన్యం అవసరాల నిమిత్తంగా తిండిగింజలను పెద్దఎత్తున దాచిపెట్టటం. రైల్వేమార్గాలు నిర్మాణం చేసాక, రైళ్ళు నడిపాక కూడా కఱవు కాటకాలు వచ్చాయి. అంతేకాక భయంకరమైన కఱవు పరిస్థితులలో ప్రజలు ఉన్నప్పటికీ, తిండిగింజలను రైల్వేలద్వారా నిరంతరం రేవుపట్టణాలకు తరలించి ఎగుమతి చేశారు.

రైల్వేలు లేకుంటే వ్యవసాయోత్పత్తులు ముఖ్యంగా తిండిగింజలకు కఱవు ఏర్పడేది కాదు."

మహాత్మగాంధీ రైల్వేలవల్ల బుబోనిక్ ప్లేగువ్యాధి శీఘ్రంగా వ్యాపించిందని విమర్శించారు. పర్యావరణానికి జరుగుతున్న హానిగురించి పట్టించుకోకుండా రైలు మార్గాలను నిర్మించటంతో శాశ్వత నష్టం వాటిల్లింది. అనేకచోట్ల జలప్రవాహ మార్గాలను మళ్ళించారు. దానితో సాగుకు పనికివచ్చే భూములు నిరుపయోగంగా మారాయి. మరికొన్నిచోట్ల సాగుకు పనికివచ్చే భూములలో నీరు నిలిచిపోయింది. వఱదలు వచ్చినప్పుడు రైలుగట్లు (Railway Embankments) నీటి ప్రవాహగతిని నిరోధించటంతో వఱదబీభత్సానికి కారణమయ్యాయి.

రైల్వేలవల్ల మార్కెట్ల సంతులనం దెబ్బతిన్నది. స్థానిక ఉత్పత్తులను ఎక్కడికో ఎగుమతి చేయటంతో స్థానికంగా ఆహారధాన్యాలు ధరలు పెరిగాయి. పండించినచోట సైతం ధరలు ఆకాశానికి ఎగిసేవి. రైల్వేలు రాకముందు జలరవాణాద్వారా స్థానిక ఉత్పత్తులను ఎగుమతిచేసేవారు. ఆ ప్రక్రియ నెమ్మదిగా జరిగేది. ఉత్పత్తులను ఎంతో దూరం తీసుకువెళ్ళగలిగేవారు కాదు. దానితో బియ్యం, గోదుమ ధరలు సామాన్యులకు అందుబాటులోనే ఉండేవి. రైల్వేలద్వారా సుదూరప్రాంతాలకు, విదేశాలకు ఎగుమతులు ప్రారంభం అయ్యాక పరిస్థితులు తారుమారు అయ్యాయి. వ్యవసాయ మిగులును (Agricultural Surplus) తరలించటం తేలిక అయింది. ఆహారధాన్యాల, చేపల ఉత్పత్తిదారులు పట్టణవాసులతో, ఎగుమతిదారులతో పోటీపడవలసి వచ్చింది. మొదటి ప్రపంచయుద్ధ సందర్భంగా పాశ్చాత్యదేశాలలో సైనికుల తరలింపుకు ప్రత్యామ్నాయ రైలుమార్గాలు నిర్మాణం చెయ్యవలసి వచ్చినప్పుడు, భారతదేశంలో అనేక రైలు మార్గాలను నిలిపివేసి, అమర్చినరైలు పట్టాలను, అడ్డపట్టాలను (స్లీపర్స్‌ను), సిగ్నల్స్‌ను పెకలించి మధ్యధరా సముద్రతీర ప్రాంతంలో రైలుమార్గాల నిర్మాణానికి వాడారు.

మొత్తంమీద, ప్రముఖ చరిత్రకారుడు బిపిన్‌చంద్ర అభిప్రాయంతో మనం ఏకీభవించవలసి ఉంటుంది. భారతదేశంలో రైల్వేల నిర్మాణానికి బ్రిటిషువారి స్వార్థప్రయోజనాలే కారణం. ఆంగ్ల వ్యాపారులు, పెట్టుబడిదారులు, ఉత్పత్తిదారులకు ప్రయోజనకరంగా రైల్వేలను భారతీయుల ఖర్చుతో చేపట్టారు. భారత సహజవనరులను దోపిడీ చేసి ఆంగ్ల పరిశ్రమలకు మేలుచేసేందుకే వాటిని నిర్మించారు.

## రైల్వేలు X సాగునీటి ప్రాజెక్టులు :

కొందరు ఆర్థికవేత్తలు ప్రభుత్వవ్యయం పెరిగితే అభివృద్ధికి అవకాశాలు మెండు అవుతాయని చెప్తుంటారు. భారీఎత్తున ప్రజోపయోగకరమైన పనులు చేపట్టితే నిరుద్యోగం తగ్గుతుందని, ఆదాయాలు పెరుగుతాయని వాదిస్తూ ఉంటారు. ఆ దృక్పథంనుండే రైలుమార్గాల నిర్మాణాన్ని సమర్థిస్తూ ఉంటారు కూడా. అయితే ఆంగ్లేయులు రైలు మార్గాల నిర్మాణంమీద పెట్టిన వ్యయాన్ని సాగునీటి సౌకర్యాలను విస్తరించటానికి వెచ్చించిఉంటే ప్రజలకు ఎక్కువ ఉపయుక్తంగా ఉండేది. ప్రభుత్వవ్యయం పెరిగినంత మాత్రాన ఉపాధి, ఆదాయ అవకాశాలు పెరగవు. ఆ పెరిగిన వ్యయం ఏ రంగంలో, ఏ వర్గపు ప్రయోజనాలను కాపాడటానికి వెచ్చిస్తున్నారన్నది ప్రధానమైన అంశం. ఆనాటి భారతదేశంలో కఱవు కాటకాల నివారణకు సాగునీటి విస్తరణమీద ఎక్కువ వ్యయంచేస్తే ఆశించిన ఫలితాలు వచ్చేవి. కాని ఆంగ్ల ప్రభువులు అలా చెయ్యలేదు. తమ స్వార్థ ప్రయోజనాలకోసం నిర్మించిన రైలుమార్గాలు, నడిపిన రైళ్ళవలన కఱవు కాటకాలు నివారించవచ్చని ప్రచారం చేసుకున్నారు. 1894లో ఒక బాధ్యతగల ఆంగ్ల అధికారి కల్నల్ చెస్నీ (Col. Chesney) రైల్వేలతో భారతదేశాన్ని కఱవు కాటకాల నుండి కాపాడినామని గొప్పలు చెప్పాడు. కాని 19వ శతాబ్దం అంతా కఱవు కాటకాలతోనే గడిచింది. 'కొఱత'ను తీవ్రరూపం చేసి కఱవు కాటకాలను సృష్టించిన ఘనత రైల్వేలదే. ఎందుకంటే పండించిన ఆహారధాన్యాలను రేవు పట్టణాలకు రైల్వేలు చేరవేసాయితప్ప, వాటిని 'కొఱత' ఉన్న ప్రాంతాలలో పంపిణీకి రవాణా చెయ్యలేదు.

భారతీయులు సాగునీటి సౌకర్యాలను విస్తరించాలని బహుకాలంగా అడుగుతున్నారు. రైల్వేలవల్ల ఒక గింజకూడా అదనంగా ఉత్పత్తి అవదని, అదే సాగునీటి సౌకర్య విస్తరణవల్ల ఆహార సరఫరా రెట్టింపు అవుతుందని, పంటలను కాపాడవచ్చు అని, కఱవులు నివారించవచ్చునని భారతీయులు చేస్తున్న వాదనలను వారు అసలు పరిగణనలోకి తీసుకోలేదు. ఆధునిక రైల్వేలను కాదని పురాతన నీటి కాలువలను అభివృద్ధి చేయమనటం అనాగరికుల అజ్ఞానమని కొట్టిపారవేశారు.[29]

సాగునీటి కాలువలను విస్తరిస్తే జరిగే ప్రయోజనాలగురించి భారతీయులు పదేపదే పాలకులకు వివరించారు. కఱవు కాటకాలనుండి అవి ప్రజలకు రక్షణ

కల్పిస్తాయని, వాటి నిర్మాణవ్యయం రైల్వేలకు కావలసిన నిర్మాణవ్యయంకంటే చాలా తక్కువని, నీటిపారుదలరంగంమీద చేసే ప్రతి రూపాయి వ్యయంమీద 6 నుండి 9 శాతం రాబడి ఉంటుందని, కాలువలను వస్తురవాణాకు కూడా ఉపయోగించ వచ్చునని, అన్నిటికంటే మిన్నగా భారతదేశంలో నీటిపారుదల రంగంమీద పెట్టే వ్యయంవల్ల భారతీయులే ప్రయోజనం పొందుతారని మొత్తుకొన్నారు. ప్రభుత్వం ఏ రంగంమీద వ్యయంచేస్తే బహుళ ప్రయోజనంగా ఉంటుందో ఆనాటి భారతీయ మేధావులకు స్పష్టమైన అవగాహన ఉంది. 19వ శతాబ్దం చివరలో జి.యస్.అయ్యర్ ఈ విధంగా వ్రాశారు. "రైల్వేలు సంపదను ఉత్పత్తి చేయలేవు. సంపదను అవి పంపిణీ చేయగలవు. కాని సాగునీటి సౌకర్యాలను విస్తరిస్తే రైతులు ఒక పుట్టెడు బదులుగా రెండు పుట్లు పండించగలరు." "నీటిపారుదల రంగం అభివృద్ధివలన నికర ఆదాయం లభిస్తుంది. 19వ శతాబ్ది చివరివరకు రైల్వేలవల్ల భారీస్థాయిలో నష్టాలే వచ్చాయి".[30]

20వ శతాబ్దపు మొదటిదశాబ్దంవరకు ప్రభుత్వం రైల్వేలు, సాగునీటిరంగం మీద పెట్టిన ఖర్చును పోల్చిచూస్తే, సాగునీటిరంగాన్ని కావాలనే ఆంగ్లప్రభువులు నిర్లక్ష్యం చేసిన వైనం స్పష్టం అవుతుంది. రైల్వేలమీద పెట్టిన ఖర్చులో కేవలం 13వవంతు మాత్రమే సాగునీటిరంగంమీద పెట్టారు. శిస్తువసూళ్ళు బాగా జరిగి, ప్రభుత్వ ఆదాయం ఇబ్బడిముబ్బడిగా పెరిగిన సంవత్సరాలలో రైల్వేలమీద వ్యయాన్ని రెట్టింపు చేసారు. సాగునీటిరంగంమీద చేసిన వ్యయం నామమాత్రంగానే పెంచేవారు. సాగునీటిరంగానికి కొంత ప్రాముఖ్యం యిచ్చిన సంవత్సరాలలో సైతం అంటే 1901 నుండి 1914 వరకు కేవలం 25 మిలియన్లు (2.5కోట్ల) రూపాయలు మాత్రమే ఖర్చుపెట్టారు. అయితే అదే కాలంలో రైల్వేలమీద 147 మిలియన్లను (14.7 కోట్ల) రూపాయలను ఖర్చు చేశారు.

సాగునీటిరంగ అభివృద్ధితోనే కఱవు కాటకాల నివారణ సాధ్యమని ప్రజానీకం బలంగా విశ్వసించిన రోజుల్లో ప్రభుత్వం కఱవు నివారణకు పరిష్కారంగా రైల్వేలను చూపించింది. రైల్వే కమిటీ ముందు 1878 లో సాగునీటిరంగ నిపుణుడు సర్ ఆర్థర్ కాటన్ యిచ్చిన వాఙ్మూలం వాస్తవాలను బయటపెట్టేదిగా ఉంది. "మద్రాసు, మైసూరు, హైద్రాబాద్, బొంబాయిలలో 4 కోట్లమంది కఱవు కాటకాలవల్ల పడరానిపాట్లు పడ్డారు. 40 నుండి 50 లక్షల మంది ఆకలిచావులవల్ల

మరణించారు. 2 కోట్ల పౌండ్లు రైల్వేలమీద ఖర్చుపెట్టిన తర్వాత, 5కోట్ల స్టెర్లింగులమేర రైల్వేలకోసం ప్రభుత్వం ఋణాలు తీసుకొన్న తర్వాత కూడా ఈ పరిస్థితి దాపురించింది". మరి ఎందుకు ప్రభుత్వం సాగునీటిరంగాన్ని అభివృద్ధి చేయలేదని కమిటీ చైర్మన్ ప్రశ్నించినపుడు, కాటన్ ఈ విధంగా జవాబు యిచ్చాడు. "ఎందుకంటే అది రైల్వేలకు ఇబ్బందికరం (Stultify) కాబట్టి. అదే ఏకైక అంశం".[31]

## పారిశ్రామికీకరణ ఎందుకు అవసరమైంది ?:

రెండు ప్రపంచయుద్ధాల సందర్భంగా తలఎత్తిన అవసరాల కారణంగా దేశంలో కొన్ని పరిశ్రమలను నెలకొల్పక తప్పలేదు. సామ్రాజ్యవాదాన్ని పూర్తిగా వ్యతిరేకించే వారు సైతం ఈ కాలపు ఆంగ్లపాలకుల విధానాలను అంచనా వేసేటప్పుడు, వారిపట్ల కొంత మెతకవైఖరిని కనపర్చారు. ఎందువల్లనంటే వారివలన కొన్ని పరిశ్రమలు దేశంలోకి వచ్చాయని, వాటి కారణంగా దేశం తర్వాతదశలో పారిశ్రామికంగా పురోభివృద్ధి సాధించిందని, ఆ కారణంగా వలసపాలకులకు భారతీయులు కృతజ్ఞులుగా ఉండాలని చెప్తుంటారు.

ఆ కాలంలో జరిగిన పారిశ్రామికీకరణ స్వభావము, ప్రక్రియలను, పారిశ్రామికీకరణకు దారితీసిన ఒత్తిళ్ళను, దాని ప్రభావాన్ని అర్థం చేసుకుంటే తెల్లదొరల పట్ల మనం ఉదారంగా ఉండవలసిన అవసరంలేదని తేటతెల్లమవుతుంది. యుద్ధకాలపు అవసరాలు, ఒత్తిళ్ళు మూలంగా దేశంలో కొన్ని పరిశ్రమలను ప్రారంభించక తప్పలేదు. ఒకరకంగా చెప్పాలంటే అది వారికి 'బహు చెడ్డ అవసరమ'యింది. అవసరం తీరాక, భారతదేశ పరిశ్రమలపట్ల ఎప్పటి మాదిరిగానే వివక్ష చూపారు.

మొదటి ప్రపంచయుద్ధం కారణంగా వలసపాలకులు సైతం భారతదేశ ప్రాధాన్యాన్ని గుర్తించక తప్పలేదు. దేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధిచేసే దిశలో కొన్ని మొదటిఅడుగులు వెయ్యక తప్పలేదు. అయితే ఆర్థికశాస్త్రంలో దేవుళ్ళుగా కొలవబడే ఆల్‌ఫ్రెడ్ మార్షల్, జె.ఎమ్.కీన్సు వంటివారు అట్టి కొద్దిపాటి ప్రయత్నాలను సైతము నిశితంగా విమర్శించారు. ఇంగ్లండ్ స్వప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని కొన్ని సిద్ధాంతాలకు రూపకల్పన చేశారు. వాటిలో ముఖ్యమైనది–మార్కెట్ల కార్యకలాపాలలో ప్రభుత్వం జోక్యం చేసుకోకూడదన్న సిద్ధాంతం (Laisseze-faire). దాని ప్రకారం వనరుల సక్రమ వినియోగానికి

ప్రభుత్వం జోక్యం చేసుకోకూడదు. మార్కెట్ శక్తులకు స్వేచ్ఛను యిస్తే, అభివృద్ధి దానంతట అదే సమకూరుతుంది. ఈ సిద్ధాంతం ముసుగులో భారతపరిశ్రమలకు ఆంగ్లపాలకులు యివ్వచూపిన కనీస మద్దతును సైతం వ్యతిరేకించారు. అంతర్జాతీయ శ్రమవిభజన సిద్ధాంతం ఆధారంగా భారతదేశం ఒక వ్యవసాయిక దేశంగా వ్యవసాయోత్పత్తులను మాత్రం ఎగుమతి చేస్తూ ఉండటమే దానికి తగినదని కీన్సు పండితుడు అభిప్రాయపడి, భారతపారిశ్రామిక అభివృద్ధిని తీవ్రంగా వ్యతిరేకించాడు. ఆర్థికవేత్తలు వారి దేశాల స్వప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొనే సిద్ధాంతీకరిస్తున్నారు తప్ప మొత్తం మానవాళి ప్రయోజనాలను పరిగణనలోకి తీసుకోకపోవటం దురదృష్టకరం. పాశ్చాత్యదేశాల స్వప్రయోజన కోణంనుండే ఈనాటికి ఆర్థికసిద్ధాంతాలు తయారవుతున్నాయి. అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (IMF), ప్రపంచబ్యాంకు, ఇతర ఫైనాన్సు సంస్థలు పెట్టుబడిదారీ దేశాల కనుసన్నలలోనే నడుస్తున్న విషయం నేడు జగద్విదితమే. ఈ సంస్థల నయావలసవాదాన్ని ఇప్పుడు తృతీయ ప్రపంచదేశాలు అర్థం చేసుకుంటున్నాయి.

**మొదటి ప్రపంచ యుద్ధ అనుభవాలు**

యుద్ధం కారణంగా, బ్రిటిష ప్రభుత్వమే చొరవ తీసుకొని పారిశ్రామికీకరణకు పూనుకొంది. అంతకుముందు భారత పారిశ్రామికీకరణను పూర్తిగా వ్యతిరేకించిన తెల్లదొరలు అకస్మాత్తుగా తమ అవసరాలకోసం ప్లేటు ఫిరాయించారు. 1918లో వచ్చిన మాంటేంగు-ఛేమ్సుఫర్డ్ నివేదికలో ఏరకంగా చూసినా భారతదేశపు పారిశ్రామికాభివృద్ధి అత్యంత ఆవశ్యకమని పేర్కొన్నారు.

"ఆర్థికపరంగానూ, సైనికపరంగానూ, సామ్రాజ్యపు అవసరాలపరంగానూ, ఇకనుండి భారతదేశపు సహజవనరులను ఇంతకుముందుకంటే నేర్పుగా, సమర్థవంతంగా వినియోగించుకోవాలి. (దోపిడీ చెయ్యాలి). పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన భారతదేశం ఆంగ్లసామ్రాజ్య ప్రాబల్యాన్ని మరింతగా విస్తరించగలదు. అందువల్ల ఒనగూరే ప్రయోజనాన్ని అంచనావేయటం ఏమంత సులభం కాదు".[32]

పైన పేర్కొన్నట్లుగా అన్ని రకాలుగా వారికి ఉపయోగపడుతుందన్న నమ్మకంతోనే, ఆశతోనే, ఆంగ్లపాలకులు భారతదేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధి చేయుటానికి పూనుకొన్నారు. 1921లో ఒక ఫిస్కల్ కమిషన్‌ను సైతం

నియమించారు. శైశవదశలో ఉన్న పరిశ్రమలకు, కొన్ని ఇతర కీలక పరిశ్రమలకు దిగుమతి-ఎగుమతి సుంకాల విధానం (Tariff Policy) ద్వారా ప్రోత్సాహకాలను సిఫారసు చేసేందుకు అ కమిషన్‌ను నియమించారు.

ఆంగ్ల ప్రభువులకు అంత అకస్మాత్తుగా భారత పారిశ్రామికీకరణపై శ్రద్ధ కలగటానికి కారణాలు ఉన్నాయి. మొదటి ప్రపంచయుద్ధకాలంలో జర్మనీ సబ్‌మెరీనులు (జలాంతర్గాములు) ఇంగ్లాండ్, దాని మిత్రదేశాల నౌకలను తుత్తునియలు చేసాయి. యుద్ధనౌకలనే కాదు, వాణిజ్యనౌకలను సైతం వారు ధ్వంసంచేశారు. అంతేకాక తన యుద్ధ అవసరాలకు అవసరమైన ఆయుధాలనుగాని, సైనికులకు వస్త్రాలనుగాని, ఆహారధాన్యాలనుగాని, ఉత్పత్తిచేయగల స్థితిలో ఆనాడు ఇంగ్లాండ్ లేదు. ముఖ్యంగా జపాన్ కారణంగా తూర్పుదేశాలలో ఉన్న తన సైనిక అవసరాలకు సరఫరాలు అందించటం కష్టమయింది. యుద్ధంలో విజయం కేవలం సైనికుల శౌర్యంమీదే ఆధారపడదు. వారికి కావలసిన మందుగుండు సామాగ్రి, ఆయుధాలు, ఆహారం, దుస్తులు, ఔషధాలు నిరంతరం సరఫరా చేస్తూ ఉండాలి. బ్రిటన్‌నుండి వాటిని సరఫరాచేయటం వాణిజ్య, యుద్ధనౌకలను యుద్ధంలో కోల్పోవటంతో కష్టంగా మారింది. అందుకే భారతదేశాన్ని అంతకుముందు పరిశ్రమలరహిత దేశంగా చేసిన 'ఘనత' దక్కించుకొన్న ఆంగ్లపాలకులకు అకస్మాత్తుగా భారతదేశంపై ఎన్నడూలేనంత అభిమానం పుట్టుకొచ్చింది. అందుకే మాంటే-ఫోర్డు నివేదికలో "సముద్రమార్గాన సమాచారం అందుకోవటానికి, సరఫరా చేయటానికి తాత్కాలిక విరామం కారణంగా, తూర్పు ప్రాంతాన జరుగుతున్న యుద్ధాలకు ఆయుధ సరఫరాకోసం భారతదేశంమీద ఆధారపడక తప్పని పరిస్థితులు ఏర్పడ్డాయి. పరిశ్రమలు లేనిదే ఆయుధాల ఉత్పత్తి జరగదు. కనుక భారతదేశ సహజవనరుల అభివృద్ధి ఈనాడు ఒక సైనిక అవసరం".[33]

వ్యూహాత్మకంగానే కాదు. ఇతర కారణాలవల్లకూడా పారిశ్రామికీకరణ అవసరాన్ని వారు గుర్తించారు. 20వ శతాబ్దపు మొదటిదశలో ఇంగ్లాండ్‌నుండే కాక ఇతర పాశ్చాత్య దేశాలనుండి సైతం తయారీ వస్తువులు భారీగా భారతదేశంలోకి దిగుమతి అవుతున్నాయి. 1920వ దశకంలో ఇంగ్లాండ్ నుండి దిగుమతులు తగ్గుముఖం పట్టగా అమెరికానుండి, జపాన్ నుండి దిగుమతులు పెరుగుతున్నాయి. భారతదేశంనుండి చేసే ఎగుమతులలో కూడా ఆ రెండుదేశాల

వాటా క్రమంగా పెరుగుతున్నది. 1926-31 మధ్య భారతదేశపు ఎగుమతులలో బ్రిటన్‌వాటా శాతం బాగా క్షీణించింది. అంటే విదేశీ పోటీదారులు భారతదేశ వాణిజ్యంపై ఆనాటికి ఇంగ్లాండ్ గుత్తాధిపత్యానికి చిల్లులు పొడిచారు. భారతదేశం ఇతరదేశాల వస్తువులకు కనుక పెద్ద మార్కెట్‌గా ఎదిగితే దానివలన బ్రిటన్‌కు ఏ మాత్రమూ ప్రయోజనం ఉండదు.

రాజకీయకారణాలవల్ల సైతం కొత్తపుంతలు త్రొక్కవలసిన అవసరం బ్రిటన్‌కు ఏర్పడింది. భారతదేశంలో స్వాతంత్ర్య ఉద్యమం బాగా పుంజుకుంది. జాతీయ వాదులను తృప్తిపర్చటానికి ఏదో ఒకటి చేయకపోతే తమకు మనుగడ ఉండదన్న భయంకూడా వారిని భారతదేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధిచేయటానికి పురికొల్పింది. భారతప్రజల ఆకాంక్షలను ఇంక ఏ మాత్రం నిర్లక్ష్యం చేయటంకూడదని బ్రిటిష్ వైస్రాయి హార్డింజ్ అన్నాడు.[34]

ఇటువంటి తప్పని పరిస్థితులలో ప్రభుత్వం కొన్ని కర్మాగారాలను భారతదేశంలో నెలకొల్పక తప్పలేదు. దానితో జౌళి, పాదరక్షలు, గోదుమపిండి, రబ్బరు, జనుము, చక్కెర, టీపొడి తయారీ, మరికొన్ని ఇతర ఆహార పరిశ్రమలను, మేజోళ్ళతయారీ మొదలైన అల్లిక ఉత్పత్తుల తయారీ కర్మాగారాలను సైనిక అవసరాలకోసం స్థాపించక తప్పలేదు. ఇందులో ఒకటికూడా భారీపరిశ్రమ కాదు. అంతేకాదు, పై కర్మాగారాలు అన్నీ వాటికి కావలసిన వాటికై ఇంగ్లాండ్‌పైనే ఆధారపడ్డాయి. యంత్రాలు, యంత్రసామాగ్రి, విడిభాగాలు, రసాయనాలు అన్నీ ఇంగ్లాండునుండే దిగుమతి చేసుకున్నారు. భారీ పరిశ్రమలను కాని, యంత్రాలను, యంత్ర సామాగ్రిని తయారుచేసే పరిశ్రమలను కాని, భారతదేశంలో నెలకొల్పకుండా జాగ్రత్తపడ్డారు. కేవలం వినిమయ ఉత్పత్తులు చేయగల కర్మాగారాలను అదీ ఇంగ్లాండ్ మూలధనంతో, సాంకేతిక పరిజ్ఞానంతో, యంత్రసామాగ్రితో స్థాపించారు. అంటే ఈ కొద్దిపాటి పారిశ్రామికీకరణవలన లబ్ది పొందింది ఆంగ్లపెట్టుబడిదారీవర్గమే. అనుబంధ పరిశ్రమలుగా సైతం కుటీర పరిశ్రమలకు ప్రోత్సాహం లభించలేదు. భారతదేశ స్వావలంబనకు దారితీసే భారీ పరిశ్రమలు ఏవీ నెలకొల్పబడలేదు. అవి కేవలం మధ్యతరహా వ్యవసాయాధారిత పరిశ్రమలు అయిన తోలు, పట్టు, చక్కెర, నూలు పరిశ్రమలు. కొంతవరకు వాటివలన దిగుమతులు తగ్గించవచ్చు. అంతేకాదు, ఎగుమతులకు మంచి అవకాశం ఉన్నవే".[35] అయితే మూలధనాన్ని

సాంకేతిక పరిజ్ఞానాన్ని, యంత్రాలను ఇంగ్లాండునుండే దిగుమతి చేసుకోవటం మూలంగా భారతదేశానికి ఎట్టి ప్రయోజనం కలుగలేదు.

మొదటి ప్రపంచయుద్ధం ముగిసి, సాధారణ పరిస్థితులు నెలకొనగానే ఆంగ్లపాలకులు తమ పక్షపాతవైఖరిని తిరిగి ప్రదర్శించటం మొదలుపెట్టారు. యుద్ధానికి ముందు అనుసరించిన విధానాలనే తిరిగి పాటిస్తూ, భారత పరిశ్రమలు ఇంగ్లాండు పరిశ్రమలకు పోటీగా ఎదగకుండా చూశారు. అయితే అది అంత తేలిక కాలేదు. ఎందుకంటే ఆంగ్లపెట్టుబడిదారులు మాత్రమే కాక, ఇతర పాశ్చాత్య దేశాలకు చెందిన పెట్టుబడిదారులుకూడా భారతదేశంలో పరిశ్రమలు స్థాపించారు. జనపనార పరిశ్రమ అంతా పాశ్చాత్యదేశాల పెట్టుబడిదారీవర్గం చేతుల్లో ఉంది. పంచదార, జౌళి పరిశ్రమలలో సైతం వారే ప్రధాన వాటాదారులు.

**వివక్షాపూరిత సుంకాల విధానం :**

యుద్ధానంతరం ఇంగ్లండ్ ఒక వివక్షాపూరిత సుంకాల విధానాన్ని ప్రవేశపెట్టింది. శైశవదశలో ఉన్న పరిశ్రమలు ఎదగటానికి ఇచ్చిన దిగుమతిసుంకాల ప్రోత్సాహకాలను కొనసాగించమని భారతపారిశ్రామికులు వేడుకున్నా, అట్టి పరిశ్రమలకు యిచ్చిన రాయితీలను అర్థాంతరంగా రద్దు చేసింది. జెమ్‌షెడ్జీ టాటా ఉక్కు పరిశ్రమకు మాత్రం మినహాయింపులను కొనసాగించారు. దానికి కూడా కారణాలు లేకపోలేదు. దేశంలో ఉక్కు కర్మాగారాన్ని నెలకొల్పాలని ఆంగ్లపాలకులు చేసిన ప్రయత్నాలు ఎందువల్లనో ఫలించలేదు. దానితో తన ఉక్కు అవసరాలకోసం, టాటా ఉక్కు కర్మాగారం టిస్కో (TISCO) మీద ఆధారపడక తప్పలేదు. మొదటి ప్రపంచయుద్ధ సందర్భంగా ప్రభుత్వం నిర్ణయించిన నాణ్యతాప్రమాణాలకు, ధరలకూ లోబడి ఉక్కును సరఫరా చేసింది టిస్కో చాలా క్లిష్టసమయంలో ప్రభుత్వాన్ని టిస్కో కంపెనీ తన ఉక్కు సరఫరాలతో ఆదుకుంది కూడా. యుద్ధం కారణంగా ఉక్కు దిగుమతులు కొంతకాలంపాటు ఆగిపోయినప్పుడు టిస్కోయే ప్రధాన ఉక్కు సరఫరాదారు అయింది. 1918లో టిస్కో ఉత్పత్తి చేసిన ఉక్కులో 90శాతం ప్రభుత్వమే కొనుగోలు చేసింది. ప్రభుత్వం నిర్ణయించిన ధరకు, బహిరంగ మార్కెటుధరకు మధ్య వ్యత్యాసం టన్నుకు రు150. టాటా కంపెనీ ఆ యుద్ధ సంవత్సరాలలో సరఫరా చేసిన ఉక్కు షుమారుగా 2,90,000 టన్నులు. కంపెనీ ప్రభుత్వానికి సరఫరా చేసిన కారణంగా భారీగా

నష్టపోయింది. (షుమారుగా 6 కోట్ల రూపాయలు అని అంచనా వేసారు).[36]

మిగిలిన పరిశ్రమలు ఉక్కుపరిశ్రమ అంత కీలకమైనవి కావు. అత్యవసరమైనవీ కావు. దానితో వాటికి యిచ్చిన రాయితీలను తీసివేసారు. రక్షణ సుంకాల కొనసాగింపు కోసం అవి పెట్టుకున్న అభ్యర్థనలను తిరస్కరించారు. అందుకోసం వారి 'స్వేచ్ఛా వాణిజ్య' సిద్ధాంతాన్ని ఉటంకించారు. భారతీయ పరిశ్రమలు తమంతతాముగా ఎదగాలని, ప్రత్యేక రక్షణలు కోరుకోకూడదని చెప్పారు. సిమెంటు, చక్కెర పరిశ్రమల అభ్యర్థనలను సైతం తిరస్కరించారు. అయితే విమ్కో (WIMCO) అగ్గిపెట్టెల పరిశ్రమకు మాత్రం రక్షణ కొనసాగింది. విమ్కో కంపెనీ స్వీడన్‌కు చెందినది. స్వీడన్ ఇంగ్లాండ్‌కు ఉక్కును సరఫరా చేస్తున్నది. కనుక అగ్గిపెట్టెల పరిశ్రమ అయినప్పటికీ, రక్షణ యివ్వవలసిన అవసరం లేకపోయినప్పటికి, రక్షణ సుంకాలను యిచ్చారు. కొనసాగించారు.

వారు ఆ కాలంలో అనుసరించిన దిగుమతి సుంకాల విధానం భారతీయ పరిశ్రమల పాలిట పెనుభారం అయింది. భారతదేశం బ్రిటన్ తయారీదారులనుండి మాత్రమే కొనాలి. ఇతర దేశాలు అవే ఉత్పత్తులను అంతకంటే తక్కువధరకు సరఫరా చేస్తున్నా సరే, ఇంగ్లాండ్‌నుండే కొనాలి. అంటే బ్రిటన్ పరిశ్రమలకు ఒక సురక్షిత మార్కెట్టును భారతదేశ పరిశ్రమలద్వారా సృష్టించారు. అందుకు ప్రతిగా ఇంగ్లండ్‌కు ఎగుమతిచేసే ముడిపదార్థాలు, కొన్ని ఇతర ఉత్పత్తుల (Semi-Manufactured goods) పై సుంకాలను తగ్గిస్తారు. అంటే మొదటి ప్రపంచ యుద్ధానికిముందు నెలకొనియుండిన పరిస్థితులలోకి భారతదేశాన్ని నెట్టివేసే ప్రయత్నమన్నమాట.[37]

భారతీయ మార్కెట్లు కనుక లేకపోతే ఇంగ్లండ్ పారిశ్రామికాభివృద్ధి కుంటుపడేది. ఏదోరకంగా ఇంగ్లాండ్ పారిశ్రామిక ఉత్పత్తులకు మార్కెట్‌ను విస్తరించేందుకు వేసిన అనేక ఎత్తుగడలలో ఇది ఒకటి. వారి 'గొప్ప సాంకేతిక పరిజ్ఞానం' కాని, వారి 'గొప్ప శక్తిగల దేవుడిగా కొలిచే పోటీతత్వం' (Magic God of Competition) కాని వారిని ఆదుకోదని వారికి బాగా తెలుసు. అందుకే భారత మార్కెట్లను వారి గుప్పెట్లో పెట్టుకొన్నారు. ఆ క్రమంలో తీవ్రంగా నష్టపోయింది భారత పారిశ్రామిక వర్గమే. 1918 నాటికి యుద్ధకాలంలో నెలకొల్పబడ్డ అనేకపరిశ్రమలు క్షీణించటం మొదలుపెట్టాయి. అంతర్జాతీయ మార్కెట్లలో ప్రభుత్వశుల్కవిధానం వలన అవి పోటీకి నిలబడలేకపోయ్యాయి. 1935 నాటికి ఉన్న కొద్దిపాటి భారీపరిశ్రమలు

సైతం తగిన ప్రోత్సాహం, మార్కెట్టు లేక వెలవెలపోయాయి. కొన్ని పరిశ్రమల ఆధునికీకరణ మొదలయినా, భారతదేశం పారిశ్రామికంగా పుంజుకొంది అని చెప్పటానికి వీలులేదు.[38]

రెండవ ప్రపంచయుద్ధం మొదలయ్యే నాటికి, దిగుమతి సుంకాల రక్షణ పొందిన పరిశ్రమలవలన జాతీయ ఆదాయంలో పెరుగుదల రాలేదు. యంత్రాలు, యంత్రసామాగ్రి, సాంకేతిక పరిజ్ఞానంకోసం విదేశాలపై ముఖ్యంగా ఇంగ్లాండ్ పైనే అవి ఆధారపడటమే అందుకు కారణం. 1941 చివరకు కూడా రసాయనాలు, ఇతర భారీ పరిశ్రమలు ఏ మాత్రమూ పుంజుకోలేదు. యంత్రాలు, యంత్రసామాగ్రి కొఱత, నైపుణ్య కార్మికుల కొఱత అనే రెండు సమస్యలను అధిగమించటానికి భారతప్రభుత్వం ఏమీ చెయ్యలేదు.[39] ద్రవ్య, ఋణ, బ్యాంకింగ్ విధానాలు సైతం భారత పరిశ్రమ, వాణిజ్యాలపట్ల ఎంతో వివక్ష చూపించాయి. పెద్దపెద్ద బ్యాంకులు అన్నీ ఆంగ్లేయుల చేతుల్లోనే ఉన్నాయి.[40]

## రెండవ ప్రపంచయుద్ధం

రెండవ ప్రపంచయుద్ధకాలం తిరిగి ప్రభుత్వవిధానంలో కొన్ని మార్పులకు కారణమైంది. ఇంగ్లాండ్ తన యుద్ధ అవసరాలకుగాను కొన్నిరకాల పారిశ్రామిక ఉత్పత్తులపై భారతదేశంపై  ఆధారపడక తప్పని పరిస్థితులు తిరిగి ఏర్పడ్డాయి. అయితే ఆంగ్లపాలకులు ఈసారి మరింతగా జాగ్రత్తలు తీసుకున్నారు. మొదటి ప్రపంచయుద్ధ కాలంలో భారతదేశపు సామర్థ్యం దానికి తెలియవచ్చింది. అవకాశం యిస్తే, భారతదేశం ఇతరదేశాలతో సమానంగా పారిశ్రామికంగా ప్రగతి సాధించగలదు అన్న విషయాన్ని ఆ యుద్ధం బయటపెట్టింది. అంతేకాదు. మొదటి ప్రపంచయుద్ధ కాలంలో భారతదేశపు పరిశ్రమలు అర్జించిన లాభాలు బ్రిటిష పెట్టుబడిదారీవర్గానికి  బహుఆకర్షణీయమైనాయి. కనుక వారు భారతదేశంలో పెట్టుబడులు పెట్టటానికి ఉద్యుక్తులయ్యారు.

అయితే భారతదేశపు శక్తి సామర్థ్యాలను చవిచూచిన ఇంగ్లండ్ రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఒక పోటీదేశంగా భారతదేశం ఎదుగగలదన్న అంచనాకు వచ్చి అట్టి అవకాశం దానికి ఇవ్వకూడదన్న నిర్ణయానికి వచ్చింది. 1940వ దశకంలో అమెరికన్ టెక్నికల్ మిషన్ వారు భారతదేశానికి వచ్చి, ఒక నివేదికను తయారుచేశారు. అందులో పేర్కొన్న అంశాలు ఇంగ్లాండ్‌కు రుచించలేదు. ఆ నివేదికలో ఈ విధంగా

పేర్కొన్నారు. "తన సహజవనరులు, మానవనరులు కారణంగా పారిశ్రామికీకరణకు భారతదేశానికి అవకాశాలు మెండుగా ఉన్నాయి. సహజవనరులను సమర్ధవంతంగా అభివృద్ధి చేసుకోవటానికి, విస్తరింపచేయటానికి తగిన సాధనాలను ఆ దేశానికి సమకూర్చిపెట్టాలి. భారతీయులకు యంత్రాలపట్ల ఆసక్తి ఉంది. భారతీయ కార్మికుల యంత్రాసక్తి తగిన ప్రోత్సాహకాలతో, పని వాతావరణంతో కొద్దిపాటి శిక్షణతో వారిని మంచినైపుణ్యం కలవారిగా చేయగలదు".[41]

రెండవ ప్రపంచయుద్ధకాలంలో జరిగిన వనరుల దోపిడీకి కొత్త వంచన మార్గాలను కనిపెట్టారు. ఈ దశలో జరిగిన పారిశ్రామికాభివృద్ధి ప్రక్రియను అర్థం చేసుకోవటం ఆ కారణంగా అంత తేలిక కాదు. ఈస్టర్న్ ఎకనామిస్టు పత్రిక ఆగష్టు 31, 1945 సంచికలో ఈ విధంగా పేర్కొన్నది. "మనం దేనినయినా ఉత్పత్తి చేయగలం. కాని దేనినీ ఉత్పత్తి చేయటం లేదు. మనం ప్రతిదాన్నీ సరఫరా చేయగల సరఫరాదారులం మాత్రమే. దేనికయినా మరమ్మతులు చేయగలం. దేనినీ మనంతట మనం ఉత్పత్తి చేయలేకపోతున్నాం. మనకు ఒక వ్యవస్థ కాని, ప్రణాళిక కాని ఉన్నట్లు కన్పడటంలేదు. కాని రెండవ ప్రపంచయుద్ధ అనంతరం భారతదేశం ఎదగకుండా, పారిశ్రామికంగా అభివృద్ధి చెందకుండా ఉండేందుకు మాత్రము ఒక స్పష్టమైన గట్టి ప్రణాళికను ఈ పాటికే తయారుచేశారు".[42]

వాస్తవానికి యుద్ధఅవసరాలకుగాను భారతదేశాన్ని ఎలా ఉపయోగించుకోవాలి అన్నది అధ్యయనం చేయటానికే అమెరికన్ టెక్నికల్ మిషన్ భారతదేశాన్ని సందర్శించింది. బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికా, రష్యా, చైనాలు ఒక మిత్రకూటమిగా ఏర్పడిన విషయం తెలిసిందే. వారి వలసదేశాల వనరులతోనే ఆ యుద్ధంలో వారు పాల్గొంటున్నారు. వలసదేశాల వనరుల సమీకరణకు ఒక కౌన్సిల్‌ను కూడా ఏర్పాటు చేసుకొన్నారు. దానికి 'ఈస్టర్న్ గ్రూప్ సప్లయి కౌన్సిల్' అని పేరుపెట్టారు. అమెరికన్ టెక్నికల్ మిషన్ భారతదేశంలో మరికొన్ని పరిశ్రమలు నెలకొల్పాలని, యుద్ధ నౌకలు, సహాయనౌకలు, విమానాలను మరమ్మతు చేయటానికి భారతదేశంలో సదుపాయాలను మెరుగుపర్చాలని, మీటరుగేజు పట్టాలమీద నడిచే ఆవిరి ఇంజన్లను, సరకు రవాణా పెట్టెలను, ఇతర అవసరమైన రవాణా వాహనాలను తయారు చెయ్యటానికి అనువుగా కర్మాగారాలను నెలకొల్పమని తన నివేదికలో పేర్కొన్నది. అమెరికానుండి అందుకు కావలసిన సాంకేతిక పరిజ్ఞానాన్ని, యంత్రాలను సరఫరా చెయ్యగలమని కూడా పేర్కొన్నది.[43]

కాని ఆంగ్లప్రభువులకు ఆ నివేదికలోని అంశాలు రుచించలేదు. టెక్నికల్ మిషన్ చేసిన సిఫారసులను తిరస్కరించింది. ఎందుకంటే పారిశ్రామికంగా భారతదేశం ఎదగటం ఇంగ్లండ్‌కు ఏ కోశానా యిష్టం లేదు. అందుకని ఉన్న పరిశ్రమలను సైతం దెబ్బకొట్టటానికి అది ప్రయత్నం చేసింది. భారతదేశంలో కీలకమైన, ప్రాథమికమైన పరిశ్రమలను నెలకొల్పటానికి అవసరమైన యంత్రాల దిగుమతిని సైతం యుద్ధం పేరుతో నిషేధించారు. తమ యుద్ధ అవసరాలకుగాను వాహనాల తయారీకి అవసరమైన యంత్రాల సరఫరాకు, యుద్ధ నౌకల నిర్మాణానికి కెనడా, ఆస్ట్రేలియాలమీద ఆధారపడ నారంభించారు. అందుకుగాను ఆ దేశాలలో భారీపరిశ్రమలు నెలకొల్పటానికి అన్ని రకాల సదుపాయాలను సమకూర్చిపెట్టారు. భారతదేశానికి అవసరమైన మోటారు వాహనాల విడిభాగాలను ఒక చోటకు చేర్చి, కూర్చి వాహనాలు తయారుచేసే కాంట్రాక్టులను సైతం అమెరికాలోని జనరల్ మోటార్స్‌కు, ఫోర్డు కంపెనీలకు ఒప్పగించారు.[44]

అఖిల భారత తయారీదారుల సంఘానికి అధ్యక్షుడిగా ఉన్న శ్రీ మోక్షగుండం విశ్వేశ్వరయ్య ఏమంటున్నారో చూడండి. "రోజర్ మిషన్, ఈస్టర్న్ గ్రూప్ సప్లై కాన్ఫరెన్సు యిచ్చిన సలహాలమేర యుద్ధ అవసరాలకుగాను అవసరమైన ఉత్పత్తుల సమీకరణకు తమ వలసపాలనలో ఉన్న దేశాలనుండి ఇంగ్లాండ్ పూనుకొంది. ఏవో కొన్నిపారిశ్రామిక ఉత్పత్తులను, అదీ ఉత్పత్తి చేయటానికి ఎక్కువ సాంకేతిక నైపుణ్యం అవసరం లేని ఉత్పత్తులకు మాత్రమే భారతదేశపు పరిశ్రమదారులనుండి సేకరించింది. భారీపరిశ్రమల ఉత్పత్తులను, మెరుగైన సాంకేతిక నైపుణ్యాన్ని ఉపయోగించి చేసేఉత్పత్తులను అమెరికా, కెనడా, ఆస్ట్రేలియాలనుండి సేకరించారు".[45]

'ఈస్టర్న్ గ్రూప్ కౌన్సిల్' యొక్క ప్రధాన కార్యాలయం భారతదేశంలోనే పెట్టారు. ఈ కౌన్సిల్‌లో భారత ప్రభుత్వ ప్రతినిధి కూడా ఉన్నారు. అది చేసే సిఫారసులకు అనుగుణంగా, యుద్ధ అవసరాలకు కొనుగోళ్ళ ఉత్తర్వులు యిచ్చేవారు. అయితే ఈ కౌన్సిల్ భారతదేశపు పరిశ్రమదారులపట్ల గరిష్ఠ వివక్షతను ప్రదర్శించింది. మిత్రదేశాల యుద్ధ అవసరాలకు కావాల్సిన ముఖ్యమైన వస్తుసేవలను భారతదేశంనుండి కాక, వారి ఏలుబడిలో ఉన్న ఇతరదేశాలనుండి కొనుగోలు చేసారు.[46]

పరిశ్రమలు ఎదగటానికి బ్యాంకింగ్, ఋణ సంస్థల తోడ్పాటు ఎంతో అవసరం అవుతుందన్న విషయం అందరికీ తెలిసిందే. అదేవిధంగా ద్రవ్య, కోశ విధానాలు, విదేశీ మారకరేటు విధానం కూడా అత్యంత ముఖ్యమైనవి. ఈ విధానాలను పరిశ్రమలకు అనుకూలంగా మలుచుకోవచ్చు. లేదా ప్రతికూలంగా తీసుకొనిరావచ్చు. వలసపాలనకాలంలో ఈ విధానాలన్నీ భారతదేశానికి ప్రతికూలంగానే ఉన్నాయి. స్వదేశీ ఉద్యమకాలంలో దేశంలో వివిధ ప్రాంతాలలో బ్యాంకింగ్, ఇన్సూరెన్సు సంస్థలు వెలిసాయి. అంతకుముందు బ్యాంకింగ్, ఇన్సూరెన్సు రంగాలను ఆంగ్లేయులు తమ గుప్పెట్లో పెట్టుకున్నారు. విదేశీ పెట్టుబడిదారీవర్గం ప్రారంభించిన ఈ సంస్థలు భారత పారిశ్రామికవేత్తల అవసరాన్ని ఏనాడూ పట్టించుకోలేదు. తీర్చలేదు కూడా. రాజకీయ వ్యవస్థ లక్ష్యం కూడా అదే కాబట్టి, వారి ఆటలు కొనసాగాయి. ఏదోరకంగా తమ గుత్తాధిపత్యాన్ని కొనసాగించటమే వారి లక్ష్యం. 'కాపిటల్ బ్యాంకింగ్ ఎన్‌క్వైరీ కమిటీ' తన నివేదికలో ఈ విధంగా పేర్కొన్నది "ఇంపీరియల్ బ్యాంకు ఋణ మంజూరీ విషయంలో జాతి వివక్ష చూపిస్తున్నట్లుగా అనేక ఫిర్యాదులు వచ్చాయి. ఇంపీరియల్ బ్యాంకు అధికారులు ఎక్కువమంది పాశ్చాత్యులు. వారి జీవనశైలి కారణంగా పాశ్చాత్య ఖాతాదారులతో వారికి ఎక్కువ అనుబంధం సహజంగా ఏర్పడుతుంది. ఆ కారణంగానే బ్యాంకు అధికారులు పాశ్చాత్య ఖాతాదారులకు తేలికగా ఋణాలు మంజూరు చేసి ఉండవచ్చు. భారతీయ ఖాతాదారుల అవసరాలను వారు అంచనా వేయటంలో, వారికి తగ్గ ఋణాలు మంజూరు చేయటంలో కొంత జాప్యం జరిగి ఉండవచ్చు. అంతేకాని జాతివివక్షను ఇంపీరియల్ బ్యాంకు చూపలేదు" అని పేర్కొన్నారు. టి.యస్.గోస్వామి అభిప్రాయాన్ని 'ఎక్సటర్నల్ కాపిటల్ కమిటీ' ఆయన మాటలలోనే ఉట్టంకించింది. "ఋణాల మంజూరు విషయంలో జాతి, రాజకీయపరమైన వివక్ష ఉందని నేను చెప్పక తప్పటం లేదు. భారతీయులకు వారి ఆస్తులకు తగిన విధంగా ఋణాలు మంజూరు కావటంలేదు. అదే ఆంగ్లేయ వ్యాపారులకు తేలికగా ఋణాలు మంజూరు అవుతున్నాయి. మామూలు వ్యాపార సూత్రాలకు అనుగుణంగా ఎంత ఋణానికి అయితే వారు అర్హులో, అంతకు కొన్ని రెట్లు ఎక్కువగా వారికి ఋణాలు మంజూరు చేస్తున్నారు".

అటువంటి జాతివివక్షాపూరిత పరిస్థితులలో స్వదేశీ ఉద్యమం బ్యాంకులను, బీమాసంస్థలను నెలకొల్పటానికి పురికొల్పింది. అనేకమంది ద్రష్టలైన భారతీయ

ఔత్సాహికులు వివిధ రాష్ట్రాలలో పూర్తిగా భారతీయులనుండి సేకరించిన మూలధనంతో వీటిని స్థాపించారు. అయితే వాటిని నిలద్రొక్కుకోకుండా చేయటానికి అన్నిరకాల మార్గాలను ఆంగ్లేయులు ప్రయోగించారు. రాజకీయంగా బెదిరించారు. పాలనాపరంగా ఇబ్బందులు సృష్టించారు. ఆర్థికంగా మోసాలకు పాల్పడ్డారు. అయినాకూడా స్వదేశీ బ్యాంకులు, బీమా సంస్థలు దేశంలో నెలకొనటం విశేషం.

యుద్ధసమయంలో పారిశ్రామిక ఉత్పత్తి పెరిగిందని, అదంతా తమ ప్రోత్సాహం, మద్దతువల్లనే ఒనగూరిందని ఆంగ్లపాలకులు స్వంతడబ్బా కొట్టుకున్నారు. కాని వాస్తవాలు వేఱుగా ఉన్నాయి. ఉత్పత్తి పెరుగుదలకు కారణం కొత్త పరిశ్రమల స్థాపన కాదు. ఉన్న కర్మాగారాలలో నిరుపయోగంగా ఉన్న ఉత్పత్తిపాటవాన్ని (Capacity) ఉపయోగంలోకి తీసుకొని రావటంద్వారానే ఉత్పత్తిని పెంచారు. కర్మాగారాలను వాటి శక్తికిమించి పనిచేయించారు. ఎక్కువ గంటలు, ఎక్కువ పనిదినాలు, ఎక్కువమంది కార్మికుల కారణంగా అధికఉత్పత్తిని సాధించారు తప్ప, ఒక్క కొత్తకర్మాగారాన్ని ఏ కీలకరంగంలోనూ కొత్తగా నెలకొల్పలేదు. ఉదాహరణకు జనపనార కర్మాగారాలలో మొదటి ప్రపంచ యుద్ధం ముగిసాక మూడవవంతు ఉత్పత్తి సామర్థ్యం నిరుపయోగంగా పడి ఉంది. అదేవిధంగా దేశంలో ఉన్న జౌళిమిల్లులలో 22 పూర్తిగానో, పాక్షికంగానో 1939లో మూతపడి ఉన్నాయి. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో వివిధ పరిశ్రమలలో నిరుపయోగంగా పడిఉన్న ఉత్పత్తి సామర్థ్యాన్ని వినియోగంలోకి తీసుకొనిరావటం ద్వారానే ఉత్పత్తిని పెంచగలిగారు. దానితో యంత్రాలమీద భారం పెరిగింది. కానీ అరిగిపోయిన యంత్రాలస్థానే కొత్త యంత్రాలు దిగుమతిచేసుకొనేందుకు అనుమతిని యివ్వలేదు.

ప్రపంచయుద్ధాల అవసరాలకుగాను విరామం, మరమ్మతులు లేకుండా పనిచేయించటంతో 1940వ దశకం నాటికి అరుగుదల, తరుగుదలవలన దేశంలో ఉన్న వివిధ కర్మాగారాల ఉత్పత్తిసామర్థ్యం తీవ్రంగా దెబ్బతిన్నది. స్వాతంత్ర్యం వచ్చేనాటికి అనేక కర్మాగారాలు జాతికి భారంగా (Liabilities) మారాయి. వాటిని మూసివేస్తే, ఎందరో నిరుద్యోగులు అవుతారు. వాటిని నడిపించటానికేమో, ఎక్కువ మొత్తంలో పెట్టుబడులు అవసరం అవుతాయి. వాటిని ఆధునికీకరించటానికి పెద్ద మొత్తంలో వ్యయం చెయ్యాల్సి వస్తుంది. భారతదేశ పరిస్థితి స్వాతంత్ర్యం రాగానే ఈ పరిశ్రమలకు సంబంధించి ముందు నుయ్యి, వెనుక గొయ్యిలాగా తయారైంది.

దీనికి తోడు నూలు, జనపనార మిల్లులు భారతదేశవాటా కిందకు రాగా, పత్తి, జనపనార పండించే ప్రాంతాలు పాకిస్థాన్ వాటాకు వెళ్ళాయి. కర్మాగారాలు ఉన్నాయి కాని వాటి ముడిపదార్థాల లభ్యత లేకపోవటంతో ఉత్పత్తి నిలిపివేయవలసిన పరిస్థితి ఏర్పడింది. చాలా గడ్డు పరిస్థితిలోకి భారతీయ పరిశ్రమలు నెట్టివేయబడ్డాయి.

అదే సమయంలో విదేశీ యాజమాన్యాలక్రింద ఉన్న కర్మాగారాలు అగ్గిపుల్లలు, పెట్టెలు, సిగిరెట్లు, సబ్బులు, పాదరక్షలు, రబ్బరు, రసాయనాలు భారీస్థాయిలో ఉత్పత్తిచేసి, మార్కెట్లను నింపివేసాయి. ఈ విదేశీ పరిశ్రమల ధాటికి భారతీయ పరిశ్రమలు విలవిలలాడాయి. పెద్ద పరిశ్రమలే వాటి ధాటికి తట్టుకోలేకపోతే, ఇక కుటీర పరిశ్రమల గురించి చెప్పే పనేముంది? భారతదేశానికి పెట్టుబడుల అవసరం ఎంతైనా ఉంది. పెట్టుబడులు పెట్టటానికి విదేశీసంస్థలు పోటీపడుతూ వచ్చాయి. అందుకు లాభావకాశాలు చాలా మెండుగా ఉండటమే కారణం. లీవెర్ బ్రదర్స్, డన్‌లప్, ఇంపీరియల్ కెమికల్స్ వంటి విదేశీ సంస్థలేకాక, అనేక విదేశీ సంస్థలు తమ అనుబంధ సంస్థలను భారతదేశంలో నెలకొల్పటానికి రిజిష్టరు చేసుకున్నాయి. 1942-3లో కేవలం 5 విదేశీ కంపెనీల అనుబంధ సంస్థలు రిజిష్టరుకాగా, ఆ మరుసటి సంవత్సరంలో అట్లా రిజిష్టరు కాబడ్డ సంస్థల సంఖ్య 108 అయింది. అన్ని రకాల పారిశ్రామిక ఉత్పత్తులను ఉత్పత్తి చేయటానికి విదేశీసంస్థలు ఎగబడ్డాయి.

ఆంగ్లపాలకులు తమ వలసపాలనా కాలంలో సాధించిన ఘనవిజయాల గురించి, భారతదేశానికి వారివలన ఒనగూరిన మహత్తర ప్రయోజనాలగురించి అనేక అసత్యాలు, అర్ధసత్యాలు ప్రచారం చేస్తూ ఉండేవారు. భారతదేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధి చెయ్యాలన్న చిత్తశుద్ధి వారికి లేదు. వారి అవసరాలకోసం, ముఖ్యంగా మొదటి ప్రపంచయుద్ధ సందర్భంగా కొన్ని పరిశ్రమలను నెలకొల్పారు. వారి అవసరాలు తీరగానే ఆ పరిశ్రమలను ఎదగనివ్వలేదు. రెండవ ప్రపంచయుద్ధ కాలంలో మననుండి పన్నులు సేకరించి, ఇతరదేశాలనుండి కొనుగోళ్ళు చేసారు. ఏతావాతా భారతదేశానికి ఒరింగిందేమీ లేదు. అందుకే పారిశ్రామికంగా వంద సంవత్సరాల క్రితం భారతదేశం ఎలాఉందో వారు దేశం విడిచేనాటికి 1947లోకూడా అలాగే ఉంది. కొన్ని పారిశ్రామిక ఉత్పత్తులను ఎగుమతి చేయగలిగినా, మొత్తం

ఎగుమతులలో అవి నామమాత్ర శాతం మాత్రమే. వ్యవసాయ ఉత్పత్తులను, ఖనిజాలను, ఇతర ముడిపదార్థాలను ఎగుమతిచేసే దేశంగానే భారతదేశం మిగిలిపోయింది.[47]

వాస్తవాలు ఇలా ఉండగా భారతదేశంగురించి అనేక అర్ధసత్యాలు ప్రచారం చేసారు

- భారతదేశానికి మూలధన కొఱత ఉంది. (కాని దానికి కారణం ఎవ్వరో చెప్పరు)
- భారతదేశపు పెట్టుబడిదారులకు చొరవ తక్కువ. (భారతీయుల పరిశ్రమలపట్ల చూపిన వివక్ష గురించి మాట్లాడరు)
- భారతీయ కార్మికులకు నైపుణ్యం లేదు. ఒక ప్రాంతం నుండి మరొక ప్రాంతానికి వెళ్ళటానికి యిష్టపడరు. (నైపుణ్యం పెంచేందుకు ఎందుకు ప్రయత్నం జరగలేదు?)
- భారతీయ సమాజం జడమైనది. ఎలాంటి కొత్తదనాన్ని కోరుకోదు. ఆహ్వానించదు. (అటువంటి సమాజంపై రెండు వందల ఏండ్లు ఎందుకు పెత్తనం చేశారు?)
- జపాన్‌కు, భారత్‌కు ముఖ్య తేడా జపాన్ ఔత్సాహకులకు దూసుకువెళ్ళే స్వభావం ఉంది. భారతీయ ఔత్సాహికులు ప్రభుత్వంమీద ఆధారపడతారు. (ప్రభుత్వం ఒక పద్ధతి ప్రకారం ఔత్సాహికులను నిరుత్సాహపరిచిన విషయాన్ని; జాతి వివక్ష చూపిన విషయం గురించి చెప్పరు).
- భారతదేశపు ఆర్థిక సమస్యల తీవ్రత చాలా ఎక్కువ. కనుక ఎంత ఉదార ప్రభుత్వమైనా చేయగలిగింది తక్కువ. పారిశ్రామిక విధానాలు భారతదేశానికి అనుకూలంగా ఉన్నా సమస్య తీవ్రతదృష్ట్యా సాధించేది తక్కువ. (ఆర్థిక సమస్యల తీవ్రతకు కారణం ఎవరు? భారీఎత్తున జరిగిన వనరులదోపిడీ వలన దేశానికి పట్టినగతి గురించి ఎందుకు చెప్పరు?)

భారతదేశపు కార్మికులగురించి, వ్యవస్థాపకులగురించి, సమాజంగురించి, అలవాట్లు, అభిరుచులగురించి అనేక అసత్యాలు సిద్ధాంతాల రూపాలలో ప్రచారం చేస్తున్నారు. వీటన్నిటిని ప్రశ్నించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. భారతదేశీయుల గురించి ఆంగ్లేయులు, ఆంగ్లమానస పుత్రులు చేస్తున్న విమర్శలలో నిజాయితీ

లేదు. భారతదేశపు దౌర్భాగ్యస్థితికి కారణమయిన పరిస్థితులగురించి, కారణమయినవారిగురించి చర్చ జరగకుండా చేయటానికి, భారతీయులను ఆత్మరక్షణలో పడవేయటానికి ఈ రకమైన కువిమర్శలు, కుతర్కాలు, తప్పుడుసిద్ధాంతాలు పుట్టుకొనివచ్చాయి. పరిశోధనలద్వారా వీటిని పూర్వపక్షం చెయ్యవలసిన అవసరం ఎంతైనా ఉంది.

## References


1. *R.P.Dutt, India Today, p.112*
2. *J.M.Keynes, 'National self Sufficiency', Yale Review June 1933*
3. *H.D Buchanan, Development of Capitalist Enterprise in India, pp. 36-37*
4. *Frederick Clairmonte, p.104*
5. *Terms of Reference of the Select Committee of House of Commons, 16th March 1858*
6. *Wills, Tropical Agriculture, p.181*
7. *R,C.Dutt,The Economic History of India, Vol .2, p. 89*
8. *"Statement of Claims of British Subjects Interested in Opium", House of Commons, Parliamentary Papers, 1840, p. 42*
9. *R.C.Dutt, Vol.2, pp 110-12*
10. *'The Means of Improving and Maintaining the Foreign Trade',Great Britain, House of Commons, Parliamentary Papers, c.746, VI (1821), p. 280*
11. *R.C. Dutt, Vol.2, p. 117*
12. *Ibid, pp. 101-2*
13. *Ibid*
14. *Report of the Imperial Commission on Agriculture Research,1937, p. 5*
15. *Bengal Indigo Commission Report, 1861, p. 25 Cf. Thompson and Garret, Rise and Fulfilment of British in India, p. 474*

16. J.de Castro, *The Geography of Hunger*

17. Dr. Voelcker's *Report on Indian Agriculture*, Cf. R.C.Dutt, Vol.11, p. 254

18. L.C.A Knowles, p.104

19. W.W.Hunter, *Marquis of Dalhousie (Rulers of Indian Series)*, pp. 193-4

20. Bipin Chandra, *The Rise and Growths of Economic Nationalism in India*, p. 179

21. Daniel Thorner, *Investment in Empire*, p. 9

22. John M.Hurd, 'Railways', *The Cambridge Economic History of India*, Vol,2, pp 753 - 55

23. Habbakuk, 'Free Trade and Commercial Expansion ,1853-1870, *The Cambridge History of British Empire*, Vol.2, p. 797

24. N.Sanyal, *Development of Indian Railways*, p. 17

25. John M.Hurd, p. 745

26. Ibid, p. 758

27. Ibid

28. R.C.Dutt, Vol.2, p. 264

29. Bipin Chandra, *The Rise and Growth of Economic Nationalism in India, 1880-1905*,

30. G.S. Iyer, *Indian Politics*, p. 102

31. R.C. Dutt, Vol II , p. 266

32. *Montagu-Chelmsford Report*, P.267, Cf.R.P.Dutt, p.150

33. Ibid

34. A.K. Bagchi, op cit , pp. 425-426

35. Clive Dewey, 'The Government of India's New Industrial Policy' Dewey and Choudhury (ed.) *Economy and Society*, p. 240

36. This figure was quoted often in the Legislative Assembly debates

on the Steel Protection Bill during the period from 27th May 1924 to 5 June 1924.

37. Kate Mitchell, Industralisation of Western Pacific, 1942 p. 280
38. M. Visvesvarayya, Planned Economy for India, P. 247
39. Kate Mitchell, India's Economic Potential, Pacific Affairs 1942, p 23
40. M. Visvesvarayya, op cit, p. 95
41. R.P.Dutt, p.175
42. Ibid p. 173
43. Ibid p.175
44. Ibid pp 177-78
45. Visvesvarayya, Prosperity through Industry, p.15
46. R.P.Dutt, p.176
47. H.D. Buchanan, Development of Capitalist Enterprise in India, p. 451



# 9

# వనరుల తరలింపు

18వ శతాబ్ది మొదట్లో ప్రపంచ స్థూలజాతీయోత్పత్తిలో భారతదేశపు వాటా 23 శాతం. ఇది పాశ్చాత్య దేశాలన్నింటియొక్క ఆనాటి వాటాకు సమానం. ఆంగ్లేయులు ఈ దేశంనుండి వెళ్ళేనాటికి భారతదేశపు వాటా 3 శాతానికి పడిపోయింది. దానికి కారణాలు పెద్దగా వెతకనక్కరలేదు. వలసపాలనలో భారతదేశాన్ని కొల్లగొట్టారు. రెండు వందల సంవత్సరాలపాటు ఇంగ్లండ్ అభివృద్ధిపథంలో దూసుకొని పోవటానికి కారణభూతమైన వనరులన్నీ భారతదేశంనుండి కొల్లగొట్టబడినవే. బ్రిటన్ ఆర్థిక చరిత్రకారుడు అగస్ మాడిసన్ చాలా లోతుగా అధ్యయనం చేసి, ఈ వివరాలు బయటపెట్టాడు.[1]

1857 భారత స్వాతంత్ర్య సంగ్రామంవరకు ఈస్టిండియా కంపెనీ 20కోట్ల భారతీయులను చాలా క్రూరంగా, నిర్దయగా పరిపాలించింది. వారి ఆర్థిక, సామాజిక, రాజకీయజీవితాలను శాసించింది. సమాజాన్ని, విద్యావ్యవస్థను అస్తవ్యస్తం చేసింది. ఇంగ్లండ్ పారిశ్రామిక విప్లవానికి అవసరమైన నిధులను భారతదేశంనుండి దోచుకొని వెళ్ళింది. బ్రిటిషు ప్రభుత్వం కంపెనీ దోపిడీకి చట్టబద్ధతను కల్పించింది. కంపెనీ బలోపేతం కావటానికి అవసరమైన సైనిక, నావికా దళాలను సమకూర్చి పెట్టింది. బ్యాంకు ఆఫ్ ఇంగ్లాండ్‌నుండి కంపెనీకి ఋణాలు యిచ్చింది. ఈస్టిండియా కంపెనీకి అనుకూలమైన విదేశీ విధానాన్ని అనుసరించింది. ఇతర పాశ్చాత్య పోటీదారులైన ఫ్రెంచి, డచ్ కంపెనీలనుండి దానిని రక్షించింది. బ్రిటిషు ప్రభుత్వం మద్దతు లేకుండా ఈస్టిండియా కంపెనీ తనంతతానుగా భారతదేశాన్ని పాలించేస్థాయికి ఎదుగగలిగేది కాదు. కంపెనీకి ప్రేరణ ఆర్థిక లాభావకాశాలే. అందువల్ల వచ్చిన ఫలితాలు సైతం ఎక్కువగా ఆర్థికమే. ఇంగ్లాండ్ దానివలన ఎంతో లబ్దిపొందగా, భారతదేశం తీవ్రంగా నష్టపోయింది.

భారతదేశపు పరిశ్రమల సమాధులమీదే 'పారిశ్రామిక విప్లవం' అని వారు ముద్దుగా పిలుచుకొన్న ఆధునిక పరిశ్రమలను ఇంగ్లాండ్‌లో తీసుకొనిరాగలిగారు.

వస్త్ర పరిశ్రమ బ్రిటన్‌లో స్థిరపడటానికి, భారతదేశపు ప్రపంచ ప్రఖ్యాతి చెందిన నూలువస్త్ర పరిశ్రమను కర్కశంగా ధ్వంసం చేశారు. భారతదేశపు మార్కెట్లను తమ మిల్లు ఉత్పత్తులతో నింపటానికి అవసరమైన ముడిపదార్థాలను భారతదేశంనుండే బలవంతంగా తీసుకొనివెళ్ళారు. ప్రపంచచరిత్రలోనే ఇది ఒక అరుదైన సంఘటన. భారతదేశాన్ని పరిశ్రమల రహితంగా చేయటానికి వారు అనుసరించని పద్ధతిలేదు. సన్నని, నాజుకైన, మన్నికయిన నూలువస్త్రాల ఉత్పత్తిలో ప్రపంచంలోనే అగ్రగామిగా ఉన్న భారతదేశాన్ని దారుణంగా దెబ్బకొడితే తప్ప, తమ నూలు, జౌళి మిల్లులు మనలేవు కాబట్టి, ఆంగ్లేయులు అందుకు పూనుకొని, భారత వస్త్రపరిశ్రమను సర్వనాశనం చేశారు. ఆ విధ్వంసక ప్రక్రియలో భాగంగానే భారతదేశం తన పరిశ్రమలను కోల్పోయింది. పరిశ్రమలరహితంగా చేసే ప్రక్రియ క్రమంగా (Deindustrialisation) భారతదేశాన్ని పేదరికంలోకి నెట్టివేసింది.

**వ్యాపారులు పాలకులు అయ్యాక :**

1613లో తన మొట్టమొదటి 'ఫ్యాక్టరీ'నీ కలంకారీ వస్త్రాలకు ప్రపంచప్రసిద్ధి చెందిన మచిలీపట్నంలో నెలకొల్పటం యాదృచ్ఛికంగా జరిగింది కాదు. ఆనాడు మచిలీపట్నం రేవుకు ఉన్న ప్రాముఖ్యం, ఆ ప్రాంతంలో తయారయ్యే వస్త్రాలకు ఉన్న గిరాకీ కారణంగానే మొట్టమొదట తమ 'ఫ్యాక్టరీ'ని మచిలీపట్నంలో నెలకొల్పారు. బెంగాల్ సన్నవినూలు వస్త్రాలకు ప్రసిద్ధిగాంచింది. ఆ వస్త్రాలు చాలా తేలికగా ఉండేవి. ఎంత తేలికగా అంటే, గాలి అంత తేలికగా ఉండేవి. ప్రపంచవ్యాప్తంగా ఆ వస్త్రాలపట్ల విపరీతమైన మోజు ఉండేది. 18వ శతాబ్ది మధ్యవరకు కూడా ఆ వస్త్రాలను పశ్చిమాన ఈజిప్టు, టర్కీ పర్షియాలకు, తూర్పున జావా, చైనా, జపాన్‌లకు ఎగుమతి చేసేవారు. 1750వ దశకంలో బెంగాల్ వస్త్రఎగుమతుల వార్షికవిలువ 16 మిలియను (1.6 కోట్ల రూ॥లు) రూపాయలని అంచనా వేసారు. వారానికి ఒక పౌండు సంపాదించ గలిగిన వారిని ఇంగ్లండ్‌లో గొప్పగా చూసిన రోజులవి. 1753 వరకు ఏటా 65 లక్షల రూపాయల విలువైన సిల్కువస్త్రాలు ఎగుమతి అయ్యేవి. ఆంగ్లేయులు పాలకులుగా గాక, కేవలం వ్యాపారులుగా ఉన్న కాలంలో బెంగాల్ నూలు, సిల్కు వస్త్రాలుకు డిమాండ్ 33శాతం పెరిగింది. కళాత్మకంగా, సృజనాత్మకంగా, వర్ధిల్లుతున్న భారత వస్త్ర పరిశ్రమ ఆంగ్లవ్యాపారులు పాలకులయిన తర్వాత కుదేలు అయింది.

అధికారంలోకి వచ్చిన తర్వాత ఆంగ్లేయులు చాలా మొరటుగా, క్రూరంగా

ప్రవర్తించారు. అంతకుముందు వస్త్రాలకు చెల్లింపులు పౌండ్లలో, బంగారం, వెండి వరహాలలో చెల్లించేవారు. అధికారంలో రాగానే చెల్లింపులు రూపాయిలలోకి మారింది. అదీ వారి స్వంతనిధులనుండి కాక, వసూలుచేసిన పన్నుల రాబడినుండి చెల్లించటం మొదలుపెట్టారు. అంటే భారతీయుల డబ్బులతోనే భారతీయ వస్త్రాలుకొని, ఇతర దేశాలకు ఎగుమతి చేసి, కోట్లకు పడగలెత్తారు. ఈ పెట్టుబడిలేని వ్యాపారానికి ఆకాశమే హద్దు అయింది. అంతటితో తృప్తిపడక ఇతర పాశ్చాత్య వ్యాపార సంస్థలను వెళ్ళగొట్టి, విదేశీ వాణిజ్యంమీద గుత్తాధిపత్యాన్ని సాధించారు. ఒకసారి బ్రిటన్‌లో వస్త్రపరిశ్రమ నిలద్రొక్కుకోవటం మొదలుకాగానే, భారతవస్త్రాలకు ఉన్న ఎగుమతి ద్వారాలను అన్నిటినీ మూసివేసారు. అయినప్పటికీ బ్రిటన్‌వస్త్రాలు భారతవస్త్రాలతో పోటీపడలేకపోవటంతో, మొత్తం భారతదేశపు చేతి నూలు, చేనేతవస్త్రాల పరిశ్రమను ధ్వంసంచేయటానికి పూనుకొన్నారు. ఈస్టిండియా కంపెనీ సైనికులు రాట్నాలను, మగ్గాలును ధ్వంసంచేసారు. నేతన్నల బొటన వేళ్లను నరికారు. నూలు వడకలేని, నేత నేయలేని దుస్థితికి వారిని నెట్టివేసారు.[2]

మొరటు విధ్వంసంతోనే వారు తృప్తిపడితే వారు ఆంగ్లేయులు కారు. ఇంకా మెరుగైన సాధనాలు వారికి అందుబాటులో ఉన్నాయి. ధ్వంసం చేయగా మిగిలిన మగ్గాలపై నేసిన వస్త్రఉత్పత్తులపై 70 నుండి 80 శాతంమేర రకరకాల సుంకాలు విధించారు. దానితో ఇంగ్లాండుకు వాటి ఎగుమతులు ఏమాత్రమూ లాభదాయకం కాకుండా చేసారు. బ్రిటన్‌నుండి ముతకవస్త్రాలను తెచ్చి కారుచౌకగా భారతదేశంలో అమ్మటం మొదలు పెట్టారు. బ్రిటన్‌నుండి వచ్చే దిగుమతులపై సుంకాలు విధించే అవకాశం భారతదేశానికి లేదు. ఓడరేవులు అన్నీ వారి ఆధీనంలోనే ఉన్నాయి. ప్రభుత్వమూ వారిదే. అంతకంటే ఏం కావాలి? వాణిజ్య సరళిని, ధరలను (Terms of Trade) వారికి అనుకూలంగానే మార్చుకోగల స్థితిలో వారున్నప్పుడు లబ్ధిపొందటానికి వారు ఎందుకు సంకోచిస్తారు?

18వ శతాబ్దిలో ప్రపంచ వస్త్ర మార్కెట్టులో నాల్గవవంతు వాటా భారతదేశానిదే. ఆంగ్లేయులు పాలకులు అయ్యాక భారతదేశపు వాటా నామమాత్రం అయింది. గొప్ప సంఘసంస్కర్తగా పేరుగాంచిన గవర్నరు జనరల్ విలియమ్ బెంటింక్ ఇలా వ్రాసాడు. "చేనేతకార్మికుల ఎముకలతో భారతదేశపు మైదానాలు తెల్లబడు తున్నాయి".[3]

తన వస్త్రపరిశ్రమను కోల్పోతున్నప్పటికీ, భారతదేశం పత్తిని పండిస్తూనే ఉంది. ఇంగ్లాండ్ మిల్లుల అవసరాలకోసం పత్తిని పండించక దానికి తప్పలేదు. తను పండించిన పత్తినుండి అది నూలు వడకటానికి వీలులేదు. ఆ నూలుతో బట్టనేయటానికి వీలులేదు. అయినా పత్తి పండించక తప్పలేదు. నేత కార్మికులే కాదు. మాస్టరు వీవర్సు సైతం బిచ్చగాళ్ళు అయ్యారు. ఢాకా జీవంలేని పట్టణంగా దిగజారగా, బ్రిటన్‌నుండి వస్త్ర ఎగుమతులు భారతదేశానికి బేళ్ళకొద్దీ వస్తూనే ఉన్నాయి. (1830 నాటికి, బ్రిటన్ వార్షిక ఎగుమతులు 6 కోట్ల గజాలు, 1858 నాటికి 96.8 కోట్ల గజాలు, 1870 నాటికి వందకోట్ల గజాలు దాటిపోయాయి.)

వలసపాలనా కాలంలో నేతపరిశ్రమకు ఏ గతిపట్టిందో, మిగిలిన అన్ని పరిశ్రమలకు అదే గతి పట్టింది. భారతదేశపు తయారీపరిశ్రమ (Manufactures) కథ అంతా విషాదభరితం. తన ఉన్నతస్థానాన్ని కోల్పోవటం, తన సర్వస్వాన్ని మరొకరు దోచుకొనిపోవటం, తుదకు కోలుకోలేని ఓటమి పొందటం ఆ కథలోని ప్రధాన అంశాలు. ప్రపంచ తయారీ వస్తువుల ఎగుమతులలో భారతదేశపు వాటా 27శాతం నుండి 2 శాతంకు వలసపాలనా కాలంలో పడిపోయింది. బ్రిటన్‌నుంచి దిగుమతులు భారీగా పెరగటంతో, ఒక పెద్ద ఎగుమతులదేశం కాలక్రమంలో దిగుమతులదేశంగా మారిపోయింది. 18వ శతాబ్దం చివరిలో మొదలైన భారత నిష్పారిశ్రామికీకరణ 19వ శతాబ్దంనాటికి పూర్తి అయింది. 20వ శతాబ్దంలో మొదటి ప్రపంచయుద్ధం కారణంగా కొన్ని పరిశ్రమలు మొదలయ్యేంతవరకు ఒకప్పటి ప్రపంచపు తయారీవస్తువులకేంద్రం వెలవెలాపోయింది. 1913లో భారతదేశపు స్థూలదేశీయ ఉత్పత్తిలో పరిశ్రమల వాటా 3.8శాతం. 1947నాటికి అది క్రమంగా 7.5 అయింది. తయారీవస్తువుల వాటా మొత్తం ఎగుమతులలో 30శాతానికి 1947నాటికి అతికష్టంమీద ఎగబాకింది. 1947లో దేశ జనాభా 30కోట్లు. పరిశ్రమలు కేవలం 25లక్షల మందికే ఉపాధిని యివ్వగలిగాయి.

**పన్నుల మోత :**

ఆంగ్లేయుల పాలనాకాలంలో ప్రజలపై మోయలేని విధంగా పన్నులు విధించారు. వాటిని పన్నులు అనాలో లేక పాలకులుచేసిన దొంగతనం లేదా దోపిడీ అనాలో నేటికీ తేలలేదు. వారికి భారతదేశం కనకవర్షం కురిపించే కామధేనువు అయింది (Cash Cow). భారతదేశంనుండి బ్రిటిష్ కోశాగారానికి ప్రవాహంగా వచ్చి పడుతున్న పన్నుల రాబడిని స్వర్గంనుండి వస్తున్న కానుకల

కనకధారగా వర్ణించారు.[4] 1765-1815 మధ్య బ్రిటిష్ వారు పన్నులరూపంలో ప్రతి ఏటా సరాసరిన £ 1,80,00,000 దండుకొన్నారు. ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్ల కంటే ధనవంతులు అయిన రాజులు పాశ్చాత్య దేశాలలో అతికొద్దిమందే ఉన్నారని ఆనాటి ఫ్రెంచి రాయబారి వ్యాఖ్యానం వారిదోపిడీ ఏ స్థాయిలో ఉండేదో తెలియజేస్తుంది.[5] ఆదాయంమీద 50శాతం పన్ను మరేకాలంలోనూ, మరే దేశంలోనూ లేదు. అంత పన్నుకట్టలేక 18వ శతాబ్దిలో జనాభాలో 2/3 వంతుమంది వారి భూములను సాగుచెయ్యలేక పారిపొయ్యారు. పన్ను బకాయిదారులను చిత్రహింసలు పెట్టేవారు. వారి భూములను బకాయిలకింద కంపెనీ స్వాధీనం చేసుకునేది. దానితో మొట్టమొదటిగా భారతదేశ చరిత్రలో 'భూమిలేని రైతులు' అనే కొత్తవర్గాన్ని సృష్టించిన ఘనత వారికే దక్కుతుంది.

వలసపాలనాకాలంలో అవినీతి తారాస్థాయికి చేరింది. ప్రజలు చెల్లించలేనంత పన్నుల భారాన్ని వారిమీద మోపారు. దానితో పన్నువసూలు అధికారులు ప్రజలను బెదిరించేవారు. భయపెట్టేవారు. కొట్టేవారు. కొన్నిసార్లు నిర్దాక్షిణ్యంగా చంపేవారు. అధికారులకు విస్తృత అధికారాలుండేవి. దానితో శిక్షలు తప్పించుకోవటానికి, అవమానాలనుండి బయటపడటానికి ప్రజలు లంచాలు యిచ్చేవారు. చేతులు తడిపితేనే అధికారులు సంతృప్తి చెందేవారు. ఆక్స్‌ఫర్డ్ హిస్టరీ ఆఫ్ ఇండియా (1923)లో పేర్కొనట్లుగా ఆ రోజులలో ప్రతివాడికీ ఒక ధర ఉంది. ప్రతిదానికి ఒక ధర ఉంది. అన్నిటికీ మార్కెట్టు ఉంది.

**అవినీతికి పరాకాష్ఠ :**

ప్లాసీయుద్ధ విజేత రాబర్ట్ క్లైవు అవినీతిపరులలోకెల్ల అవినీతిపరుడు. ప్లాసీ విజయంతర్వాత ఇంగ్లాండ్‌కు మొదటిసారి వెళ్ళినప్పుడు తనతోపాటు తాను భారతదేశంలో కొల్లగొట్టిన £ 2,34,000 (ప్రస్తుత విలువ 2.3 కోట్ల పౌండ్లు) తీసుకొని వెళ్ళాడు. ఆయనగాని, అయన కుటుంబసభ్యులుగాని, ఆయన అనుచరులుగాని వారు కొల్లకొట్టి తెచ్చిన సంపదను ప్రదర్శించటానికి ఏనాడూ సిగ్గుపడలేదు. 1765లో తిరిగి భారతదేశం వచ్చిన క్లైవు రెండు సంవత్సరాల తర్వాత మళ్ళీ ఇంగ్లాండ్‌కు వెళ్ళినప్పుడు ఈసారి £4,00,000 (ప్రస్తుతం 4కోట్ల పౌండ్లు) తను దోచుకున్న మొత్తాన్ని తనతోపాటు తీసుకొని వెళ్ళాడు. క్లైవు తమ పాదాక్రాంతులైన నవాబ్‌ల ఖజనాలను కొల్లగొట్టాడు. వారినుండి కానుకలను తీసుకొన్నాడు. వారిచేత కప్పం కట్టించాడు. క్లైవు ఇలా ప్రకటించాడు కూడా "ఒక

సుసంపన్నమైన నగరం నా దయాదాక్షిణ్యాలకై ఎదురుచూస్తున్నది. నా చిరునవ్వుకోసం ఆ దేశపు బ్యాంకర్లు ఎదురుచూపులు చూస్తున్నారు. నా కోసం ఆ దేశపు కోశాగారాలు ప్రత్యేకంగా తెరిచారు. రాసులుగా, పోసి ఉన్న బంగారం, ఆభరణాల గుట్టలమధ్య విలాసవంతంగా నేను నడిచాను. నాకు కంటికి నచ్చినదల్లా తీసుకొన్నాను. ఆ దేశపు అద్భుతమైన సంపదతో పోల్చినప్పుడు, నేను తీసుకొన్నది చాలా స్వల్పం. నా నిగ్రహం నాకే ఆశ్చర్యాన్ని కల్గించింది". ఆంగ్లేయులు అతనిని 'క్లైవు ఆఫ్ ఇండియా' అని పిలిచారు. వారి ఉద్దేశ్యం ఇండియానుంచి వచ్చిన క్లైవు అని. కాని క్లైవు ఉద్దేశ్యంలో మొత్తం దేశానికి దేశమే ఆయన వ్యక్తిగత ఆస్తి. భారతదేశంనుండి వారు దోచుకుని వెళ్ళిన సొత్తు ప్రభావం ఇంగ్లాండ్‌మీద ఎంతో పడింది. 19వ శతాబ్దపు రాజకీయనాయకుడు, చరిత్రకారుడు థామస్ బాబిన్‌గ్టన్ మెకాలే క్లైవు గురించి, ఆయన సాధించిన విజయాల గురించి విస్తృతంగా వ్రాశాడు.[6]

భారతదేశంలో కొన్నాళ్ళు పనిచేసి ఇంగ్లాండ్ తిరిగివచ్చిన కంపెనీ ఉద్యోగులను, అధికారులను ఆయన వ్యంగ్యంగా 'నబాబులు' (Nabobs) అని పిలిచేవారు. 1788లో కంపెనీ గవర్నర్ జనరల్ వారెన్ హేస్టింగ్సు అభిశంసన సందర్భంగా పార్లమెంటులో జరిగిన చర్చలో పాల్గొంటూ ఎడ్మండ్ బర్క్ మొదటిసారిగా హేస్టింగును ఉద్దేశించి ఆ పదం వాడాడు. మెకాలే ఈ విధంగా వ్రాసాడు. "నబాబులు అకస్మాత్తుగా ఎక్కడినుండో ఊడిపడతారు. వారు విపరీతంగా సంపాదిస్తారు. దాన్ని అహంకారంతో ప్రదర్శిస్తారు. విలాసవంతంగా దాన్ని ఖర్చు చేస్తారు.... వారివలన వారి పరిసర ప్రాంతాలలో ప్రతి వస్తువు ఖరీదు పెరిగింది. తాజా గ్రుడ్లు నుండి కుళ్ళిన బరోల వరకు ప్రతిదాని ధర పెరిగింది.... వారి జీవనశైలి డ్యూక్(రాజవంశీకులు)లను మించిపోయింది. మేయర్ వాడే గుర్రపు బగ్గీలుకంటే వారివి మేలైనవి. ఖరీదు అయినవి.... వారి పెద్ద, సరైన పాలనలేని కుటుంబాలు కంపెనీ ఉద్యోగులలో సగంమందిని అవినీతిపరులను చేసింది. అంత సంపదను వారు చేజిక్కించుకున్నా, ఖరీదైన జీవనస్థాయికి వారు అలవాటుపడ్డా, వారు అధమస్థాయికి చెందిన మనుష్యులే".

ఈస్టిండియా కంపెనీలో కొలువు అనతికాలంలోనే కోటీశ్వరులు కావటానికి మార్గంగా ఆనాడు అనేకమంది ఆంగ్లయువకులకు కన్పించింది. కొంచెం తెలివితేటలు ఉంటే భారతదేశాన్ని ఎంతైనా కొల్లగొట్టవచ్చునని, అడ్డుకొనేవారు ఉండరని ఆంగ్ల యువకులు మనదేశంలో ఉద్యోగానికై ఎదురుచూస్తూ ఉండేవారు.

పాఠశాలల్లో పెద్దవాడివైన తర్వాత నీవు ఏమి చేయుదువు? అని వ్యాస రచన పోటీల్లో విషయంగా ఇచ్చేవారు. అత్యధిక శాతం విద్యార్థులు హిందూదేశానికి వెళ్లి, బాగా సంపాదిస్తూ, విలాసవంతమైన జీవితం గడుపుతామని, ధనవంతులై స్వదేశానికి వస్తామని వ్రాసేవారు. కంపెనీ ఉద్యోగాలలో ఉండి స్వంతవ్యాపారం చేసి విపరీతంగా సంపాదించిన ఉద్యోగులను, ఉద్యోగంచేస్తూ అవినీతికి పాల్పడి కూడపెట్టిన సొమ్ముతో కులికే వారినీ కూడా 'నబాబులు' అని పిలిచేవారు. 'నబాబు' పదం నిందార్థంలో అవినీతికి, అక్రమ సంపాదనకు పర్యాయపదంగా ఆ రోజులలో ఇంగ్లాండ్‌లో వాడేవారు. వ్యాపారంలో 25 శాతం రాబడి రావటం సర్వసాధారణంగా ఉండేది. అందుకని కంపెనీ ఉద్యోగులందరూ స్వంతవ్యాపారాలు చేసుకోవటానికి ఉత్సాహపడుతుండేవారు.

క్లైవు తండ్రి 1752లో కొడుకుకు ఒక లేఖ వ్రాశాడు. "నీ ప్రవర్తన, ధైర్యం గురించి అందరూ మాట్లాడుకుంటున్నారు. నీ అదృష్టాన్ని పరీక్షించేందుకు ఇది తగిన సమయం. అందినకాడికి సంపద పెంచుకో (కొల్లగొట్టు). ఈ సువర్ణ అవకాశాన్ని కంపెనీని వదిలేలోపల సద్వినియోగం చేసుకో". క్లైవు తండ్రి చెప్పినట్లే కొల్లగొట్టాడు. ఆ సొమ్ముతో తనకు, తండ్రికి పార్లమెంటులో స్థానాలు కొనుక్కున్నాడు. ఒక పెద్ద రాజప్రాసాదాన్ని ఐర్లండ్‌లో నిర్మించి, దానికి 'ప్లాసీ' అని పేరు పెట్టాడు.

కాకరెల్ సోదరులు-జాన్, ఛార్లెస్-అనే యిద్దరు సోదరులు 18వ శతాబ్దం రెండవ అర్ధభాగంలో ఈస్టిండియా కంపెనీ తరఫున భారతదేశంలో పనిచేసారు. వారు ఒక పెద్ద రాజప్రాసాదాన్ని నిర్మించారు. అత్యంత విలాసవంతమైన ఆ రాజప్రాసాదపు తోట మొఘలుల ఉద్యానవనం మాదిరిగా ఉంటుంది. ఒక సూర్యదేవాలయం, నంది ఎద్దులు, శివలింగాలు సైతం తోటలో ఆకర్షణీయంగా నిలుస్తాయి. ఆ సుందర విలాసవంతమైన భవనానికి వారు 'ఇండియా ప్యాలస్' అని నామకరణం చేసారు కూడా. 'నబాబుల' లూటీకి చిహ్నంగా ఆ భవనం నేటికీ నిలిచి ఉంది.

**నబాబుల వజ్రాల కథ :**

'నబాబులు' భారతదేశపు విలువైన వజ్రాలను తెచ్చి లండన్‌లో ప్రదర్శనకు పెట్టేవారు. ఒక శక్తిమంతమైన మహాసామ్రాజ్యంగా ఇంగ్లాండ్ ఎదుగుతున్నందుకు నిదర్శనగా ఆ సంపద ప్రదర్శనను బ్రిటన్‌వాసులు ఆశ్చర్యంతో తిలకించేవారు. హొరాక్ వాల్‌పోల్ వంటి వారికి తన దేశపు నబాబుల పద్ధతి నచ్చలేదు. 1790లో

ఆయన వ్రాస్తూ "ఇప్పుడు ఇంగ్లాండ్‌లో ఏముంది? భారతదేశాన్ని కొల్లగొట్టి తీసుకొని వచ్చిన సొత్తుతో దానిని నింపుతున్నారని," అది కూడదని, ఆంగ్లేయులు నిజాయితీగా వ్యవహరించాలని ఆయన కోరుకున్నారు. కాని ఆయనది అరణ్యరోదనే అయింది. భారతదేశంనుండి కొల్లగొట్టి తీసుకొని వచ్చిన సంపద ప్రదర్శనకు ఆద్యుడు థామస్ పిట్. ఆయన మద్రాసు గవర్నర్‌గా పనిచేసే రోజుల్లో 1702లో ఒక మేలుజాతి వజ్రాన్ని సేకరించి ఇంగ్లాండ్‌కు ఒక నౌకలో పంపాడు. వజ్రం భద్రంగా తన దేశం చేరిందన్న సమాచారం రాగానే తన పదవికి రాజీనామా చేశాడు. ఆ తర్వాత ఇంగ్లాండు వెళ్ళి ఒక పెద్ద రాజ ప్రాసాదాన్ని, పెద్ద ఎస్టేట్‌ను, పార్లమెంటుస్థానాన్ని తను కొల్లగొట్టిన సొమ్ముతో కొనుకున్నాడు. థామస్ పిట్ ఆ విలువైన వజ్రాన్ని డబ్బులిచ్చి కొనలేదని తర్వాత తెలిసింది. పిట్‌వజ్రంకథ 'నబాబుల'కు స్ఫూర్తిదాయకమైంది. భారతదేశపు వైభవానికి ప్రతీకగా ఆ వజ్రం నిలిస్తే, ఆ వైభవాన్ని కొల్లగొట్టగల శక్తి కేవలం ఆంగ్లేయులకే ఉందని చెప్పే పిట్ వజ్రం కథ ఆంగ్లేయులలో తరతరాలకు గర్వకారణంగా నిలిచిపోయింది.

అన్ని దేశాలలో మాదిరిగా బ్రిటన్‌లోనూ సంపద అంటే భూములు కలిగి ఉండటమే. భూస్వామ్యవర్గంకంటే వ్యాపారవర్గం సంపదను చేజిక్కించుకోవటంలో కొత్త మెలకువలు ప్రదర్శించటంలో వర్తక వాణిజ్యాలద్వారాకూడా సంపదను సమకూర్చు కోవచ్చున్న భావన పెరిగింది. పిట్ వజ్రం ఇంకొక ప్రత్యామ్నాయమార్గం ఉందని సూచించింది. వలసదేశాలలో సాహసం, చొరవ చూపిస్తే సంపదను తేలికగా సమకూర్చు కోవచ్చునన్న భావన సమాజంలో వ్యాప్తికి పిట్ వజ్రంగాథ కారణమైంది. వజ్రాలను హస్తగతం చేసుకోగలిగితే వారి వంశచరిత్రలే సమూలంగా మారిపోవటం వారు గమనించారు. వారసత్వంగా వచ్చే సంపదకంటే, వ్యాపారంతెచ్చే సంపదకంటే, ఏదో ఒక రకంగా భారతదేశపు వజ్రాలను స్వంతం చేసుకోగలిగితే సర్వమూ ఒక తరంలోనే మారిపోగలదన్న నమ్మకం గాఢంగా ప్రబలింది. అది వాస్తవం కూడా. థామస్ పిట్ తన వజ్రాన్ని 1,35,000 పౌండ్లకు ఫ్రాన్సు రాజప్రతినిధికి అమ్మివేశాడు. ప్రస్తుతకాలపు కరెన్సీ విలువలో అది కొన్ని మిలియన్ల పౌండ్లకు (కొన్ని పదుల లేదా వందలకోట్ల రూపాయలకు) సమానం. దానితో పిట్ కుటుంబానికి అంతులేని ధనం సమకూరింది. ఒకే ఒక్క భారతీయ వజ్రం ఒక ఆంగ్లవంశానికి పెన్నిధిలా మారి, ఇద్దరు ప్రధానమంత్రులను ఆ దేశానికి యిచ్చింది. పిట్ మనుమడు, మునిమనుమడు కూడా ఇంగ్లాండ్‌కు ప్రధానమంత్రులుగా పనిచేసారు.[7]

18వ శతాబ్దంలో నబాబులు, వారు కొల్లగొట్టిన సొమ్ము బ్రిటన్ రాజకీయాలను అత్యంత శక్తిమంతంగా ప్రభావితం చేసాయి. భారతదేశంలో అధికారం చేజిక్కించుకొని, దాన్ని పాలన చేస్తున్న ఈస్టిండియాకంపెనీ ఒక వ్యాపార కంపెనీ స్థాయిని ఏనాడో దాటిపోయింది. కనుక దానిని నియంత్రించాలని కొందరు పెద్దలు అనుకున్నారు. రాబర్ట్ క్లైవును పార్లమెంటుముందు హాజరుకమ్మని ఆదేశించి, ఆయన నడవడిక గురించి, ఆయన లూటీచేసిన మొత్తంగురించి ప్రశ్నించారు. వారెన్ హేస్టింగ్సును అభిశంసన చేసారు. ఆ సందర్భంగానే ఎడ్మండ్ బర్క్ ఈ విధంగా వ్యాఖ్యానించాడు. "ఈ రోజున పార్లమెంటు భారతదేశపు నేరగాళ్ళ (delinquents)ను ప్రశ్నిస్తున్నది. రేపు ఈ నేరగాళ్ళే పార్లమెంటు సభ్యులు కావచ్చు".[8]

వారెన్ హేస్టింగ్సు మహారాజులు, నవాబులనుండి లంచాలు తీసుకొనేవాడు. లంచం తీసుకొని కూడా లంచాలు యిచ్చిన వారికి వ్యతిరేకంగా యుద్ధాలు చేసేవాడు. అవధ్ (అయోధ్య) నవాబు భార్యలనుండి 10 లక్షల రూపాయలు కానుకగా ముట్టిందని, కంపెనీకి తెలియజేసి, ఆ 'కానుక'ను తన దగ్గర ఉంచుకొనేందుకు అనుమతిని అడిగాడు. కంపెనీ అందుకు తన అంగీకారాన్ని ఏ మాత్రమూ జాప్యం లేకుండా యిచ్చింది.[9]

హేస్టింగ్సు అభిశంసన తీర్మానం సందర్భంగా ఎడ్మండ్ బర్క్ చేసిన ప్రసంగం ఈస్టిండియా కంపెనీ నిజస్వరూపాన్ని, అది చేసిన దురంతాలను, దుర్మార్గాలను విశదపరిచింది. ఈస్టిండియా కంపెనీ భారతదేశంలో చేసిన ఘోరాలు చరిత్రలో ఇంతకు ముందెన్నడూ జరగలేదని, భారతదేశాన్ని అది ధ్వంసంచేసిన తీరును వర్ణించటానికి మాటలు దొరకవని ఆయన అన్నాడు. "అత్యాశ, అత్యాచారం, అహంకారం, క్రూరత్వం, హింసోన్మాదం, దురాక్రమణ మొదలైన దుష్టస్వభావాలే వారి ఎదుగుదలకు కారణం" బెంగాలీ స్త్రీలను వారు ఏవిధంగా అవమాన పరిచేవారో, వారిపై ఎటువంటి అత్యాచారాలకు ఒడిగట్టేవారో కూడా కళ్ళకు కట్టినట్లు చెప్పాడు. "వారిని ఇళ్ళలోనుండి బయటకు లాగి, అందరిముందే వారి బట్టలు ఊడదీసి, తిడుతూ, వారి చనుమొనలను వెదురుకర్రల పదునైన అంచులమధ్య పెట్టి, వాటిని వారి శరీరాలనుండి కత్తిరించి వేసేవారు".[10]

బర్క్ మాత్రమే కాదు. షెరిడాన్, ఛార్లెస్ జేమ్సు ఫాక్స్ వంటి వారు తమ

గంభీరకంఠాలతో వారెన్ హేస్టింగ్సును, కంపెనీని తీవ్రంగా విమర్శించారు. అయినప్పటికీ చివరకు హేస్టింగ్సు అభిశంసన తీర్మానం ఎగువసభలో వీగిపోయింది. ఆయన చేసిన అకృత్యాలకు, ఒడిగట్టిన అవినీతికి ఏ శిక్షా పడలేదు.

హేస్టింగ్సుతోనే వారి అవినీతి, అక్రమాలు మొదలు కాలేదు. ఆ తర్వాతకూడా అవి బెదురులేకుండా కొనసాగాయి. మత ప్రచారకుడు విలియమ్ హెూవిట్ 1839లో మాట్లాడుతూ ఇలా అన్నాడు. "మనం పాలిస్తున్న భారతదేశంలోనూ, దాని ప్రజలపైన సాగిస్తున్న వేధింపులు, అత్యాచారాలు, దోపిడీ వంటివి మరెన్నడూ చరిత్రలో జరిగి ఉండలేదు. అంతేకాక అవి చరిత్రకే మచ్చతెచ్చే సంఘటనలు. మానవచరిత్రలోనే చాలా అవమానకరమైన భాగాలు.... ఇలా జరగటానికి ఒకే ఒక కారణం ఉంది. ఒకే ఒక లక్ష్యం ఉంది. కొద్దిమంది గౌరవనీయులు అని పిలువబడే వారి దోపిడీకి అనువుగా పవిత్రమైన దాని మట్టిని ఎందుకూ పనికిరానిదిగా చేసారు. ప్రభుత్వంలో అత్యంత ఉన్నతస్థానాలలో ఉన్నవారికి అవినీతిపట్ల ప్రగాఢమైన అనురక్తి ఉంది. దానితో తమ క్రిందస్థాయిలలో జరుగుతున్న అవినీతిని కట్టడిచేసే ప్రయత్నం జరగటానికి ఎట్టి అవకాశమూ లేదు.... ప్రతివాడు–వాడు ఏ శాఖలో పనిచేసినా సరే... పౌర, సైనిక, వ్యాపార విభాగాలలో పని చేస్తున్న ప్రతివాడు అద్భుతమైన కానుకలను కచ్చితంగా తీసుకొన్నవాడే".[11]

మెకాలే కంపెనీ ఉద్యోగి. కంపెనీ అంటే చాలా గౌరవం, వినయ విధేయతలు ఉన్నవాడు. చాలా సంవత్సరాలపాటు భారతదేశంలో పనిచేసాడు. ఆంగ్లసామ్రాజ్య నిర్మాతలలో ఒకడు. ఆయన ఏమంటున్నాడో చూడండి. "ఆంగ్లేయుల అసమర్థపాలన ఎంతదూరం వెళ్ళిదంటే, అది సంఘ మనుగడకే ప్రతికూలంగా తయారైంది.... కంపెనీ ఉద్యోగులు ప్రజలను భయపెట్టి ఖరీదుపెట్టికొనాలని, చౌకగా అమ్మాలని బలవంతం చేస్తున్నారు..... 30 మిలియన్ల (3 కోట్ల) మానవులను అత్యంత నికృష్టస్థితిలోకి నెట్టి, కలకత్తాలో అంతులేని లాభాలను కంపెనీ ఆర్జించింది. ఈ రకమైన క్రూరత్వాన్ని ప్రజలు మునుపు ఎన్నడూ చవిచూచి ఉండలేదు..." దుష్టప్రభుత్వాలపై అణచివేతకు గురిఅయిన ప్రజలు తిరుగుబాటు చేయటం కద్దు. కాని ఇంగ్లీషువారిపై తిరుగుబాటు చెయ్యలేని అశక్తులుగా ప్రజలు ఉన్నారని కూడా ఆయన అన్నారు.[12]

**దోచుకోవటమే ధ్యేయం :**

ఆంగ్లేయులు తమ లక్ష్యాన్ని ఎన్నడూ దాచుకోలేదు. బహుకాలం కంపెనీ తరపున భారతదేశంలో పనిచేసిన ఆంగ్ల అధికారి ఫె.జె.పోర్ 1857లో పార్లమెంటు దిగువసభ ముందు సాక్ష్యమిస్తూ ఆ లక్ష్యాన్ని చాలా స్పష్టంగా పేర్కొన్నాడు." వీలయిన ప్రతిమార్గం ద్వారా, ఇంగ్లీషువారికి లాభించేటట్లు, భారతజాతిని పాదాక్రాంతం చేసుకోవటమే మన ప్రాథమిక సూత్రం. వారిపై గరిష్ఠంగా పన్నులభారాన్ని మోపాం. మన అధికారపరిధిలోకి వచ్చిన ప్రతిప్రాంతాన్ని వనరుల దోపిడీకి అనువుగా తయారుచేశాం. స్థానికపాలకులకంటే అధికమొత్తంలో రెవిన్యూ వసూళ్ళు చేయగలగటం మన గొప్ప".[13]

ప్రత్యక్షంగా వారు అధికారం చెలాయించలేని ప్రాంతాలలో ఆంగ్లేయులు తమ తాబేదార్లను సింహాసనాలు ఎక్కించారు. వారు పేరుకు రాజులే తప్ప, అధికారం అంతా ఆంగ్లప్రతినిధులదే. ఆంగ్లేయుల దురన్యాయాలను అడ్డుకొనే సంకల్పంలేని వారిని, శక్తిహీనులను వారు రాజులుగా నిలబెట్టారు. అందుకుగాను వారినుండి 'ఫీజు' వసూలు చేశారు. వారి రక్షణకు ఆంగ్ల సైన్యాన్ని పంపి, వారికయ్యే ఖర్చును ఆ రాజులనుండే వసూలు చేశారు. అంటే ఇది ఒక రకమైన 'ప్రొటెక్షను మనీ'. నేటి మాఫియాకు నాటి ఈస్టిండియా కంపెనీకి ఎట్టి తేడా లేదు. 19వ శతాబ్ది మొదట్లో హైదరాబాద్ నిజాం ఆంగ్లేయుల ధృతరాష్ట్ర కౌగిలిలోకి తీసుకొని రాబడ్డాడు. నిజాం రక్షణకోసం ఆంగ్లేయులు అధిక మొత్తంలో 'ఫీజు' వసూలుచేసారు. కంపెనీ కమాండర్‌కు నెలకు 5వేల పౌండ్ల జీతం. ఇంక అనేకవందలమంది ఆంగ్లసైనికులకు, అధికారులకు, ఉద్యోగులకు నెలనెలా నిజాం బొక్కసంనుండే చెల్లించేవారు. నిధులు లేక నిజాం చేతులు ఎత్తేస్తే, నెలకు రెండు రూపాయల వడ్డీకి (24 శాతం) 1814లో గవర్నర్ జనరల్ సహచరుడి బ్యాంకు నుండి ఋణం మంజూరు చేశారు. ఆయనకు తెలిసేసరికే, ఆ బ్యాంకుకు కొన్ని కోట్ల రూపాయిలమేర నిజాం బకాయి పడ్డాడు. ఆర్కాట్ నవాబుకు కూడా ఇదే గతి పట్టింది. భూమి భాటకపు (Rental) విలువలో 80 నుండి 90 శాతం మేర భూమిశిస్తుగా వసూలుచేశారు. మూడు దశాబ్దాలలోనే బెంగాల్‌లో వారు వసూలు చేసిన భూమిశిస్తు £817,533 నుండి £2,680,000కు వసూళ్ళు పెరిగాయి.[14]

19వ శతాబ్ది చివరకు వచ్చేసరికి భారతదేశం బ్రిటన్‌కు ప్రధాన ఆదాయ వనరైంది. బ్రిటన్ ఉత్పత్తులను అత్యధికంగా కొన్న దేశం కూడా అదే అయింది.

ఆంగ్లేయులకు అధికవేతనాలు లభించే ఉపాధివసరుగా కూడా భారతదేశం తయారైంది. అంటే ప్రధాన ఆదాయవనరుగా, బ్రిటన్ ఉత్పత్తులకు ప్రధాన కొనుగోలుదారుగా, ఆంగ్లేయులకు ప్రధాన ఉపాధివనరుగా భారతదేశాన్ని తయారుచేశారు. మన అణచివేతకు మనమే వారిని మన నెత్తినమోసి, వారి జీతభత్యాలకు అయ్యే ఖర్చును కూడా భరించాం.

పన్నులు పెనుభారంగా మారాయి. పండించిన పంటలో అత్యధిక భాగం పన్నులకింద జమ చేయవలసి వచ్చేది. సంవత్సరానికంతకు రైతుకు, అతని కుటుంబానికి కావలసిన తిండిగింజలు కూడా రైతుకు మిగిలేవి కావు. ఆ సమయంలో ప్రపంచంలో అన్ని దేశాలలో కంటే భూమిశిస్తులు భారతదేశంలోనే ఎక్కువ. సగటు భూమిశిస్తులకు రెండు మూడు రెట్లు ఎక్కువగా భూమిశిస్తును నిర్ణయించి, ముక్కు పిండి, వసూలు చేశారు. ప్రతి బ్రిటిషు పాలిత ప్రాంతం ఏటా ఇంగ్లండుకు ఖర్చులు పోగా కొన్ని వేల కోట్ల రూపాయిలను వాటికి సమానమైన పౌండ్ల రూపంలో పంపుతుండేది. ఆంగ్ల అధికారులు, వ్యాపారులు, సైనికులు కూడా పంపే మొత్తాలు సైతం ఏటా వందల కోట్లలో ఉండేవి. ఈస్టిండియా కంపెనీ తరపున భారతదేశంలో పనిచేసిన ఆంగ్లేయ సిబ్బందికి పింఛనుక్రిందకూడా ఏటా కొన్ని వందలకోట్ల పౌండ్లు ఇంగ్లాండ్‌కు చేరేవి.

ఇంగ్లాండు కోశాగారం నిండిపోతుండగా, భారతదేశపు అప్పు ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపోతుండేది. భారతీయులు దేశంలో ఉన్న ఆంగ్లసైనికులమీద పెట్టిన వ్యయాన్నేకాక, బర్మానుండి మెసపటోమియావరకు తన రాజ్యవిస్తరణలో భాగంగా బ్రిటన్ చేసిన సైనిక వ్యయాన్ని కూడా ఇక్కడి పన్నులనుండే భరించారు. ఉదాహరణకు 1922లో భారతప్రభుత్వపు పన్నుల రాబడిలో 64 శాతాన్ని ప్రపంచవ్యాప్తంగా ఉన్న ఆంగ్లసైనికులకోసం ఖర్చు చేసారు. ప్రపంచంలో ఏ దేశమూ తన రాబడిలో అంతశాతం సైనికుల కోసం ఖర్చు పెట్టలేదు.

ఇక భారతదేశపు ఆదాయవ్యయ లెక్కలను తారుమారు చేసి భారతదేశ నిధులను ఇంగ్లాండుకు తరలించేవారు. ఉదాహరణకు ఎగుమతులు దిగుమతుల కంటే ఎక్కువగా ఉన్నప్పుడు వాణిజ్యమిగులు (Trade Surplus) ఉంటుంది. దానినుండి పెద్ద మొత్తంలో 'హోమ్‌ఛార్జీలు' మరియు 'అదర్ ఇనివిజిబుల్స్' పేరిట తీసివేయటంతో నికరంగా

లోటు ఏర్పడేది. ప్రతి సంవత్సరం భారతదేశపు స్థూలజాతీయోత్పత్తిలో 8 శాతం ఇంగ్లండుకు వివిధ పద్దులకింద బదిలీచేసేవారని పాల్‌బారన్ అంచనావేసాడు.[16]

**దాదాభాయి నౌరోజి వివరించిన నిధుల తరలింపు సిద్ధాంతము :**

దాదాభాయినౌరోజి 1892లో బ్రిటన్ పార్లమెంటు దిగువసభకు ఎన్నికయిన మొదటి భారతీయుడు. భారతదేశానికి జరుగుతున్న దురన్యాయాలగురించి ఆంగ్లఅధికారులను ఉట్టంకిస్తూ ఆయన చేసిన ప్రసంగం నేటికి చారిత్రాత్మకం. "మాంటేగ్ మార్టిన్ బెంగాల్, బీహార్ ప్రాంతాలను దర్శించి, తన ఈస్టర్న్ ఇండియాలో ఈ విధంగా వ్రాశాడు. "కంటికి కొట్టవచ్చినట్లు కనపడిన రెండు ప్రత్యేక అంశాలగురించి చెప్పకతప్పదు. మొదటిది ఆ దేశ సౌభాగ్యం. రెండవది ఆ దేశవాసుల పేదరికం.... భారతదేశం నుండి ప్రతి ఏటా £30,00,000 ఇంగ్లాండుకు తరలించబడుతున్నాయి. గత 30 ఏండ్లలో ఈ తరలించబడ్డ మొత్తానికి చక్రవడ్డీతో కలిపి £72,39,00,000 అవుతుంది. ఇంగ్లాండ్ నుండి అంతే మొత్తం అంతే నిలకడగా బయటకువెళితే, అది ఇంగ్లాండ్‌ను కూడా పేదరికంలోకి నెట్టివేస్తుంది. అలాంటిది రోజుకు రెండునుండి మూడుపెన్నీలు మాత్రమే కూలీ రేటుగా ఉన్న ఆ దేశంపై ఈ (అక్రమ) నిధుల తరలింపు ప్రభావం తీవ్రంగా ఉంటుంది..." ప్రభుత్వ ప్రచురణల ఆధారంగానే దాదాభాయి నౌరోజీ తన 'నిధుల తరలింపు (Drain Theory) సిద్ధాంతాన్ని' రూపొందించాడు. 1835 నుండి 1872 వరకు ఏటా భారతదేశం ఇంగ్లాండ్‌కు £13,000,000 (ఒక కోటి ముప్పది లక్షల పౌండ్ల) విలువైన ఉత్పత్తులను ఎగుమతి చేసిందని అంచనావేసారు. కాని అందుకు బ్రిటన్ ఎటువంటి చెల్లింపులు చేయలేదని ఆయన నిరూపించారు. అంతేకాక వివిధ రూపాలలో ఇంగ్లాండ్‌లోని వ్యక్తులకు (కంపెనీ వాటాదారులకు లాభాలు, రైల్వేలలో పెట్టుబడి పెట్టినవారికి డివిడెండ్లు, పదవీవిరమణ చేసిన ఉద్యోగులకు పింఛన్లు) చేసిన చెల్లింపులతో ప్రతిసంవత్సరం నికరలోటు £30 మిలియన్లుగా (మూడు కోట్ల పౌండ్లుగా) చూపించారు. రకరకాల పద్ధతుల ద్వారా చేసిన నిధుల బదిలీ కారణంగా భారతదేశం వట్టిపోయిందని, వనరులు క్షీణించాయని (Depleted), నశించి పోయాయని (exhausted), వనరులు కొల్లగొట్టటంతో భారతదేశం కటువుకాటకాలకు నిలయమైందని, పేదరికం తీవ్రస్థాయికి పెరిగిందని ఆయన సాక్ష్యాధారాలతో సహా నిరూపించారు.[16]

విలియమ్ డిగ్బీ భారతదేశపు సంపద ఎలా తరిగిపోయిందో, ఇంగ్లాండ్‌కు ఎలా తరలించబడ్డదో, దానితో ఇంగ్లాండ్ అభివృద్ధిపథంలో ఎలా దూసుకొనివెళ్ళిందో సవివరంగా వివరించారు. 1901లో 'సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కు' భారతీయ పన్నుల రాబడి నుండి ఇచ్చిన జీతభత్యాలు మొత్తం 90 వేలమంది భారతీయుల వార్షిక సగటు ఆదాయానికి సమానమని వ్రాశాడు.[17] మాడిసన్ ఇలా వ్రాస్తున్నాడు "భారతదేశంనుండి 190 సంవత్సరాలపాటు పెద్దఎత్తున నిధులు ఇంగ్లాండ్‌కు తరలించారనటంలో ఎట్టి సందేహం లేదు. ఆ నిధులను భారతదేశంలోనే వ్యయంచేసి ఉంటే, ఆ నిధులవల్ల ప్రజల స్థితిగతులలో గణనీయమైన మెరుగుదల వచ్చి ఉండేది.[18] 1901లో విలియమ్ డిగ్బీ భారతదేశం నుండి 19వ శతాబ్దిలో తరలించబడ్డ భారతదేశపు సంపద మొత్తాన్ని అంచనావేసాడు. ఆయన అంచనా ప్రకారం మొత్తం £4,187,922,732 (418 కోట్ల పౌండ్లు) తరలించబడ్డది.[19]

ఆంగ్లపాలనాకాలం ఆంగ్ల ప్రవాసుల కాలంగా చెప్పవచ్చు. భారతదేశంలోని ప్రవాసఆంగ్లేయుల ఆసక్తి ఎప్పుడూ తమ స్వంతదేశంమీదే ఉండేది. ఇక్కడ కొల్లగొట్టటం కోసమే వచ్చారు. ఇక్కడ కొల్లగొట్టి, అక్కడకు తరలించటంమీదే వారి దృష్టి ఉండేది. సాధ్యమైనంత తక్కువకాలంలో, సాధ్యమైనంత ఎక్కువ సంపాదించి ఇంగ్లాండ్‌కు పంపటమనే ఏకైక ధ్యేయము వారిని నడిపించింది. అత్యాశ వారి స్వభావం. పీడన వారి మార్గం. అందువల్ల అధికారకంగానూ, ప్రైవేటుగానూ నిధులు భారతదేశంనుండి పెద్ద ఎత్తున తరలి వెళ్ళాయి. ఒక సంవత్సరం కాదు. రెండు సంవత్సరాలు కాదు. 190 సంవత్సరాలపాటు ఇది కొనసాగింది. సంపాదించిన మొత్తం తమ దేశానికి చేరవేసే ప్రయత్నం భారతదేశాన్ని తీవ్రంగా దెబ్బకొట్టింది. స్థానికంగా సంపాదించింది, స్థానికంగా ఖర్చుపెడితే, స్థానిక ఉత్పత్తులకు డిమాండ్ పెరిగేది. స్థానిక ప్రజల జీవనప్రమాణాలు పెరిగేవి. కాని అలా జరగలేదు. సంపాదన యిక్కడ. ఖర్చు అక్కడ. ఒకవేళ కొందరు ఖర్చు చేసినా, వారు ఇంగ్లాండు నుండి దిగుమతి చేసుకున్న వస్తువులు, ఉత్పత్తులమీదే ఖర్చుపెట్టేవారు. దానితో ఇంగ్లాండ్ నుండి దిగుమతులు పెరిగేవి. ఉన్నత తరగతులవారి వినిమయ అవసరాలకు, అభిరుచులకు అనుగుణంగా చేసిన దేశీయ ఉత్పత్తులు నాజూకైన వస్త్రాలు, హస్తకళల ఉత్పత్తులు, మొదలైన వాటికి డిమాండ్ పడిపోవటంతో వాటి ఉత్పత్తిదారులు సైతం ఘోరంగా దెబ్బతిన్నారు.

**ఇంగ్లాండ్ సైనిక వ్యయభారం భారతదేశంమీద రుద్దారు :**

ఇంగ్లాండ్ 19వ శతాబ్దంలోను, 20వ శతాబ్దంలోను ప్రపంచవ్యాప్తంగా అనేక యుద్ధాలు చేసింది. అందుకుగాను భారతసైన్యాన్ని విస్తృతంగా వాడుకొంది. వారిమీద పెట్టిన ఖర్చును భారతప్రభుత్వ నిధులనుండే తీసుకొన్నారు. చైనా (1860,1900-01), ఇథియోపియా (1867-68), మలయా (1875), మాల్టా (1878), ఈజిప్టు (1882), సూడాన్ (1885-86,1896), బర్మా (1885), దక్షిణఆఫ్రికా (1896,1897,1898), సోమాలీలాండ్ (1890,1903-04), టిబెట్ (1903)లపై ఇంగ్లాండ్ యుద్ధాలు చేసింది.

1856-57 చైనా యుద్ధం సందర్భంగా 5,787 మంది భారతీయ సైనికులను వాడుకొన్నారు. ఆ యుద్ధం కారణంగా కాంటన్ రేవు పట్టణం ఇంగ్లాండ్‌కు దక్కింది. 1860లో 11 వేల మందిని చైనాకు తీసుకొని వెళ్ళింది. పీకింగ్ (ఇప్పుడు బీజింగ్ అని పిలుస్తున్నారు)ను తన అధీనంలోకి తీసుకొన్నది. నేటి ఇథియోపియాలో బందీలుగా పట్టువడ్డ ఆంగ్లేయులను విడిపించటానికి 12 వేలమంది భారతీయ సైనికులు యుద్ధంలో పాల్గొన్నారు. 1882లో, తిరిగి 1892లో ఈజిప్టులో రెండుసార్లు తిరుగుబాట్లు జరిగాయి. ఆ తిరుగుబాట్లను అణచివేయటానికి 9,444 మంది భారతీయ సైనికులను పంపారు. 14,79,000 రూపాయల వ్యయం అయింది. దక్షిణ ఆఫ్రికాలో చెలరేగిన తిరుగుబాటును సైతం భారతీయసైనికుల సహాయంతోనే అణచివేసారు. 'బ్రిటిష్ ఇండియన్ ఆర్మీయొక్క శక్తి సామర్థ్యాలవల్ల, త్యాగాలవల్ల మొత్తం భారత ఉపఖండమంతా దాని గుప్పిట్లోకి వచ్చింది. 1818లో సిలోన్‌మీద, 1824-26లో బర్మామీద చేసిన యుద్ధంలో అనేకమంది ప్రాణాలు కోల్పోయారు. ప్రతి ఏడుగురులో ఆరుగురి సైనికుల ప్రాణాలు గాలిలో కలసిపొయ్యాయి. రెండు ప్రపంచయుద్ధాల సందర్భంగానూ భారతీయసైనికులు అనేకులు ప్రాణాలు కోల్పోయారు.[20]

19వ శతాబ్ది చివరకు భారతదేశంలో ఉన్న ఆంగ్ల సైన్యంలో 3,25,000 సైనికులు ఉండేవారు. వారిలో భారతీయులతోపాటు, పాశ్చాత్యదేశాలకు చెందినవారూ ఉండేవారు. సైన్యంమీద పెట్టే ఖర్చు అంతా భారతదేశం ఖాతాలో పద్దువ్రాసేవారు. అయినా తెల్లవారికి, నల్లవారికి మధ్య అన్నిటా-ర్యాంకులు, జీతభత్యాలు, పింఛనులు, పదోన్నతులు, వసతులు, రేషను సరఫరా మొదలైన వాటన్నిలోనూ తేడాలు

ఉండేవి. నల్లసైనికులపట్ల వివక్ష చూపేవారు. భారతీయులు ఎంత వీరోచితంగా పోరాడినా సైన్యంలో వారికి గుర్తింపు ఉండేది కాదు.

సైన్యంలో చేరి సేవలు అందించటమే కాక, బ్రిటన్ దేశపు వలసలలో ఆర్థికాభివృద్ధి ప్రక్రియలోనూ భారతీయులు కీలకపాత్ర వహించారు. మలయా, ఆగ్నేయ ఆఫ్రికా, పసిఫిక్‌లలో వివిధరకాల తోటల పెంపకంలోనూ, ఉగాండాలో రైల్వేల నిర్మాణంలోనూ, బర్మాను ఆగ్నేయఆసియాలో బియ్యం ఉత్పత్తిలో అగ్రగామి దేశంగా చేయటంలోనూ భారతీయ కూలీలు ప్రధానపాత్ర పోషించారు. భారతీయ వ్యాపారులు అనేకదేశాలలో ఆంగ్ల వ్యాపార విస్తరణకు తోడ్పడ్డారు. 19వ శతాబ్దిలో వీరిలో అత్యధికులు భారతదేశంనుండి బలవంతంగా తీసుకొనిపోబడ్డవారే.

అనేకరకాలుగా భారతీయులు ఆంగ్లసామ్రాజ్య విస్తరణలో భాగస్వాములైనప్పటికీ, తగిన ప్రతిఫలం పొందలేదు. భారతసైనికులు చేసిన త్యాగాలకు ఈ నాటికీ గుర్తింపు దక్కలేదు. వారి కుటుంబాలకు నష్టపరిహారం అందలేదు. తమ ప్రగతికి, ఉన్నతికి పలువిధాల కారణమైన భారతీయులపట్ల ఆంగ్లేయులు కృతజ్ఞతతో ఉండకపోగా, వారిని చిన్నచూపుచూసేవారు. వివక్షాపూరితంగా వ్యవహరించేవారు.

భారతీయ సైనికులతో కూడిన సైనిక డివిజన్లు, బ్రిగేడులు అనేకం పాశ్చాత్య, మధ్యధరా, మెసపోటేమియా, ఉత్తరఆఫ్రికా, దక్షిణ ఆఫ్రికా యుద్ధప్రాంతాలకు పంపబడ్డాయి. యుద్ధానికి అన్నిదేశాలకంటే ఎక్కువగా భారతదేశమే ఇంగ్లాండ్‌కు తోడ్పాటును అందించింది. సైనికుల రూపంలో, తిండిగింజల రూపంలో, నిధుల రూపంలో భారతదేశం తనతోడ్పాటును అందించేటట్లు ఆంగ్లప్రభువులు చేశారు. వందమిలియను (పదికోట్ల) పౌండ్లను భారతదేశంనుండి యుద్ధ అవసరాలకుగాను తీసుకొన్నారు.

మొదటి ప్రపంచయుద్ధ కాలంలో భారతీయ సైనికులను వివిధయుద్ధ ప్రాంతాలకు తరలించారు. మెసపోటేమియాకు 5,88,177 మందిని, ఈజిప్టుకు 1,16,159 మందిని, ఫ్రాన్సుకు 1,31,496 మందిని, 46,936 మందిని దక్షిణ ఆఫ్రికాకు, పర్షియన్ గల్ఫ్‌కు 29,547 మందిని పంపారు. భారతదేశం నుండి మొత్తం 12,15,318 మంది సైనికులను వివిధదేశాలకు పంపగా వారిలో లక్షకు పైగా మరణించారు. లక్షమందికి పైగా అంగవికలు రయ్యారు. అయినా వారిత్యాగాలకు, వీరోచిత పోరాటాలకు చరిత్రలో స్థానం దక్కకపోవటం దురదృష్టకరం. ఆంగ్లేయులు తమ

యుద్ధ అవసరాలకోసం భారీగా నిధులు మళ్ళించారు. తమ ఆధీనంలో ఉన్న ప్రాంతాలనుండేకాక, 584 సంస్థానాల నుండి కూడా యుద్ధసహాయంగా నిధులు సమీకరించారు. ధనరూపంలో, ఇతర రూపాలలో భారతదేశంనుండి 14.62 కోట్ల పౌండ్లు తీసుకున్నారు. దాని విలువ ప్రస్తుతం 5వేల కోట్ల పౌండ్లకు సమానం.

ఐరోపాలో జరిగిన యుద్ధంలో ప్రాణాలు కోల్పోయిన వారిలో ముందువరసలో ఉన్నది భారతీయ సైనికులే. జర్మనీ జరిపిన ఎదురుదాడిలో పిట్టల్లాగా నేలకొరిగారు. జర్మనీని నిలువరించటానికి విఫలయత్నంచేసి వేలాదిమంది భారతీయులు ప్రాణాలు కోల్పోయారు. మెసపోటేమియాలో ఒట్టమాన్‌టర్కీకి వ్యతిరేకంగా జరిగిన యుద్ధంలో 7,00,000 భారత సిపాయిలు పాల్గొన్నారు. ఒట్టమాన్లు జర్మనీకి మద్దతుదారులు. ఆ యుద్ధంలో పాల్గొన్నవారిలో అనేకమంది ప్రాణాలు కోల్పోయారు. ఫ్రాన్సులోనూ, బెల్జియంలలోనూ అదే సమయంలో జరిగిన యుద్ధాలలోనూ అనేకవందలమంది ప్రాణాలు కోల్పోయారు. తమదికాని యుద్ధంలో తమ వలసపాలకుల ప్రయోజనాలను కాపాడేందుకు భారతసిపాయిలు తమకు ఎన్నడూ అలవాటులేని శీతలవాతావరణంలో అత్యంత దయనీయ పరిస్థితులలో ప్రాణాలు కోల్పోయారు. అయినప్పటికీ యుద్ధం పూర్తికాగానే వారు చేసిన త్యాగాలను ఏలికలు పూర్తిగా మర్చిపొయ్యారు. యుద్ధానికిముందు అందించే సహాయానికి బదులుగా స్వయంపాలన ప్రతిపత్తిని భారతదేశానికి యిస్తామని వలసపాలకులు హామీ యిచ్చారు. వారు కనుక ఆ హామీని నిలబెట్టుకుని ఉంటే ఆ వీర సైనికుల త్యాగాలకు అర్థం ఉండేది. కాని యుద్ధంలో విజయం సాధించిన బ్రిటన్ చేసిన వాగ్దానాన్ని మరిచింది. స్వయం ప్రతిపత్తికి బదులు మాంటేగు చేమ్సుఫర్డ్ సంస్కరణలను ప్రవేశపెట్టింది. అందుకు వ్యతిరేకించిన భారతీయులను అణిచివేయటానికి 1919లో రౌలత్ చట్టాన్ని చేసి, భారతదేశంమీద అనేక ఆంక్షలు విధించింది. సమావేశ హక్కును, వాక్స్వాతంత్ర్యాన్ని రద్దుచేసింది.

రెండవ ప్రపంచ యుద్ధ సమయంలోనూ భారతదేశమే ఇంగ్లాండును ఆదుకొంది. 1939లో భారతసైన్య బలం 1,94,373. 1945 నాటికి దాని బలం 20,65,554 అయింది. అంటే ఆరుఏళ్ళలో 10.63 రెట్లు పెంచారు. వైమానికదళంలో 29,201 మంది, నావికా దళంలో 30,478 మంది పనిచేసేవారు. 1 సెప్టెంబరు,1939 నుండి 28 ఫిబ్రవరి 1945 వరకు 1,49,225 మంది సైనికులు యుద్ధంలో మరణించారు. మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో మాదిరిగా రెండవ ప్రపంచ

యుద్ధానికి సైతం భారతదేశంనుండి నిధులను, తిండిగింజలను, ఆయుధ సంపత్తిని భారీ ఎత్తున సమీకరించారు. సర్ జార్జి విన్‌గేట్ 1859లో ఇలా అన్నాడు "ఒక దేశంలో వసూలు చేసిన పన్నులను ఆ దేశంలోనే ఖర్చుపెట్టటం సర్వసాధారణం. కాని ఒక దేశంలో వసూలుచేసిన పన్నుల రాబడిని వేరొక దేశంలో ఖర్చుపెట్టితే జరిగే పరిణామాలు ఊహించలేనివి. ఏదేశంలో వసూలుచేసిన పన్నులను ఆ దేశంలోనే ఖర్చుపెట్టితే, ఏ ప్రజలనుండి పన్నులు వసూలుచేశారో, తిరిగి వారికే దానివలన ఫలితం ఉంటుంది. శ్రమపడే తరగతులకు ఆ డబ్బులు తిరిగి వెళతాయి.... అలాకాక ఒక దేశంలో వసూలు చేసిన పన్నుల రాబడిని వేరే దేశంలో ఖర్చుపెడితే ఏ దేశంనుండి ఆ పన్నులు వసూలు చేశారో, ఆ దేశానికి తీవ్ర నష్టం కల్గుతుంది. ఆ మొత్తం సొమ్ము ఆ దేశంనుండి అదృశ్యం అవుతుంది.... ఆ మొత్తం సొమ్ము సముద్రంలో పడవేసినట్లే. భారతదేశంనుండి మనం వసూలుచేసిన లేదా దోచుకొచ్చిన కప్పం అలాంటిదే".

ఫె.జె.షోర్ ఇలా అభిప్రాయపడ్డాడు "భారతదేశ వైభవం అంతరించినట్లే. ఒకప్పుడు దానికి ఉన్న సంపదలో అత్యధిక శాతం తరలించబడింది. కంపెనీనుండి కిరీటానికి (రాజకుటుంబానికి) అధికారం బదిలీ అయిన తర్వాతకూడా ఆంగ్లేయులు తమ రెండునాల్కల ధోరణిని కొనసాగించారు. తమ వలసపాలనను సమర్థించుకోవటానికి సహేతుకం కాని వాదనలు చేసారు. తమనుతాము పరిపాలించుకోవటం చేతకాని దద్దమ్మలైన భారతీయులకు స్వయంపరిపాలన అనవసరం అని చెప్తూతూ ఆంగ్లేయులు వలసపాలనను సమర్థించుకోవటం మొదలుపెట్టారు. ఇది ఆంగ్లేయుల నయవంచన స్వభావాన్ని తేటతెల్లం చేస్తుంది. ఒక ఆంగ్లేయుడు దేనినయినా కోరుకుంటే, అది తనకు కావాలని బహిరంగంగా ఎన్నడూ చెప్పడు; అందుకు బదులు తను కోరుకున్నది ఎవరి దగ్గర ఉందో, వారిని జయించి తనకు కావలసింది తీసుకోవటం తన నైతిక, మత కర్తవ్యమని ప్రగాఢంగా నమ్ముతాడని ఆయన చెప్పాడు. చరిత్రకారుడు విల్ డ్యూరాంట్ దానినే పొడిగిస్తూ-ఒకవైపు దోపిడీ కొనసాగిస్తూనే, క్రూరత్వానికి నయవంచనను జోడించటం వారికి అలవాటు అని పేర్కొన్నాడు. (Hypocrisy was added to brutality, while the robbery went on). రాబర్ట్ క్లైవు ఆంగ్లసామ్రాజ్య విస్తరణ ఆవశ్యకతకు ఎలాంటి సమర్థింపు యిచ్చాడో చూడండి. "విస్తరణ ఆపటం ప్రమాదకరం; వెనుకకు మరలటం సర్వధా నష్టదాయకం" (To stop is dangerous; to recede is to ruin). ఒక రాజ్యంతర్వాత మరొక రాజ్యాన్ని వారు

కలుపుకున్నారు. యుద్ధంలో నాశనం అవటమో లేదా సామంతులుగా బ్రతకటమో వారు తేల్చుకోవాల్సి వచ్చింది. ఎక్కువమంది రెండోదాన్నే ఎంచుకున్నారు. యుద్ధం జరిగి ఓడిపోతే, ఆ యుద్ధానికి పెట్టిన ఖర్చును అణాపైసలతో సహా, ఓడిన భారతీయుల నుండే వసూలుచేసేవారు. అంటే వలసపాలనా సౌకర్యం కల్పించినందుకు భారతీయులే అందుకు మూల్యం చెల్లించేవారన్నమాట.

**ఏడుపద్దులక్రింద వనరుల తరలింపు :**

నిధుల తరలింపు నిరంతరాయంగా సాగింది. ఒక పద్దుక్రింద తగ్గితే, వేరొక పద్దుక్రింద పెరిగేవి తప్ప నిధుల తరలింపు మాత్రం ఆగలేదు. వలసపాలన కాలంలో ఏ ఏడాదికాఏడాది అంతకుముందు ఏడాదికంటే ఎక్కువగానే నిధులు భారతదేశంనుండి తరలివెళ్ళాయి. తరలింపు ప్రక్రియలో మాత్రం కొంతమార్పు వచ్చింది. ఈస్టిండియా కంపెనీ కాలంలో తరలింపు మొరటుగా, ప్రత్యక్షంగా జరిగేది. కంపెనీనుండి కిరీటానికి అధికారం బదిలీఅయ్యాక, పరోక్షపద్ధతులద్వారా నిధులను తరలించారు. ప్రపంచ యుద్ధకాలంలో మరింత వినూత్నమైన పద్ధతులను నిధుల తరలింపుకు వారు ప్రవేశపెట్టారు. "19వ శతాబ్దపు దోపిడీ పద్ధతులు అంతకుముందు కాలంలో అనుసరించిన ప్రత్యక్ష దోపిడీ పద్ధతులకు ముగింపు పలకలేదు సరికదా, వాటిని కొనసాగిస్తూనే వాటిలో మార్పు తీసుకొనివచ్చారు. 19వ శతాబ్దపు మధ్యవరకు అధికార ప్రతినిధులు 'కప్పం' పేరుతో లక్షలాది పౌండ్ల విలువైన సంపదను ఇంగ్లాండ్‌కు నేరుగా చేసే తరలింపులు, ఆ తరువాతి కాలంలో "హోమ్‌ఛార్జీలు", "ప్రైవేటు నగదు బదిలీల" పేరుతో కొనసాగటమే కాక, వాణిజ్యంతోపాటుగా 19వ శతాబ్దిలో వేగంగా పెరిగాయి".[21]

ఏడు ముఖ్యమైన పద్దులకింద నిధులను తరలిస్తూ ఉండేవారు. కప్పం, హోమ్‌ఛార్జీలు, బ్రిటిష ఉద్యోగులకు జీతభత్యాలు–పించన్ల చెల్లింపులు, నికర ఎగుమతుల విలువ, ప్రభుత్వఋణం, స్టెర్లింగ్ ఋణం, వడ్డీలు, డివిడెండ్లు, లాభాలు మొదలైన వాటినిమిత్తం చేసే చెల్లింపులు–ఆ ఏడు పద్దులు. తెల్లవాడి జిత్తులమారితనానికి దర్పణం 'హోమ్‌ఛార్జీలు' పద్దు. ఇంగ్లాండు ప్రభుత్వం భారతదేశ వ్యవహారాలకై చేసిన ఏ వ్యయాన్ని అయినా 'హోమ్ ఛార్జీలు' అని పిలిచేవారు. భారతదేశంనుండి తరలించిన మొత్తాన్ని ఈ పద్దుకింద చూపించి, దానికి చట్టబద్ధత కల్పించేవారు.

1857 విప్లవానికి ముందు ఈ పద్దుక్రింద భారతదేశపు పన్నులరాబడిలో ప్రతి ఏటా 10 నుండి 13 శాతం తరలించేవారు. ఆ తరువాత ప్రతియేటా పన్నుల రాబడిలో నాల్గవవంతు(25శాతం) ఈ పద్దుక్రింద తరలించటం మొదలుపెట్టారు. 1901-02లో 1.73 కోట్ల పౌండ్లను ఈ పద్దుక్రింద తరలించారు. విలియమ్ డిగ్బీ అధ్యయనం ప్రకారం ప్లాసీయుద్ధానికి- వాటర్‌లూ యుద్ధానికీ మధ్య అంటే 1757-1814 మధ్య వందకోట్ల పౌండ్లు తరలించారు. దానికి 'కప్పం' (Tribute) అని పేరు పెట్టారు. భారీస్థాయిలో తరలించిన ఈ మొత్తానికి ఉన్న కొనుగోలుశక్తిని మనం ఈనాడు కచ్చితంగా అంచనా కూడా వేయలేము. బ్రిటీషు అధికారిక పత్రాలు, గణాంక వివరాలు ఆధారంగానే ఆయన ఆ అంచనాకు వచ్చాడు.[22]

అంతమొత్తాన్ని దోచుకోవటానికి అనుసరించిన ఆనాటి మోరటు పద్ధతులకు ఆ తర్వాత కాలంలో మేలిముసుగు వేశారు తప్ప వనరుల దోపిడీ నిర్విఘ్నంగా కొనసాగింది. భారతదేశాన్ని తమకు ప్రతిఏటా క్రమంతప్పకుండా ఆదాయం యివ్వగల వనరు (స్రోతస్సు)గా గుర్తించారు. ఆ శాశ్వత ఆదాయవనరును పోగొట్టుకోవటం వారికి యిష్టంలేదు. అదే విషయాన్ని వారు స్పష్టంగా చెప్పారు కూడా. 'మద్రాసు బోర్డు ఆఫ్ రెవిన్యూ' అధ్యక్షుడు ఏమన్నాడో చూడండి "మన వ్యవస్థ ఒక స్పాంజివలె పనిచేస్తుంది. గంగాతీరంలో ఉన్న అన్ని మంచివస్తువులను అది పీల్చుకొని, జేమ్సునదీ తీరంలో పిండినపుడు వదులుతుంది".[23] భారతదేశంనుండి ఇంగ్లండుకు ప్రతి ఏటా వచ్చే అదనపు నిధులవలన ఇంగ్లాండ్ సంపద, మూలధనం పెరుగుతున్నాయని, దానినిబట్టే భారతదేశం ఇంగ్లాండ్‌కు ఎంత అవసరమో తెలుసుకోవచ్చునని ఈస్టిండియా కంపెనీ తన నివేదికలో పేర్కొన్నది.[24]

1813లో ఒక బ్రిటీషు పార్లమెంటు సభ్యుడు అంత ధనికదేశం అయిన భారతదేశం కొన్నేళ్ళతర్వాత ముడిపదార్థాలు ఎగుమతి చేసుకుంటూ, ఇంగ్లాండ్ ఉత్పత్తులు కొనుక్కొనే దేశంగా కొనసాగబోదని, ఎన్నటికీ దిగుమతి చేసుకొనే దేశంగా శాశ్వతంగా మారబోదని, అది ఊహించటానికి కూడా వీలుకాని పరిణామం అని పేర్కొన్నాడు. కనుక అటువంటి దేశసంపదను లూటీచేసి వీలైనంతత్వరగా ఇంగ్లాండ్‌కు తెచ్చుకోవటమే సాధ్యమయే పని కాబట్టి ప్రత్యక్ష దోపిడీ ద్వారానో లేదా ఇంగ్లీషు వారు పిలిచినట్లుగా 'కప్పం' రూపంలోనో ఇంగ్లాండ్‌కు తరలించటం మంచిదని ఆయన భావించినట్లున్నారు.[25]

1859లో జార్జి విన్గేట్ 'కప్పం' అంటే ఏమిటో నిర్వచనం యిచ్చాడు. ఓడిపోయిన దేశం గెలిచిన దేశానికి ప్రతిఏటా తన రాబడిలో కొంతభాగాన్ని చెల్లించే మొత్తాన్ని 'కప్పం'గా పిలుస్తారని, కప్పం చెల్లింపులు కారణంగా ఆ దేశానికి అందుకు సమానమైన వస్తుసేవలు ఏవీ విజేతలనుండి బదిలీకావని ఆయన పేర్కొన్నాడు. 1814-1831 మధ్య భారతదేశంనుండి 5.76 కోట్ల పౌండ్లు ప్రైవేటు చెల్లింపులు, బదిలీలకింద, నికర ఎగుమతులక్రింద (ఎగుమతులు-దిగుమతులు) 7 కోట్ల పౌండ్లు తరలించారని సర్‌జార్జి అంచనావేసాడు.[26]

1840లో ఒక పార్లమెంటరీకమిటీముందు మాంటేగ్ మార్టిన్ సాక్ష్యం యిస్తూ ఎంతభారీ మొత్తంలో ఆంగ్లేయులు భారతదేశంనుండి తరలించారో తన అంచనాను విశదీకరించాడు. "బ్రిటీషు ఇండియానుండి గత 30 సంవత్సరాలలో ఏటా 30 లక్షల పౌండ్లు తరలించారు. 12శాతం చక్రవడ్డీరేటు దగ్గర ఆ మొత్తం 72,99,97,991 అంటే అక్షరాల 72 కోట్ల 99 లక్షల, 97 వేల, 991 పౌండ్లు అవుతుంది. మనం కనుక ప్రతి ఏటా రెండు మిలియన్లు (20లక్షల) చొప్పున 50 సంవత్సరాలపాటు తరలించారనుకొంటే ఆ మొత్తం 840 కోట్ల పౌండ్లు అవుతుంది. (840,00,00,000)"[27]

కప్పం రూపంలో ఇంగ్లాండుకు తరలి వెళ్ళిన నిధుల మొత్తాన్ని ఈ పట్టిక చూపిస్తుంది.

**భారతదేశంనుండి తీసుకున్న మొత్తాలు మిలియన్ పౌండ్లలో**

| సంవత్సరం | హోమ్‌ఛార్జీలు | నికరఎగుమతులు (ఎగుమతులు-దిగుమతులు) |
|---|---|---|
| 1851 | 2.5 | 3.3 |
| 1901 | 17.3 | 11.0 |
| 1913-14 | 19.4 | 14.2 |
| 1933-34 | 27.5 | 69.7 |

ఈ క్రిందిపట్టిక భారతదేశం నికరఎగుమతుల సగటు విలువను తెలియజేస్తుంది. అవి ఏ స్థాయిలో పెరుగుతూ వచ్చాయో చూడండి.

**5 సంవత్సరాలకుగాను వార్షిక సగటు (మిలియను పౌండ్లలో)**

| సంవత్సరం | నికరఎగుమతులు |
|---|---|
| 1851-55 | 4.3 |

| | |
|---|---|
| 1897-1901 | 15.3 |
| 1909-10 నుండి 1913-14 వరకు | 22.5 |
| 1931-32 నుండి 1935-36 వరకు | 59.2 |

(ఒక మిలియన్ అనగా పదిలక్షలు)

పై పట్టికలోని అంకెలు తరలించిన నిధుల వార్షిక సగటు మొత్తాన్ని సూచనా ప్రాయంగానే తెలియజేస్తాయి. 1857 తర్వాత అనేక ఇతరపేర్లతో కూడా నిధుల తరలింపు జరిగింది. 'భారతదేశానికి బ్రిటన్ చేసిన మూలధన ఎగుమతులు' 'భారతప్రభుత్వ అప్పు' లేక 'స్టెర్లింగ్ అప్పు' అందులో ముఖ్యమైనవి.

భారతదేశంనుండి భారీస్థాయిలో తరలించిన ఈ నిధుల అండతోనే ఇంగ్లాండ్ తమ సామ్రాజ్యాన్ని విస్తరించుకోగలిగింది. సిలోన్, ఏడెన్, హాంగ్‌కాంగ్, సింగపూర్, రంగూన్, ఆఫ్రికాలలో తన సామ్రాజ్యవిస్తరణకు అవసరమైన నిధులన్నీ భారతదేశం నుండి కొల్లగొట్టినవే. అనేకయుద్ధాలు కూడా ఇంగ్లాండ్ చేయగలిగింది. జార్జి విన్గేట్ అందుకే ఇలా అంటున్నాడు "మొదటి చైనా యుద్ధం, ఆఫ్గన్ యుద్ధం, బర్మా పర్షియన్ యుద్ధాలకు కావలసిన వనరులు అన్నీ భారతదేశంలోని మన సామ్రాజ్యంనుండి తీసుకొనబడ్డవే. ఆ యుద్ధాలు ఆంగ్ల విధానానికి అనుగుణంగా జరిగినవే తప్ప, ఆ దేశపు (భారతదేశపు) ప్రయోజనాలకు ఏ మాత్రం సంబంధం లేనివి"[28]

ఆంగ్లసామ్రాజ్యవిస్తరణకు కావలసిన ఆర్థికవనరులను మాత్రమే భారతదేశం సరఫరా చేయలేదు. భారతీయ సిపాయిలు తమ ప్రాణాలు ఒడ్డి అన్ని యుద్ధాలలో ఇంగ్లాండ్‌కు విజయాన్ని తెచ్చిపెట్టారు. సామ్రాజ్య విస్తరణకు కావలసిన ఆర్థిక, సైనిక వనరులు, అన్నీ భారతదేశంనుండే వారు తీసుకొని, వారి సామ్రాజ్యాన్ని విస్తరింప చేసుకున్నారు. ఆ దేశాల వనరులనూ దోచుకున్నారు. భారతీయ సిపాయిల ప్రాణాలు పోవటంతప్ప, ఆ యుద్ధాలవలన ఇసుమంతైనా భారతదేశానికి ఒనగూరిన ప్రయోజనం లేదు. భారతదేశపు బడ్జెటులో 70 శాతంకుపైగా సైనికవ్యయానికే కేటాయించేవారు.

జెంక్స్ ఈ వనరుల తరలింపు ప్రక్రియను సోదాహరణంగా వివరించాడు. విక్టోరియా మహారాణి పెంపుడుపిల్లికి పోసిన పాలఖర్చును కూడా 'హోమ్‌ఛార్జీల' క్రింద భారతదేశపు ఖర్చు పద్దులో చేర్చారని చమత్కరించారు. మచ్చుకు కొన్ని:

"1. 1857లో జరిగిన భారత స్వాతంత్ర్య సంగ్రామాన్ని అణచివేసేందుకు అయిన

ఖర్చు; కంపెనీనుండి కిరీటానికి అధికార బదిలీ సందర్భంగా కంపెనీకి చెల్లించిన నష్టపరిహారం, ఇతర చెల్లింపులు, రాయిలీలు.

2. చైనాతోనూ, అబిసీనియాతోనూ ఏకకాలంలో జరిగిన యుద్ధాలకు అయిన మొత్తం ఖర్చు.
3. లండన్‌లో భారత ప్రభుత్వపాలనా నిర్వహణకు పెట్టుతున్న ఖర్చు; ఏ కొంచెం అయినా భారతదేశానికి సంబంధం ఉంటే, దాని ఖర్చు అంతా భారతదేశమే భరించాలి. ఉదాహరణకు ఇండియా హౌస్‌లో నియమించబడ్డ పారిశుద్ధ్య కార్మికులమీద పెట్టిన ఖర్చును సైతం భారతదేశపు పద్దులో వేసేవారు.
4. యుద్ధంలో పాల్గొనే అవసరంలేకపోయినప్పటికీ, తీసుకొని వెళ్ళిన కొన్ని నౌకలకు అయిన రవాణా ఖర్చు; భారతీయ సైనిక బృందాలకు ఆరునెలలుపాటు యిచ్చిన శిక్షణకు అయిన ఖర్చు;
5. 1868లో టర్కీ సుల్తాన్ ఇంగ్లండ్ పర్యటించినప్పుడు, ఆయన గౌరవార్థం ఇండియా ఆఫీస్‌లో ఏర్పాటు చేసిన విందుకు అయిన ఖర్చు.
6. ఏలింగ్ (Ealing)లో ఉన్మాదుల ఆశ్రయశాలమీద పెట్టిన ఖర్చుతోపాటుగా ఒక మిషన్‌కు యిచ్చిన కానుకలకు అయిన ఖర్చు;
7. చైనా, పర్షియాలలో ఏర్పాటు చేసిన కాన్సులార్, దౌత్య వ్యవస్థలకు ఏర్పాటు అయిన ఖర్చు;
8. మధ్యధరా సముద్రంలో బ్రిటన్ నావికాదళం ఖర్చులో కొంతభాగం;
9. ఇండియానుండి ఇంగ్లండ్‌కు వేసిన టెలిగ్రాఫ్ లైన్లకు అయిన ఖర్చు".[29]

కంపెనీనుండి కిరీటానికి అధికారం బదిలీఅయిన మొదటి 13 సంవత్సరాలలో భారతదేశపు రెవిన్యూ వసూళ్ళు సంవత్సరానికి 33 మిలియన్లు నుండి 52 మిలియన్లుకు (3.3 కోట్ల నుండి 5.2 కోట్లకు) పెరిగింది. అయినప్పటికీ 1866 నుండి 1870 వరకు 1.15 కోట్ల పౌండ్ల లోటును చూపించారు. 1858-1860 మధ్య £3,00,00,000 (3 కోట్ల పౌండ్లు)ను దానికి అదనంగా జోడించారు. భారతదేశపు బడ్జెటు అంకెలను యిష్టంవచ్చిన రీతిలో మార్చుతూ, బ్రిటన్ రాజకీయవేత్తలు ఇంగ్లాండ్‌కు మిగులు బడ్జెటు చూపిస్తూ, తమ 'ఆర్థిక ప్రశాసన ప్రజ్ఞను' బ్రిటన్ రాజకీయవేత్తలు ప్రదర్శించారు.

భారతదేశానికి బ్రిటన్ చేసిన మూలధన ఎగుమతులు అంటే ఏమిటో తెలుసుకుందాం. గడచిన దశాబ్దాలలో భారతదేశంనుండి దోచుకువెళ్ళిన సొత్తును

అంగ్ల పెట్టుబడిదారులు తిరిగి భారతదేశంలో పెట్టుబడులు పెట్టినప్పుడు, వాటిమీద చెల్లించబడుతున్న వడ్డీ, డివిడెండ్లు మొదలైనవి ఈ పద్దు క్రిందకు వస్తాయి. భారతదేశంలో అంగ్లేయులు పెట్టిన పెట్టుబడులకంటే భారతదేశంనుండి కప్పం రూపంలో చేసిన చెల్లింపులు అనేకరెట్లు ఎక్కువగా ఉండేవి. ఉదాహరణకు రైల్వేలకోసం అంగ్లపెట్టుబడిదారులు చేసిన పెట్టుబడులు భారతదేశంనుండి వనరుల తరలింపుకు కారణం అయింది. వారి పెట్టుబడులమీద చేసిన వడ్డీ చెల్లింపులు, డివిడెండ్లు, ఇంగ్లండ్ సాంకేతిక పరిజ్ఞానం యిచ్చినందుకు చెల్లించవలసిన రాయల్టీలు, పాశ్చాత్య ఉద్యోగులకు, అధికారులకు యిచ్చిన జీతభత్యాలు మొదలైన వాటి కారణంగా నిరంతరాయంగా ఇంగ్లాండ్‌కు భారతదేశం చెల్లించవలసి వచ్చేది. అయితే భారత వనరులను దోచుకోవటానికి, వ్యాపారపరమైన దోపిడీకి వీలు అయిన ప్రాజెక్టులలోనే 97శాతం అంగ్లపెట్టుబడిదారులు పెట్టుబడి పెట్టారు.[30]

**దేశాన్ని అప్పులపాలు చేశారు :**

అంగ్లేయులు తెలివిగలవారు. పక్కా వ్యాపారస్థులు. వారి ప్రయోజనమే వారికి ముఖ్యం. భారతదేశంనుండి పక్కా ప్రణాళిక ప్రకారం వనరులను దోచుకున్నారు. కాని అంతటితో తృప్తిపడితే వారు అంగ్లేయులు కారు. కామధేనువువంటి దేశాన్ని వట్టిపోయేటట్లు చేసిన తర్వాతే వారు 1947లో దేశం విడిచివెళ్ళారు. అయినప్పటికీ భారతదేశంమీద తమ పట్టు పోకూడదన్న లక్ష్యంతో భారత ప్రభుత్వాన్ని ఒక పద్ధతి ప్రకారం ఋణగ్రస్తం చేశారు. అందుకు వారు అనుసరించిన పద్ధతి కేవలం తమ అధికారాన్ని దుర్వినియోగం చేసి, దేశానికి సంబంధంలేని వ్యయాన్ని దేశంమీద రుద్దారు. వారు చేసిన యుద్ధాలకు అయిన వ్యయాన్ని, కంపెనీ తన వాటాదార్లకు చేయవలసిన చెల్లింపులను, కిరీటానికి అధికారం బదిలీ అయినపుడు కంపెనీకి యిచ్చిన నష్టపరిహారాన్ని భారతదేశంమీద రుద్దారు. ఆ మొత్తం అంతా భారతదేశం తమకు చెల్లించవలసిన అప్పుగా పేర్కొన్నారు. ఆ అప్పుమీద వడ్డీని తీసుకున్నారు. అసలు, వడ్డీ మొత్తం పౌండ్లలోనే చెల్లించాలి. కాబట్టి విదేశీమారకద్రవ్యాన్ని దేశం సముపార్జించాలి. అంటే ముడిపదార్థాలు ఎగుమతి చేసుకోవటం తప్పనిసరి.

ఇంగ్లాండ్ చాలా వ్యూహాత్మకంగా చేసిన ఈ ఆర్థికకుట్రను అనేకమంది బయటపెట్టారు. వారిలో దాదాభాయి నౌరోజీని ప్రప్రథముడుగా చెప్పవచ్చు. 1858 నాటికి భారతదేశం 7 కోట్ల పౌండ్లు ఇంగ్లాండ్‌కు బకాయి పడ్డది. అంగ్లేయుల అనుసరించిన పద్ధతుల గురించి దాదాభాయినౌరోజీ మాటలలోనే తెలుసుకుందాం.

"ఈస్టిండియా కంపెనీ భారతదేశాన్ని జయించటానికి చేసిన యుద్ధాలపై పెట్టిన ఖర్చును భారతదేశం మీద రుద్దారు. ఈస్టిండియా కంపెనీ వాటాదార్లకు భారతదేశమే డివిడెండ్లు చెల్లించాలని, తీర్మానం చేసి, అందుకు అయ్యే వ్యయాన్ని సైతం దేశంమీద రుద్దారు. అంటే అంత మొత్తాన్ని భారతదేశానికి ఋణం యిచ్చినట్లు చూపారు. కంపెనీనుండి కిరీటానికి అధికారం బదిలీ అయినపుడు దాని వాటాదార్లకు చెల్లించిన నష్టపరిహారాన్ని ఋణ మొత్తానికి కలిపారు. 1857 విప్లవాన్ని అణచివేయటానికి పెట్టిన ఖర్చును అదనంగా చేర్చారు. ఆ విధంగా 1858 తర్వాత కూడా భారతదేశం తనను జయించినందుకు, బానిసత్వంలోకి నెట్టివేసినందుకు అయిన ఖర్చును కూడా ఒక విదేశీరాజ్యానికి చెల్లిస్తూనే ఉంది. ఈ భారం చాలదనుకొన్నారో ఏమో, 1878లో వారు చేసిన ఆఫ్ఘన్ యుద్ధవ్యయాన్ని, ఈజిప్టుతో చేసిన యుద్ధాలకు అయిన ఖర్చును, బర్మాపై చేసిన యుద్ధానికి అయిన ఖర్చును, 1890వ దశకంలో జరిగిన సరిహద్దు యుద్ధాలపై పెట్టిన ఖర్చును సైతం ప్రభుత్వ ఋణానికి కలిపారు. దానితో భారతప్రభుత్వం పెద్ద ఋణగ్రస్త దేశంగా మారిపోయింది. కంపెనీనుండి కిరీటానికి అధికారం బదిలీ అయిన తర్వాత కూడా ఇది కొనసాగింది".[31]

కంపెనీ చేయలేని పనిని కిరీటం (బ్రిటిషు రాజరిక ప్రభుత్వం) చేసింది. కంపెనీ చేసిన దుర్మార్గాలనుండి, దురాగతాలనుండి భారతదేశాన్ని రక్షించటానికి ప్రత్యక్షంగా అధికారం చేపట్టామని చెప్పుకొన్న ఇంగ్లాండ్ ప్రభుత్వ హయాంలో సైతం దోపిడీ కొనసాగింది. చట్టబద్ధ దోపిడీకీ ఇంగ్లాండ్ ప్రభుత్వం మార్గాలు వెదికి, నిరంతరాయంగా ఏదో ఒక పేరుతో, ఏదో ఒక పద్దుక్రింద భారతదేశ వనరులను యథేచ్ఛగా తరలించింది. భారతదేశపరిస్థితి పెనంమీదనుండి పొయ్యిలో పడినట్లయింది. ఈ కింది పట్టిక భారతదేశపు అప్పులభారం వలసపాలనా కాలంలో పెరిగిన తీరును విశదపరుస్తుంది.[32]

**భారతదేశపు అప్పు (మిలియన్ పౌండ్లలో)**

| సంవత్సరం | ప్రభుత్వ అప్పులు |
|---|---|
| 1857 | 70 |
| 1875 | 140 |
| 1900 | 226 |
| 1913 | 274 |
| 1939 | 884.2 |

(మిలియన్ అంటే పదిలక్షలు; పది మిలియన్లు ఒక కోటి)

ఇంగ్లాండుకు పౌండ్లు, స్టెర్లింగు (పౌండుకు సమానమైన నాణెం)ల రూపంలో చెల్లించవలసిన ఋణమే ఇందులో ఎక్కువశాతం. ఇంగ్లాండ్ చేసిన యుద్ధాలవ్యయం, రైల్వేలమీద, సాగునీటి ప్రాజెక్టులమీద, ఇతర ప్రజాపనులు మీద పెట్టిన ఖర్చునంతా పెట్టుబడిగా చూపించి దేశాన్ని ఋణగ్రస్తం చేసిన ఘనత వారికే చెందుతుంది.

**ఆంగ్లేయుల ఆర్థిక అరాచకాలను ఎండగట్టిన నౌరోజీ, జోషిలు :**

దాదాబాయి నౌరోజీ (1825-1917), జి.వి.జోషి (1851-1911) వంటి జాతీయవాదులు శిక్షణపొందిన ఆర్థికవేత్తలు కాకపోయినప్పటికి తమ విశ్లేషణా ప్రతిభతో ఆంగ్లేయుల ఆర్థిక అరాచకాలను ఎంతో ధైర్యంతో బయటపెట్టారు. అధికార పత్రాలు, అధికార గణాంకాల ఆధారంగా వారు చేసిన తిరుగులేని వాదన అనేకమంది ఆంగ్ల అధికారులను, రాజకీయనాయకులను, పార్లమెంటు సభ్యులను విస్మయ పరిచింది. వారి ప్రసంగాలతో, వ్యాసాలతో వాస్తవాలను ప్రపంచానికి తెలియచేసారు. వారికి జాతి ఎంతో ఋణపడింది.

ఎప్పుడయితే బ్రిటన్ అనుసరించిన ఆర్థిక విధానాల లక్ష్యాలు, వాటి ప్రభావం గురించి చర్చ మొదలయిందో, కొందరు బ్రిటిషు ఆర్థికవేత్తలు వనరుల తరలింపు సిద్ధాంతాన్ని పూర్వపక్షం చేయటానికి వక్రభాష్యాలు చెప్పటం మొదలుపెట్టారు. వారిలో జాన్ స్ట్రాచీ, థియోడర్ మోరిసన్ వంటివారు ముఖ్యులు. ఎల్.సి.ఏ.నోల్బ్స, జి.ఎఫ్.సిర్రాస్ వంటివారు వనరుల దోపిడీ ప్రక్రియకు కావలసిన సైద్ధాంతిక భావజాలాన్ని రూపకల్పన చేయటానికి పూనుకొన్నారు. అప్పటినుండి వాస్తవాలకు సిద్ధాంతాల ముసుగు కప్పటం ఆర్థికవేత్తలకు అలవాటు అయింది. అత్యంత ప్రతిభతో పరదేశపు వనరుల దోపిడీ ప్రక్రియకు వీలుకల్పించే విధానాల రూపకల్పనకు అవసరమైన సైద్ధాంతిక భూమికను యిస్తూనే ఉన్నారు. ఒకసారి దృష్టి వాస్తవాలనుండి సిద్ధాంతాలమీదకు మళ్ళిస్తే, వాస్తవాల ఆధారంగా విశ్లేషణ జరగదు. సైద్ధాంతిక చర్చలు, వాటి గణితశాస్త్ర అన్వయాలు పరిశోధనాంశాలు అవుతాయి. ప్రఖ్యాత ఆర్థికవేత్త శ్రీమతి జోన్ రాబిన్‌సన్ ఇదే విషయాన్ని మరింత సాంకేతికంగా వివరిస్తున్నారు.

"కొన్ని నియమాలు (Rules) ఉన్నాయి. వాటి ఆధారంగా కొన్ని ప్రమేయాలను (Propositions)ను చేసి ఆడుకోవటం మొదలుపెట్టుతారు. అది చాలా ఆసక్తికరమైన ఆట. అది గాలిలో ఆడేఆట. దానిలో విషయం (Content) ఉండదు. సంస్థలు కాని, ప్రభుత్వాలు కాని ఎదుర్కొనే రోజువారీ సమస్యలతో సంబంధమే ఉండదు".[33]

పై అభిప్రాయానికి రాబిన్‌సన్ మరొకటి కూడా జతచేసిఉంటే బాగుండేది. అటువంటి సిద్ధాంతాలకు అసలులక్ష్యం ప్రజలదృష్టిని మళ్ళించి, వారిని గందరగోళంలో పడవేయటమే.

దాదాబాయి నౌరోజీ వనరుల తరలింపు ప్రభావాన్ని చాలా స్పష్టంగా చూడగలిగాడు. ఆయన ఈ విధంగా ప్రకటించాడు. "దయలేని ఆర్థికసూత్రాల పని తీరు వలన ఈ పరిస్థితి ఉత్పన్నం కాలేదు. ఆలోచనలేని, దయలేని బ్రిటీషు విధానం వలననే ఈ పరిస్థితి దాపురించింది. భారతదేశపు సొత్తును దేశంలో బొక్కింది చాలక, నిర్దయగా ఇంగ్లాండ్‌కు తరలించటంవలననే దారుణమైన పరిస్థితులు ఏర్పడ్డాయి. సంక్షిప్తంగా చెప్పాలంటే అన్నిరకాల ఆర్థికసూత్రాలను ఉల్లంఘించి, నిర్దయగా దోచుకున్నందునే భారతదేశం వినాశనం అవుతున్నది".[34]

ఒక శతాబ్దం క్రిందటివారైన నౌరోజి, జోషీలు వంటివారు వనరులతరలింపు ప్రక్రియను చక్కటి ఆర్థికతర్కంతో విశ్లేషించారు. అందుకోసం వారెట్టి సిద్ధాంతాలను, ఫార్ములాలను ఆధారం చేసుకోలేదు. ప్రతిఏటా తరలిపోతున్నది సంపదకాదని, తరలిపోతున్నది మూలధనం (Capital) అని వారు సుస్పష్టంగా చెప్పగలగటం వారి ప్రతిభాపాటవాలకు నిదర్శనం. భారతదేశం తన మూలధనాన్ని కోల్పోతున్నదని నౌరోజీ చెప్పారు. మన ప్రస్తుత అనేకసమస్యలకు మూలం కూడా అదే. తగినంత మూలధనం మనదగ్గర లేనందువల్ల విదేశీ పెట్టుబడిదారులకు ఎర్రతివాచీ పరుస్తున్నాం. మన మూలధనాన్ని ఆంగ్లేయులు ఏనాడో దోచుకొనిపోవటంతో ఈ దుస్థితి ఏర్పడింది. స్థూలజాతీయోత్పత్తిలో కొంతశాతం ప్రతి ఏటా తరలిపోతుందని అనుకోకూడదని, తరలిపోతున్నది మన దేశపు వార్షిక నికర మిగులు సామర్థ్యం (Proportion of the annual net potential surplus or savings) అని జోషీ చెప్పారు. ఆయన మాటలలో "తరలిపోతున్న దానికి కొలమానం స్థూలజాతీయోత్పత్తిలో ఎంతో కొంత శాతం కాదు. ప్రస్తుతం అది 6 శాతంగా ఉంది. మన ప్రజలు బ్రతికి బట్టకట్టటానికి కావలసిన ఖర్చులు పోగా మిగిలిన వార్షిక నికర ఆదాయం తరలిపోతున్నది. మన వార్షిక నికర జాతీయ ఆదాయంలో 3వ వంతు భారతదేశంనుండి ఇంగ్లండ్‌కు చెల్లింపుల నిమిత్తం (Liabilities) బదిలీ అవుతున్నది. ఈ ప్రక్రియలో మనకు ఇంగ్లండ్‌నుండి ఎట్టి రాబడి రానందున, మన దేశానికి ఇది తీవ్ర నష్టదాయకం, అందువలననే మూలధనం మనం ఎక్కువగా కూడబెట్టు కోలేకపోతున్నాం. మూలధనం అతితక్కువ స్థాయిలో సంచయనం

అవటానికి దేశంనుండి ఇంగ్లండ్‌కు వెళ్తున్న తరలింపులకు బదులుగా దేశానికి ఎటువంటి ఆర్థిక ప్రయోజనం సిద్ధించకపోవటమే కారణం".[35]

ప్రభుత్వం దేశీయంగా సేకరిస్తున్న ఋణాలవలన కూడా దేశపు మూలధన వనరులపై (Capital Resources) భారం పడుతుందని ఆయన విశ్లేషించారు. సేకరించిన ఋణాలను అనుత్పాదకంగా వినియోగిస్తున్నందున మూలధన వనరులు తరిగిపోతున్నట్లేనని ఆయన అభిప్రాయపడ్డారు. నిధుల తరలింపువలన ప్రస్తుత పొదుపురేటు స్థాయి తగ్గటమే కాక, వారసత్వంగా మన దగ్గర ఉన్న జాతీయ మూలధనం నిల్వలు సైతం తగ్గిపోతాయని నౌరోజీ హెచ్చరించారు.

1895లో బ్రిటిషుప్రభుత్వం నియమించిన రాయల్ కమిషన్‌కు వెల్బీ (Welby) అధ్యక్షత వహించారు. నిధుల తరలింపువలన కలిగే దుష్ఫలితాలగురించి దాదాభాయి నౌరోజీ ఆయనకు వివరించే ప్రయత్నం చేశారు. కాని నౌరోజీ ప్రయత్నం సఫలం కాలేదు.. ఎందుకంటే నౌరోజీ తర్కం అర్థం చేసుకోవటానికి 1930వ దశకంవరకు పాశ్చాత్యులు ఎదురుచూడక తప్పలేదు. 1936లో ఆర్థికవేత్త కీన్సు తన 'జనరల్ థీరీ' పుస్తకం ప్రచురించేవరకు నౌరోజీప్రతిపాదిత ఆర్థికతర్కం వారికి అర్థం కాలేదు. లేదా ఆయన ఆర్థికతర్కం, హేతుబద్ధత వారికి అర్థం కానట్లు నటించారు.

తన మూలధనాన్ని పోగొట్టుకొన్న ఏ దేశమూ అభివృద్ధి చెందలేదు. భారతదేశమే అందుకు పెద్ద ఉదాహరణ. ఆంగ్లేయుల వనరుల దోపిడీ కారణంగానే భారతదేశం అభివృద్ధికి నోచుకోలేదు. ఒకప్పుడు ఇంగ్లాండ్‌కంటే అన్నింటా మిన్నగా ఉన్న భారతదేశము వెనుకబాటుతనంలోకి నెట్టివేయబడటం, ఇంగ్లాండ్ అభివృద్ధి పథంలోకి దూసుకొనిపోవటం యాదృచ్ఛికం కాదు. రెండింటిమధ్య కార్యకారణ సంబంధమే ఉంది. వలసపాలన కాలంలో నిరంతరాయంగా కొనసాగిన మూలధనం దోపిడీవలననే భారతదేశం అభివృద్ధికి నోచుకోకపోగా, మరోవైపు ఇంగ్లాండ్ అగ్రరాజ్యంగా ఎదిగింది. గతానికి, వర్తమానానికిమధ్య ఉన్న సంబంధం అదే. ఈ సందర్భంగా దాదాభాయి నౌరోజీ చేసిన వ్యంగ్యవాఖ్యానాన్ని గుర్తుకుతెచ్చుకోవాలి. ఆంగ్లేయులు దేశపు మూలధనాన్ని రెండుచేతులా ఊడ్చుకొనిపోతూ, భారతదేశం ఎందుకు పారిశ్రామికంగా అభివృద్ధి చెందటం లేదని ఆశ్చర్యం ప్రకటిస్తుంటారని ఆయన ఒకసారి అన్నారు. నౌరోజీ, జోషి వంటి వారు ఎంతో శ్రమించి, ఆంగ్లేయుల దోపిడీకి సాక్ష్యాధారాలు సేకరించి, ప్రపంచంముందు పెట్టారు. వారు లేవనెత్తిన అంశాలపై చర్చజరగకుండా చేసేందుకు, వారి వాదనను పూర్వపక్షం చేసేందుకు

ఆంగ్లమేధావులు అనేక యితరకారణాలను వెదికిపట్టుకొని, వాటి మూలంగానే భారతదేశం అభివృద్ధికి నోచుకోలేదని సిద్ధాంతీకరించటం వారి దోపిడీని మరుగుపర్చే యత్నంతప్ప మరేమీకాదు.

అమ్మినధర కొన్నధర కంటే ఎక్కువగా ఉంటే లాభం వస్తుంది. ఇది ఒక దేశపు ఎగుమతులకు, దిగుమతులకు కూడా వర్తిస్తుంది. తమ ఎగుమతుల విలువ దిగుమతుల విలువకంటే ఎక్కువగా ఉండాలని ప్రతిదేశమూ కోరుకుంటుంది. ఆ దిశగా ప్రయత్నం చేస్తుంది కూడా. వలసపాలనా కాలంలో భారతదేశానికి అట్టి ప్రయత్నంచేసే అవకాశాన్ని లేకుండా చేసారు. వలసపాలనా కాలంలో వనరులు తరలించారు. ఉత్పత్తులు తరలివెళ్ళాయి. ఎగుమతులకు ఎక్కువసార్లు చెల్లింపులే జరగలేదు. ఎగుమతుల విలువకు, దిగుమతుల విలువకుమధ్య వ్యత్యాసం కొట్టవచ్చినట్లు కన్పడేది. దానితో దేశపు విదేశీ వాణిజ్యధరల నిష్పత్తి సూచి (Terms of Trade) దేశానికి ప్రతికూలంగా మారింది. పరిమాణంలో ఇంగ్లండ్‌కు చేసిన ఎగుమతులు ఆ దేశంనుండి చేసుకున్న దిగుమతుల కంటే ఎక్కువగా ఉండేవి. ఎగుమతుల స్వభావంలో చెప్పుకోదగ్గ మార్పులు లేకుండా ముడిపదార్థాల ఎగుమతులే ప్రధానంగా ఉండేవి. ఎగుమతులు చేయక తప్పని పరిస్థితులలోకి దేశం నెట్టివేయబడినందున, ఇంగ్లాండ్‌తోపాటు ఇతరదేశాలకు చేసిన ఎగుమతుల ధరలనుకూడా తగ్గించవలసి వచ్చేది. దానితో భారతదేశం ఇతరదేశాలతో సరిసమానమైనస్థాయిలో వాణిజ్యం చేయలేకపోయింది. దానితో దేశం తీవ్రంగా నష్టపోయింది.

**'ఎగుమతుల మిగులు' అనే భ్రమను ఎరగా చూపిస్తున్నారు :**

ఆర్థికవేత్తలు పాశ్చాత్య దేశాలను మూలధనాన్ని ఎగుమతిచేసే దేశాలుగానూ, వాటి పూర్వపు వలస రాజ్యాలను మూలధనాన్ని దిగుమతి (Capital importing) చేసుకొనే దేశాలుగాను పేర్కొంటారు. పాశ్చాత్యదేశాలు మూలధనాన్ని ఎందుకు ఎగుమతి చేయగల్గుతున్నాయో చెప్పరు. తమ పూర్వపు వలసదేశాలనుండి దోచుకున్న సొత్తు, వనరులతోనే అవి మూలధనాన్ని ఎగుమతి చేయగల్గుతున్నాయన్నది నిర్వివాదాంశం. అభివృద్ధికి మూలధనం అవసరం కాబట్టి, దాన్ని దిగుమతి చేసుకొని, తద్వారా అభివృద్ధి సాధించి, ఎగుమతులు చేసి, వచ్చిన ఆదాయంతో తీసుకొన్న ఋణాలు తీర్చవచ్చునని పెట్టుబడిదారీ దేశాలు చెప్తుంటాయి. కాని ఎలుకను బోనులో పెట్టటానికి ఎరను ఎలా పెడతామో, 'ఎగుమతుల మిగులు' (Export Surplus)

అనే పదంకూడా అలాంటిదే. ఎందుకంటే పూర్వపు వలసదేశాలు ఎన్నటికీ తమ ఋణాన్ని తీర్చలేవు. వాటి బంగారాన్ని, వెండిని ఏనాడో దోచుకొని వెళ్ళారు. ఇక ఎగుమతులు చేసి ఆర్జించి అప్పు తీర్చాలి. ఏ వస్తు సేవలు ఎగుమతి చేయాలో నిర్ణయించే స్వేచ్ఛ విదేశీ ఋణాలను తీసుకొన్న దేశాలకు ఉండదు. ఆ ఋణాలు యిచ్చిన దేశాల అవసరాలు, యిష్టాయిష్టాలకు అనుగుణంగానే ఎగుమతులు చేయాలి. **19వ శతాబ్దిలో మొదలైన ఈ వాణిజ్యసరళి ఇంకా కొనసాగుతునే ఉంది. పాశ్చాత్యదేశాలు, వారి కనుసన్నలలో పనిచేసే అంతర్జాతీయ ఫైనాన్సు సంస్థలు చేసే విశ్లేషణలు, ప్రతిపాదించే సిద్ధాంతాలు, చూపించే పరిష్కారాలు వలసదేశాలను తమ గుప్పెట్లోనుండి జారిపోకుండా ఉండేందుకు చేస్తున్న కుట్రలో భాగం. సామ్రాజ్యవాదం మరొక రూపంలో కొనసాగుతున్నది. దీనితో తృతీయప్రపంచ దేశాలు ఋణభారంతో క్రుంగిపోతున్నాయి. వలసపాలన పర్యవసానమే కొనసాగుతున్న ఈ దుస్థితికి కారణం.**

## నల్లమందు వ్యాపారం :

ఆంగ్లేయులకు వారి వ్యాపార ప్రయోజనాలే అన్నిటి కంటెమిన్న. వారు చేసిన నల్లమందు యుద్ధాలే అందుకు సాక్ష్యం. చైనా ప్రజలను నల్లమందుకు అలవాటు చేసి, వారికి నల్లమందు సరఫరా చేయటంద్వారా లాభాలు అర్జించటానికే తపనతో చైనాపై యుద్ధానికి దిగారు. భారతదేశంలో ఇది మరొకరూపంలో ఉన్న దోపిడీగా పరిణమించింది. గంజాయి సాగును ఈస్టిండియా కంపెనీ ప్రజల అభీష్టానికి వ్యతిరేకంగా వారిమీద రుద్దింది. 1838లో చెప్పిన ఈ వివరాలు గమనించండి.

"కంపెనీ అధీనంలో ఉన్న అన్ని ప్రాంతాలలోనూ గంజాయి సాగును రైతులు తప్పక చేపట్టాలి. గంజాయి పండించటం, దానినుండి నల్లమందు తయారుచేయటం, దాన్ని రవాణా చేయటంపై కంపెనీదే గుత్తాధిపత్యం. రైతులకు ఏజెంట్లద్వారా బయానాలు ఇచ్చేవారు. ఏ రైతు అయినా గంజాయి సాగుకు ముందుకు రాకపోతే, వాళ్ళింట్లోకి కొన్ని రూపాయినాణేలు విసిరేసి, దొంగతనం నేరారోపణ చేసి, బెదిరించేవారు. రైతు ఇల్లు విడిచివెళ్ళి పారిపోవటానికి ప్రయత్నంచేస్తే, అతన్ని బంధించి, అతని జేబులోకి బయానామొత్తాన్ని పెట్టి, అతనిని ఇంట్లోకి త్రోసేవాళు కంపెనీ దృష్టిలో అతను గంజాయి సాగుకు ఒప్పుకొన్నట్లే. వేరేదారి లేక, రైతు తనమీద రుద్దబడిన ఒప్పందంమేరకు గంజాయి సాగుచేయక తప్పేదికాదు. అనేక జిల్లాల్లో రైతులు ఆహారధాన్యాలకుబదులు గంజాయి సాగుచేయవలసి వచ్చింది.

పాట్నా, వారణాసి ప్రాంతాలలో రైతులు గంజాయిసాగుకు తమ సాగుభూమిలో కొంతశాతాన్ని కేటాయించక తప్పని పరిస్థితులను కంపెనీ సృష్టించింది".

చైనా నల్లమందు వ్యాపారాన్ని నిషేధించిన తర్వాతకూడా గంజాయిసాగు కొనసాగింది. నల్లమందు సాగువల్ల ఏర్పడ్డ భయానక పరిస్థితులను ప్రజలు భయాందోళనలు తారాస్థాయికి చేరటంతో 1895లో ఒక రాయల్ కమిషన్‌ను నియమించారు. కాని కమిషన్ రైతుల బాధలను పట్టించుకోలేదు. నల్లమందు సేవనం అలవాటు పెరగటంవలన సామాజిక జీవనంలో వస్తున్న పరిస్థితులను పరిగణనలోకి తీసుకోలేదు. 1930లో డ్యూరాంట్ 7000 నల్లమందు దుకాణాలు ఉన్నాయని, ప్రతి నల్లమందు దుకాణాన్ని ప్రభుత్వమే నడుపుతున్నదని, సామాజిక కార్యకర్తల నిరసనలమధ్యే నల్లమందు అమ్మకాలు నిరాఘాటంగా కొనసాగుతున్నాయని వ్రాశాడు. 4 లక్షల హెక్టార్ల (10 లక్షల ఎకరాల) సారవంతమైన సాగుభూమిని నల్లమందు సాగుకు బలవంతంగా కేటాయించారని వ్రాసాడు. ఆహారధాన్యాలకు బదులుగా గంజాయి సాగు చేయటంవలన ఆకలితో నకనకలాడుతున్న లక్షలాది భారతీయులకు తగినంతగా తిండిగింజలు లభ్యంకాలేదు.

1921లో కేంద్ర శాసనసభ నల్లమందు సాగును, అమ్మకాన్ని నిషేధిస్తూ ఒక తీర్మానం చేసింది. ప్రభుత్వానికి వస్తున్న ఆదాయంలో 9వ వంతు నల్లమందు అమ్మకాల ద్వారానే వస్తున్నది. అస్సామ్‌లో మహాత్మాగాంధీ నల్లమందు అలవాటును మాన్పించటానికి ఉద్యమం చేపట్టాడు. దాని ఫలితంగా నల్లమందు వినిమయం సగానికి సగం అస్సాంలో పడిపోయింది. బ్రిటీషు ప్రభుత్వం ఆయనను, సత్యాగ్రహులను జైలులో పెట్టింది.

నల్లమందు ఒక మాదకద్రవ్యం కనుక, దాని వాడకం నిలిపివేయాలని, గంజాయిసాగును నిషేధించాలని అనేక ప్రపంచ సదస్సులు డిమాండ్ చేసాయి. కాని బ్రిటన్ అందుకు అంగీకరించలేదు. ప్రపంచ ఆగ్రహాన్ని అది లెక్కచేయలేదు. కంటితుడుపుచర్యగా నల్లమందు ఎగుమతులను ఏటా 10 శాతం కుదిస్తామని ప్రకటించారు తప్ప, భారతదేశంలో దాని ఉత్పత్తినిగాని, అమ్మకాలనుగాని, తగ్గించటానికికాని, వాటిపై ఆంక్షలు విధించటానికిగాని, ఏమాత్రమూ ఆంగ్లప్రభువులు అంగీకరించలేదు. ఒక కమిషన్‌ను పొదుపుచర్యలను సూచించవలసిందిగా నియమించారు. నల్లమందు అమ్మకాలు ప్రభుత్వానికి ప్రధాన ఆదాయవనరులలో ఒకటి కనుక, దాని వ్యాపారాన్ని పరిరక్షించవలసిన బాధ్యత ప్రభుత్వంమీద

ఉందని. కనుక ఎట్టి పరిస్థితులలోనూ నల్లమందు ఉత్పత్తి, అమ్మకాలకు యిస్తున్న ప్రోత్సాహకాలను తగ్గించకుండా, భద్రతను కొనసాగించవలసిందిగా ఆ కమిషన్ సిఫారసు చేసింది.

ఆంగ్లేయుల నల్లమందు విధానాన్ని భారతీయులు తీవ్రంగా వ్యతిరేకించారు. ప్రతి జాతీయవాది నిరసన తెలియచేసాడు. భారతదేశానికి వచ్చిన విదేశీప్రతినిధుల బృందాలు అనేకం నల్లమందువాడకం వ్యాప్తికి ప్రభుత్వం ఇస్తున్న ప్రోత్సాహం చూసి ఆశ్చర్యం ప్రకటించాయి. తమ ఆదాయంకోసం ప్రమాదకరమైన మాదకద్రవ్యమైన నల్లమందును బలవంతంగా ఉత్పత్తి చేయించటాన్ని, ప్రభుత్వమే దుకాణాలు పెట్టి అమ్మడాన్ని విల్ డ్యూరాంట్ వంటి విదేశీ చరిత్రకారులు, పరిశీలకులు తీవ్రాతితీవ్రమైన పదజాలంతో వలసపాలకులను విమర్శించారు. చిత్రమేమిటంటే మెకాలేసైతం నల్లమందుకు వ్యతిరేకంగా మాట్లాడాడు. 1833లో ఇంగ్లండ్ పార్లమెంట్ దిగువసభలో మాట్లాడుతూ ఆయన ఇలా అన్నాడు. "తమచేత ప్రతిరోజూ నల్లమందు ఉత్పత్తులను సేవింపచేసి, దాని ప్రభావంతో కొన్ని నెలలలోపే శారీరక, మానసిక జవసత్వాలను కోల్పోయి, ఏ పనీ చేయలేని నిస్సహాయస్థితిలోకి నెట్టివేయబడుతున్న భారత కౌలు రైతాంగం దౌర్భాగ్యస్థితికి కారణమైన పాలకుల శక్తిసామర్థ్యాలు, అధికారబలం వారిని భయభ్రాంతులకు గురిచేస్తున్నాయి. నేరుగా హత్యకు పాల్పడటంకంటే ఘోరమైన, ఆ అసహ్యాకరమైన కళాకృతి (Detestable artifice)ని అందిస్తున్నవారు అందుకు తగినవారే. ఇది ఇంగ్లీషు జాతికి ఏమాత్రమూ శోభనిచ్చేదికాదు. ఆదర్శనీయమైనది కాబోదు. ఒక దేశపు గొప్ప ప్రజకు నల్లమందు అలవాటు చేసి సామూహికంగా వారిని మైకంలోకి నెట్టి, 'శక్తిహీనులను' (Paralyse) చేయటానికి మనం ఎన్నడూ అనుమతిని ఇవ్వకూడదు".[36] అయితే మెకాలే మాట్లాడి 100 సంవత్సరాలు గడిచిన తర్వాతకూడా ఆయన చెప్పినదానికి విరుద్ధంగానే వలసపాలకులు నడిచారు. నల్లమందు ఉత్పత్తి, అమ్మకాలు వలసపాలకులు అవిచ్ఛిన్నంగా కొనసాగించారు.

**ఆంగ్ల సామ్రాజ్యవాదుల ఆకాంక్షలు :**

ఆంగ్ల సామ్రాజ్యవాదుల ఆకాంక్షలను అంచనా వేయటంలో కార్ల్‌మార్క్స్ సైతం పొరపాటు పడ్డాడు. ఆయన ఏమంటున్నారో చూడండి. "భారతీయ సమాజానికి అసలు చరిత్ర లేదు. కనీసం ఇతరులకు తెలిసిన చరిత్ర అసలు లేనేలేదు. మనం దాని చరిత్రగా పిలుస్తున్నది–ఒకరితర్వాత మరొకరు వరుసగా బయటనుండి

దురాక్రమణలు చేసి, వారిని నిలువరించటానికి పూనుకోని, సబ్దిత ఆవరించిన ఒక జడసమాజాన్ని జయించి రాజ్యాలు ఏర్పాటుచేసినవారి చరిత్రే. ఆంగ్లేయులకు ఆ దేశాన్ని జయించే హక్కు ఉన్నదా లేదా అన్నది అంత ముఖ్యమైన ప్రశ్న కాదు. వెనుకబడ్డ తురుష్కులు, పర్షియన్లు, రష్యన్లు కంటె ఆంగ్లేయులు ఆ దేశాన్ని గెలుచుకోవటాన్ని మనం కోరుకోవాలా, వద్దా అన్నదే ముఖ్యమైన ప్రశ్న. ఇంగ్లండ్ భారతదేశంలో రెండు మహత్తర కార్యక్రమాలు నిర్వహించాలి. ఒకటి విధ్వంసకరమైనది. వినాశానికి సిద్ధంగా ఉన్న ఒక ఆసియా సమాజం అదృశ్యంకావటాన్ని వేగవంతం చెయ్యటం, రెండవది ఆసియాలో ఒక పాశ్చాత్య సమాజస్థాపనకు పునాదులు వెయ్యటం."[37] అయితే మార్క్స్ అంచనా వేసినట్లుగా ఆంగ్లేయులు ఒక నవ్యసమాజానికి పునాదులు వేయలేదు. ఉన్న సమాజాన్ని విచ్ఛిన్నం చేశారు.

ప్రముఖ చరిత్రకారులు జో విల్సన్ సామ్రాజ్యవాదుల ఆకాంక్షలగురించి విశ్లేషిస్తూ ఆంగ్ల సామ్రాజ్యవాదులు తమకు ఉన్నాయని బయటకు చెప్తున్న లక్ష్యాలు ఏవీ వారికి లేవని, వారికి ఉన్న దల్లా స్వలాభాకాంక్షలు మాత్రమేనని, సుస్థిరంగా భారతదేశాన్ని వీలయినంతకాలం తమ ఏలుబడిలో ఉంచుకొని, దాన్ని కొల్లగొట్టటమే ధ్యేయంతప్ప వారికెట్టి సదుద్దేశ్యంలేదని తేల్చిచెప్పాడు. కనుకనే వారు భారత దేశానికి ఎట్టి మంచీ చేయలేదు.[38] అని నిర్ధారించాడు.

రెండు శతాబ్దాల వలసపాలన అనంతరం దేశంలో నెలకొన్న దుర్భర పరిస్థితులను భారతీయులు ఎప్పటికీ మర్చిపోరు. ఒకప్పుడు ప్రపంచంలోనే అత్యంత ధనికదేశం భారతదేశం. పారిశ్రామికంగా అత్యంత అభివృద్ధి సాధించిన దేశంకూడా భారతదేశమే. చైనా, భారత్‌ల సంయుక్త వాటా 1750లో ఆనాటి ప్రపంచ పారిశ్రామిక ఉత్పత్తిలో 75 శాతం. ఒకప్పటి సుసంపన్న దేశం వలసపాలనానంతరం 1947 నాటికి బాగా దిగజారిపోయింది. అత్యంత పేదదేశంగా, వెనుకబడి ఉన్న దేశంగా దిగజారింది. ఎంతలో ఎంతమార్పు? ఒక సుసంపన్న దేశాన్ని ఈ స్థితికి దిగజార్చింది వలసపాలన కాక మరేమిటి?

1600 సంవత్సరంలో ఈస్టిండియా కంపెనీని నెలకొల్పినప్పుడు, ప్రపంచపు స్థూలఉత్పత్తిలో కేవలం 1.8 శాతం మాత్రమే ఇంగ్లండ్ వాటా. అప్పుడు భారతదేశపు వాటా 23 శాతం. ఆ తర్వాత కాలంలో ఇంగ్లండ్ వాటా అనుకొంద పెరిగినట్లుగా పెరిగింది. 1940లో ప్రపంచ స్థూలఉత్పత్తిలో ఇంగ్లండ్ వాటా 10 శాతానికి

పెరిగింది. భారతదేశపు వాటా క్షీణించి, తృతీయ ప్రపంచదేశాల జాబితాలో చేరింది. పేదరికానికి, కఱవు కాటకాలకు, అసమానతలకు ప్రపంచపు చిరునామా అయింది.[39]

1757-1900 మధ్య బ్రిటన్ తలసరి నికర ఉత్పత్తి 347 శాతం పెరిగింది. అదేకాలంలో భారతదేశపు నికర ఉత్పత్తి కేవలం 14 శాతమే పెరిగింది. భారతదేశపు వనరులను యథేచ్ఛగా కొల్లగొట్టటమే బ్రిటన్ ఆశ్చర్యకరమైన పెరుగుదల శాతానికి కారణమని వేరే చెప్పనవసరం లేదు కదా! అయితే ఆ అంకెలు కూడా భారతదేశపు దుస్థితిని పూర్తిగా తెలియచేయటంలో విఫలం అవుతున్నాయి. 1900 నుండి 1947 వరకు భారతదేశపు వృద్ధిరేటు ఒకశాతం కంటె తక్కువ. జనాభా పెరుగుదలరేటు 3.5 శాతం. నవజాతశిశువుల, పిల్లల మరణాలు ఎక్కువగా ఉండేవి. దానితో జనాభా నికర పెరుగుదల రేటు, ఆర్థికవృద్ధిరేటుతో సమానమైంది. నికర ఆర్థికవృద్ధిరేటు శూన్యానికి (0 కు) అటు, ఇటుగా ఉండేది.

స్వాతంత్ర్యం వచ్చినతర్వాతే భారతదేశ ఆర్థికవృద్ధి పుంజుకొంది. 1900-1950 మధ్య భారతదేశ నికర తలసరి ఆదాయం పెరగలేదు. (ఆర్థికవృద్ధిరేటు, నికర జనాభా పెరుగుదలరేటు రెండూ 0.8 శాతం). 1950 నుండి 1980 మధ్య భారతదేశపు తలసరి నికర ఆదాయపు వృద్ధిరేటు 1.3 శాతం అయింది (ఆర్థికవృద్ధిరేటు 3.5 శాతం, నికరజనాభా పెరుగుదలరేటు 2.2 శాతం). 1981-90 మధ్య 4.4 శాతం అవగా, ఆ తర్వాత దశాబ్దాలలో 7.8 శాతం రేటు చొప్పున ఆర్థికవృద్ధి నమోదు అయింది. ఆంగ్లేయులు దేశాన్ని వదిలివెళ్ళిన ఏడు దశాబ్దాలలోనే అనేక రంగాలలో ప్రగతి సాధించింది దేశం. ఆంగ్లేయులు వెళ్ళిననాటికి నూటికి 16 మందికే చదువనూ, వ్రాయనూవచ్చు. సగటు ఆయుఃప్రమాణం 27 సంవత్సరాలు మాత్రమే (Life Expectancy). 90 శాతంమంది పేదరికంలో ఉన్నారు. ఈనాడు అక్షరాస్యతా రేటు 78 శాతం. 28 కోట్లమంది పేదరికపు స్థాయినుండి బయటకు వచ్చారు. సగటు ఆయుఃప్రమాణం 70 సంవత్సరాలకు ఎగబ్రాకింది.

విద్యుచ్ఛక్తి దేశానికి ఆంగ్లేయులు పెట్టిన భిక్షగా కొందరు భావిస్తుంటారు. ప్రపంచదేశాల వాడుకలోకి విద్యుత్తు 1890వ దశకంలో వచ్చింది. మొత్తం బ్రిటన్, అమెరికా, పాశ్చాత్యదేశాలు పూర్తిగా విద్యుదీకరణను సాధించటానికి ఎంతోకాలం పట్టలేదు. 1920వ దశకం ముగిసేనాటికి ఆ దేశాలు తమ గ్రామాలను, పట్టణాలను, నగరాలను పూర్తిగా విద్యుదీకరణ చెయ్యగలిగాయి. ఆంగ్లేయులు భారతదేశపు 6,40,000 గ్రామాలకు గాను కేవలం 1500 గ్రామాలకు మాత్రమే

విద్యుత్తును సరఫరా చేసారు. అందుకుగాను (1927-47) వారికి 20 సంవత్సరాలు పట్టింది. 1947 నుండి 1991 వరకు ఏభైసంవత్సరాలలో అంతకు 320 రెట్లు గ్రామాలకు భారత ప్రభుత్వం విద్యుత్తును సరఫరా చేసింది.

భారతప్రజల అభివృద్ధిపట్ల తెల్లదొరలకు శ్రద్ధలేదు. భారతదేశాన్ని వారు కేవలం వనరులను దోచుకొనేందుకు అనువైన కాలనీ (Extractive colony) గానే చూశారు. దానితో వారి పాలనాకాలంలో భారతదేశం ఏరంగంలోనూ అభివృద్ధి సాధించలేదు. ఐరోపాలో జరిగినట్లుగా సమగ్ర అభివృద్ధికి కావలసిన పునాదులు పడలేదు. శాస్త్రీయ, సాంకేతిక, పారిశ్రామిక, పౌరవ్యవస్థలు అభివృద్ధి మాట అటుంచి, ఉన్నవాటిని సైతం చిన్నాభిన్నంచేశారు. 16 నుండి 18 శతాబ్దాల మధ్య పాశ్చాత్యదేశాలలో ఆర్థిక, సాంకేతిక, శాస్త్రీయ, మేధోపరమైన వికాసానికి గట్టి కృషి జరిగింది. అదేకాలంలో భారతదేశం విదేశీ ముస్లిం పదఘట్టనల క్రింద నలిగిపోయింది. ఆ తర్వాత నెలకొన్న ఆంగ్లేయులవలస పాలన అస్తవ్యస్తంగా ఉన్న దేశాన్ని మరింత దుస్థితిలోకి నెట్టివేసింది.

ఆంగ్లసామ్రాజ్యవాదులు తమ ఏలుబడిక్రిందకు వచ్చిన దేశాలను అభివృద్ధి చేయటానికి బదులు, వాటిని పేదరికంలోకి నెట్టివేసారు. చరిత్రకారుడు జో విల్సన్ ఏమంటున్నాడో చూడండి "తాము పాలిస్తున్న దేశాలను అభివృద్ధి చేయటానికి మారుగా, ఆంగ్లేయులు తమకు వత్తాసుపలికేందుకు సిద్ధంగా ఉన్న స్థానిక ఉన్నత వర్గాలతో చేతులు కలిపారు..... ఉదాహరణకు బీహార్ భూసామ్యవర్గం ఆంగ్లేయుల భూవిధానంద్వారా సృష్టించబడ్డదే".[40]

భారతదేశానికి పాశ్చాత్య ప్రపంచం ఆధునికతను కానుకగా యిచ్చిందని చెప్తుంటారు. ఆంగ్లేయులు అడుగుపెట్టిన భారతావని ధనధాన్యాలతో, వర్తక వాణిజ్యాలతో తులతూగుతున్న సుసంపన్నమైన దేశం. ఆ కారణంవలననే ఈస్టిండియా కంపెనీ భారతదేశంతో వాణిజ్యంకోసం తహతహలాడింది. వాస్కో డిగామా భారతదేశాన్ని సందర్శించి తన స్వదేశంవెళ్ళి పోర్చుగల్ రాజైన 1వ ఇమాన్యుల్‌ను కలసి, గుక్క తిప్పుకోకుండా మలబారుతీరంలో తాను చూసిన పెద్ద నగరాలను, నదులను, సిరి సంపదలతో దేశానికి లోటు లేకుండా జీవనం సాగిస్తున్న ప్రజానీకంగురించి చెప్పాడు. సుగంధద్రవ్యాలు, ఆభరణాలు, వజ్రాలు, రత్నాలు,

బంగారు గనులగురించి ఎంతో మెచ్చుకుంటూ వర్ణించాడు. వాస్కో డి గామా తెచ్చిన కానుకలు భారతదేశంలో ఎందుకు కొరగాకుండా పొయ్యాయి.[41]

వలసపాలనకుముందు భారతదేశం ధనధాన్యాలతో తులతూగింది. నాణ్యమైన తయారీ ఉత్పత్తులను ప్రపంచానికి ఎగుమతి చేసింది. ఆంగ్లేయులలో ఉన్నత వర్గాలు భారతదేశపు లినెన్, సిల్కు (పట్టు), నూలు వస్త్రాలు ధరించేవారు. వారి ఇళ్ళలోనూ, అలంకరణకు వాటినే వాడేవారు. భారతదేశపు సుగంధ ద్రవ్యాలంటే వారు పడిచచ్చేవారు. 17వ శతాబ్దంలో బ్రిటీషు ఉత్పత్తులను భారతదేశపు ఉత్పత్తులని చెప్పి అమ్మేవారు. ఎందుకంటె వారి ముతకఉత్పత్తులకు డిమాండ్ ఉండేదికాదు. విదేశాలనుండి వచ్చిన సరుకుపట్ల మోజుఉండటం సహజం కనుక భారతదేశం నాణ్యమైన, నాజూకయిన, మన్నికయిన ఉత్పత్తులకు పేరుగాంచింది కనుక, భారతదేశపు ఉత్పత్తుల పేరుతో అమ్ముకొనేవారు. మొగలాయి చక్రవర్తి ఔరంగజేబు వార్షిక ఆదాయం ఆయన సమకాలీనుడైన ఫ్రెంచి చక్రవర్తి లూయి 14 ఆదాయానికి కంటె 10 రెట్లు ఎక్కువగా ఉండేది.[42]

భారతదేశంలో అభివృద్ధి చెందిన బ్యాంకింగ్ వ్యవస్థ ఉండేది. వర్తకవ్యాపారాలకు, విదేశీ వాణిజ్యానికి అవసరమైన నిధులు సకాలంలో అందచేయటానికి ఏజెంట్లు, బ్రోకర్లు, మధ్యవర్తులతో కూడి పెద్ద నెట్‌వర్క్ ఉండేది. జగత్‌సేఠ్‌లు, చెట్టియార్లు, గుజరాత్ బనియాలు ఎగుమతుల వ్యాపారానికి, ఇతర వ్యాపార కలాపాలకు కావలసిన నిధులను ఎంతో నైపుణ్యంతో ఋణాలుగా యిస్తుండేవారు. బ్యాంకు ఆఫ్ ఇంగ్లాండ్ కంటె సమానమైన నెట్‌వర్క్, నిధులు, ఆనాటికి భారతదేశంలో ఉన్నాయి[43].

ఆంగ్లేయులు బానిసత్వంలోకి నెట్టివేసింది ఏదోమారుమూలన ఉన్న చిన్నా చితక దేశాన్ని కాదు. సాదాసీదా సమాజాన్ని కాదు. ఎంతో వైభవోపేతమైన దేశాన్ని వారు రెండువందల సంవత్సరాల పాలనలో చిదిమివేశారు. కొల్లగొట్టారు. పేదరికంలోకి నెట్టివేశారు. 100 నుండి 150 మంది మిలియన్ల (10 నుండి 15 కోట్ల) ప్రజలకు ఏలోటూ లేకుండా అన్న పానీయాలను అందిస్తున్న పెద్ద వ్యవసాయరంగం దానికి ఉంది. నాణ్యమైన ఉత్పత్తులను ఎగుమతి చేయగల సత్తా ఉన్న తయారీరంగం భారతదేశానికి ఉంది. నైపుణ్యానికి, పనితనానికి, క్రమశిక్షణకు పేరుగాంచిన శ్రామికవర్గం ఉంది. వీటన్నింటినీ ఆంగ్లేయులు ధ్వంసం చేశారు.

భారతదేశపు రూపురేఖలనే సమూలంగా మార్చివేశారు. ఆర్థికంగానే కాక సాంస్కృతికంగానూ భారతీయ సమాజాన్ని అనేకరకాల గందరగోళంలోకి, అస్తవ్యస్తతలోకి నెట్టివేశారు. విల్సన్ చెప్పినట్లుగా–1750లో భారతీయుల జీవన ప్రమాణం ఇంగ్లాండ్‌తో సరిసమానంగా ఉండేది. ప్రస్తుతం వారి జీవన ప్రమాణాల మధ్య ఎంతో వ్యత్యాసం ఉంది. ఆంగ్లేయుల సగటు ఆదాయంలో కనీసం 10వ వంతు కూడా లేదు. ఈ మధ్యకాలంలో 200 వందల సంవత్సరాలపాటు భారతదేశంలో వలసపాలన ఉండటం కేవలం యాదృచ్ఛికం కాదు.[44]

బానిసత్వంలోకి నెట్టివేయబడకుండా ఉంటే భారతదేశం మరింత ధనికదేశంగా అభివృద్ధి చెంది ఉండేది. శాస్త్ర సాంకేతిక రంగాలలో మరింతగా ప్రగతికి నోచుకొని ఉండేది. మరింత సమైక్యంగా, ఆధునికంగా భారతీయ సమాజం 19, 20 శతాబ్దాలలో రూపాంతరం చెందేది. కానీ అలా జరగలేదు. అనేకమంది ఆర్థికవేత్తలు ఆంగ్ల వలసపాలనకు బదులు సాంకేతిక వెనుకబాటుతనాన్ని భారతదేశపు తిరోగమనానికి కారణంగా చూపిస్తుంటారు. నిజానికి అదే కారణమైతే, జపాన్ లాగా భారతదేశమూ సాంకేతిక పరిజ్ఞానాన్ని దిగుమతి చేసుకొని అభివృద్ధి చెందేది. 20వ శతాబ్దంమధ్య వరకు అట్టి అవకాశం ఆంగ్లేయులు భారతదేశానికి ఇవ్వలేదు. శతాబ్దాలపాటు కళాకారులను, శిల్పులను, చరిత్రకారులను పర్షియానుండి, వాస్తు శిల్పవేత్తలను మధ్య ఆసియానుండి, సైనికులను తూర్పుఆఫ్రికానుండి దిగుమతి చేసుకొన్న దేశం పాశ్చాత్య దేశాలనుండి సాంకేతిక పరిజ్ఞాన దిగుమతికి ఎందుకు నిరాకరిస్తుంది? కానీ సాంకేతికంగా దేశాన్ని వెనుకబాటుతనంలోకి నెట్టివేసింది వలసపాలకులే.

బ్రిటీష్‌పాలనే లేకుంటే జపాన్‌లో వచ్చిన మేజీ (Meiji) పునరుద్ధరణ వంటి ఉద్యమాలు భారతదేశంలోకూడా వచ్చి ఉండేవి. వలసపాలన అట్టి ఉద్యమాలకు అవకాశం ఇవ్వలేదు. ఆంగ్లేయుల పెత్తనం, అణిచివేత, దోపిడీ లేకుంటే భారతదేశం కూడా తనకులేనివాటిని ఇతరదేశాలనుండి తెచ్చుకొని అభివృద్ధిపథంలో సాగి ఉండేది. ఆంగ్ల వలసపాలకుల జాతివివక్షా విధానాలు భారతదేశాన్ని క్రుంగదీశాయి. వ్యవసాయ మిగులును ఆంగ్లేయులు పన్నుల రూపంలో కాజేశారు. వ్యవసాయ మిగులు లేకుండా పారిశ్రామిక అభివృద్ధికి వనరులు లభించవు. వ్యవసాయ మిగులునే కాదు. రైతుల ఫలసాయాన్నే వారు దోచుకున్నారు. ఉన్న పరిశ్రమలను ధ్వంసం

చేశారు. కొత్త పరిశ్రమలను వారు నెలకొల్పలేదు. వలసపాలకులు భారతీయులను విద్యావంతులను చేయలేదు సరికదా కనీసం అక్షరాస్యులుగా అయినా చేయలేదు. అడుగడుగునా చూపించిన జాతి వివక్ష నాటిన సాంస్కృతిక విషబీజాలు భారతీయుల ఆత్మవిశ్వాసాన్ని దెబ్బకొట్టాయి. రెండు ప్రపంచ యుద్ధాలతో భారతదేశానికి ప్రత్యక్షంగా సంబంధం లేకపోయినా ఆంగ్లేయుల ఏలుబడిలో ఉన్నందున భారతదేశం తీవ్రంగా నష్టపోయింది.

## References


1. Angus Maddison, *The World Economy*, OECD, 2006
2. William Bolts, *Considerations on Indian Affairs: Particularly respecting the present state of Bengal and its Dependencies*, 1772, p. vi
3. P.Bairoch and M. Levy-Leboyer (ed), *Disparities in Economic Development since the Industrial Revolution*, 1981
4. Owen Jones, *The Independent*, 3rd September, 2012
5. Sudipta Das, *British Reactions to the French Bugbear in India*, European History Quarterly. 22(1),1992,pp. 39-65
6. *Historical Essays of Macaulay*, 1894
7. James Holzman, *'The Nabobs in England: A study of the Returned Anglo-Indian 1760-1785'*, 1926
8. Dalrymple, *The East India company : The Original Corporate Riders, The Guardian, 4 March 2015.*
9. Nicholas B.Dirks, *The Scandal of Empire : India and the Creation of the Imperial Britain, 2006.*
10. Peter J. Marshall, *The Impeachment of Warren Hastings*, Oxford, 1965.
11. William Howitt , *The English in India*, 1839 pp. 42-43.
12. *T.B. Macaulay, Essays : Critical and Miscellaneous*, 1844.
13. R.C.Dutt, *The Economic History under Early British Rule*. p.516

14. John Zubrzycki, *The last Nizam*, p. 34.
15. Paul Baran, *The Political Economy of Growth*, p.148
16. Dadabhai Naoroji, *Poverty and Un British Rule in India*, 1901
17. William Digby, *Prosperous British India : A Revelation from official Records*, 1901.
18. Angus Maddison, *Class structure and Economic Growths, India, and Pakistan since the Moghuls*, 2013, p. 63
19. William Digby, Ibid
20. H.S. Bhatia *(ed)*, *Military History of British India 1607-1947*, 1977.
21. R.P.Dutt, *India Today*, p.123.
22. William Digby, *Prosperous British India: A Revelation from official Records*, p. 33
23. Bipin Chandra, *Modern India*, p. 99
24. Report the EIC, 1813. Cf. *Prasad: Some Aspects of India's Foreign Trade*, p. 49
25. For Details, see R.C.Dutt, William Digby, H.H.Wilson, op.cit
26. George Wingate, *A Few words on our Financial Relations with India*, p. 8
27. Resolution No 4137. Cf. *Frederick Clairrmonte, p.* 82
28. George Wingate, op.cit; pp . 6-7
29. L.Jenks, *The Migration of British Capital*,1875 pp. 223-4
30. George Paish: Journal of Royal Statistical Society Vol.LXXIV, Part 1, Jan 2, 1911,p.186
31. Dadabhai Naoroji , Speeches and Writings, pp. 319-20
32. R.P.Dutt, p. 127
33. Joan Robinson, Cf .UGC Report on Modernisation of Syllabi in Economics, pp. 23-24
34. Naoroji Dadabhai - Poverty and Un British Rule in India, pp. 23-24

35. G.V. Joshi, *Writings and Speeches*, p. 794
36. T B Macaulay : *Miscellaneous Writings and Speeches*, Vol. 4, Project Gutenberg 2008.
37. David McLellan (ed) : *Karl Marx : Selected Writings*, 1982 p. 362
38. Jon Wilson : *India Conquered*, 2016, p. 500
39. Niall Ferguson : *Empire, 2002*, p. 216
40. Jon Wilson : 'False and Dangerous' *The Guardian,* 8 Feb, 2003.
41. Sanjay Subrahmanyam : *The Career and Legend of Vasco Da gama*, 1997
42. John H.Kautsky : *The Politics of Aristocratic Empires*, 1997, p. 188
43. R.C. Dutt : *The Economic History of India*, Vol.2, p. XXV.
44. Jon Wilson : '*False and Dangerous*' - Ibid



# 10

# వలసపాలనకాలపు దారుణాలు

వలసపాలనకాలంలో తీవ్రమైన కఱవు కాటకాలు సంభవించాయి. స్వాతంత్ర్యానంతరం అంతటి భయానక పరిస్థితులు లేవు. భారత ప్రజాస్వామ్య వ్యవస్థ కఱవుబాధిత ప్రాంతాలను, పేదరికంలో మగ్గుతున్న వారిని సకాలంలో పట్టించుకోగలగటమే అందుకు కారణం. నోబెల్ బహుమతి గ్రహీత అమర్త్యసేన్ చెప్పినట్లుగా పత్రికాస్వేచ్ఛ, ప్రజాస్వామ్యం ఉన్న ఏదేశంలోనూ కఱవులు రాలేదు. ప్రజాస్వామ్యంలో ప్రజలపట్ల పాలకులకు ఉండే జవాబుదారీతనంవల్ల ప్రజలసమస్యలను సత్వరమే పరిష్కరించేందుకు పాలకులు పనిచేయక తప్పని పరిస్థితులు ఉంటాయి. కఱవు కాటకాలు నివారించదగ్గవి. నివారణకు వీలు అయ్యేవి. ఆహారధాన్యాల కొఱతవల్ల కఱవులు రావు. ఆహారధాన్యాలు ప్రజలకు అందుబాటులోకి రాకపోతే కఱవులు వస్తాయి. అంటే ఆహారధాన్యాల సక్రమ పంపిణీయే సమస్యకు అసలు పరిష్కారం. ప్రజాస్వామ్యంలో ప్రభుత్వం ప్రజాపంపిణీ వ్యవస్థద్వారా ఆహారధాన్యాలను అందరికీ అందుబాటులోకి తెస్తుంది. వలసపాలనలో ప్రజాస్వామ్యం లేదు. ప్రజలకు ఎట్టి పాత్రా లేదు. కనుక పాలకులకు ప్రజలపట్ల ఎట్టి జవాబుదారీతనం లేదు. ప్రజలను వారెప్పుడూ పట్టించుకోలేదు. వనరులు కొల్లగొట్టడంమీదే వారిదృష్టి తప్ప, ప్రజాసంక్షేమాన్ని వారెన్నడూ పట్టించుకోలేదు.

**ఆకలిచావులు, సాముహిక హత్యాకాండ :**

వలసపాలన కాలంలో భారతదేశం కఱవుకాటకాల నిలయమైంది. కఱవు అనేది ఎప్పుడో ఒకప్పుడో అతిథిగా రావటం కాక, యింటిదగ్గర ఉండే బిడ్డ మాదిరిగా కఱవు ఎప్పుడూ వెన్నంటే ఉండేదని ఒక బ్రిటీషు పార్లమెంటు సభ్యుడు వ్యాఖ్యానించాడంటే పరిస్థితి ఎంత దారుణంగా ఉండేదో తెలుసుకోవచ్చు. బ్రిటీషువారు రాకముందు భారతదేశంలో కఱవుకాటకాలు లేవనికాదు. ఒకవేళ వచ్చినా స్థానికంగా కొన్నిప్రాంతాలకే అవి పరిమితం అయ్యేవి. వంద సంవత్సరాలకో, ఏభై సంవత్సరాలకో ఒకసారి కఱవులు వచ్చేవి. ఆంగ్లేయుల

పాలనాకాలంలో ప్రతినాల్గు సంవత్సరాలకు ఒకసారి కఱవు పరిస్థితులు ఏర్పడ్డాయి[1].

**బ్రిటీషు పాలనకు ముందు వచ్చిన కఱవులు:**

| శతాబ్దం | వచ్చిన కఱవులు |
|---|---|
| 11 | 2 స్థానికం |
| 12 | × |
| 13 | 1 - ఢిల్లీ |
| 14 | 3 - స్థానికం |
| 15 | 2 - స్థానికం |
| 16 | 3 - స్థానికం |
| 17 | 3 - విస్తృతం |
| 18 | 4 - స్థానికం |

మూలం : విలియమ్ డిగ్బీ, 'ప్రాస్పెరస్ బ్రిటీషు ఇండియా'

18వ శతాబ్దిలో 4 సార్లు కఱవులు వచ్చాయి. 1769-70, 1783, 1789, 1792 లలో కఱవులు వచ్చాయి. బ్రిటీషువారు 1911లో 19వ శతాబ్దిలో వచ్చిన కఱవులను గుర్తించారు. మొత్తం 31 కఱవులను అధికారికంగా గుర్తించారు.

| కాలం | కఱవులు |
|---|---|
| 1800-25 | 5 |
| 1825-50 | 2 |
| 1850-75 | 6 |
| 1875-90 | 18 |
| మొత్తం | 31 |

ఈ 31 కఱవులవల్ల ఎన్నో లక్షలమంది మరణించారు. వారు యిచ్చిన లెక్కల ప్రకారం కఱవు కాటకాలవల్ల అపార జననష్టం జరిగింది. 19వ శతాబ్దపు మొదటి 25 సంవత్సరాలలో 10 లక్షలమంది చనిపొయ్యారు. తరువాతి 25 సంవత్సరాలలో 5 లక్షలమంది, ఆ తర్వాత 25 సంవత్సరాలలో 50 లక్షలమంది చనిపోగా చివరి 25 సంవత్సరాలలో 2 కోట్ల 50 లక్షలమంది చనిపోయారు. 20వ శతాబ్దంలో, కఱవు కాటకాలవల్ల సంభవించిన ఆకలిచావుల వివరాలు ఈ క్రింద యివ్వబడ్డాయి.

| కాలం | సంభవించిన ఆకలిచావుల సంఖ్య |
|---|---|
| 1901 | 40, 00,000 |
| 1906-07 | 50,000 |
| 1918-19 | 1,00,00,000 |
| 1942-44 | 1,00,00,000 |
| మిగిలిన సంవత్సరాలు | 1,50,00,000 |

కాని వలసపాలకులు కఱవు కాటకాలవలన సంభవించిన మరణాలగురించి గాని, ఆకలిచావుల గురించిగాని, ప్రబలిన అంటువ్యాధుల గురించిగాని ఎన్నడూ పట్టించుకొన్న పాపాన పోలేదు. పదినుండి ఇరవైవేలమందిని మాత్రమే పొట్టనపెట్టుకున్న కఱవుకాటకాలను పట్టించుకోదగ్గవి కావని వారు భావించారు. "అటువంటి చిన్నచిన్న కఱవులుగురించి మనమెన్నడూ పట్టించుకోలేదు. కఱవుల విలయతాండవం సర్వ సాధారణంగా భావించాం".[2]

కఱవులు సంభవించిన సంవత్సరంలో ప్రభుత్వానికి రావలసిన భూమిశిస్తు, భాటకం పూర్తిగా వసూలు అయితే, ఆ సంవత్సరాన్ని కఱవు సంవత్సరంగా వారు గుర్తించలేదు. 1771లో తీవ్రమైన కఱవు వచ్చింది. కాని ప్రభుత్వ ఆదాయానికి లోటులేకపోగా 1768లోకంటె ఎక్కువ వసూలు అయింది. 1771లో రూ॥ 5,30,000 భూమిశిస్తు రూపంలో ముక్కుపిండి మరీ వసూలుచేశారు. కఱవువల్ల పంటలుపండక రైతులు కటకటలాడుతుంటే వారివద్ద ఉన్న కొద్దిపాటి ఆస్తులను జప్తుచేసి మరీ, దౌర్జన్యంగా వారినుండి భూమిశిస్తును వసూలుచేశారు. కఱవు కాటకాలంటే ఆంగ్లేయులకు తెలియకకాదు. కానీ వారి దృష్టి అంతా శిస్తువసూళ్ళ మీదే తప్ప, ప్రజాక్షేమంమీద లేదు. కఱవుకాటకాలు సంభవించినప్పుడు మరేదేశంలోనూ, మరే ప్రభుత్వం అంత పట్టనితనంతో వ్యవహరించలేదు. రైతుల ముక్కుపిండి, చెవులు మెలిపెట్టి, పలురకాల చిత్రహింసలకు గురిచేసి, భూమిశిస్తును వసూలుచెయ్యలేదు. ఆ అమానుషత్వం, క్రూరత్వం ఆంగ్లేయుల సొత్తు. అదే వారి వలసపాలనకు ఆధారం కూడా.

1876 నుండి 1900 వరకు నాల్గు పెద్ద కఱవులు వచ్చాయి. అవి భయంకరమైన కఱవులు. మెతుకు కరువై జనం అల్లాడిపోయారు. వీటిలో మొదటగా వచ్చిన కఱవు కారణంగా 65 లక్షలమంది ప్రాణాలు కోల్పోయారు. 65 లక్షల ఆకలిచావుల ఆర్తనాదాలు మిన్నంటాయి. కాని పాలకులకు పట్టలేదు. చివరిరెండు

అంతకంటె భయంకరమైన కఱవులు. వెంటవెంటనే వచ్చిన ఆ కఱవులలో 1.9 కోట్ల మంది చనిపోయారు. 19వ శతాబ్దపు చివరి నాలుగు దశాబ్దాలలో వారి వలసపాలనలో మ్రగ్గుతున్న భారతదేశంలో 18 ప్రాంతాలలో తీవ్రమైన కఱవు కాటకాలు ఏర్పడ్డాయి. అధికార లెక్కల ప్రకారమే 19వ శతాబ్దపు చివరి 25 సంవత్సరాల కాలంలో 18 కఱవులు వచ్చాయి. 1891లో దేశజనాభా 28,72,23,481. 1901లో దేశజనాభా 29,40,00,000. సాధారణ జనాభా పెరుగుదల రేటునుబట్టి 1901లో ఉండవలసిన జనాభా 33,03,06,945. ఉండవలసిన జనాభాకంటె 3,63,06,945 మంది తక్కువగా ఉన్నారు. ఇవన్నీ ఆంగ్ల ప్రభుత్వం యిచ్చిన గణాంకాలే సుమా. ఒక ప్రముఖపత్రిక వివరణ ప్రకారం 1891-1901 మధ్య జనాభా 3 కోట్ల 90 లక్షలు తగ్గింది. ప్లేగుకారణంగా 10 లక్షలమంది చనిపోయారని అంచనా వేసారు. కోటి 19 లక్షలమంది ఆకలిచావుల వలనగాని, లేక ఆహారం దొరకనందున వచ్చిన వ్యాధులవలనగాని చనిపోయి ఉంటారని వివరించారు. 1942-44 మధ్య పదిలక్షల ఆకలిచావులు సంభవించాయంటే ఆంగ్లేయుల పాలన ఎంత దారుణంగా ఉందో ఊహించవచ్చు. ప్రజలు అన్నం దొరకక అలమటిస్తుంటే, ప్రభువులు విందులు, వినోదాలు, యుద్ధాలు, దోపిడీలలో పూర్తిగా నిమగ్నమయి ఉండేవారు.

వలసపాలకులు అనుసరించిన విధానాలవలన అణచివేత విధానాలవల్లనే లక్షలాదిమంది భారతీయులు ఆకలితో అలమటించి చనిపోయారు. ఈ ఆకలిచావులన్నీ పాలకుల నిర్వాకమే. నిరోధించటానికి అవకాశం ఉన్నవే. కఱవుకాటకాలు తీవ్రంగా ఉన్న కాలంలో సైతం టన్నులకొద్దీ గోదుమలను ఇంగ్లాండ్‌కు తరలించారు. కఱవు శిబిరాలలోని బాధితులకు చాలినంతగా ఆహారం అందివ్వక పోవటంతో, శిబిరాలలో ఉన్న వారందరూ మృత్యువాత పడ్డారు.[3]

వచ్చిన కఱవులలో ముఖ్యమైనవి-బెంగాల్ కఱవు (1772), మద్రాసు కఱవు (1782-83), ఢిల్లీ కఱవు (1783-84), దక్కన్ కఱవు (1791-92), ఆగ్రా కఱవు (1837-38), దక్షిణ భారత్ కఱవు (1876-77), ఇండియన్ కఱవు (1896-1900), బొంబాయి కఱవు (1905-06), వీటన్నిటి కంటె మిన్నగా బెంగాల్ కఱవు (1943-44). ఇవన్నీ అధికారికంగా గుర్తింపబడిన కఱవులు. ది ఓరియంటల్ హెరాల్డ్ 1838లో మొత్తం 15 కఱవులు గురించి ప్రస్తావించింది. 1776, 1780, 1782, 1792, 1803, 1804, 1819 నాటి కఱవులు ఎప్పటికీ

మరచిపోలేనివి. 1770 దశాబ్దంలో వచ్చిన తీవ్రమైన కఱవులవల్ల వంగదేశంలో సగానికి పైన ప్రజలు చనిపోయారని ఆ పత్రిక వ్రాసింది.

20వ శతాబ్దంలో వచ్చిన కఱవులలో 35 మిలియన్ల (3.5 కోట్ల)మంది చనిపోయారని అధికారిక గణాంకాలే చెప్తున్నాయి. ఇవన్నీ ఆకలిచావులే. నిరోధించటానికి వీలు అయినవే. కానీ వలసపాలకుల ఉదాసీనత వల్ల, నిర్లక్ష్యంవలన ఇంత భారీమొత్తంలో జననష్టం జరిగింది. విలియమ్ డిగ్బీ వ్రాస్తూ 1793 నుండి 1900వ సంవత్సరంవరకు అంటే 107 సంవత్సరాలలో కేవలం యుద్ధాలవల్ల 50 లక్షలమంది చనిపోయారని అంచనా వేశారు. ప్రపంచవ్యాప్తంగా జరిగిన జననష్టం యిది. భారతదేశంలో కేవలం ఒక దశాబ్దంలోనే 1891 నుండి 1900 వరకు, 1.9 కోట్లమంది ఆకలిచావుల బారిన పడ్డారు.[4]

వలసపాలనాకాలంలో వచ్చిన కఱవుకాటకాల గురించి రాజకీయంగా అలజడి చెలరేగింది. మాటిమాటికీ కఱవుకాటకాలు విలయతాండవం చేయటం, వాటిని నియంత్రించటానికి తెల్లదొరలు పూనుకోకపోవటం, ఆ కారణంగా సంభవించిన సామూహిక ఆకలిచావులు భారతజాతీయ నాయకత్వాన్ని కదిలించి వేసింది. దాదాభాయి నౌరోజీ భారతదేశ దారిద్ర్యానికి, దుస్థితికి మూలకారణమైన వనరుల తరలింపు సిద్ధాంతాన్ని (Drain Theroy) ఒరిస్సా ఆకలిచావుల బీభత్సాన్ని కళ్ళారా చూశాకే ప్రతిపాదించాడు. అంతవరకు ఆంగ్లేయులపట్ల, వారి పాలనపట్ల ఆయనకు కొంత సదభిప్రాయం ఉండేది. ఒరిస్సా ఆకలిచావులు ఆయనను దుఃఖితుడ్ని చేసాయి.

“ఈ కాలంలో ఆస్తులకు, ప్రాణాలకు భద్రత కల్గించటం మంచిదే. అందులో సందేహంలేదు. కాని ఒకే ఒక్క కఱవులో (1866లో వచ్చిన ఒరిస్సా కఱవులో) 15 లక్షలమంది చనిపోవటాన్ని చూసినప్పుడు ఆస్తులకు, ప్రాణాలకు ఉన్న ‘వింతభద్రత’ యొక్కవిలువగురించి పునరాలోచించవలసి ఉంటుంది” అని ఆయన అన్నారు.

**నివారణ చర్యలూ లేవు-సహాయక చర్యలూ లేవు :**

కఱవు కాటకాలు సంభవించినపుడు వలసపాలకులు జోక్యం చేసుకోవటానికి ఎన్నడూ ప్రయత్నం చెయ్యలేదు. సహాయశిబిరాలను నెలకొల్పలేదు. గంజికేంద్రాలను ఏర్పాటు చేయలేదు. ప్రజలను గాలికి వదిలివేశారు. మెతుకు కఱవై లక్షలాదిమంది ప్రాణాలు కోల్పోయారు. వారు జోక్యం చేసుకోకపోవటానికి మూడు కారణాలను

వారు చెప్పారు. మొదటిది స్వేచ్ఛావాణిజ్య సిద్ధాంతం. మార్కెటు శక్తులను నియంత్రించకూడదు అని ఆ సిద్ధాంతం ప్రతిపాదిస్తుంది. రెండవది మాల్థస్ జనాభా సిద్ధాంతం. జనాభా పెరుగుదల రేటు ఆహారధాన్యాల పెరుగుదల రేటుకంటె ఎక్కువగా ఉన్నప్పుడు ఆకలిచావులు సంభవించి, జననష్టంవల్ల ఆహారధాన్యాల సరఫరాకు జనం అవసరాలకుమధ్య సమతూకం ఏర్పడుతుందని ఆ సిద్ధాంతం ప్రతిపాదన చేస్తుంది. మూడవది రాజ్యం తన కోశాన్ని పొదుపుగా ఖర్చు చెయ్యాలి. అంటే బడ్జెటులో ఏ కార్యక్రమాలకు వాటిని ఉద్దేశించారో, వాటిపైనే ఖర్చుపెట్టాలి. బడ్జెటులో లేని అంశాలపై ఖర్చుపెట్టకూడదు. ఈ మూడు సిద్ధాంతాల ఆధారంగా లేదా వాటిని చూపించి, ఐర్లండ్‌లో కఱవులు సంభవించినపుడు ఇంగ్లాండ్ జోక్యం చేసుకోలేదు. జీవనం గడవక అమెరికాకు పెద్దపెట్టున ఐర్లండ్‌నుండి వలసలు వెళ్ళినా, పట్టించుకోలేదు. "కఱవుకాటకాలు సంభవించినపుడు ప్రభుత్వజోక్యం అనవసరం. అంతేకాక ప్రమాదకరం కూడా. మార్కెట్ కాలక్రమంలో సంతులనాన్ని తీసుకొని వస్తుంది. ప్రకృతి అధికజనాభా సమస్యను పరిష్కరించేందుకు ఆకలిచావుల రూపంలో స్పందిస్తుంది. కనుక ప్రభుత్వజోక్యం అనవసరం".[5] ఈ మాల్థస్ సిద్ధాంతాన్ని సాకుగా చూపి వలసపాలకులు కఱవుకాటకాలు సంభవించినప్పుడు ఎట్టి జోక్యమూ చేసుకోలేదు.

బెంగాల్ గవర్నర్ కఱవు ప్రాంతాలను సందర్శించి ఈ విధంగా చెప్పాడు "ఇలాంటి విపత్తులు దైవశాపం కారణంగా దురదృష్టవశాత్తు వస్తుంటాయి. ఏ ప్రభుత్వమూ వాటిని నివారించటానికి కానీ, సహాయచర్యలు చేపట్టటానికిగానీ చేయటానికి ఏమీలేదు" 1866లో ఒరిస్సా కఱవు సందర్భంగా ఆహారధాన్యాల ధరలను నియంత్రించలేదన్న విమర్శలకు జవాబు యిస్తూ ఆయన ఇలా అన్నాడు. "వీటిని నియంత్రించటానికి నేను పూనుకొంటే, నేను ఒక బందిపోటుకంటె, దొంగకంటె ఉన్నతుడిని అవను".[6] ప్రభుత్వ జోక్యంవల్ల తన రాజకీయ ప్రతిష్ఠ తగ్గుతుందని ఆయన భావించాడు. ఎందుకంటె ఆడమ్ స్మిత్ చెప్పిన స్వేచ్ఛామార్కెట్ ఆర్థికసూత్రాలకు భిన్నంగా జోక్యంచేసుకుంటే ఇంగ్లాండ్‌లో ఆయన పరువు ఏం కాను? ఒరిస్సా ప్రజల ఆకలిచావుల విషాదంకంటె ఆయనకు పరువే ముఖ్యం! ఆంగ్లేయుల పాలనకుముందు తఱచుగా కఱవుకాటకాలు అంతకుముందెన్నడూ భారతదేశంలో రాలేదు. ఆహారధాన్యాల కొఱత అప్పుడప్పుడూ వచ్చినా పాలకులు స్పందించేవారు. ఆహారధాన్యాల ధరల గరిష్ఠధరలను నిర్ణయించేవారు.

కఱవుప్రాంతాలనుండి ఆహార ధాన్యాల ఎగుమతికి అనుమతిని యిచ్చేవారు కాదు. పాలకులకంటె దయాగుణం ఉన్న ప్రజలు ఎక్కువ స్పందించేవారు. ధనికులు పేదలను ఆదుకోవటం తమ కర్తవ్యంగా భావించి, వారికి అండగా నిలబడేవారు. వారికి ఉచితంగా, సామూహికంగా ఆహారాన్ని అందించేవారు. ఏదో పని వారికి యిచ్చి తక్కువధరలకే ఆహారధాన్యాలను కొలిచి యిచ్చేవారు. ఈస్టిండియా కంపెనీకి భారతప్రజల దాతృత్వం నచ్చలేదు. దాతృత్వంవలన ప్రజలు సోమరులు అవుతారని వారు భావించారు. అది మూఢనమ్మకంతప్ప మరొకటికాదని శాసించారు. పనిచేయగలవారికి పనికల్పిస్తాం తప్ప, సహాయశిబిరాలు నెలకొల్పి నెలలపాటు వారిని పోషించబోమని తేల్చి చెప్పారు.

**నిర్లక్ష్యం ఖరీదు పదిలక్షల ఆకలిచావులు :**

1866లో ఒరిస్సాలో కఱవు వచ్చినప్పుడు 'సెక్రటరీ ఆఫ్ స్టేట్'గా మార్క్యుస్ శాల్సిబరీ ఉన్నాడు. ఒరిస్సాలో కఱవు పరిస్థితులగురించి ఆయన దృష్టికి తీసుకొనివచ్చినా, ఆయన పట్టించుకోలేదు. సంక్షోభం రాబోతున్నదని ఆయనను హెచ్చరించినా ప్రయోజనం లేకపోయింది. ఆయన నిర్లక్ష్యం ఖరీదు పదిలక్షల ఆకలిచావులు. బ్రిటీష్ అధికారులు కనీసం 1860 నుండి ఒక విషయాన్ని చెప్తూవచ్చారు. కఱవులు తఱచుగా రావటానికి కారణం ఆహారధాన్యాల కొఱత కారణం కాదని, ప్రజలకు తగిన కొనుగోలుశక్తి లేకపోవటమే అందుకు కారణమని వారు చెప్తూ వచ్చారు. అయితే ప్రజలకు ఎందువల్ల కొనుగోలుశక్తి లేదో వారెన్నడూ పేర్కొనలేదు. 1866 ఒరిస్సా కఱవులో 15 లక్షలమంది ఆకలిచావుల బారినపడగా, 20 కోట్ల టన్నుల బియ్యాన్ని ఏమాత్రమూ పాపభీతి, అపరాధభావం లేకుండా బ్రిటన్‌కు తరలించారు.[7]

కఱవు కాటకాలు తఱచుగా సంభవించటాన్ని తమ రాజకీయ అవసరాలకు ఉపయోగించుకోవటానికి వలసపాలకులు ఎన్నడూ సిగ్గుపడలేదు. బ్రిటీషువారి పాలనే లేకుంటే దేశం మొత్తం స్మశానంగా మారిపొయ్యేది అని, వలసపాలన వల్లనే బ్రతికి ఉన్నవాళ్ళు బ్రతకగలిగారని గొప్పలు చెప్పుకొన్నారు. తమను తాము పాలించుకోలేని జనానికి తమ పెత్తనం, అజమాయిషీ లేకుంటే పరిస్థితులు మరింత దారుణంగా ఉండేవని కూడా చెప్పుకున్నారు. ఇంగ్లాండుకు వారు పంపిన అధికారిక నివేదికలలో వారినితప్ప ఇతరు లందర్నీ కఱవుకాటకాలకు కారకులుగా వారు పేర్కొన్నారు. జనాభా పెరుగుదల, ఆహారధాన్యాల ఉత్పత్తి తగ్గటం, సకాలంలో

వర్షాలు తగినంతగా పడకపోవటం వంటి నియంత్రించలేని అంశాలతోపాటు సరైన రవాణా సౌకర్యాలు లేకపోవటం, హిందువుల జీవనశైలి మొదలైన వాటి కారణంగా కఱవుకాటకాలు తఱచుగా వస్తున్నాయని పేర్కొన్నారు. ఆంగ్లపాలకులు చిత్తశుద్ధితో కఱవు నివారణకు పనిచేస్తున్నా, ప్రాకృతిక కారణాలవల్ల ఆశించిన ఫలితాలు పొందలేకపొయ్యారని నివేదికలో పొందుపర్చారు. వలస పాలకులు అనుసరించిన విధివిధానాల వలన, విచక్షణారహితంగా వనరులను దోపిడీ చేసినందున ప్రజలకు జీవనోపాధి కఱవై, వారి కొనుగోలుశక్తి తగ్గిందని వారు ఎలా ఒప్పుకుంటారు?

**కఱవులు 19వ శతాబ్దపు విషాదం మాత్రమే కాదు :**

ఇదేదో 19వ శతాబ్దపు విషాదం అని అనుకోకూడదు. వలసపాలనాకాలం కొనసాగిన 20వ శతాబ్దంలోనూ ఇవే విధానాలు, వివరణలు, ప్రజలపట్ల ఉదాసీన వైఖరి కొనసాగింది. 1943లో బెంగాల్ కఱవు నివేదికలో చివరిపేరాను చూడండి. "బెంగాల్‌లో ప్రభుత్వం కఱవునివారణలో వైఫల్యం పొందటాన్ని మేము విమర్శించాము. నివారించదగ్గ సంక్షోభాన్ని నివారించటానికి పూనుకోవటం ప్రభుత్వ బాధ్యత. అయితే బెంగాల్‌లో కనీసం కొన్ని వర్గాల ప్రజలు కూడా బాధ్యతారహితంగా ప్రవర్తించారు. ప్రజలు భయంతో, దురాశతో ఆహారధాన్యాలను నిల్వచేసుకున్నారు. దానితో ధరలు పెరిగాయి. కొందరు వ్యాపారులు విపరీతంగా లాభాలు ఆర్జించారు. ఆ కారణంగా వారు అనేకమంది ఆకలిచావులకు కారణం అయ్యారు. కఱవుకాలం సమాజంలో అత్యధికులకు పుష్కలంగా లాభించింది. అనేకమంది ఆకలిచావులతో మరణిస్తుంటే, కొందరు ఆనందంగా దేనికీ లోటులేకుండా సంతోషంగా కాలం గడిపారు. కళ్ళముందు తాండవిస్తున్న విషాదంపట్ల ఎంతో ఉదాసీనత సమాజంలో కన్పిస్తుంది. సమాజమంతా అవినీతిమయంగా ఉంది. సంఘం, దానియొక్క అంగాలతో, బలహీనులకు తగిన భద్రత కల్పించలేకపోయింది. వాస్తవానికి ఒక నైతిక, సామాజిక విచ్చలవిడితనం, బాధ్యతారాహిత్యం పాలనా వైఫల్యానికి తోడు అయ్యాయి."[8]

తమను తాము సమర్థించుకోవటానికి, ఒక విషాదాన్ని ఇతరులమీద నెట్టివేయటం ఎంతవరకు సమంజసం? అందుకే విల్ డ్యూరాంట్ "ఈ భయంకరమైన కఱవుకాటకాల వెనుక, నిర్దయతోకూడిన దోపిడీ ఉంది. విచక్షణారహితంగా చేసిన ఎగుమతులు ఉన్నాయి. కఱవు కాటకాలమధ్యలో సైతం క్రూరమైన పద్ధతులలో వసూలుచేసిన పన్నులు ఉన్నాయి. ఆకలితో అలమటిస్తున్న రైతులు అడిగిన

భూమిశిస్తులు కట్టలేకపొయ్యేవారు ...... అమెరికానుండి దాతలు దయతో పంపిన నిధులను కఱవు సహాయకచర్యలకు ఖర్చుపెట్టారు తప్ప చావటానికి సిద్ధంగా ఉన్నవారి దగ్గఱనుండి కూడా శిస్తులు, పన్నులు వసూలుచేయటం మానివేయలేదు."[9] అని రాజీలేకుండా ఖండించాడు.

రమేష్ చంద్ర దత్తు ఒక ముఖ్యమైన విషయాన్ని వెలుగులోకి తెచ్చారు. ప్రజల అవసరాలకు సరిపడా ఆహారధాన్యాల ఉత్పత్తి జరగని సంవత్సరం ఒక్కటికూడా లేదని ఆయన వ్రాసారు. ప్రతి సంవత్సరం ఆహారధాన్యాల ఉత్పత్తి జరుగుతూనే ఉంది. ఉత్పత్తులు ప్రజల అవసరాలకు సరిపోతాయి. కాని అవి వారికి అందుబాటులోకి లేకపోవటమే సమస్య. డ్యూరాంట్ అమెరికన్ మతతత్త్వవేత్త డా॥ ఛార్లెస్ హాల్‌ను ఉట్టంకిస్తూ ఇలా వ్రాసాడు "భారతదేశం ఆకలితో అలమటిస్తున్నప్పటికి ప్రభుత్వానికి వార్షికంగా పన్నులద్వారా వచ్చే రాబడి ఒక డాలరుకూడా తగ్గలేదు. ఇంగ్లీషువారి వివక్షాపూరిత దిగుమతి సుంకాల కారణంగా దేశీయ పరిశ్రమలకు సంబంధించిన ప్రతిశాఖ ధ్వంసమై పోయింది. నౌకలద్వారా ధాన్యాన్ని ఇండియాకు పంపుతున్నాం. కాని భారతదేశంలోకూడా సమృద్ధిగా ఆహారధాన్యాలు ఉన్నాయి. కాని సమస్య ఏమిటంటే వాటిని కొనుగోలుచేసే శక్తిహీనతలోకి వారు నెట్టివేయబడ్డారు. దేనినీ కొనుక్కోలేని పేదస్థితిలో వారు ఉన్నారు".

**కఱవు కాటకాలు వచ్చినప్పుడు ఆంగ్లప్రభుత్వం జోక్యం చేసుకోలేదు :**

ఈస్టిండియా కంపెనీ మాత్రమే కాదు. అధికారం కిరీటానికి బదిలీ అయిన తర్వాతకూడా అదే నిర్లక్ష్యం కొనసాగింది. సామ్రాజ్యవాద పాలకులు మరింత గడుసువారు. ప్రజాసంక్షేమాన్ని వారెన్నడూ పట్టించుకోలేదు. కఱవుకాటకాల సందర్భంగా వారిని ఆదుకోవటానికి ఎన్నడూ పూనుకోలేదు. వ్యవస్థీకృతం చెయ్యబడ్డ సహాయకచర్యలవలన ప్రజలు తిండిపోతులు, సోమరిపోతులుగా మారి ప్రభుత్వానికి పెనుభారంగా మారుతారని వారు భావించారు.

భారతదేశంలో అతిథులను ఆదరించటం అనాదిగా వస్తున్న సంస్కృతి. బీదా బిక్కీని ఆదుకొనేవారు. యాచకులను వట్టిచేతులతో ఎవరూ పంపేవారుకాదు. కొన్ని కులాలవారు యాచకవృత్తిమీదే జీవించేవారు. సాధువులు, సత్పురుషులు కూడా యాచించి జీవనం గడుపుకొనేవారు. కాని బ్రిటీషువారి దృష్టిలో వారందరూ సమాజంమీదపడి తినే పరాన్నజీవులు. సమాజమూలాలనుండి సారాన్ని పీల్చే జలగలు. ధనికులు, మధ్యతరగతివారుసైతం తమకున్న దాంట్లో ఎవరిపట్ల వివక్ష

చూపకుండా తమయింటికి 'మాదాకవళం' కోసం వచ్చేవారందరికీ యిచ్చేవారు. బిచ్చమెత్తి బతికేవారిని చిన్నచూపు చూసేవారు కాదు. ఆవిధంగా ఎందరో అనాథలు, వృద్ధులు, దిక్కులేనివారు బ్రతుకుతుంటే తెల్లదొరలకు ఈ పద్ధతి అంతా అనాగరికంగా కన్పించింది. భారతీయుల దాతృత్వం ఆంగ్లేయులకు నచ్చలేదు. దానిని వారు నిరసించారు. ఈపాటి దాతృత్వం ప్రజల్లో లేకుంటే కఱవు కాటకాలలో అధికారికంగా మరణించిన వారికంటె రెట్టింపుమంది చనిపోయేవారు. 18,19 శతాబ్దాలలో దేశాన్ని కొల్లగొట్టి తమదేశానికి విచక్షణారహితంగా వనరులను తరలించారు. కాని ఎవరి వనరులనైతే వారు కొల్లగొట్టారో, వారియోగక్షేమాలు వారికి పట్టలేదు. వారిని గాలికి వదిలివేసారు. పైపెచ్చు దయాగుణంగల సాటివారు పట్టించుకొంటే వారిని సోమరిపోతులను తయారుచేస్తున్నారని తీవ్రంగా విమర్శించేవారు.

బ్రిటీష్ విధానాలకు అనుగుణంగానే లార్డ్ లిట్టన్ ఆహారధాన్యాల ధరలు తగ్గించటానికి ఏమాత్రం ఒప్పుకోలేదు. తగ్గించకపోగా, తగ్గించకూడదని ఉత్తర్వులు యిచ్చాడు కూడా. "(కఱవు సందర్భంగా) ప్రభుత్వం జోక్యం చేసుకోదు. ఆహారధాన్యాల ధరలను తగ్గించేందుకు ప్రభుత్వం మార్కెట్లలో ఎట్టి పరిస్థితులలోనూ జోక్యం చేసుకోకూడదు..." "జిల్లా అధికారులు ఎవరూ ఏరకంగానూ సహాయక శిబిరాలు నెలకొల్పటం కాని, సహాయకచర్యలు, పనులు చేపట్టటం కాని చెయ్యకూడదు. పేదరికం సహాయక పనులు చేపట్టటానికి తగినకారణం కానేకాదు".

**జర్మనీ నిర్బంధ శ్రామిక శిబిరాల్లో యిచ్చిన కూలీరేట్లు ఎక్కువ:**

కఱవుబాధితులను ఆదుకోమని కోరినవారిని అందుకయ్యే ఖర్చును భరించమని లిట్టన్ సవాలు చేశాడు. మద్రాసులో 1876-77లో భయంకరమైన కఱవువచ్చినప్పుడు లిట్టన్ సహాయచర్యల ఖర్చు తగ్గించటానికి రిచర్డ్ టెంపుల్ అనే అధికారిని ప్రత్యేకంగా పంపాడు. ప్రజల సాధకబాధకాలు ఆయనకు అవసరం లేకపోయింది. కఱవు బాధితులకు యిస్తున్న అరకొరసాయాన్ని సైతం తగ్గించి కోశాగారంమీద భారం తగ్గించమని రిచర్డ్ టెంపుల్‌ను పంపాడు. 1866లో టెంపుల్ ఒరిస్సా కఱవు సందర్భంగా బర్మా నుండి బియ్యం తెప్పించి కఱవు బాధితులకు పంచినప్పుడు ప్రముఖపత్రిక 'ది ఎకనామిస్టు' ఆయనను తీవ్రంగా విమర్శించింది. "తమ్ము బ్రతికించటం ప్రభుత్వకర్తవ్యమని భారతీయులు భావించేందుకు అవకాశం యిచ్చినందుకు" టెంపుల్‌ను ఆ పత్రిక తీవ్రంగా విమర్శించింది. దానితో టెంపుల్

చాలా మారాడు. 1877 టెంపుల్ 1866 నాటి టెంపుల్ కాదు. లిట్టన్ మెప్పుకోసం కఱవుశిబిరాలమీద పెడ్తున్న వ్యయాన్ని నిర్దయగా తగ్గించాడు. కఱవుపనులకు గాను యిచ్చే అరకొరవేతనాలను సైతం కోతకోశాడు. 60 సంవత్సరాల తర్వాత 1937లో జర్మనీలో నాజీలు, బుచెన్‌వాల్డ్ నిర్బంధ శ్రామిక శిబిరంలో మద్రాసు కఱవు పనులకు చెల్లించిన కూలీరేట్లకంటె ఎక్కువ చెల్లించారని మైక్ డేవిస్ వ్యాఖ్యానించాడంటే పాలకులు ఎంతనిర్దయగా కఱవుబాధితులపట్ల వ్యవహరించే వారో తెలుస్తుంది.

వలసపాలకులు 1876-77 కఱవు సందర్భంగా 'ఏమీ చెయ్యలేదని' వారిని నిందించకూడదు. వారు దాని ప్రభావాన్ని మరింత పెంపు చేశారు. మరింత దయనీయస్థితిలోకి నిస్సహాయులైన భారతీయులను నెట్టివేసారు. భారతదేశంనుండి నౌకలనిండా ధాన్యాన్ని తరలించుకొని వెళ్ళారు. 1930వ దశకంలో స్టాలిన్ రష్యాలో ఇదే చేశాడు. సమష్టి వ్యవసాయక్షేత్రాలద్వారా రష్యాను, ఉక్రెయిన్‌ను తీవ్రమైన కఱవులోకి నెట్టాడు. మైక్ డేవిస్ అందుకే "భారతీయులు కఱవు కారణంగా ఆకలిచావులకు గురి అవుతుంటే, లండన్ భారతదేశపు రొట్టెలను తింటుంది" అని వ్యాఖ్యానించాడు. ఇది చాలదన్నట్లుగా పుండుమీద కారం చల్లినట్లుగా రైతాంగంమీద శిస్తులు మస్తుగా పెంచారు. ఆకలితో పనిచేయలేనివారిని మరింతగా పనిచేయండని, ఉత్పత్తి చేయండని బలవంత పెట్టారు. కొందరు మనసున్న ఆంగ్లేయులు దీన్ని తీవ్రంగా వ్యతిరేకించగా, వారిని అరెస్టు చేస్తామని ఆంగ్లప్రభుత్వం వారిని బెదిరించింది. మాక్‌మిన్ అనే ఆంగ్ల అధికారి తనస్వంతఖర్చుతో ఆకలితో అలమటిస్తున్న వారికి తిండిగింజలు యిచ్చినందుకు ఆయనను తీవ్రంగా మందలించటమేకాక, ఆయన ఉద్యోగహోదాను కూడా తగ్గించివేశారు.[10]

లెఫ్టినెంట్ కల్నల్ రోనాల్డ్ రాస్1877 కఱవు బీభత్సానికి ప్రత్యక్షసాక్షి. ఆయన ఇలా వ్రాసారు "అనేక వేల శవాలను పాతబావులలో పడవేశారు. చావులు అసంఖ్యాకంగా ఉండటంతో, విచారగ్రస్తులైన వారి బంధువులు అంతిమ సంస్కారాలు కూడా జరపలేక పోయారు. ఒక పూట భోజనంకోసం తల్లులు పిల్లలను అమ్మారు. భర్తలు భార్యలను చెఱువులలోకి తోశారు. ఆకలితో వారు మరణించటం చూడలేక ఆ దుర్మార్గానికి వారు ఒడిగట్టారు. ఇలాంటి భయంకర చావు దృశ్యాలమధ్య బ్రిటీష్ ఇండియా ప్రభుత్వం తన ప్రశాంతతను, సంతోషాన్ని

కోల్పోలేదు. కఱవు చావులను ప్రచురించవద్దని వార్తాపత్రికలను ఆదేశించారు. ఆకలితో ప్రజలు చచ్చిపోతున్నా, వారిని ఆదుకోవద్దని పౌరసమాజాన్ని కఠిన ఉత్తర్వులతో కట్టడిచేశారు.[11]

1877-78లో దక్షిణ భారతదేశంలో తీవ్రమైన కఱవు ఏర్పడింది. ప్రభుత్వం తన వ్యయాన్ని పెంచకపోగా, తగ్గించింది. అంతేకాక కఱవు సహాయకచర్యలు చేపట్టటానికి కాని, గంజికేంద్రాల నిర్వహణకుకాని వదాన్యులనుండి విరాళాలు సేకరించటాన్నికూడా ప్రోత్సాహించకపోగా అట్టి విరాళాలు అవసరం లేదని చెప్పారు. "మద్రాసులోని భారతీయ, పాశ్చాత్యపౌరులలో కొందరు కఱవునిధులకై విరాళాలకోసం ఇంగ్లాండ్ సంపన్నులకు విజ్ఞప్తి చేశారు. లార్డ్ లిట్టన్ ఆ చర్యను తప్పుపట్టారు. రాజ్యంపట్ల అవిధేయతగా దాన్ని భావించారు. ఒక టెలిగ్రాంను కోడ్‌భాషలో బెంగాల్ గవర్నర్‌కు పంపి 'కఱవు సహాయక నిధి' ఏర్పాటు యత్నాలను నిరుత్సాహపర్చమని ఆదేశించాడు. ఈ విషయం పత్రికలకు తెలియటంతో గందరగోళం చెలరేగింది. లిట్టన్ ప్రవర్తించిన తీరుపట్ల విమర్శలు తలెత్తటంతో అయిష్టంగా అయినా లిట్టన్ 1000 పౌండ్లు కఱవుసహాయకనిధికి విరాళం ప్రకటించక తప్పలేదు. మొత్తం 8,20,000 పౌండ్ల నిధి సమకూరింది. అనేకమంది సామాన్యులు చిన్నచిన్న మొత్తాలను విరాళంగా యిచ్చారు. అయినా 1877 డిశంబరు వరకు కూడా ఆ నిధిని ఒక 'కంప్లీట్ న్యూసెన్సు' గా ఆయన భావించాడు. నిధులు తప్పక దుర్వినియోగం అవుతాయని హెచ్చరిస్తూనే ఉండేవాడు. ఈ సంఘటన తర్వాత బ్రిటీషుప్రభుత్వం కఱవు సహాయకచర్యలు చేపట్టే బాధ్యతను తనే నేరుగా తీసుకొంది. కఱవు సహాయక నిధులను ప్రభుత్వమే అంతర్జాతీయంగా అవసరాన్ని బట్టి సేకరిస్తుందని, ప్రైవేటు వ్యక్తులు నిధులసేకరణకు పిలుపును యివ్వకూడదని చెప్పింది. కఱవు సహాయకచర్యలకు కొన్ని మార్గదర్శక సూత్రాలను తయారుచేసింది. 1896 అక్టోబరులో మరొక కఱవు వచ్చినప్పుడు, ప్రభుత్వం నియమనిబంధనలను రూపొందించటంలోనే కాలం వృధాచేసి, సకాలంలో సహాయక చర్యలు చేపట్టలేదు. ఇంగ్లండ్‌లో ప్రజాభిప్రాయం ప్రభుత్వానికి వ్యతిరేకంగా మారటంతో 1897 జనవరిలో సహాయక నిధుల సేకరణకోసం ప్రకటనలు యిచ్చింది. అప్పటికి కఱవువచ్చి నాలుగు నెలలు అయింది. అనేకమంది ఆకలితో చనిపోయారు.

**అపార పశునష్టం :**

బ్రిటీషువారి చలవగా సంభవించిన కఱవుకాటకాలవలన మనుష్యులతోపాటుగా పశుపక్ష్యాదులు కూడా వేలసంఖ్యలో చనిపోయేవి. 1859లో భారతదేశపు తోలు ఎగుమతుల విలువ రూ॥ 5 మిలియన్లు. 1901 నాటికి ఆ ఎగుమతుల విలువ 115 మిలియన్లు అయ్యింది. చాలా ఆశ్చర్యకరమైన పెరుగుదల ఇది. ఒక ఆవు లేక ఎద్దు మరణిస్తే రైతుకు చాలా నష్టం వాటిల్లేది. పశువులను పవిత్రంగానూ, సంపదగాను భావించే సమాజంనుండి తోలు ఎగుమతులు అన్నిరెట్లు పెరగటం ఆశ్చర్యకరమే కాదు. విషాదకరం కూడా. అన్ని వేల ఆవులు, ఎద్దులు మరణించటం అంటే రైతుల వెన్ను విరగటమే. దానివలన గ్రామీణ దారిద్ర్యం మరింతగా పెరిగింది. అన్ని వేల పశువులు ఒక్కసారిగా మరణించటంతో పశువులే ఆధారంగా నడిచే సాగు తీవ్రంగా దెబ్బతిన్నది. దుక్కిదున్నటానికి, రవాణాకు, పాలు పెరుగులకు జనం దిక్కుతోచని వారై పొయ్యారు. పశువుల దుర్మరణం వర్తమాన వ్యవసాయానికే కాక భవిష్యత్తు వ్యవసాయ అవసరాలకు కూడా తీవ్రవిఘాతమైంది. వాస్తవానికి కొందరు అధికారులు మనుష్యుల మరణంకంటె ఆవులమరణంవల్ల దేశానికి, వ్యవసాయరంగానికి తీవ్రనష్టం వాటిల్లిందని వారి నివేదికలలో పేర్కొనటం విశేషం. "దాని ప్రభావం వ్యవసాయరంగంమీద మనుష్యుల మరణంకంటె తీవ్రమైనది, శాశ్వతమైంది. సామాన్యంగా ఆకలితో వృద్ధులు, అనాథలు చనిపోయేవారు. శారీరకంగా దృఢంగా ఉన్నవారు ఎలాగో ఆకలిని తట్టుకొని నిలబడగలిగేవారు. కాని పశుసంపద నశిస్తే, మొత్తం వ్యవసాయమే కుప్పకూలిపోతుంది. వ్యవసాయం సమీపభవిష్యత్తులో పుంజుకోవటం అసాధ్యం."[12] ఆకలిచావులవలన కూలీలు దొరికేవారుకారు. కాని కూలీల కొఱత తాత్కాలికమే. దుక్కిదున్నటానికి అవసరమైన ఎద్దులు, దున్నపోతుల కొఱతవలన జరిగిన నష్టం చాలాకాలంపాటు వ్యవసాయ రంగంమీద కొనసాగేదని ఆనాటి ఆంగ్ల అధికారులే తమ నివేదికలలో పేర్కొనటం జరిగిందంటే పరిస్థితులు ఎంత భయానకంగా తయారయ్యాయో తెలుసుకోవచ్చు. ట్రాక్టర్లు లేని ఆ రోజుల్లో అన్నింటికీ ఎద్దులు, దున్నపోతులు, గుర్రాలమీద ఆధారపడ్డ రైతులు పశుసంపదను కోల్పోవటంతో సర్వస్వం కోల్పోయిన వాళ్ళు అయ్యారు.

పశుసంపద నష్టం చిన్న, సన్నకారురైతుల సేద్యంమీద మరింత తీవ్రప్రభావాన్ని చూపింది. దశాబ్దాలు కాకపోయినా, వారు కోలుకోవటానికి కొన్ని సంవత్సరాలు పట్టింది. అత్యంత పేదలైన రైతులకు వారి పాడిపశువులే జీవనాధారం.

కఱవుకాటకాల పూర్వపుస్థితికి చేరుకోవటానికి వారికి చాలాకాలం పట్టేది. కఱవు సహాయక చర్యల రూపంలో వారికి పాడిపశువులను కానీ కోడెదూడలనుకానీ ప్రభుత్వం ఎన్నడూ సరఫరా చెయ్యలేదు. పశువులకుసైతం కొన్ని ప్రాంతాలలో శిబిరాలు నిర్వహించేవారు. వాటిమీద తక్కువ ఖర్చుపెట్టేవారు. ప్రభుత్వం తన ఖజానానుండి ఒక్కపైసా కూడా ఖర్చుపెట్టటానికి యిష్టపడేది కాదు. వదాన్యులు యిచ్చిన విరాళాలనుండే ఖర్చు పెట్టేది. 1899-1900 మధ్యలో బొంబాయి ప్రెసిడెన్సీలో వచ్చిన కఱవు కాలంలో 9 శిబిరాలు నిర్వహించారు. వాటి నిర్వహణకు అయిన ఖర్చునంతా దాతలనుండే రాబట్టారు. ప్రభుత్వం పొదుపుగా ఖర్చుపెట్టాలన్న సూత్రాన్ని వారు తు.చ. తప్పకుండా అమలుచేసారు. మానవాళిని ఆదుకోవటం అనేది వారి నిఘంటువులో లేదు. బాధితులు, పీడితులపట్ల కనీస ఔదార్యంకూడా ప్రభుత్వం చూపించలేదు. తెల్లదొరలకంటె, వలసపాలకులకంటె మిన్నగా సాటిభారతీయులు తమ సోదరులను కష్టకాలంలో ఆదుకున్నారు. ఒక ప్రాంతంలో కఱవు కాటకాలు వచ్చినప్పుడు, వేరొక ప్రాంతంవారు ఆదుకొనేవారు. విరాళాలు పంపేవారు. స్వచ్ఛందసంస్థలు, ధార్మికసంస్థలు ముందుకు వచ్చి ఆదుకొనేవారు. సంపన్నులు, సహృదయులు ఉదారంగా నిధులు యిచ్చేవారు. జమీందార్లు గ్రామ పశుసంపదను కాపాడటానికి అవసరమైన మేతను, దాణాను సమకూర్చిపెట్టేవారు. తమ ప్రజలను, వారి పశువులను కష్టసమయంలో ఆదుకొనేందుకు జమీందార్లు ఎప్పుడూ సిద్ధంగా ఉండేవారు.

**కఱవు కాటకాలకు పూర్తిబాధ్యత వలసపాలకులదే :**

పంటలు సమృద్ధిగా పండిన ప్రాంతంనుండి కఱవు ప్రాంతాలకు ఆహారధాన్యాల రవాణా రహదారుల సౌకర్యం లేనప్పుడు వేగంగా చేయలేనిమాట వాస్తవమే. కాని రైలుమార్గాల నిర్మాణం పూర్తి అయ్యాక, రవాణా వసతులు పెరిగాక సైతం ఆహారధాన్యాలను కఱవు ప్రాంతాలకు తరలించకపోవటం అమానుషం. క్షమించరానినేరం. 19వ శతాబ్దంలో వేలమైళ్ళ రైల్వే మార్గాలు నిర్మించాక కూడా కఱవుకాటకాలు సంభవించాయి. ఇంతకంటె వేరే సాక్ష్యాధారాలు దేనికి? కఱవుకాటకాలకు పూర్తి బాధ్యత ఆంగ్లపాలకులది కాదా?

ఆంగ్లచక్రవర్తులు భారతీయులను వారి కష్టకాలంలో ఆదుకోవటంలో తీవ్రంగా విఫలం అయినప్పటికీ, తెల్లవారిని ఉదారపాలకులుగా అభివర్ణిస్తూ వ్రాసేవారు. 1897లో డైలీ మిర్రర్ పత్రిక ఏం వ్రాసిందో చూడండి "మన సామ్రాజ్యాన్ని

అతలాకుతలం చేస్తున్న ఆకలి అనే సైన్యంబారినుండి మనలను రక్షించగల ఆయుధం మనదగ్గర ఉంది. అదే మనడబ్బు. నిజాయితీగా మంచిగా మనం సంపాదించిన అయుధం అదే." అదే సమయంలో భారతీయుల వదాన్యతను ఎందుకు కొఅగానిదిగా కొట్టిపారవేసింది. వారి పత్రికలు ఏమి వ్రాసినా, వారిగురించి వారు ఎంత స్వంతడబ్బాలు కొట్టుకున్నా వాస్తవం మటుకు ఒకటే. కఱవు సహాయకచర్యలకు పెద్దఎత్తున నిధులను యిచ్చి, కఱవు బాధితులకు ఇతోధికంగా సాయం చేసింది భారతీయులే. భారతీయ సంతతికి చెందినవారు దేశదేశాలనుండి విరాళాలు పంపించారు. 1897, 1900లలో వచ్చిన కఱవుల కారణంగా ఏర్పడిన విపత్తును ఎదుర్కొవటానికి గాంధీగారు దక్షిణఆఫ్రికాలో నిధులు సేకరించి, పంపారు. బ్రిటీషు ప్రభుత్వ బాధ్యతారాహిత్యంవల్ల, ఉదాసీనతవల్ల ఏర్పడిన నిధుల కొఱతను అధిగమించటానికి కొంతవరకైనా అంతర్జాతీయంగా సేకరించిన నిధులు తోడ్పడ్డాయి. సామూహిక వంటశాలలను అనాథశరణాలయాలను నెలకొల్పారు. పేదలకు ఇళ్లు కట్టించారు. చౌకధరలకు తిండిగింజలు పంపిణీ చేశారు. ఆర్యసమాజం, బ్రహ్మసమాజం, రామకృష్ణమిషన్ వంటి ధార్మికసంస్థలు, స్వచ్ఛందసంస్థలు, సభలు ప్రజలను ఆదుకోవటానికి, వారికి ఆహారభద్రత కల్గించటానికి, వైద్య సదుపాయాలు అందుబాటులోకి తీసుకొని రావటానికి అవిరళకృషి చేశాయి.[13]

**ఆదుకోవటం మాట అలాఉంచి, ఆకలిచావులు కాదని దబాయింపు :**

ప్రజలసంక్షేమం పట్టని వలసపాలకులు అంకెల గారడీ చేయటంతో నిష్ణాతులు. 1943లో బెంగాల్ కఱవుపై బ్రిటీషు పార్లమెంటు చర్చలో పాల్గొంటూ ఆనాటి ఇండియా సెక్రటరీ ఆఫ్‌స్టేట్ అర్ధసత్యాలు, అసత్యాలు చెప్పాడు. ఆ కఱవులో 30 లక్షలకు పైగా చనిపోయారు. "గత 12 సంవత్సరాలలో భారతదేశజనాభా 6 కోట్లకు పైగా పెరిగింది. తలసరి బియ్యం ఉత్పత్తి బెంగాల్‌లో 384 పౌన్ల నుండి 283 పౌన్లకు (సుమారుగా 190 కి.గ్రా. నుండి 140 కి.గ్రా.లకు) గత 30 సంవత్సరాలలో పడిపోయింది. జనాభా పెరుగుదల కారణంగానే బెంగాల్ కఱవు ఏర్పడింది.[14] మాల్థస్ సిద్ధాంతీకరించిన విపత్తు ఏర్పడింది. అంతేకాని ప్రభుత్వం నిర్లక్ష్యం కారణంకాదని ఆయన చెపుతున్నారు. కొన్ని చావులు సహజమైన చావులే తప్ప, ఆకలిచావులు కానేకావని కూడా ఆయన దబాయించాడు. కాలం గడిచేకొద్దీ, బెంగాల్ కఱవులవలన మృతులసంఖ్య క్రమేపి పెరిగి 40 లక్షలు అయింది. విన్‌స్టన్ చర్చిల్ చేసిన ఘోరమైన నేరానికి ఆయన ఎప్పటికీ క్షమార్హుడు

కాదు. భారతీయులు ఆకలితో అలమటిస్తూ ఉంటే, దిక్కుదోచక నిస్సహాయులై, క్షుదార్తులై గుప్పెడుమెతుకుల కోసం అలమటిస్తున్న ఆ కఱవుకాలంలో భారతదేశంనుండి పెద్దపెట్టున ఆహారధాన్యాలను తరలించారు. తమ పట్టనితనాన్ని కప్పిపుచ్చుకొనేందుకు చర్చిల్ ఒక విచిత్రమైన వాదన లేవదీశారు. దృఢంగా ఉండే గ్రీకుల అవసరాలతో పోల్చితే అర్ధాకలికి అలవాటుపడ్డ బెంగాలీప్రజల అవసరాలు తక్కువ తీవ్రమైనవని ఆయన పార్లమెంటులో వాదన చేశారు. ఆయనదృష్టిలో వరుసగా ప్రైవేటు ఆంగ్లసైనికుల అవసరాలు (Tommies), ఇంగ్లండు ఆహార అవసరాలు, జర్మనీ ఆక్రమణ నుండి ఇంకా విముక్తంచెందని యుగోస్లేవియా, గ్రీకు ప్రజల ఆహార అవసరాలు ప్రాధాన్య క్రమంలో ముఖ్యమైనవి. అంతేతప్ప భారతప్రజల చావుబతుకులకు ఆ వరుసక్రమంలో చోటుదక్కలేదంటే చర్చిల్‌కు భారతదేశంపట్ల ఎంత చిన్నచూపు ఉన్నదో అర్థంచేసుకోవచ్చు. వారి చావులు, బ్రతుకులు పరిగణనలోకి తీసుకొనవలసిన అవసరం లేదని ఆయన భావించాడు.

భారతదేశంలో కఱవుతీవ్రతగురించి ఆయనకు పదేపదే జ్ఞప్తి చేసినపుడు, ఆయన స్పందన అమానుషంగా ఉంది. ఆవిధంగా ఆయనతప్ప మరెవ్వరూ స్పందించలేరు కూడ. "కుందేళ్ళలాగా పిల్లలను కంటే ఎవరుమాత్రం ఏమి చేయగలరు? కఱవుకు కారణం వారే. చేతులారా వారు చేసుకున్నదే". అని ఆయన స్పందించారు. కొందరు హృదయమున్న ఆంగ్ల అధికారులు కఱవు తీవ్రత గురించి, దాని కారణంగా జరుగుతున్న సామూహిక మరణాలగురించి టెలిగ్రామ్‌లు యిచ్చారు. చర్చిల్ వారికి యిచ్చిన సమాధానం "గాంధీ ఇంకా ఎందుకు చావలేదు?"

బెంగాల్ కఱవుమీద విస్తృత పరిశోధన చేపట్టిన మధుశ్రీ ముఖర్జీ ప్రకారం, భారతదేశపు ఆహారధాన్యాలను శ్రీలంకకు ఎగుమతిచేశారు. ఆస్ట్రేలియాకు చెందిన నౌకలు భారత సముద్రజలాలమీదుగానే మధ్యధరాసముద్రం మరియు బాల్కన్ దీవులలోని గిడ్డంగులకు గోదుమలను చేరవేశాయి. ఏ భారతనగరాలలో వీధులలో కుప్పలుతెప్పలుగా శవాలు దిక్కులేకుండా పడిఉన్నాయో ఆ నగరాల దరిదాపుల గుండానే సముద్రపు జలాలమీద నౌకలు గోదుమలను మోసుకువెళ్ళాయి. అంతేకాదు. అమెరికా, కెనడాలు భారతదేశానికి అందించదల్చుకొన్న సహాయాన్ని సైతం ఆంగ్లపాలకులు నిరాకరించారు. తమవద్దనున్న స్టెర్లింగు రిజర్వులను ఖర్చుపెట్టటానికి భారతదేశానికి అనుమతి లభించలేదు. కనీసం తన స్వంతనౌకలద్వారా ఆహారధాన్యాల దిగుమతికికూడా భారతదేశానికి అనుమతిని

యివ్వలేదు. యుద్ధం జరుగుతున్నది భారతఉపఖండంలో కాదు. పశ్చిమదేశాలమధ్య జరుగుతున్న యుద్ధంలో పాల్గొంటున్న ఆంగ్లసైనికుల ఆహార అవసరాలకు మించి, గోదుమలను పెద్దఎత్తున భారతదేశంలో ప్రభుత్వం సేకరించి, ఎగుమతి చేసింది. ఆహారధాన్యాలకు ఒక్కసారి డిమాండ్ పెరగటంతో వాటి ధరలకు రెక్కలు వచ్చాయి. నిత్యావసర వస్తువులకు తీవ్రకొఱత ఏర్పడింది. అవి సామాన్య భారతీయులకు అందుబాటులోకి లేకుండాపొయ్యాయి. యుద్ధవాతావరణంలో ప్రతివస్తువు ధర ఆకాశానికి ఎగిసింది. సామాన్యుల బ్రతుకు దుర్భరమైంది.[15]

1943 బెంగాల్ కఱవు సందర్భంగా భారతదేశంలోని ఆంగ్లఅధికారులు, ఇంగ్లండ్‌లోని ఆంగ్ల మంత్రులు పనిచేసిన తీరు నిశితంగా పరిశీలిస్తే, ఒక పెద్ద విపత్తు వాటిల్లినప్పుడు తన ఏలుబడిలోని నిస్సహాయ ప్రజలపట్ల వారు ప్రదర్శించిన ఉదాసీనత, నిర్లక్ష్యం, అహంకార ధోరణి అవగతం అవుతాయి. సాటి మానవుల పట్ల కనీస కనికరం లేకుండా ఒక 'మహాసామ్రాజ్యం' స్పందించిన తీరు మానవతకే మచ్చ. 'ప్రపంచాన్ని నాగరికంచేసే బాధ్యత' ను తనంతతానుగా భుజాలకు ఎత్తుకున్న శ్వేతజాతీయుల అహంకారం, అమానుషత్వం, జాతివివక్ష గతంలో వచ్చిన కఱవుకాటకాల సందర్భంగా బయటపడినా, 1943 కఱవుకాలంలో వాటిని సమగ్రంగా నిరూపించటానికి కావలసిన సాక్ష్యాధారాలు బలంగా దొరికాయి.

బెంగాల్ కఱవుకు దారితీసిన పరిస్థితులను వలసపాలకులే సృష్టించారు. భారతనాయకత్వంతో ప్రజలతో సంప్రదించకుండానే యుద్ధంలోకి భారతదేశాన్ని దింపారు. యుద్ధానికి అయ్యే వ్యయంలో వీలైనంత ఎక్కువశాతాన్ని భారతదేశంమీద రుద్దే ఉద్దేశ్యంతోనే ఆ పనిచేశారు. భారతదేశపు ఆహారధాన్యాలను వాటిని పండించిన రైతుకూలీలకు సైతం తినటానికి కూడా లేకుండా చేసి, ఇంగ్లండ్‌కు తరలించారు. ఇదంతా ఒక ఎత్తు అయితే సెక్రటరీ ఆఫ్ స్టేట్ అమ్రీకు, ప్రధాని చర్చిల్‌కు మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు, చర్చలు మరొక ఎత్తు. చర్చిల్‌కు యుద్ధంలో విజయం సాధించటం తప్ప మరేది పట్టలేదు. ఆయన సహాయకుడు పేమాస్టర్-జనరల్ లార్డ్ షెర్వెల్ (Cherwell) జాతివివక్షకు మారుపేరు. కఱవు సహాయక చర్యలకు నిధులు విడుదల చెయ్యలేదు. అంతేకాక అనేక లక్షలమంది చావులకు కారణమైన లాజిస్టికల్ నిర్ణయాలకు ఆయనే కారణం. రెండువందల సంవత్సరాల క్రూరత్వానికి, అమానుషత్వానికి పై సంఘటనలు ఉదాహరణలు మాత్రమే. ఆంగ్లేయుల ఉదాసీనత, జాతివివక్షకు సంబంధించిన సాక్ష్యాధారాలు అంతకుముందు సంభవించిన

ఆంగ్లేయుల ఏలుబడి-అంతులేని దోపిడీ

భయంకర కఱువుల సందర్భాలకంటె 1943 కఱువు సందర్భంగా విపులంగా నమోదు అయ్యాయి. (ఉదా : అంగర వెంకట కృష్ణారావుగారి 'విరామం' నవల) అంతకుముందు వచ్చిన భయంకర కఱువు కాటకాలకు, 1943లో వచ్చిన కఱువుకు అదే ముఖ్యమైన తేడా.[16]

## అంటువ్యాధులు ప్రబలినప్పుడు కూడా అమానుషత్వమే :

కఱువుకాటకాలు సందర్భంగా మాత్రమే వారి అమానుషత్వం, జాతి వివక్ష బయటపడలేదు. అంటువ్యాధులు ప్రబలినప్పుడుసైతం వారి ప్రవర్తన అదేవిధంగా ఉండేది. చరిత్రకారుడు విల్‌డ్యూరాంట్ ప్రకారం 1901లో ప్లేగువ్యాధివల్ల 2,72,000 మంది చనిపోగా, 1902లో 5,00,000 మంది, 1903లో 8,00,000 మృత్యువాతపడగా, 1904లో ఏకంగా పదిలక్షలమంది అసువులు బాసారు. 1918లో వచ్చిన స్పానిష్ ఇన్‌ఫ్లూయింజా వలన 12.5 కోట్ల మందికి ఫ్లూజ్వరం సోకింది. 1.25 కోట్ల మంది చనిపొయ్యారు. ఆనాడు ఉన్న జనాభాలో మూడవవంతుకు ఫ్లూజ్వరం సోకింది. మరణాలరేటు మిగిలిన అన్ని దేశాలకంటె భారతదేశంలోనే అత్యధికం. కానీ ఆ మరణాలనుకూడా ప్రభుత్వం తీవ్రంగా తీసుకోలేదు. అధికజనాభాకు దేవుడు చూపించిన మార్గంగా వారు ఆ తీవ్రసంక్షోభాన్ని వర్ణించారు. అమెరికన్ నేత బ్రీయాన్ (Bryan) ఇలా వ్యాఖ్యానించాడు "ఇది చాలా విచిత్రం. ప్రజలు ఒకరినొకరు చంపుకోకుండా ఉండేందుకు వలసపాలన అవసరమని ఆంగ్లేయులు తమపాలనను సమర్థించుకొన్నారు. కాని ఎవరినైతే చంపబడకుండా కాపాడామని వారు చెప్పుకున్నారో ఆ ప్రజలే ప్లేగుబారిన పడి మరణిస్తుంటే వినోదంగా చూశారు".[17]

అంటువ్యాధులు ప్రబలినపుడు, వాటి వ్యాప్తిని అరికట్టటానికి ప్రభుత్వాలు చేయవలసిన దల్లా చెయ్యాలి. కానీ వలసపాలకులు ఆ పని చెయ్యలేదు. చెయ్యగలిగి ఉండి చెయ్యవలసినది చెయ్యకపోవటం ఘోరమైన నేరం. 'ప్రజారోగ్యం'ను అభివృద్ధి చేసామని గొప్పలు చెప్పుకొనే ఆంగ్లపాలకుల పాలనలో అంటువ్యాధులతో ప్రజలు పిట్టల్లా రాలిపోతే అసలు పట్టించుకోలేదు. అందరికీ టీకాలు వేసి, మశూచివ్యాధిని అరికట్టటానికి అవకాశాలు ఉన్నా ఆ పని చెయ్యలేదు. స్వతంత్రం వచ్చిన తర్వాతే ప్రజలందరికీ టీకాలువేసి మశూచివ్యాధిని అరికట్టారు. శుద్ధమైన త్రాగునీటిని సరఫరా చేయటంలో నిర్లక్ష్యంవల్ల లక్షలాదిమంది కలరావ్యాధి బారినపడి చనిపొయ్యారు.

వైద్యసదుపాయాలు, ఆసుపత్రులు విస్తరించలేదు. ఇప్పుడు మనకు కన్పడుతున్న పూర్వకాలపు పెద్ద ఆసుపత్రులు అన్నీ భారతీయుల వదాన్యతతో కట్టినవే. కాని వాటికి కావలసిన అనుమతులకోసం వలసపాలకుల పేర్లే పెట్టటంతో, ఆ ఆసుపత్రులన్నీ ఆంగ్లేయులు కట్టించారని మనం అనుకొంటున్నాం.

**ఖైదీలతో వెట్టిచాకిరి :**

ఆంగ్లేయులు మంచి వ్యాపారదృష్టి కలవారు. స్వంతలాభానికి మించినది ఏదీలేదని వారి ప్రగాఢవిశ్వాసం. స్వంతలాభంకోసం ఎంతకైనా తెగిస్తారు. ఉచ్చనీచాలు, నైతికవిలువలు, మానవవిలువలు, కరుణ, దయ మొదలైన వాటిపట్ల వారికి ఎన్నడూ పట్టింపులేదు. వారి దృష్టిలో వ్యాపారానికి అర్హం కానిదంటూ ఏదీ లేదు. అందుకే ఆఫ్రికాఖండంమీద పడి నల్లజాతీయులను వేటాడి, పట్టి, అక్రమంగా ఖండాంతరాలకు తరలించి, బానిసల వ్యాపారం చేసి, కోట్లు గడించారు. అలాంటి వ్యాపారమే వారికి మరొకటి ఉంది. అది ఖైదీల వ్యాపారం. ఇంగ్లాండ్ జైళ్ళలో కరుడుగట్టిన నేరాలు చేసి, శిక్షలు అనుభవిస్తున్న వారితోపాటుగా, చిన్నా చితక నేరాలు చేసి శిక్ష అనుభవిస్తున్నవారు ఎందరో ఉండేవారు. ఆ శతాబ్దాలలో జైళ్ళన్నీ నేరస్థులతో క్రిక్కిరిసి ఉండేవి. వారిని జైళ్ళలో ఉంచటంకంటె, కొత్తగా తమ అధీనంలోకి తెచ్చుకున్న వలసదేశాలకు వారిని రవాణాచేసి, వారిచేత అక్కడ అడవులు నరికించటం, రహదారులను నిర్మించటం, కాఫీ, రబ్బరు, పత్తితోటల్లో పనిచేయించటం వారిని వృధాగా జైళ్ళలో పోషించటం కంటె మెరుగైనదిగా వారికి అన్పించింది. అంతే, ఖైదీల యిష్టాయిష్టాలతో పనిలేకుండా తమ వలసదేశాలకు, కాలనీలకు వారిని బలవంతంగా తరలించారు. ఈ తరలింపును కూడా వ్యాపారంగా మార్చుకున్నారు. వ్యాపారులు ఖైదీల దేహదారుఢ్యాన్నిబట్టి వారికి ముందుగా మూల్యం చెల్లించేవారు. వారందరినీ అత్యంత కట్టుదిట్టమైన భద్రతతో నౌకలమీద వలసప్రాంతాలకు, ద్వీపాలకు తీసుకొనివెళ్ళి, అక్కడ బహిరంగంగా వేలంవేసేవారు. ఆ ప్రాంతాలలో స్థిరపడ్డ శ్వేతజాతీయులైన తోటల పెంపకందార్లు వారిని కొనుక్కునేవారు. లేదా ప్రభుత్వం ప్రతినిధులే వారిచేత రహదారులు నిర్మింపచేసేవారు. గనులు త్రవ్వించేవారు. ప్రమాదకరమైన పనులకు వారిని వాడుకొనేవారు.

అమెరికాను వలసదేశంగా చేసుకొనే ప్రయత్నాలు 16వ శతాబ్దంనుండి మొదలయ్యాయి. ఇంగ్లాండ్, హాలెండ్, ఫ్రాన్సు, స్పెయిన్ దేశాల మధ్య తీవ్రమైన

పోటీ నెలకొన్నది. కాలక్రమంలో ఇంగ్లాండ్‌దే పైచేయి అయింది. అమెరికాలోని తన అధీనంలోఉన్న ప్రాంతాలకు ఇంగ్లాండ్ ఖైదీలను పెద్దపెట్టున తరలించింది. మేరీలాండ్, వర్జీనియా రాష్ట్రాలకు తొలినాళ్ళలో ఎక్కువమంది ఖైదీలను అక్రమంగా రవాణా చేశారు. జార్జియాలో ఒక ప్రత్యేకమైన కాలనీపేరు 'ఋణగ్రహీతల కాలనీ (Debtors Colony)' ఋణాలు తీర్చలేని ఆంగ్లేయులను ఆ కాలనీకి తరలించి, వారి ఋణంతీరేవరకు వారిచేత పనిచేయించేవారు. 18వ శతాబ్దంలో అమెరికాలో ఉన్న బ్రిటీష వలసదారులలో నాల్గవవంతుమంది నేరస్థులే. వివిధ నేరాలకింద శిక్ష అనుభవిస్తున్న ఖైదీలే.

1776లో అమెరికా స్వాతంత్ర్యం తరువాతకూడా కొంతకాలంపాటు అమెరికాపై ఇంగ్లాండ్ పట్టు కొనసాగింది. ఆ తర్వాత ఇంగ్లాండ్‌లోని ఖైదీలను నేటి ఆస్ట్రేలియా ఖండానికి తరలించటం మొదలుపెట్టారు. క్వీన్సులాండ్, న్యూసౌత్‌వేల్సు, నార్ఫోల్క్‌ఐలాండ్ మొదలయినవి అట్లా ప్రారంభం అయిన నేరస్థుల కాలనీలే. అమెరికా, ఆస్ట్రేలియాలలో మౌలికవసతుల అభివృద్ధిలో ఈ నేరస్థులైన ఖైదీలపాత్ర ప్రధానమైంది. నేరస్థులే లేకుంటే ఆస్ట్రేలియా వలసీకరణ వేగం పుంజుకొనేది కాదని చరిత్రకారులు చెప్తుంటారు. బెర్ముడా ద్వీపాన్ని ఇంగ్లాండ్ చేజిక్కించుకొన్నతర్వాత ఖైదీలను తరలించి వారిచేత పెద్ద డాక్‌యార్డ్‌ను నిర్మింపచేసింది. అండమాన్ ద్వీపం, సింగపూర్, హాంగ్‌కాంగ్‌లు కూడా కాలక్రమంలో ద్వీపాంతరవాస శిక్షలు విధింపబడ్డవారికి కేంద్రాలు అయ్యాయి.

అమెరికన్, కరేబియన్ దీవులకు ఏవిధంగా నేరస్థులను తరలించారో, అదే విధంగా భారతదేశం నుండి ఖైదీలను కూడా అక్రమంగా తరలించటం మొదలుపెట్టారు. 1787 నుండి భారతజైళ్ళలో రకరకాల కాలపరిమితుల శిక్షలు అనుభవిస్తున్న ఖైదీలను తొలినాళ్ళలో ఆగ్నేయఆసియాలోని అలాంటి నేరస్థుల కాలనీలకు తరలించారు. బెన్‌కూలెన్, సుమిత్రాదీవులకు, ప్రిన్స్ ఆఫ్ వేల్సు ఐలాండ్‌గా పేరుమార్చబడ్డ పెనాంగ్ (Penang), మలేషియా, మలక్కా సింగపూర్, బర్మాలకు పెద్దపెట్టున భారతీయులను వారి ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా బలప్రయోగం చేసి నౌకలు ఎక్కించి తరలించారు. వారిచేత ఆ దీవులలో జనావాసాలు ఏర్పాటు చేయటానికి వీలుగా అడవులు నరికించారు. రహదార్లను నిర్మింపచేశారు. ఇదంతా బలప్రయోగంతోనే సుమా. సింగపూర్‌లో భారతీయఖైదీలకు విపరీతమయిన డిమాండ్ ఉండేది. వారిని 'బోటనీ బేస్ ఆఫ్

ఇండియా' అని పిలిచేవారు. అలాగే మలేషియాకు వాయవ్యప్రాంతంలో ఉన్న పెనాంగ్‌ను పూర్తిగా వలసకు అనుకూలంగా చేయటంలో భారతీయఖైదీల పాత్రఎంతోఉంది. నేరం రుజువు కాబడ్డవారి (Convicts) శ్రమమీదే ఆ ద్వీపం అభివృద్ధి చెందింది. 1852-54 మధ్య కూలీరేట్లు అక్కడ 30 శాతం పెరగటంతో 'స్ట్రెయిట్ సెటిల్‌మెంట్'లోని ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వం భారతదేశంనుండి అక్రమంగా రవాణా చేయబడుతున్న ఖైదీలమీదే ఎక్కువగా ఆధారపడింది. 1825-72 మధ్య సింగపూర్‌లోని ముఖ్యమైన ప్రజోపయోగ ప్రాజెక్టులన్నీ భారతదేశంనుండి తరలించబడ్డ ఖైదీలశ్రమతోనే ప్రారంభమై, పూర్తిఅయ్యాయి. స్ట్రెయిట్ సెటిల్‌మెంటు, పెనాంగ్, ప్రస్తుత మలేషియాలో భాగంగా ఉన్నాయి. సింగపూర్ 1965 నుండి మలేషియా ఫెడరేషన్‌నుండి విడిపడి ప్రత్యేక స్వతంత్రదేశమైంది.[18]

**కట్టు బానిసత్వం :**

వలసపాలనాకాలంలో కట్టుబానిసత్వం ఏళ్ళతరబడి కొనసాగింది. కట్టుబానిసత్వం ఆంగ్లేయుల పాలనాకాలంలో ఉన్నదంటే చాలామంది నమ్మరు. వేలాదిమంది భారతీయులను ఆంగ్లేయులు కట్టుబానిసలుగా చేశారు. అందుకు వారు ఎంచుకొన్న విధానం పైకి ఐచ్ఛికంగా కనిపించేది. కూలీ బానిసలు 'ఒప్పందం'మీద తీసుకొనిరాబడినా, లేక ఐచ్ఛికంగా వారంతట వారే వచ్చినా, వచ్చినవారందరూ ఆంగ్ల పెత్తందార్లకు బందీలుగానే దుర్భరజీవితం గడిపారు.

ఇంతకుముందు వ్రాసినట్లుగా కేవలం ఘోరాలు-నేరాలు చేసి శిక్షలు అనుభవిస్తున్న వారినే కాక, చిన్న దొంగతనాలు చేసినవారిని, చిన్నచిన్న నేరాలకు పాల్పడి శిక్షలు అనుభవిస్తున్నవారిని సైతం బలవంతంగా నౌకలు ఎక్కించి వలసదీవులకు అక్రమరంగా రవాణా చేయసాగారు. ఫ్రెంచివారినుండి మారిషస్‌ను స్వాధీనపర్చుకున్నాక, మారిషస్‌కు పెద్దపెట్టున భారతఖైదీలను తరలించారు. మలేషియాలో తోటలపెంపకం ఆర్థికవ్యవస్థ (Plantation Economy) అంతా ఈస్టిండియా కంపెనీ చేతుల్లోకి వచ్చింది. బానిసలచేత అక్కడ వెట్టిచాకిరీ చేయించేవారు. బానిసత్వాన్ని రద్దుచేస్తూ చట్టాలు వచ్చాక వేలమందికి బానిసతనంనుండి విముక్తి లభించింది. అయితే ఇందువలన కూలీలకు విపరీతమైన కొరత ఏర్పడింది. తోటలలో పనిచేయటానికి భారతదేశంనుండి ఖైదీలను తరలించారు.

అయితే కేవలం ఖైదీలతోనే ఆ కొఱత తీరలేదు. దానితో మరో కొత్తపద్ధతికి ఈస్టిండియా కంపెనీ తెరతీసింది[19].

మలేషియా, సిలోన్, బర్మా మొదలైన దేశాలలో పనిచేయటానికి యిష్టపడే కార్మికులతో ఒప్పందం చేసుకొని, వారిని ఆ ప్రాంతాలకు రవాణా చేసింది. ఉదాహరణకు 1838లో 25వేలమంది భారతీయులను ఆవిధంగా మలేషియాకు తెచ్చారు. 1843లో 30,218 మగకూలీలను, 4,307 ఆడకూలీలను భారతదేశంనుండి తరలించారు. ఐదు సంవత్సరాలు కనీసం పనిచేసేందుకు వీరితో ఒప్పందం కుదుర్చుకున్నారు. అందుకే వారిని ఒప్పందకూలీలు అని పిలుస్తారు (Indentured Labour). ఒప్పంద కాల పరిమితి ముగిశాక కూడా మలేషియాలో పనిచేయటానికి మగకూలీలకు ఆకర్షణగా ఆడకూలీలను తీసుకొనివచ్చారు. 1868లో నిబంధనలను సరళతరం చేసి ప్రతి 100మంది మగకూలీలకు కనీసం 40 మంది ఆడకూలీలను ఉండేటట్లుగా కూలీలను మనదేశంనుండి తరలించారు. కాలక్రమంలో షుమారుగా 5 లక్షలమంది కూలీలను భారతదేశంనుండి ఆవిధంగా రవాణా చేశారు. వీరిలో అత్యధికులు బలవంతాన తీసుకొని రాబడిన వారే. వారిని ప్రలోభపెట్టి, భయపెట్టి వారి సమ్మతిని తీసుకొన్నారు. వారంతట వారే స్వచ్ఛందంగా వచ్చినా లేక ఒప్పందకార్మికుల రూపంలో తీసుకొనిరాబడినా, బానిసలుగా పట్టుబడటం మూలాన తరలించబడినా కూలీలు అందరూ ఆంగ్ల పెత్తందార్లకు బందీలే. శ్రమదోపిడీకి నిలువెత్తు ఉదాహరణలు మలేషియాకు, ఇతరదేశాలకు తీసుకొని రాబడిన భారతీయ కార్మికుల జీవితాలు.[20]

అండమాన్‌లో ఒక నేరస్థుల కాలనీని అదేవిధంగా నిర్మించారు. నేరం రుజువై శిక్షార్హులైన వారిని, శిక్షలు అనుభవిస్తున్న వారిని అండమాన్ తరలించేవారు. మొదటగా 700 మందిని అండమాన్ తరలించి, ఆ తర్వాత పెనాంగ్‌లో కూలీల కొఱత ఏర్పడినపుడు 1796లో అక్కడకు తరలించారు. 1860వ దశకంలో స్ట్రెయిట్స్ సెటిల్‌మెంటు బ్రిటీష్ ఇండియానుండి విడిపోయిన తర్వాత, వారి దృష్టి అండమాన్‌మీద కేంద్రీకరించారు. రాజకీయ ఖైదీలలో ప్రమాదకరమైన వ్యక్తులకు ద్వీపాంతరవాస శిక్షవేసి అండమాన్ జైళ్ళలో ఏళ్ళ తరబడి నిర్బంధించేవారు. స్ట్రెయిట్స్ సెటిల్‌మెంటు, మారిషస్‌తో పాటుగా ప్రపంచవ్యాప్తంగా ఉన్న తమ వలస దేశాలకు భారతదేశంనుండి కూలీలను పెద్దపెట్టున ఆంగ్లేయులు తరలించారు. గయానా, కరేబియన్ దీవులు మొదలుకొని దక్షిణ ఆఫ్రికా,

ఫిజీద్వీపాలకు ఒప్పందకార్మికుల పేరుతో కార్మికులను రవాణా చేశారు. షుమారుగా 19 లక్షలనుండి 35 లక్షలమంది ఆవిధంగా ప్రపంచవ్యాప్తంగా భారతదేశంనుండి తరలించబడ్డారు. ఈ కూలీల తరలింపు ఒకపెద్ద వలసప్రాజెక్టు. ఆఫ్రికానుండి నల్లజాతీయులను తరలించినట్లు, భారతదేశంనుండి గోదుమవర్ణీయులను తరలించారు. వారిని బానిసలు అనిపిలిచారు. వీరిని ఒప్పందకూలీలు అని పిలిచారు. పేరులోనే తప్ప మిగిలిన అన్ని అంశాలలో ఆంగ్లపాలకులు వీరిమధ్య తేడా చూడలేదు.

ప్రపంచవ్యాప్తంగా ఆంగ్లేయులకు ఉన్న పంచదార, పత్తి, రబ్బరు తోటల్లోనూ వారు శ్రమించారు. వారు నివాసం ఉండటానికి అందమైన భవనాలు కట్టారు. అడవులు నరికారు, నీటి కాలువలు తవ్వారు. నదులపై ఆనకట్టలు కట్టారు. రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యవాదుల ఆర్థికదోపిడీకి దేశంకాని దేశాలలో తమ సమస్తమూ పోగొట్టుకొన్నారు. తమ శ్రమవిలువను వారు దోచుకుంటున్నా ఇదేమిటని ప్రశ్నించ వీలులేని నిస్సహాయులై పొయ్యారు.

సముద్రజలాలమీద నెలలకొద్దీ ప్రయాణాలు అలవాటులేని అనేకమంది ప్రయాణంమధ్యలో ప్రాణాలు వదిలేవారు. మిగిలినవారు ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని భయంతో, అర్ధాకలితో ప్రయాణం చేయవలసి వచ్చేది. ప్రొఫెసర్ క్లేర్ అండర్సన్ ఇటీవల కాలంలో ఈ విషయమై చేసిన పరిశోధనలో అనేక భయంకరసత్యాలు వెలుగులోకి వచ్చాయి. 1856-57లో కలకత్తానుండి దక్షిణ అమెరికాఖండంలోని వెనిజులా దేశానికి దగ్గఱగా ఉన్న ట్రినిడాడ్ (Trinidad) దీవులకు తరలించబడ్డ మగకూలీలలో 12.3 శాతం, మగపిల్లల్లో 28 శాతం, ఆడపిల్లల్లో 36 శాతంమంది మార్గమధ్యమంలోనే మరణించారని వెలికితీశారు. ఆఫ్రికాఖండంనుండి అట్లాంటిక్ మీదుగా తరలించబడుతున్న బానిసలలో మరణశాతం 12.5 శాతం. అట్లాంటిక్ బానిసవ్యాపారం ముమ్మరంగా జరిగే శతాబ్దాలలో ఆఫ్రికానుండి నల్లజాతీయులను అపహరించి, కొత్తగా కనుగొన్న ప్రపంచానికి అమ్మివేసేవారు. ఈ వ్యాపారంలో మూడుదశలు ఉన్నాయి. మొదటిదశలో పట్టుబడ్డ నల్లజాతీయులను ఆఫ్రికా రేవులకు తరలించటం. చివరిదశ వారిని ఒక గమ్యస్థానపు రేవులో దించి (ఛార్లెస్టన్) అక్కడనుండి వేరువేరు ప్రాంతాలకు చేరవేయటం. ఈ రెంటికీ అనుసంధానం అట్లాంటిక్ సముద్రంమీదగా బానిసల తరలింపు. దీనిని మిడిల్ పాసేజి (Middle Passage) అని అనేవారు. ఈ మిడిల్ పాసేజీలోనే అనేక ఘోరాలు జరిగేవి. షుమారుగా 12.5 శాతంమంది

చనిపోయేవారని అంచనా. భారతదేశంనుండి కరేబియన్ దీవులకు బ్రిటీషునౌకలద్వారా తరలించబడ్డ ఒప్పందకార్మికులలో మార్గమధ్యంలోనే చనిపోయినవారి శాతం ఆఫ్రికా ఖండంనుండి అట్లాంటిక్ సముద్రజలాలమీద తరలించబడ్డ బానిసల మరణ శాతం కంటె ఎక్కువ! ఎంత దారుణమైన పరిస్థితులు ఆనాడు నెలకొన్నాయో చూడండి.

ఆ విధంగా అక్రమంగా రవాణా చేయబడ్డవారికి తమవారితో బంధం తెగిపొయ్యేది. ఒకసారి ఓడలోకి ఎక్కిన తర్వాత తిరిగి స్వదేశం రాగలగటం అసాధ్యమని వారికప్పుడు తెలిసేదికాదు. ఐదు సంవత్సరాల కట్టుబానిసతనం తర్వాత తిరిగి వచ్చేందుకు ఒప్పందంమేరకు వారికి హక్కు ఉన్నది. కాని అది కాగితాలకే పరిమితం. వారు ఐదుసంవత్సరాలలో సంపాదించిన మొత్తమంతా వ్యయంచేసినా భారతదేశానికి రావటానికి సరిపోదు. అనేక కఠినమైన నియమ నిబంధనలు ఉండేవి. ఒప్పందం గడువు ముగియటానికి 6 నెలలు ముందుగా వెళ్ళేందుకు అనుమతిని అడగాలి. గడువులోపల అనుమతికి అభ్యర్థన చెయ్యలేకపోతే, ఆ తర్వాత చేసినా ఫలితం ఉండదు. సకాలంలో చేసిన అభ్యర్థనలకే దిక్కు ఉండేదికాదు. అదృష్టవశాత్తూ ఏ కొద్దిమందో ఏదో విధంగా భారతదేశం తిరిగి చేరి ఉంటారు తప్ప, సాధారణంగా ఒప్పంద కూలీలు గడువు ముగియగానే వచ్చిన సందర్భాలు లేవు.

1519-1939 మధ్య 53 లక్షల మందిని బానిసలుగా పట్టుకున్నారని ఒక అంచనా. ఆఫ్రికా ఖండంనుండి తరలించబడ్డ నల్లబానిసలు ఈ సంఖ్యకు అదనం. మొత్తం బానిసలలో 36 శాతం మంది భారతదేశంనుండి తరలించబడ్డ ఒప్పందకూలీలు కాగా, 6 శాతంమంది భారతదేశంనుండి, ఇతరదేశాలనుండి తరలించబడ్డ శిక్షపడ్డఖైదీలు అని అంచనా వేశారు. బ్రిటీషువారు చేసిన ఈ అక్రమ మానవులరవాణా కారణంగా అనేకదేశాలజనాభా, రూపురేఖలు మారిపొయ్యాయి. తరలించబడ్డ 'విదేశీయులకు' ఆ ద్వీపాలలో ఎప్పటినుండో ఉంటున్న వారిమధ్య ఘర్షణలు నిత్యకృత్యమయ్యాయి. వారు రగిలించిన జాతి వైరుధ్యపు మంటలు ఇంకా మండుతూనే ఉన్నాయి.[21]

వలసపాలన కారణంగా పేదరికంలోకి నెట్టివెయ్యబడ్డ అనేకమంది స్వగ్రామంలో, స్వదేశంలో పనులులేక ఒప్పందకూలీ లయ్యారు. గంజాయిసాగుకోసం తమ సారవంతమైన భూములనుండి తరిమివేయబడ్డ వేలాదిమంది రైతులు సైతం పూటగడవక తమకు తెలియని ద్వీపాలలో పనిచేయటానికి సిద్ధమయ్యారు. 1857లో

జరిగిన ప్రథమస్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న అనేకమంది సిపాయిలు బ్రిటీషువారి అణచివేత తట్టుకోలేక దేశంవిడిచి పారిపొయ్యారు. అట్టివారిలో కొందరు బ్రతుకు తెరువుకై ఒప్పందకూలీ లయ్యారు. ఆంగ్లేయులకు ఎవరైనా ఒకటే. కరుడుగట్టిన నేరస్థులైనా, నిరాశ్రయులైన రైతులైనా, తిరుగుబాటుదారులైనా–ఎవరైనాసరే, వారికి కావలసింది చౌకగా దొరికే కూలీలు. శ్రమదోపిడిని వ్యతిరేకించలేని నిస్సహాయులు, నిరుపేదలు. వారి కుటుంబాల నుండి, వారి గ్రామాలనుండి, వారి భూములనుండి, వారిదేశంనుండి, సంస్కృతినుండి నిస్సహాయులను, నిరాశ్రయులను, నిరుపేదలను వేఱుచేసిన నేరంనుండి తెల్లదొరలు ఎన్నితరాలు మారినా తప్పించుకోలేరు.

**వలసపాలకుల హింసోన్మాదం :**

ఆంగ్ల చక్రవర్తులు తమనుతాము 'ఔదార్య నియంత'లుగా పేర్కొంటారు. ప్రజల క్షేమంకోసం నిరంతరం శ్రమించే ఉదారవాదులైన చక్రవర్తులుగా వారిని కొందరు కీర్తిస్తుంటారు కూడా. కానీ 1943లో భారతదేశంలో భీకరమైన కఱవు వచ్చినప్పుడు, ప్రధాని చర్చిల్ కనపర్చిన అహంభావపూరిత, అమానుష, అనాగరిక ప్రవర్తనతో వారు ఎలాంటి పాలకులో లోకానికి వెల్లడి అయింది. అయినప్పటికీ తమది ఉదార పాలన అని వలసపాలకులు అంతకుముందు రెండువందల సంవత్సరాల నుండి డప్పువాయించు కొంటున్నారు. కేవలం రాజనీతితో, కుటిలతతో, శౌర్యంతో మాత్రమే వారు విజయం సాధించలేదు. తీవ్రమైన హింస, అణచివేత, చిత్రహింసలు, ఉరితీ తలు వారు ఈ దేశంలో స్థిరపడటానికి, రెండు శతాబ్దాలపాటు వలసదోపిడీని విరామంలేకుండా సాగించటానికి తోడ్పడ్డాయి. ఎప్పుడెప్పుడు అసంతృప్తి మొదలైనా, దానిని తీవ్రంగా అణచివేసారు. తిరుగుబాటుదారులను బహిరంగంగా ఉరితీసేవారు. అందరూ చూస్తుండగానే వరుసగా నిలబెట్టి ఫిరంగి మూతులకు కట్టి, వాటిని ప్రేల్చి వారిని చంపేవారు. భారతీయ వస్త్ర ఉత్పత్తులతో పోటీపడలేక, ఎంతోసున్నితమైన, నాజూకయిన, మన్నికయిన వస్త్రాలు నేసిన ఉత్పత్తిదారుల చేతులవ్రేళ్ళను నిర్దాక్షిణ్యంగా కత్తిరించిన కరుడుగట్టిన నేరస్థులు తెల్లదొరలు. 1857లో వచ్చిన భారతస్వాతంత్ర సంగ్రామాన్ని చాలా పాశవికంగా అణచివేశారు. గ్రామాలకు గ్రామాలను తగులబెట్టారు. చిన్నా, పెద్దా, ఆడ, మగ, అన్నతేడా లేకుండా ఆ మహాసంగ్రామంలో పాల్గొన్నవారిని, మద్దతు యిచ్చిన వారిని ఫిరంగుల మూతులకు కట్టి వారిశరీరాలను ముక్కలుముక్కలుగా ఛిద్రంచేస్తే కాని వారి కసి తీరలేదు.

స్త్రీలను, పిల్లలను సామూహికంగా హత్యచేశారు. హింసోన్మాదంలో ఘోరీ, గజనీ, తైమూరులను మించినవారు తెల్లవారు. షుమారుగా లక్షమందిని ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామ సందర్భంగా వారు బలిగొన్నారు.

ఆంగ్లేయులు పైకి నెమ్మదిగా కన్పిస్తారు. సాధారణంగా ఉంటారు. కానీ జిత్తులమారితనంలో వారిని మించినవారు మరెవ్వరూ ఉండరు. వారి వ్యాపార ప్రయోజనాలను కాపాడుకోవటానికి వారు ఎంతకైనా తెగించటమేకాక, మోతాదుకు మించి హింసను ప్రయోగిస్తారు. బెల్జియన్లు కాంగో దేశంలో చేసిన హింస చరిత్రప్రసిద్ధం. లియోపోల్డ్ అనుచరులు, ఆయన ఆదేశంతో కాంగోలమీద చేయని అత్యాచారం అంటూ లేదు. నిర్దేశించిన లక్ష్యంమేరకు రబ్బరు సేకరించటంలో విఫలమయిన స్త్రీ పురుషులను, పిల్లలను చిత్రహింసలు పెట్టేవారు. కాల్చి చంపేవారు. వారి చేతులను నిర్దాక్షిణ్యంగా నరికి, వారిని శాశ్వతంగా వికలాంగులుగా చేసేవారు. బెల్జియన్లు చేసిన హత్యాకాండలో 1.5 కోట్ల కాంగోప్రజలు ప్రాణాలు కోల్పోయారు. భయోత్పాతం సృష్టించటం సామ్రాజ్యవాదంలో ఒక వ్యూహం. రాక్షసత్వం, తీవ్రహింసలతోనే సామ్రాజ్యవాదం విస్తరించింది. ఆంగ్ల సామ్రాజ్యవిస్తరణకు కూడా అవే సాధనాలు అయ్యాయి. బలప్రయోగంతోనే పరిస్థితులను తమకు అనుకూలంగా మార్చుకోవచ్చునని వారు వివిధ ఖండాలలో విస్తరించినపుడు తెలుసుకొన్నారు. వలసీకరణలో హింసకు ఎంతో ప్రాధాన్యం ఉంది. వారిదగ్గర ఉన్న మెరుగైన మారణాయుధాలు, ఒకేసారి అనేకమందిని కాల్చిచంపగల మరఫిరంగులతోనే తమకు ఎన్నడూ హానిచేయగల స్థితిలోలేని అనేక శాంతికాముక, అమాయక జాతులను తమ పాదాక్రాంతం చేసుకోగలిగారు. వ్యాపార ప్రయోజనంకోసం కావచ్చు, రాజకీయ ప్రయోజనంకోసం కావచ్చు. మోతాదుకు మించిన హింసనే వారు ప్రయోగించారు. ఈస్టిండియా కంపెనీ విస్తరణ తొలినాళ్ళలో మొదలయిన హింసను వారెన్నడూ వదలలేదు. అంతేకాదు. హింసాత్మక పద్ధతులను మెరుగుపర్చారు. హింసకు ఉపయోగించిన ఆయుధాలనూ మెరుగుపర్చారు. సామూహిక హత్యాకాండ వారెన్నుకొన్న మార్గం. భయోత్పాతం సృష్టించటం వారి వ్యూహంలో భాగం మాత్రమేకాదు. అనేకసార్లు అదే లక్ష్యంగా కూడా చేసుకున్నారు.[22]

**సామూహిక హత్యాకాండతో అణచివేత :**

1721లో మలబారుతీరంలో 'అట్టింగల్' తిరుగుబాటు జరిగింది. ఆంగ్ల

వ్యాపారులకు వ్యతిరేకంగా జరిగిన మొట్టమొదటి తిరుగుబాటు అది. స్థానికులతో అహంకారపూరితంగా వ్యవహరించటం, మిరియాల ధరల పెరుగుదలను అరికట్టటానికి ప్రయత్నించటం ప్రజల ఆగ్రహానికి కారణమైంది. స్థానిక ప్రజలు ఈస్టిండియా కంపెనీ కోటలోకి ప్రవేశించి అక్కడ ఉన్న ఆంగ్లేయు లందర్నీ చంపివేశారు. దానితో పెద్దసైన్యాన్ని సమకూర్చుకొని తిరుగుబాటుదారులనే కాక, సామాన్య ప్రజలను సైతం సామూహికంగా చంపివేశారు. మలబార్‌తీరంలో తీవ్రమైన దారుణమారణ కాండకు ఆంగ్లేయులు పాల్పడ్డారు. భారతీయులు తమపై మరెప్పుడూ తిరుగుబాటు చేయటానికి సాహసించలేని స్థితిలోకి వారిని నెట్టివేసారు. వారి ప్రతిహింస ఆ స్థాయిలో ఉండేది. మామూలుగానే మోతాదుకుమించిన హింసకు వారు అలవాటుపడ్డారు. ఇప్పుడు వారి మీద తిరుగుబాటు జరిగింది. తిరుగుబాటు దారులపట్ల క్రౌర్యంతో వ్యవహరించకపోతే, మరికొన్ని తిరుగుబాట్లు జరుగుతాయి. కనుక హింసోన్మాదం హద్దులు దాటింది.

సంప్రదింపులకంటె బెదిరింపులకు దిగటంవారికి ఇష్టంగా ఉండేది. బెదిరించటానికి కావలసిన ఆధునిక ఆయుధశక్తి వారిదగ్గర ఉంది. దానిని వారు మాటిమాటికి ప్రదర్శించేవారు. ప్రమాదకరమైన వ్యక్తుల జోలికి ఎవరూ వెళ్ళటానికి సాహసించరు. తమజోలికి ఎవరైనా వస్తే వారిని నిర్దాక్షిణ్యంగా కాల్చి పారవేసేవారు. అయినా భారతీయులు ఎదురుతిరుగుతూనే ఉన్నారు. వారి మందుగుండు ఆయుధాలకు భయపడేవారు కాదు. సందర్భం, సమయం కలిసివచ్చినప్పుడల్లా తిరుగుబాట్లు చేస్తూ ఉండేవారు. వాటిని అణచివేయటం వారి ఆయుధసంపత్తితో కూడా అంతతేలిక అయ్యేదికాదు. 1790లో తంజావూరుపై దాడికి పూనుకొన్నప్పుడు ఒక ఆంగ్ల అధికారి కంపెనీ కౌన్సిల్‌కు ఈ విధంగా విన్నవించాడు. "వారిని నిలువరించటానికి అణచివేత తప్పదు. వారి గ్రామాలను దోచుకోవటానికి, ఇళ్ళను తగులబెట్టటానికి, స్త్రీలను, పిల్లలను చెరబట్టటానికి అనుమతి కావాలి. ఈ యుద్ధంలో ఇలాంటి చర్యలు తప్పనిసరి".

1806లో వెల్లూరులో సిపాయిలు తిరుగుబాటు చేశారు. ఆ తిరుగుబాటును తీవ్రాతితీవ్రంగా అణచివేసారు. 300 మంది సిపాయిలను తాళ్ళతో బంధించి, వరుసగా నిలబెట్టి, 30 గజాల దూరం నుండి వరుసగా ఒక్కొక్కన్ని కాల్చివేశారు. వారు ఎందుకు తిరుగుబాటు చేశారో విచారించలేదు. వారి వివరణ అడగలేదు. పట్టుకున్నారు, బంధించారు, కాల్చివేసారు. మిగిలిన సిపాయిలను తిరుగుబాటుకు

కారణాలగురించి అడిగారు. వారిలో ఆరుగురిని ఫిరంగుల మూతులకు కట్టి చంపారు. ఐదుగురిని కాల్చి చంపారు. ఎనిమిదిమందిని ఉరితీశారు. ఐదుగురిని ద్వీపాంతరవాస శిక్షవిధించి, వలస కాలనీలకు తరలించారు.

1857 భారతస్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న వేలాదిమంది సిపాయిలను అవిధంగానే దారుణంగా హత్య చేశారు. సిపాయిలను మాత్రమే కాదు. సామాన్య పౌరులనుసైతం సామూహికంగా చంపివేశారు. సమాజాన్ని భయభ్రాంతులకు గురిచెయ్యటమే ఆంగ్లేయుల లక్ష్యమని వేరే చెప్పనవసరం లేదు. జేమ్సు జనరల్ స్మిత్ నెయిల్ అలహాబాద్, కాన్పూరులలో ఈ సామూహిక హత్యాకాండకు నేతృత్వం వహించగా, ఝాన్సీలో హ్యూరోజ్ అక్కడి ఊచకోతకు వ్యూహంపన్ని, అమలుచేశాడు. 5 వేలకు పైగా సామాన్య పౌరులను ఝాన్సీలో పొట్టన పెట్టుకున్నారు. విప్లవ కేంద్రమైన ఆ పట్టణంలో కనీసం ఒక్కరికి కూడా క్షమాభిక్షను యివ్వలేదు. ఢిల్లీని తిరిగివశపర్చుకొన్న తర్వాత తైమూర్ వారసులవలె కొల్లగొట్టారు. అల్లకల్లోలం చేశారు. దారుణ హింసాకాండకు పాల్పడి భయోత్పాతం సృష్టించారు. ఒక చిన్న ఆవాస ప్రాంతంలోనే 1400 మంది నిరాయుధ పౌరులను వరుసలో నిలబెట్టి మరీ కాల్చి చంపారు. "కనిపించిన ప్రతిఒక్కరిని కాల్చివేయండని ఉత్తర్వులు యిచ్చారు. సామూహిక హత్యాకాండకు అనుమతిని యిచ్చారు" అని ఒక యువ ఆంగ్ల అధికారి వ్రాశాడు. దానితో అనేకవేలమంది పౌరులను కారణంలేకుండా చంపటంతో ఢిల్లీ వీధులన్నీ శవాలతో నిండిపోయి, దుర్వాసనతో కుళ్ళిపొయ్యాయి. మసీదులలో, దేవాలయాలలో, సిక్కు గురుద్వారాలలోకి ప్రవేశించి, అక్కడ తలదాచుకున్న వారిని సైతం వదలకుండా కాల్చివేసారు. సామూహిక ఉరితీతలు ఆ రోజులలో సర్వసామాన్యం. విదేశీ ముస్లింల పాలనలోనూ సామూహిక ఉరితీతలు ఉండేవి. వారి మొరటు ఆయుధాలతోనే విదేశీ ముస్లింలు సామూహిక హననానికి పాల్పడ్డారు. ఆంగ్లేయులు క్రౌర్యంలో, పాశవికతలో వారికి తీసిపోరు. వారికంటే రెండు ఆకులు ఎక్కువే వీరు. పై పెచ్చు ఆధునిక ఆయుధ సంపత్తి వారికి ఉంది. కనుక వారు ఎంత హింసను సృష్టించారో, ఎంతమందిని ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామ సందర్భంగా సామూహికంగా కాల్చిచంపారో, ఉరితీసారో ఊహించుకోవచ్చు. మొఘలాయిల రాజధాని అయిన ఢిల్లీ ఐదులక్షలమంది

జనాభాతో కళకళలాడుతూ ఉండేది. ఆంగ్లేయుల హింసకారణంగా తన ప్రాభవాన్ని కోల్పోయి, శిధిలమైన పట్టణంగా ఢిల్లీ మిగిలిపోయింది.[23]

ఆంగ్లేయులకు చంపటం తేలికైనపని. ఎందుకంటె వారు ఎవర్ని చంపినా అందుకు శిక్షపడేదికాదు. ఆంగ్లసైనికుడు ఒక బండిలో ఇద్దరు మాట్లాడుకోవటం విన్నాడు. అందులో ఒకడు 'కాన్పూరు' అన్నాడు. అదేమిటో ఆ ఆంగ్ల సైనికుడికి అర్థం కాక తనతో ఉన్న రెండో సైనికుడికి చెప్పాడు 'కాన్పూరు' విప్లవం కేంద్రమని రెండోవాడికి తెలుసు. వెంటనే మాట్లాడుకుంటున్న ఇద్దరు భారతీయులను ఆ సైనికులు చంపివేశారు. కాన్పూరు మాట చెవినపడగానే విచారణ లేకుండానే చంపారు. అంతటి అఘాయిత్యం, అమానుషత్వం ఆంగ్లేయులది. చంపటం వారికి ఒక క్రీడ. ఆ మృత్యుక్రీడను వారు ఆనందించేవారు. భారతీయుల మృత్యుఘోషలో వారికి పైశాచిక ఆనందం అనుభవానికి వచ్చేది.

చివరి మొఘలాయి చక్రవర్తి బహాదూర్‌షా జాఫర్ కుటుంబం ఆంగ్లేయులకు లొంగిపోయింది. ఆయన 16 మంది కొడుకులను ఉరితీశారు. మరికొందరిని కాల్చి చంపారు. కొందరి చేతులువిరిచి, వారి ఆభరణాలను దోచుకున్న తర్వాత చంపారు. లొంగిపోయిన చక్రవర్తి కుటుంబానికి పట్టిన గతి యిది. సైనికాధికారులు మాత్రమే కాదు. పౌర అధికారులు సైతం చెప్పలేని అత్యాచారాలు సామాన్య పౌరులపై చేసేవారు. 1872లో పౌర అధికారుల ఉత్తర్వుల ప్రకారం పంజాబులో 'మాలేర్‌కోట్ల'లో 65 మంది నామధారి సిక్కులను ఫిరంగులకు కట్టి ప్రేల్చి తునాతునకలు చేసారు. పెషావర్ పట్టణంలో 1930లో 400 మంది భారతీయులను అకారణంగా బజారులో కాల్చిచంపారు. వారు ఒడిగట్టిన హింసాత్మక చర్యలు అనేకం. కొట్టటం, బంధించటం, కొరడా దెబ్బలు కొట్టటం, తిట్టటం, జాతివివక్ష, ఉరితీయటం, కాల్చివేయటం, దేశబహిష్కరణ, ద్వీపాంతరవాస శిక్షలు విధించటం బ్రిటీషు వలసపాలన రక్తచరిత్రలో సర్వసామాన్యం.[24]

ఈస్టిండియా కంపెనీ భారతదేశంలో అడుగిడిన తొలిదశాబ్దాలనుండే అటువంటి క్రౌర్యాన్ని వారు చూపారు. ఇంగ్లండ్ రాణి పాలనలోకి వచ్చిన తర్వాత అవే పద్ధతులు స్థిరపడ్డాయి. అంతేకాక కొత్త హింసాత్మక పద్ధతులను సైతం వారు ఆవిష్కరించారు. 20వ శతాబ్దంలోనూ వాటిని కొనసాగించారు. క్విట్ ఇండియా ఉద్యమాన్ని అణచి వేయటానికి తీవ్రమైన బలప్రయోగం చేశారు. ఒక బ్రిటీషు గవర్నర్ తాము అనుసరించిన వ్యూహంగురించి వివరిస్తూ, ఇంట్లోనుండి

తెలతెలవారుతుండగా బయటకు ఈడిస్తే, ఎవ్వరూ రక్షించలేరని వ్యాఖ్యానించాడు. సామూహిక మానభంగాలకు ఆంగ్లపోలీసులు అలవాటుపడ్డారు. స్త్రీల గౌరవమర్యాదలను మంటకలిపి, వారిని అవమానంపాలు చెయ్యటం వారికి ఇష్టమైనపని. 'క్విట్ఇండియా' సత్యాగ్రహకాలంలో 73 మంది మహిళా కార్యకర్తలపై అత్యాచారం జరిపారు. అత్యాచారం చేసింది పోలీసులే కనుక న్యాయస్థానాలు, శిక్షలు ఉండనే ఉండవు. బందీలుగా ఉన్న సత్యాగ్రహులను నగ్నంగా మంచుగడ్డల మీద వారు స్పృహ కోల్పోయేవరకు నించోపెట్టేరు. జైళ్ళలో ఖైదీలను కొట్టటం నిత్యంజరిగే అమానుష కార్యక్రమం. శాంతియుత సత్యాగ్రహులపై పైనుండి నీళ్ళుక్రుమ్మరించటానికి, లాఠీలతో బాదటానికి, కాల్పులు కాల్చటానికి ఆదేశాలు యిచ్చారు. జాన్ రస్కిన్ ఆ శతాబ్దం మొదట్లో ఇలా అన్నారు "ప్రతి తిరుగుబాటు, ప్రతి అపాయం, ప్రతి భయము, ప్రతి నేరము జరగటం వెనుక భారతదేశంనుండి తెచ్చిన 'లూట్' (దోపిడీ సొత్తు)తో హాయిగా బ్రతకాలన్న జాతీయ ఆకాంక్ష ఉంది" ఆంగ్లేయుల దోపిడీని ప్రతిఘటిస్తున్న వారిని అణచివేయటానికి చేస్తున్న ప్రయత్నాలకు నైతికత లేదని ఆయన అన్నాడు. అయినప్పటికీ అవే హింసాత్మక పద్ధతులను అవలంబించి, వారి వనరుల దోపిడీని కొనసాగించారు.[25]

**డయ్యర్ మూకుమ్మడి హత్యలు :**

జలియన్‌వాలా బాగ్‌లో వలసపాలనకు ప్రతినిధి అయిన డయ్యర్ ఏప్రియల్ 13న వైశాఖి పర్వదినం కారణంగా సమావేశమయిన గ్రామీణ స్త్రీపురుషులపై విచక్షణా రహితంగా జరిపించిన కాల్పుల్లో 1516 మంది చనిపోయారు. ఆంగ్లసైనికులు వాడిన 1650 బుల్లెట్లకు 1516 మంది పదినిమిషాలలో చనిపోయారు. కాల్పులు అయిపోగానే అమృత్‌సర్‌లో కర్ఫ్యూ పెట్టి కాల్పులలో గాయపడిన వారికి ఎట్టి సాయం అందకుండా చేశాడు. కనీసం గ్రుక్కెడు మంచి నీళ్ళుపోసే దిక్కులేక గాయపడ్డవారు పడ్డ బాధ వర్ణనాతీతం.

రౌలట్ చట్టాలను వ్యతిరేకిస్తున్న ఉద్యమకారులను భయభ్రాంతులకు గురిచెయ్యాలన్న ఏకైకఉద్దేశ్యంతో 10 నిముషాలలో ముగిసిన ఈ దారుణ మారణకాండలో వందలాది మంది చనిపోగా, వేలాదిమంది తీవ్రంగా గాయపడగా, అనేకమంది శాశ్వతంగా అంగవికలురు అయ్యారు. జలియన్ వాలా బాగ్ దురంతం ఏ ఉన్మాదో, ఏ మతిస్థిమితంలేని ఆంగ్లఅధికారో చేసింది కాదు. కావాలని, ప్రణాళిక

ప్రకారం, వలసపాలకులు పాలితులపట్ల చూపిన క్రౌర్యం అది. విల్ డ్యూరాంట్ ఇలా వ్రాస్తున్నాడు. "ఏ వీధిలో అయితే క్రైస్తవమత వ్యాప్తి చెయ్యటానికి వచ్చిన ఆంగ్ల మహిళా మిషనరీని పట్టుకొని కొట్టారో, ఆ వీధిలో ఉన్న హిందువు లందర్నీ వీధులలోకి యీడ్చి నేలమీద ప్రాకాలని ఉత్తర్వులు ఇచ్చాడు. ఎదురుతిరిగిన వారిని కాల్చివేసాడు. నేలమీద ప్రాకలేని వారిని బాయినెట్లతో కొట్టి మరీ ప్రాకించారు. 500 మంది విద్యార్థులను, వారి అధ్యాపకులను డయ్యర్ అరెస్టు చేశాడు. ప్రతిరోజు వారు పోలీసులముందు ఒక నిర్ణీత సమయంలో హాజరుకావాలి. హాజరు అవ్వవలసిన సమయంలో హాజరు కాలేకపోతే కఠినంగా శిక్షించేవాడు. అందుకోసం వారిలో అనేకమంది మైళ్ళకొద్దీ నడిచి హాజరు అయ్యేవారు. రోజుకు 16 మైళ్ళు నడిచినవారు ఉన్నారు. అనేకవందలమంది పౌరులను, అందులో కొందరు పాఠశాల విద్యార్థులను సైతం బహిరంగప్రదేశాలకు తీసుకొనివచ్చి కొట్టేవాడు. వారిలో చాలామంది అమాయకులు. రాజకీయ ఎజెండాలేనివారు. ఒక బహిరంగ కారాగారాన్ని తయారుచేసాడు. దానికి పైకప్పులేదు. సూర్యుడి వేడిమి, వెలుగునుండి రక్షణలేదు. వందలాదిమందిని త్రాళ్ళతోకట్టి ఆ బహిరంగజైలులో 15 గంటలపాటు నిలబెట్టే వాడు. సాధువుల బట్టలు ఊడదీసి, వారిమీద సున్నంనీళ్ళు పోయించి ఎండలో నిలబెట్టేవాడు. ఎండలో సున్నం గట్టిపడి వారి చర్మం చిల్లులు పడాలన్నది ఉద్దేశ్యం. భారతీయుల యిళ్ళకు ఉన్న విద్యుచ్ఛక్తి, నీటిసరఫరాలను రోజుల తరబడి నిలిపివేసాడు. భారతీయులదగ్గర ఉన్న ఎలక్ట్రికల్ ఫ్యాన్లను జప్తుచేసి, ఉచితంగా ఆంగ్లేయులకు యిచ్చాడు. పొలాలలో పనిచేస్తున్న స్త్రీ, పురుషులపై విమానాలనుండి బాంబులవర్షం కురిపించాడు."

డయ్యర్ దురాగతాలు బయటకు రాకుండా ఆరు నెలలపాటు అణచిపెట్టారు. తర్వాత ఆ దురాగతాలకు వ్యతిరేకంగా దేశంలో పెద్ద ఎత్తున ఆందోళన జరిగింది. దానితో విచారణకు హంటర్ కమిషన్‌ను వేసారు. ఆ కమిషన్ డయ్యర్ ఒడిగట్టిన మహానేరాలను కప్పిపుచ్చింది. డయ్యర్‌ను ఉద్యోగంనుండి తొలగించారు. ఇంగ్లండ్ పార్లమెంటులోని దిగువసభ డయ్యర్‌ను అభిశంసించగా, ఎగువసభ ఆ అభిశంసన తీర్మానాన్ని ఓడగొట్టింది. దానితో మంచి పెన్షన్‌తో ఆయన పదవీవిరమణ చేశారు.

**డయ్యర్‌కు ప్రశంసలు - సన్మానాలా ?**

సాహిత్యానికి నోబెల్ బహుమతిని అందుకున్న రుడ్‌యార్డ్ కిప్లింగ్

ఆంగ్లసామ్రాజ్యవాది. ఆయన "భారతదేశాన్ని రక్షించిన వ్యక్తి (Saviour of India)" గా డయ్యర్‌ను కీర్తించాడు. ఈ ప్రశంస చాలదన్నట్లుగా భారతదేశంలోని ఆంగ్లేయులు ఆయనకోసం 26,317 పౌండ్లు సేకరించి, ఒక వజ్రాలు పొదిగిన కత్తి సహితంగా యిచ్చారు. అనేక నెలల పోరాటంతర్వాత కాల్పుల్లో మరణించిన వారి కుటుంబాలకు కేవలం 500 రూ॥ నష్టపరిహారంగా యిచ్చారు. డయ్యర్ చేసిన మారణహోమానికి సాటీ ఆంగ్లేయులు ఆయనకు మద్దతుగా నిలిచారు. అంతటితో ఊరుకోక ఆయనకు బహుమతులు యిచ్చిమెచ్చుకోవటం, సన్మానించటం, అమానుషం. అనైతికం, అనాగరికం. అయినా అది వారికి పట్టలేదు. ఆయుధమే వారి పాలనా సాధనం. డయ్యర్‌ను ఆంగ్లేయుల ప్రతినిధిగా భావించగూడదని అనేవా రున్నారు. కాని ప్రతి ఆంగ్లేయుడు డయ్యర్ లాంటివాడేనని వారి రక్తచరిత్ర చెప్తున్నది. అంతేకాదు. డయ్యర్ తమను కాపాడిన రక్షకుడిగా వారు చెప్పుకున్నారు కూడా.

ఆంగ్లపాలకులు చెప్పుకొంటున్నట్టుగా వారిది ఉదారనియంతృత్వపాలన కానేకాదు. వలసపాలనా కాలంలో వచ్చిన కఱవుకాటకాలు, అందుకు దారితీసిన పరిస్థితులు, కఱవుబారినపడి ఆకలిచావులకు గురైన లక్షలాదిమంది భారతీయులపట్ల వారు వీసమెత్తు కనికరం చూపలేదు. నిస్సహాయులైన వేలాదిమందిని అక్రమంగా రవాణాచేశారు. పౌరహక్కులను కాలరాచి సామూహిక దమనకాండకు పాల్పడ్డారు. వలసపాలన ఒక ఆటవిక, రాక్షసరాజ్యం. మెరుగైన ఆయుధాలతో, జిత్తులమారి తనంతో ఒక శాంతికాముక దేశస్థులపై చేసిన దురాక్రమణదారుల పాలన అంతకంటె మెరుగ్గా ఎలా ఉండగలదు?

సర్ విలియమ్ హిక్స్ బ్రిటన్ అంతరంగిక శాఖామంత్రిగా పనిచేశారు. 1928లో ఆయన ఇలా అన్నారు "మిషనరీల సమావేశాలలో భారతీయులను ఉద్ధరించ టానికే వారిని జయించామని చెప్తున్నట్లుగా నాకు తెలుసు. కాని అది అబద్ధం. బ్రిటన్ ఉత్పత్తులకు మార్కెట్‌కోసం భారతదేశాన్ని జయించాము. కత్తిబలంతోనే ఆ దేశాన్ని జయించాం. ఆ కత్తిబలంతోనే దాన్ని మన గుప్పెట్లో పెట్టుకున్నాం. భారతదేశం భారతీయులకే అనే హిపోక్రసీ నాకులేదు. ఒక చేత్తో గజంబద్దతో, వేరొక చేత్తో కత్తి తోసూ, బయలుదేరాం. కత్తిబలంతో వారిని నిస్సహాయులను చేసి, వారి గొంతుకలను నొక్కిపెట్టాం" డయ్యర్ కత్తిబదులు ఫిరంగులు వాడాడు. గజంబద్దతో బ్రిటన్ కోశాగార పద్దుల పుస్తకాలలో ఆదాయపు నిడివిని కొలిచారు.

'పీటర్‌లూ' మారణహోమంలో 11 మంది ప్రాణాలు కోల్పోయారు.

మాంచెస్టరులో 1819 అగస్టు 16న ఒక శాంతియుత సమావేశంలోకి పోలీసులు ప్రవేశించి కాల్పులు జరిపారు. అట్లాంటిక్ సముద్రజలాల్లో ఆంగ్ల సైనికులు బోస్టన్‌లో కామన్స్‌మీద జరిపిన కాల్పులలో ఐదుగురు మరణించారు. ఆ సైనికులు మారణహోమానికి పాల్పడ్డట్టుగా భావించి, వారిని విచారించారు. డబ్లిన్‌లో 1916లో బ్రిటన్ నుండి స్వాతంత్ర్యం కోరుతూ తిరుగుబాటు లేవదీశారు. దానికి 'ఈస్టర్ తిరుగుబాటు' అని పేరు. అందులో పాల్గొన్నవారిలో 16 మందిని బ్రిటీషువారు ఉరితీశారు. కానీ జలియన్‌వాలా బాగ్‌లో కాల్పుల్లో చనిపోయినవారు ఉద్యమకారులు కాదు. వారు సామాన్య ప్రజలు. వారు నిరాయుధులు. వారు సమావేశమైన కారణం వేరు. కాని డయ్యర్‌వారిని దారుణంగా ఊచకోత కోసికూడా, ఏ శిక్షలేకుండా తప్పించుకోవటమే కాక, సన్మానాలను సైతం అందుకున్నాడు. భారతీయుల జీవితాలంటే, చావులంటే వలసపాలకులకు అంత చిన్నచూపు. లెక్కలేనితనం. ఇంతకంటె వారి క్రౌర్యానికి, జాతివివక్షకు వేరే సాక్ష్యాలు అక్కరలేదు.[26]

**అమానుష నేరస్థ తెగల చట్టం :**

నేరారోపణలకు గురైన వ్యక్తులు నేరం చేసినట్లు న్యాయస్థానం నిర్ధారించినప్పుడు వారిని దోషులుగా ప్రకటించి, శిక్షాస్మృతి ప్రకారం శిక్షలు విధిస్తారు. నేరం రుజువు అయినప్పుడు మాత్రమే దోషిగా గుర్తించబడతాడు. నేరం రుజువుకాకపోతే నిర్దోషిగా విడుదలచేయబడతాడు. నేరగాళ్ళు అన్ని కులాలోనూ, తెగలలోనూ ఉంటారు. కాని కొన్ని కులాలకు, తెగలకు చెందిన వారినందరిని ఎటువంటి నేరారోపణలు చేయకుండానే, నేరనిర్ధారణ జరగకుండానే నేరగాళ్ళుగా పరిగణించి, ఆ కులాలను, తెగలను నేరస్థజాతులుగా వలసపాలకులు ప్రకటించారు. 1871లో ఒక చట్టాన్ని తీసుకొనివచ్చి, 80 సంవత్సరాలపాటు ఆచట్టాల క్రింద లక్షలమంది భారతీయులను తరతరాల నేరస్థులుగా ముద్రవేసి నిర్బంధించటం, హింసించటం, బందీలను శ్రామిక శిబిరాలలో ఉంచి వెట్టిచాకిరీ చేయించటం ఆంగ్లేయులుచేసిన అన్ని ఘోరాలకంటె దారుణమైన ఘోరం.

ఇంతకీ ఈ 'వంశపారపర్య నేరస్థులు' ఎవరు? దేశదిమ్మర్లు, యాచకులు, సన్యాసులు, గిరిజనులు, జనజాతులు, వనవాసీలు మొదలైనవారు. ఏ ఒకప్రాంతంలో స్థిరనివాసం లేని దేశదిమ్మర్లకు స్వగ్రామం ఉండదు. మనసుకు నచ్చిన రీతిలో స్వేచ్ఛగా తిరుగుతారు. బ్రతకటంకోసం అనేక చిల్లరమల్లరపనులు చేస్తూంటారు. గారడీవిద్యలు, సోదిచెప్పటం, రకరకాల విన్యాసాలు చేసి ప్రజలకు వినోదం

కలిగించటం, పాములను పట్టి ఆడించటం, కొన్ని కళారీతులను ప్రదర్శించటం ఔషధమొక్కలను, వేళ్ళను అమ్మటం, అటవీ ఉత్పత్తులను విక్రయించటం ఇంకా అనేక రకాలుగా వీరు తమ పొట్టనింపుకుంటుంటారు. వారి మానాన వారు స్వేచ్ఛగా బ్రతుకుతుంటారు. నాగరికసమాజపు కట్టుబాట్లు, నియమాలు వీరిని బంధించవు. 'ఆధునికత'కు వీరికి ఆమడదూరం[27]. అయితే వీరిమీద స్థిరనివాసులకు అనేక అపోహలు ఉండేవి. పగలు వినోదం కల్గిస్తారని, రాత్రిళ్ళు దొంగతనాలకు పాల్పడతారని, పసిపిల్లలను ఎత్తుకుపోతారని, ధాన్యపు కుప్పలనుండి ధాన్యం ఎత్తుకుపోతారని, క్షుద్రశక్తులు వీరికి ఉంటాయని అనుకొంటూ ఉంటారు. ఎక్కడా ఒక్కచోట స్థిరంగా ఉండరుకాబట్టి ఎవరికీ లొంగిఉండవలసిన పనిలేనివారు. ప్రపంచమంతా చుట్టివచ్చారు కాబట్టి ఇతరులను ఇట్టే లోబరుచుకోగలరన్న దురభిప్రాయం కూడా ఉండేది. వలసపాలకులు ప్రజాభద్రతకు ఈ సంచారజీవులు ప్రమాదకారులుగా భావించారు. వీరిలో కొందరికి దొంగచాటుగా తమ ప్రత్యర్థులను దెబ్బకొట్టి, చేతికి చిక్కకుండా పారిపోయే నైపుణ్యం కూడా ఉంది. క్రైస్తవ మతప్రచారకులకు వీరిని క్రైస్తవంలోకి తీసుకొని రాలేకపోయారు. మతప్రచారకుల ప్రలోభాలకు వీరు లొంగలేదు. అందువల్ల క్రైస్తవ మతప్రచారకులకు వీరిపట్ల తీవ్రవ్యతిరేకత ఉండేది. (మాలపల్లి నవలలో ఈ సంబంధమైన ఘటనలు చర్చించ బడినవి.)

దేశద్రిమ్మరులకు జనాకర్షణ సామర్థ్యం ఉండేది. వీరి ఆటపాటలను చూడటానికి జనం చుట్టూ మూగేవారు. వలసపాలకులకు జనసమూహాలు అంటే గిట్టదు. తెల్లదొరలకు వ్యతిరేకంగా స్థానికభాషలలో నిరసనభావాలు వ్యాప్తి చేస్తారేమోనన్న భయం వారిని ఎప్పుడూ వెంటాడుతుండేది. దేశద్రిమ్మర్లు కనుక వివిధప్రాంతాలలో జరుగుతున్న దోపిడీకి, ప్రభుత్వ హింసాకాండకు వారు ప్రత్యక్షసాక్షులు కనుక వారిదగ్గఱ ఉన్న సమాచారం ఇతరులకు చేరవేస్తారేమోనన్న శంక వారికి ఉండేది[28].

1857 తర్వాత మరో విప్లవం, తిరుగుబాటు వస్తుందేమోనని నిరంతరం భయపడేవారు. అందుకు జనసామాన్యానికి ఉత్తేజాన్ని కల్గించే సమాచారాన్ని తమ ఆటపాటల సందర్భంగా చేరవేస్తారేమోనని ఆంగ్లేయులు వారి కార్యకలాపాలపై నిఘాపెట్టేవారు. ప్రజాభిప్రాయం మలచటంలో పుకార్లు, వదంతులు ఆనాటికి ఈనాటికీ ప్రముఖపాత్రపోషిస్తున్నాయి. మరే ఇతరమార్గంద్వారా సమాచారం అందని

ఆ శతాబ్దాలలో రకరకాల వదంతులు, పుకార్లు షికారుచేసేవి. వాటిని దేశదిమ్మర్లు ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి మోసుకొని వెళ్ళేవారు.

అయితే సంచారజీవులవలన ఎన్నడూ రాజ్యాలకు బెడద ఏర్పడలేదు. మన దేశంలోనేకాదు ఏదేశంలోనూ ఏ సమాజానికి కూడా వారివలన నష్టంకలగలేదని చరిత్ర చెప్పేవాస్తవం. వారిగురించి అనేక వదంతులు, తప్పుడు అభిప్రాయాలు వ్యాప్తిలో ఉన్నా వారివలన అస్థిరత్వం ఏర్పడలేదు. అయితే మధ్యఆసియాకు చెందిన కొన్ని సంచారతెగలు ముఖ్యంగా తైమూరిద్‌లు, మంగోలులు, హూణులు మొదలైనవారు విదేశాలమీద దాడిచేసి గొప్ప సామ్రాజ్యాలను నెలకొల్పారు[29]. పారిశ్రామిక విప్లవం అనంతరం ప్రైవేటు ఆస్తిహక్కు వ్యాప్తిచెందిన తర్వాత, స్థిరనివాసం లేని సంచారజీవులవలన రూపుదిద్దుకొంటున్న కొత్త సామాజికవ్యవస్థకు ప్రమాదం ఉండవచ్చునని పాశ్చాత్యులు బలంగా నమ్మేవారు[30].

19వ శతాబ్దం మొదట్లో కొన్ని తెగలవారు అసాధారణమైన నేరాలకు పాల్పడుతున్నట్లు పాలకులు గమనించారు. దారిదోపిడీలకు వీరు ఎక్కువగా పాల్పడుతుండేవారు. వీరినే ఠగ్గులు అనిపిలిచేవారు. ఎన్నో తరాల నుండి వారివృత్తి దారిదోపిడీలే. దారిదోపిడీలను అరికట్టటానికి అత్యంత ప్రాధాన్యతను వలసపాలకులు యిచ్చారు. 1824 నుండి 1841 వరకు ఠగ్గులను నిర్మూలించే కార్యక్రమాన్ని చేపట్టారు. 1860 నాటికి దారిదోపిడీకి పాల్పడే బందిపోటు ముఠాలను పూర్తిగా నిర్మూలించారు[31].

19వ శతాబ్దం నాటికే 117 సంవత్సరాలలో (1780 నుండి 1900 వరకు) కనీసం 110 తిరుగుబాట్లు మన దేశంలో జరిగాయని రంజిత్‌గుహా తెలియచెప్పారు. ఈ తిరుగుబాట్లు, నిరసనలు ప్రజాపోరాటాలు చేసింది గిరిజనులు, ఆదివాసీలు, గ్రామీణులు. ఈ తిరుగుబాట్లు, నిరసనలు, పోరాటాలే తర్వాత కాలంలో స్వాతంత్ర్యఉద్యమానికి, విప్లవోద్యమానికి స్ఫూర్తిని ఇచ్చాయి[32]. 1783 రంగపూర్ జిల్లాలో (బెంగాల్) రైతుల తిరుగుబాటు, బిర్సాముండా నాయకత్వంలో 1899లో ఛోటానాగపూర్ ప్రాంతంలో జరిగిన గిరిజనుల తిరుగుబాటు చరిత్ర ప్రసిద్ధమైనవి. 1801, 1857లలో కూడా గిరిజనులు ఛోటానాగపూర్ ప్రాంతాలలో తిరుగుబాట్లు లేవదీశారు. 1831లో కోల్‌విప్లవం (ఛోటానాగపూర్‌లో), 1855లో సంతాల్ సాయుధపోరాటం (ప్రస్తుత జార్ఖండ్‌రాష్ట్రంలో), 1875లో కున్బీల విప్లవం

(మహారాష్ట్రలో) కూడా చరిత్ర ప్రసిద్ధం. అనేకచోట్ల జమిందార్లు, తెల్లదొరలు, గ్రామాధికారుల 'అపవిత్రపొత్తు'ను ప్రశ్నించటం మొదలుపెట్టారు.

ఇంగ్లాండ్‌లోను పరిస్థితులు దిగజారాయి. నిరుద్యోగం పెరిగింది. సమ్మెలు నిత్యకృత్యం అయ్యాయి. ఆర్థికమాంద్యం నెలకొంది. రాజకీయంగా చైతన్యం పెరిగింది. నేరాలరేటు పెరిగింది. త్రాగుడు అలవాటు విచ్చలవిడిగా వ్యాప్తిచెందింది. అంటువ్యాధులు ప్రబలటంతో సమాజం వ్యాధిగ్రస్తమైంది. వీటన్నిటితోపాటు భారతదేశంలోని తెల్లసైనికులనుండి నిరసనలు మొదలు అయ్యాయి. వారిగురించి ఆందోళనకరమైన వార్తలు వచ్చాయి. వారిలో అనేకులు సుఖవ్యాధిగ్రస్తులయ్యారు. 1875లో సైనికులు, అధికారులలో ప్రతివెయ్యిమందిలో 205మంది సుఖవ్యాధిగ్రస్తులే. రెండు దశాబ్దాలలో అంటే 1895 నాటికి వారిసంఖ్య 522కు పెరిగింది. 1867లో సంక్రమణవ్యాధుల చట్టాన్ని తీసుకొనివచ్చారు. సిఫిలిస్, గనేరియా వంటి అంటువ్యాధులు ప్రబలటానికి వేశ్యలను బాధ్యులను చేస్తూ చేసిన ఈచట్టం వివక్షాపూరితమైనది[33].

పౌరుల కదలికలపై నిరంతర నిఘాపెట్టి, ఒకపెద్ద నిఘావ్యవస్థను నెలకొల్పారు. వలసప్రభుత్వం పెద్ద నిఘా (Panopticon) ప్రభుత్వంగా మారిపోయింది. 1857 విప్లవం వారు ఊహించనిది. దానితో సమాచార, నిఘావ్యవస్థలను పటిష్టపరిచారు. ప్రతివ్యక్తిని మరొకవ్యక్తిపై నిఘాకు వాడుకొన్నారు. ప్రతివ్యక్తి ఇతరుల కదలికలు, స్పందనలను గమనించి తనపై అధికారులకు సమాచారం ఎప్పటికప్పుడు అందించే గూఢచార, సమాచార వ్యవస్థను ఏర్పాటుచేసుకొన్నారు. దానితో పోలీసులంటే భయం వ్యాపించింది. నిఘా సమాచార వ్యవస్థలను విస్తరించి, బలోపేతం చేయటం తెల్లదొరలకి అత్యంత ఆవశ్యకం అయ్యాయి[34]. దానితో19వ శతాబ్దిలో అనేక తీవ్రమైన చట్టాలను తీసుకొనివచ్చారు. కఠినమైన నియమనిబంధనలును రూపొందించి అమలుచేశారు. అటువంటివాటిల్లో ఇండియన్ క్రిమినల్ ప్రొసీడర్ కోడ్ (1861), ఇండియన్ పీనల్ కోడ్ (1862), క్రిమినల్ ట్రైబ్సు ఆక్ట్ (1871), ఎవిడెన్సు ఆక్ట్ (1872) అత్యంత ముఖ్యమైనవి. వీటితోపాటుగా కేటిల్ ట్రెస్‌పాస్ ఆక్ట్ (1871), ఫారెస్టు చట్టాలు (1878), నీలగిరిస్ గేమ్ అండ్ ఫిష్ ప్రిజర్వేషన్ ఆక్ట్ (1879), అబ్కారీ ఆక్ట్ (1890) కూడా ముఖ్యమైనవే.

ప్రజల దైనందిన జీవితాలను అత్యంతంగా ప్రభావితం చేసిన ఈ చట్టాలతో బ్రిటీషు ఇండియా ప్రభుత్వం ఒక పోలీసురాజ్యంగా (Carceral State) మారిపోయింది. నిర్బంధాలు, నిర్బంధకేంద్రాలు, జైళ్ళు పెరిగాయి. ఒకసారి పోలీసు రికార్డులలోకి ఎక్కినవ్యక్తిపై నిరంతరనిఘా పెట్టారు. అటువంటివారికి భవిష్యత్తు లేకుండా చేసారు. ఈ చట్టాలు అన్నింటిలో నేరస్థతెగల చట్టం అత్యంత దారుణమైంది.

కొన్నికులాలు, తెగలు స్వాభావికంగా నేరాలు చేయటమే వృత్తిగా ఎంచుకొని, నేరాలకు పాల్పడుతున్నారని వలసపాలకులు ఒక అంచనాకు వచ్చారు. ఇది ఏదో 1871లో అకస్మాత్తుగా ఏర్పడిన అభిప్రాయం కాదు. న్యాయవిచారణ పద్ధతులలో ప్రభుత్వం జోక్యం మొదలయిన నాటినుండే ఈ అభిప్రాయం వారికి ఏర్పడటం మొదలైంది. పై పెచ్చు ఇంగ్లండ్‌లో జిప్సీలు, ఇతర సంచారజాతుల వారు నేరాలకు పాల్పడతారన్న అభిప్రాయం అక్కడి ప్రజలలో ఉంది. కాగా ఏ క్రమశిక్షణకూ వారు లొంగరని, సంచారజీవులు బద్ధకస్తులని, పనిదొంగలని, దేశదిమ్మరులని ఎందుకూ కొరగానివారని, వారిని నియంత్రించి, క్రమశిక్షణలో పెట్టటం అవసరమని ఆంగ్ల ప్రభుత్వం అనుకొనేది. కొన్ని తెగలవారిని నేరస్థులుగా పరిగణించటం అన్నది 1772లోనే మొదలయింది. వారెన్ హేస్టింగ్సు పరిపాలనా కాలంలోనే మేజిస్ట్రేట్లకు విశేషఅధికారాలు కట్టబెట్టారు. కొన్ని తెగలకు చెందినవారిని, దేశదిమ్మర్లును, అనుమానితులను నిర్బంధించి రహదారుల నిర్మాణానికి వారిని ఉపయోగించుకోవటానికి, ఒకవేళ వారు ఆ పనులకు హాజరు కాకపోతే 6నెలలు పాటు జైళ్ళలో ఖైదుచేసే అధికారం ఇచ్చారు.

దీనికితోడు శాస్త్రంకాని శాస్త్రం 'సుజనన శాస్త్రం' (Eugenics) విస్తృతంగా ప్రజాదరణకు నోచుకుంది. అనేక సుజనన సంఘాలను సైతం వారు నెలకొల్పారు. జన్యు లక్షణాలే నేరస్థులను తయారు చేస్తుందనే ప్రతిపాదన ఈ శాస్త్రం చేస్తుంది. పుట్టుకతోనే నేరస్థస్వభావం కలవారిని గుర్తించి, నియంత్రించి, శిక్షించి, సంస్కరించటం అవసరమని వారు అనుకొన్నారు. అందుకోసం కొందరిని సామూహికంగా తరతరాల నేరస్థులుగా ముద్రించి నిర్బంధించదల్చుకొన్నారు.

నేరస్థజాతుల చట్టం నేరాన్ని, నేరస్థుల అపరాధీకరణను, తెగల భావాలను పునర్ నిర్వచించింది. ఈ చట్టం ప్రకారం కొన్ని సామాజిక సమూహాలు బెయిల్ పొందటానికి అవకాశంలేని నేరాలు చేయటానికి అలవాటుపడ్డారు. ఈ సమూహాలు

అనాదిగా ఉన్నాయి. మొట్టమొదట ఈచట్టాన్ని వాయవ్యప్రాంతానికి అవధ్, పంజాబు ప్రాంతాలకు వర్తింపచేశారు. కొన్ని మార్పులు, చేర్పులతో 1911లో భారతదేశానికి అంతటికీ వర్తింపచేశారు. ఈచట్టం ప్రకారం దేశదిమ్మర్లు నేరస్థుల జాబితాలోకి, వారి జీవనోపాధిపద్ధతులు నేరాల జాబితాలోకి కొత్తగా చేర్చారు. వైస్రాయి ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ సభ్యుడు అయిన జె. హెచ్. స్టీఫెన్సు ఈ చట్టం చేయటానికి ముందు ఇలా అన్నాడు. "భారతదేశపు ప్రత్యేకత దాని కులవ్యవస్థ. వ్యాపారుల కులంలో పుట్టినవాడు వ్యాపారం చేస్తారు. అలాగే వడ్రంగి పనివారు కూడా. అంటే ఒక తెగకు చెందిన పూర్వీకులు అనాదిగా నేరస్థులు అయితే, ఆ తెగకు చెందిన ప్రస్తుతతరం కూడా అదే వృత్తిలో కొనసాగుతారు. ఆ తెగనంతా నిర్మూలించకపోతే, నేరాలు ఆగవు. లేదా తగ్గులకు పట్టినగతే వీరికి పట్టించాలి. ఒక వ్యక్తి చట్టవ్యతిరేక పనులకు పాల్పడుతుంటే అతను మొదటినుండి అలాగే ప్రవర్తిస్తున్నా డన్నమాట. చివరివరకు అలాగే ఉంటాడు కూడా. సంస్కరణ అసాధ్యం. ఎందుకంటె అది వారి వృత్తి. వారికులం నేరంచేయటం అదే వారి మతంకూడా." ఇంకొక సభ్యుడు టీ.వి.స్టీఫెన్సు కూడా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తంచేస్తున్నాడు. "అనాదిగా ప్రజలు కులవ్యవస్థను అంటిపెట్టుకుని, కులవృత్తులను చేసుకుంటూ ఉన్నారు. నేత, వడ్రంగి మొదలైనవి వంశపారంపర్య వృత్తులు. అదే విధంగా నేరాలుచేయటంకూడా కొందరికి వంశపారంపర్య వృత్తి. తమ తాత తండ్రుల వృత్తిలోనే వారు కొనసాగుతున్నారు"[35].

ఈ చట్టం పరిధిలోకి వేశ్యలను, కొజ్జాలను కూడా తీసుకొనిరావటంలో ఆశ్చర్యం ఏమీలేదు. ఎందుకంటె వారి మూలంగా ఆంగ్ల, పాశ్చాత్య సైనికులలో సగంమందికి పైగా సుఖవ్యాధుల పాలయ్యారని వలసపాలకులు ఆరోపించి సంక్రమణవ్యాధుల చట్టంకూడా తీసుకొనివచ్చారు. అంతమంది తెల్లసైనికులు సుఖవ్యాధుల బారినపడటం 'పాశ్చాత్యతనానికే' సిగ్గుచేటుగా వారు భావించారు. 20వ శతాబ్దం మొదటిభాగంలో వ్యభిచారం ఒక కులవృత్తి అయింది. వేశ్యలు నేరస్థులు అయ్యారు. 1857 విప్లవంలో వారు పాల్గొనటాన్ని, తమకు చేతనైనంత సహకారాన్ని స్వాతంత్ర్యయోధులకు అందించటాన్ని వారు గమనించారుకూడా. ముఖ్యంగా లక్నోలో వారు విప్లవవీరులకు అండగా నిలబడ్డారు. మగవార్రై ఉండి, వారికి వారు అంగీకరించినా, లేక వైద్యపరీక్షలో వారు నపుంసకులని తేలినా, కొజ్జాలుగా పరిగణించబడతారని ఈచట్టం స్పష్టంచేసింది. పిల్లలులేని ప్రతివారిని కొజ్జాలుగా పరిగణించేవాళ్ళు.

నేరస్థ తెగల చట్టంతోపాటు జనాభాలెక్కలు, వేలిముద్రల పరిజ్ఞానం, రాజకీయ నిఘాకు, స్థానికుల దైనందిన వ్యవహారాలలో మితిమీరిన జోక్యానికి దారితీసింది. నేరస్వభావం గలవారిని లేదా పాలకులు నేరస్వభావం ఉందని గుర్తించిన వారిని, నీతిమంతులైన పౌరులనుండి వేరుచేయటం ఈ చట్టం ఉద్దేశ్యం. వంశపారంపర్యంగా నేరాలు చేయటమే వృత్తిగా ఉన్న తెగలను అణచివేయటం ఈ చట్టపు లక్ష్యం.

డేవిడ్ ఆర్నాల్డ్ ప్రకారం దేశద్రిమ్మర్లు, సంచారులైన చిన్నవ్యాపారులు, ఇళ్ళువాకిళ్ళు లేకుండా ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి కాలినడకన సంచరించే వారు, ఆహారాన్ని సేకరించుకొనేవారు, వేటగాళ్ళు, చేపలుపట్టేవాళ్ళు, ధ్వనిఅనుకరణ చేసేవారు, వంశవృక్షాలు చెప్పేవారు, సోది, జోస్యం చెప్పేవారు, సంచార వైద్యులు, కుమ్మర్లు, బుట్టలు అల్లేవారు, వెదురు పనిచేసేవారు, కొండలలో, కోనలలో, అడవులలో నివసించేవారు మొదలైన వారందరూ నేరస్థతెగలచట్టంక్రింద నేరస్థులయ్యారు. అంటే ఒకచోట స్థిరపడి, వ్యవసాయమో, కూలీపనులో ఇతరపనులో చేసుకొనే వారిని మినహాయించి మిగిలిన వారినందరిని అంటే సంచార తెగలు, వనవాసీలు, ఆదివాసులు, కొండజాతులకు చెందినవారిని ఈచట్టం వంశపారంపర్య నేరస్థులుగా పేర్కొనటం ద్వారా మొత్తం కులాలకు కులాలను, తెగలకు తెగలను చిన్నా, పెద్ద, ఆడ, మగా, ముసలీముతకా అందరూ మూకమ్ముడిగా సామాజిక వివక్షకు, చిన్నచూపుకు గురిఅయ్యారు. నేరస్థులనే కొత్త సామాజికముద్రను ఈ తెగలమీద వలసప్రభుత్వం రుద్దడం అమానుషం. ఒక్క పంజాబులోనే లక్షాఏభైవేలమందిని ఈచట్టంక్రింద నేరస్థులుగా ప్రకటించారు. వలసపాలనను వ్యతిరేకించే తెగల వారి నందరినీ నేరస్థతెగలుగా ప్రకటించారు.

1857 విప్లవం మరొక విప్లవం రావటానికి దారితీస్తుందని ఆంగ్లేయులు భయపడుతుండేవారు. కొన్ని తెగలవారు 1857 విప్లవంలో పాల్గొన్నారుకూడా. 1857 విప్లవంలో పాల్గొన్న తెగలను గుర్తించి, ఆ తెగలనన్నింటినీ నేరస్థతెగలుగా ప్రకటించారు. ఆ విధంగా రెండువందల తెగలకు చెందిన లక్షలాదిమందిని నేరస్థులను చేశారు. ఉత్తరప్రదేశ్‌లోని గోరఖ్‌పూర్‌లో ఇలా నేరస్థులుగా ప్రకటింపబడిన జాతుల సంస్కరణకోసమని తొలి సెటిల్‌మెంట్ గ్రామాన్ని ఏర్పరిచారు. కాశీలోను పరిసర ప్రాంతాలలోను స్మశానాలలో అంత్యక్రియల విధుల నిర్వహణలో సహకరించే

డోమ్ జనజాతికి (తరతరాలుగా స్మశానంలో అగ్నిని ఆరకుండా నిలుపుతూ ఉండిన దీక్షాపరులు) చెందినవారిని అక్కడ స్థిరపరిచే ప్రయత్నాలు చేశారు. మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో మెసపటోనియాలో సైన్యానికి సహకరించే పారిశుద్ధ్య కార్మికులు అవసరమైనపుడు ఇక్కడినుండి లక్షలసంఖ్యలో అక్కడికి తరలించారు. 1947 నాటికి 200 తెగలకు చెందిన 35 లక్షలమంది ఈచట్టంక్రింద నేరస్థులుగా ప్రకటించబడ్డారు. స్వాతంత్ర్యానంతరం 1952లో ఈ చట్టాన్ని రద్దుచేసి, ఈ తెగలను విముక్తజాతులుగా ప్రకటించారు.

**నేరస్థతెగల చట్టం-స్టువర్టుపురం ఎరుకలు :**

దేశవ్యాప్తంగా 1911లో అమలులోకి వచ్చిన నేరతెగల చట్టం కారణంగా మద్రాసు ప్రెసిడెన్సిలో సంచార జాతులకు, గిరిజన, ఆదివాసి తెగలకు చెందిన లక్షలాదిమంది రాత్రికి రాత్రి నేరస్థులయ్యారు. అంతకుముందెన్నడూ నేరచరిత్రలేని వారుసైతం ఈచట్టం కింద నేరస్థతెగలుగా ప్రకటించబడ్డారు. అట్టివారిలో ఎరుకల జాతి కూడా ఉంది. ఎరుకలు సంచారజీవులు. చిరువ్యాపారులు. ధాన్యం, ఉప్పు, పశువుల వ్యాపారం చేసేవారు. చాపలు, బుట్టలు, పూసలు అమ్మేవారు. సాముగరిడీలు, ఆటపాటలతో ప్రజలకు వినోదం కల్గించేవారు. మద్రాసు ప్రెసిడెన్సీలోని మారుమూల గ్రామాలకుసైతం వారివలననే ఉప్పు సరఫరా అయ్యేది. అయితే రైల్వేలు, రహదారులు అభివృద్ధి చెందిన తర్వాత వారి కథ తారుమారు అయింది. వలసపాలకులు అనుసరించిన ఉప్పువిధానం వారి వ్యాపారానికి పెద్ద సంకటంగా మారింది. ఉప్పు ఉత్పత్తి, పంపిణీ రంగాలలో పెద్ద వ్యాపారులను అనుమతించారు. వారి ప్రతినిధులు చిల్లర దుకాణాల ద్వారా ఊరూరా ఉప్పు విక్రయించ నారంభించారు. ఎరుకులకు ఉప్పు వ్యాపారం అనాదిగా ఉన్న పెద్ద జీవనోపాధి. అది కాస్తా ఇప్పుడు పోయింది. 1877లో వచ్చిన కఱవులో వేలసంఖ్యలో పశువులు చనిపోయ్యాయి. వారి పశువుల వ్యాపారం కఱవు కారణంగా దెబ్బతిన్నది. 1880 దశకంలో తీసుకొచ్చిన అటవీచట్టాల కారణంగా వెదురుబొంగులు, ఆకులు సైతం వారికి దొరకలేదు. ఉమ్మడి వనరుల చుట్టూ వలసపాలకులు దడులు, కంచెలు కట్టి ఉమ్మడి వనరులను ఉపయోగించకుండా నిరోధించారు. దానితో పశు గ్రాసం కూడా దొరకక, పశుపోషణ ఇతరులతోపాటు ఎరుకులకు కూడా భారం

అయింది. ఆటపాటలకు, గారడీవిద్యలకు వారు పేరు మోసారు. అయితే వలసపాలకులకు వారు ప్రదర్శించే వీధివినోదం ప్రజాభద్రతకు ముప్పుగా పరిణమిస్తుందని భయపడేవారు. అన్నిరకాలుగా ఎరుకలు నిస్సహాయస్థితిలోకి నెట్టివేయబడ్డారు. వారికి ప్రత్యామ్నాయ జీవనోపాధి మార్గాలను ఏర్పరచాలన్న శ్రద్ధ పాలకులకు లేదు. పైపెచ్చు వారిపట్ల వారికి అనేక అపోహలు ఉండేవి.

మొదటి అపోహ వారి సంచార జీవనయానం గురించి. సంచారజాతులంటే పాలకులకు చిన్నచూపు. దారీ, తెన్నూ, లక్ష్యం లేకుండా ఎరుకలు సంచరిస్తూంటారని వారు అనుకొనేవారు. కాని అది వాస్తవం కాదు. వారి తిరుగుళ్లకు లక్ష్యం లేకపోలేదు. వారి ఉత్పత్తులకు ఉన్న గిరాకీనిబట్టి దేశమంతటా తిరుగుతూనే ఉండేవారు. సంతలు, జాతరలు, పండుగలు, కొలుపులు, ఉత్సవాలు–ఏదోమూల దేశమంతటా ఎప్పుడూ జరుగుతూనే ఉండేవి. వారి ఉత్పత్తులను పూసలు, గాజులు, బుట్టలు, చాపలు మొదలైనవి అమ్ముకోవటానికి–వారు అవి జరిగేచోటు తెలుసుకొని ఆయాగ్రామాలకు వెళ్ళి అమ్ముకొనేవారు. ఉప్పు ఉత్పత్తి అయ్యేకాలాలలో ఉప్పు తయారుచేసేవారు. గాడిదలమీద, బండ్లమీద ఉప్పు ఎక్కించి, ఊరూరా తిరుగుతూ అమ్ముకొనేవారు. వారు వెళ్ళేమార్గాలన్నీ వారికి కొట్టినపిండే. ఆయా కాలాలలో లభ్యమయ్యే ఉత్పత్తు లను ఉత్పత్తిచేయగలిగినవి చేస్తూ, మిగిలినవాటిని మారుబేరానికి గాను సేకరించుకొని వ్యాపారం చేసేవారు. వస్తువులకు ఉండే గిరాకీనిబట్టి వారి తిరుగుళ్ళు ఆవృతంగా ఉండేవి.

వలసపాలకులకు వారిగురించి మరొక అపోహ ఉండేది. వారు బద్ధకస్థులని, పనిదొంగలని అనుకొనేవారు. రక్షణ సైన్యం చర్చి (Salvation Army Church) అధిపతి బూత్‌టకర్ వారి గురించి ఇలావ్రాసాడు. "వారిని మేము అరకదున్నమని అడిగినప్పుడు, లేదా కర్మాగారంలో పనిచేయమని అడిగినప్పుడు వారు విభ్రాంతికి లోనయ్యారు. మేము ఎప్పుడూ పనిచేయలేదు ఆడతాం, పాడతాం అని చెప్పారు". కాని ఇది కూడా సత్యదూరమే. వారు చిరువ్యాపారులు. వారెన్నడూ పొలం దున్నలేదు. ఎవరిదగ్గరా పనిచేయలేదు. కాని పనికి వారు వ్యతిరేకులు కాదు. వారికి నచ్చినపని ఆడుతూపాడుతూ చేసుకొనే స్వేచ్ఛాజీవులు వారు. ఒకరికింద పనిచేయుటం, కూలీపనిచెయ్యుటం వారికి యిష్టంలేదు. మనస్సుకు నచ్చిన రీతిలో పనిచేస్తూ, వారికిష్టమయిన రీతిలో జీవిస్తూ, వారి ఉత్పత్తులను అమ్ముకొనేవారు.

వారికి కష్టపడే స్వభావమే లేకుంటే వారి వ్యాపారం కాని, వారి ఆటపాటలు కాని అన్ని శతాబ్దాలపాటు సజీవంగా నిలిచేవి కావు.

వలసపాలకులకు ఎరుకసానుల గురించి తప్పుడు అభిప్రాయాలు ఉండేవి. వారికి నీతినియమాలు, కట్టుబాట్లు లేవని, లైంగికసుఖంకోసం వెంపర్లాడుతుంటారని ఆంగ్లపాలకులు భావించేవారు. ఎరుకల స్త్రీలకు నాగరిక సమాజాలుగా గుర్తింపబడిన సమాజాల స్త్రీలకు లేని స్వేచ్ఛలు ఉండేవి. జీవితభాగస్వాములను ఎంచుకొనే స్వేచ్ఛ, వివాహాన్ని రద్దుచేసుకొని మారుమనువు చేసుకొనే స్వేచ్ఛ, విధవావివాహాలు, రజస్వలానంతరం వివాహాలు వారి సమాజంలో ఉండేవి. ఓలి (కన్యాశుల్కం), బహుభార్యాత్వం ఉండేది. ఎరుకల సమాజంలో స్త్రీలకు ఉన్న స్వేచ్ఛ స్వాతంత్ర్యాలను మిగిలిన సమాజంలో ప్రవేశపెట్టటమే నిజమైన సంస్కరణ అవుతుందని, అందువలన వారిని 'నాగరికుల'ను చెయ్యాలన్న ప్రయత్నాలు ఆపివెయ్యాలని సంఘసంస్కరణాభి లాషులు కోరుకున్నారుకూడా.

వలసపాలకులకు వారిపట్ల మరొక దురభిప్రాయం ఉండేది. అన్నిటికంటే ఇదే అసలు అపోహ. ఎరుకలు సహజంగా నేరస్వభావులని, నేరాలు చేయటమే వారి వృత్తి, ప్రవృత్తిఅని ఆంగ్లఅధికారులు భావించేవారు. అందుకు సమర్థనగా ఎరుకల జానపదగీతాలను చూపారు. వారికులదైవం సుబ్రహ్మణ్యస్వామి. ఆ స్వామిని వారు ఏవృత్తిని చేపట్టమని అడగగా, ఆయన వారికి గడ్డపలుగు యిచ్చాడని వారి మౌఖిక సాహిత్యంలో ఉన్న దానికి పెడర్థంతీసారు. గడ్డపలుగుతో ఇళ్ళకు కన్నంవేసి బ్రతకమని వారికులదైవం అనుజ్ఞయిచ్చాడని, దానితో వారు దొంగతనాలు వృత్తిగా చేసుకున్నారని కువ్యాఖ్యానం చేసారు. కాని ఎరుకలు ఒక సమూహంగా నేరాలకు పాల్పడినట్లుగా పోలీసులుకూడా నిరూపించలేకపోయ్యారు. అన్ని కులాలు, మతాలలో ఉన్నట్లుగా ఎరుకలలోనూ చిల్లరనేరాలతోపాటు ఘోరమైన నేరాలు చేసే వ్యక్తులు కొందరు ఉండిఉండవచ్చు. కాని మొత్తం జాతిజాతిఅంతా కరుడు గట్టిన నేరస్థులని అసత్యఆరోపణ చేయటం అన్యాయం. మద్రాసు ప్రెసిడెన్సీలో వార్షికనేరాల చిట్టాలను పరిశీలించినప్పుడు అపరాధులలో వారి శాతం జనాభాలో వారిశాతం కంటె తక్కువగా ఉండటాన్ని గమనించవచ్చు. కొన్ని సంవత్సరాలలో అగ్రకులాలకు చెందిన అపరాధుల శాతం జనాభాలో వారి శాతంకంటె ఎక్కువగా ఉండటాన్ని కూడా గమనించవచ్చు. వారు సంచరించే ప్రాంతాలలో జరిగిన నేరాల రేటు వారెన్నడూ

సంచరించని ప్రాంతాలలో జరిగిన నేరాలరేటు కంటే ఎక్కువగాలేదు. వారు సంచరించే ప్రాంతాలలో సైతం నేరాలలో అధికశాతం స్థానికులే చేస్తారని పోలీసురికార్డులు చెపుతాయి. సంచారజాతులు ఎక్కువగా వచ్చేకాలంలో స్థానిక నేరస్థులు నేరాలు చేసి, ఆ నేరాలను బయటివారిపై నెట్టేవారని పోలీసురికార్డులను బట్టి అనుకోవలసివస్తుంది.

నేరాలకు సంబంధించి మరో అభిప్రాయం కూడా తెల్లదొరలకు ఉండేది. వారి వ్యాపారాలు దెబ్బతిన్న తర్వాత, బ్రతకటంకోసం నేరాలకు పాల్పడటం మొదలెట్టారన్న అభిప్రాయం కూడా వాస్తవ దూరమైందే. కేవలం వారు ఉప్పు, ధాన్యం వ్యాపారులే కాదు. పశువులను పెంచేవారు, అమ్మేవారు, వెదురు బుట్టలు, చీపురులు, బుట్టలు తయారు చేసేవారు. సాముగారడీలు చేసేవారు. ఆటపాటలతో ఆనందింపచేసేవారు. ఆంగ్లేయుల విధానాలవలన వారి జీవన పరిస్థితి తారుమారైంది. అంతమాత్రంచేత వారు దొంగతనాలకు, దారిదోపిడీలకు పాల్పడ్డారన్నది మాత్రం కేవలం అపోహ. వారికి బ్రతకటానికి ఇతర మార్గాలు ఉన్నాయి. వ్యాపకాలు ఉన్నాయి.

కాని వారిని నేరస్థతెగలచట్టం కింద నేరస్థులుగా ముద్రవేసింది మాత్రం కేవలం వలసపాలకులకు ఎరుకలపట్ల ఉన్న అపోహల కారణంగానే. తగినన్ని సాక్ష్యాధారాలు లేకుండానే వారి జాతిమొత్తాన్ని నేరస్థులను చేశారు. దానికి పాశ్చాత్యమానవ విజ్ఞానశాస్త్రవేత్తల పరిశోధనా ఫలితాలను ఆధారంగా చూపారు. భారతదేశం వారికి పెద్ద ప్రయోగశాల అయింది. గిరిజన తెగలమీద, సంచారజీవులమీద వారు చేసిన మిడిమిడి పరిశోధనాఫలితాలు వలసపాలకుల అపోహలను బలపర్చాయి. గిరిజన, సంచార జాతులకు చెందిన ప్రజల భౌతిక రూపురేఖలు, శరీరఅవయవాల కొలతల ఆధారంగా వారికి, 'నాగరికుల'కు మధ్య ఉన్న తేడాలు ముఖ్యమైనవని, ఆటవికుల శరీరము, మనసులనిండా క్రూరత్వం, నేరప్రవృత్తీ వ్రాయబడి ఉన్నవని ఆ శాస్త్రజ్ఞులు పేర్కొన్నారు.[36]

### రక్షణసైన్యం చర్చి (Salvation Army Church) కబంధహస్తాలలో..

రక్షణసైన్యం చర్చి (Salvation Army Church) గురించి కొన్ని వివరాలు తెలుసుకుందాం. నేరస్థతెగల చట్టంకింద ప్రకటించబడిన నేరస్థతెగలను 'సంస్కరించే' బాధ్యతను వలసపాలకులు ఆ చర్చికి యిచ్చారు. రక్షణ సైన్యం చర్చి ఒక అంతర్జాతీయ క్రైస్తవమత సంస్థ. దేశవిదేశాలలో ఖైదీలలో, శిక్షఅనుభవించి విడుదల అయిన నేరస్థులలో 'క్రైస్తవ మతపరివర్తన' కోసం పనిచేసే సంస్థ. నేరస్థప్రపంచంతో

వారికున్న అనుభవాన్ని బట్టి, నేరత్వం (Criminality) స్వరూప స్వభావాలను నిర్వచించే సాధికారత ఈచర్చి అధికారులకు ఉందని ఆంగ్లేయులు బలంగా విశ్వసించేవారు. ఇంగ్లాండ్‌లో ఆర్థికంగా దివాలా తీసినవారు, ఆస్ట్రేలియా, అమెరికా న్యూజిలాండ్‌లలో ఆయాదేశాల ఆదివాసతెగలు, భారతదేశంలో గిరిజన, సంచారతెగలు నేరస్థస్వభావం సహజంగా ఉన్నవారిగా ఆసంస్థ పేర్కొంది. అపరాధులను వారి స్వభావాన్నిబట్టి, పాల్పడిన నేరాలను పట్టి, సాధారణ, అలవాటుపడ్డ, వంశపారంపర్య (Heriditary) నేరస్థులుగా చర్చి వర్గీకరించింది. వీరిలో కొందరిని నేరాలు చెయ్యకుండా నిరోధించాలని, మరికొందరిని కఠినంగా శిక్షించాలని, ఇంకొందరిని సంస్కరించే ప్రయత్నం చెయ్యాలన్నది చర్చి అభిప్రాయం.

నేరస్థతెగల చట్టం తీసుకొని రావటానికి దశాబ్దాలముందునుండి సామాజిక, రాజకీయ అభిప్రాయాలు భారతీయ 'నేరస్థుడు'చుట్టూ అల్లుకొన్నాయి. ఆంగ్లేయులు చేసిన అనేక కఠినమైన చట్టాలవల్ల అనేకమంది కొత్తగా నేరస్థులయ్యారు. ఆ చట్టాలను తెలిసో, తెలియకో ఉల్లంఘించినవారు, ఆంగ్ల వలసపాలనను వ్యతిరేకించి విధేయులుగా మెలగటానికి ఇష్టపడనివారు, స్థానిక భూస్వాముల, పోలీసుల ఆగడాలను ప్రశ్నించేవారు కొత్తగా నేరస్థులు అయ్యారు. వారి సంప్రదాయహక్కులను ఆంగ్లచట్టాలు హరిస్తే, ఆ చట్టాలను ఉల్లంఘించినవారు, చట్టపరిజ్ఞానం లేక చట్టాలను పట్టించుకోనివారు సైతం నేరస్థులు అయ్యారు. నేరస్థతెగల చట్టాలను ప్రభుత్వానికి వ్యతిరేకంగా కార్యకలాపాలు నిర్వహిస్తున్న రహస్యసంఘాలను, బహిరంగంగానే తమ నిరసనను వ్యతిరేకిస్తున్న పౌరసంఘాలను అణచివేయటానికి వాడుకొన్నారు[37].

1911లో మద్రాసు ప్రెసిడెన్సీలో మరికొన్ని ఇతర తెగలతోపాటుగా ఎరుకలను వంశపారంపర్య నేరస్థులుగా ప్రకటించారు. ఒకతెగను లేదా ఒక కులంఅంతటినీ ఈచట్టంక్రింద నేరస్థులుగా ప్రకటించేముందు సమీపంలోని 'గ్రామపెద్దల'ను సంప్రదించాలి. సహజంగా గ్రామపెద్దలుగా భూస్వాములు చెలామణీ అవుతుంటారు. నేరస్థతెగగా ప్రకటించబడిన తర్వాత ఏదేనీ ఒక గ్రామంలోకి అడుగుపెట్టాలన్నా, వదిలివెళ్ళాలన్నా గ్రామపెద్దల అనుమతి తప్పనిసరి. గ్రామపెద్దలు అనుమతి మంజూరుకు వారిచేత ఉచితంగా పనులుచేయించుకొనేవారు. పోలీసుల అనుమతి కూడా కావాలి. ఈ నిబంధనలను అడ్డుపెట్టుకొని క్రిందిస్థాయి పోలీసుఉద్యోగులు వారిని వేధించేవారు. అంతేకాదు

సందర్భాన్నిబట్టి, యజమానులతో లాలూచిపడి, కర్మాగారాలలో, గనులలో, పాషాణఖనులలో, కాఫీ, టీయాకు తోటలలో బలవంతంగా పనిచేయించేవారు. వాటి యాజమాన్యాలకు నేరస్థ తెగలకు చెందిన వారిపై విస్తృత అధికారాలు యిచ్చారు. ఇతర కార్మికులకు వర్తించే చట్టాలు ఏవీ నేరస్థతెగలకు చెందినవారికి వర్తింప చేయనవసరంలేదు. ముఖ్యంగా కాఫీ, తేయాకు తోటలలో ఈ తెగలవారి శ్రమను యథేచ్ఛగా దోపిడీచేశారు. తోటలకు వర్తింపు అయ్యేచట్టాల స్థానంలో ఈ చట్టాన్ని అమలుచేసి దారుణ శ్రమదోపిడీకి పాశ్చాత్యతోటల యజమానులు పాల్పడ్డారు. తక్కువకులాలును నేరస్థతెగలుగా ప్రకటించే స్వేచ్ఛ స్థానిక పోలీసు యంత్రాంగానికి యిచ్చారు. ఎవరికైనా వారిని నియంత్రించే అధికారం యివ్వవచ్చు. ఈ చట్టంక్రింద ఏసంస్థయినా ఒక జన/గృహ సముదాయాన్ని నేరస్థతెగల సెటిల్‌మెంటుగా ప్రకటించవచ్చు. తద్వారా ఆసంస్థలకు చట్టబద్ధంగా నేరస్థతెగలుగా ప్రకటింపబడ్డవారి శ్రమను గంపగుత్తగా దోచుకొనేందుకు అవకాశం యిచ్చారు[38].

నేరస్థతెగల చట్టంకింద ప్రకటింపబడినవారి పునరావాసంకోసం ప్రత్యేకంగా ఎంపిక చేసిన ప్రాంతాలలో శ్రామికశిబిరాలను ప్రారంభించవచ్చు. సంచారజాతులకు చెందిన నేరస్థులకు వారి కుటుంబాలతోసహా ఈ శిబిరాలలో నిర్బంధనివాసం ఏర్పాటు చేశారన్నమాట. అట్టినిర్బంధనివాస ప్రాంతాన్ని 'సెటిల్‌మెంటు' అని పిలిచారు. నేటి ప్రకాశంజిల్లాలో 'స్టూవర్టుపురం సెటిల్‌మెంటు' అటువంటి నిర్బంధనివాస ప్రాంతాలలో ఒకటి. ఎరుకలకు ఏర్పాటుచేసిన సెటిల్‌మెంటు ఇది. 1913 నుండి అనేక దశాబ్దాలపాటు 6వేలమంది ఎరుకలకు ఈసెటిల్‌మెంటు నిర్బంధనివాసగ్రామం అయింది. 1910 నుండి మద్రాసు ప్రెసిడెన్సీలో ఈ సెటిల్‌మెంట్లను నెలకొల్పారు. సంచారజాతులకు చెందిన 'అత్యంత శీలహీనులను, కరుడుగట్టిన నేరస్థులను' ఈసెటిల్‌మెంట్లలో నివాసం కల్పించమని ఆదేశాలు జారీచేశారు. సంచార జాతులకు చెందినవారిని నియంత్రించే బాధ్యత రక్షణసైన్యంచర్చికి యివ్వగా, ఇతరజాతులకు చెందిన నేరస్థుల నియంత్రణ బాధ్యతను పోలీసుశాఖకు యిచ్చారు.

రక్షణసైన్యం చర్చి 1870వ దశకంలో ఇంగ్లండ్‌లో పుట్టింది. ఆంగ్ల సామ్రాజ్యవాదలక్ష్యాలతో పూర్తిగా మమేకం అయిన సంస్థ రక్షణసైన్యంచర్చి సామ్రాజ్యవాదశక్తులతో చేతులు కలిపింది. ప్రపంచాన్ని పాలించటానికే పుట్టిన ఆంగ్లేయుల సామ్రాజ్యవిస్తరణలో భాగస్వామి అయింది. ఈ చర్చి ఉద్యోగులు, ఆంగ్లేయుల ఏలుబడి–అంతులేని దోపిడీ

అధికారులు ఆంగ్లసైన్యంలో మాదిరిగా ఏకరీతి దుస్తులు(యూనిఫారం) ధరించేవారు. పతకాలు ప్రదర్శించేవారు. కవాతు చేసేవారు. సైనిక బ్యాండ్‌ను ఉపయోగించేవారు. వారి సమావేశాలను 'ఎయిర్ బొంబార్డ్‌మెంట్సు' అని పిలుస్తారు. సర్వోన్నత అధికారిని 'జనరల్' అని సంబోధిస్తారు. ఏదేని ఒకకొత్త ప్రాంతంలో పని ప్రారంభిస్తే, కొత్తభూభాగాన్ని ఆక్రమించటానికి యుద్ధాన్ని ప్రకటిస్తున్నామని ప్రకటించేవారు. తమను ఎదిరించిన వారిని, లేదా ఎదురుతిరుగుతారని భావించిన తెగలను నేరస్థులుగా ప్రకటించి, వారిని 'సంస్కరించే బాధ్యత'ను రక్షణసైన్యంచర్చికి ఒప్పజెప్పేవారు. వారిపై ఇకపై సర్వాధికారాలు ఆ చర్చికే ఉండేవి. వలసపాలకులు సంచారజాతులను అసహ్యించుకొనేవారు. 1857 విప్లవంలో పాల్గొన్నవారికి సంచారజాతులు సహకారం అందించటం ఒక కారణం అయితే వారి స్వేచ్ఛాయుత జీవితము స్థిరసమాజాలకు ప్రమాదకరమని భావించటం రెండవకారణం[39]. (డాక్ట్రిన్ ఆఫ్ డిస్కవరీ, పాపల్ బుల్ గుర్తురావటం సహజమే)

గుంటూరుజిల్లాలోనే సీతానగరంలో ఒక 'సెటిల్‌మెంటు' ఉంది. (ఈ సెటిల్‌మెంటులో ఎలాంటి దుర్భర పరిస్థితులు ఉండేవో ఉన్నవ వారి మాలపల్లి నవల విపులంగా తెలియజెప్పింది). సీతానగరం సెటిల్‌మెంటులో 'సంస్కరించ బడినవారి పునరావాసకేంద్రంగా స్టూవర్టుపురం సెటిల్‌మెంటును తయారుచెయ్యాలని అనుకొన్నారు. కాని స్థానికుల అభ్యంతరాలవల్ల స్టూవర్టుపురం సెటిల్‌మెంటును కూడా నేరస్థుల సెటిల్‌మెంటుగానే ప్రకటించారు. ఈ సెటిల్‌మెంటును ఏర్పాటు చేయటానికి 500 ఎకరాల ఇసుకభూములను, 1000 ఎకరాల చిత్తడి భూములను రక్షణసైన్యంచర్చికి ఉచితంగా కట్టబెట్టారు. స్టూవర్టుపురం సెటిల్‌మెంటును ఒక వ్యవసాయసెటిల్‌మెంటుగా తయారుచేద్దామనుకొన్నారు. అందుకుగాను సాగునీటిని కృష్ణానది నుండి ఒకకాలువ ద్వారా సరఫరా చేద్దామనుకొన్నారు కూడా. అయితే భూస్వామ్యవర్గం ఆ ప్రతిపాదనను తీవ్రంగా వ్యతిరేకించింది. బయటనుండి వచ్చినవారికి సాగునీటి వసతికల్పించటాన్ని, పైపెచ్చు తక్కువకులాలకి చెందినవారి భూములకు సాగునీరు అందివ్వటానికి ప్రత్యేక ఏర్పాట్ల ప్రతిపాదనను వారు హర్షించలేదు. భూస్వామ్యవర్గపు మద్దతు వలసపాలకులకు అవసరమైన ఆ దశాబ్దంలో ఆ ప్రతిపాదన కార్యరూపం దాల్చలేదు. కనుక ఎరుకలకు జీవనోపాధి కల్పించటానికి ప్రత్యామ్నాయాలు వెదికారు.

ఇండియన్ లీఫ్ టొబాకో కంపెనీ (ILTD) లిమిటెడ్ 1908 నుండి గుంటూరు

జిల్లా (నేటి ప్రకాశం జిల్లా)లో కార్యకలాపాలను చేస్తున్నది. ఈ కంపెనీలో ఎరుకలకు ఉపాధి కల్పించటానికి రక్షణసైన్యం చర్చి ప్రతినిధులు ప్రయత్నంచేసారు. అందుకు కంపెనీ సానుకూలంగా స్పందించింది. 1925 నాటికి సెటిల్‌మెంటులో ఉన్న ఎరుకలలో సగంమంది పైగా కంపెనీలో పనివారుగా చేరారు. మగవారు పండని భూములలో శ్రమ చేస్తుండగా, ఆడవారు కంపెనీలో కూలీపనికి కుదురుకున్నారు. 1928లో ఇసుకనేలల దిగువున సాగుకు యోగ్యమైన భూగర్భజలాలను కనుగొన్నారు. వరిపండించటానికి ఆ భూములు ఇప్పుడు అనుకూలంగా మారాయి. నీటి దొరువులు తవ్వారు. సాగునీరు తమ సెటిల్‌మెంటు భూములకిందే లభ్యం అవటంతో, ఎరుకలకు ఆ పొలాలసాగుపట్ల ఆసక్తి పెరిగింది. తమకు మొదట హామీయిచ్చినట్లుగా శాశ్వతపట్టాలు యివ్వాలని వారు ప్రభుత్వానికి మొరపెట్టుకున్నారు. కాని రక్షణసైన్యంచర్చి అధికారులు ఎరుకలకు భూములను దఖలుపర్చటానికి ఒప్పుకోలేదు. నీటిలభ్యత కారణంగా భూముల విలువలు కొన్నిరెట్లుపెరగటమే అందుకు కారణం. ఎరుకల అభ్యర్థనపై పాలకులు ఎట్టినిర్ణయమూ తీసుకోలేదు. 5ఏళ్ళ తర్వాత ఏవో కుంటిసాకులు చూపి, వారి అభ్యర్థనను తిరస్కరించారు. నేరస్థులు 'సంస్కరించబడిన' తర్వాత సెటిల్‌మెంటు విడిచివెళ్ళాలి కనుక శాశ్వత ప్రాతిపదికన పట్టాలు యివ్వటం జరగదని పాలకులు ఆ తర్వాత తేల్చిచెప్పారు. అయితే సెటిల్‌మెంట్‌లోని ఎరుకలు తమంతతాముగా ఒక సంఘంగా ఏర్పడి నీటివనరులును అభివృద్ధిచేసుకోవటం మొదలుపెట్టారు. సాగునీటి వసతిపెరిగితే దిగుబడులు పెరుగుతాయి. వారి కష్టఫలం వారే అనుభవించవచ్చు.

రక్షణసైన్యం చర్చికి వారి చొరవ నచ్చలేదు. వారిని సెటిల్‌మెంటునుండి విడుదల చెయ్యటం అత్యంత ఆవశ్యకమనే నిర్ణయానికి చర్చి అధికారులు వచ్చి, వలసపాలనాధికారులను సంప్రదించారు. విడుదలకు వారు అభ్యంతరం చెప్పలేదు. దానిలో రక్షణసైన్యం చర్చి ఐ.ఎల్.టి.డి. కంపెనీకి దగ్గరలో ఆఘమేఘాలతో ఒక కాలనీ నిర్మించి సెటిల్‌మెంటు ఎరుకలను ఆ కాలనీకి బదిలీచేసింది. కంపెనీ ఈ అవకాశాన్ని తనకు అనుకూలంగా మలుచుకొంది. చీరాలలో తన కార్యకలాపాలను విస్తృతపర్చుకొంది. అయితే ఫ్యాక్టరీల చట్టంలోని కొన్ని సెక్షనులనుండి తమ కంపెనీకి మినహాయింపును కోరింది. రక్షణసైన్యం చర్చికూడా అందుకు సిఫారసు చేసింది. కూలీలమీద పెట్టేఖర్చు ఈ మినహాయింపు వలన తగ్గుతుందని, కంపెనీలో

పనిచేస్తున్న ఎరుకలను నియంత్రించటం తేలిక అవుతుందని, కనుక మినహాయింపును యివ్వమని సిఫారసు చేసింది. ఎంతమందిని వీలుఅయితే అంతమందిని స్టూవర్టుపురం సెటిల్‌మెంటునుండి విడుదల చెయ్యాలని రక్షణసైన్యం భావించింది. 1935లో సెటిల్‌మెంటునుండి అధికసంఖ్యలోనే ఎరుకలను విడుదల చేసి కొత్తకాలనీలో మకాం పెట్టించారు. కంపెనీ ఫ్యాక్టరీల చట్టంలోని మొత్తం 4 సెక్షన్లుకు సెక్షన్లు 21 (విశ్రాంతి సమయం) 22 (వారాంతపు సెలవు దినాలు), 27 (వారానికి చేయవలసిన పనిగంటలు), 28 (రోజువారీ పని గంటలు)ల నుండి మిహాయింపును కోరింది. ప్రభుత్వం 27,28 సెక్షన్లునుండి మినహాయింపును యిచ్చింది. చీరాల కంపెనీకే కాక మద్రాసు ప్రెసిడెన్సీలోని అన్ని పొగాకు ఫ్యాక్టరీలకు ఈ మినహాయింపును వర్తింపచేశారు. 1935 నాటికి స్టూవర్టుపురంలో పనిచేయగలిగిన వయసులో ఉన్న ప్రతి ఆడ, మగ కంపెనీలో పనికి కుదిరారు. ఆదివారాలు తప్ప ప్రతిరోజూ రెండు షిఫ్టులలో కంపెనీ నడిచింది. కూలీలచేత ఉదయం 5 గంటల నుండి మర్నాడు ఉదయం 1 గంటవరకు పనిచేయించేవారు. శ్రామికుల శ్రమను కంపెనీ ఎటువంటి సంకోచంలేకుండా దోచుకొంది[40].

**ఎరుకల సంస్కృతిని తిరగవ్రాశారు :**

ఎరుకల వ్యక్తిగత, సామాజిక జీవితాలను రక్షణసైన్యం చర్చి సమూలంగా తిరగవ్రాసింది. వారికి గతమంటూ లేకుండా చేశారు. వారి సంస్కృతి సంప్రదాయాలనుండి వారిని విడదీశారు. ఎరుకలు సంఘజీవులు. పెద్ద ఉమ్మడి కుటుంబాలు వారివి. స్టూవర్డ్‌పురం సెటిల్‌మెంటులో నిర్బంధ నివాసానికి తీసుకొనిరాబడ్డ ఎరుకల సంఘాన్ని చిన్నచిన్న కుటుంబాలుగా విభజించారు. ఒక్కొక్క కుటుంబానికి కొంత సాగుకు యోగ్యంకాని భూమిని యిచ్చి, దానిని సేద్యయోగం చెయ్యాలని ఆదేశించారు. పిల్లలను తల్లిదండ్రులనుండి విడదీసి సెటిల్‌మెంటులోనే విడిగా నివాసం కల్పించారు. ఆదివారం చర్చి ప్రార్థనాసమయంలోనే వారు తమ తల్లితండ్రులను కలుసుకోవటానికి అనుమతించేవారు. నేరచరిత్ర, నేరస్వభావం లేనివారిని నేరస్థులుగా ప్రకటించి, వారిని నిర్బంధించి, మతంమార్చి, సంస్కరించేందుకు క్రైస్తవనీతిపాఠాలు బోధించేవారు. పెద్దలకు గొడ్డుచాకిరీ చేసి తమను తాము సంస్కరించుకొనే 'అవకాశం' కల్పించారు.

ఎరుకల సమాజంలో స్త్రీ, పురుష సమానత్వం ఉండేది. ఆడ,మగ అన్ని పనులు సమానంగా చేసేవారు. ఈ పద్ధతి రక్షణసైన్యం చర్చికి నచ్చులేదు. ఆడవారు

వంటింటికి, పిల్లలపెంపకానికి మాత్రమే పరిమితం కావాలని చెప్పేవారు. ఒకవేళవారు బయటపనులకు వెళ్ళవలసి వస్తే, యజమానుల యింట్లో కుట్టు, వంట పనులకు, పిల్లలపెంపకానికీ పరిమితం కావాలని చర్చి ఉద్దేశ్యం. 19వ శతాబ్దిలో "పేదల భార్యలను బాగుపర్చండి ధనవంతులకు సేవకులుగా చెయ్యండి" అన్నది వారి నినాదం.

చాపలు, బుట్టల తయారీలో ఆడ, మగ ఇద్దరూ పాల్గొనేవారు. మగవారు చాపలు, బుట్టలు తయారు చెయ్యకూడదని ఆదేశం యిచ్చారు. ఇంటిదగ్గర ఉండి చేసే పనులు పూర్తిగా స్త్రీలకే కేటాయించారు. మగవారు బయటపనులు చూసుకోవాలని ఆదేశించారు. అంతకుముందున్న స్త్రీ, పురుష సమానత్వాన్ని రక్షణసైన్యంచర్చి తిరగవ్రాసింది. స్త్రీల కట్టు, బొట్టు, వేషం, భాషలను సైతం సమూలంగా మార్చివేసింది.

అయితే అవసరమైనప్పుడు స్త్రీల శ్రమను దోచుకోవటానికి రక్షణసైన్యం చర్చి వెనుకాడలేదు. వారు ఆశించినంతగా సెటిల్‌మెంటు భూములు సేద్యయోగ్యం అవలేదు. దానితో సెటిల్‌మెంటుకు వచ్చే ఆదాయం ఖర్చులకు సరిపోవటంలేదు. సెటిల్‌మెంటు ఆర్థిక సంక్షోభంలోకి నెట్టివేయబడిన దశలో మహిళలను కూలీపనులకు బయటకు పంపారు. బలవంతంగా వందలమంది ఎరుకలస్త్రీలను పొగాకుకంపెనీలో పనిచేయటానికి పంపారు. సెటిల్‌మెంటుకు ఏడుమైళ్ళదూరంలో ఉన్న ఐ.ఎల్.టి.డి. కంపెనీకి రోజూ కాలినడకన వెళ్ళేవారు. కంపెనీలో రోజుకు 12 గంటలు వారిచేత చాకిరీ చేయించేవారు. 10-12 సంవత్సరాలపాటు సెటిల్‌మెంటుకు వచ్చిన ఆదాయంలో 80 శాతం ఈ ఆడకూలీలవల్లే సమకూరింది. వారి కుటుంబాలకు, సెటిల్‌మెంట్‌కు ఆదాయం ప్రధానంగా ఆడకూలీలే సమకూరుస్తున్నా, వారి వ్యక్తిగత, వైవాహిక జీవితాలను నియంత్రించేందుకు రక్షణసైన్యంచర్చిప్రయత్నించింది. ఎరుకల స్త్రీలకు తమ భర్తలను ఎంచుకొనే స్వేచ్ఛఉంది. వైవాహిక భాగస్వాముల ఎంపిక ప్రక్రియలో తమకుకూడా పాత్ర ఉండాలని, అందుకు అనుమతిని యిమ్మని ప్రభుత్వాన్ని కోరి పోరింది. ఓలి (కన్యాశుల్కం) స్థానంలో వరకట్నాన్ని ప్రవేశపెట్టారు. వంటపాత్రలు, చీరెలు రూపంలో వరకట్నాన్ని చాలాసార్లు చర్చి చెల్లించేది. వివాహిత స్త్రీలు భర్తలకు చెల్లుచీటీ ఇవ్వటాన్ని, వదిలిపెట్టి వెళ్ళటాన్ని పూర్తిగా అదుపుచేశారు. దానితో ఎరుకల స్త్రీలు అనాదిగా ఉన్న స్వేచ్ఛలను పోగొట్టుకున్నారు.

రక్షణసైన్యంచర్చి సెటిల్‌మెంటులో అమలుచేస్తున్న కఠినమైన క్రమశిక్షణ నిబంధనలను, స్త్రీల హక్కులను హరించి, వారి వ్యక్తిగత, కుటుంబవ్యవహారాలలో జోక్యం చేసుకోవటాన్ని ఐ.ఎల్.టి.డి కంపెనీ సమర్థించింది. క్రమశిక్షణకు అలవాటు పడ్డ ఎరుకలు కంపెనీలోనూ క్రమశిక్షణతో మెలిగేవారు. విడాకులు యివ్వటానికి కాని, విడివిడిగా ఉండటానికి గాని అవకాశం లేకుండా చేయటాన్ని కంపెనీ తనకు అనుకూలంగా మార్చుకొంది. ఒక జంటకు (భార్య భర్తలు) యిచ్చేకూలీ విడివిడిగా ఆడ,మగ కూలీలుకు యిచ్చే కూలీ మొత్తానికంటె ఎప్పుడూ తక్కువ ఉండేది. 1930 నుండి స్టూవర్టుపురం సెటిల్‌మెంటునుండి జంటలు జంటలుగా పనికి వచ్చి రోజుకు కనీసం 20 గంటలు శ్రమించేవారు. జంటకు కూలీ చెల్లించేవారు. తక్కువ చెల్లించి, ఎక్కువ పనిగంటలు చేయించి, కంపెనీ వారి శ్రమను యథేచ్ఛగా దోపిడీ చేసేది[41].

ఎరుకల కున్న ఘనమైనగతాన్ని రక్షణసైన్యం చర్చి చెరిపివేసింది. వారందరూ కొన్నితరాలకుముందు ఘోరమైన నేరాలుకు, దారిదోపిడీలకు, హత్యలకు పాల్పడేవారని, వారిని సంస్కరించటంకోసం, రక్షణసైన్యం చర్చి, వలసపాలకులు ప్రయత్నించారని సెటిల్‌మెంటులోని ఎరుకలకు నూరిపోసారు. పిన్నలను పెద్దలనుండి వేఱుచేసారు. వారికీ అవే పాఠాలు చెప్పారు. వారిపై కొత్తదేవుడ్ని, కొత్తమతాన్ని రుద్దారు. ప్రస్తుతతరానికి వారి జాతినేపథ్యం తెలియదు. సామాజిక జీవనం తెలియదు. వారికి తెలిసిందల్లా ఒక్కటే. ఒకప్పుడు తాము కరుడుగట్టిన నేరస్థులమని, చర్చిద్వారా సంస్కరించబడ్డామని, ఇప్పుడు గౌరవనీయంగా బ్రతకగల్గటానికి ఏసుక్రీస్తు మతం, తెల్లవారు కారణమని తప్ప ఇంకేమీ తెలియదు. ఈవిధంగా నేరస్థతెగలచట్టం చేసి తమను వ్యతిరేకించిన, తమకు అనుకూలంకాదనుకున్న తెగలకు చెందినవారిని నేరస్థులుగా ముద్రవేసి, వారిని నిర్బంధించి, మతంమార్చి, నియంత్రించి, వారి చరిత్రను తిరగవ్రాసి, వారి శ్రమను తెల్లవారు ఘోరంగా దోచుకున్నారు. విముక్త జాతులుగా 1952లో ప్రకటించబడ్డ ఆ జాతులకు చెందిన అనేక లక్షలమంది భారతీయులు నేటికీ పేదరికంలో మగ్గుతున్నారు. తెల్లదొరలు తమపై వేసిన నేరస్థ ముద్రనుండి బయటపడలేక దుర్భరజీవితాలు గడుపుతున్నారు.

## References

1. William Digby: Prosperous British India, p. 121.
2. Ibid p. 125
3. Amartya Sen, Poverty and Famines: An Essay on Entitlements and Deprivation, 1982
4. Will Durant, The Case for India
5. Diyan Patel, 'How British left one million Indians Die in Famine' BBC News, 11th2016, www.bbc.com/news/world-asia-India-36379524
6. Ibid
7. Mike Davis, The Victorian Holocausts : El Nino Famines and Making of the Third world, 2001, p. 39.
8. Famine Inquiry Commission Final Report, 1945, pp 105 - 106.
9. Will Durant, The Case for India, pp 36 - 37.
10. Mike Davis, p.52
11. Ibid
12. J.C. Geddes, Administrative Experience Record- Famines, Calcutta, 1874 p. 350.
13. Chandrika Kaul, Reporting Raj, The British Press and India, 1880 - 1922, p. 75
14. Sydney Morning Herald, 6th Nov, 1943.
15. Madhusree Mukerjee, Churchill's Secret War: The British Empire and Ravaging of India during the Second World War, 2010. p.332.
16. Durant, p.36
17. William Jennings Bryan; British Rule in India. p.11
18. G.S.V. Prasad and N. Kanakarathnam - "Colonial India and Transportation: Indian Convicts in South- East Asia, and Elsewhere" International Journal of Applied Research, Vol. I (13), 2015, pp.5 - 8.
19. Ibid
20. Clare Anderson, Convicts in the Indian Ocean, 2000, pp. 104 - 106.
21. G.S.V. Prasad and N.Kanakarathnam,Ibid.

22. Howitt, English in India, p. 21.
23. Ferdinand Mount, Tears of the Rajas.
24. Dennis Judd, The Lion and the Tiger: The Rise and Fall of the British Raj, 1600 - 1947, 2005, p. 132.
25. John Ruskin, The Pleasures of England, Lectures given in Oxford, 1884. p. 111
26. British Rule Condemned, p.36.
27. Phillips (2001): People on the Move : Introducing the Nomads of the World, Piquant, p.
28. Meena RadhaKrishna (2001): Dishonoured by History: Criminal Tribes and British Colonial Policy.
29. Gooday Jack (2006): The Theft of History, Cambridge University Press.
30. Subir Rana (2011) : Nomadism, Ambulation, and the Empire: Contextualising the Criminal Tribes Act of 1871, Transience, Vol 2, issue 2, pp. 1-22.
31. Subir Rana (2011) : Ibid
32. Ranjit Guha (1993) : Elementary Aspects of Peasants Insurgency in Colonial India, p. 23
33. Arnold David (1993) : Colonizing the Body : State Medicine and Epidemic Disease in 19th Century, Oxford University Press, p. 84.
34. Subir Rana (2011) : Ibid, p. 15.
35. Raghavaiah.V (1968) : Tribes of India, Bharatiya Adimajati Sevak Sangh, Vol 2, p.188-189.
36. Meena RadhaKrishna (2000): Colonial Construction of a ' Criminal Tribe' : Yerukulas of Madras Presidency, Economic and Political Weekly, July 8-15, pp. 2553-2563.
37. Ibid
38. Ibid
39. Ibid
40. Ibid
41. Ibid



# 11

# సాంస్కృతిక బానిసత్వం

ఆర్థిక బానిసత్వంతోపాటు సాంస్కృతిక బానిసత్వంకూడా సుదీర్ఘ వలసపాలన ఫలితమే. ఆక్రమించి, రాజ్యాధికారాన్ని చేజిక్కించుకొన్న ఆంగ్లేయులు కేవలం వనరుల దోపిడీతోనే తృప్తిచెందలేదు. దేశాన్ని సాంస్కృతిక బానిసత్వంలోకి కూడా నెట్టివేసారు. సాంస్కృతిక బానిసత్వం దేశంలో ఇంకా కొనసాగుతూనే ఉంది.

వలసదేశాలలోని లేని అస్తిత్వాలను తమ సౌకర్యార్థం సృష్టించటం, ఉన్న వైవిధ్యాలను, ప్రత్యేకతలను భూతద్దంలో చూపించి, తను ప్రయోజనార్థం జనసమూహాలమధ్య చిచ్చురేపటంలో ఆంగ్లేయులు సిద్ధహస్తులు. భారతదేశంలోనూ వారు అదే చేశారు. తమ ఆంగ్లఅస్తిత్వం ప్రత్యేకమైనదని, అందరికంటె శ్రేష్ఠమయినదని వారి గ్రుడ్డినమ్మకం. అందువల్ల తమ అస్తిత్వాన్ని కాపాడుకోవటానికి వారు ప్రయత్నిస్తుంటారు. తమ అస్తిత్వం ఎక్కడ పలుచబడుతుందోనన్న భయం వారిని వెంటాడుతుంది. అందుకే ఫ్రెంచివారిలాగా ఆంగ్లేయులు తమ వలసదేశాల ప్రజలతో కలసిపోలేదు. ఫ్రెంచివారిలాగా తమ పూర్వపు వలసదేశాల ప్రజలకు ఫ్రెంచిపౌరసత్వం తేలికగా వచ్చేందుకు వీలుగా పౌరసత్వంపొందే ప్రక్రియను సరళతరం చెయ్యలేదు. వారి ఆంగ్లఅస్తిత్వాన్ని, దాన్ని ప్రత్యేకతను కాపాడుకోవాలంటే ఇతరులతో కలువకూడదు.

వారి వలసపాలనలోకి వచ్చిన ఏకైక తెల్లదేశం ఐర్లండ్. ఐర్లండ్ వాసులు తమలానే శ్వేత జాతీయులు అయినప్పటికి, వారిని పాలితులుగానే చూసారు. వారితో వివాహసంబంధాలను నిషేధించారు. వారిపట్లకూడా అనేకఅంశాలలో వివక్ష చూపారు. తమలాగే ఉన్నవారిపట్ల అంత వివక్ష చూపినవారు నల్లజాతీయులపట్ల, భారతీయులపట్ల వివక్షారహితంగా ప్రవర్తిస్తారని అనుకోవటం పొరపాటే అవుతుంది. ఆంగ్లేయుల విశ్లేషణ కథనాలు, పరిశోధనలు, నిష్పాక్షికదృష్టితో చేసినవని భావించటం గొర్రె కసాయివాడిని నమ్మటం ఎట్లాంటిదో అట్లాంటిది.[1]

ఆంగ్లేయులు తాము పెత్తనం చేయవలసిన ప్రజల ఆచారవ్యవహారాలను, మతాన్ని, న్యాయసూత్రాలను అర్థంచేసుకునేందుకు కొంతకృషిచేశారు. అడుగడుగునా కనిపించిన వైవిధ్యం వారికి చికాకు తెప్పించింది. గందరగోళానికి గురిచేసింది. భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించటం వారికి చేతకాలేదు. మత, జాతి, కుల, తెగల స్వరూపస్వభావాలను పూర్తిగా అర్థంచేసుకోలేకపోయారు. కులానికి, జాతికి మధ్య ఉన్న తేడాపట్ల వారికి స్పష్టత లేదు. లేదా కులాన్ని జాతిపరంగా నిర్వచించటమే వారికి అనుకూలంగా ఉంటుందని భావించి అదే చేశారు. నిర్వచించి, విభజించి, కంటికి కనపడుతున్న మత, జాతి, కుల, తెగ, తేడాలను మరింత శాశ్వతం చెయ్యాలన్న దురుద్దేశ్యం వాటిని అధ్యయనం చెయ్యటానికి వారిని పురికొల్పింది.

పట్టించుకోను అవసరంలేని చిన్నచిన్న తేడాలను సైతం పట్టించుకొన్నారు. కులం, ఉపకులం, తెగ, మతం, జాతి, చర్మపు రంగు పేరుతో ప్రజలను రకరకాల తరగతులుగా విభజించి, ఆ ప్రాతిపదికలపై జనగణన చేశారు. ఆ క్రమంలో కొత్త కులాలను, ఉపకులాలును సృష్టించారు. తాము పాత కులాలకే తరతరాలనుండి చెందినవారమని, కొత్తకులాలకు, ఉపకులాలు తమకు అవసరంలేదని జనం మొత్తుకున్నా వినలేదు. ఫలానా వారు ఫలానా కులానికే చెందుతారు తప్ప వేరేరకంగా ఉండటానికి వీలులేదని తీర్మానం చేశారు.[2]

**వలసపాలనే పెద్ద సాంస్కృతిక నియంత్రణా ప్రాజెక్ట్ :**

సుప్రసిద్ధ సామాజిక మానవశాస్త్రవేత్త (Social Anthropologist) నిఖిలస్ బి.డర్క్స్ వలసపాలన సాధ్యమయ్యేందుకు, విస్తరించేందుకు ఉపయోగించిన సాధనాలను గురించి వివరంగా వ్రాశారు. భారతదేశంవంటి అనేకదేశాలను ఆంగ్లేయులు ఆక్రమించి, తమవలస దేశాలుగా చేసుకున్నారు. ప్రపంచవ్యాప్తంగా వారికి వలసదేశాలు ఉన్నాయి. అందుకనే వారిది రవిఅస్తమించని ఆంగ్లసామ్రాజ్యం అయింది. వారి విజయంవెనుక మెరుగైన ఆయుధసంపత్తి ఉంది. సైనికవ్యూహం ఉంది. జిత్తులమారితనం ఉంది. ఆర్థిక, రాజకీయ అధికారం ఉంది. కాని ఇవే కారణాలు కాదు. విదేశీభూభాగాలను ఆక్రమించటానికి వారు క్రూరమైన, హింసాత్మక పద్ధతులను అనుసరించారు. వలసీకరణ సాధ్యమవటానికి, బలపడటానికి, విస్తరించటానికి వారు అనుసరించిన హింసాత్మక పద్ధతులతోపాటుగా, వారు ఉపయోగించిన సాంస్కృతిక సాధనాలు (Cultural Technologies) కూడా అంతే

ప్రాముఖ్యం కలిగియున్నాయి. ఒక వలసదేశపు సంస్కృతిపై ఆక్రమితదేశపు పాలన యొక్క ప్రభావాన్ని చాలాసార్లు పట్టించుకోరు. ఎందుకంటే ఆధునికీకరణ, పెట్టుబడిదారీవిధానపు తర్కం అందుకు అడ్డం వస్తుంది.

కానీ వలసపాలన దానికదే ఒక పెద్ద సాంస్కృతిక నియంత్రణా ప్రాజెక్టు (Coloniolism was itself a Cultural project of control) అన్న విషయం ఇంకా పూర్తిగా గుర్తింపుకు నోచుకోలేదు. వలసదేశాలకు సంబంధించిన పరిజ్ఞానం విజయానికి కారణమయింది. ఆ విజయంవల్ల ఆ పరిజ్ఞానం మరింత ఉత్పత్తి అయింది. ఆ పరిజ్ఞానంతోనే కొత్తగా 'సంప్రదాయపు' సంఘాలు అని పిలువబడు తున్న వారి సాంస్కృతిక రూపాలను, మూలాలను పునఃపరిశీలన చేసి, వాటిని మార్చివేసే ప్రయత్నం చేసారు. ఈ పరిజ్ఞానం కొత్త సామాజిక తరగతులను, వైరుధ్యాలను సృష్టించింది.

పాలకులు-పాలితులు, పాశ్చాత్యులు-ఆసియాదేశాలవారు, ఆధునికులు-సంప్రదాయపరులు, ప్రాక్ పశ్చిమాలు ఇంకా అనేక విభజనల ప్రాతిపదికగా ఒక సమూహాన్ని మరొక సమూహానికి ప్రత్యర్థులుగా నిలబెట్టారు. భారతదేశాన్ని వారి ప్రయోజనాలదృష్ట్యా మానవపరిణామ శాస్త్రీకరణ చేశారు (Anthropolized). దాని ఆధారంగా భారతీయ సమాజపు తీరుతెన్నులగురించి, దాని నిర్మాణం, వికాసంగురించి, రాజకీయ సామర్థ్యం గురించి, నాగరికతా మూలాలగురించి అంతకుముందు వాడుకలో లేని ఒక కొత్త కథనాన్ని (Narrative) సృష్టించారు. ఆ కథనం వలసపాలన అనివార్యతను, ఆంగ్ల సామ్రాజ్యవాదుల పాలన భారత్‌లో శాశ్వతంగా కొనసాగితీరాల్సిన ఆవశ్యకతనుగురించి పదేపదే చెపుతుంది. ఇక్కడ మనం గమనించవలసిన విషయం ఏమిటంటే ఆధిపత్యం చెలాయించేందుకే వారు భారతసమాజాన్ని అధ్యయనం చేసారు. ఆధిపత్య చెలాయింపు కోసమే తెలుసుకున్నారు. తెలుసుకున్నది, అధ్యయనం చేసింది తమకు అనుకూలంగా ఉండేటట్లు, తమ పాలన కొనసాగింపుకు సమర్థతకు వాడుకొన్నారు అని డర్క్స్ తన గ్రంథంలో సోదాహరణంగా విశ్లేషణ చేశాడు[3].

మరొక ప్రఖ్యాత పాశ్చాత్య పండితుడు బెర్నార్డ్ కోన్ ఆంగ్లేయులు ఏవిధంగా తాము గమనించిన భారతీయ సమాజపు లక్షణాలకు తప్పుడుఅర్థాలను కల్పించి, అన్వయించారో వ్రాశాడు. వారిచే నిర్వచించబడ్డ కొన్ని మూసపెట్టెలలో భారతీయ

లందరిని ఇరికించారు. ఆ పెట్టెలకు కొన్నిపేర్లను పెట్టారు. ఆ పేర్లను వారి ప్రాచీన సంప్రదాయంనుండి తీసుకొన్నారు. "భారతదేశాన్ని అర్థం చేసుకోవటానికి, పాలనచేయటానికి వారు సృష్టించిన భావజాలాన్నే ఆధారం చేసుకున్నారు. అనుమించుగా అదే తర్కాన్ని వారు వాడుకున్నారు. ఎంతో సంక్లిష్టమైన స్మృతులను, సంకేతాలను, వాటి అర్థాలను వారు అర్థం చేసుకోగల పరిమితభావాలకే కుదించారు... భారతన్యాయ సూత్రాలను సైతం బ్రిటీషువారు అర్థం చేసుకోగల పదాలకు లోబడే అనువాదం చేయించి, అన్వయించారు. అమలు చేసారు. భారతదేశపు సమాజం విశాలమైంది. వైవిధ్యంతో కూడింది. సంక్లిష్టమైంది. అప్పుడప్పుడూ అస్తవ్యస్తంగా కూడా ఉంటుంది. కానీ నిరంతరంగా మార్పు చెందుతూనే ఉండేది. అటువంటి సమాజాన్ని బ్రిటీషువారు నిర్వచించటానికి పూనుకొన్నారు. దాని చరిత్రను, పరిణామక్రమాన్ని వ్రాయించారు. అంటే దాన్ని పునర్ నిర్మించారు. ఒకసారి బ్రిటీషువారు తమకు తృప్తికలిగేలా సమాజపు నియమనిబంధనలను, ఆచార వ్యవహారాలను తయారుచేసిన తర్వాత భారతీయులకు ఇంకో ప్రత్యామ్నాయం లేకుండా చేశారు. వాటిని అంగీకరించి, ఆ ప్రకారం ఆలోచించి, బ్రతకటమే వారి ముందున్న ఏకైకమార్గం. వారు తయారుచేసిన నియమనిబంధనలకు, నిర్దేశించిన ఆచార వ్యవహారాలను పాటించటమే భారతీయుల తక్షణ కర్తవ్యమైంది."[4]

**సాంస్కృతిక విషబీజాలు నాటిన వలసపాలకులు :**

సమాజాన్ని విడగొట్టటం, వర్గీకరించటం, విభజించటం, అనే సాధనాలను ఎంతో నైపుణ్యంతో వారు వాడారు. అందుకోసం భారతీయ సమాజపు బలహీనతలను, బలాన్ని, లోతుపాతులను, వివిధ కోణాలనుండి అధ్యయనం చేసారు. విభజించి, పాలించటానికి అనువుగా అధ్యయనం చేశారు. అధ్యయనంద్వారా తెలుసుకున్నారు. తెలుసుకున్నది ఆధిపత్యం చెలాయించటానికి వాడుకున్నారు. భారతీయులు ఈనాటికీ ఆంగ్లేయులు సృష్టించిన భావజాలంనుండి బయటకు రాలేక వివిధ వర్గాలుగా విడిపడి ఒకరినొకరు ద్వేషించుకుంటున్నారంటే వారు నాటిన విషబీజాలు ఎంతబలమైనవో, అవి ఎంత త్వరగా 'ఎంత లోతుగా' కొట్టిపారవేయటానికి వీలుకాని విషవృక్షాలుగా నాటుకు పొయ్యాయో తెలుస్తుంది.

లేని తేడాలను ఆంగ్లేయులు సమాజంపై రుద్దలేదని కొందరు వాదన చేస్తుంటారు. ఆంగ్లేయులకు ముందే కులాలు ఉన్నాయి. కులవిభజన ఉంది. ఆ కులాలను,

సామాజిక అసమానతలను మరింతగా బలపడేటట్లు ఆంగ్లేయులు చేశారు. ఆంగ్లేయసమాజం కూడా ఒక క్రమానుగత శ్రేణి (Hierarchical Society) సమాజమే. ఉన్నత, మధ్య, నిమ్న తరగతులమధ్య అంతరాలు, అసమానతలు కొట్టవచ్చినట్లు కన్పడేసంఘం నుండే వచ్చిన ఆంగ్లేయులు తమ వ్యవస్థకు సమీపంగా ఉండే భారతీయ వ్యవస్థకోసం వెదికారు. ముందుగా భారతీయసమాజాన్ని కొన్ని 'వర్గాలు'గా విభజించారు. కానీ ఆ విభజన వారికి తృప్తిని యివ్వలేదు. దానితో వారు 'కులవ్యవస్థ'ను తమకోసం పునర్ నిర్వచించటం ప్రారంభించారు. ఆ క్రమంలో వారి ప్రవేశానికి ముందు ఉన్న కులవ్యవస్థ స్వరూప స్వభావాలను వారు సరిగ్గా అర్థంచేసుకోలేదు. ప్రవేశ, నిష్క్రమణలు లేని జడమైన వ్యవస్థగా అంతకు ముందు కుల మెన్నడూలేదు. రాజకీయ, ఆర్థిక అవసరాలు, నమ్మకాలు, సంప్రదాయాల కారణంగా కొత్తకులాలు పుట్టుకొచ్చేవి. ఉన్నకులాలు అదృశ్యమయ్యేవి. ఒక కులంనుండి మరొకకులానికి రాకపోకలు ఉండేవి. వలసలూ ఉండేవి. కనుక జీవంలేని, మార్పులేని, జడమైన వ్యవస్థగా కులమెన్నడూ లేదు. కేవలం క్షత్రియులే ఎన్నడూ రాజ్యమేలలేదు. రాజ్యాలు ఏలినవారిలో అన్ని కులాలువారూ ఉన్నారు. వ్యవసాయం చేసినవారిలో అన్ని కులాలువారు ఉన్నారు. చేతివృత్తులు చేసేవారిలోనూ, సైనికులలోనూ, యంత్రాంగం నడిపిన వారిలోనూ అన్ని కులాలవారూ ఉన్నారు. కొన్ని కులాలు వారు చారిత్రక పరిస్థితులవల్ల వేరే ప్రాంతాలకు వలసవెళ్ళినప్పుడు కొత్తపేరు పెట్టుకోవటమో, వారు చేపట్టిన వృత్తికి దగ్గరగా ఉన్న కులసంఘంలోనో చేరేవారు. కానీ బ్రిటీషువారు ఇవేవీ పట్టించుకోలేదు. వారొక కొత్త సిద్ధాంతాన్ని ఆవిష్కరించారు. దాని ప్రకారం కులవ్యవస్థ ఒక నిచ్చెనమెట్లవ్యవస్థ. ఒక కులంనుండి మరొక కులానికి మారటానికి అవకాశం లేనిది. వివక్ష దాని సహజలక్షణం. నిచ్చెనమెట్ల కులవ్యవస్థ, దాని సహజలక్షణమైన వివక్షాపూరిత మానవసంబంధాలను భారతదేశంలో నిర్దేశిస్తున్నదన్న సిద్ధాంతాన్ని ప్రతిపాదించి, దానికి బహుళ ప్రాచుర్యం కల్పించారు. ఇది ఆంగ్లేయులు ఈ దేశంలోకి రాకముందున్న భారతీయ సమాజపు స్వరూపస్వభావాలను చాలా సంకుచితంగా నిర్వచించటంతప్ప మరేమీకాదు. అయితే వలసపాలకుల భావజాలాన్ని ఇప్పటికీ ఎక్కువమంది భారతీయులు విశ్వసించటం విడ్డూరంగా కన్పించినా, అది వాస్తవం.

**'కులం'కు పునర్జన్మను కల్పించిన ఆంగ్లపాలకులు :**

డర్క్స్ తన 'కాస్ట్ ఆఫ్ మైండ్' అనే బహుళప్రాచుర్యం పొందిన గ్రంథంలో ఆంగ్లేయుల పరిపాలనాకాలంలో 'కులం' ఏవిధంగా రూపాంతరం చెందిందో విపులంగా చర్చించాడు. వలసపాలకులకు భారతదేశంలోని, భిన్న అస్తిత్వాలను, సమూహాలను, వాటిని వివరించగల సామర్థ్యం ఉన్న ఏకైక పదంగా 'కులం' వారికి గోచరించింది. ఆ పదానికి లేని సామర్థ్యాన్ని ఆంగ్లేయులు దానికి అంటగట్టారు. రెండువందల సంవత్సరాల వలసపాలనలో సంభవించిన ఆధునికతతో సంపర్కం వలన 'కులం' స్థాయి పెరిగింది. కులవ్యవస్థ బలహీనపడి, అంతరించేందుకు అవకాశాలు మెరుగైన ఒకానొక చారిత్రకదశలో ఆంగ్లేయులు ఈ దేశంలో అడుగుపెట్టారు. ఆంగ్లేయులు తమరాకతో, పాలనతో దానికి పునర్జన్మను ప్రసాదించారు. తమ వలస ఆధిపత్య అధికారాన్ని అడ్డంగా ఉపయోగించి, అన్నిరకాల సామాజిక అంశాలను 'కులం'తో ముడిపెట్టి, దానిని ఒక సామాజిక కొలమానంగా తయారుచేసి, కొత్త జవసత్వాలను దానికి యిచ్చారని డర్క్స్ నిశితంగా ఆంగ్లేయులను విమర్శించాడు.[5]

'కులం' అనేది వ్యక్తులకు ఉన్న అనేక గుర్తింపులలో ఒకానొక గుర్తింపు మాత్రమే. కులవ్యవస్థ వలన ప్రధానంగా లబ్ధిపొందిన బ్రాహ్మణవర్గానికి సైతం అదొక్కటే గుర్తింపు కాదు. ప్రతివ్యక్తికి ఉండే అనేక గుర్తింపులలో కులం ఒకటేగాక, పుట్టిన ఊరు, కుటుంబం, రక్తసంబంధాలు, చదువు, చేపట్టే వృత్తి–వ్యాపకాలు, నెలవు, కొలువు, భాష, సంస్కృతి, ఆర్థికస్థాయి, రాజకీయ అనుబంధాలు, రాజాశ్రయాలు, ఇలా చెప్పుకుంటూ పోతే అనేక ఇతర ప్రాతిపదికలపై కూడా వ్యక్తులు తమ గుర్తింపుకోసం ఆధారపడతారు. కాని 'కులం' ఆధారంగానే వ్యక్తులను, సమూహాలను గుర్తించటం, విభజించటం అశాస్త్రీయం, అహేతుకం, అని డర్క్స్ అంటాడు. "వలసపాలనలో కులం' కు సర్వవ్యాపకతను కల్గించారు. దానికి అంతకుముందు ఎన్నడూలేని విస్తృతిని, ఏకరీతిని, అన్నిటిని తనలో ఇముడ్చుకోగల ఏకత్వాన్ని ఆపాదించారు".

సమాజస్వరూప స్వభావాలకు సంబంధించిన వారి ఈ అభాస సిద్ధాంతాన్ని హిందూ సంఘంపై వారు తమ అధికార బలంతో రుద్దకలిగారు. దానితో 'కులం' అనేది వలసకాలపు 'పౌరసమాజం'గా రూపుదిద్దుకొన్నది. పార్థాచటర్జీ అభిప్రాయం

ప్రకారం, ఒక పౌరసమాజం భారతదేశంలో ఎదుగకపోవటానికి కారణం కూడా కులమే. ఎవరికి వారు తమ కులసంఘానికి పరిమితమయినపుడు పౌరసమాజం ఎదుగలేదు. భారతీయులకు రాజకీయహక్కులు ఇవ్వటానికి వలసపాలకులు నిరాకరించటానికి ఈ కారణమే వారు చూపారు. భారతీయులు పాలితులేతప్ప పౌరులు కాదని, కనుక వారు పౌరులుగా ఎదిగేవరకు వలసపాలన తప్పనిసరి ఆవశ్యకత అని వారు వాదించారు.[6]

ఆంగ్లేయులు రాకముందు పాలకులుగా ఈ దేశాన్ని ఏలిన వారందరూ క్షత్రియకులానికి చెందినవారు కాదు. శూద్రకులాలకు చెందినవారూ సమర్థులైన పాలకులుగా పేరు ప్రఖ్యాతులు గడించారు. అన్ని వర్ణాలకు చెందినవారూ అటు పాలకులుగానూ, ఇటు పాలితులుగానూ ఉన్నారు. ఏ వర్ణంవారు ఏపని చెయ్యాలని చెప్పబడిందో దానికే ఎవరూ పరిమితం కాలేదు. వర్ణసంకరం యథేచ్ఛగా జరిగింది. వర్ణాలకు అతీతంగా పాలకులయ్యారు. సేవకే పరిమితం అనుకొనే శూద్రులు, వ్యాపారానికి పరిమితం అనుకొనే వైశ్యులు, అధ్యయనానికి పరిమితం కావలసిన బ్రాహ్మణులు అందరూ అన్ని వృత్తులు చేపట్టారు. పాలకులుగా, రాజులుగా, సైన్యాధికారులుగా, సైనికులుగా, వ్యాపారులుగా, రైతులుగా అన్ని వర్ణాలకు చెందినవారు పనిచేశారు. వర్ణాశ్రమధర్మాలు కాగితాలకే పరిమితం అయ్యాయి. బ్రాహ్మణులకు ఎంతవరకు గౌరవం యివ్వాలో అంతమేరకే యిచ్చారు. వారి మాటే శిరోధార్యం కాదు. రాజులకు ఇష్టమైనపుడు వారి మాటవిన్నారు. లేకుంటే వారిని సలహాదారు పదవులనుండి తొలగించారు. భారతదేశ ఉపఖండమంతా ఒకే వర్ణవ్యవస్థలేదు. అది ఏకరీతిగా కూడాలేదు. వెయ్యి సంవత్సరాల విదేశీ ముస్లింల ఏలుబడిలో జరిగిన దారుణాలకు వ్యతిరేకంగా ప్రజలు అనేకసార్లు తిరుగుబాట్లు లేవదీశారు. వాటికి నాయకత్వం వహించిన వారిలో అనేక వర్ణాలకు చెందినవారు ఉన్నారు. శూద్రకులాలు వారు అసమాన పోరాటపటిమను చూపించారు. కాని ఆంగ్లేయులకు ఇవేవీ పట్టలేదు. జడమైన, సంకుచితమైన, అభివృద్ధి నిరోధక వ్యవస్థ ఈ దేశంలో నెలకొని ఉన్నదని ప్రచారం చెయ్యదల్చుకొన్నారు. అందుకు అనుగుణంగా సామాజిక చరిత్రను పునర్నిర్మించారు.

నవీన పరిశోధకులు వారి సామాజిక చరిత్రను ప్రశ్నిస్తున్నారు. నాలుగువర్ణాల వ్యవస్థ ఏమాత్రమూ మార్పులేకుండా, కొన్నివేల సంవత్సరాల వెనుక అది ఎట్లా ప్రారంభం అయిందో, అట్లాగే ఏమార్పులేకుండా కొనసాగిందని, భారత ఉపఖండమంతా అది ఏకరీతిన వ్యవస్థీకరించబడిందని వారు సిద్ధాంతీకరించిన వ్యవస్థ ఉనికి, స్వరూపస్వభావాలు నిరంతరం మార్పు చెందుతూనే ఉన్నవని, కాలానుగుణమైన మార్పులవలన తన చేతనను, చైతన్యాన్ని అది పోగొట్టుకోలేదని ఆధునికులు ఇప్పుడు పరిశోధనలద్వారా నిరూపిస్తున్నారు.

### ఈస్టిండియా కంపెనీ పండితుల వక్రభాష్యాలు :

వివాదాల పరిష్కారానికి భారతన్యాయ సూత్రాల క్రోడీకరణ అవసరమని 18వ శతాబ్ది చివరిలో కంపెనీ భావించింది. అప్పుడు గవర్నర్ జనరల్‌గా ఉన్న వారెన్ హేస్టింగ్స్ 11 మంది సంస్కృత పండితులను అందుకై నియమించాడు. వారి సహాయంతో క్రోడీకరించబడ్డ వాటిని ముందుగా సంస్కృతంలో, ఆ తర్వాత పర్షియన్ భాషలోకి, తదుపరి ఆంగ్లంలోకి అనువాదం చేశారు. వారు తయారుచేసిన, లేదా క్రోడీకరించిన వాటినే 'కోడ్ ఆఫ్ జెంటూ లాస్' (Code of Gentoo Laws) లేక 'ఆర్డినేషన్సు ఆఫ్ పండిట్స్' అనిపేరు. ఈ చట్టాలు 'ఆంగ్ల-బ్రాహ్మణుల' దృక్కోణంనుంచే తయారు చేయబడ్డవి. భావంలోనూ, స్ఫూర్తిలోనూ (letter and spirit) అసలు గ్రంథాలలో చెప్పబడిన విషయాలకు, క్రోడీకరించబడిన అంశాలకు సంబంధంలేదు. అంతేకాక ప్రజల వాడుకలో ఉన్న ఆచారాలను ఏమాత్రం వారు పట్టించుకోలేదు. కంపెనీ తమకు యిచ్చిన ప్రాధాన్యాన్ని వినియోగించుకొని బ్రాహ్మణపండితులు వారి కులానికి విశిష్టత చేకూరే విధంగా పక్షపాతధోరణితో న్యాయసూత్రాలను క్రోడీకరించారని వచ్చిన విమర్శలలో వాస్తవం ఎంతైనా ఉంది. గ్రంథాలలోలేని కొన్ని ఆచారాలను సైతం వారు సృష్టించి, వాటికి పవిత్రతను అంటగట్టారని కూడా విమర్శకులు అన్నారు. ఈ పండితుల పక్షపాతం, వక్రభాష్యాలు, భారతదేశపు కుల సమస్యను మరింత జటిలం చేయటానికి ఆంగ్లేయులకు ఉపయోగపడ్డాయి.[7] 'రూఢి బలీయసి' అనే వ్యవహారిక సూత్రం గుర్తింపుకు నోచుకోలేదు.

స్మృతి, శాస్త్రాలలో పేర్కొన్న విషయాలకు, సామాజిక వాస్తవాలకు మధ్య అంతరం ఎప్పుడూ ఉంటుంది. సమాజపు నడవడికను ప్రభావితం చేసే అంశాలు అనేకం ఉంటాయి. ఒకానొక స్మృతిలో గతంలో ఒకానొకప్పుడు వ్రాయబడి

ఉన్నట్లుగా జనం నడుచుకోరు. తమ స్వీయ అనుభవాలనుండి, అవసరాలనుండి, అనుభూతుల నుండి ఎప్పటికప్పుడు సమాజం తన నడవడికను దిద్దుకొంటుంది. విదేశీదాడుల కారణంగా, బానిసత్వంలో మ్రగ్గుతున్న భారతదేశపు సమాజం తన సొంత అస్తిత్వాన్ని, గుర్తు పెట్టుకోలేని నిస్సహాయ స్థితిలో పడింది. అలాంటి పరిస్థితులలో ఆంగ్లేయులు కొత్త పౌరస్మృతులు తయారుచేయించారు. దానికి సహకరించిన పండితులు కాలం చెల్లిన స్మృతులను ఉట్టంకిస్తూ తయారుచేసిన సూత్రాలు సమాజాన్ని మరింతగా బలహీన పర్చటానికి ఆంగ్లేయులకు ఉపయోగపడినవే తప్ప, భారతీయసమాజానికి జరిగిన మేలు అంటూ ఏమీలేదు. తెలిసో, తెలియకో పండితులు బ్రిటీషువారి 'విభజించి పాలించు' కుట్రకు కావలసిన సాంస్కృతిక ఆయుధాలను సమకూర్చి పెట్టారు. పాలితుల బలహీనతలను, బలాన్ని అంచనావేయటానికి, వారి ఆర్థిక వనరులను మదింపు చేయటానికి, జనగణనచేసి, విభజించటానికి విధివిధానాలను ఆంగ్లేయులు రూపకల్పన చేశారు. సమాజంమీద పూర్తి నియంత్రణను సాధించటానికి వారు పూనుకొన్నారు. సామ్రాజ్యవాదుల మహత్తర వ్యూహంలో భాగంగా మరింతగా భారతీయసమాజాన్ని బలహీనపరిచి, నియంత్రించేందుకు కులపరంగా, జాతిపరంగా, మతపరంగా విభజించి, ఒక వర్గానికి వ్యతిరేకంగా మరొక వర్గాన్ని నిలబెట్టారు. ఆంగ్లేయులకంటె తమకు వ్యతిరేకంగా నిలబెట్టబడ్డ వర్గమే తమకు ప్రధానశత్రువుగా ప్రతి వర్గమూ భావించేటట్లు చేశారు.[8]

19వ శతాబ్దపు జాతిపరమైన భావజాలవ్యాప్తి కూడా భారతీయులను బానిసత్వాన్ని, ఆంగ్లేయుల ఆధిపత్యాన్ని అంగీకరించేటట్లు చేసింది. పాశ్చాత్యదేశాలు తమ చొరవతో, సాహసంతో, మెరుగైన ఆయుధ సంపత్తితో, జిత్తులమారితనంతో అనేక దేశాలలో వలసలు ఏర్పాటుచేసుకున్నాయి. శ్వేతజాతి మిగిలిన ఇతరజాతులకంటె శ్రేష్ఠమయింది కనుకనే శ్వేతజాతీయులకు ప్రపంచం పాదాక్రాంతమయిందని, నల్ల, గోదుమరంగు జాతీయులు పరిపాలించబడటానికే తప్ప పాలించటానికి పనికిరానివారని సిద్ధాంతీకరించారు. ఆఫ్రికాను వారు ఎంత అమానుషంగా కొల్లగొట్టారో శ్వేత మేధావులు చెప్పలేదు. భారతదేశంనుండి అన్యాయంగా ఎంత దోచుకొని వెళ్తు న్నారో చెప్పలేదు. ఆసియా, ఆఫ్రికా, 'కొత్తప్రపంచం' వారికి వశం అవటంతో దానికి కారణంగా 'జాతి'ని చూపించారు.

శ్వేత జాతీయత యొక్క విశిష్టత, ప్రత్యేకత కారణంగా ప్రపంచాన్ని ఏలటానికే దేవుడు వారిని సృష్టించారని ప్రచారం చేసుకున్నారు. ఇతరజాతులవారు బలహీనులు అని, మొరటువారని, అనాగరికులని, తమంత తాముగా అభివృద్ధి చెందలేరని, శ్వేతజాతీయులు యిచ్చే ఆలంబనతోనే వారు ప్రగతిపథంలోకి రాగలరని, కనుక వలసీకరణ ఒక చారిత్రక అనివార్యత అని, ప్రపంచాన్ని నాగరికం చెయ్యటంకోసం తెల్లవారికి దేవుడు యిచ్చిన బాధ్యత అని వారు వివిధ రూపాలలో ప్రజలలోకి తీసుకొని వెళ్ళారు. భారతీయులు ఈ భావజాలాన్ని చాలాకాలంపాటు నమ్మి ఆత్మవిస్మృతిలో పడ్డారు. భావదాస్యంలోకి వారు నెట్టివేయబడ్డారు. ఇదంతా సామ్రాజ్యవాదుల పెద్దకుట్రలో భాగమని వారు 19వ శతాబ్దపు చివరలో కాని తెలుసుకోలేకపొయ్యారు.

**జనాభా లెక్కల సేకరణ :**

ఆంగ్లేయులు దేశ, ప్రాదేశిక, జిల్లా పటాల (Maps) ను విరివిగా వాడుకొన్నారు. మ్యూజియంలు నెలకొల్పారు. ఈ వస్తుప్రదర్శనశాలలో పెట్టిన వస్తువులు, చిత్రాలు, శిల్పాలు, కత్తులు, ఖడ్గాలు, ఛాయాచిత్రాలు మొదలైనవాటిని, ఒక క్రమపద్ధతిలో వాటిని విభజించి, పేర్చి ప్రదర్శించారు. ఆంగ్ల సామ్రాజ్యం విజయగాథలను, చరిత్రను, చిహ్నాలను ప్రదర్శించారు. పటాలు (Maps), వస్తుప్రదర్శనశాలల (Museum)తోపాటుగా జనగణన (Census) కూడా వారొక సాధనంగా వాడుకొన్నారు. వర్గీకరణ (Classification), సామాజిక విభజన (Social Division) అనేవి 1872లో మొదటి జనగణనతో ప్రారంభం అయి, వారి పాలనాకాలం అంతా కొనసాగింది. ప్రతి పది సంవత్సరాలకు ఒకసారి జనాభాను లెక్కించేవారు. 1901లో దానిని ఒక జాతి, సంస్కృతిపరమైన జనాభా లెక్కలుగా (Ethnographic Census) మార్చారు.

జనగణన ప్రక్రియలో భాగంగా 'కులాలు'ను నిర్వచించారు. ప్రతికులానికి కొన్ని లక్షణాలను అంటగట్టారు. కొన్ని కులాలను ప్రత్యేకంగా గుర్తించారు. కొన్ని కులాలను వీరోచిత కులాలుగా (Martial Races), మరికొన్ని కులాలను 'నేరస్థుల తెగలు' (Criminal Tribes)గా గుర్తించారు. కొన్ని కులాలను సంచార జాతులు (Nomadic Tribes)గా వర్గీకరించారు. ఒక వ్యక్తిని బ్రాహ్మణకులానికి చెందినవాడని జనాభాలెక్కల్లో నమోదు అయితే అతని సామాజికస్థాయి పెరిగేది. మరో వ్యక్తిని

'శూద్ర' కులానికి చెందినట్లు నమోదు అయితే అతని సామాజికస్థాయి తగ్గేది. ఆంగ్లేయులకు ముందు శూద్రకులానికి చెందినవారు జీవనోపాధికోసం ఒక రాజుగారి ఏలుబడిలో ఉన్న గ్రామంనుండి వేరొక రాజుగారి ఏలుబడిలో ఉన్న గ్రామాలకు, పట్టణాలకు వెళ్ళినప్పుడు అతని 'కులం' అతని వెంటవచ్చేది కాదు. వలసపాలన కాలంలో 'శూద్ర' శబ్దానికి అఖిలభారతస్థాయి వచ్చింది. ఒక ప్రాంతంలో శూద్రుడిగా నమోదు అయితే వేరే ప్రాంతానికి వెళ్ళినా ఆ ముద్ర చెరిగిపోదు. 'వీరోచిత జాతులు'గా గుర్తింపు పొందినవారినే సైన్యంలోకి తీసుకొనేవారు. ఆంగ్లేయులు సైనికుల నియామకం కులప్రాతిపదిక మీదే చేశారు. అంతకుముందు కులం ఏదయినప్పటికి తగిన దేహదారుఢ్యం ఉన్నవారిని సైన్యంలో చేర్చుకొనేవారు. ఆంగ్లేయులు సైన్యపు రెజిమెంట్లను సైతం కుల ప్రాతిపదికమీదే నిర్మాణం చేశారు.

బ్రిటన్‌లో చేపట్టిన జనగణన విధానానికి, వలస భారతంలో చేపట్టిన జనగణన విధానానికి హస్తిమశకాంతరం ఉంది. ఆంగ్ల మానవశాస్త్ర పరిణామ శాస్త్రజ్ఞుల (Anthropologists) పర్యవేక్షణ, నిర్దేశనం కింద భారతదేశంలో జనగణన ప్రారంభం అయ్యింది. వారికి భారతదేశ జనగణన అనేది ఒక ప్రయోగశాల అయింది. భారతదేశాన్ని ఆ శాస్త్రప్రకారం అధ్యయనం చేసి, వారిని నియంత్రించటానికి, పెత్తనం చేయటానికి సమగ్ర విధానాల రూపకల్పన లక్ష్యంగా ఆంగ్లేయులైన మానవశాస్త్ర పరిణామ శాస్త్రజ్ఞులకు ఒప్పగించారు.

ఆంగ్లేయులు రాకముందు దేశప్రజలు కచ్చితంగా నిర్వచించబడని సమాజాలలో నివసిస్తూ ఉండేవారు. సంప్రదాయాలు ఆచారవ్యవహారాలు పాటించటం లోనూ, పెద్ద తేడాలు ఉండేవికావు. ఎవరికి ఏది నచ్చితే, ఏది అనుకూలమైతే దాన్ని పాటిస్తూ ఉండేవారు. ప్రతి కుటుంబానికి పెద్దలనుండి కొన్ని ఆచారాలు వస్తుండేవి. కుల, జాతి, మతపరంగా నిర్దిష్టమైన ఆచారాలను వారు ఆచరించినా, ఇతరుల ఆచారాలను సైతం పాటించి గౌరవించేవారు. అన్ని పండుగలను ఉమ్మడిగా చేసుకొనే అలవాటు ఉండేది. ఉమ్మడి వనరులు, ఉమ్మడి కుటుంబాలు, స్పష్టంగా నిర్వచించబడని, ప్రాదేశిక హద్దులలో వారు కాలం వెళ్ళబుచ్చేవారు. ఒకరికొకరు సహాయం చేసుకుంటూ సుఖదు:ఖాలను ఇతరులతో పంచుకుంటూ తమతమ భేదాలగురించి పెద్దగా పట్టింపు లేకుండా బ్రతికేవారు. వారిగురించి వారికి గాని, ఇతరుల గురించి వారికి గాని ఉన్న అవగాహన కనిష్ఠంగానే ఉండేది. తమతమ కులాలకున్న ప్రత్యేకతలు కాని, ఇతరుల కులాలకు ఉన్న ప్రత్యేకతల గురించి వారెన్నడూ పట్టించుకొన్నట్లు కనపడదు.

సమష్టి జీవనవ్యాపారమే వారు ఎరిగినది. ఏ ప్రత్యేకతలు లేకుండా, కోరుకోకుండా, గుంపులో ఒకరిగా బ్రతకటానికి వారు యిష్టపడేవారు. వారివి ఉమ్మడి అస్తిత్వాలు. వారికి ప్రాదేశిక బంధనాలు లేవు[9].

**భారతీయుల ఉమ్మడి అస్తిత్వాన్ని దెబ్బతీసిన జనాభా లెక్కలు :**

అయితే ఆంగ్లేయుల కుటిలనీతివలన జనగణన ప్రక్రియ వారి ఉమ్మడి అస్తిత్వాన్ని దెబ్బకొట్టింది. వారు ప్రతి సమూహానికి హద్దులు నిర్వచించారు. వారిమధ్య కులపరంగా, జాతిపరంగా, ఆచారపరంగా అనేక తేడాలను వారు తీసుకొనివచ్చారు. వ్యక్తులను ఉమ్మడినుండి విడదీసి ఏదో ఒక కులసంబంధ లక్షణాలకు మాత్రమే పరిమితం చేశారు. కులాన్ని పరస్పర భిన్నమైన రీతిలో (Mutually Exclusive) నిర్వచించటం మొదలెట్టారు. అంటే ఒక కులానికి చెందినవారి లక్షణాలు ఇంకొక కులంవారికి ఉండవన్న మాట. ఏ కులానికి ఆ కులమే ప్రత్యేకం. ఇతర కులాలకు చెందినవారు వారితోపాటు పుట్టి, పెరిగి, అదేవృత్తి చేస్తూ, పక్కపక్కన ఉన్నప్పటికీ ఇతరకులాలకు చెందినవారి ప్రత్యేకతలు వేఱు. అంటేవారు వేఱు, ఇతరులు వేఱు. వారు, ఇతరకులాలకు చెందినవారు ఒక్కటికాదు.

కులాలమధ్యనేకాదు, ప్రధానమతాలమధ్యకూడా ఇలాంటి అంతరాలే ఆంగ్లేయులు సృష్టించారు. హిందువులు, జైనులు, సిక్కులు, బౌద్ధులమధ్య సరిహద్దు రేఖలేదని ఆంగ్లేయులు గుర్తించారు. దేశంలో వివిధ ప్రాంతాలలో హిందువులు, ముస్లిముల మధ్య అనేక ఆచార వ్యవహారాలలో సామీప్యాన్ని సైతం వారు గుర్తించారు. పెళ్ళిళ్ళు, పండుగలు, ఆహారం, ఆరాధన మొదలైనవాటికి సంబంధించి, సామాజిక సాంస్కృతిక ఆచార వ్యవహారాలలో, పాటిస్తున్న పద్ధతులలోనూ సారూప్యం వారికి కన్పించింది. ఇది ఆంగ్లవలసవాదులకు నచ్చలేదు. వారి అభిప్రాయంలో భారతదేశం భిన్నసమాజాల దేశం. ఏ సమాజపు ప్రత్యేకత దానిదే. ఒకదానికి మరొకదానితో ఎట్టి సంబంధం ఉండకూడదు. ఒకదాని కొకటి పరస్పర భిన్నమైనవి. ఒక వ్యక్తి ఒక జనసమూహానికి అంటే ఏదో కులానికో, మతానికో చెంది ఉంటే అతడు ఇతరకులాలు, మతాలవారికంటె భిన్నంగా ఉండాలి అన్నది వారి విశ్వాసం. భారతదేశపు జనసమూహాల స్వరూపస్వభావాల గురించి వారు అనుకొన్నది ఒకటి, కనుగొన్నది మరొకటి. అనుకొన్న, ఆశించిన దానికి పూర్తిగా భిన్నమైనది జనసమూహాంలో వారికి కన్పడింది. ఈ సమస్యను వారు చాలా సులభంగా

పరిష్కరించారు. వారి అధికారాన్ని ఉపయోగించి వారు అనుకొన్నదాన్ని, ఆశించినదాన్ని భారతసమాజంపై రుద్దారు. ప్రజలను మతపరంగా, కులపరంగా, తెగపరంగా విభజించారు. ప్రజలు యిచ్చిన అరకొర సమాధానాలతోనే ఈ పనిని వారు పూర్తిగా చేశారు. జనాభా కమిషన్ రూపొందించిన ప్రశ్నావళికి ప్రజలు సంతృప్తికరమైన సమాధానాలు యివ్వలేకపొయ్యారు. అయినా ఇదేమీ వారికి పట్టలేదు.

**రిస్లీ కుట్ర :**

హెర్‌బర్ట్ హోప్ రిస్లీ 1901లో జనాభా కమిషనర్‌గా పనిచేశారు. జనగణన ఆధారంగా ఒక పెద్ద సంకలన గ్రంథాన్ని (The People of India) తీసుకొనివచ్చారు. భారతీయుల పుర్రెలు, ముక్కుల కొలతలను తీసుకొని, వాటి ఆధారంగా ప్రజలను జాతిపరంగా విభజించాడు. భారతీయుల ముఖకవళికల ఛాయాచిత్రాలను ఆ గ్రంథంలో పొందుపరిచాడు. వివిధకులాలవారి సంప్రదాయాలను, సామాజిక పద్ధతులను సంకలనం చేశాడు. 1901 జనాభాగణన జాతిపరమైన గణనగా ప్రకటించి, ఆవిధంగానే ఆయన దాన్ని నిర్వహించాడు. రిస్లీ సంకలనంచేసిన సమాచారం వలసపాలకులకు ఎంతో ఉపకరించింది. పాశ్చాత్యులు భారతీయులకంటె భౌతికంగా దృఢమైనవారని, విశిష్టులని వారి అభిప్రాయం. ఆ అభిప్రాయానికి అనుగుణంగా జాతిపరంగానూ, సామాజికపరంగాను, తెగలవరంగానూ సమాజంలోని వివిధ జనసమూహాలమధ్య విభేదాలను, ప్రత్యేకతలను సృష్టించారు. అదే భారతీయ సమాజస్వరూప స్వభావాలగురించిన జ్ఞానానికి సంబంధించిన రూపావళి (Paradigm) అయింది. అదే అతిముఖ్యమైన, ఆధిపత్యం (Dominant) చెలాయించ కల్గిన రూపావళి అయింది.ముక్కుల కొలతలు ఆధారంగా రిస్లీ ఒక నాసికా సూచిక (Nasal Index) ను తయారుచేశాడు. దాని ఆధారంగా భారతీయుల లక్షణాలను వర్గీకరణ చేశాడు. ఆర్యులుగా, అనార్యులుగా ప్రజలను విభజించిదలచి, అందుకు తగిన ప్రాతిపదికలకోసం భారతదేశంలో తన నాలుగు దశాబ్దాల ఉద్యోగకాలంలో లోతుగా అధ్యయనం చేసాడు. ఆర్యులుగా, అనార్యులుగా ప్రజలను విభజించటమే కాక, అమెరికాలోని నల్లబానిసల లక్షణాలతో అనార్యుల లక్షణాలకు పోలిక ఉందని ప్రకటించాడు. ఇప్పుడు విస్తృతంగా చర్చించబడుతున్న ఆఫ్రో-దళిత-ద్రవిడియన్ ప్రాజెక్టుకు కావలసిన బీజాలు రిస్లీయే వేశాడు.

కులవ్యవస్థకు జాతికి, జన్యులక్షణాలకు సంబంధమే లేదు. కాని కులాన్ని జాతిపరంగా నిర్వచించటానికి ప్రయత్నం చేశాడు. చేపట్టిన వృత్తుల కారణంగా వచ్చే కులాలను జాతిపరంగా అన్వయించటం వాస్తవానికి పెద్దకుట్ర. మాక్స్ ముల్లర్‌నుండి రిస్లీ ప్రేరణ పొందారు. కులాన్ని అధ్యయనం చెయ్యటానికి కావలసిన 'జాతి కోణాన్ని' మాక్స్‌ముల్లర్ ఇచ్చాడు. అందుకు ఆయనను ప్రేరేపించింది భారతదేశాన్ని క్రైస్తవం చెయ్యాలన్న ఉద్దేశ్యమే. "ఇప్పటివరకు హిందువులను క్రైస్తవంలోకి మార్చటానికి అడ్డుగోడగా ఉన్న కులం భవిష్యత్తులో కేవలం వ్యక్తులనే కాక, భారతసమాజంలోని వివిధవర్గాలను మూకుమ్మడిగా మతం మార్చటానికి ఉపయోగపడుతుంది" అన్నది మాక్స్ ముల్లర్‌మాట.

మాక్స్ ముల్లర్ ప్రకారం మొదటి మూడు వర్ణాలు ఆర్యులవి. శూద్రులు ఆర్యులు కారు. అయితే సంస్కృత గ్రంథాలలో ఆర్యులకు, అనార్యులకు భౌతికమైన తేడాలు ఉన్నట్లుగా చెప్పబడిలేదని ఆయన ఒప్పుకున్నాడు. వివిధ తెగలవారి నాసికలను వివిధ రకాలుగా వర్ణిస్తూ చెప్పబడిన ఒకటి-రెండు శ్లోకాలు ఆయన కంటబడ్డాయి. అనాస అనేపదం నాసిక గురించి చెప్పబడింది. అయితే ముల్లర్ దానినుండి ఏ ముఖ్యమైన నిర్ణయానికి రాలేకపోయాడు. పాశ్చాత్యపండితులలో విశేషం ఏమిటంటే ఇంతకుముందు ఆవిషయంపై ఎంతవరకు చెప్పబడిందో అక్కడినుండి తిరిగి అధ్యయనం చేయటం వారికి అలవాటు. మాక్స్‌ముల్లర్ అభిప్రాయాలను తన లక్ష్యానికి అనుగుణంగా రిస్లీ మలుచుకొన్నాడు.

ముల్లర్ రిస్లీకి వ్రాసిన ఒక వ్యక్తిగత లేఖలో ఈవిధంగా వ్రాసాడు "పుర్రెలు, జుట్టు, కళ్ళు, చర్మపురంగు మొదలైన వాటి వర్గీకరణను, భాషల వర్గీకరణను సమన్వయం చేస్తే మంచి ఫలితాలు రావచ్చును". అదే లేఖలో ఆయన ఇంకోవిషయమూ చెప్పాడు "పుర్రె, మెదడుగుల్ల ఒకవ్యక్తి యొక్క ఆధ్యాత్మికతను తెలియచేస్తాయని జాతిశాస్త్ర విద్యార్థులు భావిస్తుంటారని వ్రాశాడు". మాక్స్ ముల్లర్ జాతివిద్వేషకుడు, తెల్లజాతికి ప్రతినిధి. ఆయనదృష్టిలో ఇతరజాతుల భాషలు, సంస్కృతులు తెల్లజాతీయుల భాష, సంస్కృతుల కంటె చాలా అధమమైనవి.

ఋగ్వేదంలో మాక్స్‌ముల్లర్ యాదృచ్ఛికంగా కనుగొన్న ముక్కుల వర్ణనను ఆధారం చేసుకొని, భారతదేశ జాత్యహంకార జాతిశాస్త్రం (Racist ethonology)ను నిర్మాణం చేశాడు. సంస్కృత పరిజ్ఞానం లేని రిస్లీ కేవలం మాక్స్‌ముల్లర్‌ను ఆధారం

చేసుకొని ఆర్యులు తరచుగా ఆదిమవాసుల (aborigines) ముక్కుల గురించి వ్రాసారని ప్రతిపాదన చేశాడు. కాని అది వాస్తవంకాదు. రిస్లీ భారతదేశపు జాతిచరిత్రకు, తద్వారా ఒకపెద్ద వక్రీకరణకూ ఆద్యుడయ్యాడు. ఆయన అధ్యయనం, నిర్మాణం చేసిన జాతులచరిత్రలను ఆంగ్లపాలకులు వ్యవస్థీకృతం చేశారు. జనాభా కమీషనర్‌గా నియమించబడటంతో, జాతులపరమైన వర్గీకరణను భారత ప్రజలపై రుద్దాడు. పరస్పర భిన్నమైన జాతులుగా వర్గీకరించి, వాటికి చట్టబద్ధతను కల్గించాడు. ఈ రోజుకు ఆయన సృష్టించిన చట్టపరమైన చట్రం నుండే (legal frame work) భారతదేశపు సమాజాన్ని చూస్తున్నారు. ఆయన చేసిన కులాల వర్గీకరణ నేటికీ నిలిచిఉండి, కుల సంఘర్షణలకు, రాజకీయాలకు ఆధారభూతంగా నిలిచిఉంది.

రిస్లీ తన ఉద్దేశ్యాన్ని చాలాస్పష్టంగా చెప్పుకొన్నాడు. శాస్త్రీయంగా పరిశోధన చేసి హిందూసమాజంగా పిలువబడుతున్న దానినుండి అనార్యులను పెద్దసంఖ్యలో విడగొట్టటమే తన లక్ష్యమని చెప్పుకున్నాడు. అందుకు ముక్కుకొలతలు చర్మపు రంగుకంటె జాతినిర్ధారణకు ఉపయోగించే పరికరాలుగా ఫ్రెంచి శాస్త్రజ్ఞుల భావనను యథాతథంగా తీసుకొన్నాడు. శరీరభాగాల కొలతలు (Anthropometry) తీసుకొని, మనుషుల లక్షణాలను అంచనావేసే కొత్తగా అభివృద్ధి చెందుతున్న శాస్త్రాన్ని భుజాన వేసుకున్నాడు. భారతదేశపు ప్రజలకు సంబంధించి తను సేకరించిన వివరాలు ఆధారంగా రెండు ముఖ్యమైన అంశాల మధ్య దగ్గర సంబంధం ఉన్నట్లుగా ఆయన గుర్తించాడు.

తలకొలతలకు, సామాజిక ప్రాధాన్యతలు (Social Preferences)కు మధ్య సంబంధం ఉందని ఆయన చెప్పాడు. దాని ఆధారంగా ఆయన ఇలావ్రాసాడు "కులవ్యవస్థకు మూలం జాతుల సముదాయమే (Community of Races) తప్ప వృత్తుల సముదాయం (Community of functions) కాదు" 1891లో బెంగాల్ ప్రజల జాతుల చరిత్ర అలాంటి అధ్యయనాలకు నమూనా అయింది. వంగదేశీయుల తలలు, ముక్కుల వ్యాసమితి (రెండు స్థానాలమధ్యదూరాన్ని కొలిచేసాధనం Calipers)తో కొలిచి, వాటి ఆధారంగా భౌతికశరీరపు కొలతలు ఆధారంగా సమాజపు క్రమానుగత శ్రేణు (Hierarchies) లను నిర్మాణం చేసాడు.

సమాజంలో ఒక కులపుస్థాయి ఆ కులపు నాసిక ప్రమాణసూచి విలువతో విలోమంగా (Inverse)గా ఉంటుందని సిద్ధాంతీకరించాడు. మైదానాలలో

నివసించేవారిని హిందువులుగా, కొండకోనలలో నివసించే వారిని హైందవేతరులుగా ఆయన విభజించాడు. ఈనాటికి వారిని 'తెగలు'గా పిలుస్తున్నాం. 'షెడ్యూల్డ్ ట్రైబు' అనే పదం రాజ్యాంగంలోనూ ప్రవేశించింది. వివిధ కులాలు భౌతికంగా వేఱువేఱు జాతులవారని పేర్కొన్నాడు. ఆర్యులుగా అనార్యులుగా భారతీయులను విడగొట్టటమేకాక మొత్తం భారతీయులను 7 జాతులుగా విడగొట్టి అందరికంటే పైన ఆర్యులు, అందరికంటె దిగువున అనార్యులను నిలబెట్టాడు. సామాజిక సమూహాలను సైతం 7 రకాలుగా వర్గీకరించాడు. భారతదేశంలో 2378 ప్రధానకులాలు, తెగలు ఉన్నాయని, 43 జాతులవారు ఉన్నారని ఆయన నిర్ణయించాడు.

అమెరికాలో ఏమి జరిగిందో అదే భారతదేశంలోనూ జరిగిందని రిస్లీ వ్రాసాడు. ఆఫ్రికానుండి దిగుమతి చేసుకున్న బానిసలతో ఏవిధంగా కొందరు శ్వేతజాతీయులు ప్రవర్తించారో అదేవిధంగా ఆర్యులు స్థానిక ద్రావిడజాతులపట్ల అంతేక్రూరంగా ప్రవర్తించారని వ్రాసాడు. ఈ ఆర్య ద్రావిడుల సంపర్కమే కులానికి ఆధారమని చెప్పాడు. ఇలాంటి తప్పుడు సిద్ధాంతాలే ఆఫ్రో-దళిత-ద్రవిడ ఉద్యమాలకు, బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమాలకు కావలసిన భూమికను తయారుచేసాయి[10].

డా॥ అంబేడ్కర్ రిస్లీ సిద్ధాంతాన్ని కొట్టిపారవేశారు. రిస్లీ నాసికా సూచిక ద్వారా సేకరించిన వివిధకులాలవారి సమాచారాన్ని సమగ్రంగా పరిశీలన చేసి, రిస్లీ సిద్ధాంతానికి విలువలేదని ప్రకటించాడు. "బ్రాహ్మణులు, అంటరానివారు ఒకే జాతికి చెందినవారని ఈ కొలతలు చెప్తున్నాయి. బ్రాహ్మణులు కనుక ఆర్యులు అయితే, అంటరానివారు కూడా ఆర్యులే. బ్రాహ్మణులు కనుక ద్రావిడులు అయితే, అంటరానివారు కూడా ద్రావిడులే. బ్రాహ్మణులు నాగజాతికి చెందిన వారనుకొంటే, అంటరానివారు కూడా అదే జాతికి చెందుతారు. కనుక రిస్లీ సిద్ధాంతం తప్పుడుపునాదులతో నిర్మాణమైందని చెప్పక తప్పదు".[11]

రిస్లీ బృందం కోరుకున్నట్లుగానే, ఆంగ్లేయులు తమకు ఆపాదించిన కులవ్యక్తిత్వాలను అంగీకరించి తమ కుల అస్తిత్వాన్ని కాపాడుకోవటానికి భారతీయులు ప్రయత్నం చేశారు. కులపరంగా తమకుగల హక్కులగురించి, రావలసినవాటాల గురించి, తమతమ కులాలకు ప్రత్యేకంగా అందవలసిన సదుపాయాలు, ప్రయోజనాలగురించి అడగటం మొదలుపెట్టారు. ఏ కులభేదాలు అయితే రావాలని వారు(ఆంగ్లేయులు) కోరుకున్నారో, అవి బయటపడటానికి కావలసిన భావజాలాన్ని

తయారుచేసి, సిద్ధాంతీకరించి సమాజాన్ని ఛిన్నాభిన్నం చేశారు. వారు ఆశించిన ప్రయోజనం వారికి వచ్చింది. ఇతర కులాలవారితో సమానంగా సైనిక, పౌర ఉద్యోగాలలో నియామకాలు, విద్యాపరంగా ఉపకారవేతనాలు మొదలైనవి అడగటం మొదలుపెట్టారు. కులాలమధ్య పోటీ మొదలయింది. అంతకుముందు కులాల కుమ్ములాటలూ లేవు. 19వ శతాబ్దం చివరినాటినుండి కులచైతన్యం వెల్లివిరిసి కులాలమధ్య తీవ్రమైన పోటీకి, కుల రాజకీయాలకు దారితీసింది.[12]

సృష్టించి, ప్రవేశపెట్టి, రెచ్చగొట్టిన కులవైషమ్యాలు వలసపాలకులకు ఎంతో ఉపయోగపడ్డాయి. ఏ కులానికి ఆ కులం ప్రత్యేకమైనదని, ఒక కులానికి మరొకకులానికి మధ్య పొంతన కుదరదని, వారు చేసిన సిద్ధాంతం వారికి ఎంతో ఉపయోగపడింది. 1857లో చేసిన ఉమ్మడి తిరుగుబాటును కొనసాగకుండా సామాజిక ఐక్యతను దెబ్బతీసారు. కులాలమధ్య కుమ్ములాటలు పెరగటంతో ఒక కులంవారికి వ్యతిరేకంగా మరొక కులంవారిని నిలబెట్టటంతో, అంతర్గత సమస్యలతోనే హిందూ సమాజం కునారిల్లింది. ఆంగ్లేయుల పాలన, అజమాయిషీ లేకుంటే కులాలవలన, కుల సంఘర్షణలవలన భారతీయులు తమ్ముతాము పరిపాలించుకోలేని నిస్సహాయులని, బలహీనులని, బలమైన, విశిష్టమైన ఆంగ్ల సామ్రాజ్యవాద ఛాయలో ఉండటమే మేలు అని వలసపాలకులు ప్రచారం చెయ్యసాగారు. కేవలం ఆంగ్లపాలనే భారతీయులను ప్రస్తుతం వారున్న దీనస్థితినుండి ఉద్ధరించగలదని, నాగరికులను చెయ్యగలదని వాదించటం మొదలుపెట్టి, భారతీయులు స్వయంపరిపాలనాధికారానికి అర్హులుకారని ప్రపంచానికి, ప్రజలకు చాటింపు వేశారు.

కొత్త అస్తిత్వాలసృష్టి కేవలం 'కులం' కు మాత్రమే పరిమితం కాలేదు. భాషాపరంగా కూడా అస్తిత్వాలు మొదలుపెట్టారు. భాషాపరంగా ఉన్న ప్రత్యేకతలు ఆధారంగా ఏ భాషమాట్లాడేవారు ఎందరున్నారు, ఎక్కడున్నారు, వారి ఆర్థిక సామాజిక ప్రతిపత్తులు ఎలా ఉన్నాయి మొదలైన అంశాల ఆధారంగా చర్చలు లేవనెత్తారు. భాషాపరమైన అస్తిత్వాలను జాతిపరంగాను అన్వయించారు. వేఱువేఱు భాషలు మాట్లాడే వారు వేఱువేఱు జాతులకు చెందుతారని వారి ఉద్దేశ్యం. ఒక దేశపు ప్రజలంతా ఒకే భాష మాట్లాడాలని, భిన్నభాషలుంటే ఆ దేశప్రజలందరూ భిన్నజాతులకు చెందుతారని వారు తీర్మానించారు. భాషాపరమైన, కులపరమైన,

జాతిపరమైన అస్తిత్వాలచర్చలు, వాదోపవాదాలు కారణంగా సామాజికంగా వివిధవర్గాలమధ్య దూరం పెరిగింది. ముందు మానసికంగానూ, ఆ తర్వాత భౌతికంగాను దూరం పెరుగుతున్నకొద్దీ వైషమ్యాలు మరింతగా పెరిగాయి. స్వయంపాలనా ప్రతిపాదనలు చర్చకు వచ్చినప్పుడు, ప్రతికులమూ తనయొక్క స్వప్రయోజనాలను కాపాడుకోవటానికి ప్రయత్నం చేసింది. తాము కోరుకున్నట్లుగానే ఇతరకులాలవారు కూడా కోరుకుంటే తమ ప్రయోజనాలు దెబ్బతింటాయన్న భ్రమను ప్రతికులంవారిలోనూ ఆంగ్లేయులు కల్పించారు.

**మిల్, మెకాలే, మాక్స్‌ముల్లర్‌లద్వారా చరిత్ర వక్రీకరణ :**

వీటన్నికంటె మిన్నగా మతాలమధ్య వలసపాలకులు చిచ్చుపెట్టారు. విదేశీముస్లిందాడుల సందర్భంగానూ, వారి పాలనాకాలంలోనూ అనేక లక్షలమంది హిందువులను ముస్లింలుగా మార్చారు. భారతీయ ముస్లింలలో 99 శాతం ఈ దేశంలో పుట్టి ఈదేశంలోనే పెరిగినవారు. తరతరాలుగా ఇక్కడ ఉంటున్నవారు. 1857 విప్లవం సందర్భంగా భారతీయ ముస్లింలు, హిందువులు కలసి తిరుగుబాటు చేశారు. ఏనాటికైనా ఈ రెండు ప్రధానమతాలవారి ఉమ్మడిపోరు తమకు ప్రమాదకరమని ఆంగ్లేయులు గ్రహించారు. అందుకే ఒకవిధానంగా హిందువుల, ముస్లింలమధ్య అగాధం సృష్టించటానికి ప్రయత్నంచేసి, సఫలీకృతులయ్యారు. అందుకు ముందుగా వారు భారతదేశ చరిత్రను పునర్‌నిర్మించారు. మొత్తం చరిత్రను 'హిందు', 'ముస్లిం', 'బ్రిటీషు' కాలాలుగా విభజించారు. దీనికి ఆద్యుడు జేమ్సుమిల్. భారతదేశ చరిత్రపేరుతో ఆయన 1817-26 మధ్య ఒక చరిత్ర గ్రంథాన్ని (The History of British India) ప్రచురించారు. చరిత్రను ఆయన వక్రీకరించాడు. భారతదేశంలో అనేక మతసమాజాలమధ్య ఎప్పుడూ వైరుధ్యం ఉండేదని, పాలకులు నియంతలుగా పాలించేవారని, వారు ప్రజలను అణచివేయటంతో పేదరికంలోకి నెట్టివేయబడ్డారని, దానితో భారతదేశ ఆర్థికవ్యవస్థ చైతన్యంలేని ఒక జడరాజ్యంగా మారిపోయిందని జేమ్సుమిల్ వ్రాశాడు.

19వ శతాబ్దం మధ్యనాటికి వలసపాలనా దృక్కోణంనుండి వ్రాయబడ్డ భారతచరిత్ర జేమ్సుమిల్, మెకాలే, మాక్స్‌ముల్లర్‌ల సారథ్యంలో తయారుచేయబడ్డ చరిత్ర పాఠ్యాంశాలుగా వచ్చాయి. ఈ చరిత్రప్రకారం భారత ప్రాచీన నాగరికత అంటే హిందూనాగరికతే. అయితే దాన్ని నిర్మించింది మధ్య ఆసియానుండి క్రీస్తుకు 1500 సంవత్సరాలకు ముందు వలసవచ్చిన ఆర్యులు. ఆర్యులు పరదేశీయులు.

వారు ఇక్కడ ఉన్న దేశీయులను, స్థానికులను ఓడించి, వారిని దక్షిణాదికి నెట్టివేసి ఉత్తర భారతదేశంలో స్థిరపడ్డారు. అగ్రకులాలకు చెందినవారు ఆర్యుల వారసులు. ఆర్యుల, స్థానికప్రజల సంస్కృతి సమ్మేళనమే హిందూసంస్కృతి. వారు ప్రాథమికంగా నెలకొల్పింది వ్యవసాయనాగరికతను. వారి భాష సంస్కృతం. వారు వేదాలను రచించారు. ఆర్యులతర్వాత ఈ దేశంమీద దాడిచేసి, స్థిరనివాసం ఏర్పరుచుకొన్న వారిలో ప్రధానమైన వారు ముస్లింలు. ఆ తర్వాత ఆంగ్లేయులు వచ్చారు. ఈ రకమైన వక్రీకరణలతో కొన్ని దశాబ్దాలపాటు ప్రతితరానికి నూరిపోశారు. ఆర్యులు, ముస్లింలు ఎలా బయటనుండి వచ్చారో, అలాగే తామూ వచ్చామని, ఆంగ్లేయులు చెప్పుకున్నారు.

దివ్యజ్ఞాన సమాజాన్ని ప్రారంభించిన వారిలో ఒకరైన కల్నల్ హెచ్.ఎస్. ఆల్కాట్ ఆంగ్లేయుల ఆర్యులు వలసవాదులన్న సిద్ధాంతాన్ని తీవ్రంగా విమర్శించారు. ఆర్యులు ఈ దేశవాసులేనని వారు ఏ పరదేశంనుండీ రాలేదని, వాస్తవానికి పశ్చిమ దేశాలకు నాగరికతను నేర్పింది వారే నని ఆయన స్పష్టం చేశారు. ఆంగ్లమేధావులు వాస్తవాలను వక్రీకరించి ఆర్యులు-అనార్యులు, అగ్రకులాలు-నిమ్నకులాలు, హిందువులు-ముస్లింలు వేఋవేఋ జాతులకు చెందినవారని చెప్పటానికి ఎంతో పాండిత్య ప్రదర్శనచేశారు. హిందువులు, భారతీయ ముస్లింలు వేఋవేఋ జాతులకు చెందినవారని, వారిమధ్యఉన్న భేదాలు తీవ్రమైనవని, వారిమధ్య రాజకీయ పొత్తుకు అవకాశం లేదని కూడా ఆంగ్లేయులు ప్రచారం చేశారు. భారతీయముస్లింలు భారతీయ హిందువులతో ఎన్నటికీ కలసి ఉండలేరని, అది సాధ్యంకాదు కనుక రాజ్యాధికారం హిందువుల చేతుల్లోకి పోకుండా ముస్లింలు తగిన జాగ్రత్తలు తీసుకోవాలని వేర్పాటు ధోరణులను ముస్లింలలో రెచ్చగొట్టారు. 'అస్తిత్వ పోరాటా'నికి తెరతీశారు.

**దేశవిభజనకు దారితీసిన బెంగాల్ విభజన :**

వేర్పాటు ధోరణులను రెచ్చగొట్టటానికి వీలుగా ఆంగ్లేయులు వక్రబుద్ధితో వాస్తవాలను మరుగుపరచి, హిందూదేశ చరిత్రను నిర్మాణంచేశారు. 1857కు ముందు ఉన్న భారతదేశగతాన్ని అంతా తారుమారుచేసి తమ స్వార్థరాజకీయ ప్రయోజనాల కోసం పునఃసృష్టిచేశారు. 1905లో బెంగాల్ విభజనకు లార్డ్ కర్జన్ కుట్రచేశాడు. పరిపాలనా సౌలభ్యంకోసం బెంగాల్‌ను విభజిస్తున్నట్లుగా చెప్పినా, ఆంగ్లేయుల ఏలుబడి-అంతులేని దోపిడీ

తూర్పున ఒక ముస్లిం మెజారిటీ ప్రాంతాన్ని వారు సృష్టించి హిందువులను అల్పసంఖ్యాకులుగా చేయదలుచుకొన్నారు. వారు క్రొత్తగా ఏర్పరిచిన పశ్చిమ బెంగాల్‌లో కూడా వంగభాష మాట్లాడేవారు అల్పసంఖ్యాకులైనారు. ఆవిధంగా వారికి ఎక్కడా అస్తిత్వం లభించకుండా చేయబడింది. బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా ఆందోళనలు చెలరేగాయి. బెంగాల్ విభజన దేశవిభజనకు నాందీ ప్రస్తావన అని ఎవ్వరూ చెప్పవలసిన పనిలేకుండానే ప్రజలు ఉవ్వెత్తునలేచి, అందుకు తమ అసమ్మతిని తెలియచేసారు. ముస్లింలుసైతం ముందు బెంగాల్ విభజనను కోరుకోలేదు. ఢాకానవాబు దాన్ని పూర్తిగా వ్యతిరేకించాడు. లార్డ్ కర్జన్ ఢాకావెళ్ళి నవాబును ఒప్పించాడు. దేశంలో ముస్లింపాలన ముగిసాక లేని ఐక్యత ఇప్పుడు తూర్పుబెంగాల్ ముస్లింలలో బెంగాల్ విభజన తీసుకొనివస్తుందని కర్జన్ తన ప్రసంగంలో చెప్పాడు. నవాబుకు లక్షపౌండ్ల ఋణాన్ని తక్కువవడ్డీకి ఆయన వ్యక్తిగత అవసరాలకోసం కర్జన్ ఆఘమేఘాలమీద యిచ్చి, ఆయనను సంతోషపెట్టటంతో నవాబు విభజనకు అంగీకరించాడు.

ముస్లింలపట్ల వారికున్న పక్షపాతాన్ని ఆంగ్లపాలకులు ఎన్నడూ దాచుకోలేదు కూడా. వారి రాజకీయ ప్రయోజనాలకు ఆనాడు భారతీయ ముస్లింలు వారికి అవసరమయ్యారు తప్ప, వారిమీద వారికేమీ ప్రత్యేకమైన అభిమానం ఏమీలేదు. జనాభాలెక్కల కమీషనర్‌గా పనిచేసి, కులాలు, జాతులు, తెగలు, మతాలవారీగా ప్రజలను విభజించిన హెర్బర్ట్ రిస్లీ బెంగాల్‌ను విభజించమని కర్జన్‌కు సలహా ఇచ్చాడు. ఎందుకు ఆ ప్రతిపాదన చేసాడోకూడా ఆయనే చెప్పాడు "ఒక ముఖ్యమైన లక్ష్యం విభజించటం, దానిద్వారా మనపాలనను గట్టిగా వ్యతిరేకిస్తున్న వర్గాన్ని బలహీనపర్చటం" ఆనాటి బెంగాల్ లెఫ్టినెంట్ గవర్నర్ తనకున్న ఇద్దరు భార్యలలో (హిందూ, ముస్లిం), రెండో భార్య నాకు ప్రియమైందని చెప్పుకున్నాడు. తాము హిందువులను ఏమి చేసినా ఆంగ్లపాలకులు తమ్ము ఏమీ చేయరన్న సంకేతాన్ని అర్థం చేసుకోవటానికి ముస్లింలలోని మతఛాందసవాదులకు ఎంతో సమయం పట్టలేదు. తరతరాలుగా కలసిమెలసి జీవిస్తున్న హిందువుల ఇళ్ళను దోచుకున్నారు. స్త్రీలను మానభంగం చేశారు. హిందువులను వెదికి పట్టుకొని, వెంటపడిచంపారు. తూర్పు బెంగాల్ అల్పసంఖ్యాక హిందూవర్గంపై జరిగిన దాడులు వర్ణనాతీతం. ఆంగ్లేయులు బెంగాల్‌ను విభజించి, హిందువులపై దాడులకు ప్రోత్సహించి,

అప్పటివరకు నెలకొని ఉన్న హిందూ-ముస్లిం సమైక్యతను ఒక్కసారిగా దెబ్బకొట్టారని హెన్రీ నెవిన్సన్ వ్రాశాడు. పాలనాసౌలభ్యంకోసం చేస్తున్నదిగా చెప్పబడిన విభజన వంగదేశాన్ని అతలాకుతలం చేసింది. ఆంగ్లేయులు ముస్లింలపట్ల ఎంతో పక్షపాతంతో వ్యవహరించారని నెవిన్సన్ వ్రాశాడు.

"ఆంగ్ల అధికారులు, ఉద్యోగులు మహమ్మదీయులపట్ల పక్షపాతంతో సానుకూలంగా మొగ్గి వ్యవహరించటం వారి విధానం. ఏ మతసంబంధ వివాదం కానీ, జాతి సంబంధవివాదం కానీ చెలరేగినప్పుడు వారెప్పుడూ ముస్లింల పక్షాన్నే బలపరుస్తూ ఉండేవారు. బెంగాల్ విభజనకు ప్రభుత్వం ముస్లింల మద్దతును బహిరంగంగానే కోరింది. ముస్లింల అత్యాచారాలను, అమానుషాలను అడ్డుకోవటానికి ప్రభుత్వం ఎట్టి ప్రయత్నమూ చేయలేదు. మతఘర్షణల సందర్భంగా వచ్చిన ఫిర్యాదులలో కేవలం హిందూవ్యతిరేక ఫిర్యాదులనే నమోదుచేశారు. హిందువులపై విచారణలు జరిపి శిక్షలు వేసారు. ప్రభుత్వ నియామకాలనుండి వారిని తొలగించారు. హిందూ పాఠశాలలకు అప్పటివరకు యిస్తున్న ప్రభుత్వ సహాయాన్ని నిలిపివేశారు.

మహమ్మదీయులు హిందువుల ఇళ్ళపై దాడిచేస్తే, పోలీసులు చోద్యంగా చూస్తూ నిలబడ్డారు. ఘర్షణలను నివారించటానికి పంపిన ప్రత్యేక పోలీసుదళాలుసైతం స్థానికముస్లింలతో కలసి హిందువుల యిళ్ళపైపడి దోచుకున్నారు. హిందువులపైనే నిఘాపెట్టారు. ప్రభుత్వ విధానమైన బెంగాల్ విభజనను వ్యతిరేకిస్తున్నది హిందువులే కాబట్టి, వారినే లక్ష్యంగా చేసుకొని, వారిని దారికి తేవటానికి, అణచివేత చర్యలకు పూనుకొన్నామని ప్రభుత్వమే బహిరంగంగా చెప్పింది."[13]

ఆంగ్లేయుల మద్దతుతోనే ముస్లింలీగ్ ప్రారంభం అయింది. ముస్లింలీగ్ ద్విజాతి సిద్ధాంతానికి కావలసిన భూమికను ఆంగ్లమేధావులే తయారుచేశారు. ముస్లింలీగ్‌ను నెత్తిన పెట్టుకొని, ప్రోత్సాహించింది కూడా ఆంగ్లేయులే. వారు డిమాండ్ చేయకపోయినా, ఆంగ్లేయులు దేశవిభజన చేసే వెళ్ళి ఉండేవారు. 1905 బెంగాల్ విభజన 1947 దేశవిభజనకు నాందీ ప్రస్తావన వంటిది. గుర్తించటం, లెక్కించటం, విభజించటం, ఒక వర్గానికి వ్యతిరేకంగా మరొకవర్గాన్ని ఆగర్భశత్రువులుగా నిలపటం వారి 'విభజించు-పాలించు' విధాన లక్ష్యం. అయితే వారు పెంచి పోషించిన వేర్పాటు, విభజన భావజాల మత్తులోనుండి స్వాతంత్ర్యంవచ్చి

ఇన్నేళ్ళు అయినా మనం బయటపడకపోవటం విడ్డూరమే కాదు, విషాదంకూడా.

వలసపాలకులు నాటిన భావజాలంనుండి విముక్తి (Decolonisation of Mind) ఈనాటి అవసరం. కుల, జాతి, మత, భాష, తెగలపరంగా వారు సృష్టించిన అగాధాలు వలసపాలన కొనసాగింపుకు వారు వేసిన ఎత్తుగడలు. ఆ భావజాల ప్రభావంనుండి సమాజంలోని వివిధ వర్గాలను బయటకు తీసుకొని రావటానికి గట్టి ప్రయత్నమే జరగాలి.

**మెకాలే ఆంగ్లవిద్య-లక్ష్యాలు, ప్రభావం :**

1833 జులై 10న బ్రిటీషు పార్లమెంటులో మెకాలే చేసిన ప్రసంగం ఈనాటికీ భారతదేశపు స్థితిగతులపై ప్రామాణికమైన కథనం (Standard Narrative)గా కొనసాగటం విచారకరమైన వాస్తవం. ఆంగ్లేయులు భారతదేశంలో ప్రవేశించేనాటికే పరిస్థితులు దిగజారాయని, ఆంగ్లేయుల జోక్యం వలననే భారతదేశం తన ఉనికిని, అస్తిత్వాన్ని కాపాడుకోగలిగిందని ఆయన చెప్పాడు. "ఎలాంటి పరిస్థితులలో మనం ఆ దేశాన్ని కనుగొన్నాం? మనం ఆ దేశాన్ని ఏవిధంగా అభివృద్ధిచేశాం? ఆనాడు భారతదేశంలో నెలకొన్న పరిస్థితులను తెలియచెప్పేందుకు చరిత్రలో మరో దృష్టాంతం లేదు. సంఘంలో గందరగోళం నెలకొంది. అశాంతి నెలకొంది. క్షణక్షణానికి పరిస్థితులు వేగంగా మారుతున్నాయి. ఏదో కారణంగా కొన్ని పొత్తులు ఏర్పడతాయి. మరో క్షణంలో మార్పు చెందుతూ ఉంటాయి. ఒక తరం హయాంలోనే ఒక వంద రాజ్యాలు పుట్టి, పెరిగి, వికసించి, పతనమై, అదృశ్యమయ్యాయి. చిన్నఅశ్విక దళం సమకూర్చుకోగల ప్రతిసాహసికుడు సింహాసనం అధిష్టించగలగటానికి అర్హుడయ్యేవాడు. ప్రతి రాజభవనం ప్రతి సంవత్సరం అనేక కుట్రలకు రాజద్రోహులకు, విప్లవాలకు, రక్తసంబంధీకుల హత్యలకు నిలయమయ్యేది. దేశంలో ఉన్న అణచివేతదారుల వలననూ, బయటనుండి వచ్చే అణచివేతదారులవలననూ ప్రజల జీవనం దుర్భరమైంది. ప్రజల నడ్డివిరగగొట్టడంతో వారి బ్రతుకులు ధూళిలో కలిసాయి. నియంతృత్వంయొక్క అరాచకంయొక్క అన్ని అనర్థాలు, చెడులు ఒక్కసారిగా పట్టిపీడించి ఆ జాతిని నిర్వీర్యం చేసాయి. దుర్భరం చేసాయి. ప్రభుత్వ దోపిడీతప్ప పాలన అంటే ఏమిటో వారికి తెలియదు. వారి గొప్పనగరాలు నిర్మానుష్యంగా ఉన్నాయి. ఎడతెరిపిలేకుండా ప్రవహించే వారి జీవనదుల తీరప్రాంతాలన్నీ కఱవు కాటకాలకు నిలయమయ్యాయి.

వారి గతకాలపు ఐశ్వర్యం, నాగరికత కనుమరుగు కావటానికి ఎన్నో సంవత్సరాలు పట్టదు. మరికొన్ని సంవత్సరాలలో వాటి అవశేషాలు కూడా మిగలవు"[14]. అలాంటి పరిస్థితులలో ఈస్టిండియా కంపెనీ భారతదేశంలో శిథిలమైన సమాజాన్ని తిరిగి నిర్మించే బాధ్యతను భుజాలకు ఎత్తుకొందని మెకాలే చెప్పాడు.

ఆసియా దేశాల సమాజాలను మరమత్తు చేయటం అనే బృహత్తర బాధ్యత దైవికవిధిగా ఆంగ్లేయులమీద పెట్టబడిందని మెకాలే తన ప్రసంగాలలో వివరించి చెప్పాడు. మెకాలే తన కాలపు ఆలోచనారీతికి స్పష్టమైన ప్రతినిధి.

భారతదేశంపట్ల ఆంగ్లేయుల ఇతరపాశ్చాత్యుల దృక్పథాన్ని 19వ శతాబ్దంలో ప్రభావితంచేసినవారిలో జేమ్సు మిల్ ముఖ్యుడు. చరిత్రకారుడు, ఆర్థికవేత్త, ఆంగ్లసామ్రాజ్యవాద సమర్థకుడు అయిన జేమ్సుమిల్ ఈస్టిండియా కంపెనీ ఉద్యోగిగా జీవితకాలం పనిచేశాడు. ఆయన ఎప్పుడూ భారతదేశంలో పనిచేయలేదు. కాని భారతదేశ చరిత్రను వ్రాసాడు. జేమ్సుమిల్ భారతదేశ చరిత్రను మతప్రాతిపదికన హిందూ, ముస్లిం, బ్రిటీషు నాగరికతలుగా విభజించించాడు (క్రైస్తవ నాగరికతగా కాదు). ఆ తర్వాతవారుసైతం దాన్ని అంగీకరించి, ఆ విధంగానే చరిత్రను నిర్మించటం ఆశ్చర్యకరం. మరికొందరు పురాతన, మధ్య, ఆధునిక యుగాలుగా చరిత్రకాలాన్ని విభజించినాకూడా, దానికి ప్రాతిపదిక మిల్ చూపిన మార్గమే-దేశాన్ని పాలించిన ప్రధాన రాజవంశాల మతం ఆధారంగా చరిత్రకాలాన్ని విభజించటమే. ఈస్టిండియా కంపెనీ పాలకులకు, చరిత్రకారులకు మిల్ వ్రాసిన చరిత్ర (History of British India) ప్రాథమిక గ్రంథం అయింది.

మిల్ హిందూ ధర్మాన్ని, సంస్కృతిని తీవ్రంగా వ్యతిరేకించాడు. ఎందుకూ పనికిరానిదిగా, ప్రగతి నిరోధక మైనదని, హేతుబద్ధ తార్కికతకు నిలవని 'హీనమైన మతం'గా విమర్శించాడు. హిందువులు నిజాయితీపరులు కాదని, యాచకులని, పిరికివారని, అనుభూతులు లేనివారని, అతిశయోక్తిపరులని మిల్ అభివర్ణించాడు. మిల్, మెకాలేలు ఇద్దరూ వారు హిందూమతాన్ని 'హీదెనిజం' గా (Heathenism) చిత్రీకరించి, తమ రచనలు ప్రసంగాల ద్వారా అప్రతిష్టపాలు చేశారు.

మెకాలేకు ముందు ఛార్లెస్ గ్రాంట్ అనే రాజకీయ మతప్రచారకుడు (Politico evangelist) భారతదేశపు వ్యవహారాలమీద నిపుణుడుగా (Authority) పేరు పొందాడు. 1767-90 మధ్య భారతదేశంలో పనిచేశాడు. ఆ తర్వాత బ్రిటీషు పార్లమెంటు సభ్యుడయ్యాడు. ఈస్టిండియా కంపెనీ డైరెక్టరు అయ్యాడు. క్రైస్తవాన్ని

స్థాపించి, భారతీయులను నాగరికులుగా చేయాలని ప్రబోధించేవాడు. హిందూ సమాజాన్ని సాంస్కృతిక బానిసత్వంలోకి నెట్టివేయటానికి వారు అనుసరించిన వ్యూహంలో రెండు ప్రధాన అంశాలు ఉన్నాయి. మొదటిది క్రైస్తవీకరణ కాగా, రెండవది దేశీయవిద్యను, విద్యాసంస్థలను నిర్వీర్యంచేసి ఆ స్థానంలో ఆంగ్లవిద్యను ప్రవేశపెట్టటం.

ఇంగ్లీషును బోధనాభాషగా ప్రవేశపెట్టి దానిద్వారా ఒక వంక పాశ్చాత్య సమాచారాన్ని బోధిస్తూ, మరొకవంక హిందువుల కాలగణన, చరిత్ర, భూగోళం, శాస్త్రవిజ్ఞానం, సామాజిక సూత్రాలు, రాజనీతి సిద్ధాంతాలు అన్నీ తప్పుల తడకలని, అశాస్త్రీయములని ప్రచారం చేయాలి. తద్వారా హిందూమతాన్ని, విజ్ఞానాన్ని క్షీణింపచేయాలి. బాహాటంగా క్రైస్తవమతంలోకి మారని వాళ్ళకుసైతం పాశ్చాత్య భావాలను, ఆలోచనాధోరణిని, జీవితవిలువలను నేర్పాలి. పరిశోధన (ఇండాలజీ) పేరుతో వేదాలు, పురాణాలు మొదలైన హిందూ ప్రాచీన సాహిత్యాన్ని వక్రీకరించి, లేనిపోని వివాదాలను సృష్టించి బలహీనపరచాలి. ఈపనిని మిషనరీ పండితులు చేస్తారు. హిందూ సమాజాన్ని అధ్యయనం చేసే సాకుతో నిమ్నకులాలు, గిరిజనులమీద దృష్టిని కేంద్రీకరించి, వారిని హిందూసమాజంనుంచి వేఱుచేసే సిద్ధాంతాలను సృష్టించాలి. ఈ సమూహాలను క్రైస్తవమతంలోకి మార్చడంద్వారా హిందూమతాన్ని నాశనం చేయాలి. హిందువులుగా ఉన్నంతకాలము ఉపేక్షిత వర్గాల పరిస్థితి మెరుగుపడదని ఆయా వర్గాలను నమ్మించాలి. వారికి వేరే సంస్కృతి, మతం ఉండేవనే సిద్ధాంతాన్ని రూపొందించి ప్రచారం చేయాలి. హిందువుల్లో ఉండే మానవసహజమైన వైవిధ్యాన్ని విభేదాలుగా చిత్రీకరించి, ప్రయత్నపూర్వకంగా వైషమ్యాలను పెంచి, అగాధాలను సృష్టించి పరస్పర అవగాహనకు, సమన్వయానికి అవకాశం లేకుండా చేసి, క్రైస్తవమతానికి మార్గాన్ని సుగమం చేయడంద్వారా బ్రిటీషు పాలనను సుస్థిరం చేయాలి ('చదువుల చెట్టు', ఖండవల్లి సత్యదేవప్రసాద్ 1989 పుట:201)

మెకాలే విద్యావిధానం ఈ బృహత్పథకంలో ఒక కీలక ఘట్టం. 1835వ సంవత్సరంలో థామస్ బాబింగ్టన్ మెకాలే తన సుప్రసిద్ధ 'మినిటు' ద్వారా ఇంగ్లీషువిద్యయొక్క లక్ష్యాలను ప్రవచించాడు."శరీర ఛాయ, ఆకారంలో భారతీయులుగాను, అభిరుచులు అభిప్రాయాలు, బుద్ధులలో ఇంగ్లీషు వారిలాగ

ప్రవర్తించే ఒక వర్గాన్ని మనం తయారు చేయాలి. వారిద్వారా మనం ఈ దేశాన్ని పాలించవచ్చు". తన తండ్రికి వ్రాసిన లేఖలోనే ఆయన తను ప్రవేశపెట్టిన విద్యావ్యవస్థ గురించి వ్రాసింది.

"మన ఆంగ్ల పాఠశాలలు అద్భుతంగా వర్ధిల్లుతున్నాయి. ఈ విద్యయొక్క ప్రభావం హిందువులమీద ప్రగాఢంగా ఉంటుంది. ఇంగ్లీషువిద్యను అభ్యసించిన ఏ హిందువుకూ తనమతంపట్ల పరిపూర్ణ విధేయత ఉండదు. కొందరు ఆ మతంలో పుట్టారు కాబట్టి హిందువులుగా కొనసాగుతున్నారు. కాని అనేకమంది పూర్తి హేతువాదులుగా మారిపోతారు. కొందరు క్రైస్తవం స్వీకరిస్తారు. అయితే ఆసక్తికరంగా మహ్మదీయులు మాత్రము దీనికి మినహాయింపు. "బాగాచదువుకున్న మహమ్మదీయుడు మహమ్మదీయుడుగా ఇంకా కొనసాగుతున్నాడు" అని మెకాలే పేర్కొన్నాడు.[15] మతం మార్చటానికి ప్రత్యేకంగా కృషి చేయనప్పటికీ, మతస్వేచ్ఛకు అణుమాత్రమైనా భంగం కల్గించకపోయినప్పటికీ తను ప్రవేశపెట్టిన విద్యావిధానంవలన విగ్రహారాధనను దేశంలో మూడు దశాబ్దాలలో అరికట్టవచ్చు అని మెకాలే విశ్వాసం వెలిబుచ్చాడు.[16]

వలసపాలకులు క్రైస్తవమతపువెలుగును పాశ్చాత్యుల జ్ఞానాన్ని హిందువులకు అందించి, వారి సంప్రదాయాలను, భాషలను, సంస్కృతిని, వ్యక్తీకరణలను, భావాలను, ఆలోచనలనూ ప్రభావితం చెయ్యాలని అనుకొన్నారు. హిందువులను వారిదైన ప్రతి దానినుండి దూరంచేసి, వారి గతాన్ని వారే ద్వేషించే వారిగా తయారుచేసి, పాశ్చాత్యుల వేషభూషలను అనుకరించేవారిగా మార్చి, భారతీయుల ఆత్మవిశ్వాసాన్ని దెబ్బతీసి, వారిలో ఇతర జాతులకంటె తక్కువ వారమన్న హీనభావాన్ని పెంపొందించే ప్రణాళిక రచించారు.

మెకాలే లక్ష్యం ఒకటే. "వినాశంలేని అజేయమైన సామ్రాజ్యాన్ని నెలకొల్పటం, దానితోపాటుగా ఎన్నటికీ వినాశనంలేని ఆంగ్లేయుల కళలు, నైతిక విలువలు, సాహిత్యం, చట్టాలు సృష్టించి, అవి ఎప్పటికీ కొనసాగేటట్లు చేయటమే లక్ష్యం".[17] సామ్రాజ్యం ఉన్నా లేకపోయినా, శాశ్వతంగా భారతీయుల మస్తిష్కాలను, ఆలోచనలను ప్రభావితం చెయ్యటమే లక్ష్యంగా ఆంగ్లమానసపుత్రులను తయారుచెయ్యాలనే ప్రణాళికకు రూపకల్పనచేశాడు. 'సామ్రాజ్యం' ఎల్లకాలం కొనసాగదని వారికి తెలుసు. కానీ సామ్రాజ్య అనుకూల భావబీజాలను బలంగా నాటితే అవి శాశ్వతంగా ప్రజల ఆలోచనలను, ఆకాంక్షలను, జీవితాలను ప్రభావితం చేస్తాయి అన్న దురుద్దేశంతో తన విద్యాప్రణాళికను భారతదేశంమీద రుద్దాడు.

ఛార్లెస్ ఎడ్వర్డ్ ట్రెవిలియన్ బ్రిటీషు ప్రభుత్వంలో ఉన్నత ఉద్యోగి. ఆయన ఆంగ్లవిద్య లక్ష్యాలను ఇలా చెప్పాడు "పాలకులుగా మన కర్తవ్యమేదైనా కావచ్చును గాని, భారతీయులను నిజంగా జ్ఞానవంతులుగా చేయడం మాత్రం కాదు. వాళ్ళు వివేకవంతులైన మరుక్షణం మనల్ని వదలించుకునే ప్రయత్నం చేస్తారు. వారికి జ్ఞానాన్నివ్వడంద్వారా బలాన్ని దానం చేస్తున్నామని గుర్తుంచుకోవాలి. వాళ్ళు ఆ బలాన్ని మొదట మనమీదే ప్రయోగిస్తారు." (చదువుల చెట్టు, పుట 211). కాబట్టి నిజమైన జ్ఞానాన్ని ఇచ్చే విద్యను భారతీయులకు ఇవ్వకూడదని, ఎందుకూ పనికిరాని విద్యనే వారిమీద రుద్దాలని ఆయన చెప్పాడు. ఆయనే ఇంకా ఇలా అంటున్నాడు."భారతీయులచేత ఇంగ్లీషు సాహిత్యాన్ని చదివించడం ఇంగ్లీషు పాలనకు దోహదం చేస్తుంది. మన సాహిత్యంద్వారా ఏర్పడిన సాన్నిహిత్యంవలన భారతీయ యువకులు మనలను విదేశీయులుగా భావించటం మానివేస్తారు. మన మహాపురుషులను గురించి మన మెంత అభిమానంతో ముచ్చటిస్తామో వాళ్ళు కూడా అంతే అభిమానంతో ముచ్చటిస్తారు. మన మాదిరిగానే చదువుకొని, మనకిష్టమైన విషయాలలోనే వారుకూడా ఇష్టాన్ని పెంచుకొని, మన వ్యాపకాలనే తాము అలవరచుకొని ఇంగ్లీషువాళ్ళలాగ మారిపోతారు. మన ఇంగ్లీషు ప్రముఖులను వారివారి గ్రంథాలద్వారా పరిచయం చేసుకొనడంవలన వారికి మనదేశాన్ని ప్రత్యక్షంగా చూచిన దానికంటే మెరుగైన అభిప్రాయం కలిగే అవకాశముంది." (చదువుల చెట్టు, పుట 211).

ట్రెవిలియన్ విద్యావ్యూహం ద్వారా ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చేయటానికి పాశ్చాత్యభావనను వ్యాప్తిచేయాలని ఆదేశించాడు. "ప్రతి మానవుడు తన పరిస్థితిని మెరుగుపరచుకోవాలని కోరుకుంటాడు. ప్రతి వ్యక్తికి జీవితాన్ని ఆనందమయం చేసుకొనే విషయంలో తనదైన ఒక కల్పన ఉంటుంది. అలాగే ప్రతి సమాజానికి తన అభివృద్ధి, జాతీయ గౌరవాల విషయంలో ఒక ప్రేరణ ఉంటుంది. ఆ జాతీయ ప్రేరణ ఏదో ఒక రూపంలో అనుక్షణం పనిచేస్తూనే ఉంటుంది. దానిని మనవైపుకి త్రిప్పుకోగలిగితే మంచిదే. లేకపోతే మాత్రం అది మనకు వ్యతిరేకంగా పనిచేసి తీరుతుంది. భారతీయులను తమ పరాధీన స్థితిని గూర్చి చింతించే దుస్థితిలో వదలివేసిన పక్షంలో, వాళ్లు తమ పూర్వపు స్వేచ్ఛామయ జీవితాన్నిగూర్చి తలపోయకమానరు. అప్పుడు ఇంగ్లీషువాళ్ళను పూర్తిగా వెళ్ళగొట్టడంలోనే తమ స్వేచ్ఛా సంతోషాలు ఇమిడి

ఉన్నాయనే నిర్ణయానికి వచ్చితీరుతారు. కాబట్టి యూరోపియను భావాలను ఎక్కించడం ద్వారా ప్రజాభిప్రాయాన్ని దారిమళ్ళించవలసి ఉంది" (చదువుల చెట్టు, పుట 212). ఇంగ్లీషు విద్యను చదివిన భారతీయులు "మనను అసహ్యించుకోవడానికి బదులు మన సాంగత్యం కోరుకొంటారు, మనల్ని తమకు రక్షకులుగా, శ్రేయోభిలాషులుగా భావించుకొంటారు. చివరకు మనలాగ కనిపించడం వాళ్ళ జీవితాదర్శంగా మారుతుంది"..."ఇంగ్లీషువాళ్ళని సముద్రంలోకి త్రోసివేయాలనే పట్టుదలమాట అటుంచి, తమ భవిష్యత్తంతా వారితోనే ముడిపడి ఉందని నమ్ముతారు. ఇంగ్లీషు శిక్షణను, రక్షణను కోరుకుంటారు. దేశీయపాలన పునఃస్థాపితం కావడమంటే తమ ప్రియమైన భవితవ్యం నాశనమైనట్లుగా భావిస్తారు స్వరాజ్యస్థాపన వారిలో అభద్రతాభావాన్ని కలిగిస్తుంది" ఏనాటికైనా భారతదేశం స్వతంత్రం అయ్యేటట్లుఅయితే, అప్పుడుకూడా ఆ దేశాన్ని తమ స్వప్రయోజనాలకు వాడుకోవటానికి మార్గాన్ని కూడా ఆయన నిర్దేశించాడు.

"భారత్, బ్రిటన్ వంటి రెండు సుదూరదేశాలు రాజకీయంగా ఒకటై ఉండటం ఎక్కువకాలం సాధ్యంకాదు. భారతీయులు ఈనాడు కాకపోతే రేపైనా స్వాతంత్ర్యం పొందకుండా ఎవరూ ఆపలేరు. ఐతే ఆ అంతిమ ఫలితం రెండుమార్గాలలో రావచ్చు. ఒకటి విప్లవం, మరొకటి సంస్కరణ. విప్లవంద్వారా వచ్చే స్వతంత్ర్యం బ్రిటను భారతదేశాల మధ్య సంబంధాలను పూర్తిగా త్రెంచివేస్తుంది. సంస్కరణద్వారా వచ్చే స్వతంత్ర్యం రెండు దేశాలను శాశ్వత మిత్రులుగా, సహకారులుగా నిలుపుతుంది. మొదటి రకం ఫలితాన్ని నిరోధించి రెండవదాన్ని సాధించడానికి ఒకే మార్గం ఉంది. అది భారతీయులను పాశ్చాత్యీకరణ చేయడం...... అలా చేసిన పక్షంలో వాళ్ళు తమ సాంప్రదాయం బోధించే సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కోరకుండా చేయవచ్చు. రాజకీయంగా హఠాత్పరిణామాలు ఉండవు. మనకు భారత్‌తోగల సంబంధాలు చాలాకాలం కొనసాగే అవకాశం కలుగుతుంది.....వారి శక్తియుక్తులను పాశ్చాత్య జ్ఞానాన్ని వ్యాప్తి చేయడంలోను, పాశ్చాత్య సామాజిక సంస్థలను స్థాపింపచేయడంలోను నియోగించే అవకాశం కలుగుతుంది. అది ప్రమాదం లేని మార్గం. విద్యావంతులు తమ ప్రయోజనాలు మనవల్ల (మాత్రమే) నెరవేరుతాయని గుర్తించిన మరుక్షణంనుంచి మననే అంటిపెట్టుకొని ప్రేలాడుతారు. ప్రస్తుతం అదే జరుగుతోంది. ఈదేశ ప్రజలందరిలో ఇంగ్లీషు ధోరణి కలిగిన వాళ్ళకు మన అవసరమున్నంతగా మరెవరికీ లేదు. స్వదేశీపాలన ఈ వర్గానికి ప్రాణాంతకంగా కనిపిస్తుంది. అచ్చమైన

దేశీయపాలన ఏర్పడిన పక్షంలో తమ ప్రయోజనాలకు ముప్పు ఏర్పడుతుందని వీరిభయం. వీరి ఇంగ్లీషు చదువు వీళ్ళని మిగిలిన ప్రజలనుంచి వేఱుగా నిలబెడుతుంది. ప్రస్తుతం ఈ వర్గం అల్పసంఖ్యాకంగా ఉంది. కాని క్రమంగా ఇంగ్లీషు విద్యాలయాల్లో చదివిన యువకులవల్ల వీరిసంఖ్య పెరిగి అధిక సంఖ్యాకులయ్యే రోజు వస్తుంది."

ఎప్పటికీ భారతదేశం ముడిపదార్థాల ఎగుమతి దేశంగానే ఉండాలని ఆయన కోరుకున్నాడు. "(భారత్ స్వాతంత్ర్యం పొందితే) మనయొక్క విశ్వాసపాత్రులైన పాలితులు విశ్వసనీయులైన సహచరులుగా మార్పు చెందుతారు....... (మునుపటి రాజకీయ సంబంధానికి బదులు) ప్రపంచంలోని మొదటి పారిశ్రామిక దేశానికి, మొదటి ముడిసరుకు ఉత్పత్తిదారుకు మధ్య ఏర్పడే నూతన వాణిజ్యపరమైన సంబంధం (బ్రిటీషు) సామ్రాజ్యానికి ఎంతో మేలు చేస్తుంది. నిజంగా చెప్పాలంటే ఈ రెండు దేశాలు విడిపోవటమంటూ ఉండదు. అంతకుముందున్న బలహీనమైన, అనిశ్చితమైన సంబంధం, ఒక బలమైన ప్రయోజనకరమైన అనుబంధంగా మార్పు చెందుతుంది." (చదువుల చెట్టు, పుట 217)

భారతదేశంపట్ల తమ ఆలోచనలను, అభిప్రాయాలను చిలుకపలుకులుగా తిరిగి వల్లించటానికి ఏమాత్రం సంకోచంలేని ఒకొత్త వర్గాన్ని సృష్టించటమే లక్ష్యంగా వారి యత్నాలు జరిగాయి. హిందూసమాజం గురించి, సంస్కృతిగురించి, సంప్రదాయాలగురించి బ్రిటీషువారి అభిప్రాయాలను, దృక్పథాలను ఏమాత్రం ప్రశ్నించకుండా వాటిని ఆమోదించి, సందర్భోచితంగా వాటిని వెలిబుచ్చే వర్గ సృష్టి వారి ఉద్దేశం.

ట్రెవిల్యన్ హిందూ ఉన్నతవర్గంపై ఇంగ్లీషు విద్యాప్రభావం గురించి ఇలా చెప్పాడు."ఇంగ్లీషువారి అభిప్రాయాలను ఆమోదించి అనుసరించే ఒక కొత్త వర్గం ప్రస్తుతం అల్పసంఖ్యాకంగా ఉంది..... కాలక్రమంలో వారు అధిక సంఖ్యాకులు అవుతారు. భవిష్యత్తులో ఇంగ్లీషు సామ్రాజ్యం భౌతికంగా అంతరించినా, కొత్తగా ఆంగ్లవిద్యను అభ్యసించేవర్గం మరింతగా బలపడి ఆలోచనలలో, అభిప్రాయాలలో తెల్లదొరలను మరిపిస్తారు. అటువంటి విద్యావిధానం ద్వారా, పాలితులను మరింత లాభదాయకమైన మిత్రులుగా, మద్దతుదారులుగా మార్చవచ్చు. వారిని లాభదాయకులైన మద్దతుదారులుగా మార్చటానికి అత్యంత సులువైన మార్గం వారిలో పాశ్చాత్య జీవనశైలిపట్ల వారికి అభిమానం పెంచేటట్లు చేయటం. హిందువులలో ఆంగ్లేయులను అనుసరించాలనే కోరికను కలుగచేస్తే చాలు, వారు ఆంగ్లేయులను

అనుకరించటానికి, అనుసరించటానికి శ్రమపడ్డారు. కట్టు–బొట్టు, సంప్రదాయాలలో, భాష, అలవాటులలో తెల్లవారిని హిందువులు అనుసరించటం మొదలుపెడితే చాలు, వారి పతనం ప్రారంభంఅయినట్లే. వారి పాత సంప్రదాయాలను వదిలివేసి బ్రిటీషువారిని అన్నిటా అనుసరిస్తారు. ఆంగ్లసామ్రాజ్య పరిరక్షణకు అదే మార్గం. అందువల్ల గొప్పదైన వారి సంస్కృతిపట్ల వారికి ఏహ్యభావం కల్గించేలా చెయ్యాలి. వారి స్మృతిపథం నుండి వారి ప్రత్యేక సంస్కృతీ వారసత్వాన్ని వారికి దూరంచెయ్యగలగటమే మన వ్యూహం. వారిస్మృతిలో ఏమాత్రం సాంస్కృతిక స్పృహ మిగిలి ఉన్నా అది వారిని మళ్ళీ స్వంత అస్తిత్వంవైపు నెట్టుతుంది"[18].

"భారతీయులు వారు పోగొట్టుకొన్న స్వేచ్ఛాస్వాతంత్ర్యాలగురించి బాధపడుతున్నంతకాలం, వారి పరిస్థితులు మెరుగుపర్చటానికి వారి ముందున్న ఏకైక మార్గం – ఇంగ్లీషువారిని దేశంనుండి పూర్తిగాను, వీలు అయినంత త్వరగా తరిమికొట్టటం. స్థానిక దేశభక్తులకు ఇంతకంటె ఏమీ తెలియదు. తన దేశపు గౌరవాన్ని, ప్రతిష్ఠను, మర్యాదను కాపాడటానికి, దేశపు సిరిసంపదలకు భద్రత కల్గించటానికి వారి ముందున్న ఏకైక ప్రత్యామ్నాయం అదే. అయితే పాశ్చాత్యుల పద్ధతులను, ఆలోచనలను వారికి ఇవ్వటంద్వారా వారికి ఒక నూతన దిశానిర్దేశనం చేయవచ్చు. మన పాఠశాలలలో చదువుకున్నవారు, శిక్షణ పొందిన యువకులు వారి జాతీయ సంస్థలను పాశ్చాత్యుల పద్ధతులలోనే మలచటానికి ప్రయత్నం చేస్తారు. మనపట్ల అయిష్టతతో కాకుండా, వారు మనతో స్నేహసంబంధాలకోసం ప్రయత్నం చేస్తారు. మనలను వారి భాగస్వాములుగా హితకారులుగా, ఉపకారులుగా చూస్తారు. వారందరి మహత్వకాంక్ష ఒకటే. మనలాగే కనపడటం, మనలాగే ప్రవర్తించటం..." మనలాగే ఉండాలనే వారి తపన ముఖ్యంగా హిందువులలో ఒక తరానికి తరం అంతా 19వ శతాబ్దపు పాశ్చాత్యులకు యిష్టమయిన అయిదు ప్రమేయాలను సొంతం చేసుకున్నారు. ఆ అయిదు ప్రమేయాలు–వాస్తవాన్ని ఎరుకపర్చేది హేతువు ఒక్కటే, శాస్త్రీయ విజ్ఞానం (Physical Domain of Science) మాత్రమే సరైన విజ్ఞానం, భారతదేశం తన గతంనుండి విడివడితే కాని భవిష్యత్తు ఉండదు, ఇతర పురాతన సమాజాలవలె హిందూ సంప్రదాయాలు కూడా లోపభూయిష్టమైనవి, కేవలం శాస్త్రీయ హేతువాదమే వెలుగును యివ్వగలదు, వ్యక్తి, అతని హేతుబద్ధత స్వయంప్రకాశాలు.

**క్రైస్తవీకరణ లక్ష్యాలు :**

ప్రపంచాన్ని క్రైస్తవీకరణ చేసి, నాగరీకరణ చెయ్యాలన్న ఆకాంక్షతో భారతీయుల వ్యక్తిత్వాన్ని, శీలసంపదను కావాలని తక్కువగా వర్ణించాడు ఛార్లెస్ గ్రాంట్. 1792లో ఆయన హిందువులగురించి వ్రాసిన అభూతకల్పనలు మిల్‌ను, మెకాలేను చాలా ప్రభావితం చేసాయి. హిందూమతం తప్పుడు మతమని గ్రాంట్ అభిప్రాయం. హిందువులు స్వార్థపరులు, మొరటువారు, దేశభక్తిలేనివారు, బానిసబుద్ధికలవారు. దేశభక్తి అనేది హిందువులలో కనపడదని, క్రైస్తవ విద్య, ఆంగ్లమాధ్యమం మాత్రమే బానిసప్రజలను తరింపచేస్తాయని గ్రాంట్ భావించాడు. అయితే గ్రాంట్ ఈ బానిస ప్రజల భూమిలోనే కొన్ని ఏళ్ళు పనిచేసి కొన్ని వందలకోట్లు కూడబెట్టాడు. మేధాపరమైన బానిసత్వంలోకి (Intellectual Subjugation) భారతీయులను నెట్టివేసే ఎజెండా కోసం ఇంగ్లాండు పార్లమెంట్ సభ్యులను ఒత్తిడి చేసాడు.

రిచర్డ్ టెంపుల్ భారతదేశపు వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో ఉన్నతాధికారిగా పని చేశాడు. బ్రిటీషు ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలు క్రైస్తవ మత వ్యాప్తితో ముడిపడి ఉన్నాయని చెపుతూనే, ప్రభుత్వం ప్రత్యక్షంగా క్రైస్తవ మతవ్యాప్తిలో పాల్గొనరాదని, అందువల్ల ప్రభుత్వంయొక్క విశ్వసనీయత దెబ్బతింటుందని వివరించాడు. "మనమీ పనులను లౌకిక ప్రయోజనాల కోసమై చేపట్టవలసి ఉంది. మన పెట్టుబడులకు నూతన అవకాశాలు, మన ఉత్పత్తులకు కొత్త మార్కెట్లు, మన వాణిజ్యానికి కొత్త మార్గాలు మొదలైన విషయాలను ప్రభుత్వం చూసుకుంటుంది. కాని క్రైస్తవమత వ్యాప్తి విషయంలో క్రైస్తవ జనసామాన్యమే ఎక్కువ చొరవచూపవలసి ఉంటుంది. ఎందుకంటే రాజకీయ కారణాలవల్ల ప్రభుత్వం క్రైస్తవమతవ్యాప్తిని చేయజాలదు". "భారతదేశంలో పెద్దసంఖ్యలో ఆదివాసులు నివసిస్తున్నారు. వారి మనసులు తెల్లకాగితం వంటివి. వాటిపై క్రైస్తవ మిషనరీలు సులువుగా తమ ముద్రను వేయవచ్చు. వాళ్ళు అమాయకులైనప్పటికీ ధైర్యము, నిజాయితీ కలిగినవారు. వాళ్ళను క్రైస్తవమతంలోకి మార్చినట్లైతే బ్రిటీషు అధికారాన్ని సుస్థిరం చేసే కేంద్రబిందువుగా పని చేస్తారు".

ఆయనే ఇంకా ఇలా అంటున్నారు.....

"భారత్‌లో పనిచేస్తున్న మిషనరీలు బ్రిటిషు సామ్రాజ్యాన్ని సుస్థిరం చేస్తున్నారు.....మన భారతీయ సామ్రాజ్యంలో సగానికి పైగా పాలించిన వ్యక్తిగా, ఈ దేశపు ఆర్థికమంత్రిగా నేను చెప్పేదేమిటంటే నేను పర్యవేక్షించిన అన్ని

ప్రభుత్వశాఖలలోను మిషనరీశాఖ అత్యంత సమర్థవంతమైనది. నా క్రింది పనిచేసిన బ్రిటిషు అధికారులందరిలోనూ ప్రొటెస్టెంటు మిషనరీలు అత్యంత సమర్థులు. నా అధికారంక్రింద ఉన్న అన్ని శాఖలలోకి ప్రొటెస్టెంటు మిషనరీ విభాగమే పూర్తి ఫలితాలను సాధించిందని చెప్పగలను". (చదువుల చెట్టు, పుట 233)

క్రైస్తవీకరణ ఫలితాల గురించి ఇలా అంటున్నాడు "రాగల తరాల్లో క్రైస్తవీకరణ ఫలితాలు ఇంకా ఎక్కువగా కనబడతాయి. ఎందుకంటే ఇప్పటివరకు పాశ్చాత్యులు చేసిన కృషికి తోడుగా మనం ఇక్కడ ప్రవేశపెట్టిన సార్వజనిక విద్యావిధానం అదనపు ఫలితాలను ఇస్తుంది. భారతదేశం ఒక పెద్దకోట వంటిది. దాని గోడలను కూలగొడుతున్నాం. దెబ్బమీద దెబ్బ.. గుద్దుమీద గుద్దు..... మొదట దీని ప్రభావం అంతగా కనబడదు. కాని క్రమంగా కోటగోడలు కూలిపోతాయి. అదే విధంగా భారతీయుల 'కుమతం' కూడా కూలిపోతుంది."(చదువుల చెట్టు, పుట 235)

హిందూమతాన్ని నాశనం చేయటానికి "ఇంగ్లీషు వ్యాకరణం, గుణింతాల పుస్తకం చాలు... ఉపాధ్యాయుడు (హిందూమతమనే) కోటగోడను ఛేదించగలడు. కాని ఆ కోటలోకి ప్రవేశించి ఆక్రమించుకోవలసింది మిషనరీయే. భారతీయులు జ్ఞానంకోసం తపిస్తున్నారు. ......మిషనరీలు ఆ అవకాశాన్ని అందిపుచ్చుకొని వాళ్ళకు క్రైస్తవజ్ఞానాన్ని బోధించాలి". (చదువుల చెట్టు, పుట 228)

"ఇంగ్లీషు బడులద్వారా క్రైస్తవీకరణ వేగంగా కొనసాగుతోందనడానికి ఉదాహరణ ప్రతి ఏడవరోజు (ఆదివారం) సెలవివ్వడం. ముఖ్యంగా మద్రాసు ప్రాంతంలో దేశీయ కుటుంబాలు మంచిదుస్తులు ధరించి గుంపులు గుంపులుగా తిరుగుతూ ఉండటం కనిపిస్తుంది. ఈ ఆచారానికున్న మతపరమైన ప్రాముఖ్యం వాళ్ళకింకా అర్థంకాలేదు. వారు ఆరోజును విశ్రాంతి వినోదాలకు ఉద్దేశించిన దినంగా మాత్రమే భావిస్తున్నారు". ఆదివారం సెలవు రోజుగా పాటించే పద్ధతివంటివి ఈ నాటికీ కొనసాగుతున్నాయి. ఈ ప్రచ్ఛన్న క్రైస్తవీకరణ మరొక పరిణామానికి దారితీసింది. బహిరంగంగా క్రైస్తవమతం స్వీకరించినవారు స్వీకరించగా, మిగిలిన హిందువులలో (పాక్షికంగా క్రైస్తవీకరణ చెందిన) కుహనా ఆధునికుల బృందమొకటి తయారైంది. వీరు తమ సంస్కృతిని, మతాన్ని నిరసించడమే ఆధునికతగా భావిస్తారు. క్రైస్తవ మతాచారాలను ఆధునికతకు కొలబద్దగా భావిస్తారు. ఈ వికృత పరిణామం మెకాలే, ట్రెవిల్యన్ కాలంలోనే ప్రారంభమైనట్లు వారి మాటలవల్ల తెలుస్తోంది.

కళాద్రష్ట, తత్వవేత్త ఆనందకుమార స్వామి చేసిన వ్యాఖ్యానం ఇంగ్లీషు విద్యా ప్రభావం గురించి తెలియచెపుతుంది. "భారతజాతి పరిణామ మూలాలమీద కొట్టిన అన్ని చావుదెబ్బలకంటె విద్యపేరుతో కొట్టిన చావుదెబ్బ తీవ్రాతితీవ్రమైనది. ఇంగ్లీషువిద్యపై ప్రధానఆరోపణ ఏమిటంటే ఈచదువులు చదివినవారిలో అధికసంఖ్యాకులకు హైందవసంస్కృతిపట్ల గౌరవాభిమానాలు ఉండవు. దానిగురించి ఏమీతెలియకుండానే, తెలుసుకోకుండానే ద్వేషిస్తారు. భారతీయ విశ్వవిద్యాలయాల్లో చదువుముగించుకొనివచ్చే విద్యార్థులలో తమ మాతృభూమికి, సంస్కృతీ సంప్రదాయాలకు అపరిచితులైపోతారు"[19].

మేధోవలసీకరణ(intellectual colonisation) అన్నిరకాల వలసీకరణల కంటే ప్రమాదకరమైనదని, ప్రగాఢమైన ప్రభావాన్ని కలగజేయగలదని, శాశ్వతమైన నష్టాన్ని ఫలితంగా ఇచ్చేదని ప్రముఖతత్వవేత్త కె.సి. భట్టాచార్య (1875-1949) వివరించారు. మేధోవలసీకరణ సమాజాలను సాంస్కృతిక బానిసత్వంలోకి నెట్టివేస్తుందని హెచ్చరించారు. ఆలోచనలు, అభిప్రాయాలు, భావాలు వాటి వ్యక్తీకరణలపై ఆధిపత్యం కంటికి కనపడదని, అయినా దానిప్రభావం తరతరాలకు విస్తరిస్తుందని ఆయన అన్నారు. సాంస్కృతికమైన లొంగుబాటు తెలియకుండా జరుగుతుందని, ఒక సంస్కృతికి చెందిన అభిప్రాయాలు, భావాలు (ideas)ను, భావోద్వేగాలను, ప్రవృత్తులను (sentiments) విదేశీ సంస్కృతికి చెందినవాటితో పోల్చుకుని చూడటానికి కానీ, పోటీలో ఎంచుకోవటానికికానీ అవకాశం లేకుండానే రద్దుచేయబడతాయి. ఈరకమైన లొంగుబాటు ఆత్మను సైతం (slavery of the sprit) బానిసత్వంలోకి నెట్టివేస్తుంది[20].

## References


1. Caesar Litton Falkner, *Illustrations of Irish History and Topography*, 1904. p. 117
2. Norman G. Barrier, *The Census in British India : New Perspectives*, 1981
3. Nicholas B. Dirks, *Castes of Mind: Colonialism and the Making of Modern India*, 2001
4. Bernard S. Cohn, *An Anthropologist among the Historians and other Essays*, 1987

   Ranjit Guha, *Dominance without Hegemony: History and Power in colonial India*
5. Dirks, 2001

6. Partha Chatterjee, *Lineages of Political Society: Studies in Post-Colonial Democracy, 2011,*
*The Nation and its Fragments: Colonial and Post-Colonial Histories,* 1993
7. Madhu Kishwar, *Zealous Reformers and Deadly Laws*, 2008.
8. Thomos Metcalfe: *Ideologies of the Raj*, 1995, p. 89
9. N.G. Barrier (ed),*The Census in British India: New Perspectives, 1981, pp.73-102.*
10. For a detailed discussion, see Rajiv Malhothra, *Breaking India*, Chapter 5
11. Dr. Ambedkar, *The Untouchables Who Were They and Why They became Untouchables?* Part III, Chapter VI, 1948
12. E.M. Collinghan, *Imperial bodies: The Physical Experience of the Raj, 1800-1947*, 2001
Cristpher Pinney, *Classification and Fantasy in the Photographic Classification of Caste and Tribe*, Visual Anthropology 3 (1990) pp.259-284.
Peter Gottschalk: Religion, *Science and Empire: Classifying Hinduism and Islam in British India*, 2012, p. 213.
13. H.W.Nevinson, *The New Spirit in India, 1908*, p.192-3
14. *Speeches of Right Honourable Lord T.B. Macaulay*, M.P.-Corrected by Himself, (London:Longman, Brown, Green & Longmans, 1854), pp. 142-143
15. Letter dated 12th October 1836, *The Letters of Thomos Babington Macaulay*, Vol.3, (Cambridge University Press, 1976), p.193
16. Ibid p. 193
17. *Speeches of the Right Honourable Lord T.B. Macaulay*, op. cit., p.162.
18. Ibid., pp.191-192.
19. Ananda Coomaraswamy: *Essays in National Idealism, G.A. Natesan & Company*, 1909, pp. 96-97
20. K.C. Bhattacharya, Swaraj in Ideas, in S.K. Ghosh (ed.), *Four Indian Critical Essays*, Kolkata: Jijnasa, 1977, p.13



# 12

# భావదాస్యం

ఇతర దేశాల భూభాగాలను ఆక్రమించి, వాటి వనరులను దోచుకోవటంతో వలసరాజ్య స్థాపన ఆగిపోదు. అక్కడి ప్రజలను రాజకీయ, ఆర్థిక బానిసత్వంలోకి నెట్టివేయటంతో ముగిసిపోదు. వారిని సాంస్కృతిక, ధార్మిక బానిసత్వంలోకి నెట్టివేస్తుంది. వారి మెదళ్ళను, మనసులను సామ్రాజ్యవాద అనుకూల భావనలతో నింపటమే కాక, తమదేశం, సంస్కృతి, భాషలు, మతం, సంఘంపట్ల ప్రతికూల భావనలతో ముంచెత్తుతుంది. ఆత్మన్యూనతా భావనతో నిరంతరం బాధపడేటట్లు చేస్తుంది. తమదైన ప్రతిదీ–భాష, మతం, సంస్కృతి, కళలు, కాలగణన, చదువులు, జీవనశైలి–ఎందుకూ కొరగానివని, వాటిని ఎంత తొందరగా వదిలించుకుంటే అంత మంచిదనే ఆలోచనకు బానిసత్వంలో మగ్గుతున్న ప్రజలు వచ్చేటట్లుగా చేస్తుంది. 'మనవాళ్ళు వట్టి వెధవాయిలోయి' అన్న కన్యాశుల్కంలోని గురజాడమాట బానిసత్వపు బతుకుల మనస్తత్వాన్ని చిత్రీకరిస్తుంది.

స్థానిక మత, సంస్కృతులను సమూలంగా నాశనం చేసేందుకు చేపట్టినదే వలసపాలన ప్రాజెక్టు. స్థానిక మత, సంస్కృతులస్థానే పాశ్చాత్య క్రైస్తవమత, సాంస్కృతిక విలువలను ప్రవేశపెట్టటమే దాని లక్ష్యం. పాశ్చాత్యదేశాల నాగరికత, వస్తుప్రేమ, విలాసజీవనం, వ్యక్తిస్వేచ్ఛలు, ఆధునిక యంత్రాలు, క్రీస్తుమతంపట్ల వలసప్రాంత ప్రజలలో మోజుపెంచటమే లక్ష్యంగా సాగే వలసపాలన స్థానికుల సంగీతం, సాహిత్యం, కళలు, భాషలు, చికిత్సాపద్ధతులు, వేషభూషలు, సంప్రదాయాలు, శాస్త్రసాంకేతిక విజ్ఞానం మొదలైనవి ఆధునికకాలానికి పనికి రానివిగా ప్రచారం చేసి, ప్రజలను తమంతట తాముగా వాటిని వదిలివేసేటట్లుగా చేస్తుంది. దానితో వాటిని విస్మరించటం మొదలుపెడతారు. ఆ విధంగా వలసపాలన ప్రతిదానిని–ఆలోచనను, అభిప్రాయాన్ని, అనుభూతిని, ఆనందాన్ని, స్పందనను, భావోద్వేగాలను–ప్రభావితంచేసి మనకు తెలియకుండానే మనదైన ప్రతిదానిపట్ల

తృణీకారభావాన్ని వ్యాప్తిచేస్తుంది. స్వంత అస్తిత్వాన్ని మరిచిపోయి, విస్మృతికి లోనయి, పాశ్చాత్యీకరణను ఆమోదించటం వలసపాలన ఫలితమే. అర్ధరాత్రివేళ నూతన సంవత్సరానికి తూలుతున్న శరీరాలతో స్వాగతం చెప్పటమూ, కేకులు కోస్తూ, దీపాలు ఆర్పుతూ అర్ధరాత్రివేళ పుట్టిన రోజులు జరుపుకోవటమూ నేడు సర్వత్రా కనబడే ఉదాహరణలు.

తాత్వికవైవిధ్యం, విభిన్న ఆలోచనా ధోరణులు, ఆధ్యాత్మిక స్వేచ్ఛ, అతిప్రాచీనం అయిన వేదవాఙ్మయం, విస్తృతం అయిన పురాణసాహిత్యం, సజీవం, శక్తివంతమైన జానపద సంప్రదాయాలతోపాటుగా అసమ్మతిని తెలియచేసే సంస్కృతికి (Dissenting Culture) సైతం ప్రోత్సాహం యిచ్చిన భారతీయుల మేధో జీవితం సుసంపన్నం అయింది. ఆంగ్లేయులపాలన ఈ సువిశాల, మహాద్భుతమైన, మేధోవారసత్వం నుండి భారతీయులను దూరం చెయ్యటానికి గట్టి ప్రయత్నంచేసింది. ఆ మేధో ప్రపంచంతో సంబంధాల పునరుద్ధరణ కోసం చేసిన ప్రతిప్రయత్నాన్ని నిరుత్సాహపర్చింది. దానితో 18,19 శతాబ్దాలలో భారతదేశం ఆత్మవిస్మృతిలోకి లోనయింది. గతాన్ని తెలుసుకోవటానికి, పరిశీలించటానికి సైతం వెనుకాడేస్థితికి భారతీయులు నెట్టివేయబడ్డారు.

**భావదాస్య (Colonisation of the Mind) ప్రమాదాలు :**

ప్రముఖ తత్వవేత్త కె.సి. భట్టాచార్య 1931లో చేసిన ప్రసంగంలోనే వలసపాలన ఫలితాలగురించి హెచ్చరించారు. రాజకీయ బానిసత్వంకంటె, ఆంగ్ల భావజాల దాస్యం మరింత విస్తృతమైనదని, ప్రమాదకరమైనదని, రాజకీయ దాస్యం మన బాహ్యాన్ని మాత్రమే ప్రభావితం చేసి, మనస్వేచ్ఛాస్వాతంత్ర్యాలను హరించి వేస్తుందని, కాగా మనోదాస్యం మన అంతరంగాన్ని ప్రభావితం చేసి, మన ఆలోచనలను, స్పందనలను, దృక్పథాలను తారుమారు చేసి, ఆంగ్లమానసపుత్రులుగా తయారుచేస్తుందని, అది ప్రమాదకరమైన పరిణామాలకు దారితీస్తుందని వివరించారు. పాలకుల దుర్మార్గాలను, దురన్యాయాలను ప్రతిఘటించటం మాట అటుంచి, పట్టించుకోకపోవటంతో మొదలయి, చెడును మంచిగా అంగీకరించటంతో భావదాస్యం (Colonisation of Mind) తీవ్రమైన మనోవైకల్యంగా మారుతుందని ఆయన అన్నారు[1].

వలసపాలనకు గురిఅయిన అన్ని దేశాలలోనూ భావదాస్య ప్రమాదాన్ని ఆయాదేశాల ఆలోచనాపరులు గుర్తించి హెచ్చరించారు. కరేబియన్ దీవులకు

చెందిన మేధావి Franz Fanon పాశ్చాత్య దేశాలలో అభివృద్ధిచేయబడ్డ భావనలు (Concepts) ఆయాదేశాల చారిత్రిక, సాంస్కృతిక సందర్భాలలో అభివృద్ధి చెయ్యబడ్డవని, ఆ భావనలు, వాటి పరిశీలనాపద్ధతులు, లక్ష్యాలను తమ ఏలుబడిలోని దేశాలపై రుద్దారని, దానితో పరతంత్రంలో ఉన్న దేశాల ప్రజలు వారివైన వాటికి దూరం అయ్యారని, వాడుకలోలేని కారణంగా అవి క్రమంగా క్షీణించాయని విశ్లేషించారు. శరీరాలు నలుపు, అయినా తెల్లముసుగు కప్పుకొనేందుకు-అంటే పాశ్చాత్యులను గుడ్డిగా అనుసరించటంతో మొదలయి, అనేక వలసపాలితదేశాలు తమ ప్రత్యేక అస్తిత్వాన్ని కోల్పోయాయని వ్రాసారు. "నా అంతరాత్మలో కారునలుపు ప్రాంతంనుండి తెల్లగా కనిపించాలనే తపన తీవ్రంగా మొదలయింది. నేను నలుపుకాదు, తెలుపు అని అందరిచేత గుర్తింపబడాలని అనుకొన్నాను. మరినాకు ఈ ప్రయత్నంలో ఒక తెల్ల స్త్రీ తప్ప ఎవరు సహకరించగలరు? నన్ను ప్రేమించటం ద్వారా, నేను తెల్ల ప్రేమకు తగినవాడినని ఆమెనిరూపించగలదు. ఒక తెల్లవాడిగా నేను ప్రేమించబడ్డాను. నేనుయిప్పుడు తెల్లవాడిని. తెల్లవారి అందం, సంస్కృతి నా స్వంతం అయ్యాయి. ఆ తెల్లని వక్షోజాలను నా చేతులు నిమిరేటప్పుడు అవి తెల్లవారి నాగరికతను, హుందాతనాన్ని నా గుప్పెట్లోకి తెచ్చి, వాటిని నావిగా చేస్తాయి." వలసపాలన ఫలితంగా తెల్లదొరల మెప్పుపొందాలని, వేషభాషలందు తెల్లవారిలా కన్పడాలన్న అనుకరణా వాంఛ ఎంత ప్రబలంగా ఆనాడు ఉండేదో ఈ వాక్యాలద్వారా ఫానన్ తెలియచేస్తున్నాడు[2].

Aime Cesaire ప్రముఖ ఆఫ్రికన్ తత్త్వవేత్త. వలసపాలన ప్రభావాలపై ఆయనచేసిన ప్రసంగం (Discourse on Colonialism) చరిత్ర ప్రసిద్ధం. తృతీయ ప్రపంచదేశాల మానిఫెస్టోగా కూడా ఆయన ప్రసంగవ్యాసం వన్నెకెక్కింది. పాశ్చాత్యేతర దేశాలు అన్నీ ఆదిమకాలానికి చెందినవని, కనుక అవి వేరే సుదూర ప్రపంచానికి చెందిన అనాగరిక, మొరటు నాగరికతలకు నిలయాలని, వాటిని నాగరికం చేసే బాధ్యతను పాశ్చాత్యదేశాలు తమంతతాముగా భుజస్కంధాలకు ఎత్తుకొని, వారిని సంస్కరించే సవాలును తమ క్రైస్తవదేవుడు తమకు యిచ్చిన ఆదేశానుసారం తీసుకొన్నామని, వలసరాజ్యాల స్థాపనవెనుక ఇంత 'మహత్తరమైన సంకల్పం' ఉందని చెప్పుకున్నాయని వాటిని దుయ్యబట్టారు. అధమజాతులకు, మొరటు నాగరికతలకు చెందిన ప్రజలకు ఒక ప్రత్యయాత్మక భాషను (Conceptual

Language) ను యివ్వటం ద్వారా, నాగరికుల సాంస్కృతిక మర్యాదలలో శిక్షణ యివ్వటంద్వారా ఐరోపా తన ప్రతికృతిని లేదా ప్రతిబింబాన్ని ప్రపంచంలోని ఇతరదేశాలలో సృష్టించదలచిందని, ఆ క్రమంలో వారి అస్తిత్వాలను చెరిపివేసి, వారి గతాన్ని వారు మర్చిపోయేలా చేసారని, మానవాళికి వారు చేసిన పెద్ద ద్రోహం ఇది అని ఆయన విమర్శించారు. పాలితుల గతంనుండి వారిని వేఋచేయటంద్వారా వారిని శాశ్వతంగా పాశ్చాత్య భావజాల దాస్యులను చేసారని వలసపాలకులను తీవ్రంగా విమర్శించారు. బానిసత్వంలో కూరుకొనిపోయిన ప్రజలు తిరిగి తమస్వంత చరిత్ర, సంస్కృతి, భాషలు, అస్తిత్వంతో సంబంధాలు పునరుద్ధరించుకోగలగటం ఎంతో కష్టసాధ్యమయిన పనిగా ఆయన పేర్కొన్నారు[3].

గోవా పోర్చుగీసు వ్యతిరేక పోరాట పితామహుడిగా ప్రసిద్ధి చెందిన Tristao de Braganza Cunha 'గోవన్ల విజాయితీకరణ' (Denationalisation of Goans) పేరుతో వ్రాసిన ఒక చరిత్రాత్మక వ్యాసం కూడా ప్రపంచ ప్రసిద్ధిగాంచింది. 450 సంవత్సరాల పోర్చుగీసు పాలనలో గోవాలో జరిగిన సాంస్కృతిక, మత, ధార్మిక విధ్వంసాన్ని ఆయన తన వ్యాసంలో కళ్ళకు కట్టినట్లు వర్ణించారు. పోర్చుగీసు క్రైస్తవపాలకులు ఇంక్విజిషన్ పేరుతో వేలాదిమందిని సజీవదహనం చేశారు. ఎన్నో దేవాలయాలను, మసీదులను నేలకూల్చారు. బలవంతపు మతమార్పిళ్ళకు పాల్పడ్డారు. కొంకణి, ఇతర స్థానికభాషలను అణచివేసారు. స్థానిక మత సంప్రదాయాలను బలవంతంగా నిలిపివేశారు. ఎదురు తిరిగినవారిని, ఎదురుతిరుగుతారేమో అనుకొన్న వారిని చిత్రహింసలపాలుచేసి నిర్దాక్షిణ్యంగా చంపివేసారు. భయంకరమైన అణచివేతచర్యల ద్వారా, దారుణమైన హింసాకాండకు ఒడిగట్టటం ద్వారా కొంకణీ ప్రజల సాంస్కృతిక జ్ఞాపకాలను చెరిపివేసారు. దానితో వారికి సాంస్కృతిక విస్మృతి (Cultural Amenesia) వచ్చింది. వారి సాహిత్యం, కళలు, తర్కం, మతం, సంప్రదాయాల వారసత్వంతో బంధం తెగిపోయిన వారు కాలక్రమంలో విజాతీయులు (Denationalise) అవుతారని Cunha సిద్ధాంతీకరణ చేసారు. విజాతీయకరణ అనే పదప్రయోగాన్ని అంతకుముందు శ్రీయుతులు కేశవచంద్రసేన్, అరవిందులు చేశారు. వలసపాలన ఒక జాతీయులను విజాతీయులుగా చేసి, పాలకులను అనుసరించేవారిగా, అనుకరించేవారిగా తయారుచేసి, వారిని స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం పోరాటం చెయ్యనివ్వదని,

అందువల్ల విజాతీయకరణ ముప్పునుండి వలసపాలిత ప్రజలు బయటపడాలని ఆయన ఉద్బోధించారు. Cunha కాథలిక్ మతస్థుడైనా గొప్ప జాతీయవాది. మిగిలిన వారితోపాటుగా కాథలిక్ క్రైస్తవులలో స్వాభిమానాన్ని, దేశభక్తిని రగిలించటానికి ఆయన ఎంతో కృషి చేసారు. ఆయన వ్రాసిన 'గోవన్ల విజాతీయకరణ' సిద్ధాంత వ్యాసం ఈనాటికీ స్ఫూర్తిదాయకంగా నిలుస్తున్నది[4].

వలసపాలకులు ప్రవేశపట్టే విద్యావ్యవస్థ, పాఠ్య ప్రణాళికలు, బోధనాపద్ధతులు విద్యార్థుల మెదళ్ళను ఏవిధంగా దాస్యభావనలతో నింపుతుందో కెన్యాకు చెందిన Ngugi wa *Thiong'o* తన *'Decolonising the Mind'* గ్రంథంలో చర్చించాడు. ఆంగ్లసాహిత్యం చదువుకొనే విద్యార్థులు షేక్‌స్పియర్, మిల్టన్, కీట్సు, వర్డ్స్‌వర్త్, షెల్లీ, కిప్లింగ్ మొదలైన వారి రచనలు లోతుగా చదవటం పరిపాటి. ఆంగ్లసాహిత్యవిద్యార్థులపై వారి ప్రభావం అపారం. జాన్ అస్టిన్ ఒక ఆంగ్లరచయిత ఇంగ్లాండ్ భూస్వామ్యవర్గపు నేపథ్యంలో ఆయన అనేక నవలలు వ్రాసారు. కెన్యావిద్యార్థులు అస్టిన్ నవలల్లోని పాత్రలను వారిగ్రామాలలో సైతం గుర్తించటానికి పూనుకొన్నారు. అయితే ఇందులో ఆశ్చర్యం ఏమీలేదని, వలసపాలిత ప్రజల వైయుక్తిక, సామాజిక దృక్పథాలను వారి చదువులు ప్రభావితం చేస్తాయని, పాశ్చాత్య దృక్కోణం నుండే ప్రపంచాన్ని చూడటం నేర్పుతాయని, ప్రత్యామ్నాయ దృక్కోణాలను విద్యార్థులు ముందు ఉంచరని, వలస విద్యావిధానంలో అత్యంత ప్రమాదకరమైన అంశం ఇదేనని ఆయన హెచ్చరించారు.

శివ నయిపాల్ భాష ఏవిధంగా భూగోళశాస్త్ర పరిజ్ఞానాన్ని సైతం మార్చుచెయ్యగలదో ఒకచిన్న దృష్టాంతం ద్వారా చర్చించారు. తూర్పు ఆఫ్రికాలో Kilimanjaro కొండలు ప్రసిద్ధిగాంచాయి. వలసపాలన మొదలయ్యాక ఆ కొండలలోని ఎత్తైన ప్రదేశాలలో తెల్లదొరల నివాసం ఏర్పరచుకొన్నారు. వాటిని 'హైలాండ్స్' అని పిలవటం మొదలుపెట్టారు. సామాన్య ప్రజలు నివసించే దిగువప్రాంతాలను 'లోలాండ్స్' అనిపిలిచారు. ఆ కొండల అసలుపేరును కాలక్రమంలో అందరూ మర్చిపోయేలా చేసి, చివరకు 'హైలాండ్స్' చుట్టూనే కథను నడిపారు[5].

మానవవిజ్ఞానశాస్త్రం (Anthropology)ను వలసపాలకులు వారి స్వప్రయోజనాలకు వాడుకొన్నారు. అది పాలకులచేతిలో శక్తివంతమైన ఆయుధంగా

మారింది. అన్ని దేశాలలోను పాశ్చాత్యులు తమవలసపాలనను సమర్థించేందుకు దాన్ని వాడుకున్న వైనాన్ని ఎడ్వర్డ్‌సెడ్ వివరించారు. పాలస్తీనాకు చెందిన ఎడ్వర్డ్‌సెడ్ భాషావేత్త మాత్రమే కాక తత్త్వవేత్త కూడా. వలసపాలకులు, పాలితులమధ్య జాతిపరంగా, శక్తియుక్తులపరంగా, మేధాపరంగా, భౌతికంగా తేడాలున్నాయని, పాలితులు పాలించబడటానికి, పాలకులు పాలించటానికి అర్హులుఅని పాలకులు చెప్పుకోవటానికి కావలసిన సిద్ధాంతభూమికను మానవవిజ్ఞాన శాస్త్రవేత్తలు తయారుచేశారు. వలసపాలనలోకి నెట్టివేయబడినవారు పాలకులకంటె భిన్నమైనవారు మాత్రమేకాదు, అధములని వివిధ ప్రాంతాలలో, వివిధ సందర్భాలలో నిరూపితం అయిందని వారు చెప్పారు. టెలిఫోను వాడుకోవటమేతప్ప టెలిఫోన్‌ను కనుగొనలేనివారు కనుక ఎందుకూ కొరగానివారని, పాశ్చాత్యులను అనుసరించటమే తప్ప అధిగమించటం తెలియనివారు కాబట్టి కేవలం పాలించబడటానికి మాత్రమే వారికి అర్హత ఉందని వ్రాసారు. తమతమ సాంస్కృతిక నేపథ్యాలనుండి విడిపడి, తమ అస్తిత్వాలను కోల్పోయినవారు, పాశ్చాత్యులను గుడ్డిగా అనుకరిస్తారని ఎడ్వర్డ్ సెడ్ హెచ్చరించారు. కనుక సాంస్కృతిక మేధావారసత్వంతో తిరిగి బంధం పెట్టుకోవటమే సమస్యకు పరిష్కారమవుతుందని చెప్పారు[9].

ట్యూనిషియాకు చెందిన రచయిత ఆల్బర్ట్ మెమ్మి తన నవలలోని ప్రధానపాత్ర ద్వారా వలసపాలిత ప్రజల ఆకాంక్షలను పాలకులు ఏవిధంగా వమ్ముచేసారో చెప్పి, వలసపాలకులను అనుసరించిన మాత్రాన పాలితులు ఎన్నటికీ పాలకులతో సమానంకాలేరని, స్వప్రయోజనాలే పాశ్చాత్యదేశాలను నడిపిస్తుంటాయని తన నవల ద్వారా రసరమ్యంగా చెప్పారు. ఆ నవలలోని ప్రధానపాత్ర వలసపాలకుల గుర్తింపు కోసం, పాశ్చాత్య ప్రపంచంలో ఎదగటానికి తనకున్న వివిధ అస్తిత్వాలను-అరబ్బు, ఆఫ్రికన్, ట్యూనిషియా-యూదు గుర్తింపులను వదిలివేస్తాడు. పాశ్చాత్య విద్యాపారంగతుడు అవుతాడు. రెండవ ప్రపంచయుద్ధం వచ్చేవరకు అంతా బాగానేఉంటుంది. యుద్ధం మొదలవగానే అదితన ఖండానికి, దేశానికి, ప్రాంతానికి విస్తరించిన తర్వాత అంతా తారుమారు అవుతుంది. తన స్వంత ప్రపంచానికి, విద్యా ప్రపంచానికి మధ్య యుద్ధం మొదలయిన తర్వాత, అతని విద్యార్హతలు, పాండిత్యం, పాశ్చాత్యీకరణ అతనిని ఫ్రెంచివారి మతమదాంధత (Bigotry),

పక్షపాతాలనుండి కాపాడలేకపోయ్యాయి. పాశ్చాత్యతత్త్వశాస్త్రం, తత్త్వవేత్తలు అతనికి అత్యంత అవశ్యకమయిన సందర్భంలో అతడిని ఒంటరివాడిని చేసాయి. సమానత్వం, స్వేచ్ఛ, సౌభ్రాతృత్వం కోసం వారిని కోరినప్పుడు, వారు మౌనాన్ని ఆశ్రయించారు. ఇది ఒక నవల రూపంలో చెప్పబడినా, స్వంత అస్తిత్వాలను వదులుకోవద్దని వలసపాలిత ప్రజలకుచెప్పిన హితవు[7].

ఫ్రెంచి గణితశాస్త్రజ్ఞుడు, తత్త్వవేత్త Rene Descartes (1596–1650) నుండి ఆంగ్లతత్త్వవేత్త, ఆర్థికశాస్త్రవేత్త జాన్ స్టువార్ట్ మిల్ (1806–1873) వరకు శ్వేత జాతీయుల తత్త్వవేత్తలు వలసపాలితదేశాల ప్రజల సమస్యలను ఎన్నడూ పట్టించుకొన్న పాపాన పోలేదు. పాశ్చాత్యమేధావులకు ద్వంద్వప్రమాణాలు మెండు. వారు చెప్పే నీతిబోధనలు, మానవహక్కులు, సౌభాతృత్వఆకాంక్షలు, సామాజిక న్యాయాలు, వ్యక్తి స్వేచ్ఛలు కేవలం పాశ్చాత్య క్రైస్తవ ప్రపంచానికే పరిమితం. 'సామ్రాజ్యాల' నిరంకుశ పాలనను వారెన్నడూ విమర్శించలేదు. పాశ్చాత్యుల తత్త్వశాస్త్రం, తత్త్వవేత్తల నమ్మకద్రోహం, బానిసవిధాన రూపకల్పనలో (అమెరికా రాజ్యాంగ నిర్మాతలు, ముఖ్యంగా 'బిల్ ఆఫ్‌రైట్స్' రూపకర్తలలో అనేకమంది బానిసల వ్యాపారం చేసినవారే. వందలకొద్దీ బానిసలను కలిగి ఉన్నవారే), వలసరాజ్యస్థాపనలో (జేమ్సుమిల్ ఉపయోగితావాద తత్త్వవేత్త మాత్రమే కాదు, లండన్‌లోని ఇండియాహౌస్‌కు అధిపతి కూడా), నాజీయిజం సమర్థనలో (ప్రముఖ జర్మన్ తత్త్వవేత్త మార్టిన్ Heidegger నాజీయిజం సమర్థకులలో ఒకరు) ప్రస్ఫుటంగా కన్పడుతుంది. అన్ని తత్త్వాల అంతిమలక్ష్యం సత్యాన్వేషణే అయినప్పటికీ, పాశ్చాత్యమేధావుల సత్యాన్వేషణ మాత్రం అధికారంలో పాలుపంచుకొని, దుర్మార్గాలను సహించటమేకాక, సమర్థించటంతో ఆగిపోతుంది. పాశ్చాత్య వేదాంతం తరగతి గదులలో పెదపెద్ద ప్రశ్నలను లేవనెత్తుతుంది. వలసవీధులలో మౌనంగా ఉంటుంది. ఎందుకు? ఇది తత్త్వవేత్తల నయవంచన వలన లేక నమ్మకద్రోహం వలన ఏర్పడిందికాదు. పాశ్చాత్య వేదాంతమూలాలలోనే ఉన్న అన్యోన్యవిరుద్ధత (Paradox) వలన వచ్చిన సమస్య. వారి సత్యాన్వేషణలో నిజాయితీ ఉంటే, వలసదేశాలలో జరిగిన జనహింసను, బలవంతపు మతమార్పిళ్ళను, స్థానికభాష, మతసంప్రదాయాల అణచివేతను, ఆర్థిక

వనరులదోపిడీని ప్రశ్నించి ఉండేవారు. ఆ దేశాలు ఖండాంతరాలలో విచ్చలవిడిగా ఒడిగట్టిన దారుణమారణకాండను, పాల్పడిన జాతి వివక్షను ఖండించి ఉండేవారు. అట్టి ప్రయత్నమేదీ వారు చెయ్యలేదు. బలవంతపు పాశ్చాత్యీకరణ వలసదేశాల సమస్యలకు పరిష్కారం కాదని తప్పక చెప్పేవారు[8].

వలసపాలకులు ఏ దేశానికి చెందినవారైనప్పటికీ, వారు ఇంగ్లీషువారైనా, ఫ్రెంచివారైనా, పోర్చుగీసువారైనా, జర్మనీవారైనా, బెల్జియం వారైనా-ఒక చిన్న ఐరోపాను వారి ఆక్రమితదేశాలలో సృష్టించదల్చుకొన్నారు. కొన్ని దేశాలను వారు పూర్తిగా ఐరోపాగా మార్చారు. అర్జంటీనా, ఆస్ట్రేలియా అందుకు ఉదాహరణగా నిలుస్తాయి. చాలా దేశాలలో వలసపాలకులు తమకొక బలమైన విధేయవర్గాన్ని తయారుచేసుకొన్నారు. వలసపాలనానంతరం ఉన్నత పదవులలో వారు నెలకొల్పిన విద్యాలయాల్లో చదివినవారే నియమితులైనారు. వలసపాలకులపట్ల ఆ వర్గానికి ఉన్న కృతజ్ఞతాభావంతో తెల్లదొరలు తమదేశాలకు, దేశస్థులకు, సంఘానికి చేసిన క్షమించరాని దురాగతాలను తర్వాత తరాలవారికి తెలియకుండా దాచిపెట్టారు. వలసపాలనా కాలపు దారుణ వాస్తవాలను వెలుగులోకి రానివ్వనందున పాశ్చాత్య 'ఉదారవాద' భావనలు నేటికీ చలామణీలో ఉన్నాయి.

వలసపాలన అనేక దేశాలలో పాలితులను భావదాస్యంలోకి నెట్టివేసింది. వలసపాలన ఒక ఛాయామెదడును (Shadow Mind) సృష్టించింది. సృజనాత్మకతకు, దానికి ఆమడదూరం. కాస్తో కూస్తో సృజనాత్మకత మిగిలిఉన్నా, అది క్రమంగా కనుమరుగు అవుతుంది. ఆ ఛాయా మెదడు స్వతంత్రంగా ఆలోచించలేదు. నిర్ణయాలు తీసుకోలేదు. దానికి తెలిసిందల్లా అనుకరించటం. దానికి నేర్పిందల్లా ఆంగ్లేయులను గుడ్డిగా అనుకరించటం. వేలాది సంవత్సరాల మేధో, సాంస్కృతిక నేపథ్యంతో దానికి ఎట్టి సంబంధం లేదు. తాము ప్రవేశపెట్టిన విద్యావిధానంద్వారా అటువంటి ఛాయామెదళ్ళను అనేకం వారు తయారుచేశారు. తమ దేశాల, సమాజాల, ప్రజల సమస్యలకు పరిష్కారాలు పాశ్చాత్య క్రైస్తవ పెట్టుబడిదారీ దేశాలలోనే దొరుకుతాయని ఈ ఆంగ్ల మానసపుత్రుల విశ్వాసం.

**భావదాస్యవిముక్తి (Decolonisation of the Mind):**

భావదాస్య ప్రమాదాన్ని గుర్తించి, భారతజాతిని ఆత్మవిస్మృతినుండి మేలుకొల్పిన వారిలో ప్రప్రథములు స్వామి వివేకానంద. ఎంత ఘనమైనగతం మనకున్నదో

ఆంగ్లేయుల ఏలుబడి-అంతులేని దోపిడీ

సవివరంగా వివరించి, ఆత్మవిశ్వాసాన్ని జాతిలో పునరుద్ధరించి, నాటికి నేటికి స్ఫూర్తిప్రదాతగా స్వామీజీ నిలిచిపొయ్యారు. ఆయనకాలంలోనూ, ఆయన తర్వాత కూడా భావదాస్యం నుండి భారతీయులను విముక్తులను చెయ్యటానికి గట్టి ప్రయత్నాలు జరిగాయి.

ఆర్యసమాజస్థాపకులు, 'సత్యార్థ ప్రకాశ్' రచయిత దయానందసరస్వతిగారు తన రచనలద్వారా, ఉద్యమంద్వారా వేదాలలోని గొప్పదనాన్ని సామాన్యులకు అర్థమయ్యే భాషలో, రీతిలో తెలియచెప్పి, మరుగున పడిపోతున్న వేదసంస్కృతికి తిరిగి జీవంపోసారు. విప్లవకారుడు, మహాయోగి అరవిందులు భారతీయ సాంస్కృతిక వైభవాన్ని భారతీయులకు, ఇతరులకు తెలియచెప్పారు. పాశ్చాత్య నాగరికతలోని పరిమితులను ఎత్తిచూపారు.

విశ్వకవి రవీంద్రుడు ఆంగ్లేయులు నెలకొల్పిన విద్యాలయాలు దేశఅవసరాలకు తగినవి కావని, ప్రత్యామ్నాయ జాతీయ విద్యాలయాల ఏర్పాటు అవసరాన్ని తెలియచెప్పి, తాను స్వయంగా శాంతినికేతన్‌లో అట్టి విశ్వవిద్యాలయాన్ని ఒక దానిని నెలకొల్పి, దారిచూపారు.

భారతజాతి సుదీర్ఘ చరిత్రలో ఎప్పుడూ పరాజయాలు, బానిసత్వాలు మాత్రమే కాక అనేక సువర్ణ అధ్యాయాలు సైతం ఉన్నాయని, వాటిని వెలికిదీసి, మహోన్నత చరిత్రకు భారతీయులు వారసులని తెలియచెప్పి, సాంస్కృతిక జాతీయవాదాన్ని వినాయక దామోదర సావర్కర్ ప్రతిపాదించారు.

'స్వరాజ్యం నా జన్మహక్కు' అని నినదించిన తిలక్ ధార్మిక ఐక్యతను తీసుకొనిరావటానికి ప్రయత్నించి, కృతకృత్యుడయి, అనేక వేలమందిలో జాతీయభావస్ఫూర్తిని రగిలించారు.

లాల్, బాల్, పాల్ నాయకత్రయం జాతీయ పునరుజ్జీవనకు శంఖం పూరించారు. బందరులో జాతీయ కళాశాల స్థాపన ఆ వరుసలో జరిగినదే. ముట్నూరి కృష్ణారావు, కోపల్లె హనుమంతరావు ప్రభృతులు అందుకు అభినందనీయులు.

పాశ్చాత్య నాగరికతను తీవ్రంగా వ్యతిరేకించిన వారిలో గాంధీ ప్రప్రథముడు. వారి వస్తు ప్రేమ, భోగలాలసత మానవాళికి, పర్యావరణానికి ముప్పుగా పరిణమిస్తుందని, అట్టినాగరికతకు బానిసలుకావద్దని, తన స్వదేశీ, సత్యాగ్రహ ఉద్యమాలద్వారా జాతిని చైతన్యం చేసారు. ఆంగ్లేయుల విద్యావిధానాన్ని తీవ్రంగా

ఖండించి, జాతీయ విద్యావిధానానికి రూపకల్పన చేసారు.

సమాజంలోని దురన్యాయాలు, దుర్మార్గులను, అసమానతలను ఎండగట్టుతూనే, విదేశీమతాలు జాతీయస్ఫూర్తికి విఘాతం కల్గించగలవని డా॥ అంబేద్కర్ తిరుగులేని సాక్ష్యాధారాలతో భారతీయులకు మార్గదర్శనంచేసారు.

ఆంగ్లపాలకులపై యుద్ధాన్ని ప్రకటించి, శౌర్యంతోనే స్వాతంత్ర్యం సిద్ధిస్తుందని, భారతీయులలో సమరోత్సాహాన్ని ప్రోదిచేసిన నేతాజీ సుభాష్‌చంద్రబోస్ వలసపాలన ముగింపుకు మార్గం సుగమంచేశారు.

డా॥ కేశవరావ్ బలీరామ్ హెడ్గెవార్ భావదాస్యంనుండి జాతిని విముక్తం చేయటానికే ఒక ఆచరణాత్మకమైన దేశభక్తి కార్యక్రమాన్ని రూపొందించారు.

వీరందరి కృషి ఫలించి, దేశంలో జాతీయ చైతన్యం వెల్లివిరిసింది. స్వదేశీ, స్వాభిమాన, స్వధర్మభావనలు వ్యాపించాయి. గతకాలపు వైభవాన్ని, సాంస్కృతిక గొప్పతనాన్ని ప్రజలు అర్థం చేసుకొనే ప్రయత్నం మొదలుపెట్టగానే వలసపాలకులు, వారి మద్ధతుదారులు వారిని నిరుత్సాహపరిచే ప్రయత్నం చేసారు. వలసపాలకులకు ఒక అనుకోని వర్గంనుండి వారుకోరుకున్న దానికంటె ఎక్కువ మద్ధతు లభించింది. వారే వామపక్షీయులు. వామపక్షమేధావులకు భారతదేశ గతవైభవం తాలుకూ స్మృతివిశేషాలు సైతం నచ్చవు. వలసపాలకులకంటే ఎక్కువ సాంస్కృతిక ద్రోహానికి వారు పాల్పడ్డారు. జాతీయ నాయకులందర్నీ విమర్శించారు. స్వామి వివేకానందుని బోధనలకు వక్రభాష్యం చెప్పారు. సావర్కర్‌ను హిందూ తీవ్రవాది అన్నారు. గాంధీని పెట్టుబడిదారీ వర్గపు ఏజంటు అని పిలిచారు. డా॥ అంబేద్కర్‌ను బ్రిటీషుతొత్తుగా అభివర్ణించారు. నేతాజీని, ఆర్.ఎస్.ఎస్ నాయకత్వాన్ని ఫాసిస్టు శక్తులని పేర్కొన్నారు. ఏ జాతీయ నాయకుడిని వారు గౌరవించ లేదు.

కమ్యూనిష్టు సిద్ధాంతానికి, అబ్రహామీయ మతాలకు ఒక సారూప్యంకూడా ఉంది. వారికి ముందున్న ఏ పద్ధతిని, ఏ సంస్కృతిని, ఏ సమాజాన్ని అవి అంగీకరించవు. అంతకుముందున్న పద్ధతులు, ఏర్పాట్లు-అవి ఇహానికి సంబంధించినా, పరానికి సంబంధించినా అవి ఎందుకూ పనికిరావని, వాటిని సమూలంగా నాశనం చేసి, వాటి అవశేషాలపై కొత్త సమాజం నిర్మాణం చెయ్యాలని ప్రతిపాదిస్తాయి. 2200 సంవత్సరాలకు ముందున్న పాగన్-రోమన్ సంస్కృతిని క్రైస్తవం సమూలంగా నాశనం చేసింది. పాశ్చాత్య క్రైస్తవదేశాలలో క్రీస్తుకు పూర్వం ఉన్న మతాల,

సంస్కృతుల పద్ధతులు, విశ్వాసాలు నేడు మచ్చుకైనా కన్పించవు. ఆ తర్వాత 600 ఏళ్లకు పుట్టిన ఇస్లామ్ అరబ్బుదేశాల నాగరికతను, ఆరాధనా పద్ధతులను మచ్చుకైనా మిగల్చలేదు.

ఇస్లామ్, క్రైస్తవం రెండూ అంతకుముందున్న మత, సంస్కృతుల సమాధులపైన ఎదిగాయి. కమ్యూనిష్టు సిద్ధాంతంకూడా బహుశా ఈ రెండు మతాల ఎదుగుదలనుండే స్ఫూర్తిని పొంది ఉండవచ్చు. వర్గపోరాటంలో విజయం సాధించాక, అంతకుముందుండే భూస్వామ్య, పెట్టుబడిదారీ వర్గాన్ని సమూలంగా నాశనంచేసి, వారితోపాటు వారి సంస్కృతిని కూడా భూస్థాపితం చేసిన తర్వాత సరికొత్త శ్రామిక సంస్కృతిని నెలకొల్పటానికి ప్రయత్నం చెయ్యాలని వారి సిద్ధాంతం ఉద్బోధం చేస్తుంది. చైనా, రష్యాలలో జరిగింది అదే. సాంస్కృతిక విప్లవం పేరిట ఆ దేశాలలో జరిగిన మారణకాండలో లక్షలాదిమందిని బలిగొన్నారు. విప్లవ సంస్కృతిని నెలకొల్పటంకోసం దేశాల గతాన్ని పూర్తిగా తుడిచివేసారు. అటువంటి సైద్ధాంతిక భూమిక గల వామపక్షమేధావులకు భారతీయగతంలో కొంచెంకూడా మంచి కనిపించలేదు. గతకాలపు పరమవైభవంగురించి మాట్లాడే వారందరూ వారి దృష్టిలో ప్రగతి నిరోధకులు అయ్యారు. వలసపాలకులు, ఆంగ్ల చరిత్రకారులు, క్రైస్తవమత ప్రచారకులు భారతదేశ చరిత్ర, సంస్కృతుల గురించి, చేసిన కువిమర్శలను వామపక్ష మేధావులు తిప్పికొట్టవలసిందిపోయి, వంతపాడారు. వారి దృష్టిలో గతం ప్రగతిశీలమైంది కాదు. దానిని వదిలించుకోవటం మంచిది. సాంస్కృతిక పునరుజ్జీవన ప్రయత్నాలుకు వారు వ్యతిరేకం. హిందూధర్మాన్ని విమర్శించటానికి వెనుకాడని మనదేశపు వామపక్షమేధావులు క్రైస్తవాన్ని, ఇస్లామ్‌ను విమర్శించగా ఇంతవరకు ఎవరూ వినలేదు. చదవలేదుకూడా.

రెండవ ప్రపంచయుద్ధానంతరమే పాశ్చాత్య క్రైస్తవదేశాలు వారి అవసరార్థం 'సెక్యులర్' సిద్ధాంతాన్ని ప్రబోధించాయి. మతం ఆధారంగానే, మతంకోసమే, మత ఆదర్శాలకోసం ఆ దేశాలు అంతవరకు పనిచేసాయి. అకస్మాత్తుగా అవి మతప్రమేయం లేనివి అయ్యాయి. రాజ్యం మతవ్యవహారాలలో జోక్యం చేసుకోకూడదని ఒక కొత్తసిద్ధాంతాన్ని వారు తీసుకొనివచ్చారు. తాముపాలించిన వలసదేశాలలో, లక్షలాది మందిని వారు క్రైస్తవంలోకి మార్చారు. వలసపాలనానంతరం స్థానిక ప్రభుత్వాలు

క్రైస్తవులను తమ పూర్వపు మతాలలోకి తెచ్చే అవకాశాలను నిరుత్సాహపర్చటానికి రాజ్యం మత వ్యవహారాలలో జోక్యం చేసుకోకూడదనే సిద్ధాంతానికి విస్తృత ప్రచారం చేసారు. ఆ విధంగా 'సెక్యులరిజం' ఒక కొత్తమతం అయింది. వామపక్షమేధావులు విచిత్రంగా పెట్టుబడిదారీ దేశాల సెక్యులరిజం సిద్ధాంతాన్ని తలకెత్తుకున్నారు. సాంస్కృతిక పునరుజ్జీవనం కోసం చేసే ప్రతిచర్య వారిదృష్టిలో సెక్యులరిజానికి వ్యతిరేకం అయింది. భావదాస్యం నుండి బయటపడటంకోసం సాంస్కృతిక గతాన్ని అర్థంచేసుకోవటం, సంబంధం పెట్టుకోవటం అవసరం. దానిని వామపక్షాలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాయి.

ఆంగ్ల మానసపుత్రులు, వామపక్షమేధావులు భావదాస్యంగురించి పట్టించుకోరు. పాశ్చాత్యమయిన ప్రతిదాన్ని స్వాగతిస్తూ, భారతీయమైన ప్రతిదాన్ని వారు తిరస్కరిస్తారు. ప్రజాభిప్రాయాన్ని మలచటంలో వారు కీలక పాత్రపోషిస్తున్నారు. వీరిలో ఎక్కువమంది పాశ్చాత్యవిశ్వవిద్యాలయాలలో చదువుకొన్న విద్యాధికులు. వారి విద్యార్హతలు, ఆంగ్లభాషా నైపుణ్యం కారణంగా వారికి పత్రికా, ప్రసారమాధ్యమాలలో విస్తృతమైన గుర్తింపుఉంది. పాశ్చాత్యదేశాలనుండి అరువుతెచ్చుకొన్న భావాలను, దృక్కోణాలను మనదేశానికి, మన సమాజానికి వర్తింపచేయటానికి వెనుకాడరు. భావదాస్యంనుండి బయటకు తెచ్చే ప్రతిప్రయత్నాన్ని కాషాయీకరణ పేరుతోనో, మరో పేరుతోనో తీవ్రంగా వ్యతిరేకించటం వల్ల, అట్టి ప్రయత్నాలకు ప్రజాదరణ లభించటం లేదు.

స్వాతంత్ర్యఅనంతరం మొదటి విద్యాశాఖమంత్రిగా కరుడుగట్టిన ఖిలాఫత్ వాది అయిన మౌలానా అబుల్ కలామ్ ఆజాద్ నియమించబడ్డారు. 47 నుండి 58 వరకు ఆయన విద్యామంత్రిగా పనిచేసిన కాలంలో భావదాస్యంనుండి విముక్తి చేయటానికి ఎట్టి చర్యలు చేపట్టలేదు. ఆ తర్వాత విద్యామంత్రులుగా పనిచేసిన మహమ్మద్ ఆలీ కరీంచాగ్లా (63-66), డా॥ వి.కె.ఆర్.వి.రావు (1969-71)లు కొన్ని ప్రయత్నాలు చేసినా ఫలించలేదు. 1972 నుండి 77 వరకు విద్యామంత్రిగా ప్రొఫెసర్ నూరుల్ హసన్ పనిచేసారు. ఆయన హయాంలో విద్యావ్యవస్థపై వామపక్షమేధావుల పట్టుబిగిసింది. దానితో భావదాస్యాన్ని తొలగించే ప్రయత్నాలు పూర్తిగా నిలిచిపోయ్యాయి.

**భారతీయ దృష్టికోణంనుండి చరిత్ర తిరిగివ్రాసుకోవాలి :**

భావదాస్యవిముక్తికి భారతదేశ చరిత్రను పరిశీలించి, భారతీయుల దృష్టి కోణం నుండి తిరిగి వ్రాయటం అత్యావశక్యం అని అనేకమంది ఆలోచనాపరులు మనకు యిస్తున్న సందేశం. వాస్తవానికి వలసపాలకులు ప్రవేశపెట్టిన భావజాలపు బూజును దులపటానికి ఇది మొదటిమెట్టు. 18,19 శతాబ్దాలలో పాశ్చాత్య చరిత్రకారులు, ఆలోచనాపరులు భారతదేశంగురించి వ్రాసిన వివరణలను, కథనాలను సవాలు చెయ్యటం అవసరం. అవి మనలో ఆత్మనూన్యతను పెంపొందించేందుకు, బలహీనపర్చేందుకు వ్రాసిన వ్రాతలుతప్ప వేఱుకావు. 'దురన్యాయం, దోపిడీ, అరాచకాలకు' నిలయంగా ఉన్న హిందూసంఘాన్ని వారు సృష్టించారు. అనైతిక, అవినీతిదేశంగా భారతదేశాన్ని అభివర్ణించారు.

"ఆంగ్లచరిత్రకారులు వ్రాసిన మనదేశచరిత్రలు మనమనస్సులను బలహీన పర్చకుండా ఉండవు. ఎందుకంటె అవి కేవలం మనపతనంగురించి మాత్రమే తెలియచేస్తాయి" అని వివేకానందస్వామి అన్నారు. మన ఆచారవ్యవహారాలు, సంప్రదాయాలు, పద్ధతులు, మతం, తత్త్వం గురించి ఏమాత్రం అవగాహనలేని విదేశీయులు నమ్మదగిన, పక్షపాతానికి తావులేని భారతదేశచరిత్రను ఎలా వ్రాయగలరు అన్న ప్రశ్నను ఆయన లేవనెత్తారు. ఆంగ్లచరిత్రకారుల అవగాహనలేమి అనేక అనర్థాలకు దారితీసిందని, భారతదేశపు గతాన్ని అర్థంచేసుకొని వ్రాసే క్రమంలో అనేక పొరపాట్లకు, తప్పుడుభావనలకు, వక్రీకరణలకు దారితీసిందని ఆయన విశ్లేషించారు. భారతదేశాన్ని, దాని సంప్రదాయాలను, సంస్కృతిని, చరిత్రను వివరించే క్రమంలో పాశ్చాత్యులు అనుసరించిన విశ్లేషణా, అన్వయపద్ధతులను, దృక్కోణాలను ఆయన ప్రశ్నించారు. పాశ్చాత్యులు వ్రాసిన చరిత్రలో దొర్లిన పొరపాట్లను, కావాలని చేసిన వక్రీకరణలను ప్రశ్నించటం అవసరమని వివేకానందస్వామి నొక్కిచెప్పారు. 'భారతదేశ చరిత్రను భారతీయులే వ్రాయాలి' అన్న పిలుపును కూడా ఆయన యిచ్చారు. భారతదేశపు గతాన్ని భారతీయ దృష్టికోణం నుండి, శాస్త్రీయపద్ధతిలో తిరిగి నిర్మాణం చెయ్యాలని ఆయన ఉద్బోధించారు. భావదాస్యం నుండి బయటపడటానికి (Decolonisation of Mind) గతంతో సంబంధం పెట్టుకోవటం అవసరమని చెప్తూ తనమిత్రుడైన ఖేత్రిమహారాజుకు వ్రాసిన లేఖలో ఆయన ఇలా అన్నారు "గతంవైపు దృష్టిసారించేవారిని నిందించటం

ఇప్పుడు అలవాటుగా మారింది. భారతదేశపు ప్రస్తుత సమస్యలకు, కష్టాలకు, కడగండ్లలకు అదేకారణం అని విమర్శించే వారు కూడా ఉన్నారు. కాని ఘనమైన మనగతం గురించి తెలుసుకోలేకపోవటం, గతవైభవాన్ని అర్థంచేసుకోకపోవటమే ప్రస్తుత సమస్యలకు కారణం. హిందూజాతి తనగతాన్ని విస్మరించినంతవరకు, ఒకరకమైన నిద్రాణస్థితిలో ఉంది. ఆ విస్మృతినుండి బయటపడే ప్రయత్నాలు మొదలుపెట్టగానే, సజీవచైతన్యం అన్నివైపులనుండి ప్రత్యక్షం అవటం మొదలయింది. నూతన జవసత్వాలు జాతికి చేకూరుతున్నాయి. ఆ గతం ఆధారంగానే, భవిష్యత్తు నిర్మాణం చెయ్యాలి. మనగతమే మన భవిష్యత్తు అవుతుంది." కనుక హిందువులు తమ గతంగురించి ఎంత ఎక్కువ తెలుసుకుంటే వారి భవిష్యత్తుకు అంతమంచిదని, ఆ గతవైభవాన్ని ప్రతియింటికి చేరవేసేవారు జాతికి గొప్ప ఉపకారులు అవుతారని స్వామీజీ చెప్పారు[9].

చరిత్రవక్రీకరణలను ప్రశ్నించిన వారిలో కళాద్రష్ట, సాంస్కృతిక సాలోచన పరుడు అయిన ఆనంద కుమారస్వామి ఒకరు. భారతదేశంలో ప్రవేశపెట్టబడిన ఆంగ్లవిద్య భారతదేశంగురించి పాశ్చాత్యులకు ఉన్న అభిప్రాయాన్ని బలపర్చేది మాత్రమేకాక దానికొక శాశ్వతత్వాన్ని కలుగచేసేదిగాను ఉన్నదని ఆయన విమర్శించారు. "ఆంగ్లేయులు భారతదేశానికి 'యిచ్చామని' గర్వంగా చెప్పుకుంటున్న విద్యావిధానం వారందరూ ఇంచుమించుగా నమ్ముతున్న ఒక తప్పుడు అభిప్రాయం పునాదులపై తయారుచేయబడింది. భారతదేశం ఒక ఆటవికమైన, భయంకరమైన దేశమని (Savage Country) ఇంగ్లండ్‌లో సర్వసామాన్య అభిప్రాయం. అట్టిదేశాన్ని నాగరికం చేసే బాధ్యతను ఇంగ్లండ్ తన భుజస్కంధాలపైకి తనకుతానుగా ఎత్తుకొందని, ఆప్రక్రియలో భాగంగానే ఆంగ్లవిద్యను భారతీయులకు యిచ్చామని వారు గర్వంగా చెప్పుకుంటున్నారు".[10]

విశ్వకవి రవీంద్రనాద్ ఠాగూర్ భారతదేశ చరిత్రను పాశ్చాత్యులు నిర్మాణం చేసినతీరుపట్ల తన అసంతృప్తిని వ్యక్తపరిచారు. మనదేశపు యువతకు అందిస్తున్న చరిత్ర అనేక వక్రీకరణలకు లోనైన భయము, ఆశ్చర్యం, కల్గించే నమ్మశక్యం కాని కథనాలకూర్పు తప్ప మరొకటికాదని, భారతదేశపు ఘనమైన గతాన్ని ఒకపెద్ద పీడకలలాగా మలిచారు అని విమర్శించారు. ఒక గందరగోళపు బానిసత్వపు

వలయంలో చిక్కుకొని భారతదేశం, దాని ప్రజలు విలవిలా కొట్టుమిట్టాడుతున్నట్లుగా వ్రాసారని ఆయన పేర్కొన్నారు.

"ఎక్కడినుండో కొందరు గుంపుగా వస్తారు. పెద్దగందరగోళం మొదలవుతుంది. దాడులు, ప్రతిదాడులు, ప్రతిఘటనలు, రక్తపాతాలతో సమాజం అల్లకల్లోలం అవుతుంది. సింహాసనంకోసం తండ్రి-కొడుకులు, అన్న-తమ్ముడు పోటీపడి కొట్లాడుకొంటారు. ఒక గుంపు దయతో నిష్క్రమిస్తే, ఆకాశంనుండి ఊడిపడినట్లుగా మరొక గుంపుదాడి చేస్తుంది. పఠాన్లు, మొగలాయిలు, పోర్చుగీసు వారు, ఫ్రెంచివారు, ఆంగ్లేయులు అందరూ కలసి ఈ పీడకలను మరింత క్లిష్టతరం చేసారు". అటువంటి వక్రీకరణకు లోనైన కథనాలు నిజమైన భారతవర్షాన్ని దూరంనుండైనా చూడనివ్వవు. "భారతదేశంలోని ప్రజలు ఎక్కడినుండి వచ్చారు?" అన్న ప్రశ్నకు సమాధానం కూడా యివ్వరు. విదేశీయులు వండివారుస్తున్న చరిత్ర కథనాలు భారతీయులను వారి అస్తిత్వాలను తెలుసుకోనివ్వదు. 'దుమ్ము', 'తుఫాన్',ల ఉపరితలంకింద అవిచ్ఛిన్నంగా కొనసాగిన నాగరికతలోని ప్రధాన అంశాలను తెలుసుకోనివ్వదు. జీవితాలలోకి ప్రసరిస్తున్న ప్రస్తుత వెలుగు రేఖలను సైతం చూడనివ్వదు అని రవీంద్రకవీంద్రుడు విశ్లేషించారు.

ఆయన ఇంకా ఇలా వ్రాసారు "ఆ చరిత్ర చదివితే భారతవర్షము అనేది ఎక్కడా, ఎన్నడూ లేనట్టుగా మీకు అన్పిస్తుంది. ఉన్నదల్లా పఠానులు, మొగలాయిలు భీకర రణగొణధ్వనులు చేసుకుంటూ ఉత్తరంనుండి దక్షిణానికి, తూర్పునుండి పడమరకు దేశమంతటా వారి జెండాలు పైకెత్తుకొని చుట్టివచ్చినట్లుగా వ్రాసారు.... కాని విదేశీయులకు వారి భూభాగాలు ఉన్నట్లే, భారతదేశానికి కూడా దానికంటూ ఒక ప్రత్యేక భూమి ఉంది. దానిమీద ప్రజలు అనాదిగా జీవిస్తున్నారు. లేకుంటే ఇంత అల్లకల్లోలం మధ్య కబీర్, నానక్, చైతన్యమహాప్రభు, తుకారాంలకు జన్మను యిచ్చింది ఎవరు? కేవలం ఢిల్లీ, ఆగ్రాలు మాత్రమే కాదు దేశంలో ఉన్నవి. కాశీ, నవద్వీప్‌లు కూడా ఉన్నాయి. నిజమైన భారతవర్షంలో ప్రసరిస్తున్న జీవనవెలుగులు గురించి, పెరుగుతున్న ప్రయత్నాల ఫలితాల గురించి, వచ్చిన, వస్తున్న సామాజిక మార్పుల గురించిన సానుకూల కథనాలు మనచరిత్ర గ్రంథాలలో కనీసం మచ్చుకైనా కన్పించవు.

కనుక ఆ గ్రంథాలు చదివితే "భారతీయులకు ఎట్టి అస్తిత్వమూలేదు. ప్రత్యేకతా లేదు. వెలుపలనుండి వచ్చినవారే మనకంటె ఉన్నతులు" అని అన్పిస్తుంది. "భారతవర్షాన్ని భారతవర్షకోణం నుంచి కాక, చిన్నతనంనుండి ఆమెను తక్కువచేసి చూడటం నేర్చుకోవటంతో దానిఫలితంగా మనలను మనమే కించపర్చుకుంటాం" అని ఠాగూరు వ్రాసారు. పాశ్చాత్య చరిత్రకారులు వ్రాసిన చరిత్ర మనలో ఆత్మన్యూనతా భావాన్ని నాటుతుందని, పెంచిపోషిస్తుందని ఠాగూరు హెచ్చరిస్తున్నారు[11].

పాశ్చాత్య చరిత్రకారులలో జరుగుతున్న వక్రీకరణలను గమనించి హెచ్చరించిన వారు కూడా ఉన్నారు. వారిలో హెచ్.జి.రాలిన్‌సన్ (H.G. Rawlinson) ఒకరు. 1913లో ఆయన ఇలా వ్రాసారు. "భారతదేశపు విశ్వవిద్యాలయాలలో ప్రస్తుతం అమలులో ఉన్న బోధనాపద్ధతులవల్ల, విద్యార్థులకు చంద్రగుప్తుడు, గౌతమబుద్ధుని బోధనల కంటె ఎక్కువగా జూలియస్ సీజర్ గురించి, క్రీస్తుకు పూర్వం 490వ సంవత్సరంలో పర్షియాకు, గ్రీకులకు మధ్య జరిగిన యుద్ధంగురించి ఎక్కువ తెలుసు. విద్యార్థులకు పాశ్చాత్యనీతిశాస్త్రాన్ని బోధించటానికి అధ్యాపకులను నియమించిన మనం జన బాహుళ్యాన్ని ఉద్దేశించి సారనాథ్‌లో అశోకుడు రాతిస్థూపంమీద చెక్కించిన నీతిసూత్రాలను అధ్యయనం చెయ్యండని విద్యార్థులను ప్రోత్సహించటం లేదు. తమదేశం గురించి, దానిగతం గురించి గ్రీకు చరిత్రకారులు, చైనా పర్యాటకులు చెప్పిన వివరాలను తెలుసుకోకుండా గ్రీకు, రోమన్ చరిత్రల అధ్యయనంలో మన విద్యార్థులు కాలం వృథా చేసుకోకూడదు"[12].

రాలిన్‌సన్ హిందూ, గ్రీసు దేశాలమధ్య ఉన్న సాంస్కృతిక సంబంధాలు గురించి వ్రాస్తూ పైథాగరస్‌పై ఈజిప్టుకంటె భారతదేశపు ప్రభావమే బహుశా ఎక్కువ ఉండి ఉండవచ్చని వ్యాఖ్యానించాడు. ఎందుకంటె ఆయన బోధించిన అన్ని సిద్ధాంతాలు- మతం, తత్త్వం, గణితశాస్త్రాలకు సంబంధించిన అన్ని సిద్ధాంతాలు క్రీస్తుపూర్వం 6వ శతాబ్ది నాటికీ భారతీయులకు తెలుసునని వ్రాసారు. పైథాగరస్ అనుచరులు జైనులు, బౌద్ధులు మాదిరిగానే జీవహింసకు, మాంసాహారానికి వ్యతిరేకులని ఆయనపేర్కొన్నాడు.

చరిత్రవక్రీకరణ ప్రమాదంనుండి తప్పుకోవటానికి ఒక పాక్షికపరిష్కారం కూడా ఆయన చూపాడు. భారతదేశపు ప్రాచీన చరిత్రను అర్థంచేసుకోవటానికి ఆ కాలానికి చెందిన భారతీయ రచయితలతోపాటుగా గ్రీకు, చైనా దేశాలకు చెందిన రచయితల

రచనలను, వాటి అనువాదాలతో ఒక గ్రంథాన్ని తయారుచెయ్యాలని ఆయనఅన్నారు. ప్రాచీన భారత చరిత్రకు సంబంధించిన శిలాశాసనాల నకళ్ళను సైతం ఆ గ్రంథంలో పొందుపర్చాలని వ్రాసారు. అటువంటి చరిత్ర గ్రంథం మాత్రమే 'తూర్పుదేశాల తాత్త్విక చింతన'పేరుతో ఒక సంస్కృతవాక్యం కూడా చదవలేని కొందరు పాశ్చాత్యవిదూషకులు చెలామణీ చేస్తున్న చెత్తభావనలను, వక్రీకరణలను అడ్డుకోగలదని ఆయన ఆశావహధోరణిని వ్యక్తపర్చారు. ఈ విదూషకుల కారణంగానే తూర్పుదేశాల నాగరికతను, సాహిత్యాన్ని అధ్యయనం చేయటానికి చాలామంది ముందుకు రాలేకపోతున్నారని ఆయన అన్నారు.

**సోదరి నివేదిత హెచ్చరిక :**

రాలిన్సన్‌కు దశాబ్దంతర్వాత, విశ్వకవి రవీంద్రులు భారతదేశ చరిత్ర వక్రీకరణల గురించి వ్రాస్తున్న కాలంలోనే సోదరి నివేదిత హిందువులు తమగతానికి సంబంధించి ప్రత్యామ్నాయ కథనాలను ముందుకు తీసుకురావలసిన అవసరాన్ని గుర్తించాలని హితబోధ చేసారు. స్వాతంత్ర్యంకోసం జరుగుతున్న జాతీయ ఉద్యమంలో ఆంగ్ల భావదాస్య విముక్తి ఒక అంతర్భాగం కావాలని ఆమె కోరుకున్నారు.క్రికెట్ వంటి ఆటలుకాక కబడ్డీవంటి ఆటలు ఆడాలని యువకులకు ఉద్బోధించారు.

ఆధునిక భారతదేశ అభివృద్ధిపై చరిత్ర ప్రభావం గురించి సోదరి నివేదిత ఈ విధంగా వ్రాశారు. "భారతదేశపు చింతనను భారతీయులుగానే అవగాహన చేసుకోవటం అవసరం. అంతేకాక ఆ భావంతోనే, ఆ భావం కోసమే జీవించటమూ, పనిచేయటమూ నేర్చుకోవాలి. ఆ రకమైన మేలుకొలుపుకు చరిత్ర దోహదకారి అవుతుంది. కనుక వక్రీకరణలు, వక్రభాష్యాలు లేని చరిత్రను నిర్మాణం చేసుకోవాలి". 'ఒక జాతియొక్క గుణం, స్వభావం, శీలం, దాని చరిత్రయొక్క 'సారాంశం' పై ఆధారపడుతుంది. మనం ఏమిటో మనం తెలుసుకోవాలనుకుంటే మన పూర్వాపరాలు మనం తెలుసుకోవాలి. చరిత్ర అధ్యయనం భారతీయులలో విశేష ఆసక్తిని రగిలించవచ్చు. ఎందుకంటె భారతదేశ చరిత్రను ఇంతవరకు ఎవరూ వ్రాయలేదు. దానిగురించి ఇంతవరకు ఎవరికీ తెలియదు కూడా". అని సోదరి నివేదిత వ్రాస్తూ "బయటివారి దృష్టికోణం కారణంగా మకిలి పడకపోతే, ఒకజాతి గురించిన అధ్యయనం ఆ జాతిప్రజలకు మేలుచేస్తుంది, వారేమిటో తెలుసుకునేందుకు ఉపయుక్తంగా కూడా ఉంటుందని" అన్నారు.

"తన గతపు అద్దంలోనే భారతజాతి ఆత్మ ప్రతిబింబిస్తుంది. అటువంటి దృశ్యంలోనే తనను తాను గుర్తించగలుగుతుందని, తన జాతియొక్క ప్రధాన లక్షణాలను నిర్ణయించుకోగలుగుతుంది" అని నివేదిత వ్రాసారు. చరిత్రగురించే ప్రధానంగా వ్రాసినప్పటికీ ఆమె అభిప్రాయాలను సంస్కృతి, సామాజిక శాస్త్రాలకు కూడా అన్వయించవచ్చు. ఎందుకంటె భారతదేశం గురించి వాడుకలో ఉన్న సంవేదనను (Perspective), కథనాలను (Narratives), ఆంగ్ల భావదాస్యంనుండి విముక్తిచేయటమే లక్ష్యంగా, ఆమె ఈ మాటలు చెప్పారు. భావదాస్య ప్రభావం చరిత్రనిర్మాణం మీద ప్రధానంగా, ప్రబలంగా ఉండటంతో చరిత్రరచనను భావదాస్య శృంఖలాలనుండి విముక్తిచేయాలని ఆమె ప్రబోధిస్తున్నారు[13].

పాశ్చాత్య చరిత్రకారులు భారతదేశ చరిత్రను నిష్పాక్షికంగా నిర్మాణం చేయలేదని ప్రముఖ చరిత్రకారులు రమేష్‌చంద్ర మజుందార్ స్పష్టంచేశారు. ఈజిప్టు, పశ్చిమ ఆసియాలోని ఇతర పురాతనజాతుల చరిత్రను వ్రాసినప్పుడు వారు చూపిన నిష్పాక్షికత, భారతదేశ చరిత్ర రచనలో వారు చూపించలేదని ఆయన విమర్శించారు. వారి పక్షపాత వైఖరికి గల కారణాలను కూడా ఆయన పేర్కొన్నారు. ఆంగ్లేయులు దేశానికి మహోపకారం చేశారని వారు పాఠకులకు చెప్పదల్చుకున్నారు. కనుక ఆంగ్లేయులు రాకముందు అరాచక, అస్తవ్యస్త, గందరగోళ పరిస్థితులే దేశంలో సాధారణంగా ఉండేవని, అప్పుడప్పుడుమాత్రం అక్కడక్కడా సుస్థిరశాంతి నెలకొనేదని, అదీ ఎక్కువకాలం కొనసాగేది కాదని వారు చెప్పదల్చుకున్నారు. అందుకుగాను అనేక అవాస్తవాలకు, అర్ధసత్యాలకు, వక్రీకరణలకు ఆంగ్లచరిత్రకారులు పూనుకొన్నారు. రాజకీయలక్ష్యాలకు అనుగుణంగా నిర్మించిన చరిత్ర కనుక అడుగడుగున వారి విశ్లేషణలు, అన్వయాలు హిందువులు ఒకజాతిగా ఎన్నడూ లేరని, దేశం సమైక్యంగా ఎన్నడూ లేదని, దేశాన్ని రాజకీయంగా ఏకంచేసిన ఘనత ఆంగ్లేయులదేనని పక్షపాతధోరణితో వ్రాశారని మజుందార్ విడమరచి చెప్పారు. వారి దృష్టిలో భారతదేశచరిత్ర 'రాజకీయ గందరగోళం, పరస్పర విధ్వంసక పోరాటాల దయనీయ గాథ'. ఆంగ్లేయులు వచ్చి ఒక సుస్థిరరాజ్యం నెలకొల్పేవరకు ఆ దయనీయ గాథ అనంతంగా కొనసాగిందని చెప్పేందుకు వీలుగా చరిత్రలోని ఘట్టాలను, సందర్భాలను వక్రీకరించారని మజుందార్ చెప్పారు[14].

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు, బహుభాషావేత్త, విద్యావేత్త అయిన కె.యమ్. మున్షీ మజుందార్‌తో కలసి భారతదేశచరిత్ర పునర్‌నిర్మాణానికి పూనుకొన్నారు.

ఆంగ్లేయుల ఏలుబడి–అంతులేని దోపిడీ

వలసపాలనా కాలంలో వెలువడిన చరిత్రలగురించి ఆయన ఇలా వ్యాఖ్యానించారు. “ఆ చరిత్రలకు ఒక దృష్టికోణం లేదు. కొన్ని సంఘటనలు, కొన్ని కాలాలకు సంబంధించిన చరిత్రలు పాక్షికదృష్టితో భారత వ్యతిరేక కోణంనుండి వ్రాయబడ్డవేకాని, భారతీయులకోణంనుండి వ్రాయబడ్డవికావు. అంతేకాక ఆ సంఘటనలు, కాలాలకు సంబంధించి వారు అందించిన వివరాలు వాటికి కేటాయించవలసిన విస్తృతికంటే చాలా ఎక్కువ ప్రాముఖ్యము ఇచ్చి వ్రాయబడటంతో ఆ వివరాలు పాఠకుల హృదయాలను గందరగోళంలోకి నెట్టివేస్తాయి”[15].

**కె.ఎం. మున్షీ ఆర్.సి. మజుందార్, సీతారాం గోయల్ ప్రభృతుల కృషి :**

భారతదేశ చరిత్ర, సంస్కృతి, సంప్రదాయాలను చాలా క్షుణ్ణంగా, పరిశోధ నాత్మకంగా అధ్యయనం చేసిన కులపతి మున్షీ కూడా తన ముందు తరాలకు చెందిన జాతీయ మేధావుల అభిప్రాయానికే వచ్చారు. “భారతీయ దృష్టికోణంనుండి భారతీయ చరిత్రను సరిక్రొత్తగా వ్రాసుకోవలసిన సమయం ఆసన్నమైనది. ఒక జాతియొక్క ఎదుగుదలను సరిగా అవగాహన చేసుకొనే శక్తిసామర్థ్యాలు ఆ చారిత్రక అభివృద్ధి క్రమం వెనుక ఉన్న మేధస్సును గ్రహించి, మెచ్చుకోగలవారికే ఉంటుంది”.

దశాబ్దాలపాటు వలసపాలకులు, ఆంగ్లచరిత్రకారులు, క్రైస్తవ మత ప్రచారకులు ప్రవేశపెట్టి జాగ్రత్తగా వ్యాప్తిచేసిన, సుస్థిరపర్చబడ్డ ఆలోచనా విధానాన్ని (Mindset) వివేకానంద, ఠాగూర్, నివేదితలు ప్రశ్నించారు. వ్యతిరేకించారు. ఆ ఆలోచనా విధానానికి ప్రత్యామ్నాయంగా భారతీయ ఆలోచనా విధానాన్ని అలవర్చుకోమని పిలుపునిచ్చారు. ఆంగ్లేయులు ప్రవేశపెట్టిన ఆలోచనావిధానం వారి వలసపాలనను సమర్థించుకోవటానికి అవసరం కనుక దానిని అభివృద్ధిచేసి, వ్యాప్తిచేసి, ఆ దృష్టికోణాన్ని కాలక్రమంలో సర్వసామాన్యమైన దృష్టికోణం చేశారు. ఆ దృష్టికోణంనుండి, ఆలోచనా విధానం నుండి బయటపడటం భావదాస్య విముక్తికి తొలిమెట్టు కాగలదు.

పాశ్చాత్యదేశాలలో ఉత్పత్తి అవుతున్నజ్ఞానం సశాస్త్రీయమైనదని నమ్మి, దాన్ని యథాతథంగా మనదేశంలోని విశ్వవిద్యాలయాలలో ప్రవేశపెట్టటానికి ప్రయత్నం చేస్తున్నారు. మన విధాననిర్ణేతల జ్ఞానాన్వేషణ అమాయకత్వం (Epistemic Innocence) పాశ్చాత్యుల సిద్ధాంతాలు, భావనలలో ఉన్న పక్షపాత ధోరణులను, వారికి ప్రయోజనాలను కల్గించే లాభాంశాలను వారి పద్ధతులతో జోడించటాన్ని

చూడనివ్వదు. ఈ రకమైన అమాయకత్వమో, గుడ్డితనమో మన విద్యావిధానలలో, విద్యాపరమైన చొరవలలో, విశ్వవిద్యాలయాలలో కన్పిస్తుంది. ఆధునిక భారతదేశపు సాంకేతిక ఉన్నత విద్యాసంస్థలను నెలకొల్పటం వెనుక పాశ్చాత్యుల నమూనాను గుడ్డిగా అనుసరించటం కన్పడుతుంది. ఆసియా, ఆఫ్రికావంటి పలుదేశాలలో వలసరాజ్యాలు స్థాపించిన సామ్రాజ్యవాద దేశాలు రూపొందించుకొన్న విద్యాప్రణాళికలను మనదేశంలో గుడ్డిగా అమలుచేసే క్రమంలో భారతీయ విద్యార్థులను మరింత భావదాస్యంలోకి నెట్టివేస్తూ, సహఅపరాధులు అవుతున్నారు. ఉదాహరణకు సామ్‌పిట్రోడా నాలెడ్జ్ కమీషన్ నివేదికలను చూడవచ్చు.

**భావదాస్యవిముక్తి (Decolonisation of the Mind) :**

స్పెయిన్, పోర్చుగల్ దేశాల పరాధీనతలో మ్రగ్గిన దేశాల మేధావులు వలసపాలనానంతరం తమకంటూ ఒక ప్రత్యేక జ్ఞానమీమాంసా శాస్త్రాన్ని అభివృద్ధి చేసుకోవటానికి గట్టి ప్రయత్నం చేశారు. వారి 'Epistemology of South' కోసం వారు చేసిన, చేస్తున్న కృషి కూడా అభినందనీయం. కొన్ని కొత్త ఆలోచనలను వారు ప్రవేశపెట్టి, భావదాస్యంనుండి మెదడును విముక్తిచేయటానికి చేస్తున్న చర్చను విస్తృతపర్చారు. ఉదాహరణకు "Colonial difference ''(Mignolo, 2000), ''Trans -Modernity'' (Dussel, 2013) "Coloniality of Power" (Quijano, 2000), "Ecology of Knowledge" (Santos,2012)" లు అటువంటి కొత్త ఆలోచనలలో కొన్ని. కాని ఆంగ్లేయుల ఆధిపత్యంలో మ్రగ్గిన దేశాలలో భావదాస్యవిముక్తికి గట్టిప్రయత్నం జరగలేదనే చెప్పాలి. లాటిన్ ప్రపంచంలో జరుగుతున్న మేధోపరమైన చర్చ దక్షిణ ఆసియాకు విస్తరించటం అవసరం. రామ్‌స్వరూప్, సీతారాంగోయెల్, శ్రీకాంత్ తెలగేరీ, ఎస్.ఎస్.రాజారాం ప్రభృతుల రచనల అధ్యయనం విస్తృతం కావాలి. అశీష్‌నంది, గోపాలగురు, పార్థా ఛటర్జీ, సుదీప్తా కవిరాజ్, శివనాధన్, దీపేష్ చక్రవర్తి, మరికొందరు ఆలోచనాపరులు అప్పుడప్పుడు లేవనెత్తుతున్న అంశాలను మరింత విస్తృతం చేయవలసి ఉంది[16].

పాశ్చాత్యుల కంటే మనం అధములం, హీనులం అనే ఆత్మన్యూనతాభావాన్ని మనసునుండి తొలగించటానికి, మననుండి వేరుచేయబడ్డ గతంగురించి నిర్మాణాత్మకంగా విద్యార్థులకు బోధించాలి. సామాజిక, మానవశాస్త్రాల విద్యాప్రణాళికలలో, బోధనాపద్ధతులలో అందుకు తీసుకొనిరావాల్సిన సంస్కరణలు ఒక పెద్దసవాలు.

పాశ్చాత్య దృక్కోణానికి బదులుగా దేశీయ దృక్కోణాన్ని అభివృద్ధిపర్చటం కూడా అంత తేలికైన విషయం కాదు. ఆంగ్లేయులు మనకు యిచ్చిన భాష, దాని పదసంపద, భావనలు, బోధనాపద్ధతులు, నేర్పిన అంశాలు మనం ఆలోచించే తీరును, వాటి వ్యక్తీకరణను, చూసే దృక్కోణాన్ని తీవ్రంగా ప్రభావితం చేస్తున్నాయి. ఆ కారణంగా దేశీయ దృక్కోణాన్ని అభివృద్ధిపర్చటానికి కావలసిన సాధనసంపత్తిని మనం ఇంకా సమకూర్చుకోలేదని చెప్పవచ్చు.

భావదాస్యంనుండి బయటపడటానికి మనం శాయశక్తులా కృషిచెయ్యాలి. అందుకు మనం వివిధరకాల వ్యూహాలను అమలుచేయవలసి ఉంటుంది[17]. ముందుగా, ఉత్తరార్ధగోళ భౌగోళిక దేశాల అభివృద్ధి నమూనాలను, భావజాలాన్ని అర్థం చేసుకొని, వాటిలోని అసంబద్ధతను వైరుధ్యాల, సంధిగ్ధతలను, అవాస్తవాలను ప్రశ్నించటం నేర్చుకోవాలి. ఈ రకమైన ప్రయత్నం వలన వారి భావజాలాలు, వాదనలలో నిగూఢంగా ఉన్న పక్షపాత ధోరణులను వెలికితీయవచ్చు. వారు చెప్పేవన్నీ అంతిమంగా వారికి మాత్రం ప్రయోజనం కల్గించేందుకు చెప్పేవి అన్న అంశాన్ని బహిర్గతంచేసి, ఎండగట్టి, అట్టి వాదనలను ప్రతిఘటించవచ్చు. రెండవదిగా, అప్రధాన, అణగారిన వర్గాల చరిత్ర (Sub-altern)ను సంస్కృతిని, సమస్యలను గ్రంథస్తంచేసే పనికూడా మొదలుపెట్టాలి. విజేతలు పరాజితుల చరిత్రను వ్రాయరు. పట్టించుకోరు. చరిత్ర ఎప్పుడూ విజేతలపక్షమే ఉంటుంది. సామ్రాజ్యవాదదేశాల పక్షాన్నే ప్రపంచచరిత్ర ఉంది. అప్రధానదేశాల, వర్గాల, సమాజాల చరిత్రను వ్రాసి, వారి కష్టనష్టాలకు బాధ్యులైన వలసపాలకుల అరాచకాలను చర్చకు పెట్టాలి. సమాంతర, ప్రత్యామ్నాయ చారిత్రక, వైజ్ఞానిక కథనాలను నిర్మాణం చెయ్యటం ద్వారా, వ్యాప్తి చెయ్యటం ద్వారా, భావదాస్యంనుండి కొంతవరకు బయటపడవచ్చు. మూడవదిగా, ప్రాక్, పశ్చిమదేశాల నాగరికతలలోని మంచిని తీసుకొని, ఒక సమ్మిళిత సంస్కృతి నిర్మాణానికి పూనుకోవచ్చును. ప్రతిచోటనుండి భావనలను తీసుకోవటం, క్షుణ్ణంగా పరిశీలన చెయ్యటం, మన పరిస్థితులకు తగినవాటిని, పరిశీలనకు నిలబడిన వాటిని ఉపయోగించుకోవటం, లేనివాటిని తిరస్కరించటం చెయ్యాలి. వేనినయితే మర్చిపోయామో, నిర్లక్ష్యానికి గురిచేసామో, వాటిని వెదికి పట్టుకొని మన ప్రస్తుత కాలమానాలకు, సామాజిక పరిస్థితులకు తగినట్లుగా ఉపయోగించుకోవటం, ప్రశ్నించటానికి వీలులేదని చెప్పబడుతున్న పాశ్చాత్యస్థిరసత్యాలను ప్రశ్నించటమూ

అవసరం. లాటిన్ ప్రపంచంలో జరుగుతున్న కృషిని మనదేశంలోనూ ప్రారంభించి, కొనసాగించటం, మనకంటూ ఒక జ్ఞానమీమాంసాశాస్త్రాన్ని తయారుచేసుకోవటమూ చాలా అవసరం. సామాజిక, మానవశాస్త్రాలు పాశ్చాత్య దేశాల అజెండాతో నిండి ఉన్నాయి. వాటికి ప్రత్యామ్నాయంగా బోధనాపరిశోధనాంశాలను, విద్యా ప్రణాళికలను రూపొందించటం కష్టతరమైనా, ఆ పనిని సత్వరమే చేపట్టాలి.

## References


1. Bhattacharya, Krishna Chandra (1954), "Swaraj in Ideas", Visvabharati Quarterly, 20, 103-114 (orig.ed:1931).
2. Fanon, Frantz (1967): Black Skin, White Masks, Newyork, Grove
3. Cesaire, Aime (1972), Discourse on Colonialism, New York: Monthly Review Press.
4. Tristao de Braganza Cunha (1961): "Decolonisation of Goans" in Goa's Freedom Struggle, Bombay, Cunha Committe, 55-98 original.ed.1944).
5. Thiong'o Ngugi wa (1986): Decolonising the Mind, London, Heinemann.
6. Said Edward (1986): "Intellectuals in the Post Colonial World" salmangundi, 71/73, 44-64.
7. Memmi, Albert (1992): The Pillars of Salt, Boston, Beacon.
8. Peter Ronald deSouza (2017): The Recolonization of the Indian Mind, URL: http:// journals.openedition.org/rccs/6809; DOI: 10.4000/rccs.6809
9. Life of Swami Vivekananda by Eastern and Western Disciples, Vol. 1, (Kolkata: Advaita Ashrama) p.271-272. Letters of Swami Vivekananda, pp. 231-32
10. Ananda Coomaraswamy (1909): "Eassys in National Idealism", Madras: G.A.Natesan & Co, p.101-103.

11. Sisir Kumar Das (2008): "The English Writings of Rabindranath Tagore" Vol.2, Sahitya Akademi, p. 487.

http://wwwifih.org/TheHistoryofBharatavarsha.htm(14.12.2011)

12. H.G.Rawlinson (1913): Indian Historical Studies, London, Longmans, p.X-XI

13. The Complete Works of Sister Nivedita (CWSN), Vol.4, (Kolkata: Advaita Ashrama, 3rd imp, 1996) p. 305-306.

14. R.C.Majumdar edited, The History and Culture of Indian People, Vol.1, (Bombay: Bharatiya Vidya Bhavan), p. 39.

15. K.M.Munshi, Akhanda Hindustan, (Bombay, New Book & Co.,1942), p.109-113.

16. Mignolo, Walter (2002): "The Geo Politics of Knowledge and the Colonial Difference" South Atalantic Quarterly, 101(1), p. 57-92.

Dussel, Entrique (2013): "Agenda for South-South Philosophical Dialogue"

Human Architecture, XI (1), p. 3-18

Quijano, Anibal (2000): "Coloniality of Power, Euro-Centricism and Latin America"

Nepentla: Views from South, 1 (3), p. 533-580.

Santos, B.de.Sousa (2012): Public spehere and Epistemologies of the South, South African Development, 37 (1), p. 43-67.

17. Peter Ronald deSouza (2017): The Recolonization of the Indian *Mind*, *Op.cit.*



# ఉపసంహారం

పాశ్చాత్య క్రైస్తవ దేశాలు ఆసియా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, అమెరికా ఖండాలలోని అనేక దేశాలను తమ ఆధిపత్యంలోకి తెచ్చుకొని, వలసరాజ్యాలను నెలకొల్పాయి. ఇంగ్లాండ్, ఫ్రాన్స్, పోర్చుగల్, స్పెయిన్, బెల్జియం, ఇటలీ, హాలెండ్, నెదర్లాండ్ దేశాల మధ్య వలసరాజ్యాలస్థాపనకు నెలకొన్న తీవ్రమైన పోటీ పాశ్చాత్యేతర దేశాలప్రజలపాలిట శాపంగా మారింది. వారు అడుగుపెట్టిన ప్రతిదేశంలోనూ నరమేధం సృష్టించారు. క్రైస్తవేతరదేశాల వనరులను కొల్లగొట్టారు. స్థానికుల సంప్రదాయాలను, సంస్కృతిని, మతవిశ్వాసాలను అవహేళన చేశారు. నలుపు, గోదుమ, పసుపు, ఎరుపు జాతులను శ్వేతజాతికి బానిసలుగా, ఊడిగం చేసేందుకు మాత్రమే వారి క్రైస్తవదేవుడు సృష్టించాడని చెప్తూ, వర్ణవివక్షకు, జాతివివక్షకు పాల్పడి సాటిమానవులపట్ల కొన్ని శతాబ్దాలపాటు అమానుషంగా, అత్యంత దారుణంగా, ప్రవర్తించి ఆయా జాతుల ప్రజలను అణచివేసారు.

ఆంగ్లేయుల ఆక్రమితదేశాలు వివిధ ఖండాలలో ఉండటంతో, వారి సామ్రాజ్యం రవిఅస్తమించని దైంది. భారతదేశంలో వారు మొదటగా అడుగుపెట్టిన 150 సంవత్సరాల తర్వాత 1757లో ప్లాసీ యుద్ధంలో విజయం సాధించిన తర్వాత వారి వలసపాలన బెంగాల్‌లో మొదలయింది. అంతతేలికగా భారతదేశం వారికి వశంకాలేదు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఎన్నో తిరుగుబాట్లు దేశంలో వివిధ ప్రాంతాలలో వచ్చాయి. 1857లో వచ్చిన విప్లవం మొదటి దేశవ్యాప్తమైన భారతస్వాతంత్ర్య సంగ్రామంగా ప్రసిద్ధిపొందింది. ఆ తర్వాతే భారతదేశం కంపెనీపాలననుండి బ్రిటీషురాణి ప్రత్యక్షపాలనక్రిందకు వచ్చింది. 1857 విప్లవం ఫలితంగా బ్రిటీషు సామ్రాజ్యవిస్తరణ భారతదేశంలో ఆగిపోయింది. 1947 తర్వాతే సంస్థానాలు భారతదేశంలో పూర్తిగా విలీనం అయ్యాయి.

1947లో వారు దేశానికి స్వతంత్రం ప్రకటించి వెళ్ళేనాటికి అనేక సమస్యలను సృష్టించి మరీ వెళ్ళారు. ఇది వారికి అలవాటైన ప్రక్రియ. కులవిభేధాలను రెచ్చగొట్టారు. మతాలమధ్య చిచ్చుపెట్టారు. మతప్రాతిపదికన దేశాన్ని విభజించారు.

విభజన కారణంగా జరిగిన హింసోన్మాదాన్ని అణచివెయ్యటానికి ఎట్టి ప్రయత్నమూ చెయ్యలేదు. ఆనాటి ఘర్షణలలో 10 లక్షలమందికి పైగా ప్రాణాలు కోల్పోయారు. రెండుకోట్లమందికి పైగా కాందిశీకులు అయ్యారు. 75వేలమంది మహిళలపై అత్యాచారాలు జరిగాయి. 20వ శతాబ్దిలో జరిగిన అత్యంత విషాదకర సంఘటన భారతదేశవిభజన. అందుకు ఇంగ్లండ్ ఈనాటికీ కూడా బాధ్యత తీసుకోలేదు. ఇటీవలికాలంలో మానవాళి చరిత్రలోనే అంతపెద్దఎత్తున హింసోన్మాదం చెలరేగిన సంఘటన మరొకటి లేదు.

**వలసపాలనను ఎట్లా సమర్థిస్తారు ?**

భారతదేశాన్ని దోచుకోవటానికి వచ్చి, అనాగరికులను 'నాగరికం' చెయ్యటానికి వలసరాజ్యాన్ని స్థాపించామని ఆంగ్లేయులు సెలవు యిచ్చారు. కాని 'హేతువు'తో కాని, 'మనస్సాక్షి'తో కాని ఈ దేశానికి యిచ్చిన పాలననుకాని, సృష్టించిన సమస్యలనుకాని వారు ఎన్నటికీ సమర్థించుకోలేరు. ఆంగ్లేయుల అరాచకాలను, అణచివేతను, దోపిడీని, దేశవిభజనను భారతీయులు ఎన్నడూ మర్చిపోలేదు. వారిని ఎప్పటికీ క్షమించలేరుకూడా. ఇంగ్లాండ్‌మాత్రమే కాదు. పాశ్చాత్య క్రైస్తవదేశాలు తాము ఆక్రమించి, వలసరాజ్యాలు ఏర్పరుచుకొన్న ప్రతిదేశంలోనూ చాలా దారుణంగా ప్రవర్తించాయి. నైతికంగా గాని, ధార్మికంగా గాని, మానవహక్కుల పరంగాగాని ఏమాత్రమూ సమర్థనీయంకాని హేయమైన, రాక్షసమైన చర్యలకు వారు పాల్పడ్డారు. మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన 1947 తర్వాత కూడా అనేక దేశాలలో వలసపాలన కొనసాగింది. ఇండో-చైనాలో ప్రజలను నిర్దాక్షిణ్యంగా పొట్టనపెట్టుకొన్నారు. మెడగాస్కర్‌లో ప్రజలను నిత్యం చిత్రహింసలపాలు చేశారు. వెస్టిండీస్‌లో సామూహిక నిర్బంధాలు నెలలపాటు కొనసాగాయి. ఇటీవలి కాలంవరకు దక్షిణఆఫ్రికాలో నల్లజాతీయులను జంతువులకంటే హీనంగా చూశారు. ఆంగ్లేయులు భారతదేశంలో 19వ శతాబ్దంలో ఈ అకృత్యాలన్నిటికీ పాల్పడ్డారు. ప్రజలను భయపెట్టారు. లొంగనివారిని నిర్బంధించారు. హింసించారు. మానభంగాలకు పాల్పడ్డారు. సామూహిక దండనలు విధించారు. అకారణంగా అమాయకప్రజలపై కాల్పులు జరిపి పొట్టనపెట్టుకున్నారు. జాతివివక్షకు పాల్పడ్డారు. 20వశతాబ్దంలో అవే దుశ్చర్యలను మనదేశంలోనూ, వారి ఇతర వలసరాజ్యాలలోనూ కొనసాగించారు.

వారుతప్ప ఇతరులందరూ ప్రపంచమంతటా అనాగరికంగా ఉన్నారు కాబట్టి, తమకుతాముగా ప్రపంచాన్ని మరమ్మత్తు చేసే బాధ్యతను వారు తలకెత్తుకొన్నామని చెప్పారు. నాగరికులను చెయ్యటమంటే క్రైస్తవమతంలోకి మార్చటం మాత్రమే కాదు. అజ్ఞానం, వ్యాధులు, నియంతృత్వ హద్దులను విస్తృతపర్చటం కాదు. చట్టబద్ధమైన పాలననుండి ప్రజలను దూరంచెయ్యటంకాదు. దోచుకున్నంత దోచుకొని వనరులను తరలించటంకాదు. ఈ 'నాగరిక ప్రాజెక్టు'లో సూత్రధారులు ఎవరు? పాత్రధారులు ఎవరు? బ్రిటీషు రాజకుటుంబం, పార్లమెంటు సూత్రధారులు అయితే, సముద్రపుదొంగలు, 'సాహసికులు'గా వారిచేత పిలువబడ్డవారు, గుత్తవ్యాపారులు, ఓడల యజమానులు, గనులు తవ్వుకొని పోయినవారు, తోటల పెంపకందార్లు, క్రైస్తవ మతప్రచారకులు, తెల్లపోలీసులు, సైనికులు, అధికారులు పాత్రధారులు. అయితే వారికి ప్రేరణ ఎక్కడినుండి వచ్చింది? వారి నాగరికత నుండే, వారి మతంనుండే వారు ప్రేరణపొందారు. తమ అంతర్గత కారణాలవల్ల, తమ మనుగడ ప్రశ్నార్థకరమయిన ఒకానొక చారిత్రక సందర్భంలో పాశ్చాత్యదేశాలమధ్య నెలకొన్న తీవ్రమైన పోటీఫలితమే ఈ 'నాగరికతా మిషన్'. కానీ వారు నెలకొల్పింది అరాచక వలసరాజ్యాలనే.

## క్రైస్తవం=నాగరికత ?

మెక్సికోను కొల్లగొట్టిన Cortez కు గాని, పెరూను కొల్లగొట్టిన Pizzaro కు గాని నయవంచన తెలియదు. ఆ దేశాల సంపదమీద కన్నుపడింది. దానికోసం వారు ఎంతకైనా తెగించారు. వారి లక్ష్యం కొల్లగొట్టటం. కొల్లగొట్టేందుకు వెళ్ళారు. మతం మార్చటానికే వెళ్ళారు. బలవంతంగా మతం మార్చారు. అపూర్వ సంస్కృతిని ధ్వంసం చేయటానికి వెళ్ళారు. ఏదీ చేయదల్చుకున్నారో అదే చేశారు. నయవంచనకు పాల్పడ లేదు. వారి ధనదాహానికి, విశృంఖలత్వానికి హద్దులు లేవు. కొత్త వ్యవస్థలను తీసుకొని వస్తామని, నాగరికులను చేస్తామని వారు ప్రకటించలేదు. వారు హత్యలు చేశారు. నౌకలకొద్దీ బంగారాన్ని, వెండిని తవ్వుకొని వెళ్ళారు. తమనుతాము కాపాడుకోవటానికి కవచాలు ధరించారు. ఇతరులను తెగనరకటానికి పదునైన ఆయుధాలను వాడారు. ఇదంతా 16,17 శతాబ్దాల నాటి కథ.

18,19 శతాబ్దాలలో తెల్లవారు తమదోపిడీకి నాగరికత ముసుగు కప్పారు. క్షమాపణవారులు బయలుదేరారు. వారిలో ప్రధానదోషులు క్రైస్తవ మతాధికారులు,

తత్వవేత్తలు. వారొక కొత్త సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టారు. క్రైస్తవం=నాగరికత, ప్రకృతి ఆరాధన, బహుదేవతారాధన=రాక్షసం, మొరటుతనం. ఆ సిద్ధాంత భావన నుండే పుట్టుకొచ్చారు నాగరికత ముసుగుకప్పుకొన్న వలసవాదులు, జాత్యంహకారవాదులు. బైబిలు మానవాళిని 5 రంగుల జాతులుగా వర్గీకరించింది. తెలుపు, నలుపు, పసుపు, గోదుమ, ఎరుపు జాతులుగా మానవులను విభజించి తెలుపురంగు జాతికి ఊడిగం చేసేందుకే మిగిలిన జాతులు అన్నీ సృష్టించబడ్డాయని తెలిపింది. మిగిలిన జాతులను క్రైస్తవీకరణద్వారా నాగరికులను చెయ్యాలని బైబిలు ఆదేశిస్తుంది. ఆ ఆదేశాన్ని అమలుచేస్తున్నామని తమను తాము మోసం చేసుకుంటూ వలసరాజ్యాలు ఏర్పాటు చేశారు.

నాగరికతలు ఒకదానికి మరొకటి పూరకంగా ఉంటాయి. ఒక్కొకరి నాగరికత నుండి తెలుసుకోవాల్సిన విషయాలు అనేకం ఉంటాయి. ఇతరుల నాగరికతలలోని గొప్పవిషయాలను మనం నేర్చుకోవాల్సి ఉంటుంది. నాగరికతలమధ్య అనుసంధానం, పరస్పర అవగాహన మానవాళి వికాసానికి చాలా అవసరం కూడా. అయితే వలసపాలకులు నాగరికతలమధ్య సత్సంబంధాలకోసం పనిచేయనేలేదు. సదవగాహన తీసుకొని రావాలనే ఉద్దేశ్యంకూడా వారికి లేదు. 'నాగరికతా మిషన్' చేపట్టిన వలసవాదులు చేపట్టిన సాహసయానాలు, చేసిన చట్టాలు, తమ పితృదేశంతో జరిపిన ఉత్తరప్రత్యుత్తరాలు, పంపిన సమాచారాలలో 'నాగరికమైన' దృష్టాంతం ఒక్కటీ కన్పించదు. తమకు చెందని భూమిలో జెండాపాతేందుకు ఆంగ్లేయులు ప్రదర్శించిన కుయుక్తులు, వేసిన ఎత్తుగడలు, పన్నినపన్నాగాలు, పాల్పడ్డ అవినీతి అక్రమాలలో 'నాగరికత' మచ్చుకైనా కన్పించనే కన్పడదు.

**వలసపాలన భావజాల ప్రభావం :**

పైపెచ్చు వలసపాలిత ప్రజలను 'నాగరికం' చేసే ప్రక్రియలో వారు బానిసత్వంలో నెట్టివేయబడ్డ స్థానికులకంటె ఎక్కువ 'అనాగరికులు' గా మారారు. అందులో వారి దోషమేమీ లేదు. ఎందుకంటె వలసీకరణ ప్రక్రియే రాక్షసమైనప్పుడు,ఆ ప్రక్రియలో ప్రధాన పాత్రధారులు రాక్షసులు కాకుండా ఎలా ఉండగలరు? వలసపాలనకు ప్రధానమైన భావజాలం–"శ్వేతజాతేతరులందరూ మొరటువారు. నాగరికమైన ఏ మర్యాదకూ, గౌరవానికి వారు అర్హులు కాజాలరు. కొన్ని శతాబ్దాలపాటు శ్వేతజాతీయుల ఏలుబడిలో ఉంటేనేగాని వారు ఎట్టి స్వేచ్ఛా

స్వాతంత్ర్యాలకు అర్హులు కారు. నాగరీకరణ ప్రక్రియలో అణచివేత తప్పనిసరి"- ఇది వలసపాలకులను మొరటువారిగా మార్చింది. మనసులేనివారిగా చేసింది. అమానుషంగా ప్రవర్తించటం అనివార్యమని తేల్చింది. వారిలో నిద్రాణమైన పశు వాంఛలను మేలుకొల్పింది, వలసవాద భావజాలం నైతిక విలువలను మర్చిపోయేలా చేస్తుంది. హింసను ప్రేరేపిస్తుంది. ఏదీ లాభమో దానికే కట్టుబడేలా చేస్తుంది. అమానుష కృత్యాలు నిత్యసామాన్యం అవుతాయి. లేకుంటే చేనేతకారుల వ్రేళ్లు కత్తిరించే వారు కారు. ఎదురుతిరిగిన వారిని నేరజాతులుగా ప్రకటించేవారు కారు. ఉరికంబాలు ఎక్కించేవారు కాదు. ఫిరంగులమూతులకు మనుషులను కట్టి పేల్చే వారు కాదు. అసత్యాలు ప్రచారం చేసి, దశాబ్దాల తరబడి అండమాన్ జైలులో ఏకాంతవాస శిక్షలకు గురిచేసేవారు కాదు. శిస్తుకట్టలేని రైతులను, నిర్వాసితులయిన గిరిజనులను, వనవాసులను, వారికి మద్ధతుగా నిలిచిన విప్లవవీరులను వేధించేవారు కాదు.

వారిని చిత్రహింసలపాలు చేసినా, నిర్దాక్షిణ్యంగా కాల్చివేసినా ఆ అకృత్యాలలో శ్వేతజాతి అహంకారాన్ని వారు చూశారు. ఒక తలతెగిపడినప్పుడు, ఒక కన్ను నలిపివేయబడ్డప్పుడు, ఒక మహిళ మానభంగం చేయబడినప్పుడు, అకారణంగా శాంతియుతంగా సమావేశమైన ప్రజలపై కాల్పులు జరిపినప్పుడు ఇంగ్లండ్‌లో దానిని అంగీకరించారే తప్ప, తప్పు అని ఎవరూ అనలేదు. నేరమని ఎవరూ ప్రకటించలేదు. తెల్లబట్లర్ నుండి విక్టోరియారాణివరకు ఆంగ్లేయులు చూపిన 'క్రూరప్రతాపాన్ని' మెచ్చుకొన్నవారేతప్ప సాటిమానవులపట్ల ఏమాత్రం కనికరం చూపలేదు. ఇంతకంటే ఏం నిదర్శనం కావాలి? వలసపాలన ఆంగ్లేయులను అనాగరికులను చేసిందని, రాక్షసులుగా మార్చిందని చెప్పటానికి ఈ సాక్ష్యాధారాలు చాలవా?

ఇంగ్లాండ్ మాత్రమే కాదు పోర్చుగీసు, ఫ్రాన్సు, హాలెండ్, బెల్జియం, జర్మనీ దేశాలు సైతం తమ వలసపాలిత ప్రజలపట్ల ఇట్లాగే వ్యవహరించాయి. గోవా, డయ్యు, డామన్‌లు 1962 వరకు పోర్చుగీసువారి అధీనంలో ఉన్నాయి. గోవాలో 'ఇంక్విజిషన్' పేరుతో వేలాదిమందిని సజీవదహనం చేశారు. చిత్రహింసలపాలు చేశారు. దేవాలయాలను నేలమట్టం చేశారు. కాని పోర్చుగీసు దేశంలో ఈ రాక్షసత్వాన్ని ప్రశ్నించినవారు ఎవరూ లేరు. వియత్నాంలో ఒక తలనరికి

వేయబడినప్పుడు, ఒక కనుగుడ్డు పెకిలించి వేయబడినప్పుడు కూడా ఫ్రాన్సులో ప్రశ్నించిన వారు లేరు. కొలంబస్ తను కనుగొన్న 'కొత్త ప్రపంచం' అయిన అమెరికాలోని రెడ్‌యిండియన్లకు పట్టించిన దుర్గతిగురించి పాశ్చాత్య సమాజం ఎన్నడూ ప్రశ్నించలేదు. బెల్జియం ఆఫ్రికాఖండంలో చేసిన దురాగతాలగురించి ఎక్కడా చర్చకూడా లేదు. పాశ్చాత్యదేశాలు తెల్లజాతీయులకు నరనరాన విషాన్ని ఎక్కించాయి. వలసరాజ్య స్థాపనలకై జరిగిన పోటీలలో, జరిపిన యుద్ధాలలో పాశ్చాత్యులు రాక్షసులై విజృంభించారు.

**నాజీయిజానికి మూలాలు :**

అయితే రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు అకస్మాత్తుగా ఐరోపాఖండం మేలుకుంది. హిట్లర్ చేస్తున్న దారుణాలు ఒక్కొక్కటీ వెలుగులోకి వస్తుండటంతో 'ఇది నాజీయిజం ఎక్కువకాలం ఉండదు. త్వరలోనే సమసిపోతుంది' అని ఎదురుచూశారు. వాస్తవాన్ని వారినుండి వారే దాచుకొన్నారు. వారి క్రూరత్వం, రాక్షసత్వం హిట్లర్‌రూపంలో వారిముందే ప్రదర్శనకు నిలబడ్డాయి. అది ఆటవికం, క్రూరత్వం, క్రూరత్వానికీ పరాకాష్ఠ. అదే నాజీయిజం. అది పాశ్చాత్య దేశాలకు తెలియందికాదు. దానిని ప్రయోగించే అప్పటివరకు వారు స్వయంగా ప్రపంచజనాభాలో మూడింట రెండువంతులమందిని బానిసత్వంలోకి నెట్టివేసి, వారి వనరులను దోచుకున్నారు. ఆ నాజీయిజంకు వారు బాధితులు అవకముందు, దానిని ప్రపంచానికి చవిచూపింది పాశ్చాత్యులే. ఇతరజాతులమీద దారుణమైన క్రూరత్వాన్ని, అమానుషత్వాన్ని ఆమోదించింది కూడా పాశ్చాత్యులే. తమమీద అట్టిఅమానుషత్వం, క్రూరత్వం ప్రయోగింపబడక ముందు, పాశ్చాత్యులు దానిని చూసికూడా చూడనట్లు నటించారు. వలసపాలకులు తీవ్రమైన అణచివేతను ఆలంబన చేసుకొని, నియంతృత్వంగా బానిసదేశాలను పాలించినా గొంతువిప్పలేదు. అంతేకాదు, అమానుషత్వాన్ని, క్రూరత్వాన్ని చట్టబద్ధంచేసినా మిన్నకున్నారు. నాజీయిజాన్ని వారు పెంచి పోషించారు. దానికి వారే బాధ్యులు. పాశ్చాత్య క్రైస్తవనాగరికతను కబళించకముందు నాజీయిజం అనేక ఇతరజాతుల నాగరికతను, సంస్కృతిని కబళించింది. నాజీయిజానికి మూలాలు వలసవాద భావజాలంలోనే ఉన్నాయన్న వాస్తవాన్ని వారు గుర్తించలేదు.

మానవజాతిని 'నాగరికం' చెయ్యటానికి వచ్చామని చెప్పుకొనే 'మానవతా వాదులు', 'క్రైస్తవమతవాదులు' అయిన పాశ్చాత్య పాలకవర్గాలకు తెలియకుండానే

వారిలో హిట్లర్ ఉన్నాడు. అందువల్లనే తమ వలసపాలిత దేశాలలో అన్ని దారుణాలకు వారు ఒడిగట్టారు. హిట్లర్‌ను వారు క్షమించలేదు. హిట్లర్‌పై యుద్ధం ప్రకటించారు. జర్మనీని ధ్వంసంచేసేవరకు వారు నిద్రపోలేదు. ఇంతకీ వారికి హిట్లర్‌పై అంతకోపం ఎందుకు వచ్చింది? అల్జీరియా అరబ్బులకు, భారతదేశపు హిందువులకు, ఆఫ్రికా నల్లజాతీయులకు ప్రత్యేకంగా ఉద్దేశించబడ్డ అమానుష కృత్యాలను హిట్లర్ శ్వేతజాతీయులపైనే ప్రయోగించటాన్ని చూసి వారు తట్టుకోలేకపోయ్యారు. తక్కువ జాతి ప్రజలకోసం గత కొన్ని శతాబ్దాలనుండి తాము ఎంతో అనుభవంతో తయారుచేసిన దారుణ హింసాకాండ తమనుసైతం బలితీసుకొంటుందని శ్వేతజాతీయులు అనుకోలేదు. క్రైస్తవదేశాలు క్రైస్తవేతర దేశాలపై యథేచ్ఛగా హింసాకాండకు పాల్పడ్డాయి. ఇప్పుడు సాటి క్రైస్తవదేశం ఇతర క్రైస్తవదేశాలపై విరుచుకుపడింది. దానితో వారు నాజీయిజంను భూస్థాపితం చెయ్యటానికి ఏకమై హిట్లర్‌పై విరుచుకుపడిన మాట వాస్తవంకాదా?

వారు మానవహక్కులగురించి అంతర్జాతీయ వేదికలమీద సూక్తులు వల్లిస్తుంటారు. వర్ధమాన దేశాలలో మానవహక్కుల ఉల్లంఘన జరుగుతుందని ఆరోపిస్తుంటారు. కాని పాశ్చాత్యదేశాలు నేడు వర్ధమానదేశాలు అనిపిలువబడే ఒకప్పుడు తమ ఏలుబడిలోని దేశాల ప్రజల మానవహక్కులను ఏనాడయినా గౌరవించాయా? వలసపాలితదేశాలలో ప్రజలకు ఎలాంటి హక్కులు యివ్వలేదు. పాలకులను ప్రశ్నిస్తే రాజద్రోహం అవుతుంది. ఆంగ్లఅధికారుల ఆగడాలను ప్రచురించకూడదు. పదిమందికలసి నిరసన తెలియచేయకూడదు. ప్రశ్నించే ధైర్యాన్ని కాలద్రోశారు. ప్రశ్నించేవారిని మాత్రమే కాదు. విధానాలవలన ఉపాధికోల్పోయిన వారిని, భూములుకోల్పోయిన వారిని, నిర్వాసితులు అయిన వారిని సైతం వారు వదలలేదు. వారు ఏ నాటికయినా ప్రమాదకరమైన తిరుగుబాటుదారులు అవుతారని భావించి వారిని నిస్సహాయులను చేసి తమ ఇతర వలసరాజ్యాలలోకి వారిని అక్రమంగా రవాణాచేసారు.

మానవుల అక్రమ రవాణా వారితోనే ప్రారంభం అయింది. అక్రమరవాణా, బానిసల వ్యాపారాలలో పాశ్చాత్యులు నిష్ణాతులు. మానవహక్కుల గురించి మాట్లాడే అర్హతే వారికి లేదు. పాశ్చాత్య దేశాలు ప్రతిపాదించే మానవహక్కులు సర్వమానవాళిని ఉద్దేశించినవి కావు. ఏకపక్షం, వర్ణవివక్షతో కూడినవి. తమ వర్తక, వాణిజ్య,

పెట్టుబడి ఫైనాన్సు వ్యాపారులను వర్ధమానదేశాలు ఎప్పుడయినా ధైర్యంచేసి అడ్డుకోవటానికి ప్రయత్నిస్తే మానవహక్కుల ఉల్లంఘన జరుగుతుందని గగ్గోలుపెట్టుతుంటారు. పాశ్చాత్య దేశాలలోని పెట్టుబడిదారీ వ్యవస్థ సర్వమానవులకు గల హక్కులను గుర్తించదు. వ్యక్తిగత నైతికనిష్ఠ, నియమాలగురించి కూడా మాట్లాడదు. పెట్టుబడిదారీవ్యవస్థ వెనుక హిట్లర్ ఉంటాడు. ఈ క్రింది వాక్యాలను శ్రద్ధగా చదవండి.

"సమానత్వం కోసం కాదు. ఆధిపత్యం కోసం పనిచెయ్యాలి. ఆధిపత్యమే మా ఆకాంక్ష. ఇతరజాతులకు చెందిన దేశాలు బానిసలదేశంగా, వ్యవసాయ, పారిశ్రామిక కూలీలదేశంగా మారాలి. అసమానతలను పోగొట్టటం కాదు, వాటిని మరింత విస్తృతపరచి, చట్టబద్ధత కల్పించాలి." వారి ఆకాంక్ష స్పష్టంగా ఉంది. అమానుషంగా ఉన్నా, ఆశ్చర్యం కలిగించినా, దిగ్భ్రాంతికి లోనుచేసినా వారి లక్ష్యాన్ని సుస్పష్టంగానే ప్రకటించారు. ఇంతకీ ఆ ప్రకటన చేసింది ఎవరు?

**జాత్యహంకారం :**

హిట్లర్‌కాదు. పాశ్చాత్య మానవతావాదిగా, గొప్పతత్వవేత్తగా ప్రసిద్ధుడయిన జోసెఫ్ ఎర్నెష్ట రెనన్ (1832-1892). ఆయనే ఇలా అంటున్నాడు. "తక్కువజాతులను సంస్కరించి పునరుద్ధరించే బాధ్యతను ఉన్నతజాతులకు (శ్వేతజాతి) దేవుడు (యెహోవా) విధించిన కర్తవ్యం. పాశ్చాత్య దేశాలలో సామాన్యుడు సైతం కత్తి తిప్పగలడు. అతని చేయి కత్తిపట్టుకోవటానికి చక్కగా సరిపోతుంది. సుత్తి, కొడవలి పట్టుకోవటంకంటే కత్తిపట్టుకోవటానికి చక్కగా సరిపోతుంది. సుత్తి, కొడవలి పట్టుకోవటం కంటే కత్తిపట్టుకోవటానికి అతను ఉత్సాహం చూపుతాడు. అతనికి సమరశీలత మెండు. అది అతని ధీరత్వం. పొలాల్లో, కర్మాగారాలలో పనిచేయటం కంటే యుద్ధం చెయ్యటానికే అతను ముందుకు ఉరుకుతాడు. అది అతని ప్రవృత్తి. పాశ్చాత్య సమాజాన్ని కలవరపరుస్తున్న ఈ సాహసికులను ఇతరులపై విజయం సాధించటానికి పంపండి. విజేతలై తిరిగివస్తారు. అయితే మరి కొన్ని ఇతర జాతులవారిని కేవలం శ్రమించటానికే దేవుడు సృష్టించాడు. ఉదాహరణకు చైనాజాతి పనిచేయటానికే పుట్టింది. చైనీయులకు ఏపని అయినా ఇవ్వండి వారు దానిని ఓర్పుతో, నేర్పుతో చేస్తారు. కాని వారికి స్వాభిమానం ఉండదు. వారికి కొంచెం మంచి పాలన అందించండి, వారికి

అది చాలును. చైనీయులను జయించినవారికి తగిన విధంగా సత్కరించండి. చైనీయులు దానిని అసలు పట్టించుకోరు. పైగా తమకు మంచిపాలన యిచ్చినందుకు కృతజ్ఞులుగా ఉంటారు. నీగ్రోలు భూమిని దుక్కిదున్నటానికే పుట్టించబడ్డారు. వారిపట్ల కొంచెం దయ చూపండి చాలును. అదే పాశ్చాత్యులను చైనీయులు, నీగ్రోలు మాదిరిగా పనిచేయాలని కోరితే వారు తిరుగుబాటు చేస్తారు. ఐరోపాలో ప్రతి తిరుగుబాటుదారు సైనికుడిగా అవకాశం కోల్పోయినవాడే. వీరోచిత కృత్యాలు చేసేందుకు పుట్టినవారికి జాతికి తగని కార్యకలాపాలు చేపట్టమని ఆదేశించకూడదు. ఏపనులు చేయటానికి పాశ్చాత్యులు వెనుకాడుతారో, ఆ పనులు సంతోషంగా చేయటానికి నల్లజాతీయులు, చైనాజాతీయులు సంసిద్ధులై ఉన్నారు. ఎందుకంటే వారు వీరోచిత కృత్యాలు చేయ్యటానికి పుట్టిన సమరోచితజాతులకు చెందనివారు. ఏజాతికి చెందిన వారు ఏ పనులు చెయ్యటానికి నిర్దేశింపబడ్డారో, వారిని ఆ పనులు చెయ్యనివ్వండి."

ఎంతటి శ్వేతజాతి అహంకారమోకదా! జయించటానికి, పాలించటానికి మాత్రమే దేవుడు శ్వేతజాతిని సృష్టించాడుట. శ్రమించటానికి, పాలించబడటానికి మాత్రమే ఇతర జాతులు ఉన్నాయన్నది ప్రసిద్ధిచెందిన ఫ్రెంచితత్వవేత్త చెప్తున్నాడు. క్రైస్తవమత పెద్దలయిన రెవెరెండ్ బార్టీ, రెవెరెండ్ ముల్లర్‌లు కూడా అదే అభిప్రాయాన్ని వెలిబుచ్చుతున్నారు. ఇంకొక అడుగు ముందుకు వేస్తూ వలసపాలనను సమర్థిస్తూ, కేవలం వలసరాజ్య స్థాపనలద్వారానే ప్రపంచవనరులు సద్వినియోగం అవుతాయని పేర్కొన్నారు. "వలసపాలన లేకుంటే, ప్రపంచంలోని మంచి వస్తువులన్నీ అందరికీ చేరవు. దేవుడి లక్ష్యాన్ని కాని, మానవుల న్యాయమైన కోర్కెలుకాని వలసపాలన లేకుంటే నెరవేర్చలేము" అని బార్టీ అంటే "మానవాళి అనాగరికతను, అసమర్థతను, నిర్లక్ష్యాన్ని, బద్ధకాన్ని కొనసాగించకూడదు. కొనసాగనివ్వదుకూడా. దేవుడు వారికి (శ్వేతజాతేతరులకు) యిచ్చిన అపారమైన సంపద మానవులందరిదీ. అది అందరికీ చేరాలన్నది ఆయన లక్ష్యం" అని ముల్లర్ వలసపాలనకు దైవానుజ్ఞ, ఆదేశం, సంకల్పం, ఆశీర్వాదం ఉన్నాయని చెప్పాడు.

రెనన్లు, ముల్లర్లు ఒకే అంశాన్ని ఏమాత్రము సందేహానికి తావులేకుండా చెప్తున్నారు "పాశ్చాత్యేతరజాతుల సంపదను కొల్లగొట్టటానికి సంకోచించవద్దు. బలమైన, సాయుధసంపత్తి గల ఇతరజాతులను ఆ విధంగా కొల్లగొట్టటమే దైవసంకల్పం"

కాని ఇది హిట్లర్ చెప్తున్నట్లుగా లేదూ? హిట్లర్‌కంటే ముందుగానే జాత్యంహకారంతో పాశ్చాత్యులు ఇతర జాతులమీద విరుచుకుపడ్డారు. మొరటు జాతులను నాగరికం చేసే ప్రక్రియలో వారు ఎన్నో అకృత్యాలకు పాల్పడ్డారు. అల్జీరియాను ఆక్రమించిన కల్నల్ డిమాంటోగ్నక్ (de Montangnac) ఏమంటున్నాడో చూడండి "నన్ను ఆలోచనలు ముట్టడి చేస్తున్నప్పుడు, కొన్ని తలలను కత్తిరించమని చెప్పాను. దుంపల చెట్ల తలలను కాదు. మనుషుల తలలు కత్తిరించమని చెప్తాను" డి.హరిసన్ న్యాయసభలో ఓ ప్రకటన చేస్తూ "మనం ఖైదీల చెవులజతలను కత్తిరించి తీసుకొని వస్తున్నామన్నది వాస్తవమే. ఆఖైదీలు మనకు శత్రువులైనా, మిత్రులైనా వారికి అట్టిగతి తప్పదు" సెయింట్ అర్నాడ్ (Saint Arnaud) తనమతపు హక్కును ఈ విధంగా ప్రకటించాడు–"మేము మంటలకు (అన్యమతస్థులను) ఆహుతి చేస్తాం. దోపిడీ చేస్తాం. వారి ఇళ్ళను, చెట్లను సైతం సమూలంగా ధ్వంసం చేస్తాం." మార్షల్ బుగీండ్ (Marshall Bugeand) అతనికంటే క్రూరుడు "ఫ్రాంక్స్ (Franks), గోత్స్ (Goaths) మాదిరిగా ఆఫ్రికా కోలుకోలేని విధంగా క్రూరమైన దాడిచేసి, దానిని మన అధీనంలోకి తెచ్చుకోవాలి". జనరల్ గెరార్డ్ అల్జీరియాలో ఒక పట్టణాన్ని జయించటానికి ఎంతటి దారుణమారణకాండకు ఒడిగట్టాడో ఆయన మాటలద్వారానే తెలుసుకుందాం–"సైనికులకు కేవలం మగవారిని మాత్రమే చంపటానికి ఉత్తర్వులు ఉన్నాయి. కాని వారినెవరూ అడ్డుకోలేదు. రక్తపు వాసనతో ఊగిపోయిన సైనికులు విచక్షణను కోల్పోయారు. ఒక్క స్త్రీని గానీ, ఒక పిల్లవాడ్ని గాని వదలలేదు. మధ్యాహ్నం సూర్యుడ్ని ఒక మేఘం కమ్మేసింది. ఆ పట్టణంలో చనిపోయిన 5వేలమంది రక్తపు ఆవిరితో ఏర్పడిన మేఘం అది".

**నరమేధం :**

పాశ్చాత్యులు వివిధ దేశాలలో నరమేధానికి పాల్పడ్డారు. భారతదేశం అందుకు మినహాయింపు కాదు. ఆంగ్లేయులు, పోర్చుగీసు, డచ్ వారు మనదేశంలోనూ వివిధప్రాంతాలలో అట్టి దారుణకృత్యాలు అనేకం చేసారు. 7,8 శతాబ్దాలలో విదేశీ ముస్లింమూకల దాడులకు, పాశ్చాత్యులదాడులకు తేడా ఏమీలేదు. ఇంకా మెరుగైన ఆయుధాలు వాడారు. ఇంకా ఎక్కువమందిని నిర్దాక్షిణ్యంగా చంపివేసారు. నిర్బంధించారు. చిత్రహింసలపాలు చేశారు. ఇదంతా 'నాగరికం చెయ్యాలనే తపనతోనే', అనాగరికంగా, అమానుషంగా భారతీయులపట్ల వారు ప్రవర్తించారు.

నరకబడ్డ తెగలు, ఉరికంబాలు ఎక్కించి బలితీసిన ప్రాణాలు, తగలబడ్డ ఇళ్ళు, వైభవం కోల్పోయిన పట్టణాలు, విచ్ఛిన్నమయిన దేశీయ పరిశ్రమలు, అడవులనుండి, కొండలనుండి వెళ్ళగొట్టబడిన గిరిజనులు, వనవాసులు వలసపాలన దారుణాలకు సాక్షులు. వలసపాలన ప్రాజెక్టు, వలసపాలకులు, వారి వ్యాపార, వాణిజ్యకార్యకలాపాలు అన్నీ స్థానికులపట్ల చిన్నచూపు, వివక్ష, ఏవగింపులతోనే ప్రారంభం అవుతాయి. తమ మనస్సాక్షిని సమర్థించుకోవటానికి సాటిమానవుడిని జంతువుకంటే హీనంగా చూడటం మొదలుపెడ్తారు. ఆ 'జంతువు'ల సంపదకావాలి. శిస్తులుకావాలి. నైపుణ్యం కావాలి. శ్రమకావాలి. సేవలు కావాలి. వాటిని సొంతం చేసుకొనేందుకు రాక్షసంగా మారిపోతారు వలసపాలకులు. అధికారులు, వారి తాబేదారులు. ఇతరులను దోపిడీ చేయటానికి ప్రయోగించిన దారుణచర్యల ప్రభావం వారిమీదే పడి వారు కాలయముళ్ళలా కాలక్రమంలో రూపాంతరం చెందటమూ వలసపాలనా ఫలితమే.

వలసపాలన ప్రపంచవ్యాప్తంగా అనేక పురాతన నాగరికతలను ధ్వంసం చేసింది. అమెరికాలో రెడ్‌ఇండియన్ నాగరికతను నామరూపాలు లేకుండా చేసింది. ఆఫ్రికాలో ఒకప్పుడు ఉజ్జ్వలంగా విలసిల్లిన నల్లజాతీయుల అపూర్వనాగరికతను వలసపాలకులు ఛిన్నాభిన్నంచేసారు. వలసపాలనకు ఎదురొడ్డి నిలిచింది భారతదేశపు నాగరికత. సాంస్కృతిక బానిసత్వంలోకి, ఆత్మవిస్మృతిలోకి భారతీయులను నెట్టివేసినా, వారిని ఎప్పటికప్పుడు మేలుకొల్పిన మహనీయులవలన హైందవ సంస్కృతి సమూలంగా నాశనం కాబడలేదు. కులాలు, భాషలు, ప్రాంతాలమధ్య చిచ్చు రగిలించినా, సాంస్కృతిక ఏకత్వాన్ని దెబ్బతీయటానికి ప్రణాళిక బద్ధమైన కుట్రకు తెల్లదొరలు పాల్పడినా, భారతదేశపు ఆత్మ సజీవంగానే నిలబడగలగటం వలసపాలన చరిత్రలోనే అపూర్వం.

కానీ మన దేశానికి తీవ్రమైన నష్టమే జరిగింది. భద్రత కఱవైంది. దమనకాండ, రాక్షసత్వం, పరపీడన కాముకత మాత్రమే తెలిసిన వలసపాలకులు ప్రజల ధన, మాన, ప్రాణాలకు రక్షణ కల్పించలేక పోయారు. కంచే చేనుమేసినట్లు పాలకులే ప్రజలకు ప్రమాదకారులుగా తయారయ్యారు. 18వ శతాబ్దంలో ఉన్న భారతీయ విద్యావ్యవస్థను చిన్నాభిన్నంచేసి ఆంగ్లవిద్యను ప్రవేశపెట్టారు. వారికి మాత్రమే

పనికివచ్చే గుమస్తాలను, అనువాదకులను, సహాయకులను తయారుచేశారు. వలసపాలకులకు వంతపాడే ఒక వర్గాన్ని తయారుచేశారు. పాలకులకంటే ఈ ఆంగ్లవిద్యా పారంగతులు దేశానికి ఎక్కువ ప్రమాదకారులు అయ్యారు. మెకాలే మానసపుత్రులకు దేశమన్నా, దాని ఘనమైన గతమన్నా కొంచెంకూడా గిట్టదు. సామ్రాజ్యవాదులు వలసవాద భావజాలంతో చరిత్ర, సంస్కృతి, మతవక్రీకరణలకు వారిని ఉపయోగించారు.

ఆంగ్లేయుల దృష్టిలో భారతీయులు ప్రాణమున్న వస్తువులు, పనిముట్లు, సాధనాలు మాత్రమే. వారి ఆశలకు, ఆకాంక్షలకు, అవసరాలకు, బ్రతుకులకు ఎట్టి విలువ లేదు. శ్రమించి ఉత్పత్తి చేయటానికి, ఆపై శిస్తులు కట్టటానికి, నిర్బంధ శ్రామిక శిబిరాలలో వెట్టిచాకిరీ చేయ్యటానికితప్ప వారెందుకూ పనికి రానివారిగా భావించి, వారిపట్ల వ్యవహరించారు. వలసపాలనను సమర్థించేవారు వలసపాలనా కాలంలో వేసిన రహదార్ల గురించి, నివారించబడ్డ వ్యాధుల గురించి, ప్రవేశపెట్టబడిన సంస్కరణల గురించి, అణచివేయబడ్డ బందిపోటుదొంగల గురించి ఎంతో చెప్తుంటారు. కాని భారతీయులను గుంపులుగుంపులుగా, తెగలుగా వంశపారంపర్యనేరస్థులుగా ప్రకటించారన్న విషయం చెప్పరు. సమాజాలు వాటి ఔన్నత్యంతోపాటుగా ఉనికిని కూడా కోల్పోయిన విషయమై మౌనంగా ఉంటారు. హైందవ సంస్కృతిని బూటుకాలిక్రింద నలిపివేసే ప్రయత్నం చేశారని, లక్షలాది ఎకరాల భూములను కబ్జాచేశారని, అమూల్యమైన గ్రంథాలను, తాళపత్ర గ్రంథాలను, దేవతామూర్తులను, గొప్ప కళాసంపదను ఎత్తుకుపోయారని అసాధారణ అవకాశాలను అందిపుచ్చుకొనే అవకాశాలు లేకుండా చేశారని, వాటిని తుడిచి పెట్టివేశారని, ఉత్తర దక్షిణ భారతదేశాలమధ్య, వివిధ కులాల, వర్గాలమధ్య ప్రాంతాలమధ్య ఈనాటికీ సమన్వయం తీసుకొనిరాలేని అగాధాన్ని సృష్టించారని చెప్పరు.

ఈ అంశాలగురించి చెప్పకుండా ఎన్ని వేల కిలోమీటర్లమేర రహదారులు, రైలుమార్గాలు నిర్మించారో, ఎన్ని ఓడరేవులను ఎంత పెద్దపెట్టున విస్తరించారో, ఎన్ని విద్యాలయాలను నెలకొల్పారో, ఎన్ని సాగునీటి ప్రాజెక్టులను చేపట్టారో చెప్తున్నారు. వారి వ్యాపార, రాజకీయ, వాణిజ్య ఆర్థిక ప్రయోజనాలను దృష్టిలో

పెట్టుకొనే వారు ఆ పనులు చేసారు తప్ప భారతదేశంకోసం కాదు. సామాన్య ప్రజలకోసం కాదు. వారి 'ఆధునీకరణ ప్రక్రియకు కావలసిన వనరులన్నీ ఈ దేశప్రజలనుండి సేకరించారు. అవి చాలక పెద్దపెట్టున అప్పులు చేసి, ఆ ఋణభారాన్ని దేశంపై రుద్దారు. ఆధునీకరణ ప్రక్రియ ఆంగ్లపెట్టుబడిదారులకు విశేషలాభాలను ఆర్జించిపెట్టింది. లక్షలాదిమంది భారతీయులను నిర్వాసితులను చేసింది. నిరుపేదలను చేసింది. వారి భూములనుండి, గ్రామాలనుండి వెళ్ళగొట్టబడినవారు వారి దేవుళ్ళనుండి, ఆటపాటలనుండి, సంప్రదాయజ్ఞానంనుండి కూడా వేఱుచేయబడ్డారు. నిర్వాసితులను చేసింది వారే, నిరక్షరకుక్షులను చేసింది వారే. అనాథలను, ఆశ్రితులను తయారుచేసింది వారే. ఒకవైపు దిక్కులేనివారిగా చెయ్యటం, వేరేవైపు వారిని ఆదుకొన్నట్లు నటించి, మతం మార్చి, వారి ఆగ్రహాన్ని వలసపాలకులపైనుండి సంఘంవైపు మళ్ళించటం వారి వ్యూహంలో భాగమే. పాలకులు దిక్కుదివాణం లేనివారిగా ప్రజలను దిగజారిస్తే, ఆంగ్లమిషనరీలు వారికి కూడు, గుడ్డ యిచ్చి ఆశ్రయం కల్పించి, క్రైస్తవమతంలో మార్చటం వారు అన్ని దేశాలలో అనుసరించిన వ్యూహమే. నాగరీకరణ అంటే వారి దృష్టిలో క్రైస్తవీకరణతప్ప మరొకటి కాదు.

నిస్సహాయులను, దిక్కులేనివారిని క్రైస్తవీకరణ చెయ్యటం తేలిక. కనుక ముందు ప్రజలను దిక్కులేనివారిగా తయారుచెయ్యాలి. అందువల్ల రెండు లక్ష్యాలు నెరవేరుతాయి. వారి సహజ, ఆర్థిక, అటవీవనరులను దోచుకోవటంద్వారా వారు దిక్కులేనివారు అవుతారు. అదే సమయంలో వలసపాలకులు, వారి వ్యాపారవాణిజ్య పారిశ్రామిక సంస్థలు ఆర్థికంగా బలోపేతం అవుతాయి. ఆ కారణంగా ఇంగ్లాండ్ ఆర్థికంగా ఎంతో అభివృద్ధి సాధిస్తుంది. 'నాగరిక ప్రక్రియ'కు అసలు లక్ష్యం ఇదే. వలసపాలకుల విధానాలవలన నిరాశ్రయులైన వారిని, ఉపాధులు కోల్పోయి, నిస్సహాయులైన వారిని, పేదరికంలో నెట్టివేయబడిన వారిని, చర్చి ఆదుకుంటుంది. అందుకు ప్రతిగా వారు క్రైస్తవమతం తీసుకోవాలి. నాగరిక ప్రక్రియ రెండవ లక్ష్యం కూడా ఈవిధంగా నెరవేరుతుంది. స్థానికులు ఏ రేటున నిరాశ్రయులు అవుతారో, అదే రేటున వారు క్రైస్తవంలోకి మార్చబడతారు. అత్యంత దోపిడీకి గురిఅయిన ఆఫ్రికాలో క్రైస్తవమతం వేగంగా వ్యాప్తి చెందటానికి ఇదే కారణం.

**వస్తువీకరణ :**

వలసపాలకులకు, పాలితులకుమధ్య మానవులమధ్య ఉండే సహజమైన సంబంధాలుఉండవు. ఉన్నదల్లా ఆంగ్లపాలకుల పెత్తందారీతనం. పౌరుల బానిసత్వం. వారిమధ్య బలవంతపు శ్రమ, బెదిరింపులు, పోలీసులు, అధికశిస్తులు, జైలుశిక్షలు, మానభంగాలు, తప్పనిసరిగా పండించవలసిన పంటలు, చిన్నచూపు (Contempt), అపనమ్మకం, జాత్యంహంకారం, కపటం, మోసం మాత్రమే ఉన్నాయి. దానితో వలసపాలన వస్తువీకరణకు (Colonisation=Thing-ification) దారితీసింది. భారతీయులు తెల్లదొరల దృష్టిలో బానిసలు, కూలీలు. కేవలం ప్రాణమున్న వస్తువులు, ఉత్పత్తి ప్రక్రియలో పనిముట్లు. స్పందనలులేని శ్రమజీవులు. వారికి ఎట్టి హక్కులులేవు. స్వేచ్ఛలు లేవు. భద్రత అసలే లేదు. తెల్లతోలును చూసి వణికిపోయేటట్లుగా వారిని తయారుచేసారు. వాస్తవాలు ఇలా ఉండగా ఎన్ని ఎకరాలలో పాలకులు వాణిజ్యపంటలు విస్తరించారో, ఎన్ని మెట్రిక్ టన్నుల పత్తిని ఎగుమతిచేశారో, ఎన్ని సాంఘిక దురాచారాలను అరికట్టారో కొందరు లెక్కలు చెప్తున్నారు. కాని దేశంలో సహజసిద్ధంగా నెలకొన్న సమతుల్యతను, ఆర్థిక పరిపుష్టిని వారు ఎట్లా దెబ్బకొట్టారో కూడా వలసపాలన సమర్థకులు చెప్తే బాగుంటుంది. ప్రకృతితో మమేకమై, జీవావరణ అనుకూల జీవితాలను గడుపుతున్న లక్షలాదిమంది ఎందుకు నిరాశ్రయులయ్యారోకూడా వారే చెప్పాలి. ఎన్ని ఎకరాలలో ఆహారపంటలను ధ్వంసం చేసి, నీలిమందును, నల్లమందును, పొగాకును, ఇతర వాణిజ్యపంటలను వేశారో కూడా ఆంగ్లపాలకుల సమర్థకులు చెప్పాలి. ఎన్ని కఱవులు వచ్చాయో, ఎన్ని లక్షలమంది మెతుకు కఱవై బలిఅయ్యారో, దేశంలో ఈనాటికీ పౌష్టికాహారలోపం ఎందుకుందోకూడా వారు తెలియచేస్తే బాగుంటుంది. కొన్ని సాంఘికదురాచారాలను అరికట్టే ప్రయత్నం చేసారు. అభినందనీయమే. కానీ వాటిస్థానంలో కొత్తవాటిని ప్రవేశపెట్టిన విషయం దాచిపెట్టకూడదుకదా! స్థానికపాలకుల నియంతృత్వం నుండి స్థానికులను ఆంగ్లేయులు విముక్తి చేసారని కూడా చెప్తుంటారు. పాలకులు మారారు తప్ప, వారి నియంతృత్వపోకడలలో మార్పులేదు. వాస్తవానికి స్థానిక పాలకులకు, ఆంగ్లేయులకు మధ్య స్నేహసంబంధాల కారణంగానే తెల్లదొరలపాలన కొనసాగింది. వారి 'అపవిత్రపొత్తు' ప్రజలపాలిట శాపమైంది.

వాస్తవాలు వెలువడుతున్న కొద్దీ తూర్పుదేశాల ఔన్నత్యం తెలుస్తున్నది. శాస్త్రసాంకేతిక రంగాలలో భారతదేశం సాధించిన అపూర్వ ప్రగతి తెల్లదొరలను ఆశ్చర్యంలో నింపింది. కాని ఆ వాస్తవాలను వెలుగులోకి రానివ్వకుండా వారు నొక్కిపట్టారు. 18వ శతాబ్ది ఏరకంగా చూసినా భారతదేశపు శతాబ్ది. అయినప్పటికీ దానిని భారత్ దేశపు చీకటిశతాబ్ది అని ఆంగ్లమేధావులు అభివర్ణించారు. న్యాయం దొరకని ప్రతీసారి, అకారణంగా నిర్బంధించి చిత్రహింసలకు గురిచేసిన ప్రతిసందర్భమూ, కూలీల ప్రతిన్యాయమైన కోర్కెను బలప్రయోగంతో తిరస్కరించిన ప్రతిదఫా, ఖండాంతరాలకు మానవులను అక్రమరవాణా చేసినప్పుడల్లా, దేశభక్తులను ద్వీపాంతరవాస శిక్షలకు గురిచేసినప్పుడల్లా, ఉరికంబాలకు ఎక్కించినప్పుడల్లా, ప్రజలను భయభ్రాంతులకు గురిచేయటానికి జరిగే ప్రతిసైనికకవాతు మన పాతసమాజపు విలువలను మనకు గుర్తుచేస్తాయి. అవి పెట్టుబడిదారీ వ్యవస్థకు ముందున్న సమాజాలు మాత్రమే కాదు, ఆ వ్యవస్థకు పూర్తిగా వ్యతిరేకమయినవి. ఆ సమాజాలు అందరివీ, కొందరి కోసం ఉన్నవికావు. ప్రైవేటు హక్కులులేవు. ఉమ్మడిహక్కులు, ఉమ్మడి బ్రతుకులతో, సహజీవనం, సహకారస్ఫూర్తితో విలసిల్లిన సౌభ్రాత్రసంఘాలు. సామ్రాజ్యవాదం ఈ సంఘాలను సమూలంగా నిర్మూలించింది. పాతకాలపు సంఘాలలో లోపాలు, బలహీనతలు లేకపోలేదు. అందుకై వాటిని ద్వేషించనక్కరలేదు. ఖండించ నవసరంలేదు. వైఫల్యం అనే పదం ఆ సంఘాలలో లేనేలేదు. ఆనాటి సంఘాలలో జనం తృప్తిగా బ్రతికారు. భవిష్యత్తుమీద ఆశతో బ్రతికారు.

ఆఫ్రికాఖండం విషాదం మిగిలిన ప్రపంచంతో చాలా ఆలస్యంగా సంబంధాలు ఏర్పరుచుకోవటంవల్ల ఏర్పడింది కాదు. ఏమాత్రమూ నీతినియమాలు లేని పాశ్చాత్యపెట్టుబడిదారులు, వ్యాపారులు, సముద్రపు దొంగల చేతులలో ఆఫ్రికాఖండం పడటమే దాని దురదృష్టం. ఆఫ్రికాలో ఎక్కడ చూసినా శవాల దిబ్బలే. వాటికి కారణం పాశ్చాత్యులే. అక్కడున్న భూస్వామ్యవర్గంతో చేతులు కలిపి, భయోత్పాతం సృష్టించింది పాశ్చాత్యులే. వారే భారతదేశంలో ఆధిపత్యంకోసం పోటీపడ్డారు. మనదేశంలో కూడా అలాంటి దారుణాలకే పాల్పడ్డారు. కాని పెల్లుబికిన వ్యతిరేకత వలన, ప్రతిఘటనలవలన భారతదేశం మరో ఆఫ్రికా ఖండం కాలేదు. వలసవాద ఇంగ్లాండ్, ఇతర పాశ్చాత్యదేశాలు పాతకాలపు దురన్యాయాలకు ఆర్థికదోపిడీని,

వర్ణవివక్షను జోడించి అసమాన, అవమాన భారాలను మరింతగా పెంచారు. కొన్ని రంగాలలో వారు తీసుకొని వచ్చిన ప్రగతిని వలసపాలన వలన జరిగిన మేలుగా పేర్కొంటూ, వారిని శ్లాఘిస్తుంటారు. కాని వారు అభివృద్ధి చేసిన రంగాలు వారి ఆర్థిక దోపిడీ కొనసాగటానికి అత్యంత ఆవశ్యకమైనవి కనుకనే వాటిని అభివృద్ధిచేశారు.

ఇంగ్లాండ్ భారతదేశ వ్యవహారాలలో జోక్యం చేసుకొని భూభాగాలను స్వాధీనం చేసుకొని, ప్రజలను బానిసత్వంలోకి నెట్టివేయకపోతే ఏమిజరిగేది?

కచ్చితంగా భారతదేశం ఒక సుసంపన్న దేశంగా వెలిగేది. 18వ శతాబ్ది నాటికే ప్రపంచ స్థూలజాతీయ ఉత్పత్తిలో భారతదేశపు వాటా మూడవవంతు. ఆంగ్లేయుల పారిశ్రామిక విప్లవానికి కావలసిన నిధులన్నీ ఒక్క బెంగాల్ రాష్ట్రమే సమకూర్చింది. తన సామ్రాజ్యాన్ని ప్రపంచవ్యాప్తంగా విస్తరించటానికి వెచ్చించిన వనరులలో సగానికిపైగా భారతదేశంనుండి కొల్లగొట్టబడినవే. వారు తరలించుకొని వెళ్ళిన బంగారం, దొంగిలించిన వజ్రాలు, ఎత్తుకెళ్ళిన అటవీ సంపదతో దేశమంతటా ప్రతిగ్రామానికి అనువైన రహదార్లు నిర్మించవచ్చు. తరలించిన వనరులతో ఏ కొద్దిశాతమో ఖర్చుపెడితే దేశప్రజలందరికీ విద్య, వైద్య, వసతి సౌకర్యాలు ఉచితంగా కల్పించవచ్చు. ఇంగ్లాండ్ చేసిన సైనిక వ్యయంలో అధికమొత్తం బ్రిటీషు ఇండియా బడ్జెటునుండి తీసుకొనబడినవే. రెండు ప్రపంచయుద్ధాలకు, అంతకుముందు ప్రపంచవ్యాప్తంగా చేసిన లెక్కలేనన్ని యుద్ధాలకు, ఇంగ్లాండ్‌కు అవసరమైన సైనిక, ఆర్థిక, మానవవనరులలో అత్యధికభాగం భారతదేశంనుండే చేరవేశారు. ఆ వనరులన్నీ దేశంలోనే దేశంకోసమే ఖర్చుపెట్టి ఉంటే పెద్ద సైనికశక్తిగా భారతదేశం ఆవిర్భవించేది. మత ప్రాతిపదికన దేశాన్ని విభజించకపోతే అఖండభారత్ అన్ని రంగాలలో అభివృద్ధి సాధించేది. దేశరక్షణకోసం, సీమాంతర ఉగ్రవాదాన్ని అడ్డుకోవటంకోసం కొన్ని లక్షల కోట్లు ఖర్చు చెయ్యవలసి వచ్చేదికాదు.

1వ శతాబ్దిలో క్రైస్తవం పొత్తిగుడ్డల్లో ఉన్నప్పుడు, ప్రపంచ స్థూలజాతీయ ఉత్పత్తికి మూడవవంతుకుపైగా భారతదేశమే సమకూర్చింది. ముఖ్యపాశ్చాత్య క్రైస్తవ దేశాలైన ఇంగ్లాండ్, ఫ్రాన్స్, జర్మనీల సమష్టివాటా కేవలం 3 శాతం మాత్రమే. 1700 నాటికి భారతదేశపు వాటా 25 శాతానికి తగ్గగా, ఆ మూడు దేశాల సమష్టివాటా 11 శాతంకు పెరిగింది. 1870 నాటికి ఆ దేశాల వాటా రెట్టింపు

అవగా, భారతదేశపు వాటా 12.5 శాతంకు పడిపోయింది. 1913 నాటికి భారతదేశపు పరిస్థితి మరింతగా దిగజారింది. దేశం పేదరికంలోకి నెట్టివేయబడింది. ప్రపంచ స్థూలజాతీయఉత్పత్తిలో భారత్ వాటా 9 శాతానికి పడిపోగా, ఆ పాశ్చాత్యదేశాల సమష్టివాటా 22.5 శాతానికి పెరిగింది. వలసపాలనానంతరం 1950లో భారతదేశపు వాటా ప్రపంచస్థూల జాతీయ ఉత్పత్తిలో మరింతగా క్షీణించి 4 శాతానికి పడిపోయింది. ఒకప్పటి సుసంపన్న దేశాన్ని ప్రపంచంలోని అత్యంత పేదదేశాల స్థాయికి దిగజార్చారు. ప్రపంచానికి జ్ఞానబిక్షపెట్టిన దేశం నిరక్షరకుక్షుల దేశంగా మారిపోయింది. ఆంగ్లేయులు ఈ దేశం వదిలివెళ్ళేనాటికి కేవలం 16 శాతం మంది మాత్రమే అక్షరాస్యులు. సగటు ఆయుర్దాయం 27 సంవత్సరాలు. దేశీయ పరిశ్రమలు అనేవి పూర్తిగా అదృశ్యమయ్యాయి. 90 శాతం జనాభా పేదరికంలో మ్రగ్గుతున్నారు. భారతదేశం అత్యంత ఋణగ్రస్తదేశం అయ్యింది. ఇవన్నీ ఆంగ్లేయుల వలసపాలనా దోపిడీ ఫలితాలే. అందుకు ఇంగ్లాండ్‌ను నిలదీయాలి. నష్టపరిహారం చెల్లించుమని గట్టిగా అడగాలి. చేసిన అమానుష కృత్యాలకు క్షమాపణ చెప్పాలని అడగాలి. అందుకు ఈ తరం అయినా కలసికట్టుగా నడుంబిగించి పోరాటం చేస్తుందా?

**సర్వేజనాః సుజనోభవన్తు–సర్వే సుజనాః సుఖినో భవన్తు !**

